# ఆముక్తమాల్యద

## సౌందర్యలహరీ వ్యాఖ్యానం

### ప్రథమభాగం-1

"అభినవ భారతి"

ఆచార్య తుమ్మపూడి కోటీశ్వరరావు

మలయకూట పబ్లికేషన్స్ హైదరాబాదు - 57

2001

AMUKTAMALYADA

*Published by*
**Prof. T. Koteswara Rao**

Volume - I

Copies : 1,000





Price : Rs. 500/-



*This book is published with the financial assistance of Tirumala-Tirupati Devasthanams under their Scheme*
**"AID TO PUBLISH RELIGIOUS BOOKS"**

Copies can be had from

**T. Koteswara Rao**
324-2RT, P.S.Nagar
Hyderabad -57

**Visalandhra Publications**
Hyderabad



Laser Typesetted
**ANNAPURNA GRAPHICS**
53/3, R.S. Gardens
Tirupati - 517 507
☎ : (08574) 35006

Printed at
**Sai Sreenivasa Printers**
# 6-2-967, Kaarnik Towers
Khairatabad
Hyderabad - 500 004.
☎ : 3392566.



తెలుఁగదేలయన్న దేశంబు తెలుఁగేను - తెలుఁగువల్లభుండ, తెలుఁగొకండ
ఎల్లనృపులు గొలువ నెఱుఁగవే బాసాడి - దేశభాషలందు తెలుఁగులెస్స



తమ్మికేలుండఁ బెఱకేలు దండయిచ్చు
లేములుడిపెడులేఁ జూపు లేమతోడ

- (ఆముక్త 1-12)

# నతి

ప్రాతః కాల నవాంశుపుంజము హరిద్భాగంబులన్ జాళ్వులై
తోతెంచెన్ దరనిర్దళన్నళినపంక్తుల్ తిక్తగంధంబులన్
పూతల్ పూయఁగ గాలిరివ్వటలు వంపుల్ వీవుచున్ మంపుగా
వీతెంచెన్ గరులార్భెనండజము దేవీ ! మేలుకో మేలుకో.

నావాక్చిత్రమునన్ లిఖించి భవదంత స్తత్త్వ సౌందర్య గా
థావైచిత్రి భవన్మనోహరుని సందర్శింపగా వచ్చితిన్
శ్రీవైకుంఠు ప్రబోధగీతిక ! ప్రభుస్నిగ్ధాంఘ్రులన్ జూపఁగా
లేవమ్మా ! జగదీశ్వరీ ! స్వగృహమౌళిన్ వెల్గుపాల్వోసెడిన్.



పీఠికావిషయ సూచిక | పుట


| | |
|---|---|
| 1. కావ్యరచనాకాలం - స్వప్న వృత్తాంతం | 1 |
| 2. ఆశ్వాససంఖ్య - | 1 |
| 3. రాయలవిజయాలు - ఆశ్వాసాంతాలు- | 3 |
| 4. కృతికర్త - | 5 |
| 5. ఉభయకవిమిత్రుడు - | 8 |
| 6. ఉదాత్తుడైన కవి - | 9 |
| 7. కవియతీంద్రుడు | 10 |
| 1. నాయకుడు - | 11 |
| 2. నామసౌందర్యం - | 19 |
| 3. నిర్మాణ మార్మికత - | 23 |
| | |
| 1. రసదర్శనం - | 25 |
| 2. అష్టాదశవర్ణనలు - | 43 |
| 3. స్త్రీపాత్రలు | 49 |
| 4. అలంకారాలు - ఔచిత్యము - | 51 |
| 5. పద్యరచనా - శైలి - | 52 |
| 6. సీసపద్యం - | 54 |
| 7. ఔచిత్యం - | 57 |
| | |
| రాజధర్మం - | 58 |
| రాజధర్మం - | 61 |
| అనంతవైదుష్యం - | 65 |
| కావ్యతత్త్వపరివేషం - | 75 |
| కావ్యతత్త్వబిందువు - | 78 |
| అనుబంధం - మూలకథలు - | |

# కావ్య వస్తు చిత్రణ


| | I. కావ్యావతరణ | పద్య సంఖ్య |
|---|---|---|
| 1. | సృష్టివికాసం (ఇష్టదేవతాస్తుతి) | 1-11 |
| 2. | స్వాప్నిక చైతన్యోన్మేషం | 12-17 |
| 3. | వంశానుచరితం | 18-44 |
| 4. | అంకితాంకనం. (షష్ఠ్యంతాలు) | 46-49 |
| | హృద్యపద్యముల నాద్యంబైన అశ్వాసం | |
| 1. | శ్రీక్షేత్ర (విలుబుత్తూరు) చిత్రణం | 51-75 |
| 2. | దేవాంగనాలాస్య క్రీడ | 59-63 |
| 3. | ప్రకృతి విలాసం | 64-66; 70-75 |
| 4. | నాయకుని సౌధం (దేవాలయం) | 72-74 |
| 5. | మహామౌని ప్రతిమ (విష్ణుచిత్తుని వర్ణన) | 76-78 |
| 6. | ఆతిథ్య వ్రతం | 79-85 |
| | ఆశ్వాసాంతాలు | 86-89 |
| | ఆశ్వాసము హృద్యపద్యముల ద్వితీయం | |
| 1. | రాజధాని | 2-38 |
| 2. | చక్రవర్తి మూర్తి | 39-44 |
| 3. | గ్రీష్మ మల్లిక | 45-71 |
| 4. | సుభాషిత ప్రభావం | 72-85 |
| 5. | అతిలోక సంవాదం (విష్ణు - విష్ణు చిత్తుని సంభాషణ) | 88-94 |
| 6. | నగర ప్రయాణం - | 95-97 |
| | ఆశ్వాసాంతాలు | 98-101 |
| | ఆశ్వాసము హృద్యపద్యముల తృతీయంబు | |
| 1. | పాండిత్యవీరం | 3-33 |
| 2. | జ్ఞాన-కర్మసముచ్చయ (ఖాండిక్యకేశిధ్వజ) సంవాదం | 14-64 |
| 3. | రాజనీతి | 19-23 |
| 4. | ఉత్తమ చక్రవర్తి | 61-65 |

| | | |
|---|---|---|
| 5. | యోగవిద్య | 65-89 |
| 6. | చైతన్యపరిణామం | 80-86 |
| | ఆశ్వాసాంతాలు | 90-93 |
| | ఆశ్వాసవరంబు నాలవది | |
| 1. | నాయక విజయం | 3-15 |
| 2. | విభవ విభూతి (అవతారవర్ణన) | 16-37 |
| 3. | ఆచార్య వైభవం (యామునాచార్య కథ) | 38-75 |
| 4. | వర్షా - శరత్తాండవార్భటి | 76-183 |
| 5. | శ్రీరంగనాథ దర్శనం | 188-203 |
| 6. | రాజధర్మ పర్వం | 204-284 |
| | ఆశ్వాసాంతాలు | 286-290 |
| | ఆశ్వాసము పంచమం బలరు | |
| 1. | శృంగారిణీ విగ్రహం | 4-39 |
| 2. | ఉపాలంభసౌందర్యం | 40-54 |
| 3. | సఖీలాస్యక్రీడ | 55-87 |
| 4. | తిరుప్పావు | |
| 5. | వసంతహేల | 96-144 |
| 6. | కామనీ విరహ గాంధర్వం | 145-158 |
| | ఆశ్వాసాంతాలు | 158-161 |
| | ఆశ్వాసవరేణ్య మారవది | |
| 1. | ప్రపత్తియోగి ప్రతిమ (దాసరి వర్ణన) | 3-14 |
| 2. | శప్తభూసురుడు (బ్రహ్మరాక్షసుడు) | 15-20 |
| 3. | యోగి-రక్షస్సంవాదం | 21-66 |
| 4. | సోమశర్మ | 67-80 |
| 5. | శ్రీరంగనాయక దర్శనం | 91-115 |
| 6. | "రంగమందయిన పెండిలి" | |
| | ఆశ్వాసాంతాలు | 136-139 |

# కావ్యరచనా కాలం

## (1) స్వప్నవృత్తాంతం

దీనికి స్వప్న వృత్తాంత మొకటే ఆధారం. కవి చక్రవర్తి కళింగ జైత్ర యాత్రాసందర్భంలో బెజవాడలో కొన్ని రోజులుండి ఒక హరివాసరంనాడు శ్రీకాకుళ స్వామిని దర్శించినట్లు కావ్యమే స్పష్టంచేస్తున్నది. అదెప్పుడు ? రాయలు కొండవీటి విజయానంతరం ''ధరణికోటకు విచ్చేసి అమరేశ్వర మహాదేవునకు తులాపురుష మహాదానమున్ను చేయ నవధరించి- తిరిగి విజయనగరానకు విచ్చేసి మఱి కళింగ దేశ విజయార్థమై విచ్చేయుచు అహోబలానకు వేంచేసి దేవుని దర్శించి శ్రీవిజయాభ్యుదయ శా.సం. 1438 యగు నేటి యువ సం॥ర పుష్యశుద్ధ 15 శుక్రవాసర మందు శ్రీఅహోబల దేవునకు -'' నగలర్పించారట. కనుక అహోబల శాసనం యువ పుష్యం - సింహాచల దర్శనం ధాత చైత్రం - నడుమ శ్రీకాకుళాంధ్ర దేవ సందర్శనం - స్వప్న వృత్తాంతం.

శ్రీగురుజాడ శ్రీరామమూర్తి పంతులుగారు ఉదాహరించిన చామర్ల కోట కైఫీయతు (చూ. వారి కవిజీవితాలు) కూడా అహోబల శాసనాన్ని ధ్రువపరుస్తున్నది. ఆవాక్యం - విద్యానగరికి విచ్చేసి శా.సం. 1438 (క్రీ. శ. 1515) అగు నేటి యువనామ సంవత్సరాన కళింగ దేశము జయించవలెనని -.''

కొండవీటి విజయం - శా. సం. 1437 ఆషాఢ శుక్ల హరివాసరం నాటిది. (32-5-1515) సింహాచల శాసనం 30-3-1516.

అహోబిల శాసన కాలం - ? -12-1515. కనుక ?-12-1515 - 30-3-1516. నడుమ రాయలు శ్రీకాకుళం వెళ్ళాడు. బహుశా జనవరి 1516 కావచ్చు.

ఇంతకంటె ఆధారం మృగ్యం.

## (2) ఆశ్వాస సంఖ్య

మనకు అచ్చులో లభిస్తున్న ప్రతులు రెండు. (1) వావిళ్ళ వ్యాఖ్యానం (2) వేదం వారి వ్యాఖ్యానం. అది ఆరాశ్వాసాల ప్రతి. రెండవ దానిలో 7 ఆశ్వాసాలున్నాయి. కనుక అసలు కావ్యంలో ఆశ్వాసాలెన్ని?

మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో ఉన్న ఆముక్త ప్రతులు 30. (268 - 301). ఇందులో పది మాత్రమే సంపూర్ణంగా ఉన్నాయని వివరణ సూచికలో ఉన్నది. ఈసంఖ్యలో కొన్ని సవ్యాఖ్యానాలు. వ్యాఖ్యాతలు ప్రాచీనులు. ఒకటి బుధమనస్తోషిణి. వ్యాఖ్యాత 'ఉప్పలపాటి జోగిజగన్నాథుడు'. (డి.405) ఇందులో మూడవ ఆశ్వాసం మాత్రం లేదు. ఈవ్యాఖ్య ప్రకారం ఆశ్వాసాలు ఆరే. ఈవ్యాఖ్య శ్రీముఖ మాఘమున కంఠమైనది. (క్రీ. శ. 1813)

డి. 412 సంఖ్య గల వ్యాఖ్య 'గట్టుపల్లి శ్రీనివాస కవి' వ్రాసిన వ్యాఖ్యానం. ఇది క్రీ. శ. 1800 నాటిది. ఇందులో 7 ఆశ్వాసాలున్నాయి.

క్రీ. శ. 1650 నాటి 'గుడిపాటి వేంకటకవి' తాత్పర్య బోధిని వ్యాఖ్యానంలో ఆరాశ్వాసాలే 403 -404 ప్రతులు ఆరాశ్వాసాలు కలవే. కేవల కావ్య ప్రతులు నెం. 392 ముఖ్యం. ఇది సంపూర్ణం ఆరే ఆశ్వాసా లున్నాయి. ఇది 1845 -50 ప్రాంతం లోది. (శ్రీవావిళ్ళ వేంకటేశ్వర శాస్త్రిగారి షష్టిపూర్తి సంచికలో శ్రీహయవదన రావు గారి వ్యాసం). నెం. 397 ప్రతిలో 6 ఆశ్వాసాలే. కానీ 6వ ఆశ్వాసానికి ప్రత్యేక విభాగం లేక చివరి పద్యంలో 7వ ఆశ్వాసం ముగిసినట్లున్నది. 401 సంఖ్య ప్రతిలో ఆరే ఆశ్వాసాలు. ఇది గోటేటి సూరన్న వ్రాసినది. కఠిన పదాల కర్థాలున్నది. 406 సంఖ్య ప్రతిలో ఆరే ఆశ్వాసాలు. 421 ప్రతిలో 5,6 ఆశ్వాసాలున్నాయి. దీనిప్రకారం ప్రతులన్నీ ఆరే ఆశ్వాసాలున్నట్లు స్పష్టం. ఒక్క గట్టుపల్లి ప్రతిలో మాత్రం 7 ఆశ్వాసాలున్నాయి.

ఆముక్తంలో 5 ఆశ్వాసాల అంత్య పద్యా లన్ని ప్రతుల్లో సమానమే. కానీ ఆరవది భేదిస్తున్నది. జోగి జగన్నాథుని వ్యాఖ్యలో నీలాచల పద్యముండగా, శ్రీనివాస కవి వ్యాఖ్యలో 'నైరామన' ఉన్నది. (1) వావిళ్ళ వారి ప్రతిలో నాల్గవ ఆశ్వాసాంతమైన 'ఇది సింహాచల' పద్యమే ఆరవ ఆశ్వాసాంతంగా పునస్స్వీకృతమైనది. (1962 ముద్రణలో మాత్రం 'నైరామన' స్వీకృతమైనది). ఇదే వేదం వారి ప్రతిలోనూ ఉన్న పద్యం.(మొదటి ముద్రణం 1927, తర్వాతది 1964) సప్తమాశ్వాసాంతంగా శ్రీనివాస కవి నాల్గవ ఆశ్వాసాంతం 'ఇది సింహాచల' నే గ్రహిస్తే, వేదంవారు మాత్రం 'జోగి'వారి ఆరవ ఆశ్వాసాంతమైన 'నీలాచల' ను స్వీకరించారు. అందు 'షష్ఠమంబలరు' అని ఉంటే వీరు 'సప్తమంబలరు' నని మార్చుకొన్నారు. (చూ. హయవదన రావుగారి వ్యాసం).

392 సంఖ్యగల సమగ్ర ప్రతిలో 5-6 ఆశ్వాసాంతాలుగా 'ఇది యంధ్రోక్తి' అన్న పద్యమే ఉన్నది. శ్రీనివాస కవి 7 ఆశ్వాసాలుగా విభాగం చేసినా, ఆరవ ఆశ్వాసాంతాలకు టీక వ్రాయలేదు. ఇది వింత! అయితే అతడు స్వీకరించిన 'నైరామన' గతేమిటి? అదే కల్పితమైతే ఆరే ఆశ్వాసాలా? మరి ఆశ్వాసాంతాలేవి (5కీ -6కీ).

ఇలా ఉండగా 'బ్రౌను' పండితుడు తయారుచేయించిన 'ఆముక్త క్రియా పద సూచిక' నెం. 432 ప్రతిలో ఉన్నది. అది అనేక ప్రతులు చూచి తయారు చేయించినది. అది 1849 ప్రాంతంలో తయారైనది. దాని ప్రకారం ఆశ్వాసాలు ఆరే (1) సహ్యజాతా (2) చందనద్రు (3) స్కంధసరః (4) చోళభూమి - వంటి మాటలు ఆరవ ఆశ్వాసంలోనివిగా ఉట్టంకింపబడటం గమనార్హం. అవి చివరి ఆశ్వాసంలోనివి. అది ఏడుగా కాక ఆరుగానే బ్రౌను ప్రతి చెప్పటం వల్ల ఆరే ఆశ్వాసాలు.

పైమాటల్లో మూడవది ఆశ్వాసాంత స్తుతి. 'చందన ద్రు' - కథాంతం పద్యంలోది. 'ఉండుదు చోళభూమి' - బ్రహ్మ రాక్షసుడు తన పూర్వజన్మ వృత్తాంతం చెబుతూ అన్న ప్రారంభ పద్యం. ఇక్కడ నుండే వేదం వారు సప్తమాశ్వాసంగా విభాగం చేసింది.

వావిళ్ళ ముద్రిత ప్రతులు :- ప్రథమ ముద్రణం - 1869; ద్వితీయం - 1886; తృతీయం -1909; చతుర్థం - 1914; తర్వాతిది -1927.

## రాయని విజయాలు - ఆశ్వాసాంతాలు

పారిజాతాపహరణం - మనుచరిత్ర - ఆముక్త రచనల కాలనిర్ణయానికి వారివారి పీఠికలు - ఆశ్వాసాంతాలే ప్రమాణాలు. దీనికాధారం చరిత్ర. రాయల వారి విజయాలను మూడు రకాలుగా చారిత్రికులు విభజించారు.

(1) దక్షిణ దిగ్ జైత్రయాత్ర
(2) పూర్వదిగ్ జైత్ర యాత్ర
(3) పశ్చిమ దిగ్ జైత్ర యాత్ర

రాయలు రాజు కాక పూర్వం, అన్న వీరనరసింహరాయలు పాలించిన 9 ఏళ్ళలో సేనా నాయకుడై సాధించిన విజయాలే దక్షిణ జైత్రయాత్రా విషయం. పారిజాతం ప్రధానంగా వర్ణించినది వీనినే. పూర్వ దిగ్ జైత్ర యాత్రలో కంబము మెట్టు వరకు మాత్రం చెప్పి అన్నపూర్ణతో వివాహం కానీ, కటక గజపతి విజయం కానీ పేర్కొనక పోవటం గమనార్హం. మనుచరిత్ర కూడా పొట్నూరు విజయ స్తంభోదంతం చెప్పి అన్నపూర్ణ వివాహప్రస్తావన చేయకపోవటం వింత. వారిద్దరూ 'చిన్నాదేవి-తిరుమల దేవు' లను గురించే పేర్కొన్నారు. ఆముక్తంలో అలా కాక చిన్నాదేవిని పేర్కొనక అన్నపూర్ణా

ప్రస్తావన చేయటం వల్ల కటక విజయానంతరం గజపతితో సంధి- తత్ఫలంగా అన్నపూర్ణా లాభం- తదనంతరం ఆముక్త రచన జరిగిందనుకోవాలి.

1517 జనవరి 2న తిరుపతి దేవస్థానం శాసనంలో చిన్నాదేవి ప్రసక్తి ఉండి, 1-12-1517 నాటి కొండమరసు చోళ సముద్రం శాసనం (ఈగ్రామం లేపాక్షి దగ్గర ఉన్నది. ఆశాసనం ఆగ్రామంలోని చౌడేశ్వరి దేవికి రాయలకు సంతాన ప్రాప్తికై వేయించింది) లో పేర్కొనబడక పోవటం వల్ల (చూడు : కవితరంగిణి) ఈనడుమ కాలంలో ఆమె పరమపద ప్రాప్తినంది ఉండవచ్చు. ఆమె స్థానంలోఅన్నపూర్ణ వచ్చింది. ఇదే ఆముక్త పీఠికలో ఇతోఽధిక బహుప్రేయసీ ప్రాప్తి (18) - పొట్నూరు విజయ స్తంభోదంతం 1516 మార్చి నాటిది. తర్వాత శ్రీకృష్ణదేవరాయలు దక్షిణ దేశంలోని పుణ్యక్షేత్ర దర్శనం చేసి విజయనగరానకు విచ్చేసినట్లు చరిత్ర. ఆతేది 1517-4-1, రాయలవారు ఆతేదీన కంచిలో ఉన్నట్లు శాసనాధారమున్నది. 1517-2-6 న రాయలవారు కుంభకోణంలో మహామఖోత్సవ దర్శనం చేసినట్లు శాసనాధారమున్నది. కనుక పొట్నూరు విజయస్తంభ కథనం మార్చి 1516. తర్వాత సంవత్సర కాలం ప్రభువు విజయనగరంలో లేడు.

మనువూ - పారిజాతం చెప్పని విజయాలు ఆముక్తలో మూడు - 1కల్బరిగ - 2సగర - 3 కెంబావి విజయాలు. పీఠికలో సనకాది (41) చివరిది ఏదుల్ఖాన వధకు సంబంధించిన పద్యం మనుచరిత్ర పద్యాలే గృహీతములైనా రాయలవారు కలిపిన పద్యాలివి -40 వ పద్యం పెద్దన గారి, ''అభిరతి''- పొట్నూరి విజయస్తంభోదంతం. కనుక కటక విజయానంతరం లభించిన విజయాలు 41-42 పద్యాల్లో చెప్పిన విజయాలు. 41 లోని కల్బరిగ - సగర, 42లోని ఏదుల్ఖాన్ వధ - ఇవి మనువులో లేనందువల్ల ఆముక్త రచనాకాలం ఈవిజయానంతరం. అంటే రాయలవారు 1517-4-1 తర్వాత విజయనగరానకు విచ్చేసిన పిదపనే అనటం స్పష్టం. దీనికి ఉపబలకంగా రాయల వారి అస్థాన భరతాచార్యుడు భండారు లక్ష్మీనారాయణ వ్రాసిన సంగీత సూర్యోదయంలో రాయల వారి విజయ పరంపరను ప్రస్తావిస్తూ చివర్లో ఫిరోజాబాదు సగర -'కల్బరిగ కోట మీద లగ్గలకు నెత్తి'- అని ఉండటం వల్ల - ఇవే రాయల విజయ పరంపరలో చివరి వనుకోవచ్చు.

ఆముక్త పీఠికలో చెప్పిన విజయ వృత్తాంతం.

(1) ఉదయాద్రి (2) కొండవీడు (3) జమ్మిలోయ (4) వేగి (5) కోన (6) కొట్యాము (7) కనకగిరి (8) పొట్నూరు (9) మాడెము (10) ఒడ్డాది (11) కటకము.

పారిజాత మిందులో జమ్మిలోయకు బదులు కంబం మెట్టును ప్రస్తావించింది.

రాయల సేనలు కొండపల్లిని జయించాక ఒకభాగం తెలంగాణ దుర్గాల మీదుగా - మరొకటి వేగిమీదుగా ప్రయాణించి రెండూ గోదావరి - రాజమహేంద్రవరం దగ్గర కలుసుకొన్నవని

చరిత్ర. పొట్నూరు విషయం పారిజాతంలో లేదు. కంబం మెట్టు విజయమే ఉన్నది. కనుక అది 1516 మార్చికి పూర్వ రచన. ఇది చెప్పినది మనుచరిత్ర కనుక అది 1516 నాటిరచన.

ఈ విషయం వివాదగ్రస్తం (వాదోపవాదాలకు చూ: నా 'ఆముక్త మాల్యదా సౌందర్యం', -'కవితరంగిణి' - 'Studies on Krishnadevaraya' మొదలైనవి) ఆముక్త పీఠికలో పెద్దన గారి పద్యాల్లో చెప్పిన విజయ ప్రస్తావన కవితాభావ సంబంధిరచన; సాలంకారం కానీ ఆశ్వాసాంతాలు అలాకావు. అవి మహాచక్రవర్తి తానై నిర్వహించిన ప్రచండ యుద్ధ సంరంభ రచనలు. అక్కడ కవి భావనకు ప్రాధాన్యంగౌణం. యుద్ధాంగణ భయానకతకు ప్రాధాన్యం ఆ విజయాలెలా సాధింపబడ్డవో రాయని పరాక్రమ వైభవమేమో వానిని చిత్రించేవి.

ఆశ్వాసాంతాలు - పీఠికాపద్యాలు చూస్తే ఇది స్పష్టపడటమే కాక ఆశ్వాసాంత క్రమమూ విజయపరంపరా క్రమము ఒకటేనని కావ్యరచనా కాలమూ స్పష్టంగా తెలుస్తుంది.

| అవతారిక | ఆశ్వాసాంతం |
|---|---|
| (1) తొలుదొల్ల నుదయాద్రి -36 | 1-89 |
| (2) చిత్రము కృష్ణరాయ -37 | 2-101 |
| (3) కూరిమి కృష్ణరాయ - 38 | 3-93 |
| ఈ 3 పద్యాలు రాయల రచన | |
| (4) కచసక్త ఫణికంచుకము -39 | 4-289 |
| అభిరతి -40 | |
| (5) సనకాది - 41 | 5-160 |
| (6) అలుకన్ - 42 | 6-139 |

అవతారిక ముగిసింది. ఆశ్వాసాలూ ముగిసాయి. అయితే సప్తమాశ్వాసం అంతంలో నీలాచల- సంగతేమిటి? - అంటే లేదనే సమాధానం. కాదు, పెద్దన గారి తొలుదొల్త పద్యంలో పొట్నూరు ప్రస్తావన తర్వాత చెప్పిన - 'మాడెములు వ్రేల్చి - నొడ్డాది మసి యొనర్చి కటక పురి గాల్చి' - తో ముగిసింది. కనుక రాయల సైన్యం కటకం దాకా వెళ్ళి గజపతిని గెల్చి సంధిచేసుకుని తత్పలంగా అన్నపూర్ణను చేసుకొని వెనుదిరిగినాడనుకొంటే - నీలాచలకు స్థానముంటుంది. కానీ రాయల ఆశ్వాసాంతాల్లో వర్ణన యుద్ధవర్ణన. పీఠికలోని విజయాన్ని స్థూలంగా కవితా భావనగా చెప్పి - ఆశ్వాసాంతంలో దాన్ని విశేషంగా వర్ణించటం కన్పిస్తుంది. నీలాచల పద్యభావం చూస్తే గజపతి భయోదితుడైనాడనే - ఇదే భావం 'కచసక్త' (39) అవతారికా పద్యమూ చెప్పింది. ఈసామాన్య వర్ణన కా 'నీలాచల' లో విశేష కథనమేమీ లేదు. కనుక అది ప్రక్షిప్తమే. (వివరాలకు చూ: 'ఆముక్త మాల్యాదా సౌందర్యం')

పోతే 5వ ఆశ్వాసాంతంలో కెంబావి విజయ మెప్పటిది? రాయల కటక విజయానంతరం - ఇస్మాయిల్ ఏదుల్ఖాను గణపవరం మొదలైన కోటలు పట్టుకోగా తిరిగి వస్తూ అతనితో కెంబావిదగ్గర యుద్ధం చేసి ఓడించినాడని ఒక కథనం. ఈకెంబావి బిజాపురం అహమ్మదు నగరం- బీదరు రాజ్యాల్లోని 'ముయ్యేలగుట్ట' ల్లోని గ్రామం. ( ఇప్పుడిదొక కుగ్రామమట. చూ: 'లక్ష్మణరాయ వ్యాసావళి' ) ఇదే కల్బరిగ విజయమని కొందరన్న మాట (చూ: శ్రీకృష్ణదేవరాయ చరి త్ర - కీళాంబిరాఘవాచార్యులు). కుందూరి ఈశ్వరదత్తు గారి ననుసరించి 1520 నాటి విజయం తప్ప సింహాచలంనుండి వచ్చే సందర్భం లోది కాదు. ఇదే నిజమైతే పెద్దనగారూ దీన్ని ప్రస్తావించి ఉండేవారే. ఎందుకంటే పెద్దనగారు ఈ తేది సత్యమైతే 1516 మార్చి అనంతరం జరిగిన అన్నపూర్ణ వివాహం మనువులో ఎందుకు లేదో ? 1518 పిరాన్మల శాసనంలో రాయలు తన సేననంపి వారం రోజులలో సింహాళమును జయించిన వృత్తాంతాన్ని సూచించారు. కనుక (1వ ఆశ్వాసాంతం - మనుచ) 1516 నాటి కెంబావి విజయమంత ప్రచండ యుద్ధమైతే చెప్పకుండా వదలరు. కాబట్టి ఈశ్వరదత్తు గారన్నట్లు అది 1520 నాటిదే. ఇదే పంచమాశ్వాసాంతంలో చెప్పింది.

'నైరామన' -పద్యవిషయం. కుందూరి ఈశ్వరదత్తుగారి ప్రకారం రాయచూరు యుద్ధం. ఆదుర్గం దగ్గరలోనున్న నిరమానూరట. అక్కడ జరిగినదట రాయచూరుయుద్ధం. రాయలవారు యుద్ధాంగణ స్థలాన్ని పేర్కొనటం గమనించాలి. ప్రతి ఆశ్వాసాంతం లోనూ ఇదే పనిచేసారు. దీనికి విరుద్ధంగా కీ॥ శే॥ నిడదవోలువారు సూచించిననైరావన (వైరావన కాబోలు) వైశ్రవణ రూపానికి పాళీ రూపమనీ - అది కుబేరుని దిక్కన్న అర్థంలో ప్రసిద్ధం. కనుక ఉత్తరదిక్కున ఉన్నదనీ చెప్పిన అర్థం కుదరదు. ఉత్తరదిక్కున ఏది? - దాని ప్రస్తావన చేయకుండా రాయని ఆశ్వాసాంతం లేదు కనుక 'న్యూనిజ్' ప్రకారం రాయలు నిర్వహించిన దండయాత్రల్లో చివరిదీ - ప్రచండమైనదీ ఇదే కనుక. ఈయుద్ధం లోనే ఏదుల్ఖానును వధించింది. కనుక అవతారికలోని చివరిపద్యం (42) చివరి ఆశ్వాసాంతమైనది.

కనుక ఆరే ఆశ్వాసాలు. ఆముక్త రచన 1520 తర్వాత స్వప్న వృత్తాంతం 1516 జనవరి ఈచివరి ఆశ్వాసమే కావ్యంలో ప్రధానం, రసదృష్ట్యా- మతదృష్ట్యా. కాక స్వప్నంలో విన్పించిన స్వామి ఆనతి ప్రకారం 'అప్పిన్న' దాని కతతోనే ముగింపు. దాసరి కథ - గోదావివాహ వృత్తాంతం - అన్నీ కలిసిన ఆశ్వాసమే 'వరేణ్యం'. ఏడుగా విభాగిస్తే ఈ ఔచిత్యం పోతుంది. కనుక 4వది 'వరంబు' - రాజనీతి- ఋతువర్ణనల వల్ల. చివరిది (6వది) వరేణ్యం- పైకారణాలవల్ల.

ఇందుచేత ఆరే ఆశ్వాసాలు.

## కృతికర్త

*మార్గస్థ వక్ర శబ్దార్థ గుణాలంకార సంపదః*
*అన్యద్వాక్యస్య వక్రత్వం తథాభిహిత జీవితం*
*మనోజ్ఞ ఫలకోల్లేఖ వర్ణచ్ఛాయా(శయః పృథక్*
*చిత్తస్యేవ మనోహారి కర్తుః కిమపి కౌశలం ॥ (వక్రోక్తి జీవితం 3-34)*

ఈశ్లోక ద్వయం ద్వారా కుంతకుడొక విచిత్ర సిద్ధాంతం చేస్తున్నాడు. 'కావ్యంలో శబ్దార్థాలకు గుణాలంకారాల ద్వారా వక్రత నిష్పన్నమౌతున్నా దానికి ప్రాణభూతంగా వాక్య వక్రత కవి ప్రత్యేక ప్రతిభా ప్రసృతమై కొట్టవచ్చినట్లు కన్పిస్తుంది. ఎలాగంటే - చిత్రంలో అందమైన పటమూ, రంగూ-రేఖల విన్యాసం కంటే చిత్రానికి ప్రాణభూతంగా కర్తృ కౌశలమే ప్రకాశిస్తున్నట్లు' -

కవి వ్యక్తిత్వం నుండి పుట్టిన వాక్యం గుణాలంకారాల కంటే అధికంగా భాసిస్తూ వాటన్నిటికీ కాంతిని చేకూరుస్తున్నది. ఉదాహరణంగా చిత్రలేఖనంలో రంగూ - రేఖాదుల ద్వారా వచ్చే అర్థసంపద. ఇదొక వక్రత. వీటికాధారంగా ఉంటూ వాటిద్వారా ప్రకాశించే అన్యశోభ - కవి ప్రత్యేక వ్యక్తిత్వం. ఇది లేనివాడు కవి శబ్ద వాచ్యుడు కాడు. దీనినుండే శైలి ఏర్పడుతున్నది. ఇదే వాక్యవక్రత అని కుంతక సిద్ధాంతం.

శ్రీకృష్ణదేవరాయల వాక్య విన్యాస మొక ప్రత్యేక మైనది. ఆయన భావన వేరు. భాష వేరు. అదే ఆముక్త కర్తను పట్టిచ్చే నికషోపలం.

*కుంతకుని ప్రకారం రాయల శైలి లేదా మార్గం 'విచిత్రం'.*
*సోఽతి దుస్సంచరో యేన విదగ్ధకవయో గతాః*
*ఖడ్గధారాపథేనైవ సుభటానాం మనోరథః. (వ. జీ. 1-43)*

అది కత్తి వాదర పైన నడక. మహోక్షాత్ర శైలి. ఇతరులకు దుర్లభం. పెద్దన శైలి సుకుమార మార్గం.

*సుకుమారాభిదస్సోఽయం-*
*మార్గేణోత్ఫుల్ల కుసుమ కాననేవ షట్పదాః ॥*
*అసమస్త మనోహారి పదవిన్యాస జీవితం*
*మాధుర్యం సుకుమారస్య మార్గస్య ప్రథమో గుణాః ॥ (వ.జీ. 1-29-30)*

ఇది ఉద్యానవనం. వసంతంలో వెర్రిగా పూచినపుడు - పైన తుమ్మెదలు ఝుంకారంతో ఎగురుతున్నపుడు - ఎలా ఉంటుంది ? ఆ మనోహర దృశ్యానుభూతి కలిగించేశైలి - సుకుమారం.

క్ష్మావశారక్తరాంకవ మరణ్యానీమధూదితారుణిమ, వల్ల్యురగరసని
కోద్గతి తరుగరుత్మద్గరుద్గణ ముద్భిదాహార్య జీమూత రోహితంబు
నవమిళింద ప్రాహుణక శోభనాక్షత - ప్రతతి, వాయస విభక్త
పరభృతౌఘ ప్రాప్త పత్రిక, మాలతీ - త్రాసామయావహోద్రక్షతజము

*ప్రమదవన వనదేవతా సముదాయాంగ*
*రాగమినజహరి జ్జగత్ప్రాణశాణ*
*కషణ దళిత దళాంత సంక్రాంత కాంత*
*ఘన మణి శలాక - చిగురాకు కలయ మొలిచె. ( ఆము. 5-110)*

సొనదేఱి పొటమరించి, నెఱెవాసిన యట్టి - యాకురాలుపు గండ్ల యందుఁ దొఱఁగి
యతీబాల కీరచ్ఛదాంకురాకృతి బొల్చి - కరవీరకోరక గతి క్రమమున
నరుణంపు మొగ్గలై యరవిచ్చి, పికిలియీ - కలదండలట్లు గుంపులయి, పిదప
రేఖలేర్పడగ వర్ధిలి వెడల్పయి, రెమ్మ - పసరు, వాఱుచు నిక్కఁ బసరు కప్పు

పూట పూటకు నిక్కఁ గప్పునకు దగిన
మెఱుఁగు నానాటికిని మీఁదఁగిఱి కొనంగ
సోగయై యాకువాలంగ జొంపమగుచుఁ
జిగురు దళు కొత్తె తరులతా శ్రేణులందు. (మనుచ. 6-27)
ఇద్దరు మహాకవుల వసంత వర్ణనలివి.

రాయలవారి శబ్దం - ఊహ, రచన - శైలి వేరు. పెద్దన గారు ఏరుకొనే పదాలు ఆకురాలుపుగండ్లు', 'సొనతేరు', 'పొటమరించు' రాయలవారు రాంకవము- రోహితము. ఆ మార్దవం వేరు. ఈ గాంభీర్యం వేరు. రాయల భావన క్లిష్టమైనది, దానికి హేతువు అందులో శాస్త్రీయాంశమో సంప్రదాయమో- లోకమో - ఆచారమో - అన్నీ కలిసిన లక్షణమో ఉండటం. పెద్దన గారి ఊహ కావ్యసౌందర్య సంబంధమే. దీని కదనంగా రాయనిలో మరేదో ఉంటుంది.

## చిగురాకు

1. చిగురాకు గరుడి ఈక - ఇదివైష్ణవ భావన.
2. భోజనాహ్వాన వేళ శోభనాక్షతలు పెట్టటం ఆచారం- ఆ కుంకుమ పూసిన అక్షతలు చిగురాకులు.
3. కాకులు కోకిలలు విడిపోతూ వ్రాసుకొన్న పత్రికలు చిగురాకులు. అన్నదమ్ములు విడిపోతూ

ఆస్తిపాస్తులు పంచుకొని విడిపత్రికలు- పారీకత్తులు వ్రాసుకోవటం దేశీయాచారం. దానితో వారిమధ్య మైత్రీబంధం - సౌందర్యం పోయినట్లు.

4. వసంతంలో మాలతి పుష్పించదు. కవి సమయం. ఇది ఇలాగే చెప్పకుండా మాలతికి భీతి కల్గించటానికై చల్లిన నెత్తురు( తోతడిపిన అక్షతలు). చేతబడి వంటివి చేసినపుడు చేయబడ్డ వారింట్లో - నడిచే దారిలో - నెత్తుటిఅన్నం వంటి పదార్థాలు చల్లటమున్నది.

ఇన్ని కలిపి రాయలు ఊహ నిర్మిస్తాడు. ఇది క్లిష్టతకు కారణం. ఇదే కావ్యమంతటికీ అన్వయిస్తుంది. ఆముక్తం కేవల ఆలంకారిక మార్గానికే ఒదిగేది కాదు. రసాది సామగ్రిని నిక్షేపిస్తూనే భారతీయ సంస్కృతీ సంపత్తి - మతం - రాజనీతి వంటి అనంత శాస్త్ర వైభవాన్ని గుంఫిస్తాడు మహాకవి. ఇది భారత మార్గం. పెద్దన గారిది వాల్మీక మార్గం. (చూ: శ్రీఅరవిందుల వ్యాస వాల్మీకులన్న విమర్శ గ్రంథం).

కవుల వ్యక్తిత్వం - జీవలక్షణం - వారిమాటల కడుగున ఉండనే ఉన్నది. రాయలలోని మహాచక్రవర్తి లక్షణం ప్రతిభావంలో - అలంకారంలో - కథాసూత్రంలో స్పష్టంగా దోబూచులాడటం సహృదయానుభవం లోనిదే.

''నల్లగ్రోలనిచ్చి మెల్లనె చివ్వంగి - నోరిజింక దివియు నేరు పొదవు వేటకాని వోలె -'' (4-193)

ఈమాట యామున కథలో రామమిశ్రునిది. ఈవేటగాని లక్షణ మా అమాయక బ్రాహ్మణున కేమెరుక? - ఇది రాజుమాటతప్ప. రాజనీతి నంతగా చెప్పినవాడు రాజు. అది స్వానుభవం. కళాపూర్ణోదయం - కిరాతార్జునీయాదుల్లోనిది పుస్తక పాండిత్యం తప్ప ఈ సూక్ష్మ దర్శన మందులో మందునకైనా లేదు. అడవులు - వేట, జంతుస్వభావాదులు - ఎన్నని. వీటికి గని ఆముక్తం. అవన్నీ రాజు జీవసంపుటి లోనివి.

మన్మథుడన్నరాజు నానతిచే ప్రాతః కాలమన్న ఫిరంగి కాల్చేవాడు - సూర్యకిరణమన్న నిప్పు త్రాడు ముట్టించి వికసిస్తున్న తామరపూలన్న ఫిరంగి నాళపు మూతులనుండి తుమ్మెదలన్న గుండ్లు గోదాదేవి ధైర్యమన్న కోటగోడపై ప్రేలుస్తున్నాడు.(5-85)

ఇదేమి ఊహ ! యుద్ధాంగణానుభవం నుండి పుట్టిన ప్రచండ భావన. ఇలాంటివి మనువులో లేవు.

ఖాండిక్య కేశిధ్వజ సంవాదంలో ఆవును పులివేటాడిన వైనం - అడవుల్లో ఓడిన వారు దాగి ఉండటం - కోటికాంద్ర కాపుదల - అంతా ఒక క్షాత్రోదంతం. రాజు కానినాడు - ఆ రచన దుర్లభం.

రాయల వారు నాల్గైదు కథలు చెప్పారు. ''విష్ణుచిత్తుని కథలో మాధుర్యమున్నది. ఖాండిక్య కథలో ఠీవి - దాసరి కథలో ప్రౌఢి - యామున కథలో రాయని ఆత్మద్రవ్యం '' ఇన్ని రకాలుగా -

భిన్నశైలుల్లో వక్త్రౌచిత్యానుగుణంగా వ్రాసిన లక్షణం తిక్కనలోనే లేదు. పెద్దన మాటేమిటి? ప్రవర కధ కవి తానై చెప్పింది. మనోరమ - గంధర్వ రాజుల కథలు వారే చెప్పుకొన్నారు. కవివాక్కు కవి నిర్మిత పాత్ర వాక్కు - ఒకే మాధుర్యపు పోహళింపు తప్ప వైవిధ్య వైచిత్రిలేదు.

ఇందుకే విశ్వనాథ కవి సమ్రాట్టు '' ఆముక్త మాల్యదలో నున్నన్ని భిన్నశయ్యలు వ్రాయగలడేని పెద్దన గారు మనుచరిత్రలో నేల వ్రాయలేదు'' - అని వేయిపడగల్లో వ్రాసారు.

హంపీ క్షేత్రంలో కొడాలి సుబ్బారావు గారు -

''- ఆంధ్ర కవిత్వ పితామహాంబునిధి యొక నీటిబుగ్గ యయిపోవదె త్వత్కృత - వస్తు సృష్టిలోన్ - అంత విశాల మహాసామ్రాజ్యం ఆముక్తం.

పెద్దన్నగారి శృంగార రస నిర్వహణకూ - ఆముక్త నిర్వహణకు ఎంత వారడి? మనువులో వాచ్యత హెచ్చు.

'దట్టంబునీ కట్టినట్టి చెంగావికి
బాగుగాదని కేలఁబయటనిమిరె' (6-8.)
చెయ్యి పట్టిన మాత్రాన శిరసు వాంచి
యవశ చందానఁబై వ్రాలు నవ్వధూటిఁ
బర్ణశాలాంతరము జేర్చి బ్రాహ్మణుండు
కెరలు కోర్కెలఁ గందర్ప కేళిఁ దేలె - (6-35)

ఇంత స్పష్టంగా రాయల వారెక్కడా వర్ణించలేదు. శృంగార రస విషయంలో కాళిదాసంత గంభీరుడు శ్రీకృష్ణదేవరాయలు

వచన రచనలో ఆముక్త కవిది కవిత్రయ మార్గం. పెద్దన గారిది ప్రబంధ మార్గం. అది ఐతిహాసిక గంభీరం. ఇది శాబ్దిక ప్రౌఢం.

''శకటాంగ భంగికమ్ముమ్మలై యింగలమ్ము లొలుకు నపాంగమ్ముల పిశంగమ్ములగుచు'' (మను. 5-27)

'అత్తెఱవ యక్కఱ కరిపలుకుల కులికి గఱిగఱిం గఱవ గరకరిం జెఱకు విలుకాడు'' (మను. 2-61)

కధాగతికైన వచనం - భగవద్వర్ణనకైన వచనం - సామాన్య లోక చిత్రణ కోసం వ్రాసిన వచనం - భిన్నమైన తీర్పు గలిగిన రచన రాయలవారిది.

శ్రీరంగనాథుని వర్ణనాత్మక వచనమెంత దివ్య సుందరమైనది! విష్ణుచిత్తులు విజయానంతరం

విలుబుత్తూరుకు వస్తున్న వేళ వ్రాసిన దీర్ఘవచనమెంత లోకజ్ఞతాగాంభీర్యం కలదో- అంత సులభమైన రచన కలది. ఆ లోకాన్ని అంత అతిలోక దర్శనంతో ముంచెత్తట మెంత ఆశ్చర్యకరమైనది !

తొల్లి దర్శన ప్రవర్తకుండై వైయాసికంబులగు
సూత్రంబులు వివరించి - (ఆము. 6-66)

ఈ రచన వేరు. కథాశయ్యల వైవిధ్యం లాగానే ఈవచనాలున్నూ. పద్యరచనలో వేగం అపృథగ్యత్న సిద్ధమైన ఓజోగుణాత్మకమైన ప్రౌఢరచన రాయలలో నున్నట్లుగా పెద్దన గారిలో కన్పించదు.

'ఇతరులు నీకు నీడె మఱి యీధృతి యీ స్మృతి' (6-96)
'నీచెఱ బాసిపోయి రజనీచర' (6-45)
'తిరుగు హరిపుర సురతరు సురల మరగి' (1-41)
'కపివర నియుక్తవర సద్గృహనిలయ' (2-3)

'బహురత్న ద్యుతి మేదురోదర దరీ భాగంబులన్'' - అన్న మనువు పద్యాన్ని గురించి ఒకచోట చెళ్ళపిళ్ళ వారన్నారు. ఒళ్ళు తెలియని ఈ శివమెత్తిన రచన - అని . ఈ లక్షణం రాయలలో బహుధా కన్పించినట్లు మనువులో కన్పించదు.

ఆముక్తం పెద్దన రచన అన్న వాదానికి మూలం రెండు తలా - తోకా లేని సీస పద్యాలు.
కృష్ణదేవరాయల పేరునిడి రచించితివి - (చూ: వావిళ్ళ పీఠిక)
ప్రౌఢదీర్ఘ సమాస పదములు గూర్చి - (చూ: వేదం వారి పీఠిక)
ఇవిమనకు పరమ ప్రమాణం !!

మొదటి పద్యం ప్రకారం ఆముక్తం మొదటి రచన, రెండవ దాని ప్రకారం మనువు మొదటి రచన. ఏది విశ్వసనీయమనుకోవాలి? ఇంతే కాక మొదటి పద్యంలో '' ఆముక్తం కఠినమని రాయలన్నట్లు పెద్దన్నతిరిగి మనువు వ్రాసినట్టున్నది.'' కఠినంగా వ్రాసింది రాజు గారి పేరున. మధురంగా వ్రాసింది తన పేరున. చిత్రంగా లేదా? కఠినంగా 'అర్థంబు గ్రాహ్యంబు గానట్లు' వ్రాసిందేమో పనికిరానిదన్నట్లు రాయని పేరున ప్రకటించి అత్యుత్తమముగ - అద్భుతముగ - వ్రాసి తన పేరున ప్రకటించుకొన్నాడట పెద్దన. ఎంతస్వార్థబుద్ధి !! (ఈపద్యకర్త దృష్టిలో మనువు ఆముక్తం కంటె గొప్ప కావ్యమని కాకపోతే అలా వ్రాయడాపద్యం).

ఆముక్తము మనువు తర్వాతి రచన అని ఆశ్వాసాంతమునుబట్టి నిర్ణీతమైనది కనుక ఈపద్యం అసంబద్ధం.

రెండవ పద్యం రామకృష్ణునిదట ! ఇంతకంటె అంధ విశ్వాసం మరొకటి ఉండబోదు! ఆప్రభువు రచన ఎక్కడ? ఈనీరస రచన - కుంటినడక కల పద్యమెక్కడ!

గిరికానుషక్త - అన్న పాండురంగ మాహాత్మ్యపద్యంలో వసు - ఆముక్త రచనల నాయన కళ్ళుకద్దుకొన్నాడు కదా. ఈచచ్చు సీస పద్యం రామకృష్ణుడు వ్రాస్తాడా ? ఈ పండితుల విమర్శశక్తి ఎంత దయనీయమైనదో ?!

శ్రీవేదం వారంత ప్రౌఢవ్యాఖ్యానం వ్రాసిపెట్టారు కనుక నేటిలోకానికి ఆముక్త మందుబాటు లోనికి వచ్చింది. లేకపోతే గతిలేదు. వారికి నమస్కరిస్తూ - వారు పీఠికలో ఆముక్తము పెద్దన గారిరచన అనే వారి వాదాని కనుకూలంగా 17 విషయాలు కూర్చారు. వాటి విమర్శ ఈక్రిందిది.

1. అప్పకవి అలాగే అన్నాడు. వ్యాఖ్యాతల పరంపర అలాగే అన్నది - ఇదంతా ! కవి బ్రాహ్మణుడై యుండాలి. అన్న లక్షణానుసారంగా వచ్చిన అంధదృష్టి. అప్పకవి కిక్కడ ప్రామాణ్యమేమీ లేదు. పైనిరూపణానుసారంగా అది రాయల ఆత్మనుండి పుట్టిన దని స్పష్టపడ్డది కనుక.
2. కృష్ణరాయ విజయం - రాయవాచకం - రాయలు కావ్యం వ్రాసినట్లు చెప్పలేదు కనుక, ఈ రచయితలు - అప్పకవి లాగానే రాయనికి చాలా తర్వాతి వారు అప్పటికే పెద్దన గారి పేరున ఆముక్తం ప్రచారంలో ఉన్నందున వారూ చెప్పకపోవచ్చు.
3. పెద్దన్న తిమ్మన్నలు రాయని కవి యన లేదు.

'కవితా ప్రావీణ్య ఫణీశ!' అన్న తిమ్మన్న గారి సంబోధన కర్థమేమిటి? కవిత్వం చెప్పటంలో ఫణీశుడనా? కావ్యాలంకార మర్మజ్ఞతలో ఫణీశుడనా? - ఈరెండవ అర్థం వేదం వారన్నది.కానీ మొదటి అర్థమే సమంజసం కదా !

'అవంధ్య ప్రబంధ కృతి సంబంధ్యనుభావునకున్' (1-31)

సకల కళా ధోరణికిన్ - (1-33) ఈరెండు పద్యాలు పారిజాతంలోవే.

రాయలు 'వారిద్దరనూ కవులన్నాడా తన కావ్యంలో? (వారు వ్రాసుకొన్నారు అయన తమను సన్మానించినట్లు) కనుక వారు వ్రాసిన కావ్యాలు వారూ వ్రాయలేదనుకోవచ్చునా?

4. 'రాజు దినచర్యలో రాజునకు కావ్యరచన విధించలేదు కావున' - ఇదేమి వాదం ! ఈరాజనీతి చెప్పింది కవికాదు. కవి నిబద్ధపాత్ర. అతడు యామునాచార్యుడు. కాక రాజ్యపాలన రాజునకు విధికాని కావ్యరచన కాదే? కావ్యం వ్రాయటం - వ్రాయకపోవటం పాలనా విషయం కాదు కదా ! కావ్యం వ్రాయక పోతే లోకానికేమీ నష్టం లేదు కానీ పాలనా ధర్మం విస్మరించరాదు. కదా! రాజధర్మంలో దేనికి ప్రాధాన్యం? అతడేచెప్పాలి తప్ప, అన్యం దేనికి ? చాణక్యుడర్థశాస్త్రం వ్రాసాడు కదా ! మరిమంత్రి లక్షణాల్లో శాస్త్ర రచన చేర్చలేదేమి? కనుక అర్థశాస్త్ర కర్త అతడు కాదంటే? -

5. రాజనీతి రాజే వ్రాయనక్కరలేదు. చాణక్యుడు వ్రాయలేదా? పెద్దన్న రాయల నడిగి తెలుసుకొని వ్రాసి యుండవచ్చుకదా !

చాణక్యుడు వ్రాసినా అనుభవించివ్రాసాడు తప్ప అనుభవం లేకుండా కాదుకదా! పెద్దన గారికా అనుభవం లేదు కనుక రాజునడిగి తెలుసుకొని వ్రాసి యుండవచ్చు కదా! ఇంత డొంకతిరుగుడు వాదం దేనికి? -

6. '' ఆముక్తం లోని వైదిక పాండిత్య ప్రకర్ష రాయని కసాధ్యం కనుక రాయలంత వాడని చెప్పనందువల్ల. ''

ఎవరు చెప్పలేదు ? ఒకడెవడో చెప్పటం దేనికి? పాండిత్యం కానీ, వేదోపనిషత్సంబంధమైన విషయం కానీ రాయల వారికుండకూడదా? -

ప్రాచీన రాజులందరూ వేదశాస్త్ర వేత్తలే. పైగా రాయలవారు సకలాగమ పారావార పారీణుడైన తిమ్మరుసు అప్పాజీగా కలవానికి తెలియక పోవటమేమిటి? కనుక ఈ విషయాలు చాలా పేలవమైనవి. ఇందుచే ఆముక్త మాల్యదను వినిర్మించినవాడు శ్రీకృష్ణదేవరాయ మహాచక్రవర్తి.

ఆముక్తము రాయల వారు వ్రాసినారన్నపుడు కలిగే ఆనందం పెద్దన్న గారు వ్రాసారన్నపుడు లేదన్న విశ్వనాథ వారి మాట ఎంత అద్భుతం !!

వేదంవారు వాక్రుచ్చిన మిగిలిన కారణదశకం ఏకాదశం చాలా నీరసం కనుక సమాధాన మనవసరమని చెప్పటంలేదు.

## ఉభయకవి మిత్రుడు

కవులు ప్రధానముగ మూడు రకాలు.

1. శాస్త్రకవి 2. కావ్యకవి. 3. ఉభయకవి.

శాస్త్రకవి కావ్యంలో రససంపదను పండించగలడు. కావ్యకవిశాస్త్రంలో తర్కకర్కశతను వేరుచేస్తాడు. రెంటిలో ప్రవీణుడు భయకవి.

*శాస్త్రకవిః కావ్యే రససంపదం విచ్ఛినత్తి*
*కావ్యకవిః శాస్త్రే తర్కకర్కశ మప్యర్థముక్తి*
*వైచిత్ర్యేణ శ్లథయతి, ఉభయకవి స్తూభయోరపి*
*వరీయాన్యదుభయత్ర పరంప్రవీణః స్యాత్ (కా. మీ. 5. అధ్యా)*

ఉభయకవి రచన శాస్త్రకావ్యము. అట్టి వారిలో సూర్యునివంటివాడుభయకవి మిత్రుడు.

శాస్త్ర కావ్యమనగా శాస్త్రమువలె మోక్ష పురుషార్థాన్ని బోధిస్తూ పాండిత్య వైశారద్యమును కల్గిస్తూ కావ్యమువలె రసానుభూతిని కల్గించే రచన. శాస్త్రవిషయాలను చర్చిస్తూ వాని ప్రాధాన్యాన్ని రసాని కంగభూత చేయటంలో ఆతడుభయకవి. విద్వత్కవి యవుతున్నాడు. కేవలరసానుకూల సామగ్రిని గ్రథించి రసానుభూతి కల్గించటమే మహావిషయము కాగా నీరసములైన శాస్త్రవిషయాలు చెప్పి రసానుభూతిని కల్గించట మంటే ఎంత మహావిషయం! ఇందుచేతనే కావచ్చు.

*''విద్వత్కవయః కవయః కేవల కవయః కేవలం కపయః''.*

అన్న యార్యోక్తి పుట్టినది. రాయలు తన కావ్యమును శాస్త్రకావ్యంగా ఎలా నిర్మించాడో కొన్ని యుపపత్తులున్నవి.

ఆముక్తంలో యోగం - విశిష్టాద్వైతమత - రహస్యములు- రాజనీతి- ఇత్యాది శాస్త్రవిషయాలున్నవి. ఈవిషయాలు కావ్యంలో గ్రథించిన ఘనత రాయలదే. కాశీఖండాదులందు యోగమున్నది, అది మూలానుగుణము. ఉన్నా రసాంగత్వం దానికి సంక్రమించదు.

రాజనీతి ఆముక్తమందే రసాంగత్వం పొందినది.

వీనిని కూర్చటంలోని రహస్యం రసదర్శనాదులందు చర్చితం. వానిని వదలితే ఆ యా విషయాలు కావ్యంనుండి బైటకు తీస్తే శాస్త్రీయ విషయాలుగా నిలుస్తాయి. నిల్వాలని రాయలు నిర్మించినాడు. లేక పోతే, వానినంతగా చెప్పనక్కఅలేదు. వానినిగూర్చి కూలంకషంగా కవి విస్తరించాడు. భారతంలో అనేక శాస్త్రవిషయాలున్నవి. కనుకనే దానికి శాస్త్రత్వ మబ్బినది.

భారతంలో శాంత రసాంగితను చర్చిస్తూ ఆ మహాకావ్యం శాస్త్ర కావ్యమంటూ ఆనందవర్ధను డిలా వ్రాసాడు.

భారతం శాస్త్రదృష్ట్యా మోక్షపురుషార్థాన్ని, కావ్యదృష్ట్యా శాంతరసాన్ని చక్కగా ప్రతిపాదిస్తున్నది.

''తదేవ మను క్రమణీ నిర్దిష్టేన వాక్యేన భగవద్వ్యతిరేకిణః
సర్వస్యాన్యస్యానిత్యతాం ప్రకాశయతా మోక్షలక్షణ ఏవైకః
పరః పురుషార్థః శాస్త్రనయే కావ్యనయే చ తృష్ణా క్షయ
సుఖపరిపోషణలక్షణః శాంతో రసో మహాభారతస్యాంగిత్వేన
వివక్షిత ఇతి సుప్రతిపాదితం '' ( ధ్వ. లో. 4. ఉద్యో)

కావ్యదృష్టి - శాస్త్రదృష్టి రెంటిని కలిపికట్టినది భారతం. రాయలు రసమత సమ్మేళనం చేసినాడని వ్రాయనైనది. మతమును రసముఖంగా వ్యాఖ్యానింప దలచుకొని యీకావ్యమును వినిర్మించినాడు. ఈవిలక్షణదృష్టి యూముక్తమును శాస్త్రకావ్యంగా జేస్తున్నది. శాస్త్రం చెప్పిన మోక్షమునే

మహాభారతం రసపరంగా వ్యాఖ్యానించింది. మోక్షం తృష్ణాక్షయమూలకం. వైరాగ్య హేతుకం, తృష్ణాక్షయ మోక్షమే పరమ పురుషార్థము, భారతంలో అదే మరొక పేరున వ్యవహృతమైనది. అదే శాంతము.

ఇది శాస్త్ర కావ్య స్వరూపం.

కావ్యంలో వైష్ణవ రహస్యాలు ప్రదర్శితములైనవి గదా. ఆళ్వార్లు పండించిన వైష్ణవ మను రాజనప్రధాన్యమును నిండించినగాదె యాముక్త మని చూడనైనది. రసదర్శనమున రసవిషయము వ్యక్తీకరింపబడినది రెంటిని కలిపి చూస్తే ఈ కావ్యం శాస్త్రకావ్యం.

శ్రీవైష్ణవము బోధించిన విషయము శేష- శేషిన్యాయము. ఆ మతము ప్రధానముగ బోధించినది భగవంతుడే సర్వనియంత. జీవులకు వ్యక్తిత్వము లేదు. ఇందుచే ప్రపత్తి యోగము శరణ్యం.

ఇందుకని జీవుడు భగవంతునిచేతిలో నొక యుపకరణం, అతని లీల యీ సృష్టి.

స్థితి - ప్రళయాదులు - చిదచిత్తు లాతనియందు బ్రతుకుతున్నవి. ఈతని ననుసరించి ప్రవర్తించటమే మోక్షమార్గం. ఆభగవంతు డర్చామూర్తి. అందరకందుబాటులో నున్నవాడు. దీనినే కవి వ్యాఖ్యానించింది. అతని శృంగారమే సృష్టి. ఆ శృంగారదర్శనమే మోక్షము. భక్తులు గానంచేసే దా శృంగారమునే.

*అపూర్వ నానారసభావనిర్భర*
*ప్రబుద్ధయా ముగ్ధవిదగ్ధ లీలయా*
*క్షణానువత్క్షిప్త పరాదికాలయా*
*ప్రహర్ష యంత్రం మహిషీం మహాభుజం. (స్తో. ర. 44)*

దీనినే రాయలు శృంగారమన్నాడు. అనగా రసం.

భారతము క్రిందనుండి పైకిచూచినది. (అనులోమదృష్టి) మనుష్యునినుండి ప్రయాణించి మోక్షమున పర్యవసిస్తే ఆముక్తం పైనుండి క్రిందికి చూచినది. (విలోమదృష్టి) భగవద్దృష్టితో శృంగారంలో అంతర్భవించింది.

''మనుజులు సేయ నెవ్వరు సమస్త మునీశ్వరునాజ్ఞ సెల్లడిన్''. (శాంతిపర్వ)

ఇదే యాముక్త ప్రబంధధ్వని. వైష్ణవ మత ప్రతిపాద్యము శ్రీమన్నారాయణతత్త్వము రసపరముగా శృంగారము కలిపి యుభయకావ్యము. రాయలు '' ఉభయకవిమిత్రుడు.''

## ఉదాత్తుడైన కవి

ఈ చెప్పిన కవితాశిల్పం సర్వం రాయలవారు తెలిసే చేశారు. కలలో కన్పించిన భగవంతుడు

కృతివినిర్మింపుమన్నాడు. తెలవారిన పిదప భక్తుడు స్వప్నాగమవేత్తలను బిలిచి కల వివరింపగా రాయలను వర్ణించి ''కృతి వినిర్మింపు'' - మనిరి.

రెండుచోట్ల 'వినిర్మాణ' శబ్దమును కవి వాడటంలో తన కావ్యశిల్పము నాతడు ప్రయత్నించి నిర్మించినాడనే కదా అర్థం.

ఇంత వినిర్మాణం చేసి తన కావ్యమును గూర్చి యొక్క మాటైనా చెప్పుకోలేదు. ఆశ్వాసాంత పద్యంలో తన రాచరీవిని వర్ణించుకొన్నాడు గాని కావ్యమును గూర్చి మాటయేనియు వ్రాసికోలేదు. కావ్యపరీక్షసహృదయునిది. వ్రాసి వీనిచేతిలో పెట్టి తన కావ్యమిట్టిది యిట్టి దనుట గంభీర మనస్విత కాదు; మహాచక్రవర్తిదృష్టిలో. కవులు( స్వభావమును బట్టి) నాల్గు రకములని సింగభూపాలుని వ్రాత. ప్రత్యేకవాక్యం.

ఉదాత్తుడు - ఉద్ధతుడు - ప్రౌఢుడు - వినీతుడు - అని.

''*అంతర్గూఢాభిమానోక్తి రుదాత్త ఇతి గీయతే*'' (*రసార్ణవసుధాకరం*) ఇట్లు చెప్పి

*పురాణమిత్యేవ న సాధు సర్వం*

*న చాపి కావ్యం నవమిత్యవద్యం*

*సంతః పరీక్ష్యాన్య తరాద్భజంతే*

*మూఢః పరప్రత్యయనేయబుద్ధిః* -

*అన్న మాళవిక శ్లోక ముదాహరించి*

*అత్ర సంతః పరీక్ష ఇత్యనేన స్వకృతేః పరీక్షణ క్షమత్వ*

*కల్పితో విజయ గర్వి, కాళిదాస స్యోదాత్తత్వం.*

- అని వ్రాసినాడు.

ఈ మాత్రమేని రాయలు చెప్పికోలేదు. కాని భగవంతుని ముఖంగా ఈషత్సూచన చేశాడు.

*మఱియు రసమంజరీ ముఖ్య మధురకావ్య*

*రచన మెప్పించుకొంటి గీర్వాణభాష*

*అంధ్రభాష యసాధ్యంబె యందునొక్క*

*కృతి వినిర్మింపు మిక మాకుఁ బ్రియముగాగ.*

భగవంతుడిట్లన్నాడు. అతని వాక్యమవితథము కనుక కావ్యం వినిర్మాణమైనది ప్రియమైనది. అట్లే వేదాగమవిదులు రాయని స్తుతించి-

''*సాహితీ సమరాంగణ సార్వభౌమ*

*కృతి వినిర్మింపు* -'' మన్నారు.

దీనివల్ల రాయలవారి కవితాశక్తి ఊహ్యము. వీరి ముఖంగా తన కావ్యరచనాస్వరూపం కొంచెము వ్యక్తీకరించినాడు. అతని కావ్యశ్రోత లట్టివారే. తావన్మాత్రమే చెప్పినాడు. ఇంకేమి చెప్పికోలేదు. పైగా తన కావ్యశ్రోత భగవంతుడు. వానితో 'నా కావ్యము నిట్లు వ్రాయుచున్నానయ్యా - ఇందీ గుణములున్నాయని తదితరులన్నట్లు చెప్పుట భక్తుని పనికాదు.

ఇంతేకాక రాయలు మహాచక్రవర్తి. అతడు మాటాడుట తక్కువ. భ్రూభంగశిరః కంపనాదులచే నాజ్ఞాపిస్తాడు. హృదయగతోహలు పైకితేల్చడు. సర్వము ననుమీయము కావలసినదే. ఇది చక్రవర్తి లక్షణం. అందుకని తన కావ్యమును గురించి ఏమీ చెప్పుకొనలేదు సరికదా యా చెప్పిన కావ్యమును సాంద్రతముగా చెప్పాడు. ఇందుకని కావ్యం ప్రౌఢతమమై పోయినది.

అతని కత్తీ, గంటమూ నిశిత ప్రౌఢములు.
అతని భుజబలమువోని మనోబల మనన్యసాధ్యము.
అతని సమరాంగణ - సాహిత్యాంగణ విక్రమం నాన్యతోదర్శనీయం.
ఇందుకని శ్రీకృష్ణదేవరాయ లుదాత్తుడైన కవియేకాక సాహితీ సమరాంగణ సార్వభౌముడు.

## కవియతీంద్రుడు

*దయానిఘ్నం యతీంద్రస్య దేశికం పూర్ణమాశ్రయే*
*యేన విశ్వసృజో విష్ణోరపూర్యత మనోరథః ( య. రా. స. )*

యతీంద్రునకు తన్మతస్థాపనంలో ఆచార్యత్వమున్నట్లు రాయలకు ఆమతాన్ని రసముఖంగా వ్యాఖ్యానించటంలో ఆచార్యత్వమున్నది. అతడు తత్త్వపరంగా శ్రీవైష్ణవ మతాన్ని తీర్చి యుభయ వేదాంతస్థాపనాచార్యుడు కాగా రాయలు తన్మత సంప్రదాయాలను రససిద్ధాంతాలను రెంటికి పరస్పరానుకూల్యం నిరూపించి ఉభయ సంప్రదాయ స్థాపనాచార్యు డైనాడు. అంటే శ్రీవైష్ణవమునకు తత్త్వ దర్శన లక్షణమారోపించి యతీంద్రుడెంత చేసినాడో తన్మత మాధుర్యాన్నిరసానుకూలముగా త్రిప్పి రాయలంత పనిచేశాడు. యతీంద్రుడు తత్త్వదృష్టిలో శ్రీవైష్ణవాన్ని వ్యాఖ్యానించగా కవీంద్రుడు రసదృష్టితో వ్యాఖ్యానించాడు.

ఈవిషయము రాయలవారి యీపద్యంలో గంభీరంగా ధ్వనిత మౌతున్నది.

*''సిరినొక్కప్పుడు కన్మొఱంగి హరి తన్జేరన్ బ్రహర్షించు ను*
*ర్వరకున్ వంచన గూడగా గలుగు భాస్వచ్చంద్రశాలా పరం*
*పరలయ్యెన్ బఱపైన యెవ్వని ఫణాపంక్తుల్ నుతింతున్ నిరం*
*తరముం దాంతుని నయ్యనంతుని నతీత బ్రహ్మకల్పాంతునిన్'' ( ఆ. ము. పీఠిక)*

ఇందులో నిత్యద్వంద్వ శృంగారము భరిస్తున్నవాడు అనంతుడు.

శ్రీరామానుజస్వామి భగవచ్ఛృంగారాన్ని, సౌందర్యాన్ని మతపరంగా స్థాపించినవాడు. సర్వసృష్టియు పరమేశ్వర భోగస్థానము, ఉభయవిభూతులు నంతే. తత్స్వరూపము చెప్పినవాడు యతీంద్రుడు. అతడు దాంతుడై యాపని జేశాడు. తత్పరమేశ్వరతత్త్వమును తన వేయిపడగలపై భరించినవాడు గావున రామానుజుడాదిశేషుడు. దాంతుడు కానివాని ముఖంనుండి సత్యమెట్లు స్రవిస్తుంది ? అతడు తపః క్లేశాదులచే దివ్యసత్యము దర్శించి దానిని సహస్రముఖములుగా వ్యాఖ్యానించినవాడు. కావ్యపరంగా భూదేవి, గోద, హరి శ్రీరంగనాథుడు. ఆ ద్వంద్వముయొక్క శృంగారము తన సుందర శబ్దజాలంతో, గంభీరకల్పనములతో ధరించినవాడు కవి. ఈతని హృద్యపద్యములునందులోని ఉదారమధురములైన పదాలు పఱపైన ఫణాపంక్తులు, కావ్యంలో శబ్దమూ విభావాది రూపమే. దానితో రతిభావం ధ్వనిస్తుంది. ఇందుకని ఫణాపంక్తులు - మణియుతములైనవి - పద్యాలు, కవిదాంతుడు. అనగా ఋషి. సంయమము లేనివాడు కావ్యసృష్టి చేయలేడు. శబ్దం సుందరమైనది. కవి దీనికి ఆకృష్టుడు కారాదు. ఐతే రసలోపమే.

*''విభావానుభావసంచార్యౌచిత్యచారుణః'' (ధ్వ.లో.3-10)*

''విభావానుభావ సంచారి భావౌచిత్యం కవి పాటించవలె. నాయకవ్యామోహితులై మానవులకు దివ్యౌచిత్యము, దివ్యులకు మానవౌచిత్యమును నిబంధించి కథాసృష్టి చేయరాదు. దివ్యసంభోగ ముదాత్తముగా వర్ణితం కావలె. గ్రామ్య సంభోగవర్ణన దేవతల యెడల సర్వథా పరిత్యాజ్యం''

రాయలు దివ్యౌచిత్యమునే పాటించినాడు. నాటి కవులవలె సంభోగవర్ణన చేయలేదు. మత వ్యామోహంతో రసనిబంధనము మఱువలేదు. యుద్ధవర్ణన యామున దండయాత్రవేళ చేయలేదు. తన చక్రవర్తిత్వము- తదనుభవమును కుదించుకొన్నాడు. ఇదే సంయమనం, యామునుడు రంగనాథ పాదదర్శనం చేసినపుడు భగవత్ స్తుతి చేయలేదు. గోదావ్రత విషయమున నామె తిరుప్పావు తెనుగించలేదు. రసదృష్టి యెప్పుడును దాంతతకు సంబంధించిన విషయమే. రాయలట్లు కావ్యసృష్టి చేశాడు. కవి- యతి ఇద్దఱు తదనంతమూర్తులే. వారు నిమిత్తమాత్రంగా ఉన్నారు. వారిని సాధనములుగా చేసికొని నిత్యద్వంద్వ శృంగారం తనంత తాను ప్రవర్తిస్తున్నది. శేషుడును జీవుడే కదా. ఆతడు దాంతుడు కనుక శృంగారమున కాయతనమైనాడు. ఇదీ కైంకర్య విశేషమే.

ఇట్లు కవి యతీంద్రులిద్దఱును వైష్ణవమును రెండు ముఖాలుగా వ్యాఖ్యానించిన యొకేతత్త్వం, అనంతత్వం.

ఆంధ్రభోజు డష్టదిగ్గజములను పోషించినాడు. అష్టదిగ్గజములు భువనభారమును వహిస్తే తద్భారము వహించువాడెవ్వడు ? అనంతుడు. ఆయన కాధార మాది కమఠము.

రాయలు దిగ్గజభారము వహించినవాడు. రాజపండితుడైనచో మదగజములు యథేచ్ఛావిహారం చేస్తాయి. వానిని నియమించి సుందర కావ్యసృష్టి చేయించాడు. వీని స్వాతంత్ర్య మనంతుడు నియమించాడు. పెద్దనగారి కితివృత్తం రాయలు సూచిస్తే రాయలకు భగవంతుడు సూచించాడు. ఇందుకని రాయ లనంతస్థానమందే ఉన్నాడు.

అసలీ యష్టదిగ్గజ సంప్రదాయ మెక్కడిది ? విక్రమార్కుని యాస్థానమున నవరత్నాలున్నారని ప్రతీతి. యతీంద్రుని యాస్థానంలో, తదవతారమైన మణవాళమహాముని యాస్థానంలోని అష్టదిగ్గజములు వీరు.

1. వానమామలై జియ్యర్
2. పరవస్తుపట్టర్ పిరాన్ జియ్యర్
3. తిరువేంగడ జీయర్
4. కోయిల్ కందాడైయణ్ణన్
5. ప్రతివాదభయంకరమణ్ణన్
6. ఎరుంబియప్పా
7. అప్పిళ్లై
8. అప్పిళ్ళాన్ ( నిత్యానుసంధానం)

ఇట్లు కవి యతీంద్రు లనంతులు. కవికీర్తి సహృదయలోకంలో. యతీంద్రుని కీర్తి, తత్త్వ చింతనాకాంక్షులయందు.

## నాయకుడు - 1

''త్రివిధావస్థల్లో - జాగ్రత్ స్వప్న నిద్రా భూమికల్లో నేనున్నాను. ఆ నేనే పరమాత్మ - భగవంతుడు'' అని షిరిడీ బాబా. వారి కథల్లో -

షిరిడీకి చాలా దూరంలో ఒక కొండ నెక్కుతూ బాబా భక్తుడు నానాచాంద్రోర్కరు దప్పికతో బాధ పడుతుంటే - మసీదులో బాబా అన్నాడట - 'వాడు బాధపడుతుంటే నేనూరుకొంటానా' అని. ఆ గుట్టపైన ఒక ఆటవికుడు తటస్థించి ''నీవు కూర్చున్న రాతి క్రిందే జలం ఉంది. త్రాగవయ్యా'' అని. అతడలాగే చేశాడు.

ఇది జాగ్రదవస్థలో భగవత్ స్థితి - పరోక్ష మార్గంలో. ప్రత్యక్షంగా - పిళ్ళే నారికురుపుతో బాధపడుతూ బాబాకు వర్తమానం పంపాడు - 'నేనీ బాధ పడలేకున్నాను. పది జన్మల మీద దానిని పంచమని'. విన్న బాబా అన్నాడట - 'మరి నేనెందు కిక్కడ ? పది జన్మ లెందుకు? - తీసుకు రండి 10 రోజుల్లో నయం చేస్తాను' ని. అలాగే చేశాడు. ఇది ప్రత్యక్ష స్థితి.

రైల్లో దర్శనార్థం బాబా భక్తులు వస్తున్నారు. ఒక స్టేషన్‌లో సేనాధికారి పెట్టెలను ఖాళీ చేయిస్తూ- వీరి పెట్టెలలోకి వచ్చి 'మీరూ దిగిపోండి' అని, మరలా 'వద్దులే' అని వెళ్ళిపోయాడు. వీరు షిరిడీ వెళ్ళి బాబా దర్శనం చేస్తే ఆ భగవంతుడన్నాడట. 'ఆ అధికారితో చెప్పాను. వారు నా

భక్తులు. వదిలిపెట్టు' అని అందుకే వాడూ అలాగే చేసాడు. ఇక్కడ భగవంతుడు ప్రేరణ శక్తిగా స్వప్న = అంతర భూమికలో ఉండి ఆజ్ఞాపించాడు.

బొంబాయిలో దీక్షిత్ భాగవతం చదువుతూ దిగులు పడ్డాడట. మనగతేమిటి ? అని, అప్పటికి బాబా శరీర త్యాగం చేశాడు. వింటున్న శ్యామా 'బాబా వంటి దైవానికి శిష్యుడవైన నీవు ఇలా బాధపడటమా' అని. ఇంతలో ఒకడు ఆనందరావు పాఖాడే అనే భక్తుడు వచ్చి బాబా రాత్రి నాకు స్వప్నంలో కన్పించాడు. ఇలా చెప్పాడు' అని ఆ స్వప్నం వివరించి శ్యామాతో 'నీకు పంచెల చాపిమ్మన్నాడు బాబా. ఇదుగో తీసుకొమ్మని'' - ఇది స్వప్న ప్రబోధం. ఈ విధంగా దైవం భక్తుల ద్వారా ఆయా కర్మలు చేయిస్తున్నపుడు కర్తృత్వమెవరిది ?

ఇదే మాండూక్యం చెప్పింది - త్రివిధ భూమికల్లో ఉన్న పరమాత్మ = తత్త్వం = అగ్ని - అని.

జాగ్రదవస్థ - వైశ్వానరుడు
స్వప్న - తైజసుడు
నిద్ర - ప్రాజ్ఞుడు

తురీయావస్థలో నామ రూప రహితుడు.
ఆముక్త నాయకుడు వీడు.

మొదటి కథలో మధురా చక్రవర్తి ఉద్ధరణార్థం విష్ణుచిత్తుని ప్రేరేపించినది మన్నారు స్వామి.

'నేడు మహామతీ' :- పద్యంలో రాజు 'ఇహము రోసినాడ' ని చెప్పి, వానిని దయతో వైష్ణవుని చేయమన్నాడు. విష్ణుచిత్తుడు నావల్ల కాదన్నాడు. ''భగవంతుడు - నీ యిచ్ఛయె మిన్నక పోవోయి ముని ప్రవర - ఆవల నేనున్నాడన్' - అని నంబితో పయనంబు తూగింపుమని చెప్పి ప్రయాణాని కేర్పాట్లు చేసింది తాను. ఈయన మధురా చక్రవర్తి ఆస్థానంలో కాలుమోపిన వెంటనే 'హరి తన చేతో గతి నొలయ' ప్రత్యర్థులను వాదించి జయించినది తాను. తుదకు రాజు వైష్ణవుడై విష్ణుచిత్తుని గురువుగా సన్మానించి ఊరేగించినపుడు మరలా భగవంతుడు ప్రత్యక్షమైనాడు. అప్పటిదే దశావతార వర్ణన. ఈ విధంగా కథాదిమధ్యాంతాలలో కన్పిస్తున్నది భగవంతుడు.

కాదు విష్ణుచిత్తుడే నాయకుడంటే 'స్వామీ నన్ను' 'నేడు మహామతీ', 'గృహ సమ్మార్జనమో', 'అనినఁ దద్భక్తికెదమెచ్చి', 'నీ యిచ్ఛయె', 'అనిన మారు పలుక నలికి'', 'ఆనతిఁ బడి', 'ఆతిథ్యము గొని హరి తన చేతోగతి నొలయ', 'అని నుతియింపగా' - అన్న పద్యాల కర్థం లేదు.

దీని మూలమైన కథలో భగవంతుడు కలలో తోచి ఆజ్ఞాపిస్తే భక్తుడాపనిని నిర్వహించినట్లుండగా ఇంత సంభాషణం దైవానికీ భక్తునకూ మధ్య కల్పించటం వ్యర్థం.

యామున కథలో (మూలం) అతడే విద్వజ్జన కోలాహలుని జయించినట్లుండగా కథలో మత స్థాపనగానీ, రాజు అర్ధరాజ్యమిచ్చి యామునాచార్యునకు తన చెల్లెలినిచ్చి వివాహం చేయటంగానీ, - రాజనీతీ - ఋతువర్ణనలేవీ లేవు. ఇంత మార్పున కర్థమేమిటి ? యథా మూలంగా కథనం లేక పోవటంలో రహస్యాలు రెండు.

(1) నాయకత్వ స్థాపన (2) తదనుసారంగా రస నిర్మాణం. ప్రథమం ప్రస్తుతం.

యామునుడు వాదియై వెళ్ళినపుడు రాజాక్షేపిస్తూ

''సంగతియె యోయి ! ఇసుమంత తింగణావు !

తత్త్వ నిర్ణయ వాదంబు తరమె నీకు !''

అన్నపుడు - అతని సమాధానంగా కవి వ్రాసిన మాట



''ఎవ్వడే సర్వభూతస్థు! డిత్తెఱంగునకును బ్రేరేచె నతని య ... ్వామి ఆనతిస్తే వచ్చానన్నాడు తప్ప, తానై వచ్చాననలేదు. కనుకనే రావి చెట్టును సాక్ష్యంగా ఎన్నుకోవటం తటస్థించింది. అది భగవత్సంకేతం కనుక. దాసరి కథకు వక్త - యామున కథకు వలెనే - భగవంతుడు. తన ప్రభుత్వ శక్తిని - జగన్నాయకత్వాన్ని కాదని - తన ఆనతి బడి వర్తించిన వారికి నాయకత్వ మంటగట్టటం సంభవిస్తుందా ? సంభావ్యమా ?

దాసరి కథ అంతా స్వామి సంకీర్తన గాథ కదా. కనుక రాక్షసునితో ముష్టి యుద్ధం 'మత్పదస్మృతి యాత్మ నేమఱక యతడు' చేసాడనీ -

'ఈ కుఱంగటి యీ కురుగుడి వైకుంఠుని బాడి వత్తు' - వదలి పెట్టుమని స్వామిపై శపథం చేస్తే రాక్షసుడు బంధమూడ్చటం గానీ 'అనిన పాలకటంకటవేయుండు-?' అన్న దీర్ఘ వచనంలో ఆయా వైష్ణవాచార్యులు చేసిన జగత్కల్యాణ కార్య ప్రశంస కానీ - రాకాసి సోమశర్మగా మారబోయే వేళ - 'భగవంతుండ రక్షించు' - నన్న దాసరి వచనం కానీ - భగవన్నాయకత్వాన్నే స్థాపించేవే తప్ప భగవంతుని వదలి తనపై నేతృత్వారోపణం భక్తుడు చేసుకోగలడా ?!

ఆముక్త కథా నిర్మాణంలో సంక్లిష్టత ఉన్నది. అది భారత మార్గం తప్ప రామాయణ శైలి కాదు. శాకుంతలాదుల్లో నాయకత్వం ఋజుమార్గం, ముద్ర - ప్రతిజ్ఞా యౌగంధరాయణం - స్వప్న వాసవదత్త వంటి నాటకాల్లో నాయకత్వ పద్ధతి వేరు. ప్రతిజ్ఞలో నాల్గంకాల్లో నాయకుడు (ఉదయనుడు) లేనే లేడు. ముద్రలో రెండంకాల్లోనే ఉన్నాడు. స్వప్నలో మొదటి మూడంకాల్లో రాజు లేడు. కథనంతా నడిపిన వారు మంత్రులు. వీరిని నాయకులుగా చేసి రస నిర్ణయం చేసినట్లు లేదు - ఆలంకారిక మార్గంలో. ఫలభోక్త నాయకుడు. వీరు సచివులై ఆయా పనులు రాజు కోసం

చేశారు కనుక ఫలభోక్తలు వారు కారు. కర్తలు మాత్రమే వారు. ఈ విషయమూ మంత్రులే సూచించారు. స్వప్నలో ప్రథమాంకంలోనే ఆ సూచన ముంది కాబట్టి రంగస్థులై కార్య నిర్వాహకులుగా చేసినవారే నాయకులనటం - ఈ సందర్భంలో కుదరదు. మత స్థాపన చేసినవారు విష్ణుచిత్తాదులు నిజమే. వారాపని చేయటానికి హేతువు వీరి ఉత్సాహం కాదు. ప్రజ్ఞకాదు. స్వప్నవాసవదత్తా నాయకులు సచివాయత్త సిద్ధులు. రాయలవారు కారు. అంటే భగవంతుడు కాడు. 'నీతిం దాస దలంచి చేయ బని కానీ, కాకపోనీ' అని ఆ ప్రభువు రాజనీతి. అంటే ఇతడు స్వాయత్త సిద్ధి. ''నేను తెనుంగు రాయడన్‌గన్నడరాయ!'' అని స్వప్నంలో శ్రీకాకుళాంధ్ర దేవుని మాట. ఈ రాచ దర్శనంలో మంత్రి తన యాజ్ఞానువర్తియే తప్ప తానతనికి వశ్యుడు కాడు. కనుక సర్వ కార్యాలు రాజే చేయడం. అత డాజ్ఞామూర్తి.

*ఆజ్ఞ వలయు నృపతి, కాభీర భిల్లాది*
*కంపకోల నూల నాజ్ఞ చెల్లు*
*నంట సార్వభౌముడైన భూపతి యాజ్ఞ*
*కెల్ల వారు దల్ల డిల్ల వలదె. (4-206)*

ఐనపుడు జగన్నాయకుని సంగతేమిటి ? అతడు ఆత్మరూపుడు. జగత్తు శరీర స్థానీయం. దీని నతడు నియమించుకొని కార్య నిర్వహణ చేస్తుంటాడు.

*అభిచారి ఘనగరాంబు దూషిత రుజ్జీ*
*రంత రాద్రి గహన దంతురోగ్ర*
*కీకటోర్వీమేరుగిరి సమానార్థము వచ్చు*
*నేని చొరకు మంపు మిడుము కొనగ. (4-268)*

అన్ని చోట్లకు రాజు పోడు. ఆజ్ఞ లిచ్చి తగినవారిని పంపిస్తాడు. 'నీ యిచ్చయె మిన్నక పోవలదు ముని ప్రవర!' ఇది నాయకుని ఆజ్ఞా లక్షణం.

ఇందుకే స్వప్న వాసవదత్తలో రాజు కోసం అంతచేసి చివరకు మంత్రి యౌగంధరాయణుడు అనుకొన్నాడట. ''నృపతి హితార్థం రాజమహిషిని దాచి – అతని కోసమింత చేసీ – ఫలం సిద్ధింప చేసి కూడా రాజేమంటాడోనని హృదయం శంకిస్తున్నది'' అని.

ఇది నాయక లక్షణం కాదు కదా !

కాబట్టి విష్ణు చిత్తాదులు మంత్రులే తప్ప నాయకులు కారు.

ఒక వేళ వీరు నాయకులేనని అంగీకరిస్తే రసం శాంతం కావాలి. ప్రధాన కథ గోదా కళ్యాణం. కావ్యాంతమదే. కనుక రసం శృంగారం. శాంతం ప్రకృతి రసమనీ, ఇతరములు వికృతి రసాలనీ సిద్ధాంతం.

*శివే శృంగారార్ద్రా తదితర జనే కుత్సన పరా*
*సరోషా గంగాయాం గిరిశ చరితే విస్మయవతీ*
*హరాహిభ్యో భీతా సరసిరుహ సౌభాగ్య జననీ!*
*సఖీషు స్మేరా తే మయి జనని! దృష్టి స్స కరుణా!*

ఈ సౌందర్య లహరీ శ్లోక వ్యాఖ్యలో లొల్ల లక్ష్మీధరుడు -

*''విక్రియా జనకా ఏవ రసా ఇతి అష్టౌ రసాః*
*భరతమతే శాంతస్య నిర్వికార త్త్వా న్న*
*శాంతం మేనిరే రసం''. - (ఇది అన్యవిషయం)*

కనుక శాంతరసాశ్రయులు భక్తులు కావాలి. వికృతి రసాశ్రయుడు భగవంతుడు. ప్రకృతి రసం జీవులందు నిక్షేపించి వికృతి రసం నిర్వికారుని యందు నిక్షేపించటం లాంటి అనౌచిత్యం మహాకవి చేస్తాడా ? ఎంతో మత రస సమ్మేళనం చేసిన మహాకవి ఈ విరుద్ధ రసాశ్రయత్వాన్ని నిక్షేపించటం కంటె అనౌచిత్యముండదు భారత ప్రణాళికలో శాంతం అంగి రసంగా - మిగిలినవి అంగ రసాలుగా చేయటం వల్లనే వ్యాస మహర్షి మహేతిహాస నిర్మాత యైనాడు.

కావ్యంలో ఫలాగమం గోదా ప్రాప్తి. దాని కితర కథ లెలా పోషకములైనవి ? రామాయణంలో సుగ్రీవాది కథలు పతాకలు. అక్కడ వా రుపనాయకులు. విష్ణు చిత్తాదులు కారు. భగవంతుడు వారి కిచ్చిన ఫలమేమి ?

కథాంతంలో విష్ణుచిత్తునకు తోచిన స్వామి విశ్వకర్మతో **''ఏతదీయ నిలయ మప్పురిన్ మణి మయంబును – సార్థము చేయు''** మని. ఈ భక్తుడు కుచేలుడు కాడు. ఆయన కీ మణి సౌధాదు లక్కరలేదు. అందువల్ల ఈ ఫలం శృంగార రసాలంబనంగా కవి నిక్షేపించినట్లు స్పష్టం.

నాగానంద రస విషయ విచారణలో దశ రూపక మున్న మాట - ''కావ్య ఫలంగా మలయవత్యనురాగం సంఘటించటం వల్ల రసం శృంగార మనీ, శాంతం కాదనీ స్పష్టం'' అని కనుక పై పద్యం శృంగార రస వ్యంజకం.

యామున కథలో ప్రయోజనం రాజ్య ధర్మ స్థాపన తప్ప మత స్థాపన కాదు. దీని కంగత్వమే. దీని ద్వారా అది స్థాపించటం ముఖ్యం. లేకపోతే రాజనీతి కథనం వ్యర్థం. అనావశ్యకం.

రత్నావళ్యాదుల్లో ప్రయోజనం రాజ్యప్రాప్తియా ? కన్యాప్రాప్తియా ? అంటే - సచివ దృష్ట్యై రాజ్య - నాయక దృ ష్ట్యై కన్యా ప్రాప్తి - రాజ్య వస్తుక నాటక రచనలో శృంగారం ఫలాగమం - రాజ్య ప్రాప్తి కార్యం. ఈ దృష్టితో ఆముక్త కథల్లో దీనికి ప్రాధాన్యం, నాటకాల్లో సచివులు బద్ధ జీవులు.

రాజ ధర్మ మగ్నులు. ఇక్కడ మహాభక్తులు ముక్త జీవులు. కనుక వీరికే ప్రయోజనమూ లేదు. యామున కథలో రాజ్య ప్రాప్తి ప్రయోజనమైతే కథ కదే ముగింపు కావాలి. కాలేదు కనుక రాజ ధర్మ స్థాపన ముఖ్యం. కనుకనే అంత విస్తృతంగా రాజ నీతి చెప్పబడినది. మత స్థాపనే ముఖ్య మంటే - యామునుడు చెప్పినది సత్యమని స్థాపించింది పిప్పలోక్తి (4-74,75). ఇందువల్ల కూడా యామునుడు సాధన భూతుడే తప్ప నాయకుడు కాడు. రాజు వైష్ణవుడు కావటానికి సాధనం యామునుని వాదం. అది భగవంతు డాయన కిచ్చిన వరం. ''నిమిత్త మాత్రం భవ సవ్యసాచిన్''. కాబట్టి వీరు నిమిత్తమాత్రులు. భగవంతుని చేతిలో సాధన భూతులు.

*''రక్షణ శిక్షణంబులు రాజ ముఖంబునం గాక*
*నేన సాక్షాత్కరించి చేయమియు,*
*దద్రక్షణేచ్ఛ యస్మ దాభిముఖ్యంబునం గాని*
*పొడమమియు, నా యభిముఖ్యంబు*
*సంవాదంబునం గాని పుట్టమియు నే విచారించి*
*తదాభిముఖ్య కరణార్థంబుగ వాది జయంబు*
*సేయవలయు నను తలంపవ్విప్రకుమారునకుం బుట్టింప - (4-53)*

ఈ వచనం కథా రహస్య సూచకం. యామునునకు లక్ష్యం వాది జయం తప్ప రాజ్య ధర్మ రక్షా స్థాపనలు కావు. అతడు బ్రహ్మచారి; యువకుడు. అతనికీ ఉత్సాహ ముండటం సహజం. నియమించిన భర్తకు లక్ష్యం రాజధర్మ స్థాపన. కనుక కథా ప్రయోజనమిదే. దీని కోసం యామునుని సేనానిగా నియమించుకొన్నాడు జగత్ప్రభువు.

## నాయకుడు - 2

రక్షితారస్తు నేతారః :- (రసార్ణవ సుధాకరం) రక్షణ కార్యం చక్రవర్తిది. పూర్వ లాక్షణికులు నిరూపించిన లక్షణాలన్నీ రాజర్షి నిర్వచనంలో గతార్థము లౌతున్నవి.

*యో హి స్వధర్మ నిరతః - ప్రజానాం పరిపాలకః*
*యష్టా చ సర్వయజ్ఞానాం, జేతా శత్రుగణస్య చ*
*దాన శౌండః, క్షమీ, శూరో, నిస్పృహో విషయేష్వపి*
*విరక్తః సాత్త్వికః సోఽపి నృపోంతే మోక్షమన్వియాత్.* (శుక్రనీతి)

అతడు సంయమి. కామాది విజేత. వినయ, దానశీలి. సకలశాస్త్రవేత్త. ధర్మనిరతుడు. ఇత్యాది గుణగణాన్వితుడుగా రాజధర్మ శాస్త్రనేత్తలు నిరూపించిన వానినే కావ్య నాయకునిగా భారతీయ కావ్య సంప్రదాయ మంగీకరించింది.

నేతా వినీతో మధురస్త్యాగీ దక్షః ప్రియంవదః
రక్తలోకః శుచిః వాగ్మీ రూఢవంశః స్థిరో యువా
బుద్ధ్యుత్సాహ స్మృతి ప్రజ్ఞా కళామానస సమన్వితః
శూరో దృఢశ్చ తేజస్వీ శాస్త్రచక్షుశ్చ ధార్మికః. (దశరూపకం - 2వ ప్రకాశం).

ఇది ఆలంకారిక నిరూపణం.

రాయల వారు స్వయంగా మహాచక్రవర్తి. ఆయన నిర్మించిన కావ్య నాయక స్వరూప మేమిటి? ఎందుకంటే రాయలు 'బుధిత మను భావుడై' నలనృగరంతి భగీరథ భారతనందన కల్పుడని' పెద్దనగారన్నారు. ప్రత్యక్షంగా చూచి చెప్పిన మాట. పేయస్ మాటలతో సంవదిస్తున్నది కనుక.

ఆముక్త నాయకుడు విష్ణువు సత్త్వమూర్తి. 'మేకొని తాచినన్ భృగువు మెచ్చినవాడు' (ఆము., 5-131) ఆస్వామియందు జగద్రక్షణ భారమున్నది. అతడు మహాచక్రవర్తి. ధర్మరక్షణార్థం మనుష్యుడవుతూ గర్భవాసాది సకలక్లేశాలనుభవిస్తున్నాడు. శత్రుసంహారం చేయుటమేకాక శత్రుప్రహారాలను సైతమనుభవిస్తున్నాడు. భక్తులకు ముక్తి ప్రదాత. రక్షణశిక్షణలు చేస్తూ మోక్షమిస్తూ స్వపరిపాలన సాగించే ఆ స్వామిలో బ్రాహ్మక్షత్ర తేజస్సులు వెలుగొందుతున్నవి. ఈ లక్షణాలపై విచారించి మత- రస సమన్వయమూర్తిగా భగవంతుని వర్ణించినాడు మహాకవి పూర్వోక్త రాజధర్మముల్లో చెప్పబడ్డ మహాచక్రవర్తి లక్షణాలు. అలంకారికులు చెప్పిన నాయకలక్షణాలూ సమానాలే. దానినుండి వీరు తెచ్చుకొన్నారు. వీరు నాయకుని గుఱించి చెప్పిన లక్షణాలు రసమార్గమునకు చెందినవి. అలాంటి నాయకుని మనఃప్రవృత్తి సర్వదా వీరశృంగారాలకు పాదుగా కవులు నిబంధించారు. ఇందుచేతనే వీరశృంగారము ఉదాత్తరసాలైనవి.

1. జ్ఞానం - సర్వసాక్షాత్కార రూపత్వం
2. శక్తి - అఘటిత ఘటనా స్వరూపం
3. బలం - ధారణ సామర్థ్యం
4. ఐశ్వర్యం - నియమన సామర్థ్యం
5. వీర్యం - అధికారిత్వం
6. తేజస్సు - పరాభిభవనశక్తి
7. సౌశీల్యం - మహాత్ములనూ, మందులనూ కౌగిలించుకొనే స్వభావం
8. వాత్సల్యం - దోషాన్నికూడా భోగ్యంగా గ్రహించటం
9. మార్దవం - ఆశ్రితులను విడువలేక పోవటం
10. ఆర్జవం - త్రికరణ శుద్ధి

11. సౌహార్దము - తనను విస్మరించి భక్తరక్షణ చేయటం
12. సామ్యము - జన్మాదులతో పనిలేక సర్వాశ్రయుడై యుండటం
13. కారుణ్యం - పరదుఃఖాసహిష్ణుత
14. మాధుర్యం - ఉపాధి భేద రహితంగా క్షీరంలాగా స్వాదువు కావటం
15. గాంభీర్యం - ఆశ్రితులకూ తెలియకుండా కర్తవ్య నిర్వహణ చేయటం
16. ఔదార్యం - అపరిమితంగా దానం చేసి తృప్తిపొందక పోవటం
17. చాతుర్యం - ఆశ్రిత దోష గోపనం
18. స్థైర్యం - అకంపనీయత్వం
19. ధైర్యం - అభగ్న ప్రతిజ్ఞత్వం
20. శౌర్యం - పరబల ప్రవేశ సామర్థ్యం
21. పరాక్రమం - పరబల నిరాకరణం.

*జ్ఞానశక్త్యాదయోః నిరూపిత స్వరూప ధర్మాః*
*సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వాదయః సృష్ట్యుపయుక్త ధర్మాః*
*వాత్సల్య సౌశీల్య సౌలభ్యాదయ ఆశ్రయణోపయుక్త ధర్మాః*
*కారుణ్యాదయో రక్షణోపయుక్త ధర్మాః.* *(యతీంద్ర మతదీపిక)*

మతం రసశాస్త్ర నిర్వచనాలివి. ఈ రెంటిని కలుపుకొంటే 'ఆముక్త' నాయకుడౌతాడు.

*ఏ పట్టున వినువకరక్షా పరుడవు కమ్ము - (4-204)*

రాయల రాజనీతి ప్రారంభ పద్యమిది. ప్రపన్నులు కూపెట్టగా విని తీర్చినవాడు ఆముక్తనాయకుడు. ప్రథమ పాండీడు, కూపెట్టటమూ- నాయకుడు రక్షా విధానాన్ని అవలంబించటమూ ఒకేసారి జరిగాయి. ఇదే ఆయన 'జ్ఞానం' షడ్గుణాల్లో ఒకటి. విష్ణుచిత్తుడు నావల్ల కాదంటే - 'పోవోయి ముని ప్రవర! అవల నేనున్నాడనీ' - అన్నాడు అంటే 'అది నాపని. నీవు కేవలం నిమిత్త మాత్రుడవే'. ఇంతే అన్నాడు తప్ప ఎలా రక్షిస్తాడో చెప్పలేదు. మహాచక్రవర్తి ఆజ్ఞా స్వరూపుడు. కనుక పాండీని కొలువులో కాలుమోపినంతనే 'దాసుని చేతోగతి' ఆవహించినాడు. ఇక్కడ కొందరు విమర్శకు లన్నారు.

''ఎంత భక్తుడైనా అంత శ్రుతి స్మృతి పాండిత్యం సంభవమా. చదువని వాని నుండి ఎలా వస్తుంది'' - అని.

కానీ, శ్రీ అరవిందుల 'అమనస్కత' - (మనో రాహిత్య స్థితి) నుండి వారి సర్వ రచనలు వచ్చాయని చెప్పినమాట దీని కాధారం. అయితే వారు మహా విద్వాంసులు - యోగులు కదా

విష్ణుచిత్తుడు కాదనటం కుదరదు. అమనస్కతాసిద్ధి జరగాలే తప్ప పై వాడు రావటం 'చేతో గతి నొలయుట' - తథ్యం. ఇక్కడ కవి మాట చేతస్సు. మనస్సు కాదు. 'తచ్చేతసా స్మరతి నూన మబోధ పూర్వం' - కాళిదాసు జగత్ప్రసిద్ధ వాక్యంలో చేతస్సే. మాట నెరవేర్చిన భక్తునిల్లు మణిమయం చేయుమని విశ్వకర్మనాజ్ఞాపించటంలో తాత్పర్యం రాబోయే గోదా వివాహ వ్యంజకం. ఇది భావి దృష్టి. ఇదే గాంభీర్యమన్న కళ్యాణ గుణం.

పాండీని విరక్తతను తెలిసి రక్షణ కుద్యమించటంలో దశరూపకం చెప్పిన దక్షత - అన్న నాయిక లక్షణం ధ్వనిస్తున్నది. 'వేత్త' కాని వానిచే అంత కథ నడిపించటం - ఘటనా ఘటన సామర్థ్యం. ఆవిష్ణుచిత్తునిలో మధురకు పొమ్మన్న వాక్యం - ఉదార మధురోక్తులు - రాజు గొప్పవాడైనా క్రిందివానితో మధురంగా ప్రియంగా మాటాడటం రాజనీతి. ఇదే 'ప్రియం వదత్వం' సభాపర్వంలో శిశుపాలునితో ధర్మరాజన్నాడు. 'వాక్పారుష్యము చన్నె' - ? రాజునకుండరాని గుణమిదని రాజనీతి శాస్త్రం. విష్ణుచిత్తుడు పోలేనంటే 'పోవోయి' అన్నమాట రాయల రాజనీతిలో.

*'సార్వభౌముడైన భూపతి యాజ్ఞ కెల్ల వారు తల్లడిల్లవలదె'* *(4-206)*

*ఇదే మతం చెప్పిన 'ఐశ్వర్య'మన్న కళ్యాణగుణం. మతస్థాపనకై శ్రుతి స్మృతుల కైక్యం కల్పించటంలో తేజశ్శౌర్య లక్షణాలు ధ్వనిత రమణీయాంశాలు*

రెండవ పాండీని కథలో - ఆరాజు మతావేశంతో పాలనాధర్మాన్ని ఉల్లంఘించటం వల్ల జగన్నాయకుడు తన బలంలోని ఒక దొరనంపి వానిని లొంగదీసుకొన్నాడు. విశ్వనాథ నాయకుని పంపి అతని తండ్రిని లొంగదీసుకొన్నట్లు, లొంగివచ్చిన అతనిని శిక్షింపక క్షమించి వదిలిపెట్టి విశ్వనాథనాయకుని మధురా రాజ్యాధిపతిని చేసినట్లు రెండవ పాండీని భక్తుని చేసుకొన్నాడు. యామునుడా పని చేస్తే తానే చేసినట్లు 'నేత' - 'ఇది మదీయ భక్త ప్రభావంబు' అని కథాంతంలో అన్నాడు. ఇదే రాజనీతి రహస్యం.

శత్రుని బలాబలా లెరిగి తగినవానిని దొరచేసి పంపటం రాజనీతి 'ధరణిపుఁడెంటునే పగదు దాఁజన'. (ఆము, 4-255)

ఇందుకని దుర్గబలోర్వి నిప్పించి రాజును చేసి యామునాచార్యుని రాజ్య ధర్మ స్థాపన చేయటంలో నాయక లక్షణాల్లోని 'దృఢవ్రత- ధార్మికతలు.

రెండవ పాండ్యుడు కానీ రాక్షసుడు కానీ భక్తులు కారు. ధర్మ వ్యతిరేకులు. వారిని శిక్షించటానికి బదులు రక్షించటంలో మతం చెప్పిన సౌశీల్య వాత్సల్య సామ్యమన్న కళ్యాణ గుణాలు ధ్వనిస్తున్నవి.

ఈ ధార్మిక చక్రవర్తిత్వమే ప్రబంధ ధ్వని. అన్ని కథలూ దీన్నే వ్యంజిస్తున్నవి. ఇటువంటి

శ్రీకృష్ణదేవరాయల ఆత్మ చైతన్య భూమిక నుండి సృజింపబడిన కథ. (సృజ్- బహిర్గమింపచేయటం- లోని దానికి కుల్యలు త్రవ్వి పాయలు తీయటం, సృష్టి అంటే లోపలిదాన్ని బయటకు వమనం చేయటం. (ఆ చేసే మహాశక్తినే తంత్రం వామకేశ్వరి అన్నది)

నాయక లక్షణాల్లో 'మధురః - యువా'' అన్న గుణాలను కవి తానై వర్ణించినాడు. 6-88 వచనం, 4-11 సీసపద్యం, గోదాదేవి వలపోత 5-67. ఇవి నాయకుని భువనైక సౌందర్య వర్ణనలు. మాధుర్య పరసీమలు.

రాజ దైనందిన చర్యలో పగలు రాజకార్యం, ''నిశన్ సుషుప్తి పూర్వకము ప్రేయసీ గోష్ఠి పొసఁగుఁబలికి''. (4-271)

కావ్యాంతమే నిశ. జగత్తు = కావ్యం. కళ నుండి పరార్థం దాకా వ్యాప్తమైన మహాకాలం పగలు. అదే సృష్టి = శిష్ట రక్షణ. దుష్టశిక్షణ. తర్వాత సుషుప్తి. కావ్యంలో పూర్వకథలు ధర్మరక్షణకు సంబంధించిన రాజకార్యాలే, పాలనా వ్యవస్థకు సంబంధించినవే. తుదకు ప్రేయసీ గోష్ఠి. ఆ ప్రేయసి

1. స్వానురక్తాం 2. సురూపాంచ 3. సువస్త్రాం

4. ప్రియవాదినీం 5. సుభాషణాం 6. సుశుద్ధాం

7. ప్రమదాం - శయనే భజేత్ (శుక్రనీతి) 2,3 - దేవీ వర్ణనలన్ని దీనికి సంబంధించినవే.

1. ఆమె చేసిన విరహ గీతాలాపన - వ్యాజనిందారూపమైన ఉపాలంభనం లోనే 4-5. గతార్థాలౌతున్నవి కదా.

6. ఆమె చేసిన వ్రతం వల్ల సిద్ధించిన దిదే.

7. ప్ర+ మద - 'కామిని మేఘరంజని' పద్యం.

శ్రీరంగేశ్వరుడు - చూచినపు డనుకొన్న స్వగతం -

''దీని చూపుదుటెక్కు కానెకా''.

ఈ విధంగా రాయల రాజనీతిలో చెప్పబడ్డ చక్రవర్తియే ఆలంకారిక నాయకత్వం కలిపి జగన్నేతగా - మతదైవంగా సాక్షాత్కరింప చేసి కావ్యనాయకునిగా నిర్మించటంలో రాయలు సాహితీ సమరాంగణ సార్వభౌముడైనాడు.

## నాయకుడు - 3

మత దృష్ట్యా కూడా ఇది స్థాపించుకోవచ్చు. పైది కావ్యరస సంప్రదాయ దృష్టి.

ప్రబోధ చంద్రోదయం - సంకల్ప సూర్యోదయాదులు మత దృష్ట్యా వచ్చిన నాటకాలు. కనుక వానిలో ప్రధాన మత వ్యతిరేక దృష్టితో ఏ అంశము ఉండరాదు కదా. ఈ దృష్టితోనే వానికి వ్యాఖ్యలూ రచితములైనవి. ఇదే దృష్టి ఆముక్తానికీ అన్వయించాలి.

భగవంతు డాత్మ స్వరూపుడు కాగా అతనికి శరీర స్థానీయుడు జీవుడు. జీవునకు ప్రకృతి. ఇదే లీలా విభూతి. కావ్యమిదే, ఇందుకే కావ్యంలో చిదచిత్తులకు - విష్ణుచిత్తాది ముక్తులు రాజ, రాక్షసాది బద్ధ జీవులను ముక్తులను చేయటానికై ఏర్పడ్డ రంగభూమి - విశ్వం. కనుకనే ప్రకృతి వర్ణనలు కావ్యంలో అంత విస్తృతంగా నాల్గవ వంతు చేయబడటం ఆశ్చర్యకరమైన విషయం కదా ! ఆళ్వార్ల ఆచార్యుల ద్వారా అర్చామూర్తి - ఈ లోకరక్షణ చేయుటమే కావ్య ప్రయోజనం. ఇదంతా నీల = భూదేవితో క్రీడా ప్రపంచమే - శృంగారమే. ఇదంతా శరీరాన్ని ఆత్మ సాధనంగా గ్రహించి స్వకార్య ప్రవృత్తి కల్పించటం.

*యస్య చేతనస్య యద్ద్రవ్యం సర్వాత్మనా*
*స్వార్థే నియంతుం ధారయితుం చ*
*శక్యం తత్ చేష్టైక స్వరూపం చ తత్త స్య శరీరం-* *(2-1-9)*

అని శ్రీభాష్యంలో శరీర నిర్వచనం.

"Any substance which a sentient soul controls and supports completely for its own purpose and is in a subordinate relation to the soul, is the body of that soul". In this sense, all the sentient and non-sentient beings constitute the body of Brahman as they are subordinate to it and controlled and supported by it for its own purpose". (Swamy Visveswarananda - Brahma Sutra) ఈ సూత్రాత్మ నడిపించిన కథే కావ్యం. ఆయా భక్తుల ద్వారా లోక, జీవ, రక్షణ జరిపించటమే అవతార ప్రయోజనం ; విశ్వసృష్టి ప్రయోజనం. 'ఇందుకే ఈ కథలన్నీ చెప్పి దీనికి ఫలభూతమైన గోద కథలో -

*తదనంతు కళ్యాణ గుణము*
*లద్భుతంబొప్ప విని విని, యతనిఁ గవయు*
*బుద్ధి ప్రాగ్జన్మ సంస్కారమున జనింపఁ*
*దదవతారానుమేయ కథా సుధాను*

కలిత లీలానుకృతుల వర్తిలుచునుండీ - (5-37)

లస అనుసంధించటంలోని రహస్యం. అందుకే రసం శృంగారం. దీనికా కథలు - రసాలు; అంగాలు.

పీఠిక నిత్య విభూతి. అక్కడ నాయిక శ్రీదేవి. కనుకనే శ్రీకమనీయతో - కావ్యారంభం జరిగింది. రెండవ పద్యంలో భూదేవితోడి శృంగారం. ఆమె కథానాయిక. మొదటి రెండు పద్యాలు కేవల స్తుతులు కావు - నిత్య - లీలావిభూతుల స్వరూప వర్ణన. రెండవ పద్యంలోనే శేషవర్ణన. శేషుడంటె నిశ్వ జీవసమాహార మూర్తి. ఆది = మొదటి, శేషుడు = జీవుడు. లీలావిభూతిలో - కథలో, వేరే పాత్రలు. భూదేవి, ముక్తజీవులు = విష్ణుచిత్తాదులు - బద్ధజీవులు = రాక్షసాదులు, ప్రకృతి - రంగస్థలం మీద నటించినవారు జీవులు కాగా సూత్రధారియై తెర మరుగున ఉంటూ - అప్పుడప్పుడు రంగప్రవేశం చేస్తూ - కథా ప్రవర్తకుడైన వాడు భగవంతుడు. తద్రూపం అర్చావతారం.

సర్వసృష్టికి శ్రీమన్నారాయణుడే నియామకుడు, శేషి, ప్రబోధయిత. సృష్టి అతని స్వామ్యం, శేషం.

కవిస్వప్న వృత్తాంతం దీనినే ధ్రువపరుస్తున్నది. కావ్య సృష్టిచేయుమని - వస్తు - భాషా సూచన లందించినదీ తానే. బోధన అతనిది.

"Brahman sustains the Jiva as itself and Inner ruler, uses the Jiva *for its satisfaction in the same way in which* the jiva animates and sustains the body *and uses it for its own* satisfaction. (P.V.96)

Freedom and activity belong to <u>PURUSA</u> and not to prakriti (Philosophy *of visistadvaita* -94).

ఇతరులకు వచ్చిన కలలు వేరు. ఈ కల తత్త్వ పరమార్థమిది. కనుక స్వప్నానుసారంగా కావ్య రచనను కైంకర్య విశేషంగా చేసాడు కవి. ఇందుకే కవి కథలో విష్ణుచిత్తుని స్థానంలో ఉన్నాడన్నది.

నిత్య విభూతి పీఠిక. అక్కడ నాయకుడు భగవంతుడు. కనుకనే స్వప్నావస్థలోనూ ఆయన ప్రబోధనమే నిర్వించింది. తర్వాత నిత్యసూరుల వర్ణన. ఆ తర్వాత రాయల వంశావతారవర్ణన.

కథలో ఆళ్వారు - ఆచార్యుడు - భక్తుడైన దాసరి - నిత్య సూరులు కాగా వారి ద్వారా రాజులు - రాక్షసుడు సముద్ధరింపబడ్డారు. పీఠికలో ఆళ్వార్ల స్తుతి తర్వాత కవి వంశావతార వర్ణనలో రహస్యమే కథలో రాజ సముద్ధరణ. ఆళ్వార్లు చేసింది. ఈ నిత్య విభూతే లీలా విభూతిగా పరిణమించింది. పరిణామ ప్రదాయకుడు నాయకుడు శ్రీమన్నారాయణుడు.

## పంచ మూర్తులు

పరతత్త్వమే ఐదు మూర్తులు దాల్చినది. లోకోద్ధరణార్థం. అంటే జలప్రళయ మగ్నయైన (1) భూదేవిని ఉద్ధరించటం. తద్వారా (2) జీవసృష్టి - సృష్టి జీవోద్ధరణం. ప్రథమ గాథా వర్ణనం పురాణం చేస్తే ద్వితీయ గాథా వర్ణనం కావ్యం చేసింది. పరతత్త్వమే ఇష్టదేవతగా స్తుతమైనది. శ్రీరంగనాథ వర్ణనమూ అదే. అతడే కవికి కావ్య రచనాప్రేరణ కల్గించినది. అది సంకల్ప సృష్టి. క్రియా సృష్టి కావ్యం. దీనిలో పరతత్త్వం క్రిందికి దిగివచ్చి అంతర్యామిగా (యామునునకు ప్రబోధం కల్గించినది) అర్చావతారంగా (విష్ణుచిత్తుని ప్రేరేచిన మన్నారు స్వామి) మానవ సన్నిహితులుగా బాసటగా నిలిచింది. విభవతత్త్వమైన రామాద్యవతారాలు త్రికాల మానవునకు సన్నిహితం కాదు కదా. కనుకనే అవి వర్ణింపబడినవి (దశావతారవర్ణనం). అర్చావతార, అంతర్యామి తత్త్వమే కథా సూత్ర ప్రవర్తనం చేయించింది. ఇదే భగవత్కృపాలక్షణం. జీవోద్ధరణం - రక్షణ శిక్షణలు - కృపావశంవదములైన కార్యాలు. సృష్టి ప్రయోజనమే ఇది.

The inner purpose of cosmic creation is the making of muktas (P.V. 106)

కనుక బద్ధ జీవులను ముక్తులు గావించటానికై నిర్మించిన రంగస్థలం సృష్టి. అదే కావ్య నిర్మాణ రహస్యం - మతపరంగా ఈసూత్రధారి నాయకుడు కావటం వల్ల కథలు రెండు, మూడైనా పురాణం కాకుండా మహాకావ్యమైనది.

కనుకనే కథలో నాయకుడు ఎక్కడ కన్పించినా శృంగార మూర్తియై - శ్రీదేవీ సహితుడై - వర్ణింపబడటంలోని రహస్యం - కావ్య నాయికా సూత్రాన్ని విస్మరింపకుండా చేయటం కోసమే.

ప్రకృతి వర్ణనలంత విజృంభించి చేయటం వాల్మీకి మార్గానుసరణమేనని కావ్య నిర్మాణ దృష్ట్యా వ్యాఖ్యాత మౌతున్నది. మత దృష్ట్యా ప్రకృతి తనకు శరీర స్థానంలో ఉండటమే.

భువన సుందరుడైన తన శరీరము అంతే కావాలి కదా. ఈ అందమే ఋతువర్ణనల్లోని అందం. శ్రీవిలిబుత్తూరు లోని పొలాలు - తోటలూ, దొడ్లూ, దిగుడు బావులూ - చెఱువులూ - బాతులు - హంసలు - అంతా ఒక మధుర సృష్టి.

కావ్యంలో ఆ తృణ బ్రహ్మ పర్యంతమూ వస్తువే. పంచ భూతాలు తన్మాత్రలు - ప్రకృతి - దేవయోనులు - శరీరస్థానంలోని వారే. జంగమ స్థావర సృష్టి సర్వమూ సూక్ష్మంగా ఋతు వర్ణనలోని వస్తు సామగ్రి. ఈ వస్తు వాత్మ సౌందర్యానికి పారదర్శకం - ప్రతిబింబ భూతం. కనుకనే

''యోగనిద్రనుండి స్వామి మేల్కొంచి భూమిపై కాలు మోపితే
ఆమె పులకించింది. ఆ పులకలే శాలిమంజరులు.'' (4-139.)

''వండుపులు, పైకి తేలగా కంకణాల సవ్వడితో పర్వెత్తు,
వార్షుక స్రవంతులు ఉరుముల మ్రోతకై భీతి చెందిన
భూదేవి యోగ నిద్రలో నున్న పతిని కౌగిలించుకోవటానికై చాచిన హస్తం. (4-101)

సాంద్ర మకరంద వృష్టి రసాతలంబు
దొరగు పువ్వుల భువియుఁ బూధూళి నభము
నీ క్రమత్రయి మాధవుఁ డాక్రమించె
నురు విరోచన జనిత మహోష్మ మడఁగ. (5-136)

రసాలంబనాశ్రయమైన నాయకు నెడనెడ ప్రదర్శిస్తే రస విఘ్నం కాదంటూ జగన్నాథుడన్నాడు- ''రసాలంబనాశ్రయయో రనుసంధాన మంతరాంతరా న చేత్ దోషః'' - (రసగంగాధరం)

ఇలా ఎడనెడ ఆత్మ వర్ణనను సంఘటించటం నాయక స్ఫూర్తి కల్గించటానికే కాక శరీరంలోని ఆత్మ ద్రవ్యానుసంధానం కోసం.

భారతంలో అనుశాసనిక పర్వంలో ఒక కుమ్మరి పురుగు కథ చెప్పబడినది ? - దేనికా కథ ? సృష్టిలో సకల జీవరాసులకూ సముచిత స్థానమున్నది. ఈ పురుగు నుండి పరమాత్మయైన శ్రీకృష్ణ దేవుని వరకూ అందరూ విశ్వనాటకంలో పాత్రలే, కదా,. అలాగే ఆముక్తంలోనూ రాయీ, రప్పా - పక్షీ - వృక్షము - పేద, సాదా - మనిషి, రాక్షసుడు - రాజూ, రెడ్డి (రైతు), ఆళ్వారూ, దాసరీ - అందరూ పాత్రలే. పాత్రధారులే, సూత్రధారి మాత్రం అంతర్యామి - అర్చావతారం. కర్షకులు కార్మికులు - పొలాల్లో తోటల్లో పని చేసే కార్మిక లోకం - అంతా సమాన దర్శనంలో ప్రతిబింబించిన పాత్రలే.

''రాజభూమిక దాల్చిన రాజునకును'' -
అనగల్గిన పండితోత్తముడు రాయలవారు.

అంటే సృష్టిలో ప్రతిదీ ఒకపాత్రే. ప్రతివాడు నాటకంలో ఒక వేషధారే. ఈ దర్శన మున్నవాడు కనుకనే రాజనీతిలో

రాష్ట్ర వర్ధన మెద గోరు రాజు మేలు
రాష్ట్రమును గోరు దానఁ గార్యమె యనంగ
రాదు, బ్రహ్మోత్తరములైన ప్రజల యేక
ముఖపు, గోర్కి దదంతరాత్ముం డొసఁగడె (4-205.)

అని అనగలిగినాడు.

ఆ అంతరాత్ముడే కావ్య నాయకుడు. కావ్య నాయకుడంటే కథానాయకుడూ, కృతి పతి అని భావం.

## నామ సౌందర్యం

*ఆస్తాం వస్తుషు వైదగ్ధ్యం కావ్యే కామపి వక్రతాం*
*ప్రధాన సంవిధానాంక నామ్నాపి కురుతే కవిః. (వక్రోక్తి జీవితం 4-24)*

మోకాళ్ళ పర్వతంపైన విద్యుత్కాంతిమండితమైన శ్రీ వేంకటేశ్వరనామమెంత పవిత్రాకర్షణీయమో కావ్యజగత్తులో ' ఆముక్త మాల్యద' నామమంత దివ్యసుందర మైనది.

లోకంలో ఆముక్తమాల్యదకు ''విష్ణుచిత్తీయ'' మన్న పేరెందుకు వచ్చిందో కానీ కవిపెట్టిన పేరు - ముద్దుగా పిల్చుకొన్నదీ - ఆముక్తమాల్యద - అనే.

''నా విన్నవింపంబూను నావముక్తమాల్యదా మహాప్రబంధంబునకు'' - అని ప్రారంభములోనూ.

*''మొదల నాముక్తమాల్యద మదన తాప*
*తరణి పెను వెట్ట వేగిన దక్షిణాశ (5-96)*

అనీ,

*''సకల సీమంతినీ సీమంతముక్తామణియగు నాముక్తమాల్యద*
*యూఫు - నెల ప్రాయంబును సాభిప్రాయంబుగా చూచి''*

అని ముమ్మాటికీ ఆముక్తమాల్యద - అనే అన్నాడు. కనుక కవి అభిప్రాయములో విష్ణుచిత్తీయం కాదు. అలా పేరు పెట్టి ఉంటే ఆయన వైష్ణవుడైన భక్తుడంతే . కవి కాదు.

పై కారికావివరణంలో కుంతకు డంటున్నాడు.

''వస్తు నిర్మాణ వైదగ్ధ్యముండనివ్వు. ఆ వస్తునిర్మాణ రహస్యాన్ని కావ్యనామం ధ్వనించేటట్లుండాలి. అది నామ వక్రత. ముద్రారాక్షసం, అభిజ్ఞానశాకుంతలం, మాయా పుష్పకం-------

ఇలా పేర్లు పెట్టాలి కాని 'హయగ్రీవ వధ-శిశుపాలవధ'- ఇలా నామకరణాలు చేయటం పద్ధతి కాదు.'' అని -కనుక రాయలవారి నామకరణంలో ఈ ఆలంకారిక దర్శన మున్నది.

ఆయన నివాససౌధానికే మలయకూట ప్రాసాదమని పేరు పెట్టుకొన్నవాడు కావ్యానికి విష్ణుచిత్తీయమని పేరుపెట్టుకోగలడా?

విష్ణుచిత్తుడన్న పండితుడు ( ఈయననే 'ఎంగళాల్వాను' అంటారు) క్రీ.శ. 1106-1200

ప్రాంతంలో ఉన్నాడు. విష్ణుపురాణ వ్యాఖ్యాత. దానిని విష్ణుచిత్తీయ మంటారు. ఈ సాదృశ్యదోషం వల్ల కావ్యానికీ ఆ పేరు వచ్చి ఉండవచ్చు.

ఏమైనా ఆ పేరు కవి కభీష్టం కాదు.

నాయిక ఆముక్తమాల్యద. అదే కావ్యం. రెంటికీ అభేదమే. నాయికనే శ్రీ రంగపతి పెండ్లిచేసుకొన్నాడు. భగవంతుడైన శ్రీ విలుపుత్తూరు మన్నారుస్వామి విష్ణుచిత్తునితో ( కలలోనని మూలకథ) అన్నాడు.

'మీ అమ్మాయిని శ్రీరంగం తీసుకుపో. అంతయు మేలయ్యెడు' నని అలాగే రాయల వారికీ కలలో ఆంధ్ర విష్ణువు కన్పించి ఒక కృతి నిర్మించి శ్రీ వేంకటేశ్వరస్వామి కంకితం చేయుమన్నాడు. కావ్యకన్యాపతి ఈ స్వామి. విష్ణుచిత్తునకు గోద ననుగ్రహించిన వాడు భగవంతుడు. అలాగే కవికి కావ్యకన్యకను ( కథాసూచన ) అనుగ్రహించిన వాడూ భగవంతుడే. విష్ణుచిత్తునకు గోద ననుగ్రహించటమే కాక ఆయన ద్వారా; 2,3, ఆశ్వాసాల కథను నడిపించి - '6' వ ఆశ్వాసంలో ఆమెను వివాహం చేసుకొన్నాడు. ఈ కథాంశము విష్ణుచిత్తుని ద్వారానే ప్రవర్తింపచేసాడు. అలాగే కవికీ రచనలో యామున దాసరుల కథల కాయనే వక్తగా తోడ్పడ్డాడు. అంటే రాయల వారు విష్ణుచిత్తుని స్థానంలో ఉన్నారన్నమాట.

భగవతి ఎంత సౌందర్యరాశియో ఆమె వర్ణనల్లో కవి నోరారా స్తుతించినాడు. అందువల్లనే

*దీని చూపుదుటెక్క కానెకాట్టెసిరిపట్టె*

*కిని, పోర, బిరుదు టెక్కెంబుగలిగె - (6-105)*

అని గ్రుక్కిళ్ళు మ్రింగి - తమక మాపలేక దివ్యశుద్ధాంతసీమ కన్నెలఃతఃదార్చి - (6-106-) నాడు. అది నాయకుని చూపు. ఆయనకు హృదయదఘ్నమైనంత అందమామెది. అంటే కావ్యానిది. కనుకనే దక్షిణాశ వేగిపోయింది. ( వసంతర్తు ప్రారంభం) - మార్మోగి పోయింది - అనన్యకృతిగా ( విశ్వనాథ కల్పవృక్షం) 'ఒక్క కృతిగా (రాయలమాట) ఒక్క - అంటే అనన్య తప్ప సంఖ్యావాచకం కాదు. భగవంతుని ఏకః - అన్నట్లు కావ్య నాయిక సకలలోక సీమంతినీ సీమంత ముక్తామణి. కావ్యకన్యకా అంతే. ఇందుకే ఆ నామమలాపెట్టింది. లేకపోతే 'గోదా కళ్యాణ' మనవచ్చుకదా !

నాయకుడు విష్ణువు. నాయిక వైష్ణవి. కావ్యకన్యాపతి విష్ణువు. కృతి కన్య ఏమౌతుంది? వైష్ణవి కాక తప్పదు. కనుకనే కావ్యంలో ప్రతిశబ్దము వైష్ణవ సంప్రదాయ రహస్యఖని. ఇది ఔచిత్య విషయం తప్ప, కవి వైష్ణవమతస్థుడు కావటంవల్ల కాదు. కవికి వైష్ణవ వ్యామోహముంటే సహృదయునకు రసవ్యామోహముంటుంది తప్ప, ఆ మత వ్యామోహ ముండదు. అప్పుడు కావ్యం విశ్వజనీనం కాదు. కానినా డది కావ్యసృష్టికాదు. వట్టి వైష్ణవ కథ. పన్నిద్దరాళ్వార్ల చరిత్ర వంటిది. కవి బ్రహ్మ. కావ్యం సృష్టి. నాయిక భూదేవి అంటే సృష్టి = విశ్వస్వరూపిణి. రాయలు కవిబ్రహ్మ అన్నమాట.

కావ్యంలో భిన్న శైలు లున్నవి కదా. విష్ణు చిత్తునికథలో మాధుర్యం - ఖాండిక్య కేశిధ్వజ సంవాదంలో ఐతిహాసిక స్థాయి - దాసరికథలో ప్రౌఢి - ఇలాగా. మరలా వర్ణనల శైలివేరు. ఇంత శైలీవైవిధ్యంగల కావ్యం తెలుగులో లేదు. ఇతర భాషలో ఏమో ? కావ్యంలో రసం శృంగారం. ఇందుకే గోద 'శృంగారిణి' (5-79). శృంగార నాయికా వైవిధ్యమే కావ్యశైలీవైవిధ్యం. ఈ భిన్నశైలులు కూడా శృంగారిణియైన కావ్యనాయికే. కృతికన్యకాశృంగార హేలలు, హేలావర్తాలు.

*యువతేరివ రూపమంగ కావ్యం*
*స్వదతే శుద్ధగుణం తదప్య తీవ*
*విహిత ప్రణయం నిరంతరాభిః*
*సదలంకార వికల్ప కల్పనాభిః*
*యది భవతి వచశ్చ్యుతం గుణేభ్యో*
*వపురివ యౌవనం వంధ్యమంగనాయాః*
*అపిజన దయితాని దుర్భగత్వం*
*నియత మలంకరణాని సంశ్రయంతే.* (*కావ్యాలంకార సూత్రవృత్తి*)

''శుద్ధగుణమయమైన కావ్యం యువతీరూపం లాగానే సహృదయులకు తుష్టిహేతువు. అదే నిరంతరాలంకారభేద కల్పనతో కృత ప్రణయయై అతిశయాస్వాద కారణామౌతున్నది. యౌవనం కోల్పోయిన స్త్రీ శరీరం లాగా, వాక్కు గుణరహితమైతే సహృదయజనులకు ప్రియమైన అలంకారాలు కూడా సౌందర్య శూన్యములు కాక తప్పదు. కనుక కావ్యం కన్యామూర్తి.

కావ్యనాయికవలె - కావ్యమూ ప్రౌఢ నిర్భర యౌవన శోభామూర్తి. ఇది ఆలంకారిక మార్గం.

## మత సమన్వయం

శ్రీదేవి కృపామూర్తి. ఆమె భక్తులకు తల్లి. రక్షణ - పాలనలో ఆమెతల్లి. భగవంతుడు ధర్మరక్షకుడు. కనుక రక్షణ శిక్షణలు రెండు కండ్లుగా పాలించే జగన్నాయకుడు. అతనిలోని ఈ పాలక లక్షణాన్ని తన దివ్యసౌందర్యంతో క్రిందు చేసి జీవుల నుద్ధరించేటట్లు చేసేది జగన్మాత. కనుక తల్లి కరుణకు పాత్రుడు కావటమే భక్తుని ప్రథమ కర్తవ్యం. ఇందుచేతనే గద్యత్రయంలో శ్రీమద్రామానుజముని లక్ష్మీప్రార్థన ముందుగా చేయటం తటస్థించింది. దానికి ఫలిత మేమిటి ? స్వామి పాదారవింద నిత్యభజన - అని తానే రెండవ చూర్ణికలో స్పష్టం చేసారు.

Alwar as saranagata seeks refuge at his (god's)feet with the intercession of Lakshmi as **PURUSAKARA** or mediator and Saranagati or prapatti is self - surrender at the feet of **SREENIVASA** with the conviction that He is the only Upaya and Upeya.(Philisophy of Visistadvaita - p.338)

కాబట్టి ఈ సంప్రదాయ దృష్ట్యా కావ్య నామకరణంలో పురుషకార ప్రపత్తి - తల్లిని శరణనటం - ధ్వనిస్తున్నది. ఇక్కడ భూదేవి, శ్రీదేవి భేదం లేదు. ఆ భేదమే కనుక ఆముక్తార్థం భూదేవి కదా అన్న శంకకు తావులేదు.

*కాంతః తవైష కరుణా జలధిః ప్రజానాం*
*ఆజ్ఞాతి లంఘన వశాదుపజాత రోషః*
*అప్యేయ విశ్వజనని! క్షమయా భవత్యా*
*సర్వావగాహన సహాయ ముపయాత్యవస్థాం. (భూస్తుతి)*

ఈకృపా - క్షమా నిధిని శరణనటమే కావ్యనామకరణంలోని మతరహస్యం.

శ్రీవైష్ణవ నిత్య విధులు ఐదు. - అభిగమన - ఉపాదాన - ఇజ్యా - స్వాధ్యాయ - యోగాలు. ఇందులో ఉపాదాన కృత్యాలు - కాలకృత్యానంతరం ఊర్ధ్వ పుండ్రధారణ దేవాలయ గమనార్చనాదులు. ఇందులో భూదేవి స్మరణ కూడా ప్రథమ గణ్యం. ప్రాతః కాలంలో లేవటమే భూదేవి స్మరణతో సంకీర్తనతో లేవాలి. Even while getting up from bed Srivaishnava has to invoke in his mind the Goddess Earth, the Divine bride before he lays his foot on the ground. The Earth is called priyadatta, the idea being that a worshipful attitude towards it in the devotees heart is a matter of great pleasure to Lord Trivikrama, the Divine Lover of the Earth and all that is Earthly - (Vedanthadesika P. 401)

కావ్య నామకరణంలోని రహస్య మీ ఉపాదాన కృత్యమే.

*అశ్వాక్రాంతే, రథాక్రాంతే, విష్ణుక్రాంతే వసుంధరే!*
*శిరసా ధారయిష్యామి రక్షస్వ మాం పదే పదే-*

అని మహానారాయణోపనిషత్తన్నది.

తరువాత లేచి పాదం నేలపై మోపకముందే ఈమంత్రం పఠించి ధూళిని శిరస్సున ధరించి అప్పుడు కాలు నేలపై మోపాలి. ఈప్రాచీన సంప్రదాయాన్ని శ్రీవైష్ణవం పాటించింది. మహాకవీ అటే సంప్రదాయానుసారంగా కావ్యనామస్మరణం చేశాడు.

ఈనామకరణం వల్ల నాయకుడు శ్రీమన్నారాయణుడని ధ్వని. కావ్యం బ్రహ్మనిర్మిత ప్రకృతి. విశ్వజనని భూదేవి. ఆమెయే నాయిక . శృంగారమే కావ్యంలో ప్రధాన రసమని వేరే వాచ్యంగా చెప్పాలా?

## కావ్యనామం

1. అలంకారిక 2. శ్రీవైష్ణవ మత సంప్రదాయానుసారంగా వ్యాఖ్యాత మైనది. ఇదీ రెండవ అంశంలోనిదే.

కావ్యనాయిక 'వైష్ణవి'. 'వైష్ణవియుం దాగావున' (6-90) అని కవి ప్రయోగం. కావ్యనాయికా అంతే కావాలి. కావ్యంలోని శ్రీవైష్ణవ సంప్రదాయం కానీ- దివ్య ప్రబంధానుసంధానం కానీ - అంతా శ్రీవైష్ణవమయం కావటంలోని ఔచిత్యం కాకపోవటంలో కదా ?

*''వృషశైల ఝురవారిఁ దిషవణ స్నానంబు.'' (4-190)*

ఈమధుమయ జీవితమెంత దివ్యంగా వర్ణింపబడినది! కావ్యంలో ఈఅలఘుర్ కోవెల- రెండుసార్లు ప్రస్తుతమైనది.

*1. ద్వితీయాశ్వాసంలో*
*అప్పెనువేసవి విభనము*
*విప్పుగఁ దన్నగర నికట వృషగిరి హరికిం*
*దెప్పతిరుణాళ్ళురా. - (2-71)*

ఈసందర్భమే ప్రథమ పాండ్య చక్రవర్తి శ్రీవైష్ణవునిగా పరిణమించటానికి హేతువైనది.

ఆక్షేత్రం సుందబాహుస్వామి నిలయం. చాల అందమైన ప్రకృతి వాతావరణావృతమైనది. దానిని గురించి ఎన్నో కథలు. ఈస్వామి కట! గోదాదేవి మ్రొక్కుకొన్నదట. గంగాళాల పాయసమర్పిస్తానని. అది నెరవేర్చకపోతే శ్రీమద్రామానుజుని ఆ మ్రొక్కు చెల్లించాడట.

ఇక్కడ నాథముని తపస్సు చేశాడని కవి వర్ణన. ఆ నాథముని ఎవరంటే - ఏయామునా చార్యుడు -

ఆళ్వార్ల సంప్రదాయానికి తత్త్వ స్వరూపం కల్పించాడో శ్రీరంగానికి భూలోకవైకుంఠ ప్రశస్తి - వైభవాలను కల్పించాడో ఆయనకు తాతగారు. అంతేకాక

'' Nathamuni is founder of the ubhaya - vedanta school and First pontiff of srivaishnava - " (Philosophy of Visistadvaita - P.57)

ఇందుకని ఆయనను స్మరించటంకోసం.

6-66 దీర్ఘవచనంలో శ్రీరామానుజముని ''గీతాచరమార్థంబు'' శ్రీరంగగోపుర మెక్కి లోకి కనుగ్రహించినదీ - గోపాలురకు ముక్తిని ప్రసాదించిన వైనం- ఇతరాచార్య స్తుతి. అంతా శ్రీవైష్ణవ గురుస్మరణకు ఆ నుతాచార్యులందర్ని ఒకసారి - ఒకచోట - చేర్చి నమస్కరించటాని కని వేరే చెప్పనక్కరలేదు కదా !

## దివ్యప్రబంధ సంప్రదాయం

శ్రీవిలుపుత్తూరు వర్ణనల్లో శ్రీరంగ వర్ణనలో దివ్యప్రబంధ సంప్రదాయ మున్నది.

ఆళ్వార్లు వ్రాసిన దివ్యప్రబంధాల్లో ఆ యా క్షేత్ర వర్ణనలు - దైవస్తుతులు ముఖ్యాంశాలు. ఈవర్ణనల పద్ధతులే శ్రీవిలిబుత్తూరి రహస్యం.

''తిరుక్కురుకూరులో ఏపుగా పండి వ్రాలిన నివ్వరివడ్ల పైరు చామరాల్లాగా వీస్తున్నది. ఆగ్రామంలో చెరువులో తామరపూలందంగావికసిస్తాయి. అక్కడ కొంగరెక్కల్లాంటి పూలు పూచే మొగలిడొంకలకంచె. మాగాణి భూములతో చుట్టుకొనబడిన ఆయూరు దర్శనీయంగా ఉంటుంది. ఈపొలాల్లో నివ్వరిపైరు చెరుకుతో సమానంగా ఏపుగా పెరుగుతుంది. ఈగ్రామమంతా బంగారు మేడలతో రమణీయంగా ఉంటుంది. ఆదివ్య గ్రామంలో పుట్టిన నమ్మాళ్వారు రచన యిది.

మేఘాల నంటే తోటలు - తుమ్మెదల పాటలు - జనసమృద్ధి గల తిరుమంగై నగరం చూట్టూ తోటలే. బురద లేని నీటిదొనలతో రమ్యమై - చొకళించే లేళ్ళతో తిరుమలను నమ్మాళ్వార్లు కోయిల్ తిరువాయిమొళిలో స్తుతించారు. కాంతిమంతమైనకెంపులతో, పచ్చలతో పొదగబడ్డ తిన్నెలతో స్వామి హస్తంలోని పాంచజన్యం లాగా నున్న అంచలతో - కెందామరల చెరువులతో గోష్ఠీపురం రమ్యంగా ఉంది.

(పెరియాళ్వారు – తిరుమొళి)

తొండరప్పొడి ఆళ్వారు తమ రచనయైన తిరుప్పళియెళుచ్చిలో శ్రీరంగపతిపై ప్రబోధ గీతిక ఆలపించారు.

''ప్రభూ ! గజేంద్ర రక్షకా ! మొల్లల పరిమళాలతో తూర్పు గాలి వీస్తున్నది. సరోజాలలో నిద్రించే అంచజంటలు రెక్కలపై కురిసిన మంచు విదలించుకొంచు మేల్కొంటున్నవి. స్వామీ ! శ్రీరంగపతీ ! మేలుకో.''

ఎత్తుగా పెరిగి ఒరిగిన ఎర్రని వడ్లపైరు నడుమ 'కయల్' అన్న చేపలు తిరుగుతుంటే సుందరములైన చెందామరల్లో మచ్చుల పుష్పంధయాలు మత్తిల్లి ఉండగా లోకం సుభిక్షంగా ఉంటుంది. ( తిరుప్పావై)

ఈరచనలన్నీ హరివంశంలో గొల్లపల్లె వర్ణనలవంటివి. రాయల వారిదే ప్రస్థానంలో ప్రయాణించినట్లు స్పష్టం.

ఇది అంధానుకరణం కాదు.

Prakriti serves as the environment for the evolving self Brahma - sristi or god's creation is for Brahmanizing. (P. V. 106)

ఈ అందమంతా పరమేశ్వరునిదే. ఇది ఆయన శరీరం కనుక. ఇందుకే వేదాంత దేశికులు దయాశతకంలో ఇలా అన్నారు -

త్వదుదయ తూలికాభి రమునా వృషశైల జుషా
స్థిర చరశిల్పి నైవ పరికల్పిత చిత్ర ధియః,
యతిపతి యామున ప్రభృతయః ప్రథయంతిదయే
జగతి హితంన నస్త్వయి భరన్యసనా దధికం.

Here the poet regards god as a master painter working on the vast canvas of native and portraying the grand the manifestation of life in all its levels. Divine grace is the brush to draw the out lines and to give as well the finishing touches (Vedantaesika. 459)

రాయలవారు కావ్యనాయకుని ప్రతిచోట కెంపుగనులు కల వానిగానే వర్ణించారు.

నమ్మాళ్వారు తమ 'కోయిల్ తిరుమొళి' లో, 'తిరుప్పావై' 30-వ పాశురంలో గోదాదేవి, విప్రనారాయణుడు అందరూ ఎర్రని కన్నులనే వర్ణించారు.

విష్ణుసహస్రంలో - 'అరవిందాక్షః పుండరీకాక్షః - లోహితాః' వ్యాఖ్యానంలో శ్రీశంకరులు- 'సమావృషభో లోహితాక్షః - ఇతి శ్రుతేః' అన్నారు.

## ప్రపత్తి వేదం

శ్రీమద్రామాయణం శ్రీవైష్ణవ దృష్టిలో ప్రపత్తి వేదం, శరణాగతిని నిరూపించిన తొలిచదువు. పరమాత్మని ప్రపన్న జనోద్ధరణమే ఆరు కాండల్లో సురగంగయై తురికిణీలు కొట్టినది.

శ్రీరామచంద్రుని ప్రపన్న జనోద్ధరణం శిలామూర్తి అహల్య కథతో ఆరంభించి కాకాసురుని కాపాడటంతో కాకలు దీరి - సుగ్రీవునకు కపిరాజ్యం పట్టాభిషేకం చేయటంతో తానూ పట్టాభిషిక్తుడై- విభీషణ శరణాగతితో ఫలించింది.

ఆస్వామి శరణాగత రక్షణ
సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే
అభయం సర్వభూతేభ్యో దదామి ఏతత్ వ్రతం మమ ( యుద్ధకాండ - 18-33)
ఈ మాటతో సర్వలోక వ్యాప్తమైనది.

రాయల ప్రకృతి వర్ణనలకు రామాయణ మార్గమే ఒజ్జబంతి అని వ్యాఖ్యానంలో నిరూపితమే. అలాగే ఆ ఔత్తరాహ ప్రపత్తి వేదానికి దీటుగా దాక్షిణాత్య ప్రపత్తి వేదంగా ఆముక్త నిర్మాణం చేశాడు.

రామాయణంలో కాకాసురాదులు స్వామి కాళ్లబడిన గాని రక్షణ రాలేదు అంటే భగవంతుని దగ్గరకు భక్తులు వచ్చారు.

ఆముక్తం దీనికి విరుద్ధ సంవిధానకం. అంటే ఇక్కడ భగవంతుడే భక్తులను వెదకుకుంటూ వచ్చాడు.

రామాయణంలో రాక్షస శరణాగతితో ప్రపన్న జనోద్ధరణ పరాకోటినధివసించినట్లే ఆముక్తంలోనూ అంతే. బ్రహ్మరాక్షస సముద్ధరణ చిటారుకొమ్మ.

ఆముక్త నాయకు డర్చామూర్తి. రామాయణంలో విభవమూర్తి (అవతారం) ప్రపన్న జనోద్ధరణకీ రెండే ఆధారాలు. రామాయణ విభవ విశేషమైన రామావతారాన్ని నాయకుని చేస్తే, ఆముక్త మర్చావతార కృపాకుల్యలను తరగలెత్తించినది.

ప్రహ్లాద విభీషణాదులు అవతార శరణాగతితో ముక్తి పొందితే - ఆళ్వార్లు అర్చామూర్తిని సేవించి తరించారు. వారిని తరింప చేయటమే కాదు. మన్నారు స్వామి తన భక్తుల ద్వారా - రాజరాక్షసులను తరింపచేశాడు. అక్కడ భగవంతుడు సాక్షాత్తుగా తరింప చేస్తే - ఇక్కడ స్వామి భక్తులతో తరింపచేయటంలో ఆముక్తం ద్రావిడ వేదమే కాదు. దివ్య ప్రబంధమైనది.

## కావ్యనిర్మాణ మార్మికత

ఇతివృత్తం రెండురకాలు. 1. ఆధికారికం 2. ప్రాసంగికం. వస్త్వైక్యమన్న మాట ఈకాలంలో బాగా వ్యాపించిన మాట. కాని ప్రాచీనాలంకారిక సంప్రదాయంలో రసైక్యమన్నది తప్ప వస్త్వైక్యం లేదు. ఈమాట గ్రీకు నాటక విషయంగా 'అరిస్టాటిలు' చెప్పినది. దాన్ని తెచ్చి మన పండితులు ప్రబంధాల్లో లేదనటమూ - ఉన్నదనటమూ చేశారు. కాని వస్త్వైక్యమంటే అన్నికథల- కథాంశాల పొసగింపు తప్ప, అనగనగా ఒకరాజన్నట్లు సూటిగా ఉండదు. ఇది తొలిరోజుల్లో వచ్చింది. తర్వాత తర్వాత కథానిర్మాణంలో సంక్లిష్టత పెరగటం - సమాజం - మానవ మేధావిలసనంతో వచ్చిన మార్పు.

సకల వేదాలూ పరమాత్మస్థితి కెలా వ్యంజకంగా ఉన్నవో అనంత సృష్టిలో వైవిధ్యముంటూనే అంతా ఏకతా, సమతా సూత్రంతో ప్రోతమై ఉన్నదో 'సూత్రేమణిగణావివ' - అన్నట్లుగా - కావ్యంలోనూ ఇదే శిల్ప మార్గం.

సర్వోపనిషన్మంత్రాలకు సమన్వయం చెప్పిన బ్రహ్మసూత్రనిర్మాత బాదరాయణుడు మహాచార్యుడై నట్లు కావ్యకథానిర్మాత వ్యాసుడూ అంతే. అదే మార్గంలో రాయలూ ప్రయాణించాడు. ఏకథ కాకథ స్వతంత్రమన్నట్లు భ్రమింప జేసి సర్వకథలకూ సూత్రం గర్భితంగా పెట్టి నిర్మిచడంలో సృష్టికర్త లక్షణం కవికీ అన్వయిస్తుంది.

ఆముక్తంలో ప్రధాన కథ గోదాదేవి వివాహమే. 'ఎన్నినుగూర్తునన్న' అంధ్రవిష్ణ్వోక్తి స్పష్టంచేస్తున్నది కదా. తండ్రి విష్ణుచిత్తుని ద్వారా మతస్థాపన చేయించిన కథ కూడా అధికారిక

వస్తువే. దీనికంగముగా ఖాండిక్య కేశిధ్వజ సంవాదమూ గోదాకథ కంగముగా దాసరి కథా ప్రసక్తాలైనవి. ప్రసక్తానుప్రసక్తంగా వచ్చిన కథే - ప్రాసంగికమంటే.

ఇది రెండు విధాలు. 1. పతాక 2. ప్రకరి. రామాయణంలో సుగ్రీవకథ పతాక. శబరి జటాయువుల కథలు ప్రకరులు. ప్రాసంగికంలో ప్రయత్నమూ - ఆధికారికంలో పలితమూ (ఫలాగమమూ) ఉంటాయి.

అధికారః ఫలస్వామ్యం – అధికారీ చ తత్ప్రభుః (దశరూపకం)

ప్రాసంగిక నాయకులతో మంత్రాలోచన చేయటం -ఫలితం - తాను, కథానాయకుడు పొందటం - ఆలంకారిక చర్చాఫలితమే.

విష్ణుచిత్తాదులను సభకు గెంటిన వాడు నాయకుడా? వెళ్తున్నవాడు నాయకుడా? కనుక కథలాయామంత్రుల ద్వారా జరిపించి ప్రపన్న జనోద్ధరణం చేయటం కార్యం. గోదాప్రాప్తి ఫలాగమం. కార్యం రాజకార్యం - వీరరసాత్మకం. ఫలాగమం - వ్యక్తి సంబంధం, శృంగార రసాత్మకం. వీరశృంగారాల అంగాంగి భావ తాత్పర్యమిదే.

కథలో నాయకుడు రంగమందు కాలూనిన దెప్పుడు. పాండ్యరాజు విరక్తుడైనపుడు. అతనిని తన భక్తుని చేయుమని విష్ణుచిత్తున కాన పెట్టినది దీనికోసమే. దీనికి ప్రతిఫలమతనికి వచ్చినదేమిటి? మామగా చేసుకోవటం. భగవంతుడు తనకు కూర్చిపెట్టిన సంబంధమిది. ఆయనకంతకంటే కావలసినది లేదు. మరొక పద్ధతిగా చూస్తే విష్ణుచిత్తుని కథ పతాకగా గ్రహించి అన్వయించ వచ్చు. కాని ఆధికారికము కంటే పతాక భిన్నంగా ఉండాలి. కాని కొందరు సంస్కృత వ్యాఖ్యాతలు ఈపద్ధతిగా వ్యాఖ్యానించారు గనుక రాజరాక్షస సముద్ధరణలు 'కార్య' ములు కనుక పతాకగా గ్రహించనూ వచ్చు. రామాయణంలో సుగ్రీవకథ పతాక. తత్సాధనంగా సంపాదితమైనది రావణవధ. ఇది కార్యం. సీతానయనం - ఫలాగమం. ఇదిప్రాచీనాలంకారిక సంప్రదాయం ఈదృష్ట్యా పైరీతిగా చూడవచ్చు. యామున కథలో రాజధర్మ స్థాపన కార్యం. మొదటికథలో రాజును భక్తునిచేయటం. దీనికోసం ఖాండిక్యకేశిధ్వజ సంవాదం చెప్పబడినది. వేదాంత యోగశాస్త్రో పన్యాస మావశ్యకమైనది. దీనికి వైష్ణవ మత స్థాపన సాధనం - ఉపాయం - యామున కథలో రాజనీతి అంగం. గోదాదేవి కథకు దాసరికథ.

ఈ యామున దాసరికథలకు వక్త కథానాయకుడు. మొదటి కథకు శ్రోత శ్రీదేవి కాగా, రెండవ కథకు శ్రోత విష్ణుచిత్తుడు. కాగా భిన్నకథలున్నా వస్త్వైక్య సూత్రం కథానాయకుడు. కనుక దానికి క్షతిలేదు. ఒకమనిషి జీవితంలో ఎన్ని సంఘటనలు, ఎంత వైరుధ్యం? కానీ అవిన్నీ 'తనకు' సంబంధించినవే. తాను చేసుకొన్నవి కొన్ని- ప్రకృతి ఘటించినవి కొన్ని. అంటే కొన్నిటికి కర్త తాను కొన్నిటికి 'కర్మ'. కావ్యంలో భగవంతుడు కనుక సర్వకర్త తానే.

యామున కథలో అనుసంధించుకోదగ్గ అంశం :- ధనుర్ధరో- ధనుర్వేదో, దండో, దమయితా దమః - అన్న విష్ణు సహస్రనామ వ్యాఖ్యలో శ్రీశంకరులు -

''శ్రీమాన్ రామో, మహత్ ధనుర్ధారయామాసేతి ధనుర్ధరః.

స ఏవ దాశరథిః. ధనుర్వేదం వేత్తీతి ధనుర్వేదః. దమయితా దండం - దండో దమయతా మస్మి - ఇతి భగవద్వచనాత్. వైవస్వత నరేంద్రాది రూపేణ ప్రజా దమయతీతి దమయితా. దండ్యేషు దండకార్యం ఫలం తచ్చ స ఏవేతి దమః''-

ఇందుకని లోకనాథుడు కథను నడిపించవలసి వచ్చింది. రాజత్వం నుండి భ్రష్టుడైనందున - శైవుడైన రాజును వైష్ణవుని చేయవలసి వచ్చింది. ఇక్కడ మతానికి గౌణత్వమే. పూర్వకథలో వైష్ణవ ప్రపత్తికి ప్రాముఖ్యం. అది వ్యక్తిగతం. ఇది ప్రభుత్వ సంబంధమైనది. ఒక చమత్కార మేమంటే శైవం రాజ్యపాలనను మతపరంగా చేయటం. మతావేశంలో రాజు కూడా ప్రజల్లో వాడుగానే భావించబడ్డాడు. ఇందుకే బసవడు రాజును చంపించాడు తప్ప బ్రతికించలేదు.

విశ్వనాథ కవి సమ్రాట్టు ఇందుకే త్రిశూలం నాటకం వ్రాసారు. అందులో వారు ప్రతిపాదించిన అంశమిదే. మతమూ- ప్రభుత్వ యంత్రాంగమూ కలపకూడదని, మహిమలు రాజ్యాన్ని రక్షించలేవని, ఇందుకే యామున కథలో రాజలా ప్రవర్తించినట్లు చిత్రించబడినది. ఇందుకే కథలో కథానాయకుని ప్రవేశ మవసరమైనది. అవతారమూర్తికి లోకరక్షణ బాధ్యత ఉన్నది తప్ప సన్న్యాసమతానికీ- సన్న్యాస మత దైవానికీ కాదు. బౌద్ధం కూడా ప్రభుత్వ - సమాజ వ్యవస్థను గురించి పట్టించుకోలేదు.

(చూ.The dance of shiva మొదటివ్యాసం - ఆనందకుమారస్వామి)

కనుక ఈ కథలన్నీ కథానాయకుని వీరరసావతార మూర్తి యైన చక్రవర్తి రక్షణ శిక్షణలు చెప్పి గోదారతిహేతువిదిగా కవి ముడిపెట్టినాడు. కనుక ప్రధాన కథ కవి అంగాలు. నాయక సౌందర్య వర్ణనలు కావ్యంలో కుప్పలు తెప్పలు.

3-85, 4-11,16,17 నుండి 31 దాకాసాగిన దశావతార వర్ణనలు 5-67 శ్రీరంగనాథ వర్ణన - ఆ భగవంతుని కళ్యాణమూర్తిని కవి ఎన్ని కోణాలనుండి దర్శించాడో చదివి తన్మయత్వం పొందదగ్గ విషయం. ఇదే మతరీత్యా గద్య త్రయాదుల్లో స్వామి కళ్యాణ గుణాకారంగా చిత్రితం కావటం చూచుకోవాలి.

ఇదంతా భరత మహర్షి నిరూపించిన శృంగార నాయక లక్షణమే.

''ఉజ్జ్వల వేషాత్మకః - యత్కించిల్లోకే శుచిమేధ్యముజ్జ్వలం దర్శనీయం వా తచ్ఛృంగారేణోపమీయతే యస్తావదుజ్జ్వలవేషః సః శృంగారవాన్ ఇత్యుచ్యతే'' (నాట్యశాస్త్రం : శృంగార రస ప్రకరణం)

శ్రీఅభినవ భారతి -

'' హస్త పృష్ఠ హారాది మండితః శృంగారవాన్ తేన శుచి మేధ్యాదుపమీయతే తేనోజ్జ్వల వేషాత్మకే శృంగార శబ్దః న చాతిప్రసంగః.''

''- శీల రూపగుణ విలాసాదిభిః ఆత్మానురూపయా''-

శ్రియాసమాసీనం - (గద్యత్రయంలో - వైకుంఠ గద్యం)

ఇందుకే శ్రీవైష్ణవం శాంతంకంటే శృంగారానికే పట్టం కట్టింది.

" It then expounds the five beautiful forms of Brahman and the different kinds of rasas giving the highest value to sringara rasa in its spiritualised aspect." (P. V.218)

మతపరంగానూ రసం శృంగారమే.

విభవస్వరూపమైన అవతార కథలన్ని వీరరస స్వభావకములే. కావ్యంలో దశావతార వర్ణనల్లోని ప్రౌఢోహ సంపత్తి అంతా వీర రసాత్మకతనే ధ్వనిస్తుంది. కావ్యనాయకుడు చేసిన పని కృపామూలకమైన ఉద్ధరణ. ఇది అర్చావతార కార్యంగా కవి నిక్షేపించినాడు. విష్ణ్వాయుధాలు పరిపాలనకు సాధన భూతంగా - సాధనాలుగా శ్రీవైష్ణవం చెప్పనే చెప్పింది. ధర్మరక్షణార్థమే ఆయుధధారణ. ధర్మ భ్రష్టుడు భయపడేటట్లు 'వాలు -గద - శంఖం - చక్రం ధరించి నిత్య సూరులకు దర్శనమిచ్చే స్వామీ' అని నిత్యానుసంధానం.

చకాస తం జ్యా కిణ కర్కశైః శుభైః
చతుర్భిరాజాను విలంబిభిః భుజైః
ప్రియావతంసోత్పల కర్ణభూషణ
శ్లథాలకా బంధ విమర్ద శంసిభిః - అన్న స్తోత్ర రత్న శ్లోకంలో వీర శృంగార అంగాంగి భావం స్తుత్యమైనది. కావ్యంలోనూ ఇంతే.

## రసదర్శనం 1

ఆముక్త కవికి స్వప్నంలో శ్రీకాకుళాంధ్ర విష్ణువు కన్పించి-

(1) ఆంధ్ర భాష - కృతినిర్మింపు మిక మాకుఁ బ్రియముగా (గ-1-13) స్వప్న ఫలమిదియని వివరించిన పండితులు చివరకు -

(2) కృష్ణరాయేంద్ర కృతి వినిర్మింపు మనిరి. (1-44)

(3) నావిన్నవింపబూను నాముక్తమాల్యదా మహాప్రబంధమునకుఁ గథాక్రమం బెట్టిదనిన (1-50)

భగవద్వాక్యం వినిర్మాణం, ప్రియువు. పండితుల వాక్కు వినిర్మాణం. కవివాక్కు మహాప్రబంధం.

ఈ వినిర్మాణశబ్దం తిక్కనగారి

''తెనుఁగు బాస వినిర్మింపఁ దివురుటరయ''నూ

''కృష్ణద్వైపాయనుండు సంవత్సర త్రయంబు నిర్మించె'' నన్న నన్నయ్యగారి మాటనూ ''నిర్మాయనూతన ముదాహరణానురూపం'' - రసగంగాధర వాక్యాన్ని ఆకర్షిస్తున్నది. తిక్కనగారితో ఆమాట అన్నది హరిహరనాథుడు. రాయలవారితోనూ భగవంతుడే. ఆ వాక్యార్థానుగుణంగా రచనముండట మౌచిత్యమా? ఉండకపోవటమా? - విష్ణుచిత్తాదులైన ఆచార్యులు భగవద్వాక్యపాలనం కథలో తు. చ తప్పక చేసినట్లు కవీ చేయవలసిందే కదా. వినిర్మాణప్రయోజనం శ్రోతయైన తనకు ప్రీతి. వినిర్మాణం కారణం - ప్రీతి సాధ్యం. అది కవి కర్తవ్యం, ఇది సహృదయుని అనుభవం. దాసరి కథాశ్రోత పండితుడూ భక్తుడైన విష్ణుచిత్తుడు. ఆయన శుష్కపండితుడు కాడు. భక్తుడైన కవి. కనుక వక్త భగవంతుడు. కథను ప్రౌఢతమంగా చెప్పటం తటస్థించింది. ఆ స్థాయికి తగ్గట్లు శబ్దముండాలి. అలాగే కావ్య శ్రోత భగవంతుడు. అతని శ్రవణేంద్రియానికి తగ్గ స్థాయిలో కావ్యముంటే వినిర్మాణం. అప్పుడే అది స్వామికి ప్రీతిపూర్వకకైంకర్య మవుతున్నది.

నాట్యశాస్త్రంలో భరతుడొక నాటకాన్ని దేవతల ముందు ప్రదర్శిస్తే సభాపతి బ్రహ్మ అన్నాడట మహాత్ముడైన త్రినేత్రునకు నీ నాట్యం చూపించు మని. వ్యాఖ్యలో అభినవ భారతి అన్నది.

''పరమేశ్వరస్య పరీక్షత్వాత్ పరితోష్యత్వాచ్చ
జ్ఞానాతిశయేన రసచర్వణాత్మక మహాభోగసమర్పణేన చ''

(నాట్యశాస్త్రం - 4-7)

పరమేశ్వరుడు నాట్యవిద్యా జన్మభూమి కనుక అయనే ప్రేక్షకుడు. ఆయునకు నాట్యం రసచర్వణాత్మకమైన మహాభోగం. ఆ సమర్పణమే అర్చన. రసానుభవం జ్ఞానాత్మకం శ్రవణం జ్ఞాన ప్రబోధం. దర్శనం తదనుభవం. జ్ఞానమే దర్శనమూ అనుభవమూనని వివరణ.

ఆముక్తమూ ఇదే దశలో నున్నది. కనుక వినిర్మాణమూ భగవంతునకు శ్రవణయోగ్యమై - కైంకర్యరూపమైన రసవద్రచన కలదై నందున మహాప్రబంధమని కవి కావ్య కథారంభంలో పేర్కొనటం జరిగినదన్నమాట.

ప్రియము = ప్రీతి అంటే రసమే.

''కవిభిః కావ్యకుశలైః రసభావమపేక్ష్యతు.'' (నాట్యశాస్త్రం19-1) (కావ్యనిర్మాణ కుశలులైన కవులకు రసభావాలే అపేక్షింపదగ్గవి)

కేవల మత దృష్టే కావ్యనిర్మాణ కారణమనుకొంటే ద్రావిడ వేదాన్ని అనుగ్రహించిన నమ్మాళ్వారు కథ చెప్పవచ్చు. లేదా ఎవని చేతిలో శ్రీవైష్ణవమైన ఆళ్వార్ల భక్తి సంప్రదాయం తత్త్వశాస్త్రమైనదో ఆ నాథముని కథ వ్రాయవచ్చు. లేదా ఎవని సహస్ర జిహ్వలపై శ్రీవిశిష్టాద్వైతం భాష్యరూపంలో అవతరించిందో ఆ ఆదిశేషావతారమైన శ్రీరామానుజస్వామి కథ చెప్పవచ్చు. ఈ ప్రత్యేక కథలే ఎందుకు గ్రహింపబడ్డట్లు?

ఆ కథలు కూడా మూలానుసారంగా చెప్పనే లేదు. యామునాచార్యుడు చోళరాజాస్థానానికి వెళ్ళి ఆస్థాన పండితుడైన విద్వజ్జన కోలాహలుని మూడు ప్రశ్నలతో జయించాడట.

1. నీ తల్లి వంధ్య కాదు.

2. ఈ రాజు సార్వభౌముడు

3. ఈ రాణి పతివ్రత - ఈ వాక్యాలను ఖండింపు మన్నాడనీ. అతడాపని చేయలేకపోతే యామున మునియే 'ఏకపుత్రుడు కలస్త్రీ వంధ్యయే' యన్న మనుస్మృతి వాక్య ముదాహరించి మొదటివాక్యాన్ని- రాజు : ప్రజాదాయంలో ఆరవవంతు పన్నుగా స్వీకరిస్తున్నాడు. ఈ కలియుగంలో ప్రజలు పాపాత్ములు. కనుక అందులోనూ ఆరవ భాగాన్ని పొందటంవల్ల అతడు కేవల ధర్మప్రభువు కాడని రెండవ వాక్యాన్ని-

రాజు అష్టదిక్పాలకాంశజుడైనందున వాని భార్య వారికీ పత్నియే కనుక అపతివ్రత అని మూడవ వాక్యాన్ని ఖండించి జయించాడట.

ఈచిట్కా వైద్యం కావ్యస్థాయికలది కాదు. కనుక కవి మార్చుకొన్నాడు. ఈమార్పు నాయకుని ఉదాత్తతకోసం. అది రసనిర్మాణ మార్గం. కనుక వస్తు నాయకుల్లో రసాననుగుణ లక్షణముంటే మార్చుకోవటం రసపరతంత్రుడైన కవి కర్తవ్యం. ఇదే ఆలంకారిక సంప్రదాయం.

యత్ స్యాదనుచితం వస్తు నాయకస్య రసస్య వా,
విరుద్ధం తత్ సంత్యాజ్య మన్యథా వా ప్రకల్పయేత్. (సాహిత్య దర్పణం)

నాయకుని ఔదాత్త్యమునకూ- రసానికీ భంగకారణమైన వస్తువును మార్చుకోవాలి అని సూత్రీకరించి విశ్వనాథ కవిరాజు సంస్కృత నాటకాల నుదాహరించాడు. ఆ మార్పులెలా - ఎందుకు చేసారో వివరిస్తూ -

కనుక కవి పండిత వాద ధోరణిని కల్పించుకొన్నాడు. అది ఆనాటి ఆస్థాన సంప్రదాయం. కనుక మూలకథలో లోపించిన ఉదాత్తతను కవి పూరించుకొని కథలో - నాయకునిలో - రసానుకూల భూమికను సృష్టించుకొన్నాడు.

4

చతుర్విధ నాయకులు చతుర్విధ రసాశ్రయులు. కాబట్టి రస నిర్ణయానికి నాయకుని లక్షణ వివేచన మావశ్యక మౌతున్నది.

'రక్షితారస్తు నేతారః' - కనుక లోక రక్షణమే కావ్య వస్తువుగా ఉపనిబంధింప బడటం స్పష్టమే కనుక ఆముక్త నాయకుడు భగవంతుడు. నాయకుడంటే రక్షణ దృష్ట్యా కథను ప్రవర్తింప చేసి ఫలభోక్త యైనవాడు.

''నయతి ప్రాప్నోతీతివృత్తం ఫలం వా నాయకం'' అని నాట్య వేదం. ఆముక్తంలో ఫలాగమం గోదా శ్రీరంగనాథుల వివాహం- అని స్వప్నంలో భగవంతుడే చెప్పాడు. ఆ ఫలానుగుణంగా పూర్వకథలను నడిపిన వాడెవ్వడు? విష్ణుచిత్తుడా ? యామునుడా? దాసరా? - భగవంతుడు.

భగవంతుడు నాయకుడైతే చతుర్విధ నాయకులలో 1) ఏ నాయకుడు కావటంలో ఔచిత్యమున్నది. (2) కవి వివక్షేమిటి? ధీరోదాత్తుడు కాక తప్పదు. ఇతర నాయకు లేక రసదృష్టి కలవారు కనుక. ఉద్ధతుడు - రౌద్రం. శాంతుడు - శాంతం. లలితుడు - శృంగారం. ఉదాత్తుడీ నవ రసానుకూల చిత్తవృత్తి కలవాడు. ఆయనకు రెండు ముఖాలున్నాయి.

1. ప్రవృత్తిముఖం 2. నివృత్తి ముఖం.

మొదటిదానిని లీలావిభూతిగా -రెండవదానిని నిత్యవిభూతిగా శ్రీవైష్ణవ మంగీకరిస్తూ భగవంతుని నిత్యోద్యోగిగా చిత్రించింది. కేవల నివృత్తి ముఖమైతే అవతారావశ్యకతే లేదు. అవతార ప్రయోజనం ధర్మ రక్షణ, అది వీర రసాశ్రితం. కాబట్టి పూర్వ కథలైన ప్రాసంగికాలు పార్యంతిక కథయైన గోదా వివాహాని కంగ భూతాలన్న మాట. అంటే ప్రధాన రసమైన శృంగారానికి పోషక రసమైన నిత్యోద్యోగితా స్వభావకమైన - వీర రసాశ్రితాలు కావలసిందే.

'స్వేచ్ఛాకేసరిణః' అన్న ధ్వన్యాలోక ప్రారంభం లోని నరసింహ స్వామి స్తుతిని వ్యాఖ్యానిస్తూ 'లోచన' మన్నది - 'ఇక్కడ నిత్యోద్యోగి భగవంతుని అసమ్మోహ, అధ్యవసాయాదులతో ఉత్సాహస్థాయి ప్రతీతమై వీర రసం ధ్వనిస్తున్నది'' - అని.

కైలాసనాథ దేవాలయంలోని నరసింహస్వామి విగ్రహాన్ని వ్యాఖ్యానిస్తూ ఆనంద కుమారస్వామి గారు తన శివతాండవంలోనూ ఇలాగే అన్నారు. అలాగే Cosmic Art of India అన్న గ్రంథంలో

ఇదే బొమ్మను వ్యాఖ్యానిస్తూ రాధా కమల ముఖర్జీగారూ అలాగే శిల్పసౌందర్యాన్ని వివరించారు. కాకపోతే లోచన భాష ఆలంకారికం. వీరి భాష ఆధునికం ( చూ : 'నా సాలభంజిక' అన్న గ్రంథంలో ''రసమూ - లోకము'' )

అంటే ఇది అనాది విమర్శ - రస - సంప్రదాయమని అర్థం. కనుక ఆముక్తంలో మొదటి - పాండ్య చక్రవర్తి సముద్ధరణ, యామున కథలో ధర్మ ప్రభుత్వ స్థాపన ( ఆదర్శ చక్రవర్తిత్వ స్థాపన) దాసరి కథలో వ్యక్తి సముద్ధరణ - అన్నవి స్వామి అవతార ( అర్చావతార) నిత్యోద్యోగితను ధ్వనించేవే. అందుచేత అవి వీర రసాశ్రితాలే.

2

జన్యజనక - సూచ్యసూచిక రసవిషయ మొకటి నాట్యశాస్త్రంలోనే ప్రసక్తమైనది.

శృంగారం జనక రసం - జన్యరసం - దాని నుండి జన్మించేది - హాస్యం. రౌద్రం - జనక - కరుణ - జన్యం వీరం - జనక రసం కాగా, జన్య రసం అద్భుతం. బీభత్సము నుండి భయానక మేర్పడుతున్నది.

ఈ సూచన దృష్ట్యా ముందనుకొన్న వీర రస స్థాపన చేయవచ్చునా ?

మూడు ( విష్ణుచిత్త - యామున - దాసరుల) కథల్లోనూ రసము వీరమే అనటానికి కథాంతంలో అద్భుత రసం ప్రసక్తమైతే పై సిద్ధాంతం సమంజసమే ననుకోవాలి కదా !

పెరియాళ్వారు పాండీని ప్రసన్నుని చేశాడు. వెంటనే దేవతలు ఆకాశంలో విస్మయ ప్రకటన చేసారు.

''అద్ధా వాగ్విభవమ్మ హా ! వచన కవ్యాహార, మహావచ
స్సిద్ధమ్మా ! కృతతాంగతిః కలి రితి శ్రీసూక్తి విద్యాధర
మ్మిద్ధొద్ధృత్య మగాత్ లయాం హి - (4-6)

యామునాచార్యులు శైవమతాన్ని ఖండించి నారాయణపారమ్యస్థాపన చేయగానే -

''అ.యెడనొక పలుకెదు రై యుండెడి పిప్పలమునసాయెను విన'' - (4-74)
అలాగే బ్రహ్మ రాక్షసుడు భాగవతుడుగా పరిణమించిన సందర్భంలో

స్నిగ్ధ త్రిభాగముండిత శిరశ్శిఖతోడ
హిమ ధవళోపవీతముల తోడ - (6-87)

ఈ పద్యాలు మూడు అద్భుత రసాత్మకములని స్పష్టమే. విస్మయం స్థాయి. ఇది ఒక లోకోత్తర

విషయం సంఘటిత మైనపుడు చిత్తం విస్తృత మౌతుంది. ఆ విషయం లోకోత్తర కర్మ సాధ్యం కనుక. ఇది ఉత్సాహ జన్యం ఉత్సాహం వీరస్థాయి. ఇది జన్య జనక రసమన్న గొలుసుకట్టు.

''వీరస్యాపి చ యత్ కర్మ సోఽద్భుతః పరికీర్తితః'' (నాట్యశాస్త్రం)

''మహాపురుషో హి జగద్విస్మయ ఫలాభిసంధానే నైవ'' - (అభినవ భారతి)

మహాపురుషుని నిస్స్వార్థ కర్మ కారణమైన చిత్తవృత్తి విశేషం ఉత్సాహం. అది జగద్విస్మయ కారణమౌతున్నది. కనుక అద్భుతం వీరం నుండి పుట్టే ద్రష్ట అనుభవ విశేషం.

"Devine daya enters into the humanity with a view to moulding matter for the making of muktas and the inner meaning of human history is the Brahmanizing of all Jivas - (Philosophy of Visistadvaita p. 180)

అవతరణ కారణం కృప. లోక రక్షణ కదే బీజం. ఆ దయ వీరుని లక్షణం. యుద్ధం కూడా దయాధర్మ మూలకం కాకపోతే అతడు మహాచక్రవర్తి - ఆదర్శ ప్రభువు కాలేడు. ఆ వీరం నిత్యమూ శృంగార రస పర్యవసాయి.

'వీరస్యాపి చ' - అన్న భరత సూత్ర వ్యాఖ్యానంలో

'అపి శబ్దాత్ శృంగారోఽపి వీర స్యానంతరం ఫలం ద్రౌపదీ స్వయంవరాదౌ'' అన్నమాట ఈ కావ్యానికే అన్వయిస్తుంది.

ఈ చర్చా సారాంశం 1. అంగిరసం శృంగారం 2. అంగరసం వీరం.

కానీ, భోజుడు 'శృంగార ప్రకాశిక' లో ఒక వాదం చేశాడు. శృంగారం నుండి హాస్యం - బీభత్సం నుండి భయానకం అన్న నియమం లేదు. ఎందుకంటే శృంగారం కాని దాని నుండి కూడా హాస్యోత్పత్తి జరుగుతున్నట్లు కవులు నిరూపించినారు కనుక. అంటే శృంగారం నుండే హాస్యం, వీరం నుండే అద్భుతం పుట్టటమే నియమం కాదు. ఈ సిద్ధాంతాని కపవాదాలున్నాయని తాత్పర్యం.

ఉదాహరణ మేమంటే - అద్భుతం శృంగారం నుండి ఉత్పన్నమైన ఘట్టాలు సాహిత్యంలో నున్నవని ఆయన నిరూపణ.

(చూ : ఆచార్య వి. రాఘవన్ గారి శృంగార ప్రకాశిక)

దీన్నిబట్టి ఆముక్తంలోని ఆ మూడు అద్భుత రసాత్మక పద్యాలకు జనక రసం వీరమే కానక్కర లేదనవచ్చు. కానీ భోజ మతానుసారంగా చూచినా శృంగారం నుండి కూడా అద్భుతం పుడుతుందన్నాడు తప్ప, వీరం నుండి కాదనలేదు కదా. కనుక వీరమే చెప్పాలి.

3

'ఎన్నిను గూర్తునన్న' - స్వప్నంలోని భగవద్వాక్యానుసారంగా శృంగారమే రసమని - అదే ప్రధానమని కవే స్పష్టం చేసాడు. కాని అంగరస సూచన - పై రీతిగా జన్యరసమైన అద్భుతాత్మక పద్యాలద్వారా - వీరరసాన్ని ధ్వనితం చేశాడు తప్ప వాచ్యం చేయలేదు. శృంగారం ప్రధానం కాగానే వీరమే అంగరసమై తీరాలి తప్ప అన్యం కాదు. కారాదన్న ఆలంకారిక సంప్రదాయానుసారంగా వీరమే అంగమన్న ధ్వని ఉండనే ఉన్నా - ఆ వీర సంబంధ యుద్ధాలిందులో వర్ణితం కాలేదు కనుక - అన్య వీర భేదాలుండాలన్న ఆలోచన విమర్శకున కుండాలి.

వీరంలో నాల్గు భేదాలున్నాయి. ( జగన్నాథాదుల ననుసరించి సంఖ్య పెరిగింది) 1. యుద్ధ 2. ధర్మ 3. దయా 4. దాన - వీరములని.

''దానవీరం - ధర్మ వీరం - యుద్ధవీరం తథైవ చ
రసం వీరమపి ప్రాహ బ్రహ్మ త్రివిధ మేవ హి'' (నాట్య శా. 6-79)
''ఏష త్రిధా సమాసేన దాన - యుద్ధం దయోద్భవః'' ( రసార్ణవ సుధాకరం)
''నచ త్రిధా యుద్ధవీర - దానవీర - దయావీర భేదాత్'' ( రసతరంగిణి)
''ఉత్సాహాత్మా భవేద్వీరః త్రిధా ధర్మాజిదానతః'' ( వాగ్భటాలంకారం 5-21)

పై సూత్రానుసారంగా రసార్ణవ సుధాకర - రస తరంగిణులలో మాత్రం దయావీరమున్నది. నాట్యశాస్త్రంలో లేదు. వాటిలో ధర్మ వీరం లేదు. నాట్యశాస్త్రంలో ఉన్నదానిని వీరెందుకు పరిత్యజించినట్లు ?

ఇలా ఉండగా - ''ధర్మ స్థానే దయావీర ముక్త్వా త్రైవిధ్య మాహ ధనికః'' -

అని ప్రతాప రుద్రీయ వ్యాఖ్యలో కుమారస్వామి సోమపీధి వ్రాసాడు. కనుక పైన రసార్ణవం - రస తరంగిణులు ధనికు ననుసరించారేమో ? ( ధనికుడు దశరూపక వ్యాఖ్యాత తత్కర్త ధనంజయుడు గుప్తపాదులకు సమకాలికుడు. దశరూపకం క్రీ. శ 1000నాటిది. ధ్వన్యాలోకం క్రీ. శ. 840)

దశరూపకం కంటె శతాబ్ది క్రితమే వచ్చిన ధ్వన్యాలోకంలో దయావీర ప్రస్తావన మున్నది.

''దయావీరాదీనాం చ చిత్తవృత్తి విశేషాణాం
సర్వాకార మహంకార రహితత్త్వేన శాంతరస ప్రభేదత్వం''

(బాలప్రియ పు. 394)

*''నను ఏవం దయావీరో- ధర్మవీరో - దానవీరో - వాసౌ
కశ్చిత్ శాంతస్యైవేదం నామాంతర కరణం తథా హి*

*మునిః దానవీరం - ధర్మవీరం - యుద్ధవీరం తథైవ చ*
*రసవీరమపి ప్రాహ బ్రహ్మ త్రివిధ సమ్మితం''(లోచనం)*
(దయావీరాదులు శాంత రసభేదాలే. ఎందుకంటే అహంకార రహితత్త్వం వల్ల.)

ఈలోచన శ్లోకానికీ పై నుదాహరించిన నాట్యశాస్త్ర శ్లోకానికీ భేదమున్నది.

త్రివిధమేవ హి - అని పైశ్లోకం
త్రివిధసమ్మితమ్మనిలోచనం

ఇదిలా ఉండగా ఆంధ్రధ్వన్యాలోకంలో వేదాల తిరువేంగళాచార్యులు గారు -

దానవీర ం - ధర్మవీరం - యుద్ధవీరం తథైవ చ
దయావీరమపి ప్రాహ బ్రహ్మ త్రివిధ సమ్మితం -

అన్న శ్లోకాన్నుదాహరించారు.

నాట్యశాస్త్రానికి రెండు పాఠాలున్నట్లు పండితులంటున్నారు. కనుక (చూ. అనభిన గుప్త - అన్నగ్రంథం) అందులో ఇదొకటేమో? - ఏమైనా సాహిత్యదర్పణం నాటికి నాల్గు భేదాలు స్థిరపడ్డాయి. జగన్నాథాదులు రాయల కీవతలివారు. కాగా వీరభేదాలు రాయలనాటికి నాల్గు.

ఆముక్తంలో యుద్ధవీరం లేదు. మిగిలిన వున్నాయా?

4

ఆముక్తంలో ఉద్ధరింపబడ్డ వారు ముగ్గురు. మధురాచక్రవర్తు లిద్దరు, బ్రహ్మరాక్షసుడు. క్రమంగా వీరుత్తమ - మధ్యమాధములు - ప్రపత్తి ననుసరించి. కనుకనే ప్రథమ పాండీనిమహాచక్రవర్తిగా - రాజనీతిజ్ఞునిగా - ధర్మపాలకునిగా సుదీర్ఘంగా కవి వర్ణించాడు. కనుక అతని కీర్తి హంస - దానత్యాగములే రెండురెక్కలుగా దిగంతరాళంలో విహరిస్తున్నది. ప్రజలు భోగపరాయణులైనారు. అతనిలోని దోషమొకటే - భోగినీ సంగతి. దానికై పోతూ ఒకనాడు రాత్రి ''వినియెనెలల్ చతుర్వ్వయిని'' (2-76)

ఆ గ్రంథమొక పరదేశి విప్రుడు పఠించినాడు. అతని కది ఉబుసుపోక పఠనం కాని విన్నరాజు హృదయదఘ్నంగా వాపోయినాడు. అతనిలో దుఃఖం పెళ్ళుగిల్లినది. స్వస్థితి విచారించుకొన్నాడు.

''ఏమి రాజ్యవైభవములు. ఏమి భోగములు. బుద్బుద ప్రతిమ శరీరం నిత్యమని విశ్వసించి ముక్తిని గణించనే లేదు. ఉన్నట్ల యుండగా నావ ప్రయాణీకుల నవల ఒడ్డునకు చేర్చినట్లు కాలం కూడా నిగూఢగమనంతో వయసు దెచ్చి మోసము పుచ్చున్. ఆకాలం షట్చక్రవర్తులనే కబళించింది. అయ్యో! తటిచ్చలమగు రాజ్యానందం మరగి ఇంద్రియారాముడనై పోయానే ? ఇంతనుండి

పరలోకానందమునకై ప్రయత్నిస్తానని కోలపై పండిత పరిషత్తు తీర్చి అపవర్గదుడే వేల్పోఅతనిభజింతున్ - తెల్పిచెప్పమన్నాడు.

ఇది ప్రతినాయకుని కథ.

ఈసందర్భంలో కథలో నాయకుడు రంగప్రవేశం చేశాడు. నాయకునిలో ఈరాజు దైన్యస్థితి కృపను గిలకొట్టినది. బ్రహ్మవిద్యార్థుడైనాడు కనుక అక్కడ శ్రీవిల్లిపుత్తూరు లో స్వామి తన భక్తునితో -

'నేడు మహామతీ ! మధురనీవు రయంబునఁ జొచ్చి -

వాడును రోసినా డిహము వైష్ణవుగా బొనరింపు సత్కృపన్' (2-88)

ఈ సంభాషణ కావ్యంలో చూచుకోవచ్చును. భక్తుడు దుఃఖితుడు కాగానే భగవంతునిలో ఉద్ధరించాలన్న తలంపు కల్గటమే పని - విష్ణుచిత్తుని మధురకు తరిమేటంత వరకు ఊరుకోలేదే ! అతని దయా స్వరూప మేమో మరి?

'అపార కరుణాంబుధే ! ప్రణతార్తిహర - ఆపత్సఖ' - అని శ్రీరంగగద్యలో రామానుజస్వామి స్తుతించారు. ఇదే గురులక్షణం. 'అహేతుక దయాసింధు ర్బంధురానమతాం సతాం' (వివేక చూడామణి -35)

ఈసందర్భంలో వీరరసానికి ఉద్దీపన విభావం పాండీని దుఃఖం. ఆలంబనం రాజు. ఇది నాయకునిలో దయాపూర్వకమైన ఉత్సాహ స్థాయిని ప్రబుద్ధం చేసింది. అదే ''నేడు మహామతి'' పద్యభావం.

ఆరాజు ఈయనను ప్రార్థించనే లేదు. ఇదే నిర్హేతుక కృప. దయ అంటే 'నిరుపాధిక పరదుఃఖ ప్రహరణేచ్ఛ- (రసతరంగిణి). దానికి కారణంలేదు. కారణముంటే కార్యంలో లోకదృష్టి ప్రవేశించిందన్నమాట. ఆ దయ ఆ పద్యంలో 'మధుర నీవు రయంబున జొచ్చి' - రయము - సావేగ ఉత్సాహస్థాయిని వ్యంజిస్తున్నమాట. పాండీని తాపం చల్లార్చాలన్న తీవ్రత రయం. విష్ణుచిత్తుని ప్రోత్సహించటం నంబితో పయనంబు తూగింపు -మనటం, సభలో విష్ణుచిత్తుడు కాలుపెట్టీ పెట్టటంతో హరి తన 'చేతోగతినాలయ' - (3-4) ఇదంతా సావేగమైన ఉత్సాహ స్థాయికి వ్యంజక సామగ్రి. అలాగే 'నీయిచ్ఛయె మిన్నక పోవోయి' - అన్నమాటల్లో ఆమంత్రణం - బలం లేదని క్రుంగిపోయేవానిలో ఉత్సాహాన్ని (వ్యభిచారి) ఉత్తేజపరచటం - (నేనున్నాగదా, భయం లేదనటం) ఇదంతా ఉత్సాహ స్థాయిని వ్యంజించే అను భావసంపద.

విష్ణుచిత్తుని ప్రయాణ వర్ణన -

2-96,97 - వాదివిజయయాత్ర. యుద్ధవీరమైతే చతురంగ బలాల జైత్రయాత్రా వర్ణన ముంటుంది. ఇదే పరాక్రమమన్న విభావంగా చెప్పబడినది. (చూ: నాట్యశాస్త్రం)

*''వాదితని చేత గెల్పింతు నాదు మహిమ*
*ఉవిద కనుమని ప్రాభవం బొప్పఁబలికె''.* - (2-92)

ఇది గర్వోక్తి - ఇది తత్త్వజ్ఞాన శూన్యమైన భౌతికాహంకారం కాక స్వశక్తి కథనం.

మతి - విష్ణుచిత్తుని ఆధారంగా చేసిన వాదమంతా ఇదే - 'తత్త్వమార్గానుసంధానాదర్థనిర్ధారణం మతిః' - (రసగంగాధరం) వినువీథిలో ఖేచరుల స్తుతించినా పొంగకపోవటం- జితులను హేళనచేయకపోవటం- వంటిది ధృతిని వ్యంజించే సామగ్రి.

ఈధృతి- మతి-గర్వాదులు వ్యభిచారిభావాలు. ఆలంబనం రాజు. అతని దైన్యస్థితి ఉద్దీపనం వీని సంయోగం వల్ల భగవదుత్సాహం ఆవిష్కృతమౌతున్నది. ఇదేవిషయం కవి చెప్పనే చెప్పినాడు. 'వాడును రోసినా డిహము, వైష్ణవుగాఁ బొనరింపు సత్కృపన్' - ఈసత్కృప దయావీర సూచకమే. భానుదత్తుడు 'రసతరంగిణి' లో దయావీరోదాహరణంగా ఇచ్చిన శ్లోకం.

*''దయాబీజం హరే ర్నేత్రం అంకుర స్తత్ర భాస్కరః*
*తతః సముత్థితా వేతౌ పల్లవౌ రామలక్ష్మణౌ.''*

ఈదయాబీజ శబ్దం దయావీర వ్యంజకం. అది రక్షణాది రూప వ్యాపార బోధకం.

కనుక ఈకథలో రసం *'దయావీరం'*.

## యామునాచార్యుని కథ – 5

దీనికి వక్త కావ్యనాయకుడు. శ్రోత ఆయన హృదయాలయ, శ్రీదేవి. నిత్యవిభూతి నాయిక.

మధుర రాజు శైవుడు. జందెము త్రెంచుకొని - స్వమతస్థుల నాదరించటం అన్యమతస్థులను నిరసించటమే పాలానాధర్మంగా స్వీకరించి రాజధర్మభ్రష్టుడైనాడు. స్వమతస్థులు దుష్టులైనా సరే శిక్షించటం, ఇదీ ఆయన పాలన.

వేద పండితులను నిరాదరిస్తూ - జంగాలను గౌరవిస్తున్నాడు. శివేతర దేవాలయాలు శిథిలములైనా - పట్టించుకోక పోవుటయేకాక - అనాథ ప్రజాదరణకు విముఖుడైనాడు.

*''ఏ పట్టున విసువక ర*
*క్షాపరుడవు కమ్ము ప్రజలచక్కి విపన్నుల్*
*కూపెట్టిన వినితీర్పుము*
*కాపురుషుల మీదనిడకు కార్యభరంబుల్''*-

అన్న యామున రాజధర్మప్రారంభమలా కావటానిక్కారణం ఆపాండీని పక్షపాత పాలన.

''అబ్బ్రాపతి తామసుండై మామకీనంబులగు జనంబుల సామాన్య
బుద్ధిం జూచుచుఁ దద్వృత్తుల కగు నుపద్రవంబుల నుపేక్షించుచు
రక్షావిముఖుండై - - - -''

అన్న వచనం (4-53) లో చెప్పిన రాజధర్మ రక్షావిధాన విముఖత్వమే నాయకుని కథారంగంమీది కాహ్వానించింది.

''చెఱువు కడమబడిన'' రాజు పట్టించుకోలేదు.
దేశవైశాల్య మర్థసిద్ధికిని మూల
మిల మొకింతైన గుంట, కాల్వలు రచించి
నయము పేదకు -నరిఁగోరునను నొసంగి
ప్రబలజేసిన నర్థధర్మములు పెరుగు''-

నన్న యామున రాజధర్మ వైరుధ్యమే పాండీని పాలనకు స్వస్తి చెప్పవలసిన సందర్భం. కనుక భగవంతుడు 'రక్షణ శిక్షణంబులు రాజముఖంబునం గాక నేనసాక్షాత్కరించి చేయమియుఁ దద్రక్షణేచ్ఛ యస్మదాభిముఖ్యంబునం గాని పొడమమియు నా యాభిముఖంబు సంవాదనంబునం గాని పుట్టమియు నే విచారించి తదాభిముఖ్య కారణార్థంబుగ నాస్థానం బెక్కి వాది జయంబు సేయవలయునను తలంప విప్రకుమారునకుం బుట్టింప నతం డేగి' -

ఇక్కడ నాయకత్వం అంతర్యామి తత్త్వగతంగా నిరూపితమైనది. విష్ణుచిత్తుని కథలో అర్చావతారం. ఈ భేదం భక్తుని పరిపక్వతకు సంబంధించినది. పెరియాళ్వారంత మహాభక్తుడు కాడు యామునాచార్యుడు. అప్పటి కతడు బ్రహ్మచార్య వ్రతనిష్ఠుడు. గురుకులంలో చదివి అప్పుడే లోకంలో కాలుపెట్టిన యువకుడు. పండితుడు కనుక వాది జయార్థియైనాడు. అతనిలో ఉన్న ఆ కోర్కె నెగసన త్రోసినవాడు భగవంతుడు. ఈయన దృష్టి రాజును వైష్ణవుని చేయటంద్వారా యామునుడు ప్రభువై ధర్మపాలన కొజ్జబంతి వ్రాయటం పరంపరయా నాయకుని లక్ష్యం ధర్మపాలన. కానీ సేనానియైన యామునుని దృష్టి వాది జయంబు - అతని కంతే తెలుసు. తర్వాత రాజు కావటం- మరలా దానిని పరిత్యజించటం లాంటి విషయాలు అతనికి తెలియవు కదా! ఈపథక మంతా భగవంతునిది - నాయకునిది - చక్రవర్తిది. సేనాని -మంత్రిది కాదు. కనుక నాయకోత్సాహం రాజధర్మస్థాపన.

ఆలంబన విభావం - రాజధర్మం
ఉద్దీపన విభావం - పాండ్యరాజు పక్షపాత పాలనం (4-45, 46,47)

ఈస్థాయినుండి పుట్టినదే యామునునకు తలంపు గల్గి వాదిజయంబుసేయ వలయునన్న విచారం. ఈవిచార స్వరూపమేమిటి? తాననుకొన్న కార్యసాధనమేదో - అన్వేషించటం యామునుడు

పనికివస్తాడని ఎన్నుకోవటం - సహాయులను వెదకి కొనుట, ఇది అనుభావంగా సాహిత్యదర్పణాదులు చెప్పాయి. గుణాగుణ విచారణ అని విచారించి కార్యభారాన్ని సేనాధిపతులపై పెట్టి జైత్రయాత్రకు పంపటం.

*''శూరాలాపములకు నతి*
*శూరుఁడు దానయ్యు నృపతిసోకోర్వదగున్*
*వారుబ్బుదు రందున నిజ*
*శూరత దొరలందుఁ గనుట సూకార్య మిలన్''* (4-244)

''ధరణి పుఁడెందునే ఁజనదు తాఁజన నూఱట కొక్క నింద గన్ । దొరనొనరించి పంప'' (4-255)

ఇది రాజనీతి సూత్రంగా యామునుడు చెప్పిన మాట. ఇదీ విచారమంటే, యామునుడు, పడమటిద్వారం చేరి రాణికి వాదిజయం చేస్తానని కబురంపటం వైశారద్యమన్న అనుభావం ధ్వనిస్తుంది. (సామాద్యుపాయ చతుష్కంలో యథావిధిగా ఏదో ఒకదాని నవలంబించటం వైశారద్యమని వివరణ)

*''వాదించి గెల్చి నీదుభర్తకు భగవద్భక్తి ఁబుట్టించి*
*కృతార్థుం గావించెద''* - (4-53)

ఇదే అనుగ్రహ ప్రదర్శనం - బహు దాతృత్వమన్న అనుభావసంపుటి. 'వాదించి జయించెద' నన్న మాటలో ధైర్య - శౌర్య - స్థైర్యాదులు స్పష్టమే.

''సంగతియె యోయి యిసుమంత తింగణావు''

ఈ రాజవాక్యాలకు అలజడి పొందక పోవటంలో ప్రసాదమన్న అనుభవం ధ్వనిస్తున్నది.

ఆమాటలు విన్న యామునుని మాట

*''ఎవ్వడే సర్వభూతస్థుఁ డిత్తెఱంగు*
*నకునుఁబ్రేరేచె, నతని యానతియ తెచ్చె*
*నెఱీఁగి నవి నాల్గు నొడువ నెట్లేని లెస్స*
*యతఁడ బొంకిన నేమి సేయంగ నగును''* - (468)

తానోడితే శిక్షార్హుడనే - (469)

*''దేవా! యిట్లని యానతి*
*యావలదేఁ గడుపు కూటికిట రాను''* - (471)

ఇత్యాదులన్ని ధృతి యన్న అనుభావ విషయాలే వాదంలో మతిస్పష్టమే - (472)

కాబట్టి ఈ కథలోని రసం ధర్మవీరం.

కనుకనే అంత రాజనీతి చెప్పవలసివచ్చింది. ఇది రసపోషకమైన సామగ్రి, రసాలంబనం లేకపోతే దానికి కథలో స్థానం లేదు.

ఈ కథలో వీర రసాలంబనం పాండీడు కనుక అతని చిత్రణలో కవి ప్రయోగించిన శబ్దాలు విచిత్రములైనవి.

*''రంజితాశ్చ ప్రజాః సర్వాస్తేన రాజేతి శబ్ద్యతే''*
*''బ్రాహ్మణానాం క్షతత్రాణాత్ తతః క్షత్రియ ఉచ్యతే''*

(శాంతిపర్వం - రాజధర్మానుశాసన పర్వం)

ఈ సనాతన ధర్మ ప్రభుతనుండి భ్రష్టుడైనాడు కనుక ఆ భ్రష్టతా స్వరూప మేమిటి? ప్రతినాయకుని దుర్లక్షణాలే నాయకునిలో ఉత్సాహ స్థాయి కుద్దీపన విభావాలు. వానిని పరిశీలిస్తే ధర్మవీరరసం సిద్ధాంతాని కూనిక చిక్కుతుంది.

అతని వెట్టిశైవ లక్షణాల్లో జంగాల నారాధించటం, భౌమవారపు పళ్ళెం పెట్టటం ఇత్యాదులతో పాటుగా 'జందెముత్తరశైవంబు చెంది త్రెంచు' దీని కర్థ మేమిటి? దక్షిణోత్తర - దక్షిణవామశబ్దాలు మతసంబంధ సాంకేతిక శబ్దాలు. దక్షిణమంటే వైదికాచారం. ఉత్తరమంటే తద్విరుద్ధం. ఉద్ధత తామసిక రూపమైనది. అంతేకాని ఉత్తరశైవంబు అంటే కాశ్మీర శివాద్వైతం కాదు.

*''యదయ మనుత్తర మూర్తిః నిజేచ్ఛయాఖిల మిదం జగత్ స్రష్టుం*
*పస్పందే సస్పందః ప్రథమః శివతత్త్వముచ్యతే తజ్జైః''*

(షట్ త్రిశంత్ తత్త్వసందోహం)

శ్లోకంలో అనుత్తర మూర్తి అంటే త్రిగుణాతీత నిర్గుణ పరబ్రహ్మము. కేవల శివతత్త్వం అనుత్తర మూర్తి కానిది ఉత్తరమన్నమాటే. అంటే వైదిక - అసనాతనమతం వెట్టిశైవం. కనుక జందెం త్రెంచుకొన్నాడు.

అంటే? ఛాందోగ్యోపనిషత్తు నాల్గవ అధ్యాయంలో ఒక కథ ఉన్నది.

జానశ్రుతివంశంలో పౌత్రాయణుడన్న వాడు జన్మించాడు. వాడు నిరంతర దానశీలి. ఒక రోజాయన సౌధాగ్రంపై శయనిస్తున్నాడు. పైన రోదసిలో రెండు హంస లెగురుతున్నవి: అందులో ఒకటి రెండవదానితోఅన్నదట - ' ఓసీ ! అక్కడ పౌత్రాయణుని తేజస్సు సూర్యమండలమై వెల్గుతున్నది, దాట బోకని . విని రెండవపక్షి 'వీడేమి రైక్వుడా?' అన్నది తృణీకారభావంతో (ఈహంసలు మహర్షులనీ, వానికి జ్ఞానబోధన చేయటానికై వచ్చారని శ్రీశంకరుల వ్యాఖ్యానం) వాడామాటలు

విని 'రైక్వుడెవరో?' అని అన్వేషించి ఆయన కనేకోపాయనము లర్పించి బ్రహ్మవిద్యను బోధింపుమని ప్రార్థిస్తే

''తం ఉపహర ప్రత్యువాచాహ హరే త్వా శూద్ర! తవైవ సహ గోభి రస్త్వితి
తదుహ పున రేవ జానశ్రుతిః పౌత్రాయణః సహస్రం గవాం
నిష్క,మశ్వతరీరథం దుహితరం దదాయ ప్రతిచక్రమే
ఆజహార ఇమాః శూద్రానేనైవ ముఖే నాలాపయిష్యదా''

శూద్రా! పోరా నీకీ బ్రహ్మవిద్య దేని కన్నాడు. వాడు వేయి ఆవులను, గుర్రాలను - రథాలను - ధుహితను సమర్పిస్తే బ్రహ్మవిద్యను బోధిస్తాడు. దీనినిబట్టి బ్రహ్మసూత్రాల్లో అపశూద్రాధికరణం పుట్టింది. శూద్రునకు బ్రహ్మవిద్యాధికారం లేదన్నారు. ఐతే మరి బ్రహ్మవిద్య బోధించబడ్డ ట్లుపనిషత్తు అన్నది కదా! అంటే శూద్ర శబ్దాని కిక్కడ దుఃఖితుడన్న అర్థం చెప్పారు భాష్య కారులు.

'సంస్కార పరామర్శాత్తదభావాభిలాపాశ్చ' (బ్రహ్మ సూ 1-3-36)

అన్న సూత్రంవల్ల ఉపనయన సంస్కారం లేనివారికి బ్రహ్మ విద్యాధికారం లేదని నిర్ధారితమైనది.

కనుక క్షత్రియుడైన రాజు జందెం త్రెంచుకొన్నాడు. కనుక అవైదిక మతస్థుడైనాడని తాత్పర్యం.

ఇలాంటి వాడిని సమీపించి యామునుడు జందెమును కాన్కగా పెట్టాడు. అంటే నిన్ను తిరిగి బ్రహ్మవిద్యాసంపన్నుని చేస్తానన్న సూచనతో -

కనుక కథలో ఈ జందెం విషయం వైదిక లేదా బ్రహ్మవిద్యాసంబంధం. ఇందుకని సనాతనుడు- వైదిక బ్రహ్మ స్వరూపుడైన విష్ణువు ధర్మస్థాపనార్థం కథలో ప్రవేశించాడు. ఆ సందర్భ మలాంటిది. కనుక కథలో రాజధర్మ - ధర్మప్రభుత్వ స్థాపన లక్ష్యం. దానికి వైష్ణవం - శైవమత ఖండనాదులు అంగాలుతప్ప వానికి ప్రాధాన్యం లేదు. వైష్ణవ మతస్థాపనకే ప్రాధాన్యమైతే 'వాదసరణి నందఱగెలిచెన్' అని ఒక్క పద్యమే వ్రాసి కవిచేతులు దులుపుకోడు కదా!

యామును డద్వైతమత ఖండనం చేసిన సిద్ధి త్రయాది గ్రంథాలను కవి గుదిగ్రుచ్చలేదు

కనుక కథా ప్రాధాన్యం రాజధర్మమే, ధర్మ పాలనమేనని స్పష్టం. అందుకని రసం 'ధర్మ వీరమే'

ఈ పనికాగానే మరలా రామమిశ్రుని ప్రవేశ పెట్టి యామునుని మత రాజ్యాభిషిక్తుని చేయటానికి శ్రీరంగం పిలిపించుకొన్నాడు నాయకుడైన భవగంతుడు. ఒక పని తీరిన పిదప రాజైన వాడు నమ్మిన మంత్రినో సేనాధిపతినో - మరొక పనికి నియోగించుకొన్నట్లు.

యామునుడు రాజైనాక ఆ ధర్మపాలనను కవి 2,3 పద్యాల్లో సూచించాడు.

''జన్నములు చేసి దానము
లన్నానా దేశ విప్రులం దనిపెను.'' (4-186)

''కసవు గఱచి చేయెత్తి మొఱబెట్టుట కరుల యంద'' (4-18) ఈ విషయం పాండ్యరాజు పాలనకు విరుద్ధమైనది. ఆదర్శ ప్రభుపాలనగా రాజనీతిలో చెప్పాడు.

(చూ : 4-253, 276, 280)

కాబట్టి ఈ కథా నిర్మాణమంతా చక్రవర్తి ఆత్మ ద్రవ్యమే. ఆ కథలో రాయలవారే ఉన్నారని భావం.

దాసరి కథ- 6

దీనికీ వక్త కావ్యనాయకుడైన మన్నారు స్వామి. శ్రోత భక్తుడైన విష్ణుచిత్తుడు. కనుకనే కథ బహు ప్రౌఢమై - విచిత్ర శబ్ద ప్రయోగం కలిగి, పద్య, శైలీ సుందరమై ఆంధ్ర సారస్వతంలో 'దానికి సాటువ మరొక కథ లేదు'. (విశ్వనాథ వారు) అన్నంత మిన్నంటినది.

బ్రహ్మ రాక్షసుడు బంధించినపుడు వ్రత పూర్తి అనంతరం తిరిగి వచ్చి దేహమర్పిస్తానని శపథం చేసాడు. తర్వాత వచ్చి అన్నాడు.

''నీచెఱఁ బాసి పోయి రజనీ చర!'' (6-45)

ఈ పద్యంలోని సావేగోత్సాహం దేహార్పణ సంబంధమైనది.

''ఏలా నొంచెద దేయమిట్లడిగి'' (6-65)

కైశికీఫల దానం యాచిస్తే దాసరిమాట యిది. రాక్షసుడు ముందు కోరినది దేహం. తిరిగివచ్చిన తర్వాత కోరినది కైశికీ ఫల దానం. కనుక కథలో దీనికి ప్రాధాన్యం. దేహమిస్తాననటం కైశికీ ఫలదానం చేయననటం - తర్వాత అంగీకరించటం - ఈ సర్వ కథకు ప్రాణం, దానం.

''తను విచ్చుట యనుకంపకాదు మదాత్మకసటు
వాపుట యనుకంపగాక'' (6-57)

కాబట్టి దయాపూర్వకమైన దానం - తద్గతోత్సాహం స్థాయిగా రసం దాన వీరం కావాలి. ఇందుకే రాక్షసుడు రామానుజుడు శ్రీరంగ గోపురమెక్కి ద్వయశ్లోకార్థాన్ని సర్వులకూ ఎలుగెత్తి చాటటం లాంటి కథ లనేక ముదాహరించాడు. ఇవన్నీ దయా పూర్వకదానాలుగా ఉదాహరించాడు. అప్పుడు దాసరి దయార్ద్రుడైనాడు.

'దయార్ద్రుండై యట్ల కానిమ్ము లెమ్మ' - అన్న వాక్యాల వల్ల కైశికీ ఫల దానానికి దాసరి మెత్తబడ్డాడని స్పష్టం. కనుక దాన విషయకమైన రసమే వ్యంగ్య మౌతున్నది.

ఆలంబన విభావం - రాక్షసుడు

ఉద్దీపన విభావం - రాక్షసుడు చెప్పిన రామానుజాది ఆచార్యుల కథలు.

అనుభావాలు - రాక్షసుని కథ వినాలన్న కోరికతో పాటు దాసరి కతనిపై అనుగ్రహం కలిగినది. 'అట్ల కానిమ్ము లెమ్ము' అన్న వాక్యంలోనే దాతృత్వం సుకుమారంగా ధ్వనిస్తూనే ఉంది.

వ్యభిచారి భావాలు - ''దిక్పాలతను వెత్తితిరిపెంపు తను దాన ఎన్ని మార్లెత్తమి యేను నీవు'' (6-61)

''ఊతనీరు - చెలదినేత, మూటాయిటి
దూది - ఎండపసుపు - తొట్టియక్క
రంబు -మేను''

ఇందులో మతి ధ్వనిస్తున్నది.
రాక్షసుడు తన కథను ముగించి దానమర్థిస్తే దాసరి

''*ఫలము పరమేశ్వర ముఖోల్లాసంబ*
*భగవంతుండ రక్షించు నూరడిలుము*'' -

అన్నమాటల్లో ధృతి - (లోభశోక భయాది ఉపప్లవ నివార కారణమైన చిత్తవృత్తి విశేషమని రసగంగాధరం. పరమేశ్వర సకల నియామకమైన అనాలోచన అనుభావమై వీనివల్ల ధృతి వ్యంగ్య మౌతున్నది. శాస్త్రీయంగా చెప్పవలసివస్తే ఇలా చెప్పాలి. కానీ అనవసరమని చెప్పటం లేదు.)

ఈ మూడు భావాల వల్ల ఉత్సాహ స్థాయి పుష్టమై రసము దానవీర మౌతున్నది.

ఈ కథానాయకుడు వక్తయైన దైవమే - దాసరిని నాయకుని చేస్తే శాంతమే రసమనాలి. అతని చిత్తవృత్తి దాని కుచితమే కనుక, స్వామి నాయకుడైతే రసం దానవీరం. ఆయన చెప్పిన కథలో తన భక్తుడు రాక్షసుని సైతముద్ధరించినాడని చెప్పటంలో ఉత్సాహానికి ప్రాధాన్యం. భక్తుని మాహాత్మ్య కథనంలోని ఉత్సాహం కాక అది రాక్షసుని ఎలా ఉద్ధరించినదో చెప్పటంలో ఉత్సాహమున్నది. గానఫలం దాసరి చేయనే లేదు.

'*ఏను ఫలం బెఱుంగ, ఫలంబు పరమేశ్వర ముఖోల్లాసంబ*
*కాన బంధకం బగుట ఫలం బింతింత యందుఁ గొమ్మన*
*వెఱతు, భగవంతుండ రక్షించు నూరడిలుము*'- (6-86)

అని కర్తృత్వం తనపై లేదనటంలో కర్త దైవమని స్పష్టమే.

ఈ దాసరి ప్రపత్తి యోగి, ఏది చేసినా భగవంతునిలో లీనమై చేస్తాడు. రాక్షసునితో మల్లయుద్ధం చేస్తూ 'మత్పదస్మృతి యాత్మ నే మఱక యతఁడు'. (6-22)

ఇది ఆతని కర్మ రహస్యం. తనను తాను దైవాని కర్పించుకొని కర్మ ఫలాన్ని దైవాని కర్పించటం కాక - కర్తృత్వ బుద్ధినే సమర్పించుకొన్నాడు.

''న్యాసవిద్యా ప్రపత్తిః ప్రపత్తి ర్నామ అనుకూలస్య సంకల్పః, ప్రాతికూల్యస్య వర్జనం.

రక్షిష్యతీతి విశ్వాసో గోప్తృత్వ వరణం. తథా ఆత్మ నిక్షేప కార్పణ్యం''

(యతీంద్ర మత దీపిక)

ఆయన కనుకూలమైతే చేయటం. ప్రతికూలమైతే మానుకొనటం - రక్షించే దతడే యన్న విశ్వాసంతో శరణని బ్రదకటం.

''జానామి ధర్మం న చ మే ప్రవృత్తిః
జానా మ్యధర్మం న చ మే నివృత్తిః,
త్వయా హృషీ కేశ ! హృదిస్థయా మే
యథా నియుక్తోఽస్మి తథా కరోమి.''

''ధర్మం తెలుసునని దానియం దాసక్తీ లేదు. అధర్మం తెలుసు. ఐనా అనిష్టమూ లేదు. హృదయంలో ఉన్న ఇంద్రియాధిష్ఠాత్రియైన తల్లీ ! నీవెలా నియోగిస్తే అలా చేయటమే నా కర్తవ్యం - ధర్మం''

ఇది న్యాస విద్య. దాసరివాడు వాడు కాదు. ఆయన చేతిలోని సాధనం. కనుకనే ''ఫలపరిమాణ గణన ప్రపన్నుల కెక్కుడియది -'' అన్నాడు. భగవంతుని ఉత్సాహం భక్తుని ప్రపత్తి యోగిగా చిత్రించటంలోనే నాయకత్వం తనదేనని చెప్పక చెప్పటమే కదా.

ఈకథ చెప్పినది - భూదేవి కైశికీగాన మాహాత్మ్యము విని తరింప గోరి గోదయై జన్మించినదని చెప్పటం కోసం. గానఫలమాహాత్మ్యం చేత బ్రహ్మ రాక్షసుడు సైతముద్ధరించబడ్డాడు. ఆ గాన ఫలదాత స్వామి. అందుకని ఆయన మీద గోదకు భర్తృభావ మేర్పడినది. దాసరి అంతవాడు కావటానికిగానీ, రాక్షసు డుద్ధరించబడటానికి కానీ ఆయనే కారణం. కనుక కథానాయకు డాయనే.

*''త్వత్ సంప్రాప్తౌ ప్రభవతి హి తథా దేశికేంద్రః*
*త్వత్ సంప్రాప్తౌ వరవరముని ర్దేశికేంద్రః''* (సప్తగాథ)

(నీవు లభించావు కనుక వేదాంత దేశికులు - వర వరమునీ అంతగొప్ప గురువులైనారు)

7

ఈవిషయం మూలకథ చూస్తే స్పష్టపడుతుంది. శ్రీ వైష్ణవం రామాయణ గీతాచరమంతో పాటు వరాహచరమాన్నీ గ్రహించింది (ఈ కథకు మూలం, వరాహపురాణమే). ఈ మూడు చరమములూ ప్రపత్తి యోగానికి ప్రమాణం.

*''స్థితే మనసి సుస్వస్థే శరీరే సతి యో నరః*
*ధాతు సామ్యేస్థితే స్మర్తా విశ్వరూపం చ మా మజః*
*తతః తం మ్రియమాణం తు కాష్ఠపాషాణ సన్నిభం*
*అహం స్మరామి మద్భక్తం నయామి పరమాం గతిం.''*

(సుస్వస్థ మనస్కుడు, శరీర ధాతు సామ్యస్థితుడైన మనిషి విశ్వరూపుడను - అజుడనూ నైన నన్ను మరణవేళ స్మరించక పోయినా వానికీ పరమగతిని కల్పిస్తాను.)

ఈ మూడు చరమాల్లో ప్రథమం వరాహ చరమమే. (ఈ చరమ శ్లోక త్రయమునకు 'పెరియవాచ్చాన్ పిళ్ళె' తమిళంలో వ్యాఖ్యానం వ్రాసారు.)

ఈ కథను రాయలవారు గ్రహించటానికి మంత దృష్ట్యా ఈ కారణం కూడా అనుసంధించుకొంటే రసం దానవీరమని స్పష్టమౌతుంది.

భూదేవి గోదగా జన్మించిన కారణంగా ఈ కథ చెప్పబడినది. ఇందుకని ఈ రెంటికీ ఒక ముడి. గోదగా జన్మించి తానూ ఆ కైశికీ గానంతో తరించాలనీ ఆమె సంకల్పమైనట్లు కవి దాసరి కథను ప్రస్తావనగా వివరించాడు. ఈ రాక్షసోద్ధరణం విభీషణోద్ధరణం కంటే మహత్తరం. కనుక వరాహ చరమాని కంత ప్రాశస్త్యం.

ఈ కథా రంగస్థలం అరణ్యం. పాత్రలు రాక్షసుడు, దాసరి. ఇద్దరూ శుచిమూర్తులు కారు. దాసరి శుచి మనస్కుడైనా - 'చమురైన తోల్కుబుసంబు' - వర్ణన అశుచిమూర్తి వర్ణన. ఈ వర్ణనలు దానవీర రస నిష్పత్తిలో మెట్లు. ఇలాంటి వానిద్వారా అంత పాపాత్ముని కూడా ఉద్ధరించటం - ఆశ్చర్యం కదా ? కనుక ఈ కథలో ఉద్ధత రసాలున్నాయి.

1. భయానకం

విభావసంపుటి - ఇరులన్ననో యనియెడు తమిస్ర - శూన్యగహనవాటి ఏతాల రాటలు మాత్రం మిగిలి బీళ్ళు వడిన సస్యక్షేత్రాలు -

వటవృక్షం - పుఱ్ఱెలు - చర్మాలు - ఎముకలు - రాక్షసుడు అనుభావాలు - జాలిగొనుట - (6-18) త్వరితంపుగతి (6-16)

వ్యభిచారులు - సంశయించుట (6-15) త్వరితంపు గమనంతో ధ్వనించే ఆవేగం -

ఈ త్రివిధ భావ సంపుటినుండి భయమన్న స్థాయి దాసరిలో ఈషత్సుకుమారంగా వ్యక్తమైనదే తప్ప - అజ్ఞాని వోలె - అతడు విలాసితుడు కాలేడు. కేవల శరీర రక్షణకై పెనుగులాడిన వాడు కనుక అతనిలో భయభావం కృతకం - తాత్కాలికం, కనుక అనుభావ మార్దవముంటుంది, దానికి బాహుళ్యముండదు. వ్యభిచారుల్లో భయాధిక్యముంటే వేపథువు - స్వేదం - ముఖశోషణాదులుండాలి. అవీ లేవు. ఇది కృతక భయానకం. ఇది మాత్రం దేనికి ?

'నాకుమేని యెడ కాంక్షయు లేదిది పోవుటేయురున్' (6-28) ఐతే పెనుగులాడటం దేనికి?

''పెనఁగక ప్రాణరక్షణ ముపేక్షయొనర్చుట పాపము'' (6-28) కనుక ఇంకా అతని వ్రతమూ పూర్తి కాలేదు. అది 'ముఖ్యము' నేడగుఁ దుదికిన్' (6-39), కనుక ప్రాణ రక్షణ మవసరమైనది. ఇందుకని భయానుభవం.

''అస్వాభికవిత్వాచ్చ, కృతకత్వం బహుతర కాలానువర్తనేనాస్వాద్యత్వాచ్చ రసత్వం. న చ వ్యభిచారిత్వం తద్ధి తదా స్యాద్యది స్వభావత ఏవ (న) కించిత్, కాలలవ ముత్పాద్యతే''.

(అభినవభారతి – రసాధ్యాయం)

జ్ఞానిలో సత్వ దర్శనం వల్ల ఉద్భవించిన భయం కృతకం. కనుక అనుభావ తీవ్రత లేదు. కనుక రసానుభవం లేదు. భయభావం సూచ్యమైనది. ఈ భయానకభావం రాక్షస స్వరూప చిత్రణకు వ్యంజకమై - అది దాన వీర రస పోషక మౌతున్నది. అలాంటి వాడూ దైవీకృపకు భాజనుడైనాడన్న వీరాద్భుతానుభూతిని ధ్వనించటానికి చేసిన ప్రయత్నం తప్ప ఈ భయానక రస పుష్టికోసం కాదు. కనుక రసము గౌణమై పోతున్నది.

రాక్షసులు స్వభావ రౌద్రులు కనుక రౌద్రమూ స్పష్టం కాలేదు. ఆలంబనం - దాసరి. అతని చేష్టలైన పెనగులాడటం ఉద్దీపనం అనుభవాలు - రాక్షసుని వాక్కులు - చేష్టలు. 'సారాస్వాదన ప్రాణపంచకము' - 'నన్నింతలయించిన ఖలు' - 'అసియుఁ బాత్రయు దేబంచి - వ్యభిచారులు' - పైవానితో వ్యక్తమయ్యే అమర్ష - వాక్పారుష్యం - చపలత -గర్వం - కోలగ్గెర వేయటంలో ధ్వనించే ఉగ్రత - వానివల్ల రౌద్ర రసం చెప్పవచ్చు. కానీ ఇవన్నీ దాసరి నారాయణ శపథాదులచే రౌద్ర కర్మలగు తాడన - పీడన - భేదనాదులు - ఈ షత్తుగా చోటు చేసుకొన్నా వాటి ఔద్ధత్యం వర్ణితం కాలేదు. ఇదీ నారాయణ స్మరణకు లోబడి పోయినందున గౌణమై పోయినది.

*అలాగే 'ఎలనీటి బొండలంబులు బోలె మెదడెల్ల*
*జుజ్జీ వైచిన డొల్లపుఱ్ఱెగములు'.* (6-17)

అన్నచోట బీభత్స రససామగ్రీ నిర్మాణమున్నది. జుగుప్సా హేతుకమైన వస్తు దర్శనాదుల వల్ల కలిగే

జుగుప్స స్థాయి. అవన్ని దాసరికి ముక్కు మూసుకొనుట వంటి అనుభావాలు కల్గించ లేదు. అతనికి జుగుప్సా వస్తుసామగ్రి పరిచితమే. పుర్రెలు కాకపోయినా - చర్మాదులు. అతని నివాసంలో కోళ్ళూ-చర్మాలుండనే ఉన్నాయి కదా. అందుకని వానిలో నివి జుగుప్సను కల్గించలేదు.

రౌద్ర - బీభత్స - భయానకము లుద్ధత రసాలు. అరణ్యం - రాక్షసులు - పిశాచ భూతాదుల వాతావరణ సంబంధ రసాలు కనుక వర్ణించకపోతే రాక్షస స్వరూపావగతి కల్గదు. ఇదంతా దానవీర రస పుష్టికి విరుద్ధ రస సామగ్రి.

తెలుపు వన్నె ప్రక్క - నలుపు రంగు పెట్టినట్లు, అప్పుడది మిక్కిలిగా వన్నె మీరుతుంది కనుక. ప్రతినాయక వర్ణనములా చిత్రించటం వల్ల నాయకుని దయాస్వభావ సాంద్రత ధ్వనిస్తుంది కదా.

నాయకోత్కర్ష కది మెరుగులద్దటం.

వీర రసానికి రౌద్ర బీభత్స భయానకాలు విరోధి వర్గం. ఆ వర్ణించటం వల్ల వాటిని బాధితం చేసి అంగిరసమైన దానవీరాన్ని పోషించటమే ఇక్కడి రసశిల్పం.

ప్రకృత రసపుష్టి కోసం విరోధి రసవర్గ బంధనం కర్తవ్యం. 'వైరి విజయాదుల వర్ణన ప్రస్తుత నాయకోత్కర్షా హేతువే కదా' - అని రసగంగాధర నిశ్చయం.

కనుక రౌద్రాదులు గుణీ భూతములై ప్రస్తుత రసపుష్టి హేతు వవుతున్నవని తాత్పర్యం.

మూలకథలో రాక్షసుడు తుదిపాట ఫలమివ్వమని యాచిస్తే రాక్షసజన్మకారణ మడిగినట్లున్నది. కావ్యంలో రామానుజాద్యాచార్య దయాచేష్టాది వర్ణనవల్ల దాసరి మెత్తబడ్డాడు.

మూలంలో రాక్షస చోదితుడై 'దాసరి నిన్నుద్ధరిస్తా' నన్నాడు.

కావ్యంలో ' భగవంతుండ ! రక్షించు నూరడిలుము' - అన్నాడు.

కనుక మూలంలో దాసరికి కర్తృత్వమున్నది తప్ప కావ్యంలో కాదు. ఇక్కడ కర్త భగవంతుడే.

ఈ విధంగా మూడు కథల్లో మూడు వీరభేదాలు చెప్పబడ్డాయి. ఆ మూడూ దయాహేతువులే. మొదటి కథలో ''సత్కృవన్'', రెండవ కథలో 'యామునాచార్యుఁ డొక్కరుండీ మహాత్ముఁ- డొక్కరుఁడును గాడె - అస్మదీయ కృపాతిశయమున' -

మూడవ కథలో 'కైటభారికనుంగులగు డింగరీలు దయాళువులు గావలదే'. ఐనపుడు దయా - ధర్మ - దానవీరాలెందుకు చెప్పటం ? అన్నీ దయావీరమేనని ఏల చెప్పరాదు! ? లేదా మరొక్కటి.

మొదటి కథలో రాజు భగవంతుని ప్రత్యక్షంగా యాచించలేదు. మార్గమేమిటని పండిత పరిషత్తును

ప్రశ్నించాడు. భగవంతుడు తానే వచ్చి మార్గనిర్దేశం చేయటానికై అర్హుడైన గురువును పంపించాడు. తానే ముక్తిప్రదుడనని ప్రకటించుకొన్నాడు. ఇందుకని దయావీరమే. ఇంతేకాక రాజునకు ధర్మబోధచేయటంలో ఉత్సాహము భగవంతునకున్నదా ? లేక వాని సముద్ధరణమందా ! దీనిలోనే అనటానికి మతవాదం - యోగం - ఖాండిక్యకేశిధ్వజసంవాదం - కథనింత పెంచడానికి కారణం రాజ సముద్ధరణకు. ఇక్కడ రాజు ఆలంబనం. అతని కృపణస్థితి ఉద్దీపనం. ఇక్కడ వ్యక్తి సముద్ధరణోత్సాహం తప్ప మత ధర్మ సముద్ధరణం కాదు. అధ్యాత్మ విద్యాదానం చేసినందున దానవీరమనరాదా ? అని అనవచ్చు కదా ? అంటే రాజు దానిని యాచించలేదు. రాక్షసుడు గాన ఫలదానం కోరినట్లు ఇతని కోరిక దాన సంబంధమైనది కాదు. రాజు కోర్కె ''మోక్షప్రదుడే వేల్పు?'' ఆ ప్రశ్నకు తానే ఆ వేల్పునని దైవమే దిగివచ్చి గురు రూపంలో ప్రకటించుకొన్నందున ఇక్కడ దయావీరమనీ అక్కడ దాన వీరమనీ నిర్ధారిత మైనది.

రెండవ కథలో 'రక్షణ శిక్షణంబులు రాజ ముఖంబునం గాని' సాధ్యం కాదన్నది. ఇక్కడ రసాలంబనం ధర్మం తప్ప రాజు కాడు. ఇందుకనే ఈ కథలో యోగ - మత ఖాండిక్యసంవాదంలాంటివి చెప్పక మతవాదం తేల్చి వేసి - రాజధర్మ ప్రసంగం విస్తృతంగా చేయవలసి వచ్చింది. కనుక ధర్మవీరమే రసం. ఇది కేవలము ఆలంకారిక మార్గం.

శిబి కపోత కథను ప్రస్తావిస్తూ రసగంగాధరమంటున్నది. ''పావురమా ! డేగవల్ల నీవు భయపడనక్కర్లేదు. నీ ప్రాణానికి నాప్రాణం ధారపోస్తాను'' - ఇక్కడ శరీర దానమున్నది కదా అని దానవీరం చెప్పరాదు. పావురం డేగకు భక్ష్యవస్తువే కనుక అది శిబిని శరీర దానాన్ని కోరనే లేదు. రక్షణ కోరింది. కనుక ధర్మవీరం చెప్పాలి'' - అని ఈ సూక్ష్మ దృష్టితో పై కథను విచారించాలి.

మూడు కథల్లోను దయాశబ్దం వాడడంలోని రహస్యమేమిటి వీర మూల ధాతువదే కనుక. ఈ దయ మహాత్ముల లక్షణం.

''కృష్ణ ద్వైపాయనుఁ డర్థిలోక హిత నిష్ఠంబూని కావించె ధ
ర్మాద్వైత స్థితి భారతాఖ్యముగు లేఖ్యంబైన యామ్నాయమున్''

అని కదా కవిబ్రహ్మ నిర్ధారణ. కనుక దాన- ధర్మాదులు దయాజన్యములే. 'దానవీరం- ధర్మవీరం - దయావీరమపి ప్రాహబ్రహ్మ త్రివిధ సమ్మతం' అన్న శ్లోక వివరణలో ఆంధ్ర ధ్వన్యాలోకమంటున్నది.

''ఈ త్రివిధములకు సమ్మతమనగా దయావశమున దానమును ధర్మమును యుద్ధమును గూడ నొనర్పవచ్చును. పరదుఃఖ దుఃఖిత్వము గదా దయ. అందువలన నుద్రిక్తమగు నుత్సాహము మహాసత్త్వుల కుదయించును. అపుడు వారి వారి ప్రవృత్తుల ననుసరించియు, దేశకాలౌచిత్యముల ననుసరించియు వారు పై మూడు విధములగు నుత్సాహముల నావిష్టులగుదురు''. - (పు 485)

''దయావీరాదీనాం చ చిత్తవృత్తి విశేషాణాం సర్వాత్మనా మహంకార రహితత్త్వేన శాంతరస ప్రభేదత్వం, ఇతరథాతు వీర ప్రభేదత్వమితి''.

''వ్యవస్థాప్యమానే, న కశ్చిద్విరోధః'' -( బాలప్రియ - 394)

ఈ ధ్వన్యాలోక సిద్ధాంతానుసారంగా పై మూడు వీర భేదాలు శాంతరసం కావాలి కదా ? వీర భేదంగా వ్యపదేశించటమెలాగా ? భగవదుత్సాహం సాహంకారం కాదు కదా. కనుక శాంతమే చెప్పాలి అనవచ్చు.

'స్వేచ్ఛా కేసరిణః' - అన్న ధ్వన్యాలోక మంగళ శ్లోక వ్యాఖ్యలో వీర రసమే చెప్పబడినది తప్ప శాంతం చెప్పబడలేదు. ఆ శ్లోకంలో రసాలంకార వస్తుధ్వనులు నిరూపిస్తూ భగవంతుని నిత్యోద్యోగిత్వంచేత - జగత్త్రాసాపసారణోద్యమంచేత - పరమేశ్వరగతంగా వీరరస స్థాయి - ఉత్సాహమే ఉన్నదన్న శ్రీమదభినవులే ప్రమాణం.

ఇంతేకాక ధ్వన్యాలోకం చేసిన సిద్ధాంత భావంలో మానవ నాయకత్వమే ఉన్నది తప్ప భగవన్నాయకత్వం లేదు. కనుక కూడా పై వాదం సమర్థనీయమే. ఒకవేళ కవి అలా నిరూపిస్తే శాంతమే చెప్పుకోవాలి. కావ్యార్థం కవి వివక్షాధీనం తప్ప శాస్త్ర నియంత్రితం కాదు. ఈ దృష్టినే సంప్రదాయమన్నారు ఆలంకారికులు.

*''యమకాది నిబంధేతి పృథగ్యత్నో ప్యజాయతే*
*శక్తే స్యాపి రసేఽంగత్వం తస్మాదేషాం న విద్యతే''* ( ధ్వన్యాలోకం)

యమకాదులు రసపుష్టికి ప్రతిబంధకాలన్న ఈ ధ్వన్యాలోక సిద్ధాంత మన్ని చోట్లా అన్వయించదు. దీనికి వ్యాఖ్య వ్రాసిన అభినవులే కాళిదాస కృత ఘట కర్పరకులక వ్యాఖ్యానంలో ఈ సిద్ధాంతాన్ని ఖండిస్తూ కవిశక్తి చేత యమకాద్యలంకారాలు కూడా రసాంగత్వం పొందుతాయనటాని కిదే తార్కాణమంటూ ఒక కారిక వంటి శ్లోకాన్ని వ్రాసారు.

*''న వై దోషో దోషో న చ ఖలు గుణావేవ చ గుణా*
*నిబంధ స్వాతంత్ర్యం సపది గుణ దోషాన్ విభజతే*
*ఇయం సా వైదగ్ధీ ప్రకృతి మధురా తస్య సుకవేః*
*యదతోత్సాదా దస్యతి సుభగ భావః పరిణతః*

కవీనాం శక్తి రేవ బలీయసీ, సా ఏవ లోకోత్తరా వ్యుత్పత్తి రిత్యభిధీయతే, నతు అన్యా కవిశక్తేః వ్యుత్పత్తి ర్నామ కాచిద్యదుక్తం మయా ఏవ రౌరవే విచారే'' - (20,21 శ్లోక వ్యాఖ్య)

కావ్యంలో గుణదోష విచారణ లేదు. అదంతా కవి నిరూపణను బట్టి ఉంటుంది. కవి కావ్య నిర్మాణ ప్రతిభాధారంగా గుణం-దోషమౌతుంది. దోషం గుణమౌతుంది.

కనుక దయావీరాదులు ధర్మార్థకామ పురుషార్థ పర్యవసానం పొందితే అక్కడ వీరమే చెప్పాలి. ఎక్కడ తురీయ పురుషార్థ గమ్యమౌతుందో అక్కడ శాంతమే చెప్పాలి. కావ్యాంతం శృంగారం కనుక వీరశృంగారాలు అనుకూల ద్వంద్వం కనుక వీర ప్రభేదాలే చెప్పుకోవటం సముచితం.

''నాగానందంలో రసం శాంతమన్నవాద మున్నది, కానీ అక్కడ నాయకునికి మలయవత్యనురాగమూ - విద్యాధరచక్రవర్తిత్వం ఫలితంగా సంఘటించటం వల్ల రసం దయావీరం తప్ప శాంతం కాదు'' అని దశరూపక సిద్ధాంతం కూడా ప్రస్తుతవాద సమర్థకమే. (చూ : దశరూపకం 4వ అవలోకం)

అయితే ఈ వాదాన్ని ఖండిస్తూ గుప్తపాదులు శాంతరసమేనని నిరూపిస్తూ శాంతరసంలోనూ ఉత్సాహముంటుంది. ఉత్సాహ రహితమైన అవస్థ ఏదీ ఉండదు. కావ్యం జీవిత నైరాశ్యం ప్రబోధించదు. జీవితాసక్తిని బోధిస్తుంది. కనుక మలయవతి - రాజ్యప్రాప్తి సంఘటించబడినది. అంత మాత్రాన శాంతం కాకపోదు (చూ. నాట్యశాస్త్రం 6వ అధ్యాయం) కాని ఆముక్తకని 'ఎన్నిను గూర్తునన్న' పద్యానుసారం శృంగారమే. కావ్యాంత వాక్యమైన 'జగములఁ బాలించుచున్నవాడు' అన్నమాటలో రసము వీరమే తప్ప శాంతం కాదు.

### శృంగారం – 8

సర్వజనాహ్లాదకతచే ఈ రసచర్చ చేయని శాస్త్రకర్తగానీ - తత్ప్రధానంగా కావ్యం వ్రాయని కవికానీ లేడనట మతిశయోక్తి కాదు. ప్రతివానికి లౌకికానుభవాని కందేది కనుక కావ్యగత విభావాదికము చర్చించటం తేలిక కనుక దీని కధిక వ్యాప్తి కల్గినది.

శ్రోతకది సులభగ్రాహ్యం కావచ్చుకాని కవికి నిర్వహణలో క్లిష్టత ఉన్నది. ఏ మాత్ర మేమరించినా కచకుచాది వర్ణనలోని కిది దిగజారి పోతుంది కనుక రసంలోని రసత్వం పోయి కామస్థాయి సంక్రమిస్తుంది. కనుకనే చాలా కావ్యాల్లో ఇదే రసంగా భ్రమించడం జరిగింది.

శృంగార శబ్ద నిర్వచనమే లోకంలోని కామం; కావ్యంలోని రతి స్థాయి ఒకటి కాదని, రెంటికీ మధ్య ఒక 'లక్ష్మణ రేఖ'ను గీసింది.

'యస్తు శృంగార శబ్ద స్యాన్మయేన - వ్యుత్పత్తి మాహతస్య రూపమపి విస్మృతం అరకన్ ప్రత్యయోత ఆరబ్ధః శృంగభృంగాభ్యామారకన్' (వార్తికం 5-2-121)

''బృందారక ఇతియథా. అత ఏవ ఉణాదిషు నిపాతితోఽయం శబ్దః''

(శృంగార భృంగారౌ - అభినవ భారతి)

'శౄ = హింసాయాం' అన్న హింసార్థక ధాతువునకు అరకన్ ప్రత్యయం చేరిస్తే శృంగార శబ్దం

నిష్పన్నమౌతుంది. ఏది అహంకారం = నేను అన్న భావాన్ని చంపుతున్నదో అది శృంగార శబ్దార్థం. ద్వంద్వం తమను తాము మరచిపోయి ఒకరిలో ఒకరు లీనమైన స్థితిని బోధించేది శృంగారం.

సీత నడవికి పంపించి రాముడన్నాడు ప్రాణ స్వరూపిణి జానకి పోతే ఈ శరీరం కేవలం 'శ్వాసాయాస విడంబనం' చేస్తున్న దింతేనని. ఇది శృంగార రసస్వరూపం. కనకనే భరతముని 'శృంగార ముత్తమ యువ ప్రకృతిక మన్నాడు. ఉత్తమ సంస్కారం గల యువతీయువకులు ఆలంబనంగా శృంగార రసం నిష్పన్నమౌతుంది. తప్ప అసంస్కృత చిత్తాశ్రితంగా రతి - స్థాయిగా నిలువదు. ఈ దృష్టితో చూస్తే నాయకుడు భగవంతుడు. నాయిక కూడా ఆ స్థాయికి చెందినదే కావాలి. ఈ రస స్వరూపం కొంచెం వివరించుకోవాలి.

I. ఆలంబన విభావాలు - గోదా శ్రీరంగనాథులు

II. ఉద్దీపన విభావాలు - (1) ఆలంబన గుణాలు (2) వారి చేష్టలు
(3) దశాలంకరణలు (4) తటస్థములు

(1) గుణాలంటే రూపయౌవనాదికం (2) హావభావాదికం (3) ఆభరణాలు (4) మలయానిల చంద్రికాదులు

III. అనుభావాలు : ఇవీ నాల్గు విధాలు (1) అంగజములు పరవశ భావహేలలు 3 (2) స్వభావజములు - లీలావిలాస కిలికించితమోట్టాయితాదులు 18 (3) సాత్త్విక భావాలు 8 (4) ఇతర చేష్టలు - భూతారాది దృగ్విలస నాదులు.

IV. వ్యభిచారులు - ఆలస్యం, ఉగ్రత, జుగుప్సలు కాక మిగిలినవన్నీ. ఈ భావ సంపుటిచే ఉద్బుద్ధమైన 'రతి' స్థాయి ఆస్వాదన శృంగారం.

ఇందులో భేదాలు 2. సంభోగం - విప్రలంభం. పూర్వరాగ శృంగారంలో అభిలాష - చింత - స్మృతి - గుణకథనం - ఉద్వేగం - ప్రలాపం - ఉన్మాదం - వ్యాధి - జడత - మృతి అన్నవి దశావస్థలు.

సమన్వయం - గోదాదేవి ధరాంగన కనుక దివ్యనాయిక. ఉద్దీపన విభావాదికం -'తమ తండ్రి శ్రీశదత్తశ్రీలు గృహమున ద్రవ్వితండములయ్యు'. ఇందుచేత ఐశ్వర్య లబ్ధములయ్యే అలంకారాదులన్నీ ఆమె కమరటానికి కారణం. నాయిక ప్రాసాదం (4-32) మణిమయసౌధం విశ్వకర్మ నిర్మితం. ఆ గృహమే నాయకునికి విడిది గృహం. (6-123) కనుక ధారాగృహం (5-88) గృహారామం దీర్ఘికలు (5-89) సర్వం సంగృహీతమైనది. వయస్యలు స్రగ్విణీ - ఏకావళులున్నారు. గోద గాంధర్వ ఖని (5-145, 19)

ఇలా భరతముని నిరూపించిన శృంగార రస సామగ్రిని నిష్పన్నం చేయడంలో కవి కృతకృత్యుడైనాడు. ఈ నిరూపణ సహజ సంసిద్ధం తప్ప శాస్త్రం కోసం కాదు.

ఉద్దీపన విభావాలు

గోదాదేవి వాక్కులు, చేష్టలు, దశావస్థలు, లీలా విలాసాలు - భగవత్కళ్యాణ గాథలు విన్న గోదకు 'ప్రాగ్జన్మ సంస్కారమున నతని గవయు వాంఛ' జనించినది.

రతిస్థాయి

చెలికత్తెలు పాడిన పాటలు విని యాక్షేపించిన తీరంతా (5-41, 54) ''అనుస్మృతి''

'అభినయ కువలయ శ్యామ కోమలమైన (5-61) పద్యంలో గుణకీర్తనం, ప్రలాపం, తాను సత్యనని తెలిపిన పిదప 'సోలిపోవటం' (5-76) జడత 'నఖముఖోక్షిత' - (5-60)లో ఉద్వేగం - వ్యాధులన్న వ్యభిచారులు ధ్వనితాలు. అలాగే స్వభావజాలైన లీలా విలాసాదులు కూడా కవి కథా ధోరణిలో సహజంగా నిష్పన్నం చేశాడు. 'తదవతారానుమేయ కథా సుధానుకలిత - లీలానుకృతుల వర్తిలుచునుండి' (5-37) పద్యంలోని 'లీల' నాయికాలంకారాలైన ఏబదిలో నొక భావం. లీల అంటే మాల్య - భూషణ - అనులేపనాదులచే భర్త రూపగుణ చేష్టాదుల అనుకరణం.

*''అంగైః వేషైః అలంకారైః ప్రేమభిర్వచనైరపి*
*ప్రీతి ప్రయోజితైః లీలాం ప్రియస్యానుకృతిం విదుః*
*యథా ''మృణాల వ్యాళవలయం వేణీబంధకపర్దినీ*
*హరానన కారిణీ పాతు 'లీల'యా పార్వతీ జగత్''*

(సాహిత్య దర్పణం 3వ పరిచ్ఛేదం)

తామరతూళ్ళనూ, త్రాచు పాములనూ అలంకరించుకొని జటాబంధనంతో శివుని లీలగా అనుకరిస్తున్న పార్వతీ దేవి రక్షించుగాక.

'పర్జనీ లేశ పూర్ణసౌభాగ్యదాంగ, ధూతి చకచక లీరెండ తోడమారుమలయ, నిడు వెంట్రుకల గుంపుమలచివైచి - వేగఁ దడియొత్తి' - (5-89) పద్యంలో విచ్ఛిత్తి ధ్వనితమౌతున్నది. అంటే కాంతి పోషకమైన స్వల్పాలంకరణం.

*''అథ విచ్ఛిత్తిః స్తోకాప్యాకల్పరచనా, విచ్ఛిత్తిః కాంత పోషకృత్*
*యథా - స్వచ్ఛాంభస్స్నపన విధౌత మంగం, ఓష్ఠ స్తాంబూల ద్యుతి*
*విశదో విలాసినీనాం'' (సాహిత్య దర్పణం 3వ పరిచ్ఛేదం)*

*''మాలాచ్ఛాదన భూషణ విలేపనానామనాదర న్యాసః*
*స్వల్పోఽపి పరాం శోభాం జనయతి యస్మాత్తు విచ్ఛిత్తిః''*

(నాట్యశాస్త్రం, 22-16)

అన్న శాస్త్రోక్తు లన్వితా లౌతున్నాయి కదా !

వ్యభిచారులు

'నఖముఖోక్షిత' (5-60). ఈ పద్యమంతా ఈ భావాల గూడు - కాళహస్తీశ్వర శివలింగం పైన అల్లిన అందమైన సాలీని పటం.

ఆలస్యం - చపలతలు, రమణీయంగా ధ్వనిస్తున్నాయి. భావుకులు విచారించాలి.

'అట్టి మురారి కప్పుడనన్గై' (5-80) మరణవాంఛ - (పూర్వరాగం)
అది యొండె (5-81)

కామిని మేఘరంజి మదుగర్వమడంతు (5-154) మోహం. భ్రమర గీతిక మాయ - (5-147) ఉన్మాదం.

''కుముద సరస్సుటీ'' (5-150) అశ్రువు

శ్రీపతిమీది గీతములు (5-153) వైస్వర్య స్వేదాదులు. ఒక రమణీయ సృష్టి ఇదంతా.

> ''శృంగార ఏవ మధురః పర ప్రహ్లాదనో రసః
> తన్మయం కావ్యమాశ్రిత్య మాధుర్యం ప్రతితిష్ఠతి.'' (ధ్వన్యాలోకం)

అన్ని రసాలు ధ్వనితాలు కావలసిందే. ఐనా శృంగారం కావటం పరమౌచిత్యం. మాధుర్య పరిరక్షణ కారణంగా భావాలు రసానికి వ్యంజన సామగ్రి కావాలి.

దీనికి సాధనం గ్రామ్యత్వపరిహరణ. నిగూఢ సుందరంగా వర్ణిస్తే ఈ దోషం పరిహృతమౌతుంది. సంభోగ వర్ణనవల్ల సహృదయుని ఆస్వాదన విధ్వస్తమౌతుంది. కనుకనే

> ''శృంగారాదే రపి ఫల భూమా వవర్ణనీయ తైవ
> పూర్వభూమౌ తు ప్రశాంత వాహితా సంస్కారాత్.''

ధ్వన్యాలోక మీ సిద్ధాంతం చేయక తప్పలేదు. సంభోగ పూర్వ వర్ణన ద్వారా ఫలితం ధ్వనితం కావాలి. గ్రామ్యత్వోదాహృతి కావ్య ప్రకాశాదు లుదాహరించాయి.

> ''మృగ మదము మించు తములంపు టిరులు, మోవి
> దళముగా, సాగరు హసంతి వెలుగ, సౌధ
> శిఖర వాతాయనాగతాచిర రుగంశు
> నత దృగవరోధముల తోడ నగిరి నృపులు'' (4-35)

అన్న వర్షర్తు వర్ణనలో నృపదంపతులు ఆలంబన విభావం. ఉద్దీపనం వర్షం. వీటీచర్వణం, ఏకాంత ప్రదేశం సాగరుహసంతి.

అనుభావాలు - అవరోధ నత దృక్కులు (మెరుపు మెరిస్తే అంతఃపురాంగనలు భయపడి చూపులు క్రిందకు మరలించారు) దీనిచే త్రాసమన్న వ్యభిచారి ధ్వనిస్తున్నది. ఇది శృంగార రస స్వరూపం.

ఇది భగవంతుడు చేసిన వర్ణన. ఇక్కడ విభావాలు మానవులు. కవి నిరూపించిన విభావాలు దివ్యులు. కనుక దానికంటె నిది మేలుగా ఉండాలి కదా. రస భంజక హేతువులు చెబుతూ పంచమ హేతువుగా వృత్త్యనౌచిత్యాన్నుదాహరిస్తూ ధ్వని కారుడన్నాడు. నాయిక సంభోగాభిలాషను వ్యక్తం చేయటమే ఈ అనౌచిత్య మంటూ దాన్ని భంగ్యంతరంగా రమణీయంగా ధ్వనించాలి తప్ప వాచ్యం చేయరాదన్నాడు.

'సహ్యకన్యాతటోద్యాన' - (కావ్యాంతం) పరమేశ్వరీ పరమేశ్వర సంభోగాన్ని వర్ణిస్తా డా మహాకవి !

విరహవేదనంతా నాయికా ముఖంగానే నిరూపించాడు. భగవంతున కుండదు కనుక విప్రలంభ పరాయణత్వం లోకపాలనకు విరుద్ధం. పైగా ప్రకృత్యనౌచిత్యం. దివ్య ప్రకృతి యైన నాయకునికిది కూడదు కనుక విరహం నాయికా గతంగానే నిరూపించాడు మహాకవి. ఒక మహానంద స్థితిని వాచ్యం చేస్తే అంతకంటె అనౌచిత్యం లేదు. నాయకునిలో లీనం కావటం ప్రస్తుత శృంగార రస మాధుర్యం. కావ్యం దీనితోనే ముగిసింది.

'జగముల పాలించుచున్నవాడు' - ఈ వాక్యం భరతవాక్యం. ఆమె కోరిక నామెకు ప్రసాదించాడు. తెల్లవారింది. మరలా లోకపాలన. మరలా ఆర్త రక్షణ, ధర్మ పాలన అవతారగాథలే. ఈ వృత్తమే సృష్టి. కావ్య ప్రారంభం సృష్టి పూర్వావస్థ. మహానారాయణ తత్త్వం. అక్కడ కథనులీనం చేసి ఆయన లోక రక్షణ యన్న నిత్యోద్యోగిత్వంలో కథనులీనం చేయటంలో కావ్య వృత్తం సృష్టిగా ధ్వనిస్తున్నది.

ఇది సాహిత్య సమరాంగణ సార్వభౌమ రచన.

9

నవ్యత : విద్వత్సభారాయలు శబ్దం నుండి రసం దాకా నవ్యతనే సమాదరించాడు.

1. శృంగారాని కంగంగా ప్రతివాడూ యుద్ధవీరాన్నే సంఘటిస్తే ఇక్కడ అలా చేయలేదు. ఇది సాహితీ సృష్టిలోనే అపూర్వారంభం కదా ! ఇంతేగాక వాటిని శాంత రస భేదాలుగా చూపక స్వయంస్థితి కల్పించటం ధ్వన్యాలోక మతాన్ని అన్యథాకరించటం కాదు కానీ ఈ స్వయంస్థితి ఉండే అవకాశమూ ఉంటుందని ప్రదర్శించటం.
2. విక్రమోర్వశీయంలో నాయిక దివ్య. నాయకుడు మానవుడు. ఇక్కడ దానికి వ్యతిరిక్తత. ఇది ఆలంబన విభావ నవ్యత.

3. ఉద్దీపన విభావ సంగ్రహణంలో ఆముక్తకవిది 'మురారేః తృతీయః పంథా' తెగలోది. సామాన్యంగా వెన్నెల, మలయానిలం, మామిడి పూత, చిగురాకులు, కోకిల ఇది బారంబాట. ఈ కావ్యంలో ఇవి మందులోకి లేవు. దీనికి బదులు కాలాన్నే ఉద్దీపనగా వర్ణించటం కావ్య జగత్తులోనే అపూర్వం. (చూ : 5-84, 85,86,37)

ఆమె దివ్యాదివ్య. ఆమెకు దేశమే కాదు. కాలం కూడా ఉద్దీపనమే. అతడు కాలస్వరూపుడు. దేశమాతనికి శరీరం. జనులూ శరీరమే. ఈ మత దర్శనం రాయల రస దర్శనానికి భూమిక. భావనా సౌకుమార్యమున్న చిత్తమున కేది ఉద్దీపనం కాదు!

''శేఫాలికలు విచ్చాయి. ఆమె మూర్ఛపోయింది. ఇప్పుడు కోడి కూసింది. ఆమె ఏమౌతుందో,'' ఈ శ్లోకం సాహిత్య దర్పణంలో మరణమన్న దశకు - భావాని కుదాహరించింది. ఇది ఉత్తమ ప్రకృతి లక్షణం.

4. ఇతర కవులుద్దీపన విభావ దూషణ - ఉపాలంభనమని చేయిస్తే ఆముక్తకవి స్పృశించనే లేదు. పైగా ఆలంబన దూషణ చేయించాడు అవతార గాథాక్షేపణమంతా - వ్యాజనిందగా చేసినదంతా ఇదే. దేశకాలాల కాత్మ స్వరూపుడతడే కనుక వానినే ఆక్షేపించాలి కాని అచేతనమైన ప్రకృతిని దూషించి ప్రయోజనమేమిటి ? ఇంతకంటె పరమౌచిత్యం లేదు. 5-41 నుండి 54 దాకా ఈ మధురోపాలంభనమే.

ఈ కావ్య శృంగార మింత నూత్న రమణీయం.

## అంగాంగి రస సమ్మేళనం-10

పూర్వ కథల్లో రసం వీరము కదా. అక్కడ అంగిరస ప్రసక్తి ఎలా గన్న ప్రశ్నకు సమాధానమేమిటి ? అంటే ఏకనాయకత్వసూత్రం వల్ల నాయకుని ఉద్దేశానుసారంగా కథను ప్రవర్తింపచేసుకుని అందులో ఫలితాన్ని పొందటం సర్వత్ర ఉన్నదే. ఆ ఫలం శృంగారం. కాక పూర్వ కథల్లో అంగిరస సూచనలున్నాయి. మణి గృహానుగ్రహంలో గోదా కథ ధ్వనించటం లేదా ? కనుక పూర్వ కథలన్నీ ఆయన నిత్యోద్యోగిత్వానికే ఆయన జ్ఞాన శక్తిబలాదులు. దీనజన సముద్ధరణలోని అయన దయాలక్షణం. ఈ సామగ్రినంతా గోద విన్న కథలుగా కవి అతుకు పెట్టటంలో కృతకృత్యుడైనాడు. ఆయన కళ్యాణగేయాలు విన్నందువల్ల కదా ఆమె కాయనపై ప్రేమ జనించింది? రాక్షసుని సైతముద్ధరించిన ఆ మహాకృపకు అంతం లేదు. ఇది మతం చెప్పిన సౌశీల్యమన్న కళ్యాణగుణం. మూడు కథల్లో ఇదే స్పష్టపడ్డ విషయం. కనుక నాయకుని లోకోత్తర కర్మను వీరంగా నిరూపించి దానికి నికటఫలంగా అద్భుతం నిరూపించి, పార్యంతిక ఫలంగా శృంగారాన్ని నిరూపించటంలో కవి ప్రతిభ భూనభోంతరాళం నిండిపోతున్నది.

తదవతార కథా సుధాను కలిత లీలానుకృతుల వర్తించినదన్నచోట ఈ నిర్మాణ సూత్రం వ్యక్తం చేయబడ్డది. (5-37) ఇక్కడ అవతారమంటే అర్చావతారం. ఆయన కథలే పూర్వాశ్వాస కథలు. ఇందుకే విష్ణుచిత్తుని కంటె ఇటీవల నున్న యామునాచార్యుని అతనికి పూర్వుడుగా నిరూపించాడు. ఇది ఇలా చెప్పకపోతే గోదాదేవి ఆ కథ వినటం తటస్థించదు కదా!

అవతారికలోని పద్యాలు మొదటి రెండూ భగవంతుని నిత్య విభూతికి సంబంధించిన శృంగార వర్ణనలు. అతడే సృష్టించి నిత్య విభూతిలో అవతరించి ధర్మ రక్షణ చేస్తూ వీర రసావతారమై తిరిగి మరలా నిత్య విభూతిగా సృష్టినంతా పరిణమింపచేసి నిత్య శృంగారి కావటమే ప్రబంధ ధ్వనిగా ప్రారంభాంత పద్యాలు నిరూపిస్తున్నవి.

కథలో నాయకు డెక్కడ కన్పించినా, స్వప్నంలోనూ, భార్యా ద్వితీయుడై కన్పిస్తున్నాడు. యామున కథకు శ్రోత దేవి. వక్త నాయకుడు. ఇందువల్ల అంగిరస స్ఫూర్తికి నష్టం లేదు.

''రసాలంబనాశ్రయయో రనుసంధాన మంతరాంతరా న చేత్ దోషః'' అన్న రస గంగాధర సూత్రానుసారంగా ఆలంబన విభావానుసంధానం కథలో ఎడనెడ కన్పిస్తే రస దోషంకాదు. కనుక వర్ణనల్లో సైతమీ లక్షణం కన్పిస్తుంది.

'ఒండుపయి దాలిచి కంకణధ్వనితో నదులు సముద్రంలో పతనమైన వన్న వర్ణనలో యోగనిద్రపోయే హరిని ఉరుము మోతకు భీతయైన భూదేవి కౌగిలించుకోవటానికి చాచిన హస్తం' లాగా ఉన్నదన్న ఉపమాన పరమార్థం శృంగారాంగిత్వ ధ్వని తప్ప అన్యంకాదు.

ఇలాంటి వర్ణనలు కావ్యంలో ఇరవై దాకా ఉన్నాయి. కనుక నిత్య ద్వంద్వ స్ఫూర్తి కావ్యంలో అంగిరసాశ్రయంగా కవి సంఘటించటం ద్రష్టవ్యం. భారత యుద్ధ పర్వాల్లో శాంత రస స్ఫూర్తి ఎలాగంటే నాయకు డెక్కడ కన్పించినా విరక్త చిత్తునిగా కన్పిస్తున్నందువల్లనని సమాధానం. అలాగే ఇక్కడా.

అంగరసాలు సాధనగా, అంగిరసం సాధ్యంగా నిరూపించటమే 'వినిర్మాణం.' చైతన్య సంప్రదాయంలో గోపికా కృష్ణ శృంగారం మధురభక్తిగా నిరూపించిన అలంకార గ్రంథాలు. 1. రూపగోస్వామి ఉజ్జ్వల నీలమణి 2. మధుసూదన సరస్వతి. భక్తి రసాయనం. ఈ దృష్టితో మధురభక్తి అనవచ్చునా! రూపగోస్వామి - మధుసూదన సరస్వతులు రాయల కర్వాచీనులు కనుక వారి వాదంతో ఆముక్త మన్వయించటానికి వీలులేదు. అభినవ గుప్త - జగన్నాథాదులు భక్తిని రసంగా అంగీకరించలేదు. కనుక మధుర భక్తివాదం ప్రస్తుత మన్వయించదు.

2. సూచ్యార్థ సూచన సంప్రదాయానుసారంగా పీఠికలోని

'శ్రీకమనీయ - సిరినొక్కప్పుడు' వంటి పద్యాల్లో శృంగారమే సూచ్యం. 'ఎన్నిను గూర్తునన్న' పద్యం కేవలం శృంగార రస సూచకమే.

3. పూర్వ వైష్ణవాచార్యులీ కథలో శృంగారమే దర్శించారు.

''భోక్తుం తవ ప్రియతమం భవతీవ గోదే, శృంగారవంతి హృదయం గుర వస్త్యదీయః.'' (గోదాస్తుతులు.)

4. గోదాదేవి వ్రాసిన 'నాచ్చియార్ తిరుమొళి'లోని 140 పద్యాలూ ఆమె విరహాన్ని వర్ణించాయి తప్ప భక్తి కాదు. ఆమె గోపికలాగా పరకీయ కాదు. భగవంతుని భర్తగా అభిలషించింది. ఈమె స్వకీయ. ఇందుకే కళ్యాణం వర్ణితం కావలసి వచ్చింది. గోపికా కథల్లో ఇది లేదు.

''సకియా ! తన శ్రీపాదాబ్జంతో శ్రీపతి నా పాదాన్ని
సన్నెకల్లు మీద త్రొక్కించినట్లు కలగన్నాను''. (తిరుమొళిలో)

ఇదొక పద్య భావం. ఇది భాగవత మార్గం కాదు.

వైవాహిక మంగళ వర్ణనమంతా రసము శృంగారమునే నిరూపిస్తున్నది. కనుక మధుర భక్తివాదం కుదరదు.

## అష్టాదశ వర్ణనలు

''నిర్మాణేయది మార్మికోఽసి నితరా మత్యంత పాక ద్రవన్
మృద్వీకా మధుమాధురీ మదపరీహారోద్ధురాణాం గిరాం
కావ్యం తర్హి సఖేః సుఖేన కథయ త్వం సమ్ముఖే మాదృశాం
నో చేత్ దుష్కృత మాత్మనో కృత మివ స్వాంతాత్ బహిర్మాకృథః''

(రసగంగాధరం)

(నీవు కావ్యనిర్మాణ మార్మికత తెలిసిన వాడవైతే ద్రాక్షామాధుర్యమద పరిహారం చేసే కావ్యం వ్రాస్తే, సఖా! సుఖంగా విన్పించు. లేదా చేసిన పాపాన్ని దాచుకొన్నట్లు దాచుకో. బయటపెట్టకు.)

ప్రథమాలంకారికుడు భామహుడు - సర్గబంధ విషయంగా మంత్ర దూత - ప్రయాణ - అజ - నాయకాభ్యుదయాలన్న వర్ణనలు, పంచసంధులుండాలన్నాడు. పంచసంధులకు ప్రతీకలుగా పంచవర్ణనలు చెప్పటం గమనార్హం.

తర్వాత వచ్చిన దండి మొదటిసారిగా 18 వర్ణనలను చెప్పిన పండితుడు.

''నగరార్ణవశైలర్తుచంద్రార్కోదయవర్ణనైః
ఉద్యాన సలిలక్రీడా మధుపాన రతోత్సవైః

*విప్రలంభైః వివాహైశ్చ కుమారోదయ వర్ణనైః*
*మంత్రద్యూత ప్రయాణాజి నాయకాభ్యుదయైరపి''*

(కావ్యాదర్శము 1-16,17)

ఈచివరి వాక్యం భామహుని వాక్యమే. తర్వాతి వారింకా పెంచారు. ఆలంకారికులిలా నిరూపించటంలో తాత్పర్యమేమిటి? నాటకంలో పంచసంధులు - సంధ్యంగాలు దేనికన్న ప్రశ్నకు సమాధానంగా 'అభినవ భారతి' అన్నది.

''ఏతే చ (సంధిసంధ్యంగాని) విభావానుభావ వ్యభిచారి రూపా ఏవ. న తు తదతిరిక్తం జగతి కించిదస్తి. ప్రయోగే ప్రయోగోజ్జ్వలత్వోపయోగాయ తూపలక్షణ త్వేనైకవింశతి రిత్యుక్తం కవేర్మార్గం ప్రదర్శయితుం'' - (అభినవ భారతి 196 అధ్యాయం)

సంధి సంధ్యంగాలు రసాధారమైన విభావాలు. అనుభావాలు- వ్యభిచారులు. కావ్యం రసమే ప్రాణంగా కలది. కనుక రసప్రయత్నమే కవికి కర్తవ్యం. కవికి మార్గోపదేశంగా భరతుడు సంధులను నిరూపిస్తే - ఆలంకారికులు కాళిదాసాది కావ్యవిశ్లేషణం ద్వారా, స్వకీయ ప్రజ్ఞాసహాయంతో ఈమార్గం సుగమం చేశారు అష్టాదశ వర్ణనలను చెప్పి.

18 వర్ణనల్లో సరిదృతు గిరివర్ణనలు - సూర్యచంద్రోదయాలు - ఉపవన - జలక్రీడలు, మధుపానం, వియోగం - శృంగార రసవిభావ ప్రపంచమే. రతోత్సవం- కుమారోదయం శృంగారం కేవల ప్రణయవ్యవహారం కాక- గృహస్థాశ్రమ సంబంధంగా నిరూపించిన అద్భుతాంశం. అదిలేకపోతే గాంధర్వ వివాహాశ్రితంగానే శృంగారం నిరూపింపబడేది. ఆర్షవివాహ ప్రసక్తి ఆ తుదివర్ణనతో సంఘటించటం భారతీయాలంకారికుల దృష్టిలో సాంఘిక వ్యవస్థతో సాహిత్యం ముడిపడిన విషయాన్ని సూచిస్తున్నది. అంటే ఈవిషయాన్ని రెండు రకాలుగా దర్శించాలి. 1. రసదృష్టి 2. సామాజికదృష్టి. (దీని వివరాలకు చూ: సాలభంజిక) ప్రస్తుతాంశం ప్రథమం కనుక అదే వివృత మౌతున్నది.

భామహుడు చెప్పిన ఐదంశాలు - వీరరస విభావాదికం. కనుక కావ్యం వీర శృంగార రసాత్మకం. అష్టాదశ వర్ణనలు వీర - శృంగార విభావాదులే నన్నది స్పష్టం.

సాహిత్య దర్పణంలో అదనంగా చెప్పిన మునులు- మునివాటికలు- యజ్ఞాలు - స్వర్గము మొ॥వి. శాంత రసవిభావాలు. విశ్వనాథుడు శాంతరసాన్ని అంగీకరించిన వాడు కనుక దాని కాశ్రయంగా ఈవర్ణనలను సంఘటించటం భావించాలి.

అలంకార శేఖరం కావ్యనాయక సంబంధమైన సర్వసామగ్రిని లక్షణంలో చేర్చటమూ

ఈసందర్భంలో గుర్తించదగ్గదే. ఆసామగ్రి గజాశ్వాదిక వర్ణనలు - (చతురంగ బలాలు) ప్రాచీన కావ్యనాయకుడు రాజుకావటం వల్ల చేర్చాడు.

ఈదృష్టితో ఆముక్తంలో అష్టాదశ వర్ణనలు సమన్వయించుకోదగ్గవి.

నగరవర్ణన - శ్రీవిలుబుత్తూరు - మధుర - శ్రీరంగం

ఋతువులు - గ్రీష్మ - వర్ష - శరద్వసంతాలు.

విప్రలంభం - గోదాకథ

పరిణయం - గోదాశ్రీరంగేశ్వరుల వివాహమే కావ్యాంతం.

కన్యావర్ణనం - గోదాదేవి వర్ణన ( కన్యాంగ సౌందర్యకథనంబు అప్పకవి చెప్పినది)

ప్రయాణం - విష్ణుచిత్తుడు మధురకు పోవటం.

యుద్ధం - యామునుడు - విష్ణుచిత్తులు చేసిన మతస్థాపనకై వాదాలు.

అలంకార శేఖరానుసారం -

రాజు - పాండ్య చక్రవర్తులు.

రాణి - రెండవ పాండీని భార్య

నది - కావేరి (6-92,93)4-101,4-183

సరస్సు - 4-15, శరద్వర్ణనం

ఉద్యానవనాలు - శ్రీవిలుబుత్తూరులో తోటలు.

గజాశ్వాదికం - 2-24,49

ఈవర్ణనల కౌచిత్యం ప్రాణం తప్ప - రసాశ్రయణీయత్వం ధ్యేయం తప్ప వర్ణనల పట్టిక కాదంటూ రాజశేఖరుడన్నాడు.

*''మజ్జన పుష్పాపచయన సంధ్యాచంద్రోదయాది వాక్యమిహ*
*సరసమపి, నాతిబహుళం, ప్రకృతి రసాన్వితం రచయేత్*
*యస్తు సరిదద్రి సాగర పుర తురగ రథాది వర్ణనే యత్నః*
*కవిశక్తి ఖ్యాతి ఫలో వితతధియాం సోమనస్య ఇహ''* (కావ్య మీమాంస)

ఈ మాటలు అపరాజితవని రాజశేఖరుని వ్రాత.

సంధ్యాచంద్రోదయాది వర్ణనలెంత అందంగా ఉన్నా ప్రకృత రసాన్వితాలు కాకపోతే వ్యర్థమని సారాంశం.

కాబట్టి రాయలవారి వర్ణనలోని ఔచిత్యరహస్యం నిర్ధారితం కావాలి.

వేణీసంహార నాటకంలో సుయోధన భానుమతీశృంగారం ప్రకృతి రసానుగుణం కాదని - సంధిప్రయోజనం తెలియక 'విలాస' మన్న సంధ్యంగాన్ని సంఘటించాలన్న భరత మతానుసార మలా చేయటం రసదోషమని -

*'సంధిసంధ్యంగఘటనం రసాభివ్యక్త్య పేక్షయా*
*న తు కేవలయా శాస్త్ర స్థితి సంపాదనేచ్ఛయా'* - (ధ్వన్యాలోకం 2- ఉద్యోత)

సంధిసంధ్యంగ ఘటన రసాపేక్షయా జరగాలి కాని శాస్త్రస్థితికోసం కాదని సిద్ధాంతం చేశాడు.

'మొలక చీకరటి జలజల రాల్పగా రాదె' -

అన్న పాండురంగ మాహాత్మ్యం లోని వారవనితావర్ణన అస్థానపతితమై అనుచితమైపోయినది. ఆపద్యం చాలాఅందమైనదే. కాని కాశిలో దీనికి స్థానమేమిటి? ఇతర నగర వర్ణనమైతే చాలాగొప్ప పద్యమయ్యేది. మహాపుణ్యక్షేత్రంలో వారవనితకు స్థానంలేదు. కనుక రత్నహారమే కావచ్చు. కంఠం దానికి స్థానం తప్ప అన్యాంగం కాదుకదా.

కాని రామకృష్ణుడే పర్వతారణ్య వర్ణనం చాలాసొగసుగా చేశాడు. ఆసొగసునకు హేతువు. పద్యరచన - భావ - సౌందర్యములే కాక సందర్భచారుత్వము. లోపాముద్ర ప్రయాణంలో నివారించి ఉత్సాహశక్తులను కల్పించటం కోసం చేయటంవల్ల అందం వచ్చింది. ఇదే కావ్యమీమాంసలో అపరాజిత సిద్ధాంతం.

ఈదృష్ట్యా ఆముక్తంలో నగర వర్ణన.

మధుర పాండ్యదేశ రాజధాని రాజునకు స్థానం కదా । ఆయన స్వరూప స్వభావాలు పరిపాలనాదులు చిత్రించాలి. దీనికాధార సామగ్రి వప్రము - పరిఖ - చతురంగ బలాలు - చాతుర్వర్ణ్యం. వీని చక్కని ఉనికి రాజు ధర్మపాలనకు వ్యంజక సామగ్రి. ప్రత్యక్షంగా రాజవర్ణనమొకటి, పరోక్షధర్మపాలన మొకటి. ఈరెండు రీతుల్లోనూ వర్ణనముండాలి. అతడు రాజధర్మాగ్రేసరుడు (2-39). అతని కీర్తి బంగారు కొండపై ముద్రితమైనది. అగస్త్యుని ఆశీర్వాద బలం కలవాడు విభీషణునకు మిత్రుడు. మఘవుని మకుటము మొట్టగల మంత్రి భూతాధిపతి. అతని కత్తి దెబ్బ తిమింగల వాల పతనం వంటిది. అతని ధర్మపాలనలో చాతుర్వర్ణ్యం సురక్షితమైనది. ఎవరి వృత్తులు వారు నిర్వహిస్తున్నారు. బ్రాహ్మణులు చిర సముపాశ్రితాగ్ని తడిసి నశిస్తుందో అన్నట్లు దానధారను హస్తం చాచి స్వీకరించరట. రాకుమారులైదుపది సేయరు. వైశ్యులు దానకర్ణులు. కృషీవలులు పంటలు తామర తంపరగా పండిస్తున్నారు.

మనుచరిత్రాదుల్లోని ఈవర్ణనలు వేరు. దీనిబాస వేరు. అచటి బ్రాహ్మణులు బ్రహ్మకంటే

పండితులు. ఇచటివారు అప్రగ్రహీతులు. అగ్నిమూర్తులు. బ్రాహ్మణుని అరచేత అగ్ని ఉంటుందని శాస్త్రవచనం. నిత్యాగ్ని జపహోమతత్పరత కారణంగా. వైశ్యులు కుబేరునకు 'మును సంచి మొదలిచ్చి మునుపదక్షులు' (మను) ఇక్కడ దానకర్ణులు ఈభేదంచేత రాయలు సాధించినదేమి?

వర్ణాశ్రమాల యథార్థ స్థితి ఏమిటి? దాని ఉనికి కర్థమేమిటి? పరిపాలన దానిని రక్షించవలసిన అవసరమేమిటి? కనుక రాజైన కవి దాని యథార్థస్థితిని వర్ణించటం రాజైనవాడు రక్షించటం కర్తవ్యం.

*''ధరణి వర్ణాశ్రమముల కాధారమైన*
*యట్టివిద్యల రక్షించునట్టి యధిపు*
*డఖిల వర్ణాశ్రమములు వారాచరించు*
*పుణ్యమాఱవ వాలుదాఁ బొరయునంద్రు''* (ఆంధ్ర కామందకం - 2. అ)
''నరవర్ణముల తప్పు సరణు లుడిపి'' (ఆముక్త 4-270.)

ఆనాటి వ్యవస్థలో ఆధ్యాత్మిక విద్యాసముపార్జనం చేసినవాడు విప్రుడు. (వి+ప్ర - రెండూ ఉపసర్గలే- కనుక చాలా గొప్పవాడు) వ్యాపారంలో ధనసముపార్జన వైశ్యుడు - వారార్జించు నదివ్యవస్థాగతం కావటంకోసమే - చేయటం కోసమే ధర్మపాలన ఆవశ్యకత. రాయలు చక్రవర్తియై వ్యవస్థా పరిరక్షణ చేసినవాడు కావటం వల్ల ఈ విధంగా వర్ణించగలిగినాడు.

ఈ మహానగరంలోని అంగళులలో రత్నరాసు లమ్ముతున్నారంటే ఆనగర వైభవం చెప్పేదేముంది? ఇందుకే ఆనాడు విజయ నగర దర్శనం చేసిన 'పేయస్' - ''మన రోము నగరం కంటె ఎంతో సంపన్నమూ - సుందరమూ - విశాలమూ'' నన్నాడు. ఈమధుర విజయనగరమే. అంటే ఆదర్శ రాజధాని. రాజధాని నగరాని కది ప్రతీక. అష్టాదశ వర్ణనలో నగర వర్ణనం ఆదర్శ ప్రభుత్వానికి ఆలంకారిక ప్రతిమ (ఈస్టటిక్ ఇమేజ్). కనుక అదొక ప్రత్యేక నగరం కాదు.

ఎల్‌గ్రెకో - అన్న పశ్చిమదేశ చిత్రకారుడు స్వనగరమైన ట్రెనిడాడ్‌ని చిత్రించాడు 'అది నగర ఛాయాచిత్రం కాదు' అది అతని భావరూపమని విమర్శకుల అభిప్రాయము. కానీ మనసాహిత్యంలోని నగర వర్ణనలు యథార్థరూపాలకు చిహ్నములేకాక ఆదర్శ రాజ్యప్రతిమలు. భావమూర్తులు. కల్పితాలు కాదు. ఇందుకే వైశాలి - కుశీనగరం వంటి నగరాలను బౌద్ధశిల్ప క్షేత్రాలుగా భావించి శిల్పంగా మలిచాడు. అయోధ్యాద్వారకలు ఆదర్శరాజధానులే కాక పుణ్యక్షేత్రాలు. శరీరమూ దేవాలయమూ సమానభావనచేసి - ఈనగర వర్ణనగా మలిచిన తీరు 'లోనారసి మేలునా' దగినట్టిది. (వివరాలకు చూ: శ్వేతఛ్ఛత్రం)

ఆమహారాజు పాలనలో దేశం సుసంపన్నమైనది. సంపదతో పాటు భోగతృష్ణకు

నగరమాలవాలము. కనుక అచటి వేశ్యలు సురత వైయాత్యనిధులు ( ఒక్క విజయనగరంలో వేశ్యల నుండి వసూలు చేసిన సుంకం నగర రక్షక భటుల జీతాలకు సరిపోతుందని చారిత్రకులన్నారు) పుష్పలావికలన్నారు. వారు పతికికైదువలందించు రతీదేవులై పూలమ్ముతున్నారు. వారి విలాసములు వచోలాలిత్యములు. కనీవినీ తృప్తి పొందటానికై జనం వారిచుట్టూ మూగుతున్నారు. చిత్రచిత్రంగా భాషిస్తున్నారు - కామతృష్ణవశంవదులై ఆనగరోపకంఠవనాలలో శుకపికాదులు కంతుసైన్యం. కనుక 'కామినీ కాముకులకేలా ఎడత్రెవ్వకంతుకలవోన్మాదం బులాప్రోలునన్'.

దేశరక్షణ చక్రవర్తి కార్యం. అందుకని కోటలూ - గోడలూ- చతురంగ వర్ణనలూ ప్రసక్తాలైనవి. ఇది చక్రవర్తి పాలనకు ప్రతీక. కనుక ఆనగర వప్రము - ''త్రిపురాసుర విజయానంతరం శివుడు దిగజార్చిన పినాకం'' ఈఅలంకారం శత్రుదుర్భేద్యతను వ్యంజిస్తూ చక్రవర్తి పరాక్రమంలో లీనమౌతున్నది.

మధురా నగర

''కోట కొమ్మల పంక్తి గగన
మండలశ్రీకి సంపంగి దండల''ట్లున్నది
పరిఖ = భోగవతి (2-6)

శ్రీరంగం 'విరజ' అన్న నామాంతరంగల కావేరీ ఒడ్డున నున్నది. అదే పరిఖ. (కవి అనలేదు, అనకూడదు కనుక)

సప్తకాంచన ప్రాకారాల శిఖరాలు 'పాపాళి' అన్న భృంగాలకు సంపంగి పూలు.

ఇది భూలోకవైకుంఠం. పరమాత్మని నగరం. మధుర అపరమేశ్వరుని ప్రతినిధి కాని ( రాజు వైష్ణవుడింకా కాలేదు కనుక) రాజునకు స్థానం. కేవల భౌతిక సుఖాల కాలవాలమైన నగరంగానే మిగిలిపోయినది. (విష్ణుచిత్తుని రాకతో రాజు రాయలవారు కాలేదు. ఈరాజులో రాయలలోని చక్రవర్తిత్వమున్నది. రాయనిలోని 'విష్ణుభక్తి' ఇంకా అతనికి సంక్రమించలేదు. ఇందుకే మధురా వర్ణనమంతా వాస్తవిక విజయనగర భావనా రూపం. వర్ణనల్లో ప్రతిబింబించిన యథార్థవిజయనగర రూపం. ఈవిషయం వ్యాఖ్యానంలో ఇంచుక సూచితమైనది.

## శ్రీవిలుబుత్తూరు

''దేశంబు తెలుగు'' - ఋతువర్ణనల ముఖంగా - మిషగా ఈ **'ఊరు'** మిషగా - ద్వారంగా మహాకవి చేసిన వర్ణనమంతా **'దేశఋణం'** తీర్చుకోవటంకోసమే నన్నంత గాఢ భావబంధురంగా- సభక్తికంగా వర్ణించాడు. ఆవర్ణనల్లో ఒకతాదాత్మ్యమున్నది. కవికి కావలసిన దిదే.

''శ్వశుర మమర వంద్యం రంగనాథస్య సాక్షాత్
ద్విజకుల తిలకం విష్ణుచిత్తం నమామి ''(శ్రీమన్నాథమునులు)

''పంచపాండవులకు పరీక్షిత్తొక్కడే కొడుకైనట్లు పదుగురాళ్వార్లకు జ్ఞానపుత్రిక గోదాదేవి. తమతండ్రులగు ఆళ్వార్ల కంటె బాల్యావస్థయందే అతిశయించిన జ్ఞానభక్త్యాదులు కలదగుట చేత మనసా! నిత్యమూ ఆ తల్లినే స్మరించు.'' ( ఉపదేశ రత్నమాల)

వారిజన్మస్థలం ఆ 'ఊరు'. శ్రీకృష్ణుడు దేవకీ గర్భంలోనే ఎందుకు పడ్డట్లు ? దానికి సమాధాన మక్కడే చెప్పబడ్డది - 'ఊరు' వారికి జన్మస్థలం కావటం వల్ల అదొక పవిత్ర క్షేత్రం. ఆవర్ణనమంతా ఒక దివ్య తానిధి. అక్కడి గృహభిత్తికలపై గజలక్ష్మి బొమ్మలే (1-53) ఆగ్రామ పరిసరాల్లో చుట్టూరా ఉన్న అరటి తోటల్లోని గెలలు - పసుపు పచ్చలై - పచ్చని ఆకుల మధ్యగెలలు - పండ్లచివళ్ళు నలుసుతో- భగవంతుడైన మన్నారుస్వామి ధరించిన బొందుతోమాలెలు - ఈపవిత్ర సౌందర్యపరసీమగా ఆ ఊరు వర్ణితం కావటం ఔచిత్యచారితార్థ్యం. (1-69)

శ్రీవిలుబుత్తూరు చుట్టుపట్ల బంగారు కాంతులీను వరిచేలచే, చెరకుతోటలచే, కలుగుండ్ల వంటి పనసపండ్ల తోటలచే; చెరువులనుండి త్రవ్విన పంటకాల్వల్లో నిద్రించే బాతులు ( అప్పటికి పోర్చుగీసువారినుండి ఈ పక్షులు మన దేశానికి రావటం వల్ల రాయలు వాటిని గ్రహించాడు. ఇదెలాంటి దంటే నాగార్జున కొండశిల్పాల్లో తుహిన స్వర్గశిల ఫలకంలో దేవతలు 'లైరు' వాద్యాన్ని వాయిస్తున్నట్లు చిత్రించటం లాంటిది.)

ఆచెరువు కట్లపై సరసాలాడుకొనే తలారి - కాపుగుబ్బెతలచే ఏదో తెలుగు పల్లెటూరి తనం పండించుకొన్నట్లుంది ( తర్వాత మనవిశ్వనాథ కవిసమ్రాట్టు వచ్చేటంత వరకూ ఈతెలుగు పల్లెటూరి అందం కవితా వస్తువు కాలేదు. 'కూడిమెట్ట పొలాల వికుంఠలక్ష్మి' లాస్యం చేసిందా మహాకవి కావ్యాల్లోనే.)

ఊళ్ళో తోటలు - దొడ్లు - వాటిల్లో పాడుపడ్డ బావులు - అందులో నీరుకోళ్ళ గోల; వానిచేపల వేటల సంరంభాలు - తోటల్లో దిగుడుబావులు. వానిలోని స్నానమాడి ''పొగడపు పాదంబొప్ప నచ్యుత మజ్జనార్థము శయపూజాంబుజములు తడబడే నీళ్ళ కుండలు రొండిన పెట్టుకొని తెచ్చే ద్రవిడాంగనలు - ఇళ్ళముంగిట్లు మధ్యాహ్నంపూట వడ్లారబోసుకుని వాటి కాపలా కోసం గడపల్లో కూర్చుండి పల్లెల నుండి అమ్మవచ్చిన పల్లె పడుచుల కమ్మచెంగల్వ దండలు బేరమాడుతూ - ఆ ఊరి మన్నారుస్వామి కోవెలలోని పెంపుడు లేడి ఆరబోసిన వడ్లు సారెసారెకు బొక్కుతుంటే ఆకల్వదండలతోతోలుతుంటేమెట్లపై పేరుకొన్న పసుపంటుకోగా బంగారు కాంతితో మెరిసే రెక్కలున్న అంచలు వీథుల్లో తిరుగుతూ దేవలోకంలో మందాకినిలోని రాజహంసల భ్రాంతిని

కల్గిస్తు సంచరిస్తూ ఉంటే ఓహో ఆ ఊరి వారిజీవిత పవిత్ర మాధుర్యమెంతగా స్తుతించాడు మహాకవి. ఇదంతా 'చూడికుడుత్తదేవికి' చేసిన కైంకర్యం కాదా!

ఆ ఊరినడుమ పెద్దకోవెల. అందులో మన్నారు స్వామి. ఆయనకూ ఆయన భార్యకూ రెండు రథాలు. అవి మేరు- మంథర సమయాల్లో తూర్యధ్వనులు మ్రోగితే వాటితో -తోటల చెరువుల్లో విహరించే పక్షులు గూళ్ళకు పోతూ ఎగిరేటప్పుడు మ్రోగే పటపట ధ్వనులు - క్రీంకార స్వరాలతో పైకెగరటం - స్వామి భోగార్థం నటించే దేవదాసీ జనం - వారికొప్పులో ధరించిన కమ్మ చెంగల్వ దండల నల్లాడిస్తూ సాయంకాల వాయుసంచారంతో ఆ ఊరు ఊరా? సౌందర్యలోకమా? పవిత్ర ఆశ్రమమా?

అలాంటి ఊళ్ళో పరమ భాగవతులు. వారిలో హరిదళము విష్ణుచిత్తుడు. 'ఆనిష్ఠానిధిగేహం' నిరంతరమూ దివ్యప్రబంధానుసంధానంతో, అతిథుల సంరంభంతో సుడితిరుగుతున్నది. ఆ గ్రామాన్ని భగవంతుడు పాలిస్తున్నాడు. మున్యాశ్రమం కంటె దివ్యంగా ఉంది.

ఒక పరమహంస - ఒక రమణ మహర్షి - ఒక షిరిడీ బాబా ఉన్నప్పుడు ఆగ్రామాలు, నగరాల, మాహాత్మ్యం అక్కడి మానవ జీవితాలకూ వారు కేంద్ర బిందువులుగా ప్రతిజీవిత వ్యాప్తి లోనూ వారి మహత్తే పరిమళించింది. అలా ఉంది ఈ ఊరు.

ఇక్కడ పువ్వులమ్మే వారు పల్లె పడుచులు. కొనేవారు పల్లెకన్నెలు మధురలో పుష్పలావికలు. వారు నెరజాణలు. కొనేవారు వయసు కాంద్రు విటులు. వారిమధ్య నడిచే సంభాషణలు మాన్మథములు. మధురలో వాయుదేవుని నడక రాచనడక.

*'మదగంధ తారతమ్యము యామ్యకలికిఁ ద*
*త్కురులకుం గనబలెఁ గటుము లొరసి'. ( ఆము. 2-38)*

ఏదో హుందాతనం ప్రదర్శిస్తూ విహరిస్తున్నాడు. శ్రీవిలుబుత్తూరులో గాలిదేవుడు వినమ్రమూర్తి. భక్తినమ్రుడై తెలవారుజాముననే వచ్చి - పూజారివలె - కోవెల ధ్వజస్తంభపు బంగారు మువ్వలను గలగలలాడిస్తూ - స్వామికి మేల్కొలుపులు పాడుతున్నాడు. సాయంవేళల స్వామి తులసిమాలల్లోని మకరంద బిందువులాని పణ్యారంపు పుణ్యంపు కంపులాని గుడిలో నటనమున కాయత్తమయ్యే దేవదాసీ జన కబరికా భారంలోని కహ్లార పుష్పాలను చలింప చేస్తూ తాపత్రయం మీటజాలినవాడై ఉన్నాడు. మధురలో పణ్య యువతులున్నారు. వారు సౌందర్య పరసీమలు. కురులు తేంట్లు. చనులు చక్రద్వితయి. చూపులు మీలు. మేనులు అలరుదీగలు. సురత వైయాత్య నిధులు. ఎంతవారినైనా లోగొనగల జాణలు.

శ్రీవిలుబుత్తూరులో దేవదాసీ జనమున్నది. వారు వైష్ణవ స్వాములన్న భక్తికలవారు. ఎవరి

ముఖం చూడకుండు సరాకు కుసుమ బాణున్నైనా కువిటుని చేస్తుంది. కోవెలలో నైవేద్యావసర శంఖనాదానికి త్రిప్పేకడకంటి జిగి ప్రజల గుండెల్లోని మాన్మథాగ్నికి ఆజ్యం. వారి చన్నులే చన్నులు. మన్మథుని మోచేతి క్రింది గుండ్రని దిండ్లు. (మధురలోని వేశ్యాజనవర్ణనల్లోని ఉపమానాలు సాధారణం. ఇక్కడిది కాదు) వారి నాగరకత - నాజూకుతనం - సౌకుమార్యం చెప్పనలవికానిది. నరిగింజనొకటి పల్వరుస తోమటం - పసుపు నిగ్గులు దేరునట్లుగా పసపాడటం. ఆశరీరానికి పట్టిన పసుపు వన్నె, గుడ్డతో ఒత్తి తుడిచినా పోనిది. వీరు సురతవైయాత్య నిధులు కారు. బాసకృతి సెప్ప వలతులు - ద్రావిడ భాషలో కవిత్వం చెప్పగలరట. కనుకనే ఇంద్రుడంతవాడు వారి కొలువున్నకై గ్రుక్కిళ్ళు మ్రింగుతున్నాడు.

మధురలోని తోటలు కృత్రిమోద్యానాలు. విలుబుత్తూరులోనివి సహజమైనవి. మధుర వనాల్లో పికశుకాదులు కంతు సైన్యం కాగా 'ఊరు' లో ఇవి ఉన్నా - 'వలభీనీల హరిన్మణీ పికశుకాలాప భ్రమం బూంచునట్టివి', మాత్రమే. శృంగార రసోద్దీపన విభావ సామగ్రి కాదు. వట్టి పల్లెటూరి పక్షులు.

మధురలోని మదయువతులు గురువక్షోజాలపై కస్తూరీ సంకు మద చందనాగరు పంక మలదుకొని పరిఖలో స్నానం చేస్తే - అక్కడి వారు ఉద్యానంపు లోద్రోవలనేగి బొడ్డున బావుల్లో పస పాడుతున్నారు. మధురలో మానవులు పుష్పలావికలతో కామ సంభాషణలాడుతున్నారు. 'ఊరి' లోని వారు అతిథి సేవలతో తల మున్కలౌతూ దివ్య ప్రబంధానుసంధానం చేస్తున్నారు.

మధుర కామునకు మధురంగా ఉంది. 'ఉదుటు గుబ్బల తల్పుటురము చూచి' - రవిచంద్రులానగర కాంత చుట్టూ పరిభ్రమిస్తున్నారు. ఇక్కడ పరిఖ - వప్రము - అంగళ్ళు - పణ్యయువతులు - పుష్పలావికలు - కృత్రిమ వనాలు - చతురంగ బలాలు - చాతుర్వర్ణ్యం - ఆకసమంటే మేడలు - ఊరిలో నివేమీ లేవు. గ్రామ్య తరుణులు దివ్య ప్రబంధ యుగాస్యలైన ద్రవిడాంగనలు హరి - అభిషేకం కోసం నీళ్ళు తెచ్చుకోవటం కంటె ఏమీ తెలియని వారు. భగవత్సేవలు - కోవెల - భాగవతులు - అతిథిసేవలు - ఇంతే వారి జీవిత పరిధి.

ఇక్కడ కోట - పరిఖ - వంటి నగర వర్ణనలు లేవు. ఎందుకని ? చేసినవారున్నారు.

''మనసా ! నీదయవల్ల ఆళ్వార్లపై భక్తికలిగి సమీపించి విశాలమైన ప్రాకారం మధ్యనున్న శ్రీ విలుబుత్తూరు పేరొకసారైనా ఉచ్చరించే వారి పాదారవిందాలను శిరసా వహిస్తున్నాను.'' (శ్రీ భట్టరు)

ఈస్తోత్రంలో ప్రాకార వర్ణనమున్నది. ప్రాచీన కాలంలో చిన్న చిన్న మండలాలకు ఏలికలైన వారుండే గ్రామాలకూ మట్టి కోట గోడ లుండటం మామూలే. కాని కావ్యమంటే ఔచిత్య పరాకాష్ఠ. లోకధర్మి తనంత లాను కావ్యం కాదు. నాట్యధర్మి సమవేతమైతేనే లోకధర్మి కావ్యమౌతున్నది.

కనుక వప్రపరిఖాదులు రాజసంబంధాలు కనుక రాజధాని వర్ణనలే కావటం ఔచిత్యోపనిషత్తు. కనుక శ్రీ విలుబుత్తూరు భక్త - ఆచార్య స్థానం. మున్యాశ్రమం. నగరం రాచరిక చిహ్నం.

ఈ ఔచిత్య మండిత వర్ణనలే విభావాదులు.

కేవల లోక సామగ్రి విభావం కాదు.

'విభావాది జ్ఞానం నామ ఔచిత్య వివేకః.' (రసార్ణవ సుధాకరం)

ఇందుకని ప్రథమాశ్వాసమంతా ఒక మధు కోశం. ద్వితీయాశ్వాసం కృత్రిమ సౌందర్య విధానం. అది రామాలయం. ఇది కామాలయం. అది బ్రాహ్మతేజస్సంపద. ఇది క్షాత్ర తేజోవైభవం. అది గురు స్థానం. ఇది శిష్యస్థానం. దేని అందం దానిదే. కానీ ఔచిత్య దృక్పథంతో చూచే చూపుండాలి. ఆశ్వాసారంభ పద్యాలే దీన్ని వ్యంజించేటట్లు వ్రాసాడు మహాకవి. 'శ్రీవిలుబుత్తూరు సెలంగు పాండ్య నగరోర్వీ రత్న సీమంతమై!' అని ప్రథమాశ్వాసారంభం, కాగా ద్వితీయం

''ఏ వీటి సతుల పాలిండ్ల పై గంబూర
నవహారముల చిప్ప కవుచు మాంచు''.

ఉర్వీ రత్న సీమంతం కనుకనే రాజు గురుపాదాలను మౌళిని ధరించాడు. ఈ బ్రహ్మ క్షత్ర తేజస్సమన్వయమే ప్రాచీన రాజ ధర్మం. ఆదర్శ ప్రభుత్వమూల ధాతువు.

(చూ: నా శ్వేతచ్ఛత్రం)

ఇది చేసిన రచన ఈ కావ్యం.

కనుక ఊరు వర్ణనమంతా ఆశ్రమోచితంగా చేసి అదంతా విష్ణుచిత్తునిలో పర్యవసింప చేసి అతడు భగవత్ సాధనం కావటంలోని ఔచిత్యాన్ని నిరూపించాడు. మధుర నలా వర్ణించి అదంతా రాజులో లీనంచేసి అతనిని భగవంతుని దయా పాత్రుడు కావటంలోని అంటే భగవంతుని దయావీర రస స్థాయియైన ఉత్సాహానికి కారణం - ఆలంబన విభావంగా నిరూపించాడు. ఇదీ ఔచిత్యమంటే.

## దండయాత్ర

వీరరసానుగుణమైన వర్ణనల్లో ఇది ప్రధానం. ఈ కావ్యంలో యుద్ధవీరం లేదు. యామునాచార్యుని జైత్రయాత్రను వర్ణించకుండా - అంత ప్రచండ యుద్ధాలు చేసిన వాడయ్యీ-తనను తాను కుదించుకొన్న మహాకవి ఇక్కడ విష్ణుచిత్తుని యాత్రా సంరంభాన్ని అంతగా పెద్దచేసి ఎందుకు వర్ణించినట్లు? ఈ కథలో రసం దయావీరం కనుక. 2-94, 95, 96, 97. తిక్కన్నగారు చతురంగ బలాలను నాల్గు భిన్నవృత్తాల్లో వర్ణించినట్లు - లెక్కపెట్టి నాల్గు పద్యాలే వ్రాయటం చిత్రంగా ఉంది.

దాసరికథలో రాకాసి తినగా పొడైన ఊళ్ళు వర్ణనలన్నీ బ్రహ్మరాక్షసుని కుచితములై - అలాంటి వానిని సైతం భగవంతు డుద్ధరించాడు - అన్నవిషయంలో పర్యవసించి అక్కడి రసమైన దానవీరానికి తళుకులద్దుతున్నవి.

దశావతార వర్ణన

అష్టాదశ వర్ణనల్లో ఇది లేదు. కాని మన కవులు దీనిని అదనంగా సందర్భానుగుణంగా చేయటం పరిపాటి కనుక కొంత వ్రాయవలసి వస్తున్నది. రాయలు చేసిన వర్ణనకు మూలకథలోనే ఒక సందర్భం పరంపరయా చెప్పబడుతున్నది. విష్ణుచిత్తుడు పాండీని వైష్ణవుని చేసిన తర్వాత రాజా మహాత్ముని గజారోహణం చేసి ఊరేగిస్తుంటే భగవంతుడు సాక్షాత్కరించాడట. అప్పుడా మహాత్ముడు ఏన్గు గంటలనే తాళాలుగా చేసుకొని భక్త్యుద్రేకంతో స్వామికి మంగళాశాసనం 12 పాశురాల్లో చేసినట్లు 'తిరుప్పల్లాండు', అన్న రచన సాక్ష్యమిస్తున్నది. రాయలు తిరుప్పల్లాండు ననువదించకుండా దశావతార వర్ణన చేసాడు.

శ్రీ వైష్ణవం చెప్పిన పరమేశ్వర తత్త్వం పంచధా విభక్తమైనది. ఈ అవతారవర్ణన ఆ ఐదులోని విభవ తత్త్వ సంబంధం. కావ్య కథను ప్రవర్తింప చేసినది అర్చావతారం. కనుక దానినీ కలుపుకోక తప్పదు - కవికి. పంచమూర్తులున్న పరమతత్త్వ నాయకమైన కావ్యంలో ఈ వర్ణన లేకపోతే ఒక కొరత వస్తుంది. కనుక కవి దీనిని సంఘటించక తప్పలేదు. విష్ణుచిత్తుని పాండీని సభకు పొమ్మని - పయనంబు తూగింపు మని నంబికాన తిచ్చి - విష్ణుచిత్తుడు రాజసభలో అడుగుపెట్టగానే వాని మనస్సు నావేశించి - గెలిపించి మరల తుదకిల్లు ప్రత్యక్షమయ్యే సరికి భాగవతున కొడలు తెలియని భక్త్యావేశం క్రమ్మింది. ఆ ఆవేశమే ఏకాదశావతార వర్ణనకు హేతువు. చేసిన వాని హృదయంలో భావం భక్తి. కాని వర్ణనలన్నీ ధర్మ వీర రసాత్మకాలే. ఇది గుర్తించదగ్గ అంశం. ఆయా విషయాలు వ్యాఖ్యానంలోనే వివరించబడ్డవి కనుక మరలా వ్రాయనక్కరలేదు. అలాగే నాయికా సౌందర్య కథన మక్కడే వ్రాయబడినది.

స్త్రీపాత్రలు

ఈ కావ్యంలో ముగ్గురు భక్తులు. విష్ణుచిత్త, యామున, దాసరులు వారిద్వారా ఉద్ధరించబడ్డవారు ప్రథమ - ద్వితీయ పాండ్యులు, బ్రహ్మరాక్షసుడు.

ముగ్గురు స్త్రీలు (1) విష్ణుచిత్తుని భార్య (2) రెండవ పాండ్యరాజు భార్య (3) గోదాదేవి.

(1) విష్ణుచిత్తుని భార్య

ఆమె పేరేమో కానీ !? (విరజ- అని కీ॥శే॥ శ్రీనివాసయ్యంగారు ఒక మా ట వ్రాసారు) ఆ తల్లి

నిజంగా సాధ్వీలలామ. అమాయక బ్రాహ్మణి. సత్తెకాలపు మనిషి. మగనికి నీడగా బ్రతికినట్టిది. ఆమెను కవి ప్రథమాశ్వాసంలో భర్తతో పాటుగానే పరిచయం చేశాడు. శ్రీవైష్ణవం గృహస్థమతం కనుక స్త్రీ లేక పురుషుడు లేడు. భగవంతుడు కూడా అంతే. శ్రీ విష్ణువు లక్ష్మీకల విష్ణువు. అలాగే విష్ణుచిత్తుని భార్య.

*''గగనము నీరు బుగ్గకెనగా జడివడ్డిన నాళ్ళ భార్య ; కన్*
*బొగసొరకుండ నారికెడపుంబొరియల్ తవులించి వండన్.''*

విష్ణుచిత్తుడు అతిథులకు భోజనసపర్యలు చేస్తున్నాడని కవిచిత్రణ. 'వండనలయని ప్రవరుని భార్య వోలె.' కానీ ఆమె తర్వాతి కథలో ఎక్కడా కన్పించదు. (హిమాలయాల్లో దారి తెలియక దుఃఖించే సమయంలో ప్రవరుడీమెను స్మరించటం తప్ప) కథాగమనంలో ఆమెకు చోటులేదు. కాని ఇక్కడ అలాకాక భర్త మధురకు వెళ్ళే వేళ -

*''భక్తిఁ ద్రోవకు సాధ్వి పరికరంబులు వెట్టె*
*కట్టేన పొరివిళంగాయ గములు''*

ఆయన కీ విధంగా సాయపడ్డది.

గోదాకథలో ఆమెను తులసి తోటనుండి

*''కొనిపోయి ధర్మ గేహిని*
*కను రక్తి నొసంగఁ బొంగి యా యమయును జేఁ*
*పునిజస్తన్యంబులచేఁ*
*బెనిచెన్ గోమొప్పన్''. (5-6)*

ఆమెకు జగన్మాత ఇచ్చిన వర మిది. ఇందుకే ఈమెను ప్రథమాశ్వాసం లోనే పరిచయం చేసాడు కవి.

తుదకు గోదా వివాహవేళ -

*''అయ్యాళునారు దేవేరియుం దానును*
*ధారవోయ'' - (6-130)*

కన్యాదానములో ఆమెకూ స్థానమున్నది కదా. ఈ విధంగా కథ మొత్తాని కడుగున సరస్వతీ స్రవంతి లాగా నాల్గు చోట్ల మెరిసిపోయిన పాత్రయిది. భగవతిని పెంచిన తల్లికి నమస్కార మన్నట్లున్నదీ పాత్ర చిత్రణ.

## మహారాణి

రెండవ పాండ్యుని భార్య, పట్టపురాణి మహాసాధ్వి. విష్ణుచిత్తుని భార్యకూ ఈమెకూ ఒకే భేదం. అక్కడ భార్యాభర్తలిద్దరూ వైష్ణవులే. ఇక్కడ తానే వైష్ణవి. భర్త శైవుడు.

*''వింగడం బైనట్టి ముంగిట నెలకొన్న*
*బృందావనికి ముగ్గు వెట్టు దాన.''* (4-50)

భక్తి సంబంధ కర్మలన్నీ ఆమె స్వయంగా చేసుకొంటుంది తప్ప ఇతరులపై బరువు మోపదు.

ఇందుకే కథా వక్త స్వామి 'పురంధ్రీ రత్న' మని నోరార పిలిచాడు. రాణిని కదా అని తులసి ముగ్గు తానే తీర్చాలా ? అని దాసితో చేయించుకోకుండా తనకు తానే ముగ్గు కఱ్ఱ తీరుస్తున్నది.

'చిత్తంబు మధురిపు శ్రీపాదములయంద' -

అన్న అంబరీషుని భక్తి పద్ధతిగా ఉన్నదీమె నారాయణారాధన. ఆమెలేకపోతే భర్త ఉద్ధరింపబడేవాడు కాదు. రాజధర్మస్థితి భగ్నమయ్యేది. యామునుడు సభకు రావటాని కీమే కారణం కనుక. భర్తను తరింప చేసిన ఇల్లాలామె.

ఆమె నిత్యకృత్యం 4-53 వచనంలో వర్ణింపబడ్డది. ఆమె నిత్యదానశీల దానయజ్ఞ పరాయణ భంగ్యంతరంగా ఆ వచనమే రాజు పరిపాలన ధర్మవిరుద్ధంగా ఉన్నదని చెబుతున్నది. లేకపోతే **'చెరువు కడమపడిన విషయ'** మామె దాకా రావలసిన అగత్యమే లేదు. రాజు ఇవి పట్టించుకోనంత **'వెఱ్ఱిశైవుడు'** కనుక పడమటి ద్వారమాధారమైనది - అలాంటివారికి.

యామునుడీ ద్వారంగానే కొల్వులోనికి ప్రవేశింప గలిగినాడు. ఈపాత్ర ఆకథ కొక కొలికి పూస; కథాహార నాయక రత్నం.

## గోదాదేవి

ఆముక్తమాల్యద విషయం కథలోనే వివరింపబడినది. దాని కనుబంధంగా ఇక్కడ నాలుగే మాటలు.

శ్రీవేదాంత దేశికులు గోదాదేవిని - శ్రీశంకరులు సౌందర్యలహరిలో శ్రీదేవిని వాగర్చన చేసినట్లుగా అదే స్థానంలో పెట్టి అర్చించారు.

**'కవీంద్రాణాం చేతః కమలవన బాలాతపరుచిం'** - *(సౌ.ల)*

'కృష్ణాన్వయేన దధతీం యమునానుభావం
తీర్థైర్యథావదవగాహ్య సరస్వతీం తే

*గోదే ! వికస్వరధియాం భవతీ కటాక్షాత్*
*వాచః స్ఫురంతి మకరందముచః కవీనాం' - అని*

ఆమె కవులకు శబ్దదాత్రి. ఇది పీఠం. మతదృష్ట్యా రాయలసృష్టి దానికి క్షతి కల్గింపరాదు కదా! ఇందుకే ఆమె అంగవర్ణనలో పరదేవతగా భావించి వర్ణించినట్లు వ్యాఖ్యానింప బడినది.

ఆమె చెలికత్తెలతోనే మాట్లాడినది తప్ప, తల్లిదండ్రులతో మాట్లాడినట్లు లేనే లేదు.

5-40-54,58,65-70,72,73,80,81-

1. 40-50 అ.వరకు వ్యాజనింద. చెలికత్తెలకామె సమాధానం (58)
2. 67-70 ఏకాంతంలో కృష్ణ స్మరణ.
3. 72-73 పూర్వజన్మలో తానెవరని ప్రశ్నించటం.
4. 80-81 సత్యనని తెలిసి పరితపించటం.

ఉపాలంభ దంభమున ఆమె చేసిన వ్యాజనిందలో భావనాప్రౌఢికి వ్యాఖ్యానం ద్రష్టవ్యం. ఆమె అంతు చిక్కని భావన గల కవయిత్రి. ఆమె రచనలైన 'నాచ్చియార్ తిరుమొళి', 'తిరుప్పావు' చదివిన వారికిది విదితమే. కనుకనే ఇక్కడా సాక్షాత్కరిస్తాయి. ఆమె భూదేవి కనుక పుట్టి పెరిగిన యిల్లూ - ఊరూ అలాంటిది కనుక.

ఈ సంస్కృతి పాత్ర నిర్మాణ పీఠం.

## అలంకారౌచిత్యము

కుంతకుడు విచిత్రశైలీలక్షణాల్లో సంకీర్ణాలంకారత్వ మొకటిగా నన్నాడు. అంటే అలంకార సంశ్లిష్టత. రెండు మూడు అలంకారాలు పెనవేసుకొని పోయిన లక్షణమని తాత్పర్యము.

రాయలనిర్మాణంలో ఇదొక ప్రధాన లక్షణంగా వ్యాఖ్యానంలో చూచుకోవచ్చు. దీనికి కారణం భావసంశ్లిష్టత. భావసుపర్ణుడు పల్లటీలు కొట్టడం. చక్రవర్తి శబ్దమూ అర్థమూ గంభీరం కనుక ఈ అలంకారసంకీర్ణత ఆయనలో మహోదారంగా కన్పిస్తుంది. సహజంగా ఉండటం స్వభావ మధురోక్తులు. అదొక పద్ధతి బహుశా ప్రజ్ఞాపరిణామంలో పల్లీనాగరకతలో - స్వభావోక్తి ప్రథమాలంకారం. అలాగే సులభమైన ఉపమ. పట్టణ సంశ్లిష్ట నాగరకత - మానవ ప్రజ్ఞావికాసంలో పరాకాష్ఠ. ఈమార్గమే వక్రోక్తి కారుని విచిత్రోక్తి. ఇక్కడ ఉత్ప్రేక్షాదులకు శ్లిష్టభావనా వాదులైన అలంకారాలకు పట్టాభిషేకం జరుగుతుంది. ఇదే రాయల అలంకారసౌందర్యం.

మరొకటి ఔచిత్యం. ఏమార్గమైనా ఔచిత్య ప్రాణం కావాలి. రమణీయతకు కాణాచి కావాలి. అలంకారం శాస్త్రీయంగా నిర్వచించటానికి ముందది అనుభూతం కావాలి కదా! మూలాలంకారం ఉపమా? అతిశయోక్తా? అన్న మీమాంస ఆలంకారికుల్లో కన్పిస్తుంది. సర్వాలంకారాలకేది మూలమన్న జిజ్ఞాసే ఆ మీమాంసాకారణం. శాస్త్రదృష్ట్యా ఉపమాలంకారం కాగా, అనుభవ దృష్ట్యా అతిశయోక్తి మౌలికం.

అస లలంకారం అర్థానుభూతికోసం. తర్వాత ఏమిటిది? అన్న మీమాంస ఏ అలంకారం ఎక్కడ ఎందుకు ప్రయుక్తమైనదో చెప్పటం విమర్శకుని పని. ఈదృష్టితో ధ్వన్యాలోకం కొంత మార్గం చూపింది. అలంకారం ప్రత్యేక ప్రయత్న నిర్మితం కనుక సరసూత్రం తెగేదాకా లాగకూడదన్న తాత్పర్యంతో.

'సాంధ్యరాగ లహరి సామిరంజితములై' (4-139)

తెల్లని శరద్ఘనములు సంజకెంజాయలతో అంచుల ఎరుపెక్కి - అప్పుడే యోగనిద్ర లేచిన స్వామికెత్తిన కర్పూర నీరాజనములైనవట.

4-143 లో లేచిన స్వామి కాలు క్రిందమోపితే ఆ భారానికి వర్షకాలంలో నానిన నేల పాతాళానికి క్రుంగి వానధారలకు పడ్డ చిల్లులనుండి నీరు పైకిచిమ్మినట్లు తెల్లుపువ్వులుల్ల సిల్లినవట. తర్వాతి పద్యంలో స్వామి పాదస్పర్శకు అవని రమణి పులకించినట్లు శాలిమంజరులున్నాయట.

161 లో - సూర్యోదయాస్తమయ వేళల్లో అది - ప్రకృతి శబరీకాంత ధరించిన గురిగింజ నాసాభరణం లాగా ఉన్నది. ఈ అంలకార - వర్ణనల వైభవమంతా యోగనిద్ర నుండి మేల్కొన్న స్వామి కుపచారంగా సంఘటితమైనది. అంటే అలంకారం ప్రస్తుతోపయుక్త మౌతూనే మొత్తం కావ్యవస్తు తత్త్వాన్ని ధ్వనిస్తున్న దన్నమాట.

మధురానగర వప్రము పినాకము - 2-2 - శార్ఙ్గమెందుకు కాదు? కవి కిష్టమైనది కదా. పాండ్యచక్రవర్తి శాంభవమూర్తి కనుక (2-39) శ్లేషాదుల జోలికాయన పోలేదు. కాని పరిమితంగా ప్రయుక్తాలైనవి.

1. పుష్పలావికా వర్ణన -2-19,21,

2. 4-76,82,165,183

పుష్పలావికల స్థలమంగడి. వక్తలు విటులు, వారి విషయం కామభావం. కనుక శబ్దం నిగూఢంగా - విన్నవారికి మాత్రమే విదితమయ్యేటట్లుండాలి. కనుక ఆ అలంకార మొక ప్రయోజనాన్ని నిర్వహిస్తున్నది.

*'స్ఫటలమణుల్ మీఱ శాంతమై శ్వేతమై*
*నట్టి (త్రా)చొక్కటిచుట్టి యుండు - (4-200)*

ఇది రాజైన యామునాచార్యునకు రామమిశ్రుడు చెప్పిన పద్యం. రాజునకు నిధియన్న అర్థమే స్ఫురించాలి కాని అనిధి పెన్నిధియైన శ్రీరంగనాథుడు ఈఅర్థంపైకి తేల్చితే రాజు శ్రీరంగం రాడు. భవిష్యత్తులో శ్రీవైష్ణవ సామ్రాజ్యాధినేత కాడు కనుక శ్లేషనాశ్రయించవలసి వచ్చింది.

4-270 లో రాజనీతి విషయకమైన ఈపద్యంలోనూ శ్లేషసంఘటితం కావటానిక్కారణం-

రాజు స్వదేహాన్ని (స్వాంగరాజ్యం) రాష్ట్రాన్ని (సాంగరాజ్యం) రెంటినీ సమానంగా భద్రంగా రక్షించుకోవాలని చెప్పటం తాత్పర్యం కనుక.

ఆయన ప్రయోగించిన శబ్దాలంకారాలు క్వాచిత్కం. అవీ అప్రయత్న సిద్ధములైనవే.

''నీచెఱఁబాసిపోయి రజనీచర''

''ఇతరులు నీకు నీడె'' - ఈరెండూ దాసరి కథలోనివి. భక్తిపారవశ్యంతో ఊడిపడిన మధుర వాక్కులు.

''స్వస్తికృద్వా స్తవస్తుత్యగస్తి'' - (2-39)
వంటి వానిని గూర్చి శ్రీవేదాల తిరువేంగళాచార్యులు గారు తమ ఆంధ్ర ధ్వనాలోకంలో ఇలా వ్రాశారు.

''ఇట్లు సులభముగా నుపస్థితమగు నర్థము ప్రకృత రసమునకు విభావాది రూపమున నుపకరింపవలెను - నిజమున కచట యమక స్ఫూర్తియే యసలుండదు. కొన్నిచోట్ల కొంచెము స్ఫురించినను నవి రసోద్దీపకములై రసస్ఫురణముననే యవియు గోచరించుచుండును. ఇట్టివి తప్పక గ్రహింపవలసినదే.''

ఆముక్తంలో కన్పించే అలంకారాలన్నీ కవి స్వయం ప్రతిభావ్యక్తములే తప్ప పూర్వకవుల కనుకృతులు కావు. ప్రతిధ్వనులూ కావు. అనూచానంగా అందరూ వాడి ప్రాతపడిపోయిన ఉపమానాలు ఆయనలో కన్పించవు. అంతా ఒక నూత్న సృష్టి. కవి ప్రతిభ కొక గీటురాయి నూత్నాలంకార కల్పన.
ప్రభావతీ ప్రద్యుమ్నంలో కవి సంప్రదాయోపమాన ద్రవ్యాలను 'వానిఁ దడవఁ బోయిన సిగ్గొదవు గదయ్యా' అన్నాడు.

*''ఊఁత నీరు, చెలది నేత, మూటాయిటి*
*దూది యెండ పసుపు - తొట్టియక్క*
*రంబు మేను.''*

ఈ దాసరి ఔపమ్యం నాన్యతో దర్శనీయం కదా! అందరూ అన్నది బుద్బుదమని. ఎవ్వడైనా మరొక పోలిక చెప్పాడా?

ఇది రాయల ప్రతిభ. నవనవోన్మేషమైన ప్రజ్ఞాఫలం.

పద్యరచన

రాయల వారి శైలి విచిత్ర మార్గం. సుకుమారం కాదు. ఇది తిక్కనగారి నుండి మొలిచిన వటవృక్షం ఊడలు దిగుతూ వచ్చింది. అది సుభట మార్గం; ఖడ్గధారాపథమని దుస్సంచారమనీ కుంతకుని నిర్వచనం.

*''విచిత్రోయత్ర వక్రోక్తి వైచిత్ర్యం జీవితాయతే*
*పరిస్ఫురతి యస్యాంతః సా కాపి అతిశయాభిధ.'' (1-42)*
*''సోఽతి దుస్సంచరో యేన విదగ్ధ కవయో గతాః*
*ఖడ్గ ధారాపథేనైవ సుభటానాం మనోరథః.'' (1-43)*

ఆషామాషీ కవుల కందేది కాదట.

(చూ: నా సంవిధానక చక్రవర్తి ఎర్రన్న - సోమన్నల కవితా తారతమ్య పరిశీలన)

ఎక్కడ దీర్ఘాక్షర - బిందుపూర్వక -గురుత్వముంటుందో ఆ రచన సుకుమార మధురం. సంయుక్త విసర్గ - ద్విత్వపూర్వాక్షర బంధముంటుందో అది విచిత్రం. దీనినే బంధచారుత్వమని వాగ్భటాలంకార మంటున్నది.

*''పశ్చాద్గురుత్వం సంయోగాద్విసర్గాణా మలోపనం*
*విసంధి వర్జనం చేతి బంధచారుత్వ హేతవః.''*

'బంధస్య సందర్భస్య చారుత్వం మృదుపద్ధతి యోగేన మనోజ్ఞత్వం' అని సింహదేవగణి వ్యాఖ్యానం సరియైన దనిపించదు. ఇది వైచిత్రి తప్ప వికటత్వం - సౌందర్యం తప్ప మృదుత్వం కాదు. సౌందర్యం విచిత్రశైలీ స్వభావం మృదుత్వం - మాధుర్యం - సుకుమార మార్గగుణం. 'గండ ద్వంద్వ గళత్ కరాళ మృదురేఖల్ - భిన్న సప్తచ్ఛదా ఖండక్షోదసితల్' - (4-153)

*'హలనమత్ కదళ కందాభ తిర్యజ్జ్నతా*
*స్యమున కొమ్మొకటి మోసనగ గ్రుంగ'. (4-154)*

గండద్వంద్వ, గళత్, రేఖల్ - ఖండక్షోద - ఈ గురుత్వ నిర్మాణం వల్ల రచన, బంధం, సాంద్రతమంగా- దంతురంగా ఉంటుంది.

(హలన) వుత్ -హలంత గురుత్వం వల్ల పద్యమేదో దూకినట్లుంటుంది. ఒక కొండనెత్తమునుండి మరొకనెత్తానికి అశ్వం దూకినట్లు - కొండకొమ్ము నుండి లోయలోకి 'ఝురి' దూకినట్లు - ఒక మెరుపు కండ్లకు బరువై మెరసినట్లు రచనలో శ్లిష్టత - పూర్వాపరాక్షర సంశ్లిష్టత సిద్ధిస్తుంది.

'మణియష్టిఁగేలి బరివాణ షడ్జ సుధ'

ఈద్విత్వాక్షరాలు పాఠకునికి పుక్కిలిబంటి. రాయలేమాటన్నా నోటినిండుగా ఉంటుంది. అదిభావంతో నిండిన గుండె నుండి పోటుపొడిచినట్లుంది. వైరళ్యం - విరళత - పలుచదనం - వెలితి ఉండదు. ఆయన కవితా భావమెంత భారావహమో ఆయన శబ్దమూ అంతే, కథా అంతే. వర్ణన - కావ్యనిర్మాణమంతా భారావహమైన రచన.

కొన్నిచోట్ల దీర్ఘాక్షర సంయోజనమున్నా పద్యగాంభీర్యం విరిసిపోదు.

*''రాజమరాళలబ్ధగిరి రంధ్రము''*. (4-13)

*'కపిలగవి సర్పి పృథుదీప కళికఁదీర్చి'*. (5-92)

లబ్ధ - రంధ్ర శబ్దాలపై ఒకబరువు - ఊనిక నుంచి పఠించాలి. ఒకహిమాలయం దగ్గర - కన్యాకుమారి దగ్గర సముద్ర సైకతాల్లో నిలబడి చూస్తే ఎలా ఉంటుంది? ఏకాంతంలో? గుండెలవిసి పోతాయి. ఒకమహావిశాల దేవాలయ ప్రాంగణంలో ప్రొద్దుకుంకే వేళ - నిశలో - నిర్జన వేళలో నిలబడిచూస్తే చీకటిలో ఆగుడిగోపురాలు - ప్రాంగణవైశాల్యం -చెట్టూ చేమా - ఏకాంతంగా చూస్తున్నసేపూ - గుండెలవిసిపోయేటంత గాంభీర్యముద్ర. ఒక విచిత్ర భయరేఖ - ఏదోవస్తుంది - చచ్చిపోతానని కాదు. ఒక వివేకానంద ముందునిలబడివింటున్నట్లు; ఆమహాగంభీరమూర్తి దర్శనంచేస్తూ. ఒకసెలయేరు మెలికలు తిరుగుతూ కొండకొమ్మున నుండిదూకుతున్నట్లు - ఆజలధార పడే లోయలో ఒంటరివైన నీవు - ఎలా ఉంటుందో బహుశా - ఈపద్యం ముందు మనమలా ఉంటాం.

రాయలవారట 'వ్యాయామస్థిర సంధిబంధు' డని పెద్దన గారిమాట. ఆయన ఖడ్గ 'తిమింగల వాలపతనం' (2-41 ఆముక్తం) - ఆయన పద్యమూ అంతే. ఆయన గంభీరమూర్తి యని పేయస్ అన్నాడు. మహాచక్రవర్తి గాంభీర్యమెలా ఉంటుందో? - కానీ కావ్యంలో చిత్రించిన ప్రథమ పాండీని వర్ణనం వల్ల ఊహించుకోవచ్చు. అతడు 'చరున్మేరువు'. రాయల పదమలాంటిది.

'పూని ముకుందునాజ్ఞ కనుబొమ్మ నెగాంచి యజాండభాండముల్

వానను' - అన్న విష్వక్సేన స్తుతిని బట్టి మహారాజు నేత్రాది సంజ్ఞలతో ఆజ్ఞాపిస్తాడే తప్ప నోరువిప్పి మాటాడడు. అంత మహామౌని. మాటాడితే వచ్చే గాంభీర్యం చెప్ప నలవికానిది. అనుభవైకవేద్యం తప్ప అనలేము.

''పుష్పసముల్ సదల్చి'' యిటిగుబ్బలనొత్తిరి హత్తి - పద్యం ప్రారంభం బుగ్గలు బూరటించి సపుప్పకో ట్టగది. ఇదే పుక్కిటి బంటి అన్నది. ఆకంఠంగా ఉంటుంది ఆ పద్యరచన.

## ఇదికావ్య సందర్భం

ఐతిహాసిక శైలి మరొకటి ఆయన రచనలో కన్పించేది. ఇదీ తిక్కన్న గారి నుండి మనకు సంక్రమించిన మహావరం ఇది వ్యాసుని శైలి. దీన్ని గూర్చి వివరిస్తూ - శ్రీ అరవింద మహాకవి యోగి "Upanishadic Diction" అన్నారు.

ఈ ఔపనిషద మార్గమేమిటి ?

> 'నమశ్శివాయ సోమాయ సగణాయ ససూనవే
> సవృష వ్యాళ శూలాయ సకపాలాయ సేందవే' (కావ్యమీమాంస - 76).

''సదేవ సోమ్య ఇదమగ్ర మాసీత్ - ఏక మేవాద్వితీయం బ్రహ్మ'' (ఛాందో 6-2)

> ''న తత్ర సూర్యో భాతి - న చంద్ర తారకం
> నేమా విద్యుతో భాంతి - కుతోఽయమగ్నిః-'' (ముండకం 2-2-10)

ఇదేమి భాష? దానిలో ఏమున్నది? క్లిష్టత లేదు. అన్వయ కాఠిన్యములు లేవు. కానీ ఏదో దివ్యత్వమున్నది. అదే మంత్ర లక్షణంగా శ్రీఅరవిందుల వేదరహస్య మన్నమాట.

> ''హంసః శుచిషద్ - వసురంతరిక్ష సద్
> హోతా వేదిషద్, అతిథిః దురోణ సత్
> నృషద్ వరసదృతసద్ వ్యోమసదబ్జాగోజా
> ఋతజా, అద్రిజా, ఋతం బృహత్'' (కఠం 5-2)

ఈ పదార్చులలో చిక్కదనం స్పష్టమే. ఇది ఔపనిషన్మార్గం= శైలి. ఇదే ఇతిహాసశైలి. మంత్రశైలి. పై మంత్రాల నడక వేరు - అది సరళం. ఇక్కడి నడక వేరు. గులకరాళ్ళపై సెలయేళ్ళు నడిచినట్లు, క్షణ క్షణం బుగ్గలు - బుగ్గలుగా పొడుచుకొంటూ జింక తొడల కండల పోలె చీలుతూ పారే సొగసు.

ఈ మంత్రానువాదం సాధ్యమా? - కానీ రాయ లనువదించాడు.

> ''ఆదినారాయణుం డాయె నొక్కడ- బ్రహ్మ
> లేడు , మహేశుండు లేడు- లేదు
> రోదసి - లేడు సూర్యుడు- లేడు చంద్రుడు -
> లేవు నక్షత్రముల్ - లేవు నీళ్ళు -''

ఇక్కడ కావ్యగుణాత్మకశైలి పనికిరాదు. మాధుర్యాది గుణాలవల్ల ఔపనిషదౌదార్యం ధ్వస్తమై విరిసి పోతుంది.

''నేడు మహామతీ!'' అన్న మన్నారు స్వామి వాక్కులోని ఔదార్యం భావించుకోవాలి. త్రివిక్రముడై తలనెక్కడో పెట్టి మంద్రగంభీరంగా క్రింది వానితో మాటాడినట్లుంది.

ఆ ప్రసన్న గాంభీర్యౌదార్యాలు శ్రీఅరవిందుల భాషణంలో ఉండేవని వారి శిష్యులన్నారు.

In a huge forest where the Conscious of listening night, heard lonely voices, and in the large hush, was coin of the sigh and tread of things, that have sound for the rich heart of day (SAVITRI)

అన్నంత నిశ్శబ్ద గాంభీర్యమున్నది - ఆ సశబ్ద వాగ్విన్యాసంలో మాట్లాడి, మౌని కాగలవాడే మహాకవి.

రసప్రస్థాన వేత్త సైతము తెలుసుకోదగ్గ సౌందర్యమందులో ఉన్నందువల్లనే కావ్యం దురవబోధమైనది.

The truth is that very much of the best poetry is necessarily ambiguious in its immediate effect. Even the most careful and responsible reader must reread and do hard work before the poem form itself clearly and unambiguiously in his mind. An original poem as much as a new branch of Mathematics compels the mind which receives it to grow, and this takes time.

(Principles of Literary Criticism - 291 byI.A. Richards)

సీసపద్యం

ఈ పద్యరచనాశిల్పులు 1. తిక్కన్న 2. నాచనసోమన్నలు. రాయల సీస పద్యము, తెనాలి కవి పద్యము గణనీయశిల్పాన్వితాలు.

భగవత్సౌందర్యము నెక్కడ వర్ణించినా సీసంలోనే వర్ణించడం.

*1. ''శరదిందు చకచక స్మయజిత్ప్రసన్నాస్య*
*దొడ్డకెందమ్మి కందోయివాని'' (3.85)*

ఇది ధ్యానయోగ్యమగు స్వామి స్థూలరూపవర్ణనాత్మకమైనది.

2. పెరియాళ్వారు మతస్థాపన చేసిన తర్వాత ప్రత్యక్షమైన కావ్యనాయకుని కళ్యాణగుణమహితమైన విగ్రహవర్ణన

''చిగురు, బీట్లపుదోయి చెందమ్ములనఁ దార్క్ష్య
హస్తోదరములఁ దివ్యాంఘ్రులమర.'' (4-11)

గోదావిరహతాపమున చేసిన నాయక స్మరణ

(3) ''అభినవ కువలయ శ్యామ కోమలమైన
డామూపు మకరకుండలము దాల్ప'' (5-6)

ఇదంతా భగవంతుని స్థూల రూప వర్ణన.

ఇక సూక్ష్మ రూపవర్ణన

(1) ''మున్నెన్ని న పరాఖ్యకును ద్వితీయమైన'' (3-82)

ఈ రచనలోనూ - +

కథాకథనంలో -''తమ తంద్రిశ్రీశదత్త శ్రీలు త్రవ్వితండ ములయ్య - (5-38)

పౌరాణిక సీసరచన కన్పిస్తుంది. అంటే ఏ పాదాని కాపాదం తెగిపోకుండా - సమతాగుణ విరుద్ధంగా - పద్యంతీగ సాగినట్లు అల్లుకు పోవటం. దీనిని ఇతిహాస, పౌరాణిక రచనగా భావించవచ్చు.

గంభీర భావన

ఆయన సీసమొక భావబంధురమై - మదగజ గమనంతో భాసిస్తుంది.

1. ''మణియష్టిఁ గేళిబర్హిణ షడ్జసుధవీను
లోలాడ నొక్కింత మేలుకాంచి -'' (4-135 వర్షాంతం)

''మదగంధతారతమ్యము యామ్యకరికి
దత్కరలకుంగన బలె, గటములొరసి'' (2-38)

ప్రతి ఋతువర్ణనాంతంలోను సీసమే ఊని నిలిచింది.

''చక్రస్తన ప్రకాశమునకు ఫేనపుఁగొంగిడి'' (శరదంతం)

''సహకార ఫలరససౌరభ్యములు కూడి'' (వసంతం)

''మణియష్టి'' (వర్షాంతం)

ఈమూటిలోను రసము శృంగారమే. వర్ణనమంతా తెచ్చి శృంగారరసంలో పర్యవసింప చేయటం లోని భావం కావ్యంలో ప్రధాన రసమదేనని భంగ్యంతరంగా చెప్పటమే.

రాయని సీసమొక మలయ కూట మణిసౌధం. ఈసౌధద్వార బంధాలు, భిత్తికలు, శిఖరాలన్నీ, బంగారుకవచమయాలే ఆ కవచాలన్నీ రత్నముక్తామణి సంఘటితాలేనని పేయస్ వర్ణనం. అలాగే సీసపద్యమంతా ప్రౌఢోహసంపత్తి కవధిభూతమైన రచన.

వసంత వర్ణనలోని సీస పద్యాలన్నీ ఇంతే.

ప్రత్యేకించి చిగురాకు వర్ణన - (110)

తుమ్మెదల వర్ణన - (118)

కవి చూపులోని ప్రత్యేకత - వస్తుదర్శన - విన్యాసంలో ప్రస్తుతమౌతుంది. ఆ చూపునకు, అల్పప్రాణి యనిగానీ, అధిక ప్రాణియని గానీ ఉండదు. అత్యల్ప విషయం దగ్గర నుండి అత్యంతాధికమైన అంశందాకా వస్తువే. ప్రతివస్తువు ఉదాత్త వర్ణన ద్వారా కావ్యభూమికకు చేరుతున్నది.

2-53 కొంగల చేపల వేట వర్ణన ఎంత ఉదారమధురమో, భగవద్వర్ణనమూ అంతే ''స్ఫటలమణుల్ నీఱు'' - (4-200)

ఇమిడిక

''తనువు, గొమ్ము గొరిజ గొన కుండ మలపుచుఁ
జప్పుడెసఁగ,దోక నప్పళించి
శోణితంబుగ్రోలుచునె నేర్పుమై ఘర్మ
గవిని గవికి నీడ్చునవసరమున.'' (3-21)

పులి యాగధేనువును చంపిన ఘట్టం నాల్గు పద్యాలు. అందులో ఇది మూడవది.

ఈఘట్టాన్ని గూర్చి వ్రాస్తూ కవి సమ్రాట్టు విశ్వనాథవారు

''జంతుస్వభావ మింత వింతగా వ్రాయువారు రాయలకు మించియుండరు. ఒకపశువును బులి వేసికొని పోవుట లక్షమంది చూచి యుండవచ్చు. ఇట్లు కనులకు గట్టినట్లు చిత్రించగలుగుట యొక మహాశక్తి. మూడు పద్యములలో నీ విచిత్రమైన సంఘటనమున జరిగిన యైదాఱు విషయములచేత కనులకు గట్టినట్లు వ్రాయుట యొక విలక్షణమైన కవితాశక్తి. అది యందఱకు చేతనగునది కాదు''. ( ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం)

పై పద్యాన్ని శ్రీవేదం వారు తమ వ్యాఖ్యానంలో ఇమడిక కుదాహరించారు. అంత చిన్న ఛందంలో ఆవిషయాన్ని ఇమడించడం- ఇరికించటం - క్లుప్తత - ఆశ్చర్యకరమని వారి అభిప్రాయం.

ఇది తిక్కన్నగారి కవితా కౌశలం.

''ఒకతోటలో బొడ్డన బావి. దాని ప్రక్కనే చెఱకుతోట. అందొకగడ డిగ్గియపై కొరిగింది. దాని ప్రక్కన ఒక పొన్నచెట్టున్నది. ఒక అంచ డిగ్గియలోపల తమ్మితూడు త్రెంచి చెరకుగడ మీదుగా పొన్నచెట్టు పైకెగిరింది. ఆ తామరతూటి దారం చెరకు మీదుగా ఉన్నది. ఆ గడ వంపుగా ఉందికదా. ఆ సూత్రం పైదాకా దీర్ఘికలోని తుమ్మెదలు పొన్నపూతేనెకై సూత్రం వెంటనే ఎగురుతున్నవి. అలాగే పొన్నతేనె త్రాగిన తుమ్మెదలు తామరరస మకరందం కోసం మరొక ప్రక్కగా సూత్రం వెంట క్రిందికి దిగుతున్నవి. ఆ రెండు తుమ్మెద బారులు మరుని చెరుకు వింటికి జంటనారిగా నైనది.'' (5-122)

ఇదొక పద్యభావం! ఆ కవిగీసిన చిత్రం సంగతలా ఉంచి అంత విస్తార భావాన్ని ఒకే పద్యంలో కుదించుట ఎలాగా? అస్పష్టత కానీ గజిబిజితనం కాని ఉండదు. ఆ కుదింపు పరమాద్భుతం.

''పెల్లుండానును భిల్లుడొక్కరుండు -'' (4-233)

ఒక భిల్లుడు ధనుర్ధారియై అన్యభిల్లునింటికి చుట్టపుచూపుగా వెళ్ళాడట. వాడానందించి వీడికి పాయసాన్నం పెట్టాడు. వాడు భోజనం చేస్తూ పొయ్యి వంకచూస్తే దానిమీద కుండలో నార ఉడుకుతూ తెర్లుతున్నది. పొంగు ఎర్రగా ఉంది. వీడు మాంసమనుకొన్నాడు. తనకేమో పాయసంపెట్టి వాడు తనకోసం మాంసం వండుకుంటున్నాడని కోపంతో చంపుదామని నిర్ణయించుకొన్నాడు. వీడు 'వస్తారా' అని లేచాడు. వాడు 'సరే' నని అందాకా సాగనంపటానికై పోతున్నాడు. వెన్నంటి పోతూఉంటే వాడు మరుగు చోటికి రాగానే చంపుదామని ఆలోచిస్తుంటే గృహస్థు అన్నాడు. ''సరేరా! దిగబడతాను. పొయ్యిమీద నార ఉడుకుతున్నది. చెడిపోతుంది వెళ్తాను. నీవు క్షేమంగా పోయి రమ్మన్నాడు.''

వీడు ''ఒరే! నారా! దొబ్బనుకున్నానే'' అని ''సరే పోయి రారా'' అన్నాడు. ఈ కథ నాప్రభువొక పద్యంలో కుదించాడు. ఆ పద్య మిక ఎలా ఉంటుంది.

''పీన దేహుఁ డితడు పిప్పళ్ళ బస్తా వి
ధానున్నవాడు వానరుండు'' అని

హనుమంతుని బంధించి ఇంద్రజిత్తు తండ్రి రావణుని ఆస్థానానికి తెచ్చినపుడు రాక్షసు లను కొన్నారని కల్పవృక్షం. అదుగో ఆ హనుమంతునిలాగా ఉంది పద్యం.

Companion of siridius అని ఒక చిన్న నక్షత్ర మున్నదట. అక్కడ ఒక ఘనపుటంగుళంలోని పదార్థాన్ని భూమిపైకి తెస్తే ఒక టన్ను బరువు తూగుతుందట. (చూ. Astronomic Encyclopedia)

అలాంటిది రాయలవారి పద్యం, బహుశా ఆయన కత్తి బరువలా ఉండి ఉంటుంది. మరొక చోట పురాణ కథలను అంగంగా చేసి పద్యం వ్రాస్తాడు.

''ఒకటికి రోయకుంట కను మున్నవియుం'' - (4 -234.)

ఆప్రభువు గాంభీర్యమే పద్యంలోకి ప్రవహించి భారావహంగా - దంతురముగా - సాంద్రోహకలదిగా పరిణమించింది. ఆయన జీవలక్షణమే ఆయన పద్యం.

కాలమాహాత్మ్యం తెలిసినవాడు క్లుప్తంగా మాట్లాడుతాడు. వ్యర్థం చేయడు. ప్రతిక్షణమూ విలువైనదే. కనుక రచనలో క్లుప్తత ఔచిత్యపరాకాష్ఠ.

ఔచిత్యం

''అనౌచిత్యాదృతే నాన్యద్రసభంగస్య కారణం
ప్రసిద్ధౌచిత్య బంధస్తు రసస్యోపనిషత్పరా.'' (ధ్వన్యాలోకం)

ఔచిత్యం రచనను నియంత్రించే అంకుశం. కవి వర్ణనాశక్తి నదుపులో పెట్టే ఆనకట్ట. పైకికావలసినంత వరకే అభివ్యక్తం చేస్తుంది. కావ్యరచన నవరసాత్మకం. నానాభావోపేతమై అనంతలోక వైవిధ్య వైచిత్రిని సంతరించుకొనే సముద్రమిది. దీని కుదాహరణ భారతం - ఆముక్తం. రాయలరచన ఒకచోట నిరళం. సులభ సుకుమార పదబంధంతో శోభిస్తుంది.

'' ఉన్నట్లయుండగా దరి - కిన్నరులను నావచేర్చుక్రియ-'' (2-79)

ఇది విరక్త చిత్తుడైన ప్రథమపాండీని స్వగతం. రాజ్యవైభవమే గొప్పనుకొని కాదని తెలిపోయాక కలిగిన వైరాగ్య మూ వాక్యానికి జన్మభూమి. రచనలో అందుకే నైరళ్యమున్నది.

మరొకచో ప్రౌఢసమాసార్భటిలో ఫెళ ఫెళలాడుతుంది. '-కీకట శరాళీవారవాణీభవత్'- (4-31)

ఇది కవి వర్ణన. ఆ అధర్మ దమన కార్యం - క్రోధస్థాయికి పుష్టికల్పించేది. రసం, రౌద్రం దానికీ కల్కిఅశ్వవర్ణన వ్యంజకం.

''స్కందసరస్తటీ రమణ కందర చందన కుందవాటికా
మందసమీర లోలవనమాలికా'' - (6 ఆశ్వాసాంతం.)

నెత్తికెత్తికొన్న బరువు దించుకొని నిట్టూర్పు పుచ్చి సేదదీరుతూ భగవదాజ్ఞను కావించానన్న భావనతో- మధురంగా ఆయనను స్మరించటం. పద్యంలో భావం స్నిగ్ధభక్తి. కావ్యరచన ముగిసింది. హమ్మయ్య అని అనుకొని స్వామిని తనివిదీరా పిలవటం - మరలా ఈ అవకాశం రానిది. వచ్చినా ఎప్పటికో ? ఎప్పుడో? - ఈ భావ శబలత నుండి పుట్టిన పద్యరచనకు మాధుర్యమే -జీవం.

ఈ భావదృష్ట్యా రచన విస్పష్టం కావాలి. భావ సంబంధమైన శబ్దార్థ సమత - ఉంటే నిర్మాణ మార్మికత - రచనాసౌందర్యమున్నట్లు. లేకపోతే వట్టి శుష్కరచన.

''ఖనటత్ పయోబ్ధిపీక్ష్యరసాతలాన్యోన్య'' -(అవతారిక 3)-1

''స్యందన స్థిత'' - (రామావతార వర్ణన) 4-27-2

''కాంచెన్ వైష్ణవుడు'' (6-15) దాసరికథలో వటవృక్ష వర్ణన. కొందరన్నారు ఇలాంటి పద్యాలుదాహరించి కావ్యం నారికేళపాకమని. ఇలాంటి పద్యాలు కావ్యంలో పది.

మదన స్యందనతా - (5-108)

క్ష్మావశా రక్తరాంకవము - (5-110)

మరుదూఢ మలయాహి గరధూమలు - (5-188)

కవిసెన్ గల్పాంత -(6-75.)

ఈపద్యరచనను నియంత్రితం చేసిన ఔచిత్య సూత్రమేది?

1-గరుత్మంతుని ఉడ్డీనప్రభావం వర్ణితాంశం. ఆయన అమృతానయన సందర్భవ్యంజకం తప్ప మామూలుగా కూర్చున్న వర్ణన కాదు. ఈవర్ణనలు వేరే ఉన్నాయి.

''ఇంగిలలికంబునం దడిపి యెత్తుక సీసపురెంటె మోయ న్''

ఇది విష్ణువు విష్ణుచిత్తునకు ప్రత్యక్షమైన సందర్భంలోది (4-10)

(అవిదిత పురందరాయుధం బైనకనక)

''శిఖరి యుంబోలె'' -

శ్రీరంగనాథుని దర్శింపబోయిన విష్ణుచిత్తుని దర్శించిన సందర్భంలోదీ పద్యం. ఈ రచనాశైలి వేరు.

''ఆతపక్ష మారుత రయఃప్రవికంపిత - అని నన్నయ్య

1. ''తుల్యాః సంవర్తకాభ్రైః పిదధతి గగనం పంక్తయః పక్షతీనాం, తీరం వేగాన్నిరస్తం క్షిపతి'' - (నాగానందం)

ఈ ఓజోగుణమే ఇక్కడ రచనలో ఔచిత్యం.

2. స్యందనస్థిత :- రామబాణ కాఠిన్యవర్ణన; యుద్ధవర్ణన ఉద్ధతంగా ఉండటమే ఔచిత్యం. సుకుమార మాధుర్యాదులీ సందర్భాని కొదగవు. (చూ: వ్యాఖ్యానం)

3. వటవృక్ష వర్ణన:- బ్రహ్మరాక్షస నివాసం కనుక చూచినంతనే గుండె లవిసిపోవాలి. అది నగరోద్యానవన వృక్షమా? అందంగా వర్ణితం కావటానికి;

4. కవిసెన్ గల్పాంత :- దారిదోపిడీ గాంద్ర వర్ణన కనుక భయానక రసాలంబనంగా వర్ణించటం కోసం ఆసాంద్రరచన అవశ్యకమైనది. అలా వ్రాయటమే సందర్భోచితం - ఔచిత్యపరాకాష్ఠ.

## రాయల రాజధర్మం - 1

''హస్తిపదేపదాని, సంలీయంతే సర్వసత్త్వోద్భవాని
ఏవం ధర్మాన్ రాజధర్మేషు సర్వాన్ - సర్వావస్థాన్ సంప్రలీనాన్ నిబోధ'' -

(శాంతిపర్వం)

''లోకములు, లోకధర్మంబులును నృపాల! రాజమూలకముల్ రాజరహితమైన పుడమిజనులకు నింకిన మడువులోని - జలచరంబులు పడుపాట్లు సంభవిల్లు''

ఇది ప్రాచీన రాజనీతివేత్తల దృష్టి. రాజునకంటె బలమైనదిధర్మం. అదే అతనికి ఆధారం. కనుక అతని ఆసనం ధర్మాసనం. ఆ సభపేరు 'సుధర్మ'. ఇది సర్వసభలకు ప్రతీక. రాజధాని అమరావతి. (శాతవాహనుల కాలంలో వారెక్కడ ఉండి పాలించినా దానిపేరదే. ఇందుకే ఉత్తర దేశాల్లోనూ అదే పేరున నగరాలున్నవి) రాజు ఇంద్రప్రతిమ. ఇదంతా రాజ - రాజధాని - సభాదులకు పురాణమిచ్చిన ప్రాగ్రూప ప్రతిమ. (Archetypal Image) **తత్ శ్రేయోరూపం అత్యసృజత ధర్మం - తత్ ఏతత్ క్షత్రస్య క్షత్రం యత్ ధర్మః తస్మాత్ ధర్మాత్ పరం నాస్తి** (బృహదారణ్యకం 1-4-14)

(ప్రజాపతి సృష్టి చేసి సంతృప్తి పడక ''విశ్వస్థితి గతుల కాధారంగా శ్రేయోరూపమైన ధర్మాన్ని సృష్టించాడు. ఆ ధర్మం పాలకునకు పాలకుడు. కనుకనే ధర్మం కంటే పరమైనది ఏదీ లేదు.)

కనుక భారతీయ రాజనీతిలో చక్రవర్తి ధర్మరాజు. ధర్మరక్షకుడైన రాజు. అతడు భౌతికాభౌతిక సమన్వయ కర్త. ఆధ్యాత్మ చక్రవర్తి తప్ప ఆధికారిక చక్రవర్తి కాడు, ఇది మైకేవిల్లీ కుటిలరాజనీతి. కనుక అర్థశాస్త్రం కూడా ''కృత్స్నం శాస్త్రమిదం ఇంద్రియ జయః'' (1-6) ఇంద్రియ విజయార్థమే చెప్పబడిన దన్నాడు. అంటే ఏమిటో భారతం వివరిస్తుంది.

*''తను దాన తొలుత గెలువన్ - మనుజపతికి వలయుఁ బిదప మార్తుర గెలువన్*
*మనమున తలంచు నదియును - దనుగెలువని పతికి గెలువఁదరమే పగరన్''*

(శాంతి 2-276)

*''వినుము తన్ను గెలుచుటన వేరొకండె, పం*
*చేంద్రియముల దూలనీక కొలది*
*నాగుటయ జితేంద్రియత్వంబు గలరాజు*
*రిపులఁ జెరుపజాలు నృపవరేణ్య!'' (శాంతి 2-27)*

ఇందుకే ధర్మరక్షా సమర్థమైన ధనుస్సునకు ధర్మమనే పేరు. అది ఆధ్యాత్మిక ఐహిక యుద్ధసాధనముగా ఉపనిషత్తు చిత్రించింది.

ధనుః గృహీత్వా ఔపనిషదం మహాస్త్రం - శరం హి ఉపాసనా నిశితం
ఆయమ్య తద్భావగతేన చేతసా - లక్ష్యం తదేవాక్షరం సోమ్యవిద్ధి (ముండకం2-2-2)

ఉపనిషత్తు దివ్యధనుస్సు. ఉపాసన శరము. లక్ష్యము అక్షరమైన బ్రహ్మము. కనుక ధనుస్సు బ్రహ్మ-క్షత్రవిద్యాసేతువు. ఇందుకే భారతంలో అర్జునునకు సవ్యసాచి - అని బిరుదనామం. లోపల యుద్ధంలో - బయట యుద్ధంలో నిపుణుడు పార్థుడు. ధనుర్ధరుడంటే బ్రహ్మ - క్షత్ర విద్యాధనుర్ధారి. అతని కురుక్షేత్రం ధర్మక్షేత్రం. యుద్ధానికి తాత్త్విక భూమిక గీత.

భారతంలో అశ్వమేధ ప్రథమాశ్వాసంలో మిథ్యాయుద్ధ. తథ్యయుద్ధ ప్రస్తావన వస్తుంది. (వివరాలకు చూ : **నా శ్వేత ఛ్ఛత్రం**)

''వ్యాధులు రెండు విధాలు. దైహికమూ - మానసికమూ'' నని.

''వాతపిత్తశ్లేష్మముల సమత - స్వస్థత. విషమత అనారోగ్యం - అస్వస్థత ఇదే వ్యాధి. సత్త్వ-రజ -స్తమస్సుల సమత స్వస్థత. విషమత ఆధి(న్యూరోసిస్). ఈ రెండు ఆరోగ్యాలున్న మనిషే స్వస్థ చిత్తుడు కాగలడు. ''ఇది సూక్ష్మ కర్మానుష్ఠానంబు'' ఇది నిర్మలం కావాలంటే ఆధివ్యాధులు లేని స్వస్థత అవసరం. ఆ శాంతి లేనివాడు రాజు కాలేడు.

''వెలిపగర గెలుపు గెలుపే - అలఘుమతిన్ గెలువవలయు నభ్యంతర శ
త్రుల దద్విజయము మోక్షము- నలవరుపంజాలు, నొంటనమ్మేలగునే'' (అశ్వ-1-124)

ఈ రెండు గెలుపులు సాధించినవాడు ధర్మరాజు. ఇందుకే యుద్ధానంతరం అభిషేకం జరుగలేదు. జరుపుకోవటానికి మిథ్యాయుద్ధవిజయం కారణం కాదు. అభ్యంతర శత్రువిజయ సాధనమైన ధర్మజ్ఞానం అవసరం. కనుక భీష్ముని దగ్గర అనంత రాజధర్మస్వరూపం విన్నాకనే అభిషిక్తుడైనాడు. అప్పుడతడు ధర్మరాజు. ఈ అభ్యంతర శత్రువిజయంకోసం ''తథ్యయుద్ధం'' అవసరం. ఇక్కడ తనకు తానే శత్రువు. తనలోని అరిషడ్వర్గమే శత్రుపక్షం. ఈ రెంటి విజయం సాధించినవాడు కేవలం రాజు కాడు. రాజర్షి.

ఇదీ రాయని రాజధర్మానికి భూమిక -వెన్నెముక. భారతీయ ఆదర్శ ప్రభుత్వ ప్రతిష్ఠ

ఇందుకే ఆలుబిడ్డలు లేని యట్టి వాడు - మృత్యువిజేత - ఇష్టం వచ్చినపుడు ప్రాణత్యాగం చేయగల మహాత్ముడు - ఎన్నో తరాల రాజరికం - రాజ్యపాలన- విజయాదులు చవిచూచిన భీష్ముడు రాజధర్మవక్త. శ్రోత ధర్మరాజు. ఇద్దరూ విరక్తులే. వక్త పక్వబుద్ధి. శ్రోత ఇంచుమించు అంతే.

ఆముక్తంలో రాజధర్మవక్త యామునాచార్యుడు. రాజ్యాన్ని త్యజించి ఆధ్యాత్మిక సామ్రాజ్యాధిపతిత్వానికి వెళ్తున్న వైరాగ్య మూర్తి. శ్రోతకుమారుడు. నూత్నాభిషిక్తుడు.

ఇందుకోసనే ఆముక్తంలో

''కన్యాకటి నిద్రపోన్'' – (4-247)

అంతరరులపై దృష్టికి ఫలమే -

''స్ఫటలమణుల్ మీర'' - (4-200)

''దానము ద్విజరక్షణకును'' - (4-276)

ఇది తథ్య యుద్ధ సాధనకైన సామగ్రి.

ఖాండిక్యునకు కేశిధ్వజుడు గురుదక్షిణ ఇవ్వటానికి వస్తాడు. మంత్రులు రాజ్యం కోరు కొమ్మంటారు. ఇక్కడ ఖాండిక్యు డన్న మాటలు.

పరలోక సుఖము - (3-49)

అనవుడు అల్ల నవ్వి - (3-58), నిమివంశోత్పన్నులమఁట (3-59)

వంటి మాటలెవ్వ డనగలడు?

''– అజ్ఞునకుంగాక వివేకి కేల జనించున్ లౌల్యమెందున్'' - (3-6)

'' విను వర్గ సమత నృపుడున్ను ధర్మాంశంబె హెచ్చెనా! –'' (4-282)

ఓహో ! ఏమి పద్యం ! ఏమి రచన ! ఎంత పరిపక్వ జీవు డా మహాత్ముడు !

ఏపట్టున విసువకర త్రాపరుఁడవు గమ్ము ప్రజల చక్కి - ద్గర ప్రారంభించిన రాజధర్మబోధకు ముగింపు

''చేయునది రాజ్యమట'' (284)

''ఎంతే నారాయణుశరణుఁ జొరుము'' - ఇది ఆధ్యాత్మిక ఆదర్శ చక్రవర్తి స్వభావం ధర్మ ప్రభుత్వమంటే ఇది.

ఇది రాయని రాజధర్మ స్వరూపం.

ఋతువర్ణనలో ఆముక్త కవికి అవధి భూత ప్రయాణం రామాయణమైనట్లు - రాజధర్మానికి మహాభారతం.

భారతంలో భీష్మాచార్యుడు - ఆముక్తంలో యామునాచార్యుడు - ఒకటే.

కొన్ని ఉపపత్తులు -

*''పులి గూనలఁ దిను చందము -గలిగినంతటన నిలుచుఁగాక ధనంబుల్,*

*గలుగునె మోదము గావున- జలగ దిగిచినట్లుగొనఁగ నిల సొమ్ముల్''* (శాంతి-2-393)

''అరిమిగులఁ గొనుట గ్రేపులఁ, బోరిమాలం బిదికినట్ల'' - (శాంతి 2-339.)

*''ఏనుఁగే నుంగు బేర్చినట్లెసక మెసగు*
*నంగముల సొంపుఁ బులికిని సింగమునకు*
*బుట్టినట్టి యుగ్రతయును గట్టిమెఱయు*
*నలనుగల యోధవీరులు వలయు ననికి'' (3-10. శాంతి)*

అరిపయి వీఁక నెత్తిన చనునప్పుడు దేనియ లుట్టునట్లుగా -

*- ''నరపతి వానివారలు వినంబ్రియమాడుట మేలు - పక్షితాఁ*
*- చిరముగఁజేయఁగా మృగముతేకువ వాపను, వేటకాడు, త*
*- త్స్వరములు సూపికాదె తుదిఁజంపదెగున్ దన బారిబాఱినన్.'' (3-21)*

ఈ జంతుస్వభావాలు వేటగాని పరిజ్ఞానంలోనివి. ఈ లక్షణమే రాయల రాజనీతిలోనూ కన్పిస్తుంది. (4-241,246)

*''కుడువనిచ్చు తఱియు, గురువర! క్రక్కించు*
*నవసరంబు నెఱిఁగి యరినృపాలు*
*నీవు ధీర వృత్తి నిదుద్రాట పోనిమ్ము*
*క్రమ్మ కపిల యనఁగ గ్రమ్మ చెఱువు'' ( ఆశ్రమ 1-72)*

*''అనద తనంబును, బెడిఁదఁపు*
*దనమును లేకుండఁ బరగి దరియొత్తెడి యే*
*ఱును బోలె నొత్తవలయును*
*మనుజేంద్రుడు మార్దురం గ్రమంబున నధిపా !'' (శాంతి 3-24)*

పోవం బోలు - ఆముక్తం (4-247)

*''విను నృప ! సమ్రాట్టు విరా*
*ట్టనియెడు శబ్దములఁ బొగడు నాగమములు నె*
*ట్టన భూపాలకు'' - (శాంతి 2-27)*

ఆముక్తంలో 4-285 వచనంలో ఇదే చెప్పబడినది.

''విషమున, మాంత్రిక విధిఁ జంపుపాటున
నలయక రిపుఁ దెగటార్పవలయు - (శాంతి 3-36)

ఇది విని శ్రోత క్షేమదర్శి - అధర్మోపాయ విధాయకంబులగు నపాయంబులకుం జొరం జాలనన -(3-37)

కనుక ఇది ఉదాత్త చక్రవర్తి స్వభావంగా భారత కథనం.

''అభిచారి, ఘనగరాంబు దూషిత రుజ్జీరంత రాద్రి'' - (ఆముక్త 4-268) లో కుటిల క్రూర రాజనీతిని శత్రురాజులపై ఆరోపించి చెప్పటానికి కారణం ధర్మ ప్రభువున కది నీతికాదు కనుక.

భారతంలో ధర్మరాజు ననుసరించి ఆదర్శప్రభుత్వం- ఆదర్శరాజధర్మం చెప్పబడితే - సుయోధను నాశ్రయించి కణిక రాజనీతి కథితమైనది. దీనిని చూచి ఒక పాశ్చాత్య రాజనీతి శాస్త్రవేత్త డా॥ మెకంజీ బ్రౌన్ తన

White umbrella (శ్వేత ఛత్రం)లో భారతంలో ఇక్కడ మైకేవిల్లీ రాజనీతి కన్పిస్తున్నదన్నాడు. కానీ ఇది ప్రతినాయకుని రాజనీతి తప్ప నాయకుని రాజధర్మంకాదు. దీనికి వక్తలు నారద - భీష్ములు.

కాబట్టి ఆదర్శరాజ్యపాలన సూత్రమే భారతమూ ఆముక్తమూ వివరిస్తున్న వనాలి.

రాయల రాజధర్మప్రసంగ మంతా స్వానుభవమేనని వ్యాఖ్యానంలోనే ప్రదర్శితమైనది. దాని కుపబలకంగా ఈ విషయమూ అనుసంధించాలి.

పూర్వాచార్యులు సైతమూ తత్పూర్వమతాలను చూచి అవసరమైనచోట స్వానుభవజన్యమైన విద్వత్తును ప్రదర్శిస్తూ శాస్త్రరచన చేశారు తప్ప. ఏదీ ఎవ్వడూ స్వతంత్రించి చెప్పింది లేదు.

కనుకనే కామందకాదులు చెప్పిన ద్వాదశ రాజమండలం- పంచప్రకృతులు - దుర్గస్వరూపాలు - భేదాలు - చతుర్విధ యానములు - వంటివానిని రాయలు స్పృశించనేలేదు. ఒకవేళ చెప్పవలసివస్తే స్వతంత్రంగా చెప్పాడేతప్ప పూర్వమతాల ననువదించలేదు. యామునాచార్యుడు శ్రీరంగనాథ దర్శనం చేసినపుడు ఆ యామునుని ప్రసిద్ధస్తోత్ర రత్నానువాదం చేసాడా ? - అంత భక్తితో వ్రాసిన గోదకథలో ఆమె పాశుర మొక్కటైన తెలుగులో పెట్టాడా? - విష్ణుచిత్తుని ప్రబంధాలను ముట్టుకొన్నాడా? - అంత విజేత యాముని

దండయాత్రను వర్ణించాడా ? - స్వయంగా సేనాగ్రగామియై యుద్ధాలు చేసిన మహావీరుడై కూడా- అలాంటి సందర్భంలోనే మౌనియైన రాయలు పూర్వరాజనీతి ననువదిస్తాడా?

## రాజధర్మం - II

పూర్వవ్యాఖ్యాతలు ఒక రిద్ద రన్నారు. ఈ ఆముక్తరాజనీతి పూర్వులు చెప్పినదే నని. కానే కాదు.

''పూర్వమతాని యథేదం సంగృహ్యైకం చకార కౌటిల్యః'' అని జయమంగళవ్యాఖ్య. అయినా అర్థశాస్త్రగౌరవానికేమీ నష్టం రాకపోగా నేటికీ ఆ మార్గంలో అది అగ్రేసరంగానే ఉన్నది. పూర్వమతాలు గ్రహించి అవసరమైతే అంగీకరిస్తూ - ఖండిస్తూ తన మతాన్ని చెప్పడమనేది ఏ శాస్త్రకారుడైనా చేసేపనే. రాయలవారూ అంతే. పూర్వగ్రంథకర్తలు చెప్పినదే తానూ చెప్పినందువల్ల లాభమేమున్నది? కనుక ఆ నూరుపద్యాల్లో చెప్పినది స్వానుభవ జన్యమే. ఎడనెడ కొంత అన్యమత ప్రసక్తి ఉన్నా తనది కానిది కావ్యంలో 10 పాళ్ళుండవచ్చు). ఇదీ కష్టమే చెప్పటం. ఇతరుల అలంకారమే గ్రహించనివాడు శాస్త్రవిషయాన్ని సంగ్రహిస్తాడా!

'ఎవరిని మంత్రిగా చేయాలి? మంత్రిలక్షణా లేవి?' అన్న దానికి భారత సమాధానం-

''పితృపితామహ క్రమ సమాగతులు, విశదమతులు
*గాగ వలయు సచివులు'' - (ఆశ్రమవాసం. 1-56)*
*''నయవిక్రమ క్రమజ్ఞులైన యమాత్యులతో'' - (శాంతి 2-285-)*

### అర్థశాస్త్రం

1. 'సహాధ్యాయినోఽమాత్యాన్ కుర్వీత, దృష్టశౌచ సామర్థ్యత్వాత్ - ఇతి భరద్వాజః. తేహ్యస్య విశ్వాస్యాః భవంతీతి.

2. నేతి విశాలాక్షః - 'సహ క్రీడితత్వాత్ పరిభవంత్యేనం'.

యే హ్యస్య గుహ్యసధర్మాణ స్తానమాత్యాన్ కుర్వీత సమానశీల

వ్యసనత్వాత్. తేహ్యస్య మర్మజ్ఞ భయన్నా పరాధ్యతీతి' -

ఇలా - పరాశర - పిశున - కౌణపదంత - వాతవ్యాధి - బాహుదంతీ పుత్రాదుల మతాలు చెప్పి

'సర్వముపపన్నమితి కౌటిల్యః' - అంటూ స్వమత స్థాపన చేసాడు.

' జానపదః అభిజాతః స్వగ్రహః కృతశిల్పః
చక్షుష్మాన్, ప్రాజ్ఞః, ధారయిష్ణుః, దక్షః, వాగ్మీ - - - - -
సంప్రియః వైరాణామకర్తా - ఇత్యమాత్ సంపత్'

ఈ దీర్ఘవాక్యంలో 22 లక్షణా లుపన్యసించి ఇది మంత్రిలక్షణ మన్నా డాయన.

''కులమును, బావనతయు, వడి
గలతనమును, దండనీతి, గడుఁబనిగొను చొ
ప్పులు ననురాగము జదువును
గలవార లమాత్యజనులు గావలెఁ బతికిన్ ( ఆంధ్రకామందకం - 2-80)

రాయల సిద్ధాంతం ''చదివి'' - (4-211)

ఈయన చెప్పిన వానిలో చదివి, అరుజాస్య పూర్వులై - పైలక్షణాల్లో ఉన్నా - ( ఇది ఇతరుల్లోనూ ఉంది) లక్షణరచన తనదే. ఏ పద్ధతి చాణక్యుడనుసరించాడో అదే కవిగా కావ్యంలో తా ననుసరించడం అనుచితం కనుక పూర్వ మత సంగ్రహణం లేదు. తాను చెప్పిందే తన అనుభవం; తన లోకజ్ఞత; తన శాస్త్రదృష్టి.

ఈపద్యంలో మంత్రి లక్షణపరిష్కారం చేయడంలో రాయలవారు రాజనీతిశాస్త్రకారుల శ్రేణిలో చేర్చవలసినవాడౌతున్నాడు. ఆ యా పూర్వాచార్యులు చెప్పినది ఏదో ఒకే కోణంనుండి చెప్పడంవల్ల వాదప్రతివాదాల కాస్కారమేర్పడినది. అలాగే కౌటిలీయంలోనూ. ఆ మహాచార్యుడు చెప్పిన 22లక్షణాలకూ మరికొన్ని చేర్చవచ్చు తర్వాతి ఆచార్యులు. సమగ్రంగా చెప్పడం కష్టం. కనుక రాయని పద్యంలో వయఃపరిమితి; రాజు ప్రార్థన అన్నవి ఇతరులు చెప్పనివి.

'చక్రవర్తుల దైనందిన జీవితవిధాన మెలా ఉంటుంది ?' అంటే భారతం చెప్పిన దిది- ధృతరాష్ట్రుడు ధర్మరాజునకు చెప్పిన రాజనీతిలోని దిది.

''దానికిమును దేవతాపూజనము భూసు
రార్చనమును జేయు మమల బుద్ధి
ప్రొద్దుసాలంగ నెక్కినప్పుడు సమ్యక్ష
భోజనము నిర్వహింపుము సుశీల
మాన్య ! తదనంతరము గంధమాల్యభూష
ణాంబరములు నిజేచ్ఛమై ననుభవింపు.''
కొలువిమ్ము మాపుకడ యో
ధులకెల్ల సంధ్యవడ్డ దూతలనుం జా
రుల సంభావింపుము, రా
త్రులఁ గాంతా భోగ తత్పరుఁడ వగుము నృపా !'' ( ఆశ్రమ 1- 60, 61)

దీన్నే కౌటిలీయమూ చెప్పింది. ఆయన పగటిని రాత్రిని ఎనిమిదేసి భాగాలు చెప్పిన దిది.

పగలు - 1వ జాము - రక్షావిధానం ఆయవ్యయ విచారణ.

2 '' - పౌరజానపద కార్యవిచారణ.

3'' - స్నాన భోజన స్వాధ్యాయం.

4. '' - పూర్వదినాదాయ స్వీకారం.

5. '' - మంత్రిపరిషదాలోచన

6. '' - మంత్రాంగం లేదా విహారం

7. '' - అశ్వగజాయుధ పరీక్ష

8. '' - సేనాపతి విక్రమ చింతన

రాత్రి - 1వ జాము - గూఢపురుష దర్శనం

2 '' - పానభోజన స్వాధ్యాయాలు

3. '' - తూర్య శ్రవణ రూఢత్వాలు

4. '' - సంవిష్టం

5. '' -శయనం

6. '' - శాస్త్రవిచారణ

7. '' - ఋత్విగాచార్యం - చికిత్స

8. '' - మహానసిక - మౌహూర్తిక దర్శనం.

మనుస్మృతి 7 145 - 226

1. స్నానం, ధ్యానం, అధ్యయనం, అర్చనం.
2. న్యాయవిచారణ, నేరవిచారణ
3. మంత్రాంగం
4. విదేశాంగ శాఖతో ఆలోచన. విదేశరాయబారులతో గూఢచారులతో గోష్ఠి.
5. సేనాధిపతితో సేనావిషయక చర్చ.

మధ్యాహ్నం - రాత్రి

1. వ్యాయామం, స్నానం, రక్షణ శాఖ విచారణ
2. సేనాపరీక్ష యుద్ధవిషయ విచారణ

3. సంధ్యా ప్రార్థన
4. రహస్య శాఖతో చర్చ
5. సంగీతం, విశ్రాంతి

ఆముక్తంచెప్పిన పద్యం (4-27)

ప్రాచీనాచార్యులు చెప్పిన వానితో పోల్చిచూస్తే రాయలవారి ఆచార్యత్వం నిర్ధారిత మౌతుంది. రాజనీతి శాస్త్రకర్తల్లో శ్రీకృష్ణదేవరాయల వారిది చివరిమాట. తర్వాత ఈ దేశంలో చక్రవర్తి అంతరించాడు.

మరొక రకంగా దీనినే దృఢీకరించవచ్చు.

*1.* *''ఆ యతికాడు వలయు నర*
*నాయకునకు వాని కెల్ల నరులుం జేటుం*
*జేయఁ దలఁతురు''* -

కనుక రాజు వానికి రక్షణ కల్పించాలి (శాంతి 2-363)

దీనిపై రాయలన్నది '' ఆయతికాని కీకుము'' (4-263)

2. చక్రవర్తి ''విశేషించి పురోహితుం బాటింపవలయు'' (శాంతి 2-322,326)

చాణక్యుడూ వ్రాశాడు -

''పురోహితం ఉదితోదిత కులశీలం, షడంగే :
నిమిత్తే దండనీత్యాం చ అభివినీతం,
ఆపదాం దైవమానుషాణాం అధ్వరభిరూపాయైశ్చ ప్రతికుర్వతాం కుర్వీత. తం ఆచార్యం శిష్యః పుత్రః భృత్యస్వామిన మివ చానువర్తేత'' (5-9)

ఈవిషయాన్ని పెంచక రాయలవారు

''హితులు భిషగ్గ్రహజ్ఞ బుధబృంద కవీంద్ర పురోహితులు'' - మాత్రమే అన్నాడు. సభాపర్వంలో నారదుడు కూడా ఈ విషయాన్ని ప్రస్తావిస్తాడు.

*3.* *''దుర్గ స్వరూపాన్ని వివరిస్తూ భీష్ముడు -*
*గడ్డియు, ఖాణంబు, కొలుచును, కట్టియలును,*
*నేయి నూనెయు, ఆయుధౌషధముల, ఆభీలయంత్రాలు,*
*కూపములు, మహావీరుల''నుంచాలి అన్నాడు.*

అలాగే కామందకం -

*''జలమును ధాన్యము నాయుధ*
*ములు రసవర్గములు యోధముఖ్యులు మంత్రం*
*బులు గలిగి'' - (2-104)*

రాయలీ విషయాన్ని కుదిస్తూ

''హితబహుశ్రుత ధర్మరత'' - (4-204)

ఎంత పట్టిక వ్రాసినా ఏదో శేషిస్తూనే ఉంటుంది. కనుక ''పులిజున్ను మొదలుగా'' అని కుదించాడు.

పూర్వులు సూచించిన విషయాన్ని విశదీకరించటం మరొక పద్ధతి.

1. ''దుర్మంత్రుల కుటిల వాక్యములకు లోనుగాక'' (శాంతి 2-285)

ఈవిషయాన్ని విశదీకరిస్తూ రాయలవారన్నవి 4 పద్యాలు 4-228,229,231,232.

ఆంధ్రకామందకం చెప్పిన మంత్రివ్యసనాలు -

*''అలసత, జాడ్యము, గర్వము*
*కలహము తెచ్చుట ప్రమాదగతి, ఉద్ధతి'' - (6-48)*

పైపద్యాల్లో ఎక్కడో సురిగిపోతున్నది. అంతగా స్వతంత్రించి చెప్పటం ఆ మహాప్రభుని అనుభవం కదా!

ఆటవికులను లోబరచుకొనే విధానం, వారి మనఃప్రవృత్తులు, (4-223,224,225)

రాయబారులను విచారించే తీరు (4-259)

అస్థితి శూరులకు గడిదేశాలపై ఆధిపత్యమివ్వటం (4-221)

పిశునాంధ్ర యెడల ప్రవర్తన (4-220)

ఇదంతా రాయని రాజనీతి ఆచార్యత్వానికి ప్రబలోదాహరణ నిశ్రేణిక.

ఇంకా చూచుకోవచ్చు.

*''ఎల్లకార్యములు మంత్రి - జనములతోడ విచారించి చేయంగ*
*వలయును, గుప్తనివాసమొండె*
*మాడువు మీదొండె, మాటులేని యరణ్య*
*తలమొండె, మంత్రనిధానమునకు స్థలముల్'' (ఆశ్రమ. 1-58)*

అలాగే అర్థశాస్త్రమూ (11-15) చెప్పింది.

ఇవి సామాన్య విషయాలు. చెప్పనక్కరలేదు. ఇందుకే ఆముక్తంలో వీటికి చోటు లభించలేదు. శాస్త్రవిషయం చెప్పాలి. లోకం చెప్పక్కర్లేదు.

రాజు నిత్యజీవన విధానం చెబుతూ భారతమన్నది.

-''రాత్రులకాంతా భోగతత్పరుఁడ వగుము-'' (1-61)

ఆముక్తం కావ్యం కనుక -

''నిశన్ సుషుప్తి పూర్వకము ప్రేయసీ గోష్ఠిపతికి'' (4-271) అని ప్రథమ పురుషలో చెప్పట మెంత ఔచితీమంతంగా ఉంది.

ఈమాటకు పైపద్యాల్లో

-''పరుషముల రాయబారి యెదుట పలుకకుము''(4-268)

''అభిచారి - చౌరకుము''

అని మధ్యమ పురుషలో సంబోధిస్తూ ఇక్కడ ప్రథమ పురుషలో అన్నాడు. వక్త తండ్రి శ్రోత కుమారుడు. సంభాషణ ఎలా ఉంటుంది? అలా వ్రాయటం కావ్యమార్గం.

'శ్రీకృష్ణదేవరాయలవారు తిరుమలలో వైష్ణవాచార్య మఠాదులకు దానమివ్వలేదని అచ్యుతరాయ లెక్కువగా ఆచరించినాడనీ కొందరన్నారు. దానికి కారణం కృష్ణదేవరాయలవారి ఈ పద్యంలో ఉందనుకుంటాను, అంతేకాని ఈయనకంటే అచ్యుతరాయలు మహాభక్తుడనీ కాదు. మహాప్రభుత్వం వేరు. మహాభక్తి వేరు. దేనికదిగా ఉండాలనుకోవటం చక్రవర్తిత్వం.

1. అక్షర పక్షపాతమున - అన్నపద్యంలోని విషయం నేను చూచినంత మేరలో ప్రాచీనాచార్యులు చెప్పినది కాదు. అధిభౌతిక - అధిదైవిక సమన్వయ మీ పద్యంలోని రహస్యం. ఇలాంటిది చెప్పటానికి **'అతిలోక మతి'** అవసరం. అది ఉన్నపుడే ఆచార్యత్వసిద్ధి.

శ్రీరంగనాథ వర్ణనలో 6-99 మహాకవిలోని మహర్షి లక్షణం, వ్యాఖ్యానంలో చూచుకోవాలి.

ఇది ఆధ్యాత్మిక దర్శనం.

ఇదే ఆదర్శ ప్రభులక్షణం. దీనిని చెప్పటంలో రాయలవారు ఆచార్యత్వ పీఠాభిషిక్తులైనారు. మిగిలిన విషయాల కా యా పద్యవ్యాఖ్యానం సాక్ష్యం.

అతని పాలన కలియుగమును కృతయుగముగా నడపించినది అనుట కీ పద్యమే సాక్ష్యము.

''అక్షర పక్షపాతమున''

ఇందు శిశుచ్యుతి కల్గుట యధర్మపాలనకు సూచనగా రాయలు చెప్పటం రాముని కాలంలో శంబుక వధకు నిమిత్తమైన శిశుమరణాన్ని సూచించటమే. కావున తనపాలన రామపాలన యట్టిదనటమే ధ్వనిత రమణీయార్థం. కనుకనే శ్రీకృష్ణదేవరాయలవారిని వేనోళ్ళకీర్తిస్తూ ఈ తిరుపతి శాసనం వాయుస్కంధ వీచికలలో నాతని యశః కర్పూరంలో కస్తూరికా పరిమళముల నద్దుతూ దిగంత విశ్రాంత మవుతున్నది.

''ఇహ కిల జగతి నిఖిల కవికులాభినంద్య మానేకార్య ధైర్య
శౌర్యాది జనిత యశఃపూర కర్పూర పూరిత బ్రహ్మాండ
కరండేన, విహసిత నృగ, నళ, నహుష, నాభాగ, దుంధుమార
మాంధాతృ భారత భగీరథ రామాదిచరితేన, కృతభూసుర
త్రాణేన, భోజేనాపరేణ, కావ్యనాటకాలంకార ధర్మజ్ఞేన, మర్మజ్ఞేన
నాగాంబికే నరసనృపనంద నేన - విజయనగరే
సింహాసన మారుహ్య శాసతాం సకలాం భుజనిజిత
సాంపరాయేణ కృష్ణదేవమహారాయేణ భువన భరణ
సావధానాయ వేంకటేశాభిధానాయ - దత్తమిదం
ధర్మశాసనం''.

## అనంత వైదుష్యము

రాయలవారు తమ కావ్యమునకు పూర్వం సంస్కృతంలో అనేక కావ్యనాటకాలు వ్రాసినట్లు పీఠికలో పద్యమొకటి సాక్ష్యమిస్తున్నది. అందులో ఒకపాదం -

''శ్రుతిపురాణోప సంహిత లేర్చికూర్చితి
సకల కథాసార సంగ్రహంబు.''

దీనివలన కవి తత్పూర్వగ్రంథ సముద్రమును మథించినాడని తెలుస్తున్నది కదా ! ఇంత జ్ఞానగాంభీర్య మూరక దాచుకొనక కావ్యంలో జాల్వార్చిక ఊరుకొనడు. అతని పఠనపద్ధతి యనంత మైనది. అట్టివాడు మాట్లాడిన యెడల తత్పూర్వ పఠిత గ్రంథరహస్యములు వెలువడక మానవు. ఆముక్తంలో ఎడనెడ కవి తన యపూర్వశాస్త్ర విజ్ఞానం వెదబెట్టినాడు. అందులో కొన్ని విషయంలో వ్యాఖ్యాతలు సూచించారు. వానిని తిరిగి వ్రాయక వారు వదలిన వానినిగురించి చూచుకోవాలి కదా !

ఆముక్తంలో మతవాద సందర్భంలో కవి సర్వతోముఖ ప్రజ్ఞను వేదోపనిషత్ప్రవేశాన్ని

వెళ్ళడించినాడు. ఈవిషయం తత్సందర్భంలో కాక, వర్ణనల్లో నాశ్వాసాంతాల్లో కలవానినిగూర్చియే, ఆ విజ్ఞానంలో విభజించి ప్రదర్శించుకోవచ్చు.

1.పౌరాణిక జ్ఞానము 2.యోగ శాస్త్రము 3. కామశాస్త్రము 4. లౌకిక జ్ఞానము 5,6.గజాశ్వశాస్త్రములు 7. రత్నశాస్త్రము.

**పౌరాణిక జ్ఞానము -**

నన్నయభట్టు పెద్దన మొదలగు కవీంద్రులు బ్రహ్మాండాది పురాణ విజ్ఞాననిరతు లని వారే చెప్పుకొన్నారు. అట్లే రామకృష్ణుడు తనను గూర్చి

''శైవ వైష్ణవ పురాణావళి నానార్థ రచనాపటిష్ఠైక మతిని'' అన్నాడు. రాయ లుదారుడు, పరమగంభీరస్వభావుడు, తానట్టి మాటలు తనను గుఱించి తానై చెప్పుకొన లేదు. వీలును లేదు. వ్రాయుమన్నది భగవంతుడు కనుక, అతడును భక్తుని పొగడటానకి వీలులేదు కదా. కాని కావ్యంలో కవికున్న నానాశాస్త్రార్థవాసన పరిమళిస్తున్నది. ప్రాచీన కవులందఱును పురాణాదులు తఱచి చూచినవారే. అందులో ఏ యే విషయాలు రహస్యాలున్నవో వారికి కరతలామలకములు. రాయలు నాకోవకే చెందినవాడే. ముందాశ్వాసాంత పద్యాల్లో కవి పౌరాణిక జ్ఞానం ప్రదర్శిత మౌతున్నది.

1. ద్రుహిణజ ముఖమౌని స్తోమని స్తంద్రభాస్వ
   ద్ధహోర విహరమాణా తామ్రపాదాంబుజాతా ! ! (2-100)

2. కరధృత దరారివితరణ
   పరిపాలిత తొండమాన్నృపాలక. (4-287)

3. హరార్చక దుర్భరపక్వతపః కుహనార్భక !
   వార్భృతకోనిరిహారి హిరణ్యయహర్మ్య చరిష్ణుపదా. (5-159)

4. కృక వాకుధ్వజదీర్ఘ కాష్ఠవతపః క్రీడోత్సవాద్యుత్సుకా. (3-90)

5. స్కందరసస్తటీరమణ కందరచందన కుందవాటికా
   మందసమీరలోల వనమాలిక !

6. గుహపుష్కరిణీతట ఘనగహన గుహోఖేటవంచన పుళిందునకున్ - షష్ఠ్యంతములు,

ఇవిగాక

''ఇషి కాదృతవార్ధ శ్రవసైక నేత్రవై కృతనిపుణా !'' (2-99)

ఇట్టివి ఉన్నవి. అవి సర్వవిదితములు, కావున పరిత్యక్తము లౌతున్నవి.

1. నారదాదులు విష్ణుభక్తులు కదా. ఇది సకలజనవిదితమే. కావున దానికొక పురాణమందలి వాక్యములు చూపనక్కరలేదనవచ్చు. కాని యిక్కడ కవివాడిన మాటలను బట్టి యిందలి విషయం కేవలం భారతమునకు సంబంధించినదని స్పష్టపడుతున్నది.

శాంతిపర్వం షష్ఠాశ్వాసంలో శ్వేతద్వీప నివాసియైన పరముడు నారాయణుని మూర్తి కథనమున్నది. నారాయణముని దయచే నారదుడు శ్వేతద్వీపవాసియగు స్వామి నారాధించు మార్గము తెలిసి

''దుగ్ధార్ణవమునకు నుత్తరంబు చేరువనున్న శ్వేతద్వీపంబు
నందనాహారులు, నింద్రియ వృత్తిరహితులు, నస్వేదులు
సుగంధి శ్వేతాంగులు''-

అగు ముక్తపురుషులను చూచి భగవంతు నెల్గెత్తి స్తుతింపగా స్వామి ప్రత్యక్షమై నిజస్వరూపమును ప్రపంచించి యిట్లనెను.

''నను@ గానబడయ రెవ్వరు
ననఘా ! యేకాంతికులక య్యర్థము మద్ద
ర్శన మీవే కాంతికుడవు
ననహంకారుడవు గాన యబ్జాంజాడన్.'' (6-379)

నారదుని స్థితియట్టిది. ఆయన దర్శించిన శ్వేతద్వీపము, తన్నివాసులు, భగవత్సాక్షాత్కృతి, తద్వాఙ్మయామృతాస్వాదనము.

''క్రమమున వాఙ్మయమగు నయ్యమృతము లోకమును@ బరగా'' (6-391)

ఇవి సర్వము నారదుడు బాహ్యమున చూడలేదు.

''నారదు డట్టు లద్దీవియును, నద్భుతాంగులైన యమ్మానవులు@ దన
యంతరంగంబున దోచిన'' (6-37)

నారదు డుత్సాహియై స్తుతింప

''సితాసిత పీతారుణ పిశంగ హరిత వర్ణంబులను బహుశిరో
బహుపాదంబులును''

గల స్వామి సాక్షాత్కరించెను. కావున స్వామి 'నారదహరవిహరమాణ పాదాంబుజాతుడు' అని కవి స్తుతించెను.

2. బ్రహ్మపురాణము -

''శత్రవశ్చ బలో(దిక్తా రురుధు స్తస్య వై పురీం శ్రుత్వా బల్నార్ణవం
ఘోరమాయాంతం నాతిశంకతః యోద్ధుకామో జగా
మాదపునస్సైశ్మ పరాజితః తతః ఖిన్నమనా భూత్వా తమేవ
శరణం యయౌ, బిలద్వారేణ దేవేశం గత్వా పాదౌ ప్రగృ
హ్యచ రురోద త్రాహి త్రాహీతి తం ప్రాహోర్చాస్వరూపవాన్
మా భైషీః పుత్రభద్రం తే చక్రశంఖౌ దదామి తే, తాభ్యాం
గచ్ఛ పురీం దివ్యాం తౌతే శత్రూన్ హనిష్యతః ఇత్యుక్త్వా తౌ
దదౌతస్మై తాభ్యాం సహ జగామ సః తౌ చ శత్రూన్ నిహత్యాశు
కృత్వా రాజ్య మకంటకం'' బ్రహ్మపురాణే. సప్తమోఽధ్యాయః.

ఈ తొండమాన్ ప్రభువు పాలకుడు తుండీరమండలమును వీరనారాయణ పురమును రాజధానిగా నేలుతున్నాడు. అతడు పొంతనున్న శ్రీవేంకటాచలనాథు పాదపద్మారాధకుడు. ఆయన కొక కాంచనపాంచాలిక వంటి బాలిక భూమిని దున్నుతుండగా దొరికినది. ఆమెయే పద్మావతి. ఆమెను స్వామి వివాహమాడెను. రాజేమరుపాటున నుండగా శత్రువులు దాడిచేస్తే తొండమాన్ స్వామిని పట్టుకొని దుఃఖించినాడు. ఆయన తన శంఖచక్రములచే శత్రుహననం చేసినాడట.

తారక సంహారోపాయం తెలియక దేవతల పడవాలు వేంకటాచలముపై ఒక సెలయేటిజాలు ప్రక్క తపస్సు చేయగా నాస్వామి శక్తినొసగగా, కుమారుడు తారక నిర్మూలనం చేసినాడు. పిదప తారకాసుర సంహారానంతరము కుమారస్వామికి బ్రహ్మ హత్యాదోషము సంభవిస్తే శివుడు కుమారునకు వేంకటాచలమున కేగుమని చెప్పగా నాయన తిరుమలపై కుమారధారలో స్నానంచేసి వేంకటేశ్వరుని స్మరిస్తే తత్పాపము రూపుమాసిన దట !

''శక్తిప్రదం శక్తిప్రాణో శ్శరణ్యం శరణార్థినాం, పురామరైః
ప్రార్థితేన శంకరేణ పురారిణా ! ఔమాపతో బాహులేయ
స్సేనాపత్యే నియోజితః, తద్వోఢు మసహన్సోపి సేనాపత్యే
నివిష్టధీః, అనేకాపాయసదనముపాయరహితో గుహః. దైత్యారేః
ప్రాప్తు కామస్సం స్తత్ప్రతీకారమాత్మవాన్. త్రిసంధ్య
మాప్లవం కుర్వస్త్రివృద్బ్రహ్మ జపన్ త్సుధీః, త్రిసంధ్యమర్చ
యన్ విష్ణుః దివ్యైః పుష్పైః అనన్యధీర. అస్యానిర్ఝర ధారా
నిష్ఠరశ్రవాః ఆవిర్భూయ దిదేశక్తింతస్మైసోపి తిరోదధే.

[illegible] ప్రణమ్యాదదేనం స్వర్గం జగామ సః. తస్మాత్
[illegible]రధారేతి విఖ్యాతా విమలోదకా. ప్రథమాన ప్రశంసా
[illegible]ప్రమేయ ఫలప్రదా. (పద్మపురాణము, చతుర్వింశోధ్యాయము.)

[illegible] స్నానమాడి దేని యొడ్డున తపస్థితుడైనాడోయదే స్కందపుష్కరిణో లేక [illegible]

"కుమారధారి కేత్యేవ త్వన్నామ్నేదం భవిష్యతి" (మార్కం, 4అధ్యా.)

[illegible] కుమారధారనే ప్రశంసించిన హేతువు పురాణవిషయక జ్ఞానమే. భగవంతుడే స్కందునకు [illegible] దేవతలతో నిట్లన్నాడు.

"కుమారధారికాస్నానం కులకోటిం సముద్ధరేత్" (మార్కం 4- అధ్యా.)

ఈ ధారాపవిత్రత, వారాహం, పాద్మం, మార్కండేయం, వామనపురాణం, భవిష్యోత్తర పురాణం, స్కందపురాణాల్లో స్కందధారను గుఱించిన కథలు అనంతంగా ఉన్నవి. ఈకథను [illegible]కొని రాయలు కుమారధారనే కావ్యంలో పలుసార్లు స్మరించి నిర్ధూత సకల [illegible]

[illegible] వేంకటేశ్వరుడు స్కంద ధారాప్రాంతాల్లో పుళిందాకృతియై వేటాడుతాడని చెప్పబడినది.

దీనికి సంబంధించిన కథ భవిష్యోత్తర పురాణంలో ఉన్నది. స్వామి పుళిందాకృతిలో [illegible] పద్మావతీ దేవి విహరించే ఉద్యానవనంలో ప్రవేశిస్తే సఖు లిట్లనుకొన్నారు.

"[illegible]గతా బాలా అన్యోన్యం వాక్యమబ్రువన్, కోఽయ
[illegible] సఖి! కంజాతలోచనే! కోఽసౌ కిరాతరూపీ చ
కిం [illegible]యాపరః" (భవిష్య 7 అధ్యా.)

[illegible] పద్మావతీ దేవి తల్లికి సోదె చెబుతూ (భగవంతుడే పుల్కసీరూపమున కరవీర [illegible] కేగినట్లుచే కథ) .

"యోఽసౌ తురగమారుఢః పురుషః పూర్వ మాగతః కిరాత
[illegible]ధారి ససాక్షాన్మన్మథమన్మథః, తం దృష్ట్వా మోహ
[illegible]తా కామజ్వరసుపీడితా, దుహితా తేఽభవద్రాజ్ఞి తతో
[illegible]శోషణం.

[illegible] పద్మావతితల్లి ధారుణీదేవి యాతడెవ్వరంటె పుల్కసి

"[illegible] హరిః సాక్షాత్ వర్తతే వేంకటాచలే". (భ. ఉ 9 అధ్యా)

అని చెప్పినది. కనుక ఈపద్యాల్లో కవి ప్రదర్శించిన పౌరాణిక జ్ఞానమిది. ఇంతే కాక స్వామి యొకసారి మృగయార్థియై శబరరూపంలో వెళ్ళితే అడవిలో వృషభాసురుడన్న రాకాసి చూచి

*''అహో! కోఽస్యస్య మాయావీ స్రష్టాఽద్రేరుపరిధ్రువం*

*శార్ఙ్గపాణిం మాయారూఢం శబరాకృతి ధారణం''*

అని యుద్ధం చేసినాడట. ఇందులోనూ భగవంతుడు పుళిందుడై వేటలాడే విషయము చెప్పబడినది. ఈ కథను బ్రహ్మాండపురాణం నాల్గవ యధ్యాయం చెబుతున్నది. ఇట్లనేక పురాణములందున్న విషయాన్నే రాయలవారు -

**''గుహపుష్కరిణీ తట గత ఘనగుహాఖేట పంచక పుళిందునకున్''**

అని స్తుతించాడు.

## జ్యోతిశ్శాస్త్రం

కవికి జ్యోతిషవిద్యలో అమేయ పాండిత్యమున్నదనటానికి కొన్ని పద్యాలు సాక్ష్యమిస్తున్నవి.

1 కర్కశుడంట కోర్వక - ( 4-76)
2. వనతతివరాహ - (4-77)
3. సారెకుమింట మేఘుఁడు - (4-106)
4. బలిదైతేయ - (4-26)

వీటిని గురించి వ్యాఖ్యాతలు వివరించారు.

''మేరుశృంగాగ్ర సమ్మిళితమై శింశుమా
రముసప్తకోటుల నమరు నరుబ
దియు మూడులక్షలు దీర్ఘమయ్యుఁ గులాల
చక్రంబు రీతినిచ్చలును దిరుగు -
- కాలస్వరూపమై తేజరిల్లు '' (వాణీ విలాస వనమాలిక 1అ.)

''ఇలఁ గుళీరధనుర్మాసములు మొదలుగ
నాఁబునాఁటసి నెల లుత్తరాయణమ్ము
దక్షిణాయనమగు హెచ్చుతక్కువ లహ
ములగు చక్రాన (మరు) ద్గతు లలవడంగ''. (వా. వి. వ. 1అ.)

అది మేరు శృంగాగ్రమున నున్నదట. కులాలచక్రమువలె తిరుగుతున్నది. ఆయనములు దానిచేతనే యేర్పడుతున్నవి. రాహుకేతువు లట సదా వక్రగతి చరిస్తున్నారు.

''అట్టి శింశుమార చక్రమధ్యస్థుండగు ధ్రువుని కరగతపాశ
లగ్నంబులై యూర్ధ్వ లోకంబు లమరు''.

కనుక కాలస్వరూపం సర్వము తదధీనం, అలాంటి చక్రం

''కపిలాననము, ఉన్నత పుచ్ఛమును, అది జగదఖిలోద్ధరణము
సకలార్థ సిద్ధిదము'' (వా. వి. వ 1అ)

బలికీర్తి జ్వాల బ్రహ్మాండములోపల - పైన మండుతున్నవి. దాని నార్పగా స్వామి శింశుమారమంట పెరిగెను- అనుటచేత బ్రహ్మాండమున కూర్ధ్వమునందే యిది ఉన్నట్లు కవి చెప్పినాడు. ఇది పెద్ద నక్షత్రముల గుంపు అంతటి దాకసంలో మఱొకటి లేదు. దీనినే Cetes అంటారు. ( అని నన్నయ భట్టు విజ్ఞాన నిరతి)

ధ్రువుడును, తన్మధ్యమున నున్నాడనటం వల్ల నది సర్వోపరిగతము.

ధ్రువమండల మెక్కడున్నది? విష్ణువు సాక్షాత్కరించి ధ్రువునితో -

''త్రిదశగ్రహ తారా ముని
పదముల కన్నిటికి నుపరిభాగంబునఁ బెం
పొదవు ధ్రువస్థానంబు
న్నది, యిచ్చేటిత్తు నీకు'' (విష్ణు. పు. 2-90)

ఇంకను వివరంగా విష్ణుపురాణ మిట్లంటున్నాది.

''సూర్య, చంద్ర, నక్షత్ర, బుధ, శుక్ర, అంగారక, బృహస్పతి
శనైశ్చర, సప్తర్షి మండలములకంటె పైది ధ్రువమండలము.''

అట్ట ధ్రువమండలం శింశుమార గర్భాంతరం. కనుక అది బ్రహ్మమండ లోపరితలాన నున్నది. స్వామి దానికంటెను పైకెగసినాడు.

### కామశాస్త్రం

''చక్రస్తన ప్రకాశమునకు ఫేనంపు
గొంగిడి గొనగొనఁ గొళ్ళగొణఁగి'' -

ఇది శరత్కాల స్రవంతులనుగూర్చిన పద్యం. నదులు నాయికలు. సముద్రుడు నాయకుడు. ఎత్తుగీతివరకు విప్రలంభస్థితి. గీతంలో సంయోగం. ఇందు పూరుషాయితం వర్ణితము. మొదటినుండీ రూపకం నిర్వహింపబడినది. వ్యాఖ్యాత లలాగే వ్రాసారు. కానీ ఎత్తుగీతలో మాత్రము నదీపరంగానే వ్రాసారు కాని నాయికాపరంగా అన్వయించలేదు. ఇందుచేత రూపక మసంపూర్తిగ మిగిలిపోయినది.

మొదటినుండి చక్రస్తన ప్రకాశము చక్రవాకము లనెడి స్తనముల ప్రకారము - చక్రవాకములవంటి స్తన ప్రకాశము. (నాయికాపరము).

ఇలా నిర్వహిస్తే తుదకు నదీపరంగానే కవి చెప్పటం కుదరదు. అక్కడా నాయికా పరమైన యర్థముండాలి. 'కువల మధులహరి నబ్ధిఁజెందిపై మగతనముల, శరత్ప్రవంతులుబ్బు స్వరూపమునే భర్తృహరి వర్ణించినాడు.

*''ఉరసి నిపతితానాం స్రస్తధమ్మిల్లకానాం*
*ముకుళితనయనానాం కించి దున్మీలితానాం*
*ఉపరిసురతఖేద స్విన్న గండస్థలానాం*
*అధరమధువధూనాం భాగ్యవంతః పిబంతి'' (శృంగార శతకము.)*

కువల మధులహరి - కలువలయొక్క మకరందముయొక్క పెద్ద అలచేత - (వేదము) - కలువల మకరంద ప్రవాహముచేత (వావిళ్ళ).

ఇట్లిద్దఱును నదీపరంగానే వ్రాసారు. కవి ఇక్కడ వీరాయితాన్ని వర్ణిస్తున్నాడు. మఱి నాయికా పరమైన యర్థమిది.

కువలమధులహరి - కువలమధులహరివంటి పరిమళముగల లేక కువలమధువనెడి, శోణితం ఐనచో శోణితాణువులు కువలమధు వేమి? శోణితమునకు పరిమళమున్నట్లు కామ శాస్త్రము.

*''శీతలసుగంధ మన్మథసీమ సలిల*
*పద్మినీ కామినీ మణి.'' (వా.వి. వ. 4అ.)*

ఆమె-

*''హరశుభాంబర చారుభూషణ గంధ*
*సుమలోల రాయంచ సొబగునడపు''*

ఫేనంపుకొంగు, హంసహారము, పరాగరేఖాస్వర్ణరశన, జలశాటి, ఇట్టి స్వరూపం కలదిగా కవి చెప్పినాడు. కాబట్టి పద్యంలో పద్మినీ స్త్రీ పూరుషాయితము వర్ణితమైనది.

## రత్నశాస్త్రము

ఆముక్త కవి చక్రవర్తి యైన కారణంగా రత్నాదిశాస్త్ర పరిచయం కలవాడు కావలసినదే.

*''విశదపయోదపుంబొరల వేష్టనచే నొకమై నభోమణిన్*
*లశునపటంబు లొందుట మనంబున నారసి కాంచి విష్ణు డ*

యృశివత్కైక పదంబు వలయంబున బాపి యవస్థులోభక
ర్కశతఁ బ్రబోధ మంది సిరిగాంచి చెలంగె పయఃపయోనిధిన్.'' (4-159)

ఇది శరదృతు పద్యము. ఇందు లశునపటంబన్న రత్న దోషము చెప్పబడినదని వావిళ్ళ టీక వారి ననుసరించి వేదమువారును, రత్నదోషములాఱు.

''లశున, పటల, త్రాసభిన్న, కర్కశ, నీల, జర్ఘరము'' లని రత్నశాస్త్రము.

పేర్మి లశునత్రాస భిన్నముల్ పటలంబు

''జర్ఘరంబు, కర్కశమును నీల
మనఁగ దోషషట్కముగు కెంపుజాతికి'' (వా. వి. వ. 4అ.)

''పాలుపై జూపిన లీల నుండెడి డాలు - లశుపటల మదిలక్ష్మిజెఱచు
జిదురుపలైన యట్లొదవిన పటలంబు -ఘనశోక వనధిలో మునుగఁ జేయు. . .'' లశునము, పటలము, వేర్వేరుగా చెప్పి స్వరూప నిరూపణంలో పటలము లని కని ఒకటిగా చెప్పుట వింత.

''పాలు పయిబోయ గనుపడు డాలది లశునంబు
చిద్రుపలైన రీతిచేఁ బటలం బది శోకకారణంబు''.

అని వేర్వేఱుగా టేకుమళ్ళ రంగశాయికవి తన వాణీవిలాస వనమాలికలో పేర్కొనెను. ఇతడు త్రాసము భిన్నము వేర్వేఱనెను. రత్నపరీక్షాగ్రంథకారుడును త్రాసభిన్నము నొకటిగానే పఠించి యాఱని యుదాహరణమున-

''పగిలిన గలురేకపై నున్న త్రాసంబు
కలహమెప్పుడు దాన గలుగుచుండు
దునుకపోయిన రీతి దోచుచు భిన్నంబది
చయ్యనబంధు పక్షంబు చెఱచు'' -

నని వేర్వేరుగా చెప్పినా డెందుకో ? ఏమైనా లశునపటలముల పైన వేర్వేఱుగా చూసాం. కావున రాయలు లశునపటంబు - అన్న సమాసమున రెండు దోషములు గ్రహించవలెగాని యొకటి కాదు.

లశునము- పాలుపోసిన రీతిగానుండుదోషము
పటలము - చిదురుపలై నట్లొదవుట.

ఈ రెంటిని గ్రహించాలి. ఇంతేకాక నాల్గవ పాదంలో కర్కశశబ్దమున్నది. దీనికి వ్యాఖ్యాత లిద్దఱును కాఠిన్యమనియే వ్రాసిరి. దీని కర్థ మిది కాదు. రత్న దోషాల్లో న దొకటి. దాని స్వరూపం

''కర్కశంబది ప్రాణసంకట మొనర్చు''

-గడుసు బారియుండుట- రత్నపరీక్ష.

కాబట్టి విష్ణుపదంబు వలయంబును విష్ణువు త్యజించెను. ఎలాగా? తల్లో భవము వదలి, లోభమెందుకు? అది నభోమణి. అనగా రవి, అతడు పద్మ రాగమున కధిపతి. కాబట్టి నిట మణిపద్మరాగం. ఇంతేకాక పైదోషాలారు పద్మరాగమునకు చెందినవి గాని తదితర రత్నాలకు చెందినవి కావు. ఆ పద్మరాగం.

''మానికములకెల్లను మొదలై చొక్కమగు పద్మరాగము
లెక్కింప నమూల్యము- అది నిలింపుల కమరున్ ''
''తులయెత్తు పద్మరాగము
తెలియఁగఁ జొష్టి నే దీనారంబుల్
వెలయెక్కు డంత కంతకు
బలువై వేనేలు దాని పై పై గూడున్.''

-''ధరపద్మరాగ మెందును దొరుకదు కలియుగమునందు'' - (రత్నపరీక్ష)

అని రత్నపరీక్షయన్న గ్రంథంలో భైరవకవి. కాబట్టి అంత యనర్ఘమణిని సైతం స్వామి పరిత్యజించటం చెప్పబడినది.

''మణియందు దోషము
లెన్నగ మజీ రెండుమూడు నేర్పడియున్నన్
గన్నుల నది ప్రొద్దున గను
గొన్నను గొఱకాదు వట్టి గొడసలువచ్చున్''

స్వామి త్రివిధదోషయుక్తమైన పదవలయమందలి నభోమణిని చూడలేదు. చూడక మనంబున నారసి పరిత్యజించి పిదప ప్రబోధమొంది సిరిగాంచి పయఃపయోనిధిలో చెలంగెనట. ఈమూటివల్ల ఫలిత మేమంటే

1. లక్ష్మిని చెఱచుట. 2. శోకమున ముంచుట, 3. ప్రాణసంకటము.

ఇందులో విష్ణువు యోగనిద్రనుండి మేల్కొవటం వర్ణితం. శరత్కాలపు మొగిలు విరియెండలు పెళుసుదనమును వర్ణించుట తాత్పర్యం. భగవంతునకు దీర్ఘకాలము వియోగము సంభవించింది. ఆ వియోగమే లక్ష్మివియోగము. శోకము - ప్రాణసంకటంలాంటి మణిపోయినది కనుక కనులు విప్పి నిప్పుగా సిరిదర్శన మైనది.

ఈ లోకసామాన్య విషయాన్ని కవిరత్నశాస్త్ర విజ్ఞానాన్ని మేళవించి బహుసాంద్ర చిక్కణంగా నీ పద్యం నిర్మించినాడు.

( ఈపద్యమున 'లశునపటంబు నొంది' యని యున్నది. కానీ 'పటంబులొందె' యని ఉండాలి)

గజశాస్త్రము

*''కొండయుబోలె వాడు వలగొందునె భక్తి నిజద్రుమభ్రమీ*
*హిండన వాలు పాకలపు టేనుఁగుబోలె''.* (6-47)

బ్రహ్మరాక్షసుడు మాలదాసరి పాదములకు నమస్కరించెనట. ఇందేన్గులకు వచ్చు పాకలవ్యాధి ప్రస్తావితమైనది.

*''జరంబులును గజజాతికి పాకలంబులును, అట్టి పాకలదశకంబును,*
*ద్వాత్రింశత్పాదరోగంబులును, గూల కక్కుటాది సప్తవాహ*
*నంబులును, ద్వాదశశోభలు, శాల్మలీకదళీతండులంబులను*
*జతర్వింశతి నేత్రరోగంబులును గలవు'' (వా. వి. వ. 4అ)*

ఈ రోగముపోవుట కష్టము. బ్రహ్మరాక్షసునకు తద్రూపమే రోగము. పోవుట యసాధ్యమైనను తుదకు ఫలించెను.

అశ్వశాస్త్రము

*''పూచిన మావులందవిలి పూవిలు జోదున కమ్మె మాధవుం*
*డేచిన శంక యాత డవియే కొనియే పథికావళీ జయ*
*శ్రీచణు డయ్యె'' -* (5-120)

పూచిన మావులు(గుఱ్ఱములు) కొనుట యకృత్యము - పీడాకరమని చెప్పబడినది. పూచిన మావులనగా మచ్చలగుఱ్ఱములు, కుసుమిత మాకందములు (వేదము), ఆపూచిన మావులు అవసరముకోసమై - పథికావళీజయార్థమై మరుడుకొని యుద్ధమున జయించినాడు. ఇది దైవసాహాయ్యము. పద్యమున 'తవిలి' యనగా వెంటబడి యని యర్థం. (అంటి - వావిళ్ళ - పూనుకొని - వేద) ఎవరి వెంటబడి - మరుని వెంటబడి - పదే పదే యమ్మెదనని వెంటబడి, ఎందుకమ్ముతున్నాడో యని శంకించు కొనేవాడు- మరుడు -కొనెను. కాని దైవానుకూల్యం వల్ల విజయం సిద్ధించినది. ఈమావు లల్పమూల్య లబ్ధములు. ఇది తవిలి శబ్దంవల్ల ఊహ్యం.

యోగశాస్త్రము

ప్రాచీన మహాకవు లందఱకు నీ శాస్త్రంతో పరిచయ మున్నట్లు పండితలోక మెఱిగినదే. కాని రాయలవారికున్న యోగశాస్త్రవిజ్ఞాన మపారం. ఖాండిక్య కేశిధ్వజసంవాదమం దిది స్పష్టమే.

''కంధరనీలవర్ణ ! మధుకైటభనాగసువర్ణ ! యోగిహృ
ద్గ్రంథి భిదోత్థభోగివనితాస్వనవచ్ఛ్వసన స్రవచ్ఛిర
స్సంధి వసన్నిశాపతిరసస్రుతి దుగ్ధ పయోధివీచికా
మంధర కేళికాదర ! సమాశ్రిత పంక్తి శిరోధిసోదరా !''

(5వ ఆశ్వాసాంతము)

''అంజ సమానవాయుగణమంతయు ఖంజత చిక్కనజ్జవో
ష్మంజనియించు చిక్కని వాయువులోనొకండు గ
ల్మిం జనియించు దుర్యశను మేల్కని లేహనవేళ వాజు లూ
ర్పంజెడు మాణిబంధముకురంబుల కాళిమపేర గార్కొనున్.'' (2-28)

ఇందులోని యోగశాస్త్ర విషయమగాథం.

మొదటి పద్య మాశ్వాసాంత స్తుతి. నారాయణుడు

''దుగ్ధాంబోధి మహాగృహోత్సుకుడు'' (4-286) దుగ్ధాంబోధి బ్రహ్మాండంలోపాలపుంతనుట సరే కానీ మానవ శరీరమందే యున్నదనటమూ సత్యమే. పిండాండ బ్రహ్మాండముల కభేదమే కాబట్టి.

యోగి హృద్గ్రంథులను భేదించి యుత్థితయైన కుండలినీశక్తి యన్న కుండలిని (పాము) బుసకొట్టుచున్నది. దాని కంపనచే స్రవించుచున్నట్టి శిరస్సంధి యందున్నట్టి చంద్రరసస్రావణ మన్న పాలసంద్రపుటలయందు కేళీలోలుడైనవాడా ! ఈ సమాసమందే యోగశాస్త్రవిషయ ముంది. ఇందలి శబ్దాలు గ్రంధి - కుండలినీ - నిశాపతి - రసస్రుతి - శిరస్సంధి యోగశాస్త్రసాంకేతిక శబ్దములు.

గ్రంథులు మూడు. 1. బ్రహ్మగ్రంథి 2. విష్ణుగ్రంథి 3. రుద్రగ్రంథి. షట్చక్రములకు షడర్ధగ్రంథులు. రెండేసి చక్రముల కొక గ్రంథిచొప్పున నున్నది. మూలాధార, స్వాధిష్ఠానములకు మధ్యబ్రహ్మగ్రంథి; మణిపుర, అనాహత, మధ్య విష్ణుగ్రంథి, విశుద్ధాజ్ఞోపరి రుద్రగ్రంథి, - ఈమూడు గ్రంథులలో మొదటిది యన్నయము కోశము, స్థూలదేహాభిమానము కలది; రెండవది ప్రాణమయ, మనోమయ కోశద్వయ రూపము, తేజోరూపము, సూక్ష్మశరీరాభిమానము కలది. మూడవది విజ్ఞానానందమయ కోశరూపము.

మొదటిది జాగ్రదవస్థాపన్న విశ్వనామక జీవుడు.
రెండవది స్వప్నావస్థాపన్న తైజసనామక జీవుడు.
మూడవది సుషుప్త్యవస్థాపన్న ప్రాజ్ఞనామక జీవుడు. (కామకళావిలాసం)

మూడు గ్రంథులు పంచకోశస్వరూపములై, త్రివిధ జీవాకృతులై స్థూలసూక్ష్మ కారణ శరీరమూర్తులై యున్నవి. వాని నాశనము పిదప భగవత్సాక్షాత్కృతి, దానికి యోగమార్గమే శరణ్యము. ఆ పని కుండలినీ శక్తి నిర్వహించును, యోగి యమనియమ- ప్రాణాయామాదులచే నిద్రిత కుండలిని రాజిల్లెడి క్రోధవివశయై బుస్సులు కొట్టుచు మూలాధారమునుండి షట్చక్రాలను గ్రంథిత్రయాన్ని భేదించుకొంటూ పోయి సహస్రారకమలమందలి (దీనినే కవి శిరస్సంధియన్నది) చంద్రకళామృతమును స్రవింపజేయును. సహస్రారమందున్న చంద్రకళామృతమే సుధాసింధువు. అది దైవ్యధిష్ణ్యముచే ఘనీభవించియుండగా కుండలినీ స్పర్శయను నగ్నిచే ప్రవాహముగా స్రవించును. (అగ్నిరూపా పరదేవి కుండలిని ప్రవేశమువలన చంద్రమండలము ద్రవించి యమృతధారలు ప్రవహించును లలితా సహస్రవ్యాఖ్యా 122) దీనినే కవి నిశాపతి రసస్రుతి యన్నాడు. అదే దుగ్ధపయోధి-సుధాసింధువు

''సహస్రారమధ్యగత కర్ణికారూప చంద్రమండలం
బిందు రూపం తస్మాత్తదేవ సుధాసింధుః'' (కా. క. వి)
''బిందుస్థానం సుధాసింధుః'' (వామకేశ్వరీతంత్రము) కా. క. వి 227

దీనినే ఆదిశంకరులు సౌందర్యలహరిలో-

''సుధాసింధో ర్మధ్యే సురవిటపివాటీ పరివృతే'' అని దానిని దేవీ స్థానంగా కీర్తించారు. ఆ దేవియే కుండలిని ఆమె మూలాధారంనుండి పయనించి సహస్రారకమలంలో కామేశ్వరునిచేర సుఖిస్తున్నది. సహస్రార కమలమే యామెస్థానము. ఇదియే యాదిదంపతుల నివాసభూమి. వారిని శాక్తేయులు ఉమామహేశ్వర ద్వంద్వమనవచ్చు. రాయలు లక్ష్మీనారాయణ ద్వంద్వమన్నాడు. కుండలినీశక్తి లక్ష్మి యేమి రాజరాజేశ్వరీ పరాభట్టారిక యేమి, ఎవరైనను తుదకు సహస్రారకమలం ప్రవేశించే అది జ్యోత్స్నాలోకం. అచట కాలం లేదు, కాలం షట్చక్రములవరకే. కాలము లేనిచోట చీకటి లేదు. ఇది లేనిచోట నామము లేదు. మనుష్యబుద్ధి యల్పమై యనంత విషయమును మహాశక్తి లేని నామరూపకల్పన చేసికొన్నది. దాని నొకడు లక్ష్మీనారాయణ ద్వంద్వమన్నాడు. మఱొకడు ఉమామహేశ్వర ద్వంద్వమన్నాడు. నామభేదమే కాని వస్తుభేదము లేదు.

రాయల నారాయణ సాక్షాత్కృతి షట్చక్ర - త్రిగ్రంథి భేదనాంతరము. అది కుండలినీ కార్యం.

''షట్చక్ర భేదిన్యై నమో నమః – గ్రంథివిభేదిన్యై నమో నమః''

(లలితాసహస్రము)

చంద్రకళామృత స్రవణము (నిశాపతిస్రుతి) ఆమె యగ్ని స్పర్శ చేతనే (సుధాసారాభివర్షిణ్యై నమః- లలితా సహస్రము) ఆ చంద్రకళామృత ప్రవాహమే దుగ్ధపయోధి. పరమేశ్వరుడగు నారాయణుని దివ్యస్థానము. భక్తిన ఉపాస్యము.

ఈ యర్థమును వట్టి శాస్త్రవేత్తయైనా వ్రాయవచ్చు. కాని రాయలమహాయోగి యన్న విషయమును ననుమానించటాని కక్కడక్కడ కొన్ని మార్గాలు కన్పించటం వల్ల రాయలయోగానుభూతి కావచ్చు.

పై పద్యమున కవి గ్రంథి యని నిర్విశేషణంగా వ్రాయక సవిశేషంగా హృద్గ్రంథియని వ్రాయటంలో రహస్య మేమి?

హృదయము అనాహత చక్రస్థానము విష్ణుగ్రంథి యనాహతము పైది. ఈగ్రంథి స్వరూపము పైన వివరింపబడినది. అది మిథ్యాప్రపంచానుభవము కలది. (సూక్ష్మశరీరాభిమానీ మిథ్యా ప్రపంచానుభవః కలుషరజః ప్రధానప్రకృతిః) ఇది విష్ణుస్థానము. అందుచే నీలోకమే సత్యమనిపించును. ఈయన్పించుట విష్ణుగ్రంథి కార్యము. ఇందుచేతనే వైష్ణవమాయ యన్నమాట పుట్టినది. (దానిని లంఘించుట యశక్యమనుట) దానిని భేదించినచో మోక్ష సమీపమున కేగుటయే. హృద్గ్రంథి - విష్ణుగ్రంథి - భేదనమే కష్టము. మిథ్యాభ్రాంతి తొలగించుకొని భగవత్స్వరూపమే యథార్థమన్న జ్ఞానము పుట్టించుకొనుట మహావిషయం. అందుకే హృద్గ్రంథియన్నాడు. విష్ణుగ్రంథి భేదనము తర్వాత-

> ''స్థూలదేహ ప్రపంచము లసత్యములని తెలిసినపైని
> జీవితము నిజమని నిశ్చయము కలుగును'' (లలితాసహస్రము.)

ఈనిశ్చయమే మోక్షమార్గం. మఱియు 'భోగివనితాస్వనవత్ శ్వసనవచ్ఛిరస్సంధి' యన్నాడు స్వనవచ్ఛ్వసనమంటేమి? మరి స్వనవత్ - ఉన్నది. అనగా వట్టిధ్వని కలదని కాదు. అనాహత మనగా నేమి ? లోకమందలి శబ్దమాహతము. (రెంటి స్పర్శచే కల్గేది) ఈచక్రమందలి ధ్వని యనాహతం (కొట్టబడనిది)- ఆహతముకానిది. దానంతటదే నిరంతరం విన్పిస్తుంది. దాని కెడతెఱపి లేదు. కావున అనాహతం శ్రీదేవి - కుండలినీ దేవి - మణిపూరనుందుత్పన్నమై అనాహతను పొందుతుంది.

> '' ఇచట పరాశక్తి పతిదర్శనోత్సాహముచే నాదబ్రహ్మాకార
> మైన మంగళధ్వనులతోబయలుదేరి స్వస్థానమైన సహస్రార
> కమలమందలి కామేశ్వరుని దర్శనము పొందునుగాన, ఈ
> రూపమును పొందించును, అటుల కామేశునకు బోధించును.''

(లలితాసహస్రవ్యాఖ్య. 118)

రెండవ పద్యము గుల్ఫములను వర్ణించు సందర్భమందలిది. తాత్పర్యము

మధురానగరమందలి యశ్వము లొక్క యంగలోనే సమాన
వాయుగణమును జయించెను. కాని సమానమను పేరుగల
వాయువొకటి మాత్రము జితముకాక కడుపునందే చిక్కెను.
దానివల్ల గుజ్జాల కపయశస్సు కల్గెను. ఆ యపకీర్తి నైల్యమే
లేహనవేళ నిట్టూర్పులచేత మాణి బంధముకురంబులం
దేర్పడిన నైల్యము.

ఇందు సమాన వాయుగణమన్నమాట యున్నది. ఇది యాంతరవాయు సంబంధియని తెలుస్తూనే యున్నది. అది యోగశాస్త్ర ప్రసిద్ధం. కాబట్టి ఇందులో యోగశాస్త్రరహస్య మున్నది.

గుజ్జములొక యంజలోనే సమానవాయు గణమును ఖంజితపఱచెను. (వాయుగణము వెనుక పడునట్లు పర్వెత్తెను)

ఆజవోష్మచే జనియించు చిక్కని సమానపువాయువులోపల నొక్కండు కల్మి నపకీర్తి జనించెనట. ఇదేమిటి? సమానవాయు గణము సర్వమంజలోనే జితనుయ్యెను. ఆ గణములో నొక వాయువు తమ కందక మిగిలిపోయెను. ఆ వాయు వేది?

ముఖ్యవాయువులు - ప్రాణాపాన వ్యానోదాన సమానములు.

ఉపవాయువులు - నాగ, కూర్మ, కృకర, ధనంజయ దేవదత్తములు.

వీని స్థానములను 'సంజీవనీ' వ్యాఖ్య యుదాహరించినది. నేనుదాహరించు దర్శనో పనిషత్తునకును దానికిని భేదమున్నది.

| వాయువు | దర్శనోపనిషత్తు | అమరము |
|---|---|---|
| ప్రాణవాయువు | ముఖము- ముకుపుటములు -హృదయము | హృదయము |
| అపానము | గుదమధ్యము- ఊరువు- జానువు- నాభి- ఉదరము- పిక్కలు | గుదము |
| వ్యానము | కర్ణనేత్ర మధ్యభాగములు- మూపులు- చీలమండలు | గళము<br>సర్వశరీరము |
| ఉదానము | పాదములు - హస్తములు | కంఠదేశము |
| సమానము | సర్వశరీరము | నాభి |

''నాగాదివాయవః పంచత్వగస్థ్యాదిషు సంస్థితాః'' (దర్శనోపనిషత్తు)

దర్శనోపనిషత్తు యోగ విద్యాచార్యుడు దత్తాత్రేయుడు సాంకృతికి చేసిన బోధ. దీనినే ప్రమాణంగా గ్రహించాలి.

పద్యంలో సమానవాయుగణమంటే ఈ పది యాంతరవాయువులు.

(సంజీవనీవ్యాఖ్య బాహ్యవాయుస్కంధములను గ్రహించెను. ఇది చింత్యము)

''చిక్కని సమానపువాయువులో నొకండు కల్మిన్'' - దీని కర్థ మేమి?

ఆ గుఱ్ఱములు 9 వాయువులను జయించెను, ఆసమానపు వాయువులో నొకండు కల్మిన్ - లోపల మిగిలిపోయినది.

(చిక్కని - అందని)

చిరంజీవని వ్యాఖ్యానుసారము :-

సమానపు వాయువు - సమానమను పేరిగాలి (తమసాటి గాలి)

ఒకండు - అజితవాయుగణమందలిది కాక వేఱొక టి

కల్మిన్ - ఉండుటవలన.

అంజసమానపు వాయుగణమంతయు ఖంజత చిక్కగా - చిక్కని సమానపు వాయువు లోనొకండు కల్మి. మొదటిపాదమున సమానవాయుగణమంతయు జితమయ్యెనని ప్రథమపాదమున చెప్పి ద్వితీయపాదమున చిక్కలేదంటే? సమానమన్నగాలి యొకటి లోనున్నందువల్ల - ఇందలి యొకటి కర్థ మేమి? రెండు సమానపు వాయువు లున్నవి కనుకనా? కావున ముందు నేనువ్రాసినదే సమంజసార్థం.

సమాన వాయుగణమంతయు నోడెనుగాని యందులో నొకటిమాత్రము చిక్కలేదు. ఆ వాయువు ప్రాణవాయువు - స్థానములు పైన వ్రాయబడనివి కదా? అది దాని కపకీర్తి ఘటించెను. 'లేహనవేళ వాజులూర్పన్'

*''ఊర్పుట ప్రాణవాయు ప్రచోదితక్రియ*
*నిశ్వాసోచ్ఛ్వాస కాసాశ్చ ప్రాణకర్మహింసాంకృతే!'' (ద. ఉ.)*

ఇందుచే ప్రాణకర్మ ఐన నిశ్వాసము పైకి వచ్చి మాణిబంధములపై నైల్యము ఘటించింది. అపు డీ సంగతి వానికి తెలిసింది. అది తమకు చిక్కలేదని, ఆ ప్రాణవాయువును జయించటం యోగిలక్షణం కాని అశ్వలక్షణం కాదు. దానిని జయిస్తే

''జవోష్మం జనియించు -

జవోష్మ- వేగము వల్ల కల్గిన వేడిమి - తల్లక్షణములు స్వేదకంపములు.

''ప్రస్వేదజనకో యస్తు ప్రాణాయామేషు సోఽధమః
కంపనం మధ్యమం విద్యా దుత్థానం చోత్తమం విదుః,
పూర్వం పూర్వం ప్రకుర్వీత యావదుత్థానసంభవః.'' (ద. ఉ.)

దేహము తేలికయ్యై గాలిలో తేలుతున్నట్లుంటే ఉత్తమం. అందాక ప్రాణాయామం చేయాలి. జనోష్మం జనియించు - చిక్కని = వేగమువల్ల కల్గిన వేడిమిచే దొరకనట్టి = ఉత్తమ ప్రాణాయామస్థితిః గాలిలో తేలిపోవునట్టి స్థితి. వీనికి లేదు. ఎందుచే ననగా-

**''సంభవత్యుత్తమే ప్రాజ్ఞః, ప్రాణాయామే సుఖీ భవేత్'' -**

ఈ స్థితి యోగికే సాధ్యము. గుజ్జములకు మధ్యమాధమస్థితులే లభించెను.

అంజ - అడుగు - సమీపము

ఖంజము - కుంటి - కొల - వధ - బల్లెము - బాణము

సమాన వాయుగణమంతా సమీపంలో (కొలదికాలమందే) చిక్కగా నా ప్రాణాయామపు టుత్తమ స్థితి లభింపలేదు.

యోగశాస్త్రపరముగా ఖంజత అంటే (వాయు) వధ (విజయము)

ప్రాణాయామ ప్రయోజనము.

''ప్రాణాయామ పరస్యాస్య పురుషస్య మహాత్మనః దేహశ్చో
త్తిష్ఠతే న కించిత్ జ్ఞానాద్విముక్తతా మనోజవత్వ మాప్నోతి.''

గుజ్జములీ సిద్ధికై యత్నించి ఓడిపోయెను. దీనికి ముందున్న పద్యమున గుజ్జాలు వాయు, బాణవేగము లందెనని చెప్పబడెను. మనోజవము మాత్రము సిద్ధింపలేదన్నది కవి చమత్కరించి ఇలా చెప్పాడు.

ఇంతేకాక ప్రాణవాయువు నాయంగములందు బంధించినచో నాయా సిద్ధులు కల్గుతాయని ఆ యుపనిషత్తే చెబుతున్నది. దీనినే ప్రత్యాహార మంటారట. అంగుష్ఠంలో బంధిస్తే శరీర లఘుత్వము కల్గునట. ఇందుకే సమానాదిగణమును అంజ - పాదము(అంగుష్ఠము) న బంధించిన నశ్వములు. ప్రాణవాయువు మాత్రం బంధింపబడలేదు. ఇందుచే వానికి మనోజవము సిద్ధించలేదు. అవి యోగభ్రష్టము లయ్యెను. ఇదే కాళిను పేర పేర్కొన్న యపకీర్తి

చక్రవర్తి రత్న గజాశ్వాది సకల శాస్త్రవేత్త కావలెనని శుక్రనీతి చెబుతున్నది. రాయలట్టివాడే యనుట నిరూపితమైనది.

## కావ్యతత్త్వ పరివేషం

ఆత్మానుభవరూపమైన మతానికి పరమత ఖండనం మరొక ముఖం. దీనికి ఆచార్యులు పరమత ఖండన - స్వమతస్థాపన రూపమైన శాస్త్రమర్యాదలేర్పరిచినవారు, వారి నిరూపణమే విష్ణుచిత్తుని వాదంగా కవి పండించిన వేదవేదాంత శాస్త్రచర్చ. ఈవాద వివాదాలెన్ని ఆ మహాప్రభువు తన ఆస్థానంలో ప్రత్యక్షంగా కన్నాడో? చెప్పలేము. శ్రీవల్లభాచార్యులు లక్ష్మీధరులు - ఎందరో ప్రభువు భువన విజయంలో సన్మానితు లైనారో !! కవులతోపాటు ఇదంతా చరిత్ర కెక్కిన సత్యమే కాగా ఆ వాదచర్చలకీ విష్ణుచిత్తుని వాదం ప్రతిధ్వనియే, దర్పణమే. ఈ విషయంలో రాయల ప్రతిభ నాన్యతో దర్శనీయం ఆయన వేదాంత శాస్త్ర దర్శనశక్తి - కవితాబద్ధం చేసిన తీరు ఇతర కావ్యాల్లో కన్పించని ప్రజ్ఞానేత్రం.

'' జగదుద్గతికిని - (3-8)

ఆదినారాయణుండాయె నొక్కఁడ'' - (10)

వంటి శాస్త్రార్థకవితా సంపద కీ కావ్యం కాణాచి కదా !

*జగదుద్గతికిని బీజము ప్రధానమన నీ*
*క్షత్యాది నీశు నశబ్దవాదిన్ -''*

ఈవాదంలో సాంఖ్యమత ఖండనం చేయబడినది.

జగత్తు మోక్ష బహిర్వ్యక్తీకరణకు సృజ్‌ధాతునిష్పన్నమైన సృష్టికి అర్థం లోనున్న దానిని బయటకు వమించటం - ఇది వామాశక్తి కార్యమని తంత్ర వాదం. వమించేది కనుక వామా బీజం ప్రకృతి అని నిరీశ్వర వాదియైన సాంఖ్యాన్ని 'ఈక్షతేర్నా శబ్ద' మన్న బ్రహ్మసూత్రం ద్వారా జయించాడని తాత్పర్యం.

ఈక్షత్యధికరణమన్న బ్రహ్మసూత్ర విభాగంలో సాంఖ్యవాదం ఖండించబడినది. ( ఆ సూత్రం 1.1.5) ఉపనిషత్తుల్లో సృష్టి ఈక్షణకర్మగా చెప్పబడినది. ఈ క్షణం (సంకల్పం) సచేతన పదార్థబోధకం తప్ప అచేతనమైన అశబ్దాన్ని మూల ప్రకృతిని బోధించదు. అశబ్దమంటే శ్రీభాష్యంలో-

**'యస్మిన్ శబ్ద ఏవ ప్రమాణం న భవతి ; తత్ అశబ్దం - ఆనుమానికం ప్రధానమిత్యర్థః'** శబ్దమంటే వేదం. అదే ప్రమాణం కాదు. అనుమానమూ ప్రమాణమేనని సాంఖ్యుల భావం. కనుక ప్రపంచానికి త్రిగుణాత్మక ప్రకృతులు బీజమని వీరి మతం. ఉపనిషత్తుల్లోని ఈక్షణాదిక మంత్రభాగాలకు ప్రధానమని అర్థం చెప్పగా బాదరాయణ మహర్షి అది ఖండించి అవాక్యార్థం పరబ్రహ్మమని స్థాపించిన విషయాన్నే ఇక్కడ శ్రీభాష్యానుసారంగా రాయలవారు ప్రతిపాదిస్తున్నారు.

సృష్ట్యారంభంలో 'తత్ ఐక్షత' అది సంకల్పించిం దన్నమాటకు సృష్టి ఈశ్వర సంకల్పమని సంస్థాపితం. కాబట్టి ఈశ్వరుడు సృష్టికర్త తప్ప మూల ప్రకృతి కాదు.

*2. పారినీశుడేననా భోగమాత్రేత్యాద్యు*
*దాహృతి స్ఫూర్తి మాయావి వాదిన్*

నేనే ఈశ్వరుడను. జగత్తు మాయాకృతం కనుక మిథ్య. రజ్జుసర్పభ్రాంతి బ్రహ్మమందారోపిత సృష్టి. మాయ అజ్ఞాన కల్పితము అన్న మాయావాదాన్ని

''భోగమాత్రసామ్యలింగాచ్చ'' (4-4-21.)

అన్న సూత్రం బ్రహ్మ సూత్రాల్లో చిట్టచివరిది. తర్వాత ముగింపు సూత్రమైన

''అనావృత్తిః శబ్దాత్ – అనావృత్తిః శబ్దాత్ ''

ముక్తునకు పునరావృత్తి లేదు. వేదప్రమాణంవల్ల అన్నదే ముగింపు. దీనికి పై సూత్రం ముక్తునకు పరమాత్మ సాయుజ్య మెంతవరకంటే భోగానుభవంలోనే తప్ప సృష్టి నిర్మాణాదుల్లో కాదు. అంటే

''ఓం బ్రహ్మవిదాప్నోతి పరం తదేషాభ్యుక్తా. సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ. యో వేద నిహితం గుహాయా పరమే వ్యోమన్ సోఽ_ శ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితే'' అని తైత్తిరీయ బ్రాహ్మణాలలో ప్రతిపాదించినట్లుగా బ్రహ్మవేత్త బ్రహ్మమే అవుతున్నాడు. బ్రహ్మమంటే సత్యం జ్ఞానం అనంతం. కనుక ముక్తుడూ అంటే సర్వకామానుభవాలూ పొందుతున్నాడు.

ఈ వాక్యానుసారంగా ముక్తునకు బ్రహ్మ సామ్య మెందులో నంటే భోగానుభవంలోనే తప్ప సృష్టినిర్మాణంలో కాదని బ్రహ్మసూత్ర తాత్పర్యంగా భాష్యకారులు వేదం. ''అహం బ్రహ్మాస్మి, తత్త్వమసి'' వంటి వాక్యాలు జీవబ్రహ్మైక్యవాదస్థాపకాలే కానీ సృష్టినిర్మాణాదుల్లో ముక్తునకు సామ్యం లేదన్న సూత్రం ద్వారా జీవేశ్వరుల సామ్యం భోగమాత్ర పర్యవసిత మైనందువల్ల సర్వాత్మనా జీవేశ్వరాభేదం తప్పుగా మాయావాది ఖండనంగా పద్యం రెండోపాద తాత్పర్యం. ఎక్కడో అక్కడ జీవబ్రహ్మభేదంలేకపోతే సృష్టినిర్మాణాది నిషేధం దేనికి ?

కొందరు పండితులు శంకరుల జీవ బ్రహ్మైక్య వాద ఖండనానికీ సూత్రం సమర్థకం కాదు. దానికి వేరే సూత్రా లున్నాయన్నారు. (చూ : వావిళ్లప్రతి పీఠిక) కాని ఈ సూత్రం చిట్టచివరిది. భౌతికదశలో వార్తమానిక జ్ఞానం వల్ల జీవేశ్వరభేదం సర్వానుభవమే. అదే ముక్తిదశలోనూ ఉన్నదన్న ఈ సూత్రం ప్రబల ప్రమాణంగా రాయల వారి ప్రతిపాదన. ఆ పరమదశలోనూ భేదం గర్భితమై ఉన్నప్పుడు ఇతర దశల్లో సంగతి చెప్పనక్కరలేదని భావం. మొదటిపాదం బ్రహ్మసూత్రాల్లో ప్రథమభాగంలోది రెండోపాదంలో చివరి సూత్ర ప్రతిపాదన వల్ల ప్రధాన మతాలు రెండే. సాంఖ్యం,

అద్వైతం. కనుక వాటి ఖండనం వల్ల ఇతర మతాల ప్రసక్తి గౌణమై పోతున్నదని ధ్వని రమణీయంగా ఉంది.

*3. ''ఫలియించుఁ గ్రియయ నా ఫలమత యిత్యాది*
*సర్వేశుఁ గానని యపూర్వవేది ''*

ఇది పూర్వమీమాంసావాద ఖండన. క్రియ యజ్ఞం. అపూర్వం = అదృష్టం. అదృష్టవిశేషమైన పుణ్యపాప రూపమే ఫలప్రదం తప్ప ఫలప్రదాత ఈశ్వరుడు కాదు. కృషి ఫలించునట్లుగా యజ్ఞయాగాది క్రియలే ఫలప్రదాతలు. దీనికోసం సర్వేశ్వరు డున్నాడనక్కర్లేదు. ఆ కల్పన మనవసరం.

యజ్ఞాదికర్మలు చేసిన తర్వాత అవి కర్తలైన మానవులలో అదృష్టం అపూర్వమనబడుతున్న పుణ్యపాప రూప విశేషాలను కల్పిస్తాయి. అవే ధర్మాధర్మాలు. అవే పరిపక్వమౌతు ఫల ప్రదాతలుగా పరిణమిస్తున్నాయి. ఈ వాదనను ఖండనం చేస్తున్న సూత్రం.

''ఫలమత ఉపపత్తేః'' అందువల్ల ఫల ముపపన్న మౌతున్నది అని అర్థం. తాత్పర్యమేమంటే అనంత జ్ఞాన సంపన్నుడైన సర్వేశ్వరుడే కర్మఫలప్రదాత తప్ప అచేతనకర్మలకీ ఫలప్రదాన శక్తిలేదు. యజ్ఞయాగాదులు కర్మలు, సాధనలు. ఫలితం దైవానుగ్రహలబ్ధం.

**4. శాస్త్రయోని**

శాస్త్రయోనిత్యాది సరణి ఈశ్వరునిఁ దె
ర్పెడు ననుమానమున్ పీలువాదిన్-

ఈ వాక్యం వైశేషిక దర్శన ఖండనం చేస్తున్నది. వైశేషిక దర్శనంలో 'పీలుపాకవాదం పిఠరపాకవాదం' అని రెండు వాదములున్నాయి. ఈ వాదం ప్రకారం సృష్టి నిర్మాణ కారణం అణుసంఘాతం. ఈశ్వరుడు ఉన్నాడనటానికి వేదమే ప్రమాణం కాదు. అనుమాన ప్రమాణం చేతకూడ గ్రహించవచ్చు. ఈ వాదాన్ని ''శాస్త్రయోనిత్వాత్'' అన్న బ్రహ్మసూత్రంతో ఖండిస్తున్నాడు. ఈ సూత్రం ఆ మహాగ్రంథంలో ప్రథమాధ్యాయంలో మూడవది. రెండవ సూత్రం ''జన్మాద్యస్య యతః'' అంటే ఎవరి నుండి జన్మాదులు కలుగుతున్నవో వాడు ఈశ్వరుడు అని చెప్పి దీన్ని స్థాపించటానికి వేదమే ప్రమాణం తప్ప అనుమానాదులు కావు. (ఈ సృష్టి సాధనిర్మాత పరమేశ్వరుడన్న విషయాన్ని స్థాపించేది వేదాంతమే కనుక-) వేదశాస్త్రమే ప్రమాణం తప్ప తర్కం కాదు అని స్థాపించడం కోసం చెప్పిన సూత్రం. బృహదారణ్యకంలో బ్రహ్మము ఉపనిషత్ప్రోక్తము. దానిని గురించి నాకు వివరింపుము అని చెప్పిన వాక్య మున్నది. (111-9-26)

ఈ వైభవమంతా గురుపరంపరా ప్రాప్తమైన మహావిద్య. ఈ మంత్ర వాక్యం ప్రకారము

పరబ్రహ్మము ఉపనిషత్ప్రోక్తం తప్ప తర్కసాధ్యం కాదని స్పష్టపడుతున్నది. ఒక సౌధం నిర్మించాలంటే అనేక వ్యక్తుల అవసరం. కనుక విశ్వసౌధ నిర్మాణానికి కూడా అనేక వ్యక్తులు అవసరమున్నదని అనుమానించడానికి వీలున్నది తప్ప ఈశ్వరుడొక్కడే సర్వకారణమన్న విషయం అనుమానం చేత నిర్ధారించలేము. అందుచేత శాస్త్రమే ప్రమాణము.

5. ''నిత్యులం దెల్ల నిత్యుడన్ శ్రుత్యుర్యుక్తి
క్షణిక సర్వజ్ఞులేషి సౌగత వివాది''

సౌగతవివాది అంటే బౌద్ధమతస్థుడు. ఇది క్షణికవాదం. సృష్టిలో ప్రతి వస్తువు ప్రతిక్షణం పుట్టి నశిస్తున్నది. కాని దీపపు వత్తి ఏకాకారంగా వెలుగుతున్నట్టుగా సృష్టి కూడా ఏకరూపంగా భాసిస్తున్నది తప్ప ఆ వస్తుప్రపంచం స్థిరమైనది కాదు. అది క్షణికమే కనుక దీనిపై వ్యామోహపడడం దుఃఖహేతువు. ఈ వాదాన్ని విష్ణుచిత్తులు శ్వేతాశ్వతర ఉపనిషత్తులోని ''నిత్యో నిత్యానామ్ చేతన శ్చేతనానామ్ – ఏకో బహూనామ్ – యో విదధాతి కామాన్''

అనిత్యులలో నిత్యుడు, అచేతనములందు చేతన స్వరూపుడు. అనేకము నందేకము. సర్వనామ ప్రదాత ఈశ్వరుడన్న వాక్యాన్ని ప్రమాణీకరించి క్షణిక వాదాన్ని ఖండించాడు. ఈ ప్రమాణ వాక్యము ఆత్మ నిత్యత్వ సాధకమైనది. పదార్థ పరిణామమున్నప్పటికి తద్గత చైతన్యం నిత్యమే. బ్రహ్మ సూత్రాల్లో ''అను స్మృతిశ్చ'' అన్న సూత్రప్రకారం నిన్న నేను చూచిన వాడే వీడు- అన్న స్మృతి ఒకటి ప్రతివానిలో ఉంది. కనుక నాచుట్టూ ఉన్న ప్రపంచము క్షణికమే. అయితే ఈస్మృతియొక్క నిత్యత్వం కుదరదు. కనుక క్షణికవాదం తప్పు అని తాత్పర్యం.

''అనుపపత్తే ర్న యను సూత్రమాదియైన
వాని నృపలీశు ప్రత్యక్షవాది గెలిచె''

ప్రత్యక్ష ప్రమాణాన్ని మాత్రమే అంగీకరించిన భౌతిక చార్వాక వాదిని బ్రహ్మసూత్రంలోని ''అనుపపత్తేర్న అనుపపత్తేస్తు న శారీరః'' అన్న సూత్రం ద్వారా ఖండించాడు. అతడు మనఃప్రాణాలు కలవాడు. అతని నుండి సర్వ క్రియలు కామములు, రుచులు, రూపు ధరిస్తున్నవి. అతడే సర్వాన్ని ఆవరించియున్నాడు. అయినా అతను మాట్లాడడు. ఈగుణాలన్నీ పరమేశ్వరునకు సంబంధించినవి తప్ప జీవులకు సంబంధించినవి కావు. శ్రీభాష్యంలో ఎక్కడా చార్వాక మత ఖండనం లేదు. కనుక ఈసూత్రం ప్రకారం ఆ మతఖండనం చేయడం రాయల వారి స్వోపజ్ఞకం తప్ప భాష్యకారుల సిద్ధాంతం కాదు. కనుక 'బలవంతుడైన రాజే ఈశ్వరుడు, ఐహిక భోగమే మోక్షము' అన్న చార్వాక మతాన్ని ఖండించడానికి ఈ సూత్ర మెలా ఉపయోగపడుతుంది అని పండితులు కొందరు ప్రశ్నించుకొని కవిని ఈవిధంగా సమర్థించారు. ''శరీరం'':- శరీర విశిష్టుడైన మానవ మాత్రునకు సర్వ విశ్వ నిర్మాణ సామర్థ్యం లేనందున'' సృష్టికర్త కలడు అని సూత్రార్థం చెప్పి కవిని సమర్థించాడు.

( వివరాలకు చూడు - తత్త్వోపహారము - రచన:- శ్రీ న. చ. రఘునాథాచార్యులు)

శ్రీభాష్యంలో ప్రత్యక్షంగా చార్వాక మత ఖండనం లేక పోయినా కవి బ్రహ్మసూత్ర పాండిత్యంతో ఈ సందర్భాన్ని స్పష్టంచేసుకొన్నాడని చెప్పవచ్చు.

ఈ విధంగా ఈ పద్యం రాయలవారి- వేదాంత విద్వత్తకు దర్పణం. కనుకనే తరువాత వచ్చిన పద్యం -

''విద్వద్వందితు డాతడిట్లు సుఖ సంవిత్త త్త్వ బోధైకమం
చుద్వైపాయన సూత్ర సచ్ఛ్రుతులనీశున్ మున్నిరూపించి -''

ఈవిధంగా వ్రాయబడినది. అంటే ఈవిద్వద్వందిత లక్షణం కవికి అన్వయించేది కదా! అందుకే ఆయనకు విద్వత్సభా రాయలన్న బిరుదు ఉన్నది. ఈశాస్త్ర చర్చ అంతా అనుష్ఠాన రూపమైన మతముయొక్క సత్యాన్ని స్థాపించే తాత్త్విక భూమిక. కాబట్టి ఆముక్త కథావస్తు సూత్రమిది. ( దీనికి ఖాండిక్యకేశిధ్వజ సంవాదం లోని యోగం కలపుకొని చూడాలి)

## చారిత్రక క్షేత్రాలు

అవతారికలో రాయలవారి కథనమలా ఉంచి - ఆశ్వాసాంతాల్లో ఆయన గెలిచిన భూభాగ - దేశ ప్రస్తావన కావ్య సీమావిస్తృతి పాఠక చిత్త భూమిక నెంత విస్మయా వహం చేస్తున్నది !!

- విజయనగరం నుండి తూర్పు కోస్తా ప్రాంతం - ఉదయగిరి మీదుగా కొండవీడు - కొండపల్లి - విజయవాడ - సింహాచలం - పొట్నూరు - కటకందాకా; మహారాష్ట్రంలో అహమ్మదునగరం -(కెంబావి 5వ ఆశ్వాసాంతం) కర్ణాటకలో రాయచూరు అవతారికలో నగరుపురం కూడా కలుపుకొని సూచన ప్రాయములైన ఎల్లలు - మైలురాళ్లుగా దేశపటం గీసుకోగలిగితే ఈ కావ్యమెంత దేశవైశాల్యాన్ని కమ్ముకొన్నదో - ఎంత ఆక్రమించిందో- ఎంత పరిధిలో కావ్యం నిర్మితమైనదో భావించి తరించవలసిందే తప్ప చెప్పనలవి కాదు.

ఆయా పుణ్యక్షేత్రాలు - శ్రీగురుపరంపర ఇటు ప్రాచీన చారిత్రక స్థలాలు -ఘట్టాలు - రాజులు - వారి చరిత్ర యుద్ధాలు తీరుతెన్నులు ( ఆశ్వాసాంతాలు) ఇది ఎంత అద్భుత మండలం !

పుణ్యక్షేత్రాలు కావ్యమందు గతాంశం కాగా చారిత్రక క్షేత్రాలు దానికి బహిరావరణ - వస్త్రం. ఇదంతా కావ్యకథలోని విద్యాబోధకులైన విష్ణుచిత్తాదులు శ్రీగురువులు. ప్రబోధితులైన వారు చక్రవర్తులు. ఒకరు ఆత్మద్రవ్యం. మరొకరు శరీరం. వెరసి శ్రీవైష్ణవం.

ఆముక్తమంత సమన్వయ బిందువు.

## కావ్య తత్త్వ బిందువు

సృష్టి ఆదిమ ద్వంద్వ క్రీడాప్రపంచం. ఏకమైన అధ్యతత్త్వం తనలోతాను మునిగి ఒక పథకం ప్రకారం తనలోపలి శక్తిని బహిర్గమింప చేస్తే -ఈపృథ్వీచైతన్యం ఘనీభూతశక్తిగా ఏర్పడినది. కనుక చైతన్య ప్రథమ వికారం పదార్థం; శిల, రెండవ పరిణామం వృక్షలతాప్రపంచం. తృతీయదశ జంతువు. చతుర్థదశ మనిషి. అతడే దేవతగా, పరమాత్మగా ఆదిమస్థితిగా పరిణామం పొందటమే సృష్టిపరమార్థం. ఈసృష్టిపరిణామాన్ని వేదం - సప్తధామా - సప్తలోకాలుగా- నిచ్చెన మెట్లుగా పేర్కొంటున్నది. ఈ పరిణామం, చైతన్య పరిణామం. ప్రతివస్తుగతంగా ఒక ప్రజ్ఞ ఉన్నదని మనువు - అంతస్సంజ్ఞా భవంతి అని అంటే, తైత్తరీయమేమో - ప్రజ్ఞానేత్రో అయం లోకః- అంటున్నది. ( ఈలోకం ప్రజ్ఞానేత్రం కలది) ప్రజ్ఞానంచైతన్యం - అది పరిణమంచి- లోకమై తిరిగి ఊర్ధ్వ గమనంలో స్వస్థితి చేరుకొంటుందని భారతీయ చైతన్య పరిణామవాదం వివరిస్తుంది.

(చూ : 1. The Life Divine - Sri Aurobindu

2. The Concept of man in Sri Auyrobindo M.P. pandit)

ప్రజ్ఞాత్మకం కానిదే కేవలపదార్థం పరిణమించలేదు. జడం కనుక.

దీనినే దశావతార తత్త్వం గా - పైగ్రంథంలో శ్రీపండిట్ గారు వ్యాఖ్యానించారు. బహుశః. ఈవాదప్రారంభకుడు స్వామివివేకానంద. ఏమైనా, పైగ్రంథంలోపండిట్‌గారు - '' అంతా జలంనుండి వచ్చినది కనుక మత్స్యావతారం ప్రథమచైతన్యవికారం, రెండవది కూర్మం స్థల, జలచరం; అంటే జలంనుండి స్థలమేర్పడినదశ. మూడవది వరాహం. కేవల స్థలచరం. నృసింహం జంతుమానవ సమ్మిశ్రణం- సంధిరూపం. జంతువుమానవ పరిణామం పొందబోతున్నదశ. వామనుడు మానవపరిమాణంలో ప్రథమదశ కనుక గుజ్జురూపం. పరశురాముడు రాజసిలోక మానవుడు. తర్వాత సాత్త్విక - పరిపూర్ణ మానవుడు శ్రీరామచంద్రుడు. తర్వాత మనిషి దైవస్థితినందిన భూమికలో శ్రీకృష్ణావతారం. దైవశక్తిని మానవ దేహంలో కవతరింప చేసుకొన్న పూర్ణావతారం. (చూ: పై గ్రంథం పు. 20) వామన దశనుండి పూర్ణాత్మ దశకు చేరుకొనే పరిణామంలో మరలా సప్తమనోభూమికలున్నాయని శ్రీఅరవిందదర్శనం.

1. బౌద్ధిక మనస్సు 2. అంతర్మనస్సు 3. పశ్యంతీమనస్సు (Illumined mind) 4. ప్రజ్ఞానమస్సు (Intution) 5. ఊర్ధ్వమనస్సు (Over mind) 6. పరామనస్సు (Super mind).దాని పైది సచ్చిదానంద పరబ్రహ్మం - సప్తమం. ఈపరాదశనే ద్వంద్వాత్మక ఆదిమ తత్త్వంగా తంత్రాభివర్ణన. అంతవరకే మానవ ప్రజ్ఞకందుతుందనీ శ్రీఅరవిందులన్నారు. ప్రకాశాంశ ( శివుడు) విమర్శాంశ ( దేవీతత్త్వం) ఒకదానిలో మరొకటి లీనమై ఉన్న ఆదిమ బిందు వర్ణన మే రాయల ఇష్టదేవతాస్తుతుల్లో ప్రథమపద్యం '' శ్రీకమనీయహారమణి ''.

'A staie and dynamic power descend in Him (SAVITRI)

కావ్యాంతంలో మరలా - సృష్టిలో రెండుగా చీలిపోయిన ప్రకృతి - పురుషద్వంద్వం - కలుసుకొని ఏకమైపోయిన ఆద్యబిందు వర్ణన.

*''సహ్యకన్యాతటోద్యాన చందన ద్రు*
*కుంజముల నీల కుంతల గుస్తరించి*
*కంతు సామ్రాజ్య మేలించి కరుణఁ జిత్త*
*మొలయ జగముల పాలించుచున్నవాడు.*

'సావిత్రి' మహేతిహాస విమర్శలో ఎ.బి. పురాణీగారు-

''The world of the form less where there is no
object cognizable either by the sense or
thought. There he (Aswapathy) that the
Whole World became a single being which
felt thing as it own self. (Savitri - An Approach everystudy)

ఈఅవరోహణారోహణ మొక మహోవృత్తభ్రమణం. అవరోహణ చేస్తున్నది పదార్థప్రాణ మనశ్చైతన్య స్వరూపిణి దేవి. మహాప్రకృతి. అందులోని మహాప్రజ్ఞా కిరణం ఈశ్వరుడు. ఈ ద్వంద్వ నిత్యక్రీడ - నిత్య సంగమమే ఆముక్త శృంగారరస తాత్త్విక భూమిక.

ఇందుకే అంతగా వేద - వేదాంగ యోగ దర్శన పాండిత్యం - మహాభక్తుల జీవితచరిత్ర లాధారంగా - భూమికగా కట్టవలసి వచ్చింది కవికి.

దశావతార వర్ణనలో ప్రథమావతారం మత్స్యం కదా. మత్స్యావతారం చైతన్యప్రథమ వికారమన్నారు కదా. పదార్థమంతః ప్రజ్ఞాశాలిని అని కదా తాత్త్విక దర్శనం. ఇప్పుడు రాయల వారి పద్యం దివిజద్వేషి - (3-17).

చేప శరీరంపైన ఉన్న 'చౌకపుఁదెల్ల కౌయచుగమి' సోమకాసురుని చంపి గ్రహించిన వేద విశుద్ధాక్షర పంక్తిగా ఉన్నది. దీనిని చౌకపు కొచుమిషగా ధరించినాడని భావం. వేదమంటే అంత మీ ప్రజ్ఞయే కదా, పరిణామం ప్రజ్ఞాసంబంధ తత్ప్రేరణతో పదార్థం పరిణమిస్తున్నది.

*ఉండు నప్రాణులం దొక్కింటు కీ శక్తి*
*స్థావరశ్రేణిఁ దజ్జాతికంటె*

వెజ్జేరోకటిబండ జెజ్జ మందిండే ము
న్న గుసరీ స్ఫసము లందంతకంటె
ఖగముల మజీవానికంటె మృగావళి
యందు నూహిపంగ నంతకంటె
దంతి గోముఖ పశుపతి నంతకంటె, మా
ర్త్యకదంబకముల యందంతకంటె
యక్షగంధర్వ నాగాలి నంతకంటె
నంత కంటె నిలింపులం దంతకంటె
హరిహయునియందు దక్షునం దంతకంటె
నాద్యుడు హిరణ్య గర్భు నందంతంకంటె.

రాయని భాషలో ఇది ఆరోహణ క్రమ పరిణామం. దీనిని తారుగలేస్తే అవరోహణం సృష్టి. ఆరోహణం ముక్తి మార్గం. 13వ పద్యము శ్రీమన్నారాయణుడు; కావ్యనాయకుడు. (పద్యంలో 2 మెట్లుగా తత్త్వమే సృష్టి ఊర్ధ్వారోహణ చెప్పబడింది)

ఒక ఫ్రెంచి దార్శనికుడు. టీల్ – హోర్డ్ – చార్డిన్ - అని అతనిపేరు. ప్రథమ ప్రపంచ మహాయుద్ధంలో క్షతగాత్రులకు సేవచేసినవాడు. అతడు తన మహాగ్రంథమైన (1) The phenomenon of man - లో - చైతన్య పరిణామాన్ని నాల్గు భూమికలుగా వివరించాడు. ('యూంగ్' దీన్ని చాలా కీర్తించాడట)

1. Lithosphere - స్థావరాలైన శిలాదులు -కేవల పదార్థదశ.
2. biosphere- లతావృక్షాదికం - ప్రాణశక్తి అవరోహణ జరిగిన దశ.
3. noo sphere - మానవావిర్భావం - మనోభూమిక. మనస్సు అవతరించిన దశ.
4. christosphere - చరమావస్థ (అవరోహణ క్రమంలో)

ఇక్కడ మనిషి క్రీస్తు శరీరం పొందుతాడు. (శ్రీవైష్ణవం చెప్పిన సారూప్య ముక్తి కావచ్చు)

(వివరాలకు చూ : The conept of man. M.P. Pandit.)

పైభూమికలను శ్రీఅరవిందుల భాషలో

1. పదార్థదశ - భౌతిక చైతన్యం
2. vital - ప్రాణచైతన్యం (Biosphere)
3. Mental - మనోభూమిక - మనశ్చైతన్యం.

ఈమూడు అవరోహణ క్రమం, ఆరోహణ క్రమం నాల్గు నుండి ప్రారంభమౌతుంది. ఇది మనస్సు నుండి పరామనస్సు దాకా వ్యాపించియుంది. అదే సావిత్రి మహేతిహాసం.

Ascending and descending trixt lite's poise The serried kingdom of the svaded law plansed from the Everlasting in to Then glad of I lovy of multitudinous mind and rich life's adbenlute and delight.

And packed with the beauty of malteni shapes elimbed back from time in to undying self up a golden ladder carrying the soul Tying with deimond threads the spit's extreme. (Savitri- Book I canto 5)

ఆరోహణ మొక సాహస యాత్ర. కఠోపనిషత్తు అన్నది ఆ మార్గం. **'క్షురస్య ధారా నిశితా దురత్యయా'** అని. అలాగే శ్రీఅరవిందుల ఆత్మారోహణ క్రమణ మొక మహాప్రస్థానం. ధీరుని సాహసయాత్రగా దర్శించి వ్యాఖ్యానించారు (Adventure of the soul -అన్న పేరున వారి జీవితయోగ దర్శన వివరణగా ఫ్రెంచి భక్తు డొక మహాగ్రంథం వ్రాసాడు.

ఈచైతన్య పరిణామాన్ని మెహర్బాబాదర్శన మిలా వివరిస్తుంది. 1. శిల, 2. లోహం, 3. వృక్షం, 4. క్రిమి, 5. మత్స్యం 6. పక్షి 7. జంతువు 8. మానవుడు.

మొదటిరెండు దశల్లోను ఆత్మస్థూల ప్రపంచానుభవాన్ని తొలిగా పొందినా జడానుభవమే. ఈఘనస్థితిలో జీవము - శక్తి నిగూఢంగా ఉంటాయి. కనుక చైతన్యం నిట్టునిలువుగా కాక నేలబారుగా భూమికి సమాంతరంగా వ్యక్తమైన స్థితి.

వృక్ష జాలం చైతన్యంలో సగం స్థావరం - సగం జంగమం. ఊర్ధ్వముఖగమనం కలిగినందున విశ్వంలో తన ఉనికిని తలెత్తుకొని చాటుకొంటుంది.

క్రిమిలో చైతన్యం స్వేచ్ఛాచలనం పొందుతుంది. మత్స్య ఉపాధిలో చైతన్యం స్వేచ్ఛాచలనం. జీవశక్తి ఇంద్రియ జ్ఞానం కలిగినది. పక్షిలో నేలపై నిలబడటమే కాక నింగిలో విహరించే చైతన్యం నూత్నానుభవంతో పుష్టిపొంది జంతుదశకు చేరుకొనేసరికి చైతన్యం మరింత విస్తృతమౌతున్నది. ఈసప్త భూమికలనుండి చైతన్యం మానవోపాధిలోనికి పరిణమిస్తుంది.

*''లోహంగా మృతిచెంది, వృక్షాన్నై -*
*చెట్టుగా చచ్చి జంతువునై*
*ఆమాపాన్న వదిలి మనిషినైనాను.*
*మరలా మరణించి దేవుడూ తానై పోవాలి.*
*తర్వాత దేవుడ్నై పోతాను. అదే నా పరమస్థితి.'' (రూమీ)*

( వివరాలకు చూ: భగవద్వచనం - ఇది God Speaks అన్న మెహర్బాబా గ్రంథానువాదం. )

ఆముక్త కవి ఈక్రమాన్నే గానం చేస్తున్నాడు. ముందు పేర్కొన్న 'ఉండు నప్రాణులం దొక్కించు కా శక్తి - (3-80) తర్వాతి పద్యంలో

ఇట్టి రూపకోటు లెల్ల నవ్విష్ణుని
తను చయంబు సుమ్ము ధరణినాథ!
యతఁ డచింత్య శక్తి నఖిలభూతముల నా
కసము వోలె నిండి యెసఁగుగాన (8).

దీనితోపాటుగా ఈక్రింది పద్యంకూడా కలుపు కొని చదవాలి.

దిక్పాలతను వెత్తి - తిరిపంపు తనుతోన యెన్ని మార్లెత్తమీ యేను నీవు - - (6-61) దాసరి రాక్షసునితో అన్నమాటలు. చివరివాక్యం

''కంసరిపు భక్తుల మొకండె కాము గాక''

ఇది చరమజన్మ. తర్వాతిది Christotsphre శ్రీరంగంలో రంగనాథవర్ణనలో చెప్పబడినవైకుంఠస్థితి.

శిలాదశనుండి ఇక్కడి దాకా చేసే ప్రయాణమే దీర్ఘసాహసయాత్ర క్షురధారాగ్రం మీద నడవటం.

జనిసాహస్ర బహు ప్రయాణ మగు సంసారపుఁద్రోవన్ (3-70)

ఇదంతా రాయలు వర్ణించిన ఆరోహణ క్రమం.

కథ అంటే మానవజీవితమే. దేశకాల బద్ధుడైన మానవుడు చేసే ప్రస్థానమే - యుద్ధమే (బాహ్యాభ్యంతరాలుగా జీవితమున్నది. తిక్కన్న గారు అశ్వమేధపర్వంలో మిథ్యాయుద్ధం-) - బాహ్యయుద్ధమని సత్యయుద్ధమాంతర శత్రువులను జయించటమన్న ఆధ్యాత్మిక జైత్రయాత్ర అనీ అన్నారు. (చూ: నా శ్వేతచ్ఛత్రం - పు. 87)

''వెలి పగర గెలుపు గెలుపే
అలఘుమతిన్ గెలువ వలయు నభ్యంతర శ
త్రుల దద్విజయము మోక్షము
నలవరుపంజాలు నొంట నమ్మేలగునే''. (1-124 అశ్వ)

ఇందుకే రాయలవారు యామునబాహ్యయుద్ధవర్ణన చేయలేదు. కావ్యవస్తువంతా అంతరజైత్రయాత్ర. భక్తి మతం కనుక దానిని ప్రపత్తియోగంతో క్రమ్మేసాడు. కావ్యమంతా అంతర్ముఖీనుడైన జీవిసద్ధ సంవేదన. ప్రథమపాండీడు - రాక్షసుడు - గోదాదేవి. ఈమె విరహవేదనలో అవిగతార్థా లౌతున్నవి. ప్రథమ పాండీని ఆవేదన.

2-78-84 దాకా పరుచుకొనియున్నది. కాకపోతే అతని ఆర్తి ఎలుగెత్తి పెట్టిన గజేంద్రుని మొర కాదు. తనలోపల తాననుభవించిన సంవేదనావర్తం. పరమగంభీరుడైన మహాచక్రవర్తి ఆవేదన అంతకంటె వాచ్యం కారాదు. బ్రహ్మరాక్షసుని ఆవేదన స్పష్టంగానే ఉంది. గోదావిరహదుఃఖం సరే సరి. కనుక వీరందరూ కుసిన మనిషిజీవితగాథే భంగ్యంతరంగా ఆముక్తకథ. అంటే సావిత్రి మహేతిహాసం వంటిదే ఆముక్తమున్నా. కాకపోతే దేశ కాలభాషావ్యక్తీకరణులలో వైవిధ్యం-భేదమున్నది. ఇంతే. భావం (ప్రబంధధ్వని) ఆరోహణమార్గంలో ప్రయాణించే మానవ కథ. ఆముక్తంలో ఋతువర్ణనలో చిత్రమైన రంగురంగుల మయూరపింఛం వంటి మానవజీవితమెంత రమ్యోదారంగా ఉంది.! ఎందుకు అది పరమేశ్వరచైతన్య ప్రతిబింబమే. ఇదే సావిత్రి వాక్యాల్లో (పైన ఉదాహరించినది) rich with life's అంటే - A godhead stads behind the brute machine అన్న మహావాక్యతాత్పర్యమే ఋతువర్ణనల్లో - కథలో - అలంకారాల చాటున - భగవంతునెడనెడ సాక్షాత్కరింపచేయటం. అంతర్యామితత్త్వాభివర్ణనమే నాయకవర్ణన (చూ: నాయకాధ్యాయం)

ప్రభువు జీవశక్తిలో ఒక తాత్త్వికు డున్నాడు. ఒక చక్రవర్తి - ఒక విజేత - ఒక ధర్మపాలకునిగా ఆప్రభువును చరిత్రలో చూస్తున్నాం. ఆయన జీవశక్తి గతమైన కవిని కవిలోకం కీర్తించింది. కాని ఆమహాప్రభువులోని అంతఃపురుషదర్శన మెవ్వరూ చేయలేదు. అలాగే ఆసార్వభౌమునిలోనున్న రాజధర్మ ప్రవక్తయైన ఆచార్యునీ ఎవరూ చూడలేక పోయారు.

దానికోసమే ఈ వ్యాఖ్యానావసర మేర్పడినది. కనుక ఆముక్తకావ్యకథాతత్త్వం

చైతన్యారోహణ. తదభివర్ణనమే కావ్యం. ఆ చైతన్యం పేరు పురుషోత్తముడు.

శ్రీఅరవిందు లెలా పురుషోత్తమ యోగాన్ని ప్రతిపాదించారో రాయలవారూ శ్రీవైష్ణవ యోగాన్ని రసంద్వారా అభివర్ణించారు. ఇది ఇతిహాసకవి నిర్మాణం - వినిర్మాణం.

### ఆధారగ్రంథాలు

ఆళ్వార్ల చరిత్రలు చెప్పే గ్రంథాలు కొన్ని ఉన్నవి.

1. దివ్యసూరిచరిత్ర - గరుడవాహనముని. రామానుజునకు సమకాలీనుడు.
2. గురుపరంపరాప్రభావము - తమిళమున మణిప్రవాళ శైలిలో పశ్చాత్సుందరునిచే వ్రాయబడినది. ఇతడు బహుశః 14 వ శతాబ్దివాడు కావచ్చు.
3. Life of Sri Ramanuja -స్వామి రామకృష్ణానంద. ఇందులో రామానుజుని జీవితముతో పాటు ఆళ్వార్ల చరిత్రలూ జెప్పబడినవి.
4. యామున విజయవిలాసమన్న కావ్యం.

కొలది మార్పులతో గాథలన్నిట సమానంగానే ఉన్నాయి. కనుక ఒక గ్రంథంలో కథవ్రాసి తదితర గ్రంథభేదాలు వ్రాస్తే సరిపోతుంది.

# సౌందర్యలహరి

ఇది చిరకాలపు తపస్సు ఏనాడో (1964-67) ఆముక్త దర్శనం - పరిశోధన ద్వారా కలిగి ఆమముక్తమాల్యదా సౌందర్యమన్న సిద్ధాంత గ్రంథంగా అవతరించింది.

ఒక మహాకావ్యాన్ని ఎన్ని దృక్కోణాల్లో విమర్శించవచ్చునో శ్రీకృష్ణదేవరాయల మహావ్యక్తిత్వాన్ని అతిలోక ప్రతిభను వ్యాఖ్యానించటానికి ఆ గ్రంథమొక అవకాశమిచ్చింది.

కావ్యం రసప్రధానమనటం ఆలంకారిక సంప్రదాయం. కానీ ఒక మహేతిహాసంలో ఆ దేశ సంస్కృతీసారం వడకట్టబడుతుంది. ఈ దేశ ప్రత్యేకత - స్వామివివేకానంద, శ్రీ అరవింద మహాయోగి వంటి ఆధునిక మహాత్ముల ననుసరించి - దేశప్రతిభనిర్మించుకొన్న వేదవాఙ్మయం. తర్వాత శాస్త్రవాఙ్మయం. అదే విషయం రాయలవారిలో కనిపిస్తుంది. దీనిని మత దర్శనమంటే, ఆలంకారిక సంప్రదాయం రసదర్శనం. ఈ రెంటిని కలిపి కట్టినమను హేతిహాసం ఆముక్తమాల్యద. ఇంతే కాక రాయలవ్యక్తిత్వంలో మరొక దిశ (డైమెన్షన్) చక్రవర్తి. అంటే సమాజం- మానవ సంబంధాలు- మానవుల్లో అనేక అంతస్థులు - వారి వారి జీవన వైఖరులు ఇదంతా లోకదర్శన మనుకొంటే (పైరెంటితో కలిపి) ఈ కావ్యంలో ముప్పేటలు -కలిపివేసిన లక్షణమున్నది. ఇందుకే కావ్యం ప్రౌఢమయమై పోయినది. నారికేళపాకమంటే-ఈ కావ్యవిషయంలో ఈ లోతు- అర్థంలోనున్న త్రివిధభూమికలు. ఈ త్రైవిక్రమలక్షణ వ్యాఖ్యానమే ఆ పరిశోధనగ్రంథం - ఆముక్తసౌందర్య మన్నది.

ఈదృష్టితో ఈ వ్యాఖ్యాన ఆవశ్యకత ఏర్పడింది. 1964నుండి - నేటిదాకా (1999) ఆకావ్యం ఈ వ్యాఖ్యాతను- వెన్నాడుతూనే ఉంది. ఎటుపోయినా - ఏదివ్రాసినా- దక్షిణభారతంలో ఏ ప్రదేశానికి వెళ్ళినా ఆ మహాప్రభువు వ్యక్తిత్వమే సాక్షాత్కరిస్తూ వచ్చింది. అంటే - ఏ ఊరు వెళ్ళినా ఆ ఊళ్ళో రాయలవారు కట్టించిన కోవెలో- గోపురమో- వేయించిన శాసనమో -కన్పించేది.

హోసూరులో కోదండరామయ్యగారన్న మాన్యపండితులు తమ జీవితమంతా రాయలవారిపై పరిశోధనచేయటంలోనే గడిపిన వారన్నారు. ''నేను తమిళనాడు ఎమ్.ఎల్.ఏ. గావుంటూ ఆ నాడంతా ప్రతి ఊరూ తిరిగాను. ఏ ఊరువెళ్ళినా రాయలవారా ఊరుతో ఏదో ఒక సంబంధం కలిగివున్నట్లుగా నా పరిశోధనలో వ్యక్తమైనది. ఆ మహాప్రభువు మానవమాత్రుడు కాడు. సాక్షాత్తు శ్రీవేంకటేశ్వరావతార'' మనేవారు.

కనుకనే ఈ వ్యాఖ్యానావసరమిది. ప్రాచీనవ్యాఖ్యాతలు వేసినమార్గంలో నడుస్తూనే కొత్తభూమికలను వెల్లవరించే ప్రయత్నమీ సౌందర్యలహరిలో కన్పిస్తుంది. ఈ యుగారంభంలో ఈ కావ్యమహత్త్వాన్ని వ్యాఖ్యానించిన విమర్శక కవులు- వ్యాఖ్యాతలు సరే- కవి సామ్రాట్టు విశ్వనాథ- హంపిక్షేత్రంలో ఆ మహాకవి కొడాలి సుబ్బారావుగారు. వీరందరకు నమస్కరిస్తూనే ఈ విమర్శ వచ్చింది.

నాటి వ్యాఖ్యాత దృష్టిలో పద్యమే ఒక రాశి ( యూనిట్). అది శాబ్దిక ప్రధానమైనది. ఇందుకే వేదంవారి వ్యాఖ్యాన విస్తృత పీఠికలో అంతా శబ్ద దృష్టేనని చెప్పక్కర్లేదు.

ఈ నేటి వ్యాఖ్యానం కేవలం ఆలంకారిక సంప్రదాయ దృష్టితో కావ్యాన్ని మొత్తాన్నీ ఒక రాశిగా గ్రహించి రసాదిమార్గాన్ని విమర్శించటమే ధ్యేయం. దీనితోపాటు మతలోక దర్శన సమన్వయం. ఈ బృహద్దర్శన ప్రదర్శనమే ఈ వ్యాఖ్యానావసరహేతువైనది.

అభినవ బాదరాయణ మహర్షికి శ్రీఅరవిందయోగికిన్
అభినవగుప్త పాదుల రసాంచిత మూర్తికి – భైరవాత్మకున్
అభినవ కృష్ణరాయులు మదాత్మగురూత్తము విశ్వనాథకున్
అభినతులాచరించుచు సమర్చన చేసెద కృష్ణ భారతిన్

※ ※ ※

# కృతజ్ఞతలు

ఈ గ్రంథమిలా ప్రసిద్ధి పొందటాని కెందరెందరు తమ అమృత హస్తమందించారో !!

ప్రధానవ్యక్తి మిత్రులు డ్యాక్టర్ తూమాటి సంజీవరావుగారు. అయన లేకపోతే ఈ గ్రంథము రూపుదాల్చేదా - ఏమో ? అసలీ వ్యాఖ్యానం వ్రాయాలన్న ప్రేరణ అప్పటి పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయ- ఉపకులపతి- ఆచార్య పేర్వారం జగన్నాథంగారు. మైత్రీ బంధ బద్ధతతో వారు 'వ్యాఖ్యానం వ్రాయండి, మా విశ్వవిద్యాలయం అచ్చువేస్తుందన్నారు. వ్రాయటం, అచ్చువేయటం రెండు పనులు ఈ విమర్శకుడే నిర్వహించవలసి వచ్చింది. ( ఇది వేరే విషయం. )

తర్వాత 'అన్నపూర్ణాగ్రాఫిక్సు' వారు, (తిరుపతి) ఎంతో శ్రమతో ఈ అక్షరరూపం కల్పించారు. తర్వాత ప్రెస్సువారూ- వారందరికి కృతజ్ఞతలు. మరొక ప్రధానాంశం - గ్రంథముద్రణకు కావలసినది మందీ- మార్బలమూ సంగతలా ఉంచి - ధన సహాయం ముఖ్యంకదా ! అది అందించినది తిరుపతి తిరుమల దేవస్థానం, భారతప్రభుత్వమానవ వనరులశాఖ. సి. ఐ. ఐ. ఎల్ మైసూరు.

మహాసేతుబంధనంలో ఉడుతకూడా తోడ్పడినట్లు ఐతిహ్యం. దానిని స్మృతికందిస్తూ ఈ మహాగ్రంథప్రకటనార్థం విజ్ఞప్తి పంపగానే చిరు సాయమందించిన మద్రాసులో కన్యకాపరమేశ్వరీచారిటీస్- 5000రూ॥లు. దేసు అమృతవల్లీ తాయారమ్మ ఎస్టేట్‌వారు - 2000 రూ॥లు. సింగమచెట్టి అతీంద్రులు చెట్టి ఛారిటీస్ - 2000 రూ॥లు అందించారు.

వీరందరకూ జగజ్జనని ఆశీస్సులు లభించాలని ప్రార్థిస్తున్నాను. అడుగకుండానే మధురకవులు శ్రీదుగ్గిరాలవారు నన్ను ఆశీర్వదించారు. వారికి కృతజ్ఞతలు.

సమధికాముక్తమాల్యదా సౌరభమ్ముఁ
దెచ్చి రసికాంధ్రజనుల కందిచ్చునట్టి
మలయకూటసమాగత మందమారు
తమ్మెవండయ్య ! ఆతఁడే ! తుమ్మపూడి.

'సంవిధానమ్ము' చర్చకు లేవదీసెనా !
నాచన సోమన్న సీఁచమడఁగు
'నాముక్తమాల్యదా' ప్రాముఖ్యమెత్తెనా !
కర్ణాటపతిశిరఃకంప మొలయుఁ;
'బదగుంఫనమ్ము' చొప్పడఁ బద్యమల్లెనా !
రామలింగఁడు గింగిరాలుకొట్టుఁ;
బ్రతిభఁజూపఁగ 'వేయిపడగలు' విప్పెనా !
విశ్వనాథకు గంగవెఱ్ఱులెత్తు;

నతని కృతులు 'కుమారభారతి' కిఁ 'గుంద
మాల', లాతండు జొంపమ్ము మఱుఁగు పిందె;
తన స్మితమ్మట్లు తాను సుంతయును బయట
పడఁ డతఁడు తుమ్మపూడి విద్వద్వరుండు.

– దుగ్గిరాల రామారావు

# సమర్పణం

ఇలువేల్పువని కాదు, ఇలవేల్పువని కాదు
ఎల్ల లోకాలకు తల్లి వనుచు
ముక్తినిత్తనికాదు భుక్తినిత్తనికాదు
మనసులో పాయని దినుసువనుచు
సిరిదోతువని కాదు శివదూతివని కాదు
నమ్మిన చిననాటి అమ్మ వనుచు
గురుదత్తవని కాదు. తెరువిత్తువని కాదు
ఇంతవ్రాయించి నన్నేది తనుచు

శాంతబిందువంశ - శివదూతి - శాంతనాత్మ
భార్యచేసినా వన్న విశ్వాసమూని
నీ వొసంగిన నీవిద్య నీకె యిత్తు
పూతచరణాల లత్తుక పూతగాగ.





# ఇష్టదేవతాస్తుతి

## ప్రథమాశ్వాసము

శ్రీ కమనీయ హారమణిఁ జెన్నుగఁ దానును, గౌస్తుభంబునం
దాకమలా వధూటియు నుదారతఁ దోపఁ బరస్పరాత్మలం
దాకలితంబులైన తమ యాకృతులచ్చతఁ బైకిఁ దోప, న
స్తోకతనందుఁ దోఁచెనన, శోభిలు వేంకట భర్తఁ గొల్చెదన్. 1

శ్రీ కమనీయ, హారమణిన్ = లక్ష్మీదేవియొక్క, అందమైన, ముత్యాలదండయొక్క రత్నంలో; చెన్నుగన్ = అందంగా; తానును = శ్రీ వేంకటేశ్వర స్వామి; కౌస్తుభంబునందు = విష్ణు వక్షఃస్థలమందలి కౌస్తుభమన్న పేరు గల మణిలో; ఆ కమలా వధూటియున్ = ఆ లక్ష్మీ యువతి; ఉదారతన్ = దర్జాగా, ఠీవిగా ; తోఁపన్ = ప్రతిబింబింపగా; పరస్పర - ఆత్మలందున్ = ఒండొండు హృదయాలలో; ఆకలితంబులు + ఐన = చక్కగా నాటబడినవైన; తమ యాకృతులు = ఇద్దరి మూర్తులు; అచ్చతన్ = నిర్మలత్వంచేత; పైకిన్ = బయటకు; తోచి = కనిపించి; అస్తోకతన్ = అతిశయంగా; అందున్ = లక్ష్మీదేవి కంఠహారమణిలో, కౌస్తుభరత్నంలో; తోఁచెన్ = కనిపించినవి; అనన్ = అనగా; శోభిలు = ప్రకాశిస్తున్న; వేంకటభర్తన్ = వేంకటేశ్వర స్వామిని; కొల్చెదన్ = సేవిస్తాను.

తా : లక్ష్మీనారాయణులు పరస్పరాత్మలలో ప్రేమాతిశయంచేత ప్రతిఫలించారో అన్నట్లుగా వారిద్దరు తమ తమ కంఠహారాలలో కనిపిస్తున్నారు. లక్ష్మీదేవి నారాయణుని కౌస్తుభ రత్నంలోను, లక్ష్మీహారమణిలో నారాయణుడు ప్రకాశిస్తున్నారు అన్నట్లుగా శోభిస్తున్న శ్రీవేంకటేశ్వరస్వామిని సేవిస్తున్నాను.

విశేషాలు :

మొదటి పాదంలో చెన్నుగన్, రెండవపాదంలో ఉదారతన్ ఇవి యతిస్థానాలు. కనుక వారి ప్రతిబింబాలు మహారాజోచితంగా, దివ్యసుందరంగా ఉన్నాయని ధ్వని ఆదిదంపతుల నిద్దరినీ

సేవిస్తున్నాను అనకుండా కేవలం వేంకటేశ్వర స్వామిని పేర్కొనడంలో తాత్పర్యమేమంటే లక్ష్మి స్వామి శక్తి. ఆమె ఆయనలో అంతర్గతంగా ఉంది. ఆయనను విడిచి ఆమె, ఆమెను విడిచి తానూ లేరు. ఆయన శ్రీవేంకటేశ్వరుడు శ్రీతో కూడుకొని ఉన్నవాడు. శ్రీవైష్ణవం తప్ప శ్రీదేవీ రహిత వైష్ణవం కాదు. ఇది నిశ్శ్రీక వాదం. వేదంలో ఏకాయన ఋషి అనేవాడు దీనికి స్థాపకుడు. రాయల వారి మతం శ్రీ వైష్ణవం. అవతారికలో పన్నెండవ పద్యంలో విష్ణుమూర్తి ''లేము లుడిపెడు లేజూపు లేమ తోడ''నే ప్రత్యక్షమైనాడు. ఈ సర్వసృష్టి సంహారాదులు ఆమె సంతోషం కోసం ఆయన చేస్తున్నాడని వేదాంత దేశికులు శ్రీస్తవంలో అన్నారు. లక్ష్మి ద్వారా భక్తుడు భగవంతుడైన శ్రీమన్నారాయణుని దర్శిస్తున్నాడు. కనుక పద్యం ''శ్రీ''తో ప్రారంభమైంది. లక్ష్మితో ప్రారంభమైన పద్యం వేంకటేశ్వరస్వామితో అంతం కావడంలోని విశేషమిదే. కనుక వేంకట భర్త కొలిచెదన్.

ఛందస్సు : ఉత్పలమాల - భ ర న భ భ ర వ గణాలు. పారిజాతం, మను వసు చరిత్రల ప్రారంభ పద్యాలతో పోల్చిచూచుకోవాలి.

కథలో నాయిక అయిన గోదాదేవి తాను కొప్పులో ధరించిన పూదండను భగవంతున కర్పించింది. ఆముక్తమాల్యద అంటే తాను చక్కగా ధరించిన మాల్యమును ఇచ్చినది అని అర్థం.

ఈ ఉత్పలమాల ఆ పూదండకు సూచకం. సంస్కృత నాటకాలలో నాందీ శ్లోకానికి ఈ విధంగా ప్రాచీన వ్యాఖ్యాతలు అర్థకల్పనం చేయకపోలేదు. ద్వితీయ పాదంలో ఉత్ + ఆర శబ్దం సంధి విడగొట్టిన అకారమునకు యతి. దీనిని ఉపసర్గయతి అంటారు. భగణమునకు ఫలము ధన హేమమణి వస్త్ర పశు తనూజ పరిజనాశ్వాది సంప్రాప్తి అని అప్పకవీయం చెబుతున్నది.

అలం - ఉత్ప్రేక్ష.

ఉత్ప్రేక్ష వాచికం అనన్. ఆలుమగలిద్దరు పరస్పరాత్మలందు ఆకలితములైనారు. అన్నట్లుగా వారి ఆకారాలు కంఠహారాలలో ప్రతిఫలించాయి.

ఈ ఉత్ప్రేక్ష వల్ల కావ్యంలో భగవంతుడే ఆయా భక్తుల హృదయాలలో ఉండి కథను నడిపించిన లక్షణం వ్యంజితమౌతున్నది కథలో నాయకుడు చివరి దాకా కనిపించడు. కాని కథాసూత్రధారణం చేస్తాడు. భగవత్ ప్రతిబింబమైన మన్నారు స్వామి కథానాయకుడైనట్లు ముందు ముందు స్పష్టపడుతున్నది.

మ. సిరి నొక్కప్పుడు కన్మొఱంగి, హరి దన్జేర ప్రహర్షించు ను
ర్వరకున్వంచనఁ గూడఁగాఁగలుగు భాస్వచ్చంద్రశాలా పరం
పరలయ్యె న్బుఱపైన యొవ్వని ఫణా పంక్తుల్బుజింతు న్నిరం
తరముం దాంతుని నయ్యనంతుని నతీత బ్రహ్మ కల్పాంతునిన్. 2

హరి=విష్ణువు ; సిరిన్=లక్ష్మిని; ఒక్కప్పుడు=ఒక్కొక్కసారి ; కన్మొఱంగి=కనుచాటుచేసి; తన్=తనను (భూదేవిని); చేరన్=కూడగా; ప్రహర్షించు=అమితంగా సంతోషించే; ఉర్వరకున్=సస్యశ్యామలయైన

భూదేవికి ; వంచనన్=కనుచాటుగా; కూడగాన్=పొందుటకై; కలుగు= ఉన్న; భాస్వత్= ప్రకాశించు; చంద్రశాలా=వెన్నెల ప్రవేశించగల మేడపైకట్టడములయొక్క; పరంపరలు=పంక్తులుగా; పటుపైన= ఎత్తుపల్లాలు లేని విశాలమైన; ఎవ్వని= ఎవని యొక్క; ఫణా పంక్తులు=పడగల వరుసలు; అయ్యెన్=చంద్రశాలా పరంపరలయినవో; దాంతుని= ఇంద్రియ నిగ్రహం కలవాడిని; ఆ అనంతుని= ఆ ఆదిశేషుని; అతీత, బ్రహ్మ, కల్ప, అంతునిన్= ఉల్లంఘింపబడిన, బ్రహ్మ, సృష్టియొక్క, అంతం కలవాణ్ణి ; నిరంతమున్ భజింతున్=నిత్యమూ సేవిస్తాను.

తా : హరి ఒక్కొక్కసారి సిరిని మోసగించి భూదేవిని సమీపిస్తున్నాడు. వారిద్దరి సమాగమక్రీడకు ఆదిశేషుని వేయి పడగలు చంద్రశాలా పరంపర లవుతున్నాయి. ఈ విధంగా భగవదానందానికి సాధన భూతుడైన అనంతునికి నిత్యమూ నమస్కరిస్తున్నాను. ఆయన ఇంద్రియ నిగ్రహ సంపన్నుడు. సృష్టి ప్రళయాల నుల్లంఘించిన చిరంజీవి.

విశే. చంద్రశాలలు - మేడల పై భాగంలో పైకప్పులు లేకుండా స్తంభాలపై నిర్మించిన కట్టడాలు. ఈనాళ మనం 'స్టార్ హోటల్స్' పైన వినోద సమావేశాలకు ఈ యేర్పాట్లు గమనిస్తున్నాము. శాలా='హాలు'. ఇక్కడ ఆదిశేషుని మణిమయ ఫణా పరంపరే చంద్ర శాలాపరంపర. ఇక్కడి మణులే దీపాలు. తన పడగలపై జరుగుతున్న నిత్యక్రీడకు తాను దాంతుడు గనుక మనశ్చలనం లేకుండా ఉన్నాడు. ఆదిశేషుడు=మొదటి జీవుడు. సృష్టివికసన దశలో మొదటి మెట్టుగా వచ్చిన వాడు ఆదిశేషుడు.

రసం : శృంగారం. మొదటి పద్యంలో శృంగారం భావనా దశలోనిది కాగా దానికిక్కడ బాహ్యప్రకటన దశ చెప్పబడినది. అక్కడ నాయిక శ్రీదేవి. ఇక్కడ భూదేవి. నాయకుని రాకతో నాయికయైన భూదేవికి ప్రహర్షం కలిగింది. ఉర్వర అంటే సస్యం కలది అని అర్థం కనుక ప్రహర్షంచేత కలిగిన రోమాంచం ఉర్వర శబ్దంతో ధ్వనిస్తున్నది. (చూడు.4-144.)

మొదటి పద్యంలో శ్రీమన్నారాయణునిలో లక్ష్మి ప్రతిబింబించడం జరిగింది. ఇది సృష్టికి ప్రథమ ఉన్మేషం. రెండవ పద్యంలో భూదేవి, ఆది శేషుడు వచ్చారు. భూదేవి = సృష్టి . వైకుంఠంలో లక్ష్మీద్వితీయుడైన భగవంతుడు సృష్టి కాలంలో భూదేవీ ద్వితీయుడవుతున్నాడు. సృష్టివికాసం జరుగుతున్నదని తాత్పర్యం. పైపద్యంలో శ్రీ-ఇక్కడ సిరి కావటమే సృష్టి.

కథలో ఈ భూదేవి ప్రతిబింబమే గోదాదేవి. ఆమె నాయిక. శ్రీరంగ స్వామి నాయకుడుగా శృంగార రసాత్మక కథను చెప్పుమని ఆంధ్రనాయకుడు ఆనతి నీయబోతున్నాడు.

సీ. ఖనటత్ప్రయోబ్ధి వీక్ష్య రసాతలాన్యోన్య
పిండీకృతాంగ భీతాండజములు,
ఘృత కులాయార్ధ ఖండిత సమిల్లవరూప
చరణాంతికభ్రమత్తరువరములు

ఘన గుహా ఘటిత ఝాంకరణ లోకైకద్వి
దుందుభీకృత మేరు మందరములు
చటుల ఝంపాతర స్స్వనగరీ విపరీత
పాతితాశాకోణ పరిబృఢములు
ప్రబలతర బాడబీ కృతేరమ్మదములు
భాస్వరేరమ్మదీ కృత బాడబములు
పతగ సమ్రాట్పతత్త్ర ప్రభంజనములు
వృజిన తూలౌఘములఁ దూల విసరుఁగాత. 3

ఈ పద్యంలో గరుత్మంతుని రెక్కల గాలి స్పష్టించిన విపరీతాలు అద్భుతంగా వర్ణింపబడుతున్నవి
( ఇది సార్వ భౌముని రచనకి ప్రతీక)

1) ఖ= ఆకాశంలో; నటత్=నటించే; పయోబ్ధి=సముద్రంలో ;వీక్ష్య=చూడదగ్గ; రసాతల= పాతాళలోకంలో; అన్యోన్య=పరస్పరం; పిండీకృత=లుంగలుగా చేయబడ్డ; అంగ=అవయవాలు గల, భీత=భయపడ్డ ;అండజములు=పాములు గలవి.

గరుత్మంతుని బలిష్ఠములైన రెక్కల గాలి దెబ్బకు నేలపై ఉన్న సముద్రపు నీరంతా ఆకాశంలోకి ఎగసిపోయి అల్లకల్లోలంగా ఎగసి పడుతున్నది. క్రిందసముద్రంలో నీళ్ళ లేనందువల్ల పాతాళంలోని పాములు బయల్పడి గరుత్మంతుని జూచి భయపడి ఒకదానితో నొకటి చుట్టుకొని ముడుతలు పడి గుంపులు గుంపులుగా పడిపోయాయి.

2) కులాయ=గూడు ;అర్థ=కొరకు ;ఖండిత=విరువబడ్డ; ధృత=తాల్చబడ్డ; సమిత్+లవ=చిన్న పుల్లలయొక్క; రూప= ఆకారం కలవై; చరణ=గరుత్మంతుని పాదాలయొక్క; అంతిక=సమీపంలో, భ్రమత్= ఎగురుతున్న ; తరువరములు=పెద్ద చెట్లు.

ఆకాశంలో ఆయన ఎగిరి పోతుంటే ఆ వేగానికి భూమి మీద ఉన్న మహావృక్షాలన్నీ పైకి లేచి ఆయన కాళ్ళ వెంట ఎగురుతూ పోతూ ఉంటే అవన్నీ ఆయన గూడు పెట్టు కోవడం కోసం తీసికొని పోతున్న చిన్న చిన్న పుల్లల లాగా ఉన్నాయి. ఆకాశం నుండి చూచినపుడు దూరాన చెట్టు కూడా పుల్లగా కనిపిస్తుంది. దానివల్ల దూరం వ్యక్తమవుతుంది. లేదా గరుత్మంతుని శరీరం కొండలాగా ఉన్నందువల్ల చెట్లు పుల్లల్లాగా కనిపిస్తున్నాయి.

3) ఘనగుహా=గొప్పగుహల్లో;ఘటిత=సంఘటింపబడ్డ; ఝాంకరణ= ఝుంకారం చేత; లోక+ ఏక=విశ్వాని కంతా ఒకటే అయిన ;ద్విదుందుభీకృత=జంట భేరిగా చేయబడ్డ; మేరు మందరములు= మేరు పర్వతం,మందరపర్వతం;

ఆయన రెక్కల గాలి కొండగుహలలో దూరి 'ఝుం' అని ధ్వని చేస్తున్నది. అది ఎలా ఉందంటే ఆయన పరాక్రమాతిశయాన్ని మేరు, మందర పర్వతాలు దుందుభులై కీర్తిస్తున్నవో అన్నట్లున్నవి.

4) చటుల= తీవ్రమైన; ఝంపా= లంఘనం, దూకటం ; తరస్= బలంవల్ల, వేగంచేత; స్వనగరీ= తమతమ పట్టణాలనుండి; విపరీత= ఇక్కడి దక్కడ, అక్కడి దిక్కడ; పాతిత= విసరి వేయబడ్డ; ఆశాకోణ= దిశలయొక్క, మూలలయొక్క; పరిబృఢములు= పాలకులు గలవి.

ఆయన రెక్కల గాలి తీవ్రత వల్ల దిక్కుల అధిపతులు, మూలల అధిపతులు అటువాళ్లిటు, ఇటువాళ్లటు చెదరి పడి పోతున్నారు. అంటే ఇంద్రుడు తూర్పుదిక్కునుండి మరొక దిక్కుకు పారవేయబడ్డాడు. అలాగే ఇతరులు.

5) ప్రబలతర= మిక్కిలి బలంకల ; బాడబీకృత= బడబాగ్నిగా చేయబడిన; ఇరమ్మదములు= మెరుపులు కలవి.

సముద్రగర్భంలో ఉన్న బడబాగ్ని మేఘాలలో మెరుపులై పోతున్నది.

6) భాస్వర= ప్రకాశించే; ఇరమ్మదీకృత= మెరుపులుగా చేయబడ్డ; బాడబములు= బడబాగ్నులు

మేఘాల్లోని విద్యుత్తు సముద్రంలో పడి బడబాగ్ని అవుతున్నది.

7) పతగ సమ్రాట్= పక్షిరాజైన గరుత్మంతునియొక్క ; పతత్ర= రెక్కలు సృష్టించిన; ప్రభంజనములు= వాయువులు, పెద్దగాలులు; వృజిన= పాపములనెడి; తూల= దూదియొక్క, ఓఘ= సమూహాన్ని ; తూలన్= చెదరి పోయేటట్లు; విసరుగాత= వీచుగాక.

ఇలా భయంకరంగా వీస్తున్న ఆ గాలులు పాపాలన్న ధూళిగుట్టలను చెదరగొట్టుగాక.

విశేషాలు : ఈ కావ్యంలో మొత్తం పదిదాకా ఇలాంటి కఠిన పద్యాలు కనిపిస్తాయి. ఈ కాఠిన్యం వర్ణింపబడ్డ వస్తువుయొక్క అతిశయాన్ని చిత్రిస్తున్నది కనుక ఔచిత్యమే. ఈ గరుత్మంతుని వర్ణనలు 4-13;6-97లలో కూడా కనిపిస్తాయి. కాని అక్కడి రచన చాలా మృదువైనది. కనుక ఇక్కడ గరుత్మంతుడు ఏ అమృత భాండం కోసమో ఎగిరిన సందర్భంలోనిదిగా భావించాలి.

వైష్ణవ దేవాలయాలలో విష్ణుమూర్తి విగ్రహానికి ఎదురుగా గరుత్మంతుని విగ్రహం ప్రతిష్ఠింపబడియుండటం చూస్తున్నాము. విష్ణుదేవునియొక్క వాహనమైన పక్షిరాజు యొక్క పరాక్రమ మిక్కడ వర్ణితాంశం గనుక ఈ ఓజో గుణాత్మకమైన రచన ఔచిత్యమని పిలువబడుతున్నది.

ఓజోగుణం: అంటే పరుష అక్షర సంకలితమైన దీర్ఘసమాసాలు కలది. ఇది శబ్దగతంగాను; అర్థగతంగాను ఉంటుంది. ఇక్కడ శబ్దార్థగతంగా ఓ జోగుణముండటం విశేషం. అంటే శబ్దమెంత కఠినమో, సాంద్రమో, అర్థంకూడా అంత బరువైనది కావటం.

అలం: స్వభావోక్తి. గరుత్మంతుని పరాక్రమ దృష్ట్యా స్వభావోక్తి; కవి కల్పన దృష్ట్యా ఉత్ప్రేక్ష.

రసం : అద్భుతం.

*'వీరస్య చ యత్కర్మ సోఽద్భుతః పరికీర్తితః'*. వీరునియొక్క చేష్టయే అద్భుత రసస్థాయియైన

విస్మయాన్ని పాఠకులలో ఉద్బోధిస్తున్నది. ఇక్కడ గరుత్మంతుని ఉడ్డీనం (ఎగరడం) ఆశ్చర్యకరంగా చెప్పబడింది కనుక అద్భుత రసం చెప్పాలి. ఆరుపాదాల్లో వర్ణింపబడ్డ ఆయా విషయాలన్నీ విషయస్థాయిని పరిపుష్టంచేసే భావాలు. అంటే వర్ణింప బడ్డ విషయాలన్నీ కూడా అద్భుత రసాన్నిధ్వనించే సామగ్రి ఒక్క ప్రభంజనమే శత్రువులను హరిస్తున్నది, భక్తుల పాపాలను హరిస్తున్నది.

భగవద్వర్ణనలన్నీ కావ్యంలో ఈ విధంగానే అద్భుత రసాత్మకంగా వర్ణింపబడటం ముందు ముందు స్పష్టపడుతుంది. (ఉదా : చూడు. 4-18 లో మత్స్యావతార వర్ణన, 21 లో వరాహావతార వర్ణన, 27 శ్రీరామబాణ వర్ణన.)

ఉ. పూని ముకుందు నాజ్ఞఁగను బొమ్మనె కాంచి యజాండ భాండము
లానను మీఁదఁబ్రోవ నడువన్ గొనెఁదన్నన నగ్ర నిశ్చల
త్వానచలత్వ నిష్ఠలె సమస్త జగంబుల జాడ్య చేతన
ల్గా నుతి కెక్కు సైన్యపతి కాంచన వేత్రము నాశ్రయించెదన్. 4

ఈ పద్యంలో విష్వక్సేనుని చేతి బెత్తం వర్ణింపబడుతున్నది. ఆయన విష్ణువు సేనాని.

ముకుందు నాజ్ఞన్=మోక్షమిచ్చే హరి ఆనతి ;కనుబొమ్మనె గాంచి=కనుబొమ కదలికచేతనే చూచి;పూని=త్రికరణశుద్ధిగా ధరించి; అజా+అండ భాండములు=బ్రహ్మాండములనెడు కుండలను; వానను=చేయును; మీదన్=తర్వాత; ప్రోవన్=రక్షించటానికి; అడువన్=సంహరించటానికి; తనున్ కొనెన్=తన్నును గ్రహించెను.(బెత్తమును చేతధరించినాడు) అనన్=అన్నట్లుగా; అగ్ర=చివరయొక్క; నిశ్చలత్వ=కదలిక లేక పోవటంయొక్క; అనచలత్వ=కదలికయొక్క; నిష్ఠలె= ఉండుటలె; సమస్తజగంబుల= సర్వలోకాలయొక్క; జాడ్య==జడత్వం; చేతన=చైతన్యము; కాన్=అగునట్లు; నుతికెక్కు=ప్రశంసలందుకొన్న; సైన్యపతి=సేనాపతియొక్క; కాంచన వేత్రము=బంగారు బెత్తమును; ఆశ్రయించెదన్=శరణు కోరుకుంటున్నాను.

తా : జగత్ప్రభువైన శ్రీమన్నారాయణుడు కనుబొమ కదలిక చేతనె సృష్టిస్థితి లయములు చేయవలసిందిగా తన సేనాపతి విష్వక్సేనునికి ఆనతిచ్చాడు. అత డా కార్యాన్ని ఎలా నిర్వహిస్తున్నాడంటే తన చేతి బెత్తంచేత. దాని కొన కదిలితే సృష్టి సాగుతున్నది. కదలక పోతే ప్రళయం సిద్ధిస్తున్నది. అలాంటి దివ్య శక్తిమంతమైన వేత్రమునకు నమస్కారము.

విశ్వాకారం, విశ్వాంతరాళం బోర్లించిన కుండగా కనిపిస్తున్నది. కనుక అది భాండమన బడినది. కుండ సర్వకళలకు మొదటి కళగా కళావేత్తలు చెబుతారు. అతి ప్రాచీన మానవుడు ఉపయోగార్థం నిర్మించు కొన్న పాత్ర కుండ. భారతీయుడు 64 కళలు ఉన్నాయన్నాడు. కుండ, బండి అతిప్రాచీన కళలు. వేదంలో మాటిమాటికి రథ ప్రతీక కనిపిస్తుంది. సేనాపతి బెత్తం కుమ్మరి సారె. అతడు కుమ్మరి. ఇక్కడ రూపకాలంకారము. మిగిలినది ఉత్ప్రేక్ష. ఆయన చేతి బెత్తమే సృష్టిస్థితిలయాదులు చేస్తున్నది అన్న సంభావన చేత ఉత్ప్రేక్ష చెప్పుకోవాలి. 'వాను' ధాతువు కుండలు చేయుట అనే అర్థంలోనే ప్రయోగింపబడుతున్నది. ఈ విష్వక్సేనుని వర్ణన 6-96 పద్యంగా రాబోతున్నది. అక్కడ కూడా 'వేత్రం కేల బూని' అన్న మాటతోనే ప్రారంభమవుతున్నది.

మ. హరి పూరింప ఁదదాస్య మారుత సుగంధాకృష్టమై నాభి పం
కరుహక్రోడ మిళంద బృంద మెదుఱెక్కం దుష్క్రియాపంకసం
కర దైత్యాసు పరంపరం గముచు రేఖం బొల్చు రాకా నిశా
కర గౌరద్యుతి పాంచజన్య మొసగుం గల్యాణ సాకల్యమున్. 5

ఇది పాంచజన్య వర్ణన :

హరి=విష్ణువు; పూరింపన్= ఊదగా; తత్=అతని; ఆస్య=నోటినుండివెడలిన; మారుత=గాలియొక్క; సుగంధ=పరిమళంచేత; ఆకృష్టమై= ఆకర్షింపబడ్డవై; నాభి=బొడ్డులోని; పంకరుహ=తామరయొక్క; క్రోడ= ఒడిలో; మిళింద బృందము=తుమ్మెదల గుంపు; ఎదుఱెక్కన్= ఆస్యమారుతానికి ఎదురు రాగా; దుష్క్రియా=పాపపు పనులన్న; పంక=బురదతో; సంకర=కూడుకున్న; దైత్య=రాక్షసుల యొక్క; అసు=ప్రాణములయొక్క; పరంపరన్=మొత్తమును; కవుచు రేఖన్= క్రమ్ముకొన్నట్లు; పొల్చు= ఒప్పుతున్న; రాకానిశాకర=పౌర్ణమి నాటి చంద్రునివలె; గౌర=తెల్లని; ద్యుతి=కాంతిగల; పాంచజన్యము=శంఖం; కళ్యాణ=మంగళములయొక్క; సాకల్యమున్=సమృద్ధిని; ఒసగున్= ఇచ్చుగాక.

తా : విష్ణువు తన శంఖాన్ని పూరిస్తుంటే ఆ స్వామి ముఖ వాయువులందున్న పరిమళముల వల్ల ఆయన నాభిపద్మంలో ఉన్న తుమ్మెదల బారు ఎదురెక్కుతున్నది. అది ఎలా ఉందంటే శంఖ ధ్వని పాపపంకిలమైన రాక్షసుల ప్రాణ సమూహాన్ని త్రాగుతున్నట్లుగా ఉన్నది. పున్నమి నాటి చంద్రుని వలె తెల్లగా ఉన్న ఆ పాంచజన్యం సకల కళ్యాణములను ప్రసాదించు గాక!

విశేషాలు : పాంచజన్యం పంచజనుడన్న రాక్షసుని చంపి అతని గొంతు ఎముకతో శంఖాన్ని నిర్మించు కొన్నాడని పురాణ ప్రతీతి. దీని ప్రతీకార్థం పంచజనుడంటే మనిషి. అతని కంఠంలోని స్వరపేటిక అదే స్థానంలో సూక్ష్మశరీరంపైనున్న విశుద్ధి చక్రం=పాంచజన్య శంఖం. అందులో నుండి వెలువడే స్వరసంపుటి ప్రాణవాయు వికారం అక్షరసమూహం. ఈశంఖమే సృష్టి ప్రథమ బీజమైన 'ఓం' కారంగా కూడా ప్రతీతి.

అలం : తుమ్మెద బారు పాపసమూహంగా సంభావింప బడింది కనుక ఉత్ప్రేక్ష.

నాభి పంకరుహక్రోడ - దుష్క్రియా పంకసంకర- కళ్యాణ సాకల్య అన్న సమాస కల్పన చెవుల కింపైనది. పాంచజన్య వర్ణన పద్యమంతా మధుర శబ్దరచనచేత సుగంధ భరితంగా వ్రాయడం అద్భుత విశేషం. కల్పనతో పాటు పద్యశైలికూడ విశేషమైనదే.

మ. ప్రతతోర్ధ్వాధరభాగ పీఠయుగళీ భాస్వత్సరుస్తంభసం
స్థితి ఁదీండ్రించెడు జాళువా మొసలి వా దీప్తారర్చిగా ఁగజ్జలా
న్విత ధూమాసిత రేఖ, పై యలుగుఁ గా, విజ్ఞాన దీపాంకురా
కృతి నందంబగు నందకం బఘలతా శ్రేణి చ్ఛిదం జేయుతన్. 6

భగవంతుని ఖడ్గమైన నందకవర్ణన :

ప్రతత=విస్తారమైన; ఊర్ధ్వ=పైన; అధర=క్రింద; భాగ=ప్రదేశాల్లోని; పీఠ=పీటలయొక్క; యుగళీ=జంటచే; భాస్వత్=ప్రకాశించే; త్సరుః=పిడి అన్న; స్తంభ=స్తంభంలో; సంస్థితిన్= ఉనికిచేత; తీండ్రించెడు=జ్వలిస్తున్న; జాళువా=బంగారు; మొసలి వా=మొసలి నోరు; దీప్త=మండే; అర్చి=జ్వాల; కాన్=కాగా, పై అలుగు=మీది మొన; కజ్జల+అన్విత=కాటుకతో కూడుకొన్న; ధూమ=పొగయొక్క; అసిత=నల్లని; రేఖకాన్=పొగకాగా; విజ్ఞాన దీప=జ్ఞాన దీపంయొక్క; అంకుర+ ఆకృతిన్= లేతమొలకయొక్క ఆకారంతో; అందంబగు నందకంబు=అందమైన నందకమన్న ఖడ్గం, అఘ=పాపములన్న; లతా==తీగలయొక్క; శ్రేణి=గుంపుయొక్క; ఛిదన్=ఛేదించటం; చేయుతన్=చేయుగాక ।

తా : భగవంతుని ఖడ్గం విజ్ఞాన దీపం. పూర్వకాలం దీప ప్రమిదలు ఒక కొయ్యసెమ్మెపై పెట్టేవారు. ఇది ఉపమానం. నందక ముపమేయం. ఖడ్గపు పిడికి క్రిందా పైన గుండ్రని చదునైన పీఠం సెమ్మెలాగా ఉండగా దానిపై నున్న బంగారు మొసలి నోరు దీపపు జ్వాలవలె ఉండగా ఆ మొసలి నోటినుండి పైకి సాగిన, నల్లని కత్తి దీపపు పొగ చాలుగా ఉన్నది. ఇలాంటి విజ్ఞాన దీపమైన నందకం పాపములన్న తీగల గుంపును నరుకు గాక ।

అలం : ఉత్ప్రేక్ష. ఈకత్తి వర్ణన వాస్తవిక వర్ణన. పిడికి అడుగున పీట ఉన్నది. పిడికిపైన మొసలినోరు బంగారంతో చేయబడి పిడికి పొదగ బడి ఉన్నది. ఆనోటినుండి కత్తి పైకి అమర్చబడి ఉంది. సెమ్మెకు క్రిందా పైన పీటలుంటాయి. దీపంలో జ్వాల వెలుగు తుంటే నల్లగా పొగ చాలు పైకి సాగి పోతుంటుంది. ఈ విధంగా సెమ్మె దీపపు భాగాలు ఖడ్గావయవాలపై ఆరోపింపబడటం చేత రూపకాలంకారం. ఈ రూపకం ఉత్ప్రేక్షను పోషిస్తున్నది.

కవి చక్రవర్తి గనుక కావ్యంలో ఆ యుధాలు, యుద్ధాలు, కోటగోడలు, కవచాలు ఇలాంటివన్నీ ఆయాస్థలాల్లో వర్ణింపబడటం గమనించాలి. ఇక్కడ ఆనాటి ఖడ్గ స్వరూపం ప్రత్యక్షంగా వర్ణింపబడింది. 4-31లో ఆనాటి కవచ వర్ణన చిత్రంగా చెప్పబడింది.

భగవంతుని ఆయుధాలకు ప్రతీకార్థాలున్నాయి. ఇక్కడ ఆ ప్రతీకార్థ దృష్టితోనే యీవర్ణన వచ్చింది.

జ్ఞానస్య ఖడ్గరూపత్వం - యతీంద్ర మత దీపిక
విద్యామయో నందకాఖ్యో అసిః - విష్ణుసహస్రవ్యాఖ్య - ఆదిశంకరులు.

ఉ. యాదవ సార్వ భౌమ భయదాయత బాహునియుక్తిఁ జేసి యెం
దే దను జేంద్ర సాళ్వపుర హేమమణీ వరణంబు సంగతం
బై దివి నాత్మ కంకణము లందొక కంకణ మయ్యె నట్టి కా
మోదకి మోదకీలిత సముజ్జ్వల కల్పక మాల్యఁ గొల్చెదన్. 7

యాదవ సార్వభౌమ= యదువంశ చక్రవర్తి శ్రీకృష్ణునియొక్క; భయద= భయంకరమైన; ఆయత= పొడవైన; బాహు= భుజంయొక్క; నియుక్తిన్ చేసి= ప్రయోగంచేత, ఎందేన్= ఏ కౌమోదకియందు; దను జేంద్ర= రాక్షసరాజైన; సాళ్వ= సాళ్వునియొక్క; పుర= పట్టణము యొక్క; హేమమణీ వరణంబు= బంగారము, రత్నములయొక్క ప్రాకారము, సంగతంబు+ ఐ= అంటుకున్నదై; దివిన్= ఆకాశంలో; ఆత్మ= తనయొక్క; కంకణములందున్= కడియముల మధ్య; ఒక కంకణము= ఒక వలయం; అయ్యెన్= అయినదో; మోద= సంతోషంతో, కీలిత= కూర్చబడ్డ; సముజ్జ్వల= ప్రకాశవంతమైన, కల్పకమాల్యన్= కల్ప వృక్షముయొక్క పూలదండ కలదైన, అట్టి కౌమోదకిన్= అలాంటి విష్ణుమూర్తి గదను; కొల్చెదన్= సేవిస్తున్నాను

తా. : సాళ్వుడన్న రాకాసి రాజు ద్వారకపై తన కాంచన రత్నమయమైన కోటతో ఆకాశంలోకి ఎగిరిరాగా శ్రీకృష్ణుడు తన కౌమోదకి చేత ఆ ప్రాకారాన్ని పటాపంచలు చేశాడు ఆ కౌమోదకియందు అనేక బంగారు మణి వలయాలు ఉన్నాయి. ఈ ప్రాకారం కూడా దాని కలాంటి అలంకారమే అవుతుంది. అంతటి మహత్వం గల కౌమోదకిని స్తుతిస్తున్నాను

విశే : సాళ్వుడు శిశుపాలుని స్నేహితుడు. వాడు తపస్సు చేసి శివుని వల్ల కాంచన మణిమయమైన ఒక సౌభకమన్న పేరుగల నగరాన్ని వరంగా పొందాడు. అది ఆకాశగామి అందువల్ల ద్వారకా నగరాన్ని నాశనం చేయడానికి ఆ నగరంతో పాటుగా వాడు ఆకాశంలో ఎగురుతూ వస్తున్నపుడు కౌమోదకి దాన్ని నాశనం చేసిన వృత్తాంతం ఇందులో వర్ణింప బడింది.

అలం : కాంచన మణి మయమైన పురప్రాకారం కంకణంగా సంభావింప బడింది. కనుక ఉత్ప్రేక్ష . ఉత్ప్రేక్ష వాచకం లేదు గనుక ఇది గమ్యోత్ప్రేక్ష. (2-4 పద్యంతో దీన్ని పోల్చు) కౌమోదకీ= భూదేవికి ఆనందాన్ని కలిగించేది. సృష్టిపాలనకు అడ్డుపడే దుర్మార్గులను సంహరించడం ద్వారా విశ్వానికి సంతోషాన్ని కల్పించే ఆయుధం గనుక కౌమోద కి

చ. పిడికెడు కౌనుఁ గొప్పుఁ గని ప్రేమ ఁ ద్రివక్ర సమాంగిఁ జేసి తేఁ
బిడికెఁడు కౌనుఁ గొప్పుఁ బయిఁ బెచ్చు గుణంబును గంటినంచు, నే
ర్పడఁగ నిజత్రివక్రతయుఁ బాపఁగ మ్రొక్కెడునా, సుమాలిపైఁ
జడిగొన నమ్ములీనుహరి శార్ఙ్గ ధనుర్లత గాచుఁగావుతన్. 8

విష్ణు చాప వర్ణన :

పిడికెడు కౌను= పిడికిలంత నడుమును; కొప్పున్= తురుమును; కని= చూచి; ప్రేమన్= ప్రేమతో; త్రివక్రన్= మూడు వంకరలు కలది అన్నపేరు గలస్త్రీని; సమ+ అంగిన్= = వంకరలు లేని శరీరం గలదిగా; చేసితి= చేసావు, ఏన్= నేనును; కౌనును= లస్తకమే ( ధనుస్సును చేతితో పట్టుకొనే చోటు; నడుము) కొప్పున్= అగ్రభాగమును; పయిన్ పెచ్చు= ఇంకా ఎక్కువగా; గుణంబునున్= అల్లెత్రాటిని (సద్గుణాన్ని)

కంటిని=పొందితిని; అంచున్=అని; ఏర్పడగన్=స్పష్టపడునట్లుగా; నిజ=తన యొక్క; త్రివక్రతయున్=మూడు వంకరలు గలిగియుండటాన్ని; పాపగన్=పోగొట్టగా; మ్రొక్కెడునాన్=నమస్కరిస్తున్నదో అన్నట్లుగా; సుమాలిపై= ఆపేరుగల రాక్షసునిపై; జడిగొనన్=ముసురు వానపడేటట్లుగా; అమ్ములు=బాణములు; ఈను=స్రవించు; హరి=విష్ణువుయొక్క; శార్ఙ్గలత=శార్ఙ్గమను పేరుగల తీగవంటి ధనుస్సు; కాచుగావుతన్=రక్షించుగాక!

తా. : సుమాలిపై బాణవర్షాన్ని కురిపిస్తున్న ధనుస్సు ఎలా ఉందంటే "హరీ! నీవు శరీరంలో మూడు వంకరలు గల మరుగుజ్జు స్త్రీని సుందరాంగిగా చేసావుకదా! నేనూ మూడు వంకరలు కల దానిని. నావంకరలను పోగొట్టి నన్నురక్షించుమని నమస్కరిస్తున్నదో అన్నట్లున్నది.

విశే : త్రివక్ర=మధురా నగరంలో కంసునికి చందనాది లేపనాలను సమకూర్చేదాసి. శ్రీరామకృష్ణులు మధురకు వెళ్లినపుడు ఇది ఎదురవుతుంది. శ్రీకృష్ణుడు ఆ చందనాదులను తనకు ఇమ్మని అడిగితే ఇస్తుంది. అప్పుడామె ననుగ్రహించి కృష్ణుడామె శరీరంలోని వంకరలను తీసి దివ్య సుందరిగా చేశాడు. ఈకథ భాగవతంలో ఉంది.

"తత్పదంబుల మీఁదఁ దన పదంబులు ద్రొక్కి, హస్తాంగులిద్వయ
మునం గవద క్రింద విప్పుగ నిడి కృష్ణుడు మీదికి నెత్తిన వక్రత
లెల్ల మాని".

ధనుస్సును ఎక్కుపెట్టడం గూడా ఇలాగే. క్రింది భాగాన్ని కాలితో త్రొక్కి పైకొనను వంచి అల్లెత్రాటిని బిగిస్తారు. కనుక శార్ఙ్గధనుర్లత పైవిధంగా ప్రార్థిస్తున్నట్లు వర్ణింప బడింది.

"త్రిషు స్థానేషు నతాః త్రిన్నతః శార్ఙ్గిణి"

మూడు చోట్ల వంపులు కలది కనుక శార్ఙ్గము - అని మాఘ కావ్యటీకలో మల్లినాథుల వ్రాత (వివరాలకు వేదం వారి ఆముక్తమాల్యద పీఠిక చూడు).

విష్ణువు నల్లని వాడు గనుక మేఘం లాగా, శార్ఙ్గధనుర్లత మెరుపులాగా, బాణపరంపర మబ్బుల కడుపులలోనుండి కురిసే వానలాగా ఉన్నది అన్న భావనా దృశ్యం పాఠకుడు హృద్యంగా భావించుకోవచ్చు.

చ. అడరు గళాస్రధారలు మహాముఖ వాంత సుధాంబు ధారలు
న్పొడవగు వహ్నికీలములు c బొంగును గా c బెఱద్రై త్య కోటికి
న్బెడిదవు c గిన్కతో నెసరు వెట్టిన పెద్ద పనంటి c బోలె నె
క్కుడు వెస రాహు మస్తకము c గొన్న సుదర్శన దేవుc గొల్చెదన్. 9

సుదర్శన చక్ర వర్ణన :

అడరు=స్రవించు; గళ+అస్రధారలు=గొంతుయొక్క నెత్తురు కాల్వలు; మహాముఖ=పెద్దనోటినుండి; వాంత=క్రక్కబడిన; సుధాంబు ధారలున్=అమృతరస ధారలును; పొడవగు= ఎత్తైన;

వహ్ని కీలములున్= నిప్పుమంటలును; పొంగునుగాన్= ఎసరు పొంగు కాగా; పెఱదైత్య కోటికిన్= ఇతర రాక్షస సమూహమునకు; ఎసరు పెట్టిన= పొయి మీద ఎసరుగా పెట్టిన, పెద్ద పనంటిన్ పోలెన్=వెడల్పైన నోరుగల పాత్రయో అన్నట్లుగా; బెడిదపు కిన్కతోన్=మిక్కిలి కోపముతో; ఎక్కుడు వెసన్=మిక్కిలి వేగంగా; రాహుమస్తకమున్=రాహువుతలను; కొన్న=నరికిన; సుదర్శన దేవున్= దేవుడైన సుదర్శనుని; కొల్చెదన్=సేవిస్తాను.

తా. : విష్ణువు మోహిని రూపంలో అమృతాన్ని దేవతలకు, రాక్షసులకు పంచుతున్నపుడు రాహు కేతువులు దేవతారూపాలు ధరించి తమకు పోసిన అమృతాన్ని త్రాగుతున్నపుడు ఆ సుధ గొంతులో నుండగానే సుదర్శనాయుధం ఆ కంఠాలను ఖండించింది. ఈ పురాణ కథ ఆధారంగా ఈ వర్ణన మలచబడింది.

అలం : తెగిన రాహువు తలనుండి వాంతి చేయబడ్డ అమృతధారలు ఎసరువలె, కంఠం నుండి స్రవించే నెత్తురు పొయిలోని మంటల్లాగా ఉన్న ఆ శిరస్సు మిగిలిన రాక్షసులకు గూడ ఎసరు బెట్టిన పెద్దవెడల్పైన నోరుగల పాత్రలాగా ఉన్నది అని ఉత్ప్రేక్ష.

ఎసరు పెట్టుట అన్నది జాతీయం.

విష్ణువు పంచాయుధ వర్ణన ఒక భావనా శక్తితో చేయబడ్డది. ఆయుధాలు కూడా దేవతలే. వాటికీ స్వయం వ్యక్తిత్వ మున్నది. కనుకనే ఆయా ఆయుధాలకు ప్రత్యేక నమస్కారములు చేయడం జరిగింది. ఈ చివరి పద్యంలో ఆ రహస్యం సూచించడానికా అన్నట్లు సుదర్శన దేవున్ అని ప్రయోగింప బడింది. కనుక యీ దేవశబ్దం మిగిలిన వాటికి కూడా అన్వయిస్తుంది.

చక్రవర్తి అయిన శ్రీకృష్ణదేవరాయలకు విజయ పరంపర సంభవించడానికి ఈ ఆయుధార్చన అత్యవసరం. సుదర్శనాదులకు ప్రత్యేక మంత్రాలున్నాయి. ద్వితీయాశ్వాసంలో వర్ణింప బడ్డ పాండ్యరాజు మంత్ర శక్తులు కలవాడిగా చిత్రింపబడటం; నాల్గవాశ్వాసంలో చెప్పబడ్డరాజనీతిలో శత్రురాజులను సంహరించడానికి అభిచారాది మంత్రప్రయోగాలు చెప్పబడినందువల్ల ఈ పంచాయుధ వర్ణన అద్భుత స్తోత్రంగా సంతరించ బడినది.

ఇంతేకాక మతదృష్టిగా ఈ ఆయుధములు విష్ణువాహనం అయిన గరుత్మంతుడు అంశలతో ఆళ్వారులు జన్మించినట్లు వైష్ణవ విశ్వాసం. మొదటి పద్యంలోని కౌస్తుభరత్నం అంశతో కులశేఖరాళ్వారులు, 2 వ పద్యం ఆది శేషుని అవతారం శ్రీమద్రామానుజులు, గరుత్మంతుని అంశతో విష్ణుచిత్తుడు, విష్వక్సేనుని వేత్రాంశతో నమ్మాళ్వారు; పాంచజన్య అంశతో పొయిగై ఆళ్వారు, నందకాంశతో పే ఆళ్వారు, కౌమోదకీ అంశతో భూతాళ్వారు; ధనురంశతో తిరువేంగళాళ్వారు, సుద ర్శనాంశతో తిరుమలేశాళ్వారు జన్మించినట్లు వైష్ణవ మతం చెబుతున్నది. రామాయణంలో భరత, లక్ష్మణాదులు ఇలాగే నారాయణ ఆయుధాంశజులు అన్న విషయం చెప్పబడింది కదా! కనుక ఆయుధవర్ణన ఆళ్వారుల స్తుతిగా కూడా అన్వయిస్తుంది.

రాయలవారు మతదృష్ట్యా విష్ణు భక్తుడు - శ్రీవైష్ణవుడు. నిర్వహించిన పాత్రదృష్ట్యా చక్రవర్తి. ప్రజారక్షణ, రాజధర్మపరిపాలనను ఆయన జీవిత యోగం కనుక ఈరెంటికి విష్ణుదేవతా స్తుతి అన్వయిస్తుంది. ఆయుధ మెప్పుడు అధర్మ నిర్మూలనకు గ్రహింపబడుతున్నది. ఇందుకే రాజదండం, దండనీతి, ధర్మదండము, ధర్మాసనము వంటి మాట లేర్పడ్డాయి. ఈ కావ్యంలో మత సంబంధమైన, రాజసంబంధమైన రెండు విషయాలు అన్వయించు కోవాలి. ఈ రెండు కలవాడే చక్రవర్తి, ఒకడు జగత్ చక్రవర్తి శ్రీమన్నారాయణుడు. అతని ప్రతినిధి శ్రీకృష్ణదేవరాయలు (రాజు). దీనికి సూచనగా రాజధర్మం చెప్పిన నాల్గవ ఆశ్వాసం చివరి పద్యంలో

'దృఢ అష్టాక్షర కృష్ణరాయనృప' అన్న సమాసం ఉంది. శ్రీకృష్ణదేవరాయలు అన్నది అష్టాక్షరి. అష్టాక్షర మంత్రం నారాయణ దైవతాత్మకం. ఇద్దరికి అన్వయిస్తూ ఈ మాటలు రాయలన్నాడు.

మ. అల పన్నిద్దఱు సూరులందును సముద్యల్లీల' గా పున్నవె
గ్గలపుం దాపముఁ బాప నా, నిజ మనః కంజాత సంజాతపు
ష్కల మాధ్వీక ఝరి న్మురారి సొగియుంగాఁ జొక్కి ధన్యాత్ములౌ
నిల పన్నిద్దఱు సూరులం దలతు మోక్షేచ్ఛామతిం దివ్యులన్. 10

ఇందులో పన్నిద్దఱు ఆళ్వారులు స్తుతింపబడుతున్నారు.

అల= ప్రసిద్ధమైన; పన్నిద్దఱు= పన్నెండుమంది; సూరులందును= సూర్యులలో, పండితుల్లో; సముద్యత్+ లీల= పొంగుతున్న విలాసంతో; కాపు+ ఉన్న= నివాసమున్న; వెగ్గలపున్+ తాపము= మిక్కిలి వేడిని; పాపన్= పోగొట్టడానికి; నాన్= అన్నట్లుగా; నిజ= తనయొక్క; మనః= మనస్సులనెడి; కంజాత= తామరలందు; సంజాత= పుట్టిన; పుష్కల= నిండుగా ఉన్న, మాధ్వీక ఝరిన్= మకరంద ప్రవాహంలో; మురారి= మురుడన్న రాక్షసుని చంపిన విష్ణువు; సొగియుంగాన్= సుఖిస్తూఉండగా; చొక్కి= ఆనంద పరవశులై; ధన్యాత్ములౌ= ధన్యజీవులైన; ఇల= భూమియందు; పన్నిద్దఱు సూరులన్= పన్నెండు మంది ఆళ్వారులను; దివ్యులన్= దేవతా స్వరూపులను ( ఆయా విష్ణ్వంశలతో పుట్టిన వారు కనుక) మోక్ష+ ఇచ్ఛామతిన్= మోక్షమందలి కోరిక గల మనసుతో; తలతున్= నిత్యమూ స్మరిస్తాను

తా : ఆకాశంలో పన్నెండు మంది సూర్యులున్నారు. నేలమీద పన్నెండు మంది సూరులున్నారు. ఇద్దరిలోనూ నారాయణుడున్నాడు. సూర్యబింబాల్లో ఉన్నందున నారాయణుడికి తాపం కలిగింది. ఆ తాపం పోగొట్టు కోడానికో అన్నట్లు నేలపైనున్న పన్నిద్దఱు ఆళ్వారుల హృదయాలలో నిత్యమూ స్రవించే భక్తి అన్న తేనె వాకలో మునగడానికో అన్నట్లు నారాయణుడు నివసిస్తున్నాడు. ఆ స్వామిని దర్శించి ఆనంద పరవశులై ఉన్న ఆళ్వారులను ముముక్షువునై నేను స్మరిస్తున్నాను.

విశే : పన్నిద్దఱు ఆళ్వారులు పొయిగై, పే, భూతాళ్వారులు ముగ్గురు, విష్ణుచిత్త, గోదాదేవి, విప్రనారాయణ, కులశేఖర, మధుర కవి, నమ్మాళ్వారులు, ప్రాణనాథ, పరకాళ యోగులు, శఠకోపయతీంద్రులు.

వీరు నిత్యసూరులు. అనగా నిత్యముక్తులు. బద్ధజీవులైన లోకులను శ్రీమన్నారాయణుని పాదసన్నిధికి చేర్పించే వారు ఆళ్వారులు, జగద్గురువులు. కథలో వీరే ఆయా వ్యక్తులను భగవద్భక్తులుగా చేసారు. కనుకనే రాయల వారిక్కడ మోక్షేచ్ఛామతిన్ సేవిస్తాను అన్నారు. ఈ మాట ముందరి పద్యాలలో ఎక్కడా లేదు. లౌకిక మానవుని తరింప జేసేది గురువే గనుక ఇది గురుస్తుతి.

భగవంతుడికి, లోకానికి మధ్యనున్న వారు గురువులైన ఆళ్వారులు. కనుకనే తరువాత చక్రవర్తి రాయల వర్ణన రాబోతున్నది. ఇష్టదేవతాస్తుతికి, చక్రవర్తికి మధ్యసేతువుగా గురువులున్నారు. ఆ వంతెనపైనుండి భగవంతుడు క్రిందికి వస్తాడు. క్రిందనున్న మానవులు పైకి ప్రయాణం చేస్తారు.

ఇష్ట దేవతాస్తుతి - భావోన్మేషం :

తెలుగు కావ్యాలలో ఈ స్తుతి ఒక సంప్రదాయంగా వచ్చింది. సంస్కృత నాటకాలలోని నాంది కిది విస్తృత రూపం.

శ్రీకృష్ణదేవరాయలు ఈ సంప్రదాయాని కొక క్రొత్త అర్థం కల్పించాడు. అంటే ఈ స్తుతి ఒట్టి ఆచారంగా గాక ఒక ప్రత్యేకమైన అర్థదృష్టితో చేయబడింది.

శ్రీవైష్ణవానుసారంగా భగవంతునకు రెండు విభూతులున్నాయి. 1. నిత్యవిభూతి లేదా త్రిపాద్విభూతి. ఇదే వైకుంఠం. ఇక్కడ లక్ష్మీనారాయణ ద్వంద్వం పంచాయుధాలు సేవిస్తుండగా ఆదిశేషునిపై ఆసీనమై ఉంటుంది. ఈ నిత్యవిభూతి వర్ణనమే ఇష్టదేవతాస్తుతి.

అది సృష్టిగా పరిణామం పొందుతుంది. ఎందుకు అంటే బద్ధజీవులను ముక్తులను చేయడానికి, అంటే సృష్టి మనిషి పరిమిత స్థితినుండి అపరిమిత నిత్యవిభూతిలో లీనం కావడానికి ఏర్పడ్డ సాధనశాల.

మొదటి పద్యంలో శ్రీమన్నారాయణ ద్వంద్వం కీర్తింపబడింది. అది ఒకే తత్త్వం. కాని సృష్టి కోసం రెండుగా అయింది.

రెండవ పద్యంలో లీలావిభూతి స్వరూపం కీర్తించ బడింది. ఇక్కడ భూదేవి, ఆదిశేషుడు వచ్చారు. తర్వాత పంచాయుధ వర్ణన వచ్చింది.

ఆదిశేషుడు అంటే ప్రథమ జీవుడు అని అర్థం. గరుత్మంతుడు, విష్వక్సేనుడు కూడా జీవకోటిలోని వారే. కాకపోతే వారు నిత్యముక్తులు. పంచాయుధములు జీవకోటి లోనివే ఈ తొమ్మిది పద్యాలలో వర్ణింప బడ్డ విషయమంతా నిత్యవిభూతి. అందులో బీజరూపంగా ఉన్న లీలావిభూతి వర్ణన తత్త్వము పైనుండి క్రిందికి దిగివస్తే సృష్టి ఈ అవరోహణ క్రమనే ఇష్ట దేవతాస్తుతి తర్వాత పన్నిద్దరు ఆళ్వారులు వచ్చారు. తర్వాత రాజు రాయల వర్ణన. ఇది లీలా విభూతి క్రమవికాసం. అంటే అవరోహణ క్రమం. ఇదొక అర్ధవృత్తం. ఆరో అశ్వాసంలో గోదాదేవిని తీసికొని విష్ణు చిత్తుడు శ్రీరంగం వెళ్లి స్వామిదర్శనం చేస్తాడు. అక్కడ ఇష్టదేవతా స్తుతి ఆరోహణ క్రమంలో చేయబడుతుంది. అదీ నిత్యవిభూతి వర్ణనే. మనిషి ఊర్ధ్వప్రయాణం చేయడం అక్కడ తాత్పర్యం. ఇదొక అర్ధవృత్తం. అక్కడ

విష్ణుచిత్తుడు మొదటగా చూచినది విష్వక్సేనుని, తరువాత గరుత్మంతుడు, తరువాత లీలావిభూతినంతా గర్భస్థంగా పెట్టుకున్న నిత్యవిభూతి స్వరూపమైన శ్రీలక్ష్మీ నారాయణ ద్వంద్వం.

కనుక ఇష్టదేవతాస్తుతి ఏకమైన భగవత్తత్వం క్రిందికి దిగివచ్చి సృష్టిగా పరిణమించిన విధానానికి వ్యంజకం. శ్రీరంగ నాయక వర్ణన తిరిగి నిత్యవిభూతిగా పరిణమించడానికి వ్యంజకంగా వర్ణింపబడింది. కనుక ఇష్టదేవతా స్తుతిలోని వర్ణనలు అక్కడ ఆ విధంగా చేయబడ్డాయి. లీలావిభూతిని నిత్యవిభూతిగా పరిణమింపజేసేవారు ఆళ్వారులు కనుక పదవ పద్యంగా వారి వర్ణన వచ్చింది

సృష్టిని 'నవం' అని వేదం వ్యవహరించింది. 'అధ్యతిష్ఠత్ దశాంగుళమ్' అన్న వేదమంత్రానికి అనేకులు అనేకార్థాలు భావించారు. భగవంతుడు పదివ్రేళ్లంత లేదా వ్రేళ్లకు పైన లేదా పదవ వ్రేలుగా ఉన్నాడు. అంటే సృష్టికి పైన నిత్యవిభూతిగా ఉన్నాడు. ఈ 9,10 సంఖ్యలకు ఇలాంటి ప్రతీకార్థాలున్నాయి కనుక రాయల వారు చేసిన ఇష్ట దేవతాస్తుతి పద్యాలు పదవ పద్యం ఆళ్వారులస్తుతీ ఈ దృష్టితో భావించ వలసిన అవసర మున్నది.

**వ. అని యిష్టదేవతా వందనంబుఁ జేసి మున్నేఁ గళింగదేశ విజిగీషా మనీషం దండెత్తి పోయి విజయ వాటిం గొన్ని వాసరంబులుండి శ్రీకాకుళనికేతనుండగు నాంధ్ర మధుమథను సేవింపంబోయి హరివాసరోపవాసం బచ్చటఁ గావింప నప్పుణ్యరాత్ర చతుర్థ యామంబున. 11**

అని యిష్ట దేవతా వందనంబుఁ జేసి

అని= ఈ విధంగా; ఇష్టదేవతా వందనంబున్= కులదేవతా నమస్కారమును; చేసి= నిర్వర్తించి. 4 - 43లో వీరశైవుడైన పాండ్య చక్రవర్తి వర్ణనలో గృహ దైవతంబులిర్రింకులింక అనడం వల్ల ఇష్టదేవత కుల క్రమాగతంగా వచ్చింది కావచ్చు. లేదా వ్యక్తిగత అభిరుచి ననుసరించి పూజార్థం గ్రహింపబడిన దేవతా కావచ్చు.

సామాన్యంగా మన ప్రబంధాలలో ఇష్టదేవతా స్తుతులుగా త్రిమూర్తులు, వారి భార్యల వర్ణనలు, వినాయక ప్రార్థన ఉండడం కద్దు శ్రీకాళహస్తీశ్వర మాహాత్మ్యం లో కూడా ధూర్జటి కవి శైవకుటుంబాన్ని మాత్రమే వర్ణించాడు. ఇది నిశ్చయాత్మకమైన భక్తి లక్షణం. అంటే ఆరాధ్య దైవతమే సర్వస్వంగా పూజించటం.

పైగా ముందు వ్రాసినట్లుగా ఏకమైన నారాయణ తత్త్వమే సృష్టిగా లీలా విభూతిగా పరిణామం పొందినదన్న సృష్టి విద్యానుసారంగా వ్రాయబడిన ఇష్టదేవతాస్తుతి కనుక ఇది. ఇక్కడ త్రిమూర్తి వర్ణనలు కుదరవు.

మున్నేఁ గళింగదేశ- - - - - చతుర్థయామంబున.

మునున్= పూర్వము, ఏన్= నేను; కళింగదేశ= ప్రస్తుతం ఒరిస్సా; విజగీషా= జయించాలన్న; మనీషన్= కోర్కెతో ( ప్రజ్ఞతో, యుద్ధతంత్రజ్ఞతతో సన్నద్ధపడి జైత్రయాత్ర చేయడానికి వీలైన ప్రజ్ఞతో); దండు+ ఎత్తిపోయి= జైత్రయాత్రగా వెళ్లి; విజయ వాటిన్= బెజవాడలో; కొన్నివాసరంబులు= కొన్నిరోజులు;

ఉండి=నివసించి; శ్రీకాకుళ=శ్రీకాకుళనగరము; నికేతనుండు=నివాసముగా కలవాడు అయిన; ఆంధ్ర=తెలుగు, మధు మధునున్= విష్ణుని; సేవింపంబోయి=పూజించడానికి వెళ్లి; హరి వాసర=విష్ణు ప్రీతికరమైన దినము; ఉపవాసంబు= ఉపవాసము; అచ్చటన్ కావింపన్= అక్కడ వహింపగా; ఆ+పుణ్య= ఆ పవిత్ర; రాత్ర=రాత్రియొక్క; చతుర్థయామంబున=నాల్గవ ఝామున

పూర్వము నేను ఉత్కళింగాన్ని జయించడానికి సకల యుద్ధతంత్రజ్ఞుడై పోతూ బెజవాడలో కొన్ని రోజులుండి ఒక ఏకాదశినాడు శ్రీకాకుళాంధ్ర విష్ణుని దర్శింపగా పోయి అక్కడ ఉపవాసం చేసి నిదురింపగా తెల్లవారు జామున ఆయనకు కలలో శ్రీకాకుళాంధ్ర దేవుడు కనిపిస్తాడని ముందు పద్యంతో అన్వయం.

ఇక్కడ 'మున్ను' అనడం చేత కళింగ విజయయాత్ర జరిగిన తర్వాత చాలా కాలానికి ఆముక్త మాల్యద వ్రాసినట్లు తెలుస్తున్నది. క్రింది పద్యంలో వర్ణింపబడ్డ స్వప్న వృత్తాంతం జరిగిన రోజు ఏదో మనకు స్పష్టంగా తెలియదు కాని చరిత్రకారుల ననుసరించి ఉజ్జాయింపుగా 1516 జనవరి 15 వ తేదీ ప్రాంతం. ఎందుకంటే రాయలవారు యుద్ధయాత్రకు వెళ్లేటపుడు తిరిగి జయించి వచ్చేటపుడు ఆయాపుణ్యక్షేత్రాలలో ఉన్న దేవతామూర్తులను పూజించి కానుక లర్పించి జయస్తంభాలో,శాసనాలో నాటించడం ఆయన కలవాటు. ఉదయగిరి నుండి కొండవీడు, కొండపల్లి, రాజమహేంద్రవరము, సింహాచలం, కటక్ దాకా ఆయన యుద్ధయాత్రలు సూచించే శాసనాలు నేటికీ లభిస్తున్నాయి. ఆ శాసన క్రమాన్ని అనుసరించి ఈ తేది నిర్ణయింపబడింది.

కావ్యరచనా కాలాన్ని బట్టి కూడా ఈ కల కాలం తేల్చుకోవచ్చు. వివరాలు పీఠికలో గుది గుచ్చబడినవి. దాని నిక్కడ అనుసంధించు కోవాలి.

సీ. నీల మేఘము డాలు డీలు సేయఁగఁ జాలు
మెఱుఁగుఁ జామన చాయ మేని తోడ,
నరవిందముల కచ్చు లడగించు జిగి హెచ్చు
నాయతంబగు కన్నుదోయితోడఁ
బులుగు రాయని చట్టుపల వన్నెనార వెట్టు
హొంబట్టు జిలుఁగు రెంటెంబు తోడ
నుదయార్క బింబంబు నొఱపు విడంబంబు
దొరలంగ నాడు కౌస్తుభముతోడఁ

తే. గీ. దమ్మి కేలుండఁ బెఱకేల దండయిచ్చు
లేములుడిపెడు లేఁజూపు లేమతోడఁ
దొలకు దయఁ దెల్పు చిఱునవ్వుతోడఁ గలఁద
దంధ్ర జలజాక్షుఁ డిట్లని యాన తిచ్చె. 12

1. నీలమేఘము= నల్లని మబ్బు, డాలున్=కాంతిని; డీలుసేయఁగఁజాలు = క్రింది చేయగల; ఓడించగల, మెఱుఁగున్ చామన చాయ= జిలుగు శ్యామల వర్ణం, మేనితోడ= శరీరంతో;

2. అరవిందముల కచ్చులు= తామర పూల గర్వములను, అడగించు= ఓడించు; జిగి= కాంతి; హెచ్చు= అధికమైన; ఆయతంబగు= విస్తారమైన; కన్నుదోయితోడన్= జంట కనులతో

3. పులుగు రాయని= పక్షిరాజు గరుత్మంతునియొక్క; చట్టుపల= రెక్కల యొక్క; వన్నెన్= కాంతిని; ఒరపెట్టు= వన్నెపెట్టు (బంగారాన్ని గీటురాయి మీద వరసి వన్నె చూచి మంచి చెడులు నిర్ణయించడం) హొంబట్టు= బంగారు జరీ కలిపి నేసిన పట్టు; జిలుఁగు రెంటెంబు తోడన్= సన్నని వస్త్రములతో

4. ఉదయార్క బింబంబు= ఉదయించే సూర్యబింబముయొక్క, ఒఱపున్= కాంతిని; విడంబంబు దొరలంగన్= ఎగతాళి మీరగా; ఆడు= ఆక్షేపించు; కౌస్తుభంబుతోడన్= కౌస్తుభరత్నములతో

5. తమ్మికేలు= పద్మం గల చేయి; ఉండన్= వేరుగా ఉండగా; పెఱకేలన్= వేరు చేతితో; దండ= ఊతము; ఇచ్చు= ఇస్తున్న; లేములు= పేదరికములు; ఉడిపెడు= పోగొట్టే; లేఁజూపు= లేత చూపులు కల; లేమతోడన్= స్త్రీతో; తొలకుదయన్= తొణకిసలాడుతున్న కారుణ్యమును ప్రకటించు, చిఱునవ్వుతోడన్= మందహాసముతో; తత్= ఆ; ఆంధ్రజలజాక్షుడు= ఆంధ్ర విష్ణువు; కలన్= స్వప్నంలో; ఇట్లని= ఈ విధంగా, ఆనతిచ్చెన్= ఆజ్ఞాపించెను.

స్వప్నంలో తోచిన ఆంధ్ర విష్ణువు రూపవర్ణన. నల్లని మబ్బుల కాంతిని క్రిందు చేసే మెఱుగు చామన చాయ మేను ముందు కన్పించింది ఒక నీలకాంతిపుంజము కనిపించి అదే శరీరంగా పరిణమించినట్లు, అందులో తామర పూల గర్వాన్ని ధిక్కరించగల విస్తారమైన కనుదోయి తోచింది. అంటే శిరస్సు దృగ్గోచరమైంది. తరువాత గరుత్మంతుని రెక్కల కాంతికి వన్నెపెట్టగల బంగారు పట్టువస్త్రం ఆ శరీరాన్ని ఆవరించి ఉన్నది. వక్షఃస్థలం మీద కౌస్తుభరత్నం అరుణార్కబింబ సౌందర్యాన్ని ధిక్కరిస్తున్నది. అంటే ఆయన వక్షఃస్థలం నీలాకాశం లాగా, కౌస్తుభరత్నం అక్కడ ఉదయిస్తున్న సూర్యునిలాగా ఉందని ధ్వనిస్తున్నది. ప్రక్కన లక్ష్మీదేవి ఒక చేత పద్మాన్ని ధరించి మరొక చేతితో భర్త హస్తమును గ్రహించి ఉండగా మందహాసం నుండి కారుణ్యం తొణకిసలాడుతుండగా కలలో కనిపించిన తెలుగు రాయడు ఈవిధంగా ఆజ్ఞాపించాడు. ప్రథమంగా క్రీడాభిరామంలో శ్రీకాకుళాంధ్ర దేవప్రసక్తి రాగా మరలా ఇక్కడ వచ్చింది.

విశేషాలు :- అలం: ఉపమ.

సీసపద్య ప్రథమ పాదార్ధంలో సమానధ్వని గల అక్షరముల కూర్పుచేత పద్యశైలిలో ఒక తూగు, సమతాగుణము వచ్చింది.

1. నేల, డాలు, డీలు, జాలు,
2. కచ్చు, హెచ్చు

3. చట్టు పలు, ఒఱపెట్టు, హొంబట్టు
4. బింబంబు, విడంబంబు

ఈ కూర్పు ఒక మధురమైన రచనా విశేషము.

ఈపద్యము మనుచరిత్రలోనిది 6-102. స్వారోచిషునకు విష్ణువు ప్రత్యక్షమైనపుడు అతడు చేసిన స్తుతి. కాని పెద్దనగారి ఎత్తుగీతిని రాయలవారు ఎత్తివేసి ఈ విధంగా వ్రాశారు. మనుస్తుతిలో లక్ష్మి లేదు.

దీనిని మార్చి రాయలవారు లక్ష్మీదేవిని ప్రవేశపెట్టాడు అతడు శ్రీ విష్ణువు తప్ప శ్రీలేని విష్ణువు కాడు కనుక మతం శ్రీవైష్ణవం తప్ప అన్యం కాదు. కనుక దాక్షిణాత్య మతము సశ్రీకమైనది. రాయల వారి రచన జాగ్రత్తగా చదువు కొనదగినది. ఉదయార్క బింబమన్న ఉపమానం ఈ కల తెల్లవారు ఝామున వచ్చిన దన్న వాక్యాన్ని చమత్కారంగా సూచిస్తున్నది. 4-11 పద్యంతో పోల్చు.

సీ. పలికి తుత్ప్రేక్షోపమలు జాతి పెంపెక్క
    రసికులౌనన మదాలస చరిత్ర,
భావధ్వని వ్యంగ్యసేవధి గాఁగఁ జె
    ప్పితివి సత్యావధూ ప్రీణనంబు,
శ్రుతిపురాణోప సంహిత లేర్చి కూర్చితి
    సకల కథా సార సంగ్రహంబు
శ్రోత్రఘచ్చటలు విచ్చుగ రచించితి సూక్తి
    నైపుణి జ్ఞాన చింతామణి కృతి
తే.గీ. మఱియు రసమంజరీ ముఖ్య మధురకావ్య
    రచన మెప్పించి కొంటి గీర్వాణభాష,
    నంధ్రభాష యసాధ్యంబె యందు నొక్క
    కృతి వినిర్మింపు మిఁక మాకుఁబ్రియముగాఁగ. 13

ఉత్ప్రేక్ష ఉపమలు జాతి= ఉత్ప్రేక్ష, ఉపమ, స్వభావోక్తి అలంకారములు; పెంపు+ ఎక్కన్= అతిశయింపగా; రసికులు=రసజ్ఞులు; అవును- అనన్=శభాష్ అని మెచ్చుకొనగా; మదాలసచరిత్ర=మదాలస చరిత్ర అన్న కావ్యమును; పలికితి=చెప్పినావు.

భావ=భావము ( రస పరిభాషలో భావమంటే వ్యభిచారి భావం అనే అర్థం); ధ్వని=ధ్వన్యర్థము; వ్యంగ్య=వ్యంగ్యార్థము; సేవధి=నిధి; కాగా=అగునట్లుగా; సత్యావధూ ప్రీణనంబు=సత్యభామకు ప్రీతి కలిగించు ఇతివృత్తం గల కావ్యం; చెప్పితివి=వ్రాసినావు.

శ్రుతి=వేదం; పురాణ=అష్టాదశ పురాణాలు, ఉపసంహితలు= ఉపపురాణాలు పద్దెనిమిది; ఏర్చి= ఏరి ఏరి, సకల కథా సార సంగ్రహంబు=సకల కథా సార సంగ్రహం అను గ్రంథాన్ని, కూర్చితి=సంకలనం చేసావు

శ్రోతృ+అఘచ్ఛటలు=వినేవారి పాపసమూహము; విచ్చగన్= =చెదరిపోగా; సూక్తినైపుణిన్=సుభాషిత నైపుణ్యముతో; జ్ఞాన చింతామణి కృతిన్=జ్ఞాన చింతామణి పేరు గల కావ్యాన్ని; రచించితి=రచించావు.

మఱియున్= ఇంక; రసమంజరీ ముఖ్య=రసమంజరి యను పేరు గల అలంకార శాస్త్రం మొదలుగా; మధుర కావ్యరచనన్=తీయని కావ్య రచనతో; గీర్వాణభాషన్=సంస్కృతభాషలో; మెప్పించికొంటి=పండితులతో మెప్పించుకొన్నావు.

ఆంధ్రభాషన్=తెలుగులో; అసాధ్యంబె=సాధ్యంకాదా! ఇకన్=ముందు; మాకున్=తెలుగురాయలనైన నాకు; ప్రియము గాగన్=ప్రీతి కలుగునట్లుగా; అందున్=తెలుగులో కూడా; ఒక్క కృతిన్= ఒక్క కావ్యము; వినిర్మింపుము=విశిష్టంగా నిర్మాణం చేయి.

సంస్కృతంలో రాయలవారు ఈ కావ్యాలను వ్రాసినట్లు ఈ పద్యమే మనకు ఆధారం. ఆ గ్రంథాలు మనకు దొరకలేదు. సకల కథా సార సంగ్రహంమద్రాసు తాళపత్ర గ్రంథాలయములో ఒకప్రతి ఉన్నదట. అది అయ్యల రాజు రామభద్రుడు వ్రాసి నట్లున్నదని కీ.శే. వేటూరి వారు వ్రాశారు. రసమంజరీ అనే అలంకారగ్రంథం భానుదత్తుని పేరు మీదుగా ఒకటి లభిస్తున్నది. మిగిలిన గ్రంథాలసంగతి మనకేమీ తెలియదు. జాంబవతీ పరిణయం అనే సంస్కృత నాటక మొకటి మన తెలుగు సాహిత్య అకాడమీ వారు రాయల పేరు మీదుగా ప్రకటించారు.

విశేషాలు : ఒక్క కృతి=అనన్య సామాన్యమైన కావ్యము. విశ్వనాధకవి సమ్రాట్టు తమ రామాయణ కల్పవృక్ష అవతారికలో పూర్వకవిస్తుతిలో రాయల వారిని 'కృష్ణ రాయడనన్య కృతి ప్రబంధ' అని స్తుతించినాడు. ఈ అనన్యశబ్దము రాయల వారి 'ఒక్క' కు రూపాంతరమే.

ఉపనిషత్తులలో పరబ్రహ్మమును ఏక శబ్దముతో వ్యవహరించారు అది సంఖ్యా వాచకం కాదు. సమస్తం తానైనది అతీతమైనది అని అర్థం. ఇదే ఒక్క అన్నా.

వినిర్మింపుము - తిక్కనగారు కూడ హరిహరనాథుని నోటినుండి వినిర్మాణశబ్దాన్ని అనిపించారు. బ్రహ్మసృష్టి వంటిదే కావ్యసృష్టి కనుక అది విశిష్టమైన నిర్మాణము కలది. కేవల రసపరతంత్రమైన రచన, ప్రౌఢ కావ్యం. శబ్దం నుండి రసం దాకా పేర్చుకు పోయే ఒక బంగారు మేడ, వినిర్మాణం.

మమ్మటు భట్టు అన్న ఆలంకారికుడు కూడా కావ్యరచనను వినిర్మితిగా పేర్కొన్నాడు. భామహాచార్యులు తన అలంకార గ్రంథంలో

'కావ్యం తు జాతు జాయేత కస్యచిత్ ప్రతిభావతః' ఒకానొక ప్రతిభావంతుడైన కవినుండి ఎప్పుడో ఒకప్పుడు కావ్యం పుడితే పుడుతుంది. కావ్యనిర్మాణము, కైలాస నాథదేవాలయ నిర్మాణము ఒకటే కనుక ఈ వినిర్మాణ శబ్దం విశేషార్థంలో వాడబడింది.

భావము కేవలరస పరిధిలోనిది. ధ్వని వేరు వ్యంగ్యం వేరు. 'గంగలో గొల్లపల్లె' అన్న వాక్యం దగ్గర లక్షణార్థప్రయోజనమైన పావనత్వ, శీతత్వాదులు చెప్పబడ్డాయి. ఈ ప్రయోజనార్థం వ్యంగ్యం, ధ్వని దీనికి పై అంతస్థులోనిది. కనుక ఈ మూడు మాటలు కేవల రసకక్ష్యలోనివి. ఆ దృష్టితో చేసిన నిర్మాణం వినిర్మాణం.

అలం : అర్థాపత్తి. సంస్కృతంలో వ్రాశావు కనుక తెలుగులో అసాధ్యమా? తెలుగులో ఇంకా చెప్పేదేమిటి? 'కైముత్య' న్యాయం చేత అన్యార్థ ఆపత్తి కావ్యార్థాపత్తి.

ఉ. ఎన్నినుఁ గూర్తు నన్న, విను, మే మును దాల్చిన మాల్య మిచ్చు న
ప్పిన్నది రంగమందయిన పెండిలి సెప్పుము, మున్ను గొంటి నే
వన్ననదండ యొక్క మగవాడిడ, నేను దెలుంగు రాయఁడ,
గ్గన్నడ రాయ!, యక్కొఁదువఁ గప్పు ప్రియాపరిభుక్త భాక్కథన్. 14

ఎన్నిను= ఏ నిన్ను గూర్చి; కూర్తును=రచించేది; అన్నన్=అంటే; వినుము=వినవలసినది; ఏన్=నేను, మును దాల్చిన=ముందు తాను ధరించిన; మాల్యము +ఇచ్చు=దండ నాకు అర్పించు; ఆ+పిన్నది= ఆ చిన్నది; గోదాదేవి; నప్పిన్నది=తమిళంలో ఈ శబ్దం నీలాదేవి అను అర్థంలో ఉన్నది. ఆమె రూపమే యిక్కడ గోదాదేవి. కనుక రెండర్థాలలో ఈ శబ్దాన్ని గ్రహించాలి; రంగమందున్+అయిన=శ్రీరంగమందు జరిగిన; పెండిలి=వివాహము; చెప్పుము=కథగా వ్రాయి. మున్ను=పూర్వం; అన్ననదండన్= ఆ పూలదండను; ఒక్క మగవాడిడన్= ఒక్క మగవాడిస్తే; ఏవన్= ఏవగించుకుంటూ; కొంటిని=గ్రహించాను. నేను తెలుంగు రాయఁడన్=నేను ఆంధ్రవిష్ణువును. కన్నడ రాయ=నీవు కర్ణాట క్షితిపతివి; ప్రియా=ప్రియురాలిచేత; పరిభుక్త=చక్కగా అనుభవింపబడిన(పూలదండను) ; భాక్=పొందిన; కథన్=కథచేత; అక్కొఁదువన్= ఆ వెలితిని; కప్పుము= ఆచ్ఛాదించు, తొలగించు.

తా :- నిన్ను గురించి పురాణ కథలు అనేకం ఉన్నాయి కనుక ఏ కథ చెప్పుమని నీవు అడిగితే తన కొప్పులో తాల్చిన దండను ప్రేమతో నాకర్పించిన ఆ చిన్నదాని కథ చెప్పు. పూర్వము నేను ఒక మగవాడిచ్చిన పూలదండను జుగుప్సతో తీసికోక తప్పలేదు. ప్రియురాలిచ్చిన దండను తీసుకున్న కథను చెప్పి ఆ కొదువను తొలగించు. నేనో ఆంధ్రవల్లభుడను. నీవా కర్ణాట చక్రవర్తివి. మనిద్దరి మధ్య ఉన్న యీ సామ్యంచేత నీవే నా కథ చెప్పగలవాడివి.

విశేషాలు :- ప్రియా పరిభుక్త భాక్కథన్ అన్నమాట కావ్యంలోని రసం శృంగారమని వ్యంగ్యరమణీయంగా సూచింప బడుతున్నది. 'మును దాల్చిన మాల్యమిచ్చు నప్పిన్నది' అన్నమాట భగవంతునకు ఆమెపైనున్న రతిస్థాయిని తెలుపుతున్నది. ఆవిడంటే ఆయనకు చాలా ఇష్టము అన్న విషయాన్ని నప్పిన్నది అన్న మాట ధ్వనిస్తున్నది. దీనికి సంబంధించిన కథాంశం 5-38లో వస్తుంది.

'మగవాడిడ' అన్నది శ్రీకృష్ణావతారములో సుదాముడన్నవాడు దండలిచ్చిన కథగా వేదం వారు గ్రహించారు కాని యిది సమంజసం కాదు. ఆంధ్రనాయక శతకంలో ఒక కథ చెప్పబడి ఉంది. ఆంధ్రవిష్ణువును అర్చించే పూజారి ప్రతిరోజూ ఆయనకు వేసేదండలను తనప్రియురాలైన ఒక వేశ్యకు

అలంకరించి. అవే తెచ్చి విష్ణువు మెడలో వేసే వాడట. ఒకరోజు రాజుగారు దైవ దర్శనానికి వస్తే దైవ ప్రసాదంగా దైవ నిర్మాల్యాన్ని అంటే పూలదండను రాజుగారి మెడలో వేశాడట. ( ఇప్పటికి దక్షిణ దేశ దేవాలయాలలో భగవంతుడికి వేసిన దండను ముఖ్యవ్యక్తులైన వారికి మెడలో వేయడం ఆచారంగా ఉంది ) ఆదండలో ఒక వెంట్రుక వచ్చింది. అది చూచి రాజునకు కోపం వచ్చిందట. కోపంవచ్చి పూజారిని దండిస్తూ ''భగవంతునికి అర్పించిన పూలదండలో ఈ కేశమేమిటి?'' అన్నాడట. పూజారి వణకి పోతూ ''ప్రభూ! మన స్వామి వారికి కొప్పున్నది. అందులోదే యీ మాల్యంలో చిక్కుకున్నది'' అన్నాడట. ''ఇది చాల విడ్డూరంగా ఉందే. విగ్రహానికి కొప్పేమిటి?'' అని రాజు నిలదీస్తే పూజారి ''రేపు చూపిస్తాను'' అన్నాడట. ఆ రాత్రి పూజారి భగవంతుని ప్రార్థిస్తే తెల్లవారి ఆయనకు కొప్పు కల్పించుకోక తప్పలేదట మగవాడంటే పూజారి. కనుక తెలుగు రాయడు తనకు జరిగిన పూర్వానుభవాన్నే యీసందర్భంలో కన్నడ రాయనితో అంటున్నాడు. ఈ కథా సూచన ఆంధ్రనాయక శతకంలో ఉన్నది. (''వైఖానసోక్తికి వంచన రాకుండ నెరుల చూపినమాట నిజమయేని'') (12వ పద్యం)

ఆ. తెలుఁగదేల యన్న? దేశంబు దెలుఁ, గేను
దెలుగు వల్లభుండఁ, దెలుగొ కండ,
యెల్లనృపులు గొలువ నెఱుఁగవే బాసాడి
దేశ భాషలందు ( దెలుగు లెస్స. 15

తెలుగు-అది- ఏల-అన్నన్=తెలుగులోనే కావ్యం వ్రాయమని ఎందుకు అంటున్నానంటే; దేశంబు తెలుఁగు=మాతృదేశం తెలుగు; ఏనుఃనేను; తెలుఁగు వల్లభుండన్=తెలుఁగు రాజును; తెలుఁగొ= ఇక తెలుగు భాషంటావా? కండ=కండగల భాష, పులకండ; ఎల్లనృపులున్ గొలువన్= రాజులంతా సేవిస్తూ ఉండగా ( నీ భువన విజయ సభామంటపంలో) బాస - ఆడి - ఎఱుగవే=మాట్లాడి ఎరుగుదువు కదా!; దేశభాషలందు=సంస్కృతము కాక రాష్ట్రభాషలలో; తెలుఁగు లెస్స=తెలుగు భాష గొప్పది.

తా : ఈ పద్యం దేశ భాషాభిమానం ప్రతి మానవుని ప్రథమ కర్తవ్యమని బోధిస్తున్నది. దేశభాషలంటే ఔత్తరాహ, దాక్షిణాత్యరాష్ట్రభాషలు. రాయల వారి అస్థానంలో దేశ భాషా కవులందరూ ఉండేవారు. వారి భాషలన్నీ విన్న వాడు గనుక 'దేశభాషలందు తెలుగు లెస్స' అనగలిగినాడు. కండ అంటే పుష్టిగల సమర్థవంతమైన అన్న అర్థం సంభవించింది. భారత, భాగవతాది అనువాదాలు చూస్తే సర్వశాస్త్రాలను తెలుగు శబ్దం తనలో ఇమిడించు కోగలదు అని తెలుస్తుంది. మాతృభాషాభిమానంకల ఆనాటి తెలుగు వాని నిష్ఠ అట్టిది. పద్యంలో నాలుగోపాదం వినుకొండవల్లభరాయని క్రీడాభిరామంలోనిది. అయినా దానికి ప్రశస్తి రాయల వారి రాచముద్ర వల్లనే వచ్చింది.

దాసరి కథలో 'అమృతమైననుఁ జవుల జాత్యన్నసమమె?' అని దాసరి అంటాడు. ఇది దేశభాషాభిమానం. తిక్కన, రాయలు, రామకృష్ణుడు, విశ్వనాథ వంటి కవులలో తెలుగు గడ్డపై మొలిచిన ప్రతి గడ్డిపూవూ పారిజాతమే. వారి రచనా లక్షణమది. (1-60) 'బాసఁగ్రుతిసెప్పవలతు పద్మముఖులు'.

బాస అంటే దేశ భాష. సంస్కృతంతో పాటు మాతృభాషను సమానంగా గౌరవించిన లక్షణము ఆనాడుఉన్నది. పైగా పాశ్చాత్యులు, తమిళులు ఈ భాషను స్తుతించారు. కదా!

ఆంధ్రభాషలో అక్షరసమామ్నాయము వామావర్తలిపి గలది. అంటే అక్షరం ఎడమ వైపునకు చేయిత్రిప్పివ్రాసేది. కనుక యిది జగజ్జననికే ప్రీతి పాత్రమైన భాష. మన చదువు 'ఓంనమశ్శివాయ' అన్న పంచాక్షరంతో ప్రారంభమవుతున్నది. ఇది త్రిలింగ మధ్యభాష. ఇది పవిత్రభాష.

'తెలుఁగొ కండ' అన్న వాక్యాన్ని కొందరు తెలుగు-ఒకండ=తెలుగు ఒక్కటే అనే అర్థంలో విడదీశారు. వేదం వారు కలకండ అన్న అర్థం వ్రాశారు.

కం. అంకితమో యన నీకల,
వేంకటపతి యిష్టమైన వేల్పగుట ౘదదీ
యాంకితము సేయు మొక్కొక
సంకేతముగా కతఁడ రసన్నేఁ గానే. 16

అంకితమో అనన్= ఇక అంకితం విషయం అంటావా; నీకున్; అల= జగత్ప్రసిద్ధమైన; వేంకట పతి=శ్రీవేంకటేశ్వర స్వామి; ఇష్టము- ఐన= నచ్చిన; వేల్పు+అగుటన్=దైవమైనందున; తదీయ=అతని పేరున; అంకితము-చేయుము; ఒక్కొక= ఒక్కొక్క; సంకేతము=గుర్తు; కాక=తప్ప; రసన్=భూమియందు; అతడ=అతడు( ఆ వేంకటపతి); నేన్-కానే= నేను కానా?.

తా : రాయలవారికి వేంకటేశ్వర స్వామి ఇష్టదైవం. కనుక ప్రతిజైత్రయాత్రలో తిరుపతి వెళ్లి, విజయానంతరం తిరిగి వచ్చి వివిధములైన కానుకలు సమర్పించేవాడట. కనుక తదంకితంగా ఈ కావ్యం వచ్చింది. ఒక్కొక్క సంకేతమన్న మాట చాలాగొప్పది. ఈ మూర్తులన్నీ శిలవంటి పరబ్రహ్మమునందు శిల్పి మలచిన ఆకృతి విశేషాలు. అపరిమిత మైన ఆత్మతత్వాన్ని మనిషి తన పరిమితమైన మనస్సుకు అందేటట్లుగా చెక్కుకున్న శిల్పాలు. అంటే పరమాత్మ పరిమిత మానవ ప్రజ్ఞకు లోనై దిగివచ్చిన మూర్తులు. ఋగ్వేదంలోని పురుషసూక్తంలో

'సహస్రశీర్షా పురుషః' అన్న మంత్ర తాత్పర్యమిదే. పురుషుడనగా పురుషోత్తముడే. అతనికి కోటానుకోట్ల ముఖాలున్నాయి. ఇందుచేతనే శ్రీరామ కృష్ణపరమహంస సర్వమత ఉపాసనా ధ్యానాలు చేసి అన్ని మతాలు ఒక్కటే నన్న మహాసత్యాన్ని నిర్ధారించాడు. ఇది ఆధునిక యుగ ఉషః ప్రారంభం.

తే. పొత్తమిటు సేయ నీకుత్తరోత్తరాభి
వృద్ధి యని పోవ, మేల్కాని వెఱఁ గు తోడి
భక్తిఁ దద్గృహ గోపుర ప్రణతి ౘజేసి
వేగుటయు ౘ గల్యకరణీయ విధులు దీర్చి. 17

పొత్తము=పుస్తకము,కావ్యము; ఇటు= ఈవిధముగా; చేయన్=చేస్తే; నీకున్, ఉత్తర- ఉత్తర- అభివృద్ధి=భవిష్యత్తులో అభివృద్ధి (కలుగుతుంది); అని; పోవన్= అదృశ్యుడైపోవగా; మేలుకాంచి; వెఱఁగుతోడి భక్తిన్= ఆశ్చర్యముతో కూడిన భక్తితో; తత్-గోపుర= ఆస్వామి గోపురానికి;

ప్రణతి=నమస్కారము, వంగి నమస్కరించుట; చేసి= అర్పించి, వేగుటయున్=తెల్లవారినంత; కల్య=వేగు జామున; కరణీయ=నిర్వహించదగిన, విధులు=వైదిక కర్మలు(పూజాదులు); తీర్చి=పూర్తి చేసి.

తా : నీ వీ కావ్యం వ్రాస్తే నీకు భవిష్యత్తులో సుఖపరంపరలు కలుగుతాయి అని భగవంతుడు అదృశ్యుడు కాగా మేల్కొంచి ఆ ఆలయ గోపురానికి నమస్కరించి తెలవారినంతనే చేయవలసిన అనుష్ఠానాదులు నిర్వహించి (తరువాతి వచనానికి అన్వయం)

ఈ స్వప్నం రాయలవారు కళింగ జైత్రయాత్రకు పోతున్నపుడు వచ్చినది తప్ప సుఖంగా తిని పడుకున్నపుడు వచ్చింది కాదు. మనస్సు యుద్ధ మగ్నమై ఉన్నపుడు వచ్చిన కల కనుక యథార్థంగా భావించ దగింది తప్ప కావ్య సంప్రదాయమని అనుకోవడానికి వీలులేదు. ఇందుచేత కవికి వెలుగుబాటు కలిగింది. కవుల, శాస్త్రవేత్తల అనుభవాల ప్రకారం మనస్సు అన్యవస్తువు మగ్నమైనపుడు వారి వారి శ్రమఫలితంగా స్వప్నం రావడం అందులో సమాధానం లభించడం జరుగుతున్నది.

(ఈ వ్యాఖ్యాతకు కూడా స్వప్నంలోనే కావ్య పరమార్థం అంటే నిర్మాణ రహస్యం విన్పించినందు వలననే పరిశోధనాత్మక విమర్శగా ఆముక్త మాల్యదా సౌందర్యమన్న గ్రంథం నిష్పన్నమైనది).

ఆధునిక కాల స్వప్న మనస్తత్వశాస్త్రం స్వప్నం యథార్థమైన విషయంగానే చెబుతుంది. కనుక యిదేదో భక్తితో వ్రాసుకున్నది అని కొట్టి వేయడానికి వీలు లేదు.

వ. నిండోలగంబుండి దండనాథ సామంతసందోహంబులం బిలిపించి బెందలకడన మందిరంబుల కనిపి వివిధ వేదాగమ విదులగు విద్వజ్జనంబులఁ గానిపించి కొని నమస్కరించి యా శుభస్వప్నంబు వినిపించిన, హర్షించి, వారును సవిస్మయ స్వాంతులై, 'దేవా! దేవదేవుండు విజయంబు చేసిన' యాస్వప్నంబనేక శోభన పరంపరలందెలుపు చున్నయది. ఎట్లనిన, ప్రథమ మప్పద్మేక్షణు స్వప్న సాక్షాత్కారం బితోఽధిక భక్తియు,నతండు ప్రబంధ నిబంధనంబు c గావింపు మనుట యితోఽధికాగాధ సారస్వతోద్బోధంబును, నతని దేవీ సమాగమంబితోఽధికాఖండ భాండాగార సమృద్ధియు,నతని యాసతి చేతి విశద శతచ్ఛదంబితోధికాద్వితీయ సిత ఛత్రతయు, నతండశేష నృపసేవం దత్తద్భాష తెలుఁగవె యనుట యితోఽధిక సమస్త సామంత సమాజ సమాకర్షణంబును, ప్రియోపభోగ పరిశిష్ట భోగంబింపనుట యితోఽధిక బహుప్రేయసీ ప్రాప్తియు, కృతి చెప్ప నుత్తరోత్తరాభి వృద్ధి యగు ననుట యితోఽధికా పత్య పరమాయు రవాప్తియు, నగు నఖర్వ మహిమాతి ధూర్వహుఁడగు తుర్వసు వంశంబునం బుట్టినట్టి నీకిట్టి శోభన పరంపర లేమద్భుతంబు, లవధరింపుము. 18

నిండు=పూర్ణమైన; ఓలగంబు+ ఉండి=సభ తీర్చి; దండనాథ= సేనాపతులు; సామంతులు=సామంతులైన రాజులు; సందోహంబుగా= సమూహముగా; పిలిపించి; పెందల కడన= ప్రాతఃకాలములోనే, మందిరంబులకు= వారి వారి శిబిరాలకు, అనిపి= పంపి, వివిధ=అనేక;

వేద=వేదములు, ఆగమ= పాంచరాత్రాది శాస్త్రగ్రంథాలు; విదులు=తెలిసిన వారు; విద్వత్+ జనంబులు=పండితులు; కానిపించుకొని= తనదర్శనం చేయించుకొని; ఆ శుభస్వప్నంబు= ఆ శుభమైన కల; వినిపించినన్=వినిపిస్తే; వారునున్= ఆపండితులును; హర్షించి=సంతోషించి; సవిస్మయస్వాంతులై= ఆశ్చర్యమనస్కులై; దేవా=ప్రభూ!; దేవ దేవుండు=దేవతలకు దేవుడైన శ్రీమన్నారాయణుడు, విజయంబు చేసిన=దర్శన మిచ్చిన; (వచ్చిన అన్నమాటకు పెద్దల విషయంలో వాడే మాట); ఆ స్వప్నంబు= ఆ కల; అనేక శోభన పరంపరలు=వివిధ శుభ సమూహములు (ఉత్తరోత్తరాభివృద్ధి అని పైపద్యంలో ఉన్నమాట కిది వ్యాఖ్యానము) ఎట్లు-అనినన్= ఎలాగంటే;

1. ప్రథమము=మొదటిగా; ఆ-పద్మేక్షణు= ఆ తామర పూల వంటి నేత్రాలు కల స్వామి; స్వప్నసాక్షాత్కారంబు=కలలో దర్శన మిచ్చుట; ఇతోఽధిక భక్తియు=అదనపు భక్తి; ఇతః-అధిక= ఇప్పటికన్నా ఎక్కువ,

2. అతండు= ఆ భగవంతుడు, ప్రబంధ నిబంధనంబు=ప్రబంధనిర్మాణం; కావింపుము- అనుట= చేయుమని ఆజ్ఞాపించడం; ఇతోఽధిక= ఇంతకంటె మిక్కిలి; అగాధ=లోతైన; సారస్వత=సాహిత్య; ఉద్బోధంబునున్=లబ్ధియు,

3. అతని; దేవీ సమాగమంబు=లక్ష్మీదేవితో కూడుకొని యుండుట (లేములుడిపెడు లేఁజూపు లేమతోడ- 12వపద్యము) ఇతోఽధిక= ఇంతకంటె; అఖండ=ఎడతెగని; భండాగార=కోశముయొక్క; అభివృద్ధియు=పెంపుదల (భాండము=కుండ; అగారము= ఇల్లు - పూర్వకాలం ధనం నాణెముల రూపంలో ఉండేది గనుక అవి లోహ, మృణ్మయ, పాత్రలలో పోసి ఉంచే చోటు కనుక కోశాగారాన్ని భాండాగార మనేవారు.)

4. అతని; ఆ సతిచేతి= ఆ భార్య చేతిలో ఉన్న; విశద=తెల్లని; శతచ్ఛదంబు= నూరురేకులు గల తామరపూవు; ఇతోఽధిక; అద్వితీయ=సాటిలేని; సితచ్ఛత్రతయును=తెల్లని గొడుగును; ( ఇది మహా చక్రవర్తి చిహ్నము)

5. అతండు; అశేష, అనంత నృపసేవన్=రాజులకొలువులో; తత్= ఆయా; భాషలు=రాష్ట్రభాషలు; ఎఱుగవే= ఎఱుగవా! అనుట, ఇతోఽధిక, సమస్త=సకల; సామంత సమాజ= సామంతరాజులయొక్క; సమాకర్షణంబును= చక్కగా ఆకర్షించుటను; ప్రియ-ఉపభోగ= ప్రియురాలిచేత అనుభవింపబడిన; పరిశిష్ట భోగంబు=మిగిలిన అనుభవము; (భోగంబు= దైవార్చన - దేవాలయాల్లో నర్తననైవేద్యాదులను ఈ శబ్దంతో వ్యవహరిస్తారు.) ఇంపు+అనుట= ఇష్టమనడం; ఇతోఽధిక, బహుప్రేయసీ ప్రాప్తియున్=అనేక మైన ప్రియురాండ్రయొక్క లబ్ధియు.

6. కృతి చెప్పన్=కావ్యం వ్రాస్తే; ఉత్తరోత్తరాభివృద్ధి=క్రమ క్రమ అభ్యుదయం;అగుననుట=కలుగుతుంది అనడం; ఇతోఽధిక ; అపత్య=సంతానము; పరమ=పూర్ణ; ఆయుః= ఆయుస్సుయొక్క; అవాప్తి= పొందుటయును; అగును= కలుగును; అఖర్వ=అధికమైన; మహిమ=గొప్పతనము;

అతిధూర్వహుడు= మిక్కిలి ధరించినవాడు; అగు=అయిన; తుర్వసు వంశంబునన్=తుర్వసుని వంశవములో; పుట్టినట్టి=జన్మించిన; నీకున్; ఇట్టి= ఈ చెప్పినట్టి; శోభన పరంపరలు= శుభసమూహములు; ఏమి అద్భుతంబులు= ఏమంత ఆశ్చర్యము!; అవధరింపుము=వినుము.

భగవంతుడు అన్న ఉత్తరోత్తరాభివృద్ధి వ్యాఖ్యానం ఈ వచనంలో చేయబడింది. ఇందులో ఆశ్చర్యకరమైన వ్యాఖ్యానము పన్నెండో పద్యంలో తమ్మికేలుండన్ - అన్న చోటి తమ్మిశబ్దానికి చేసిన సాంకేతికార్థం చాలా సొగసుగా ఉంటుంది. శ్వేతఛత్రధారణ అన్నది మహాచక్రవర్తికి సంకేతంగా ఉంది. (చూ. ఈ వ్యాఖ్యాత వ్రాసిన శ్వేత ఛత్రమన్న రాజనీతి గ్రంథం)

బహు ప్రేయసి ప్రాప్తి అనటం జరుగబోయే గజపతి కూతురైన అన్నపూర్ణాదేవి వివాహం. (పేయస్ప్రకారం రాయలకు పన్నెండు మంది భార్యలు. అందులో కూర్చు ప్రేయసులు ముగ్గురు. చిన్నాదేవి, తిరుమలదేవి; అన్నపూర్ణా దేవి అని, ఆ మిగిలిన తొమ్మిది మంది భార్యలకు కుమారులున్నారని చరిత్ర చెబుతుంది). ఇందులో ఇతోఽధిక సంతాన ప్రాప్తి అన్నవాక్యం సాక్ష్యమిస్తున్నది కనుక ఈ వచనం రాయల వారి అంతఃపుర సమాచారాన్ని కొంత అందిస్తున్నదిగా గ్రహించాలి.(1-12-151) రాయల సేనాపతి తొండమరుసు చోళ సముద్ర శాసనంలో రాయలవారికి సంతానం కలగాలని వేయించిన శాసనం తర్వాత ఏడాదికి సంతానం కలిగినట్లు మరొక శాసనం.

భారత ఆది పర్వంలో యయాతి కథ చెప్పబడింది. (3వ ఆశ్వాసం) అతని సంతానం ద్రుహ్యు అను పూరుడు అని ముగ్గురు శర్మిష్ఠ సంతానం. యదుతుర్వసులు దేవయాని సంతానం. ఈ తుర్వసుడు రాయలవారి వంశకర్తగా ఈ వచనంలో చెప్పబడింది.

12 నుండి 18 దాకా స్వప్న వృత్తాంతం. రాబోతున్న రాయల వంశావతార వర్ణనకు ఇష్టదేవతాస్తుతికి మధ్యలో ఉన్నది. ఇదొక ప్రత్యేక ఘట్టంగా చారిత్రక నేపథ్యంలో పెట్టి చూడదగిన రమణీయాంశం.

సీ. కలశ పాథోరాశి గర్భ వీచిమతల్లి
గడుపార నెవ్వానిఁ గన్నతల్లి,
యనలాక్షు ఘన జటా వన వాటి కెవ్వాడు,
వన్నె వెట్టు ననార్త వంపుఁ బువ్వు,
సకల దైవత బుభుక్షాపూర్తి కెవ్వాని
పుట్టు కామని లేని మెట్ట పంట,
కటిక చీకటి తిండి కరముల గిలిగింత
నెవ్వాడు తొగకన్నె నవ్వఁ జేయు,

తే. నతడు వొగడొందు మధుకైటభారి మఱఁది,
కళల నెలవగు వాఁడు చుక్కలకు ఱేఁడు,
మిసిమి పరసీమ వలరాజు మేనమామ,
వేవెలుంగుల దొర జోడు రే వెలుంగు.

1. కలశ పాథోరాశి= పాలసముద్రముయొక్క; గర్భ= కడుపులోని; వీచివు తల్లి= గొప్ప అల, కడుపార= సంతృప్తిగా; ఎవ్వాని= ఎవని; కన్న తల్లి= ఏ చంద్రుని కనిన మాతృ దేవతయో;

పాలసముద్రములోని మధ్యభాగంలో ఉన్న చల్లని పెద్ద కెరటము చంద్రుని కన్న తల్లి.

2. అనలాక్షుః= అగ్ని ఫాలనేత్రంగా గల శివునియొక్క; ఘన= దట్టమైన; జటా= జడలనెడి; వనవాటికి= తోటకు; వన్నెవెట్టు= అందాన్నిచ్చే; అనార్తవంపుఁ బువ్వు= ఋతు సంబంధం కాని పుష్పము.

ఫాలాక్షుని దట్టమైన కెంపుజడల తోటకు అన్ని ఋతువులలోను శోభను కలిగించే పుష్పము చంద్రుడు.

3. సకల= సమస్తమైన ; దైవత= దేవతలయొక్క; బుభుక్షా= ఆకలి; పూర్తికిన్= తృప్తికి, తీరుటకు; ఎవ్వాని పుట్టుక= ఎవ్వని జన్మ; ఆ మనిలేని= మార్పిడి లేని; మెట్టపంట= వర్షాధారంగా పండే పంట; ( పంటలు దేవమాతృకలు, నదీమాతృకలు అని రెండు రకాలు వర్షాధారంగా పండేవి దేవమాతృకలు, నదీజలాలతో పండే సస్యము రెండవది.)

సకల దేవతల ఆకలిని తీర్చే మార్పిడి లేని మెట్టపంట - చంద్రుడు.

4. ఎవ్వాడుః ఏ చంద్రుడు, కటిక చీకటి తిండి కరముః కటిక చీకటియే ఆహారంగా కలిగిన కిరణములచేత; తొగ కన్నెన్= కలువ కన్యను; గిలిగింత= చక్కిలి గింత చేత; నవ్వ చేయు= నవ్విస్తాడు.

చంద్రుని కిరణాలకు ఆహారం కటిక చీకటి. ఆ కిరణాలచేతనే కలువ పువ్వును వికసింప చేస్తున్నాడు. ఈ అర్థంలో నవ్వించు అన్నక్రియా ప్రయోగం ప్రౌఢమైనది.

5. అతడు= ఆ చంద్రుడు; మధుకైటభారి= మధుకైటభుల శత్రువైన విష్ణువుకు; మఱఁది= బావమరది; కళల నెలవగువాడు= పదునారు కళలకు ఉనికి పట్టయినవాడు; చుక్కలకు ఱేడు= నక్షత్రములకు రాజు;

6. మిసిమి= జిలుగు కాంతికి; పర= ఆవలి; సీమ= హద్దు అయిన; వలరాజు= మన్మథునకు మేనమామ; వేవెలుంగుల= వేయి కిరణాలు గల; దొర= సూర్యునకు; జోడు= దీటైనవాడు; రేవెలుంగు= రాత్రికి వెలుగైనవాడు.

చంద్రుడు శ్రీకృష్ణదేవరాయల వంశ మూలపురుషుడు. అనగా రాయలు చంద్రవంశీయుడు. అతని వంశ ఔన్నత్యాన్ని ఈ పద్యం చాలా అందంగా అద్భుతంగా ధ్వనిస్తున్నది. మొదటి పాదంలో చంద్రుని జన్మయొక్క ఔన్నత్యాన్ని, ద్వితీయ పాదంలో అతని ఉన్నతస్థితిని, మూడవ పాదంలో ఆత్మత్యాగాన్ని, నాల్గవపాదంలో ఇతరులకు ఆహ్లాదాన్ని కలిగించడాన్ని చిత్రించి, యెత్తుగీతిలో అతని కళాకాంతులను, రాచరికాన్ని (చుక్కలకు ఱేడు); అతిశయాన్ని (కైటభారి); చిత్రించాడు.

మూలపురుషునియొక్క- ఈ గుణాలే అతని వంశీకుడు రాయల వారి రక్తనిష్ఠమై ఉన్నవన్న తాత్పర్యం ధ్వనిస్తున్నది.

మొదటి పాదంలో అలంకారం పరిణామం. వీచిమ తల్లి తల్లిగా కనడం అన్న క్రియా పరిణామాన్ని అభిలషిస్తున్నది కనుక ద్వితీయ పాదంలో చంద్రుడు పుష్పంగా రూపొందించ బడ్డాడు. కాబట్టి రూపకం. అలాగే తృతీయ పాదంలో కూడా. కావ్యగుణాలు రెండు రకాలు. శబ్దగుణం అర్థగుణం అని. ఇందులో చంద్రుని వర్ణన లోకోత్తరంగా ప్రౌఢంగా చేయబడినందువల్ల అర్థసంబంధమైన ఓజోగుణ మున్నది. శబ్దసంబంధంగా సౌకుమార్య మాధుర్యగుణాలున్నాయి.

రచన అంటే శైలి చాలా ఉదాత్తమైనది. ఒకటవ పాదంలో మొదటి అర్ధపాదం సమానంగా, చెరిసగంగా విరుగుతున్నది. కలశ పాథో రాశి గర్భవీచిమతల్లి. ఇలాగే రెండో అర్ధభాగంలో ఏ గణానికి ఆ గణం విరిగి పోతున్నది. 'కడుపార ఎవ్వాని కన్నతల్లి' ఇలాగా ఈ విరుపులచేత పద్యంలో సమతా గుణం సిద్ధిస్తున్నది. లయాన్వితమైన నడక ఏర్పడు తుంది.

ఇది పెద్దన గారి పద్యం

తే. ఆసుధాధాము విభవ మహాంబురాశి
కుబ్బు మీఱంగ నందనుఁడుదయమయ్యె
వేద వేదాంగ శాస్త్రార్థ విశదవాస
నాత్త ధిషణా ధురంధరుండైన బుధుడు. 20

ఆ=పైన వర్ణింపబడిన; సుధాధాము=అమృత నిలయుడైన చంద్రునియొక్క; విభవ=సంపద అన్న; మహాంబు రాశికిన్=విస్తృతశ సముద్రానికి; ఉబ్బు మీఱంగన్= సంతోషపు పొంగు ఎక్కువకాగా; నందనుడు=కొడుకు; ఉదయమయ్యెన్=పుట్టినాడు; వేద=నాల్గు వేదాలయొక్క; వేదాంగ=శిక్షా వ్యాకరణ, ఛందో నిరుక్త జ్యోతిష కల్పాలన్న ఆరు అంగాలున్నాయి. వాటియొక్క; శాస్త్ర= తర్క, న్యాయ శాస్త్రాలయొక్క; అర్థ=సారాంశముయొక్క; విశద=స్పష్టమైన; వాసన =సంస్కారంచేత; ఆత్త=పొందబడ్డ; ధిషణా=ప్రజ్ఞయొక్క; ధురంధరుడు= బరువు మోసేవాడు; అయిన= అయినట్టి; బుధుడు=పండితుడు.

చంద్రునికి బుధుడు కుమారుడై జన్మించినాడు. అతడు వేద వేదాంగ శాస్త్రరహస్యార్థ వేత్త కనుక అతనిపేరు బుధుడు=పండితుడు. కాబట్టి తండ్రి చంద్రోదయానికి సముద్రం పొంగినట్లుగా ఆనందించాడు. ఆనందాన్ని కలిగించిన వాడు గనక నందనుడు. పద్యంలో బుధ, నందన శబ్దాలు సాభిప్రాయంగా ప్రయోగింపబడ్డాయి కనుక అలంకారం పరికరాంకురం.

చంద్రునకు తండ్రి సముద్రుడు. బుధునకు తాను కూడా పొంగిపోయి సముద్రుడైనాడు అనటంలో వక్రత ఉన్నది. సూటిగా చెప్పటానికి బదులుగా వక్రంగా చెప్పడం.

క. వానికిఁ బురూరవుఁడు ప్ర
జ్ఞానిధి జనియించె సింహ సదృశుఁడు తద్భూ
జానికి నాయువు తనయుం
డా నృపతికి తనయుఁడై యయాతి జనించెన్. 21

వానికిన్= బుధునకు; ప్రజ్ఞానిధి= ప్రతిభావంతుడైన; పురూరవుఁడు; సింహసదృశుఁడు= సింహము పరాక్రమముతో సమానమైనవాడు; జనియించెన్= జన్మించాడు; తత్= ఆ; భూజానికిన్= రాజునకు; ఆయువు= ఆయువన్న పేరుగల వాడు; తనయుండు= కుమారుడు; ఆ నృపతికిన్= ఆయువునకు; తనయుఁడై= కొడుకై; యయాతి= యయాతి అన్నవాడు; జనియించె= జన్మించాడు.

క. అతనికి యదుతుర్వసులను
సుతు లుద్భవ మందిరహిత సూదనులు కళా
న్వితి మతులు వారిలో వి
శ్రుత కీర్తి వహించెఁ దుర్వసుఁడు గుణనిధియై. 22

అతనికిన్= ఆ యయాతికి; అహితసూదనుడు= శత్రువులను నాశనం చేయగలవాడు; కళ+ అన్విత మతులు= కళా మనస్కులు; యదు, తుర్వసులు అను; సుతులు= కొడుకులు; ఉద్భవమందిరి= పుట్టారు; వారిలోన్= ఆ ఇద్దరిలోను; తుర్వసుడు; గుణనిధియై= సద్గుణాలవాలమై; విశ్రుత కీర్తి వహించెన్= విశాలమైన కీర్తిని పొందినాడు.

తా : భారతం యయాతి వంశకథనంతోనే ప్రారంభమవుతున్నది. ఈ పద్యానికి సంబంధించిన విషయం అక్కడ కథలో చూచుకోవచ్చు. ఈ రెండు పద్యాలలో రచనా విశేష మేమీ లేదు. కారణం వాళ్లు మూలపురుషులు కనుక అనవసరమైన కథాంశాన్ని తేల్చి చెప్పడ మన్నది ప్రాచీన కవి పాటించిన శిల్పంలో ఒక భాగం.

తే. వాని వంశంబు తుళువాన్వ వాయ మయ్యె
నందుఁ బెక్కండ్రు నృపు లుదయంబు నొంది
నిఖిలభువన ప్రపూర్ణ నిర్ణిద్ర కీర్తి
నధికులైరి తదీయాన్వయమునఁ బుట్టి. 23

వానివంశంబు= ఆ తుర్వసుని కులము; తుళువ= ఆ పేరున; అన్వవాయము= వంశము; అయ్యెన్= ఐనది; అందున్= ఆవంశంలో; పెక్కండ్రు= అనేక మంది; నృపులు= రాజులు; ఉదయంబు= జన్మను; పొంది= పొంది; నిఖిల భువన= సమస్తలోకాలలో; ప్రపూర్ణ= నిండారిన; నిర్ణిద్ర= ప్రకాశించే; కీర్తిన్= యశస్సుతో; అధికులైరి= గొప్పవారైనారు; తదీయ= ఆ; అన్వయమునన్= కులములో; పుట్టి= జన్మించి ( తర్వాతి పద్యానికి అన్వయం)

తుర్వసు అన్న సంస్కృత శబ్దం తుళువ అన్న తద్భవంగా వచ్చినదని కవి చేసిన కల్పన. ఈ పద్యంలోను పెద్దగా విశేషాంశాలు లేవు. కాని మూడవ పాదం లోని నిబిడమైన సమాసము ఆ కులములో రాజుల గొప్పతనాన్ని ధ్వనిస్తున్నది. ఆ గుణములే తర్వాత వర్ణింపబడ్డ రాజ వర్ణన మహాస్రగ్ధరలో చేయబడడానికి కారణమవుతున్నవి.

మ. స్ర. ఘనుఁడై తిమ్మక్షితీ శాగ్రణి శఠ కమఠ గ్రావ సంఘాత వాతా
శన రాడాశాంత దంతి స్థవిర కిరుల జంజాటము ల్మాన్చి యిమ్మే
దిని దోర్దండైక పీఠిన్ దిరము పఱిచి కీర్తి ద్యుతుల్ రోదసిన్ బ
ర్వ నరాతుల్నమ్రులై పార్శ్వములఁ గొలువఁ దీవ్రప్రతాపంబు సూపెన్. 24

తిమ్మక్షితీశాగ్రణిః=రాజులలో శ్రేష్ఠుడైన తిమ్మయ్య అను పేరు గలవాడు; ఘనుడై=గొప్ప వాడై; శఠ=మోసగాళ్ళు అయిన; కమఠ=తాబేలు; గ్రావసంఘాత=కొండల గుంపు (సప్త పర్వతాలు), వాత-అశనరాట్=గాలే తిండిగా గల ఆదిశేషుడు; ఆశాంత=దిక్కుల యొక్క చివళ్ళ; దంతి= ఏనుగులు; స్థవిర = ముసలిదైన, కిరి=పంది (ఆది వరాహములు- బహువచన ప్రత్యయము కమఠ --- కిరులు మొత్తం సమాసంలో ఉన్న అందరూ కమఠాగులు. భూమిని ఇన్నీ కలిసి బరువు మోసేవాళ్ళ లాగా నటిస్తున్నారు. కనుక వంచకులు- అని శఠ శబ్దానికి ఒక అర్థం; మరియొక అర్థం ఆది కమఠం, వరాహం, ఆదిశేషుడు, ఇవన్నీ కూడ విష్ణుమూర్తి అవతారాలు కనుక లౌకిక దృష్టికి అవి కమఠాలుగానే కనిపిస్తున్నాయి. కనుక వంచకులే) జంజాటము=తగులుపాటు (నేటికీ యీమాట జాతీయంగానే ప్రయోగింప బడుతున్నది. విషయ వాసనలందు తగుల్కోవడం అన్న అర్థంలో); మాన్చి=పోగొట్టి; ఈ+మేదిని= ఈ భూమికి, దోర్దండ+ ఏక పీఠన్=ప్రధానమైన తనయొక్క బాహుదండ మన్న పీఠం మీద; తిరముపఱచి=స్థిరంగా ఉంచి; కీర్తి ద్యుతుల్=ప్రఖ్యాతి కాంతులు; రోదసిన్=అంతరిక్షంలో; పర్వన్=వ్యాపింపగా; అరాతులు=శత్రువులు; నమ్రులై=నమ్రతకలవారై; (వంగి) పార్శ్వములన్=ప్రక్క ప్రక్కలందు; కొలువన్=సేవిస్తూ ఉండగా; తీవ్ర=అతిశయమౌ; ప్రతాపంబు=తేజస్సును; చూపెన్=చూపించాడు.

తా : ఆ తుళువవంశంలో ఎందరో రాజులు పుట్టి వంశఖ్యాతిని విస్తరింపచేసిన తర్వాత చాలా కాలానికి తిమ్మరాజు జన్మించాడు. అతనికి ముందు అఖండ భూమండలాన్ని ఆదికమఠము, సప్తపర్వతాలు, ఆదిశేషుడు, ముసలి పంది, పెద్ద బలశాలు లయినట్లు మోయలేక మోస్తుంటే వాళ్లను తొలగించి ఆ భూదేవిని తన భుజపీఠం మీద అధిష్ఠింప చేసి శత్రురాజులను వినమ్రులను కావించుకొని తీవ్రప్రతాపంతో రాజ్యపాలనం చేశాడు.

విశే : పై మూడు పద్యాలు అలా వ్రాసి యీ మహాస్రగ్ధర నింత బిగింపుగా వ్రాయడం లోని శిల్పం గుర్తించాలి. దీనిక్కారణం రాయల వారి కితడు ముత్తాత. మూడు తరాలను వర్ణిస్తున్నాడు కనుక మొదటి తరం మొదలు పెట్టినాడు. తిమ్మరాజు బహుశా మొదటి సారిగా విజయనగర రాజుల దగ్గర ఏ సేనానిగనో

ఒక రాజోద్యోగిగా చేరి మండలాధిపతి అయి ఉండవచ్చు. రాజ్య పాలనకూ, తుళు వంశాని కతడు మూలపురుషుడు చారిత్రక దృష్టితో. నేటికీ మూడు తరాలను చెప్పు కోవడం ఉన్నది.

ఛందస్సు - స, త, త, న, స, ర, ర, గ ప్రతి పాదానికి 9-7 యతులు

అలం : మొదటి రెండు పాదాలలో తిమ్మరాజు ఘనుడై పరిపాలించాడు అన్న అర్థంలో ఆది కమఠాదులు మోయలేని వారని చెప్పడం ప్రౌఢార్థ కల్పన. అలంకార దృష్టితో చెబితే చక్కగా పాలించాడన్న అర్థాన్ని భంగ్యంతరంగా చెప్పినందున పర్యాయోక్త్యలంకారం.

క. వితరణఖని యత్తిమ్మ
క్షితిప గ్రామణికి దేవకీదేవికి నం
చిత మూర్తి యీశ్వర ప్రభుఁ
డతి పుణ్యుఁడు పుట్టె సజ్జనావన పరుఁడై. 25

వితరణఖని=దానాలకు నిధి; ఆ+తిమ్మక్షితిప= ఆ తిమ్మరాజు; గ్రామణికిన్= శ్రేష్ఠునకు (శ్రేష్ఠుడైన ఆ తిమ్మరాజుకు;) దేవకీదేవికిన్= ఆయన భార్యకు; సజ్జన + అవన పరుడై= ధర్మాత్ములను రక్షించే రాజై; అతి పుణ్యుఁడు= మిక్కిలి ధన్యుడు; అంచిత మూర్తి= అందమైన ఆకారం గలవాడు; ఈశ్వర ప్రభుఁడు= ఈశ్వరుడన్న రాజు; పుట్టెన్=పుట్టెను.

తిమ్మరాజు లో కవి చెప్పిన గుణాలు ప్రతాపశాలి, సమర్థుడైన రాజ్య పరిపాలకుడు, వితరణ ఖని మూడు. అతని కొడుకు ఈశ్వరరాజు పుణ్యుడు, సజ్జనావన పరుడు, అంచిత మూర్తి. మొదటిది అతని ధర్మ జీవన కార్య సంబంధమైనది. రెండవది రాజ్యపాలన సంబంధమైనది. మూడవది అతని ఆకారసంబంధమైనదిలేదా బాహ్యాభ్యంతర గుణరూప సంబంధమైనది కావచ్చు. బహుశా గొప్ప అందగాడేమో. లేక పోతే మూర్తి శబ్దానికి ప్రత్యేకార్థ మేమీ లేదు.

చ. బలమద మత్త దుష్ట పుర భంజనుఁడై పరిపాలి తార్యుఁడై
యిల పయిఁ దొంటి యీశ్వరుఁడె యీశ్వరుఁడై జనియింప రూపఱెన్
జలరుహ నేత్రలన్ దొఱఁగి శైలవనంబుల భీత చిత్తులై
మెలఁగెడు శత్రు భూవరుల మేనుల ( దాల్చిన మన్మథాంకముల్. 26

ఈ పద్యంలో శివునకు, ఈశ్వర రాయలకు అన్వయ మున్నది.

బల=బలంతో; మద=హర్షంతో; మత్త=మదించిన; దుష్ట=దుర్మార్గులైన వారి యొక్క; పుర=రాజధాని నగరాలను; భంజనుఁడై=నాశనం చేసినవాడై;

దుర్మార్గులై చతురంగ బలాలున్నాయన్న సంతోషంతో మదించియున్న శత్రురాజుల నగరాలను నాశనం చేశాడు. ఇది యీశ్వర రాయల వారి పక్షము.

శివుని పక్షంలో త్రిపురాసుర సంహారం. ఈ అర్థంలో బలమంటే వరబలం. పురమంటే కోటలు. ఈ పుర శబ్దం వల్లనే ఈ అర్థం సంభావ్యమౌతున్నది.

పరిపాలితార్యుడై=పరిపాలింపబడ్డ ఆర్యజనులు కలవాడై ( ఈశ్వర రాయలు); ఏలిన పార్వతి కలవాడు (శివుడు); ఇలపయిన్=భూమి మీద; తొంటి ఈశ్వరుడే=పురాణ పురుషుడైన ఈశ్వరుడు; ఈశ్వరుడు+ఐ = ఈశ్వరరాయలై; జనియింపగన్=పుట్టగా; జలరుహనేత్రలన్=పద్మలోచనలైన భార్యలను; తొఱఁగి=విడచి; శైలవనంబులన్=కొండల్లో, అడవుల్లో; భీత చిత్తులై=భయాన్విత మనస్కులై, బెదరినగుండె కలవాడై; వెలఁగెడు=తిరిగెడు; శత్రు భూవరులు= శత్రురాజులు; మేనులను=శరీరాలపై; తాల్చిన=ధరించిన; మన్మథ+ అంకముల్= మన్మథుని గుర్తులు అయిన కుచ కస్తూరికా ముద్రలు, ఫాలసింధూర చిహ్నాలు వంటివి; రూపఱెన్=నశించెను.

తా : ఈశ్వర రాయలు సాక్షాత్తు శివుడే గనుక శత్రురాజుల శరీరాల మీద మన్మథాంకములు పోయినవి. ఎందు కంటే వాళ్లు భార్యలను విడిచి అడవులలోకి పారి పోయారు కనుక శివుడు మన్మథుని దగ్ధం చేసినవాడు కనుక ఆ లక్షణమే ఈ జన్మలో కూడా సంక్రమించిన దని తాత్పర్యం.

సీ. నిజ భుజాశ్రిత ధారుణీ వజ్ర కవచంబు
దుష్ట భుజంగాహితుండికుండు,
వనజేక్షణా మనోధన పశ్యతో హరుం
డరి హంస సంస దభ్రాగమంబు,
మార్గణ గణపిక మధుమాస దివసంబు
గుణరత్న రోహణ క్షోణిధరము,
బాంధవ సందోహ పద్మవనీ హేళి
కారుణ్య రస నిమ్నగా కళత్రుఁ

తే. డన జగంబుల మిగుల ఁబ్రఖ్యాతిఁగాంచె
ధరణి ధవ దత్త వివిధోపధా విధా స
మార్జిత శ్రీ వినిర్జిత నిర్జరాల
యేశ్వరుఁడు తిమ్మభూపతి యీశ్వరుండు. 27

నిజ=తనయొక్క; ధరణి ధవ=రాజులచేత; దత్త=అర్పింపబడ్డ; వివిధ= అనేకమైన; ఉపధా=కానుకలయొక్క; విధా=సమృద్ధిచేత; సమార్జిత=సంపాదింపబడ్డ; శ్రీ=సంపద; వినిర్జిత=జయింపబడ్డ; నిర్జర=దేవతలకు (ముసలితనం లేనివారు) ఆలయ=నివాసమైన స్వర్గముయొక్క; ఈశ్వరుడు=ప్రభువైన ఇంద్రుడు కలవాడు; తిమ్మ భూపతి యీశ్వరుండు=తిమ్మరాజు కొడుకైన ఈశ్వర రాయలు.

ఈశ్వర రాయలు రాజులను జయించి వారర్పించిన సంపత్సమృద్ధితో స్వర్గాధిపతియైన ఇంద్రుని జయించాడు.

నిజ=తనయొక్క; భుజ=బాహువులు; ఆశ్రిత= ఆశ్రయించిన; ధారుణీ=భూమిని; వజ్రకవచంబు =వజ్రంతో చేయించిన కవచం; దుష్ట=దుర్మార్గులైన; భుజంగ=పాములకు, అహితుండికుండు= పాములవాడు. (అహితుండము=పాముపడగ, దానిని సొరకాయ బుర్రతో ఆడించేవాడు)

తనరాజ్యానికి వజ్ర కవచమై శత్రువులన్న పాములను పట్టి ఆడించినాడు.

వనజ + ఈక్షణా=తామరపూల వంటి నేత్రాలుగల స్త్రీలయొక్క; మనోధన=మనస్సన్న ధనాన్ని; పశ్యతో హరుండు=చూస్తుండగానే అపహరించే దొంగ; అరిహంస=శత్రువులనే హంసలయొక్క; సంసత్=గుంపుకు; అభ్ర+ ఆగమంబు=మబ్బుల రాకగల వాన కాలము;

తామరస నేత్రలయొక్క మనస్సన్న సంపదను మొదటి చూపులో హరించేవాడు. అంటే పై పద్యంలో చెప్పినట్లుగా ఈశ్వర రాయలు అంచితమూర్తి. శత్రురాజులన్న హంసల గుంపులను పారద్రోలే చెదరగొట్టే వర్షాకాలం వంటివాడు.

వర్షాకాలంలో హంసలు లోకంనుండి క్రౌంచ పర్వత బిలం ద్వారా మానస సరోవరానికి పోతాయని, తిరిగి శరత్కాలం రాగానే అదే బిలం ద్వారా దేశం మీదికి వస్తాయని కవిసమయం.

మార్గణ గణ= యాచకుల సమూహమన్న; పిక=కోకిలలకు; మధు మాస=చైత్రమాసపు; దివసంబు=కాలము; గుణరత్న=సద్గుణాలన్న రత్నాలకు; రోహణ క్షోణిధరము=రత్నపర్వతము.

అతడు యాచక గణమన్న కోకిలలకు వసంత ఋతువు. సద్గుణాలకు రత్నపర్వతం.

బాంధవ=చుట్టాలయొక్క; సందోహ=సమూహమన్న; పద్మవనీ= తామర పూలతోటకు; హేళి=సూర్యుడు; కారుణ్యరస=దయారసానికి; నిమ్నగా= నదుల యొక్క; కళత్రుడు=భర్త అయిన సముద్రుడు

చుట్టాలు ముఖపద్మాలు వికసింప చేసే సూర్యుడు కారుణ్యరస సముద్రుడు; అనన్=అన్న ప్రఖ్యాతితో; జగంబులన్ = లోకాలలో; మిగుల ప్రఖ్యాతిన్= మిక్కిలి కీర్తిని; కాంచెన్=పొందెను.

ఈశ్వర రాయలలో కవి నిరూపించిన గుణాలు ధారుణీ వజ్రకవచము= శత్రువులను ఓడించేవాడు స్త్రీ మనో ధన అపహర్త, యాచకులను ఆదరించేవాడు; చుట్టాల సురభి, దయాసముద్రుడు, ఇంద్రుని అంత సంపద గలవాడు.

అలం : ప్రతి పాదంలోనూ రూపకం.

శైలి :- ఎత్తు గీతిలో ధకార, ఢుకార ఆవృత్తి వల్ల, పద్యగమనం నిబిడంగా ఉంది. సీసపద్య పాదాలు కూడా సంస్కృత సమాసఘటనచేత భారావహంగా ఉన్నని.

క. ఆ యీశ్వర నృపతికిఁ బు
ణ్యాయత మతియైన బుక్కమాంబకుఁ దేజ

స్తోయజ హితు లుదయించిరి
ధీయుతులగు నారసింహ తిమ్మనరేంద్రుల్ 28

ఆ+ఈశ్వర నృపతికిన్= ఆ ఈశ్వర రాయలకు, పుణ్య + ఆయతమతి= పుణ్యకార్యాలు చేయడంలో విశాలమైన మనస్సు; ఐన=కలిగినటువంటి; బుక్కమ+ అంబకున్=బుక్కాదేవికి; తేజః=కాంతిలో; తోయజహితులు=పద్మములకు బంధువైన సూర్యుని వంటి వారు; ధీయుతులు=మేధావంతులు అగు; నారసింహ తిమ్మనరేంద్రుల్=నరసింహరాజు, తిమ్మరాజు అన్నవారు; ఉదయించిరి= జన్మించారు

విశే :- బుక్క+అమ్మ-అంబ-అమ్మ శబ్దం మీద అంబశబ్దం చేరడం పునరుక్తి అంటే అమ్మ, అయ్య శబ్దాలు పూజ్యార్థకాలు కనుక బుక్కమ్మ పూజ్యురాలైన బుక్కాదేవి అని అర్థం.

క. అందు నరస ప్రభుఁడు హరి
చందన మందార కుంద చంద్రాంశు నిభా
స్పంద యశస్తుందిల ది
క్కందరుడై ధాత్రి యేలెఁ గలుషము లడగన్. 29

అందున్= ఆ యిద్దరిలో; నరస ప్రభుఁడు=నరసరాయలు; హరి చందన= మంచి గంధము; మందార=కల్పవృక్షపుష్పాలు; కుంద=మొల్లలు; చంద్ర+అంశు= వెన్నెల కిరణాలతో; నిభ=పోలిన, సమానమైన; అస్పంద=చలించని, మాసిపోని; యశః=కీర్తితో తుందిల=పొట్టగల; దిక్=దిశలయొక్క; కందరుడు=గుహలు కలవాడు; కలుషములు+అడగన్=పాపములు శమించగా; ధాత్రి=భూమిని; ఏలెన్= పాలించెను.

ఆ నరసరాయలు రాజ్యపరిపాలనము మిక్కిలి కీర్తివంతుడై చేశాడు. అతని యశస్సు మంచిగంధము, మందారపుష్పము, మొల్లలు వెన్నెల కిరణాలు లాగా స్వచ్ఛమై దిగంతాలలో ఉన్న సప్త పర్వతాల గుహలు కూడా కీర్తికాంతితో తెల్లబడి పోయాయి.

ఈ రెండు పద్యాలు కేవలం నీరసార్థనివేదనం చేస్తున్నవి. కనుక విశేషార్థమేమీ లేదు. నరసరాయల వర్ణన రాబోతుంది. దాన్ని ప్రారంభించడానికి యిది నాందిగా హరి చందన ఇత్యాది సమాసం వాడబడింది.

సీ. అంభోధివసన విశ్వంభరావలయంబు
ఘన బాహుపురి మరకతము ఁ జేసె;
కకుబంత నిఖిల రాణ్ణికరంబుఁ జరణమం
జీరంపు సాలభంజికలఁ జేసె;
మహనీయ నిజ వినిర్మల యశస్సరసికి
గగనంబు కలహంసకంబుఁ జేసె;
నశ్రాంత విశ్రాణ నాసార లక్ష్మికిఁ
గవికదంబము ఁ జాతకములఁ జేసె

తే. నతిశిత కృపాణ కృత్త మత్తారి వీర
మండలేశ సకుండల మకుట నూత్న
మస్త మాల్య పరంపరా మండ నార్చి
తేశ్వరుండగు నారసింహేశ్వరుండు. 30

అతిశిత= మిక్కిలి వాడియైన; కృపాణ= కత్తితో; కృత్త= నరకబడ్డ; మత్త= మదించిన; అరివీర= శత్రువులైన వీరులయొక్క; మండల+ ఈశ= మండలాధిపతులయొక్క; సకుండల మకుట= చెవి పోగులతో కిరీటములతో కూడుకున్న; నూత్న= క్రొత్త; మస్త= శిరస్సులయొక్క; మాల్య= పూదండలయొక్క; పరంపర= సమూహము యొక్క; మండన= అలంకారములతో; అర్చిత= పూజింపబడ్డ; ఈశ్వరుండు= శివుడు కలవాడు; నారసింహేశ్వరుడు= నరసింహదేవరాయలు.

నరసింహ దేవరాయలు తన వాడియైన కత్తితో మదించిన శత్రు వీరులు అయిన మండలేశ్వరులయొక్క చెవిపోగులతో, కిరీటాలతో కూడుకొన్న అప్పుడె నరికిన తలల మాల్యముల పరంపర అన్న అలంకారములతో శివుని పూజించిన వాడు. శివుడు కపాల మాలికలు కలవాడు కనుక, ప్రళయ కర్త కనుక ఈ విధంగా కవి చిత్రిస్తున్నాడు.

అంభోధి= సముద్రమే; వసన= చీరగా ధరించిన; విశ్వం భరావలయంబు= భూచక్రము; ఘన= పెద్ద; బాహుపురిన్= భుజకీర్తులతో; మరకతమున్ చేసెన్= పచ్చ అన్న రత్నంగా కూర్చినాడు.

సర్వభూమండలాన్ని తన భుజకీర్తిలో మరకత మణిగా జేసి ధరించాడు. విశాలమైన భూమండలాన్ని మరకతంగా ధరించడానికి కావలసిన గొప్పదైన బాహుపురికలవాడు. (తన బాహుపురి అని పాఠాంతరం ఉన్నది. మరకత, మరతక రెండు రూపాలున్నాయి. ఇక్కడ వర్ణ వ్యత్యయం- అక్షరాల మార్పిడి జరిగింది.) అప్పుడు మరతకము - అని యతిస్థానంలో వుండాలి.

విశాలమైన మహీమండలము మరకతంగా ధరించడం వల్ల అతడు మహామండలేశ్వరుడు అని ధ్వనిస్తున్నది. భూమి వృక్షాల చేత శ్యామల వర్ణం కలది కనుక ప్రాకుడు రంగుగల మరకతాన్ని ఉపమానంగా గ్రహించాడు. రెండూ గుండ్రంగా ఉంటాయి. రూపకాలంకారం.

కకుప్+ అంత= దిగంత; నిఖిల= సమస్త; రాట్= రాజులయొక్క; నికరంబున్= సమూహము; చరణ= పాదముయొక్క; మంజీరంపు= గండ పెండేరములో; సాలభంజికలన్= బొమ్మలుగా; చేసెన్.

సమస్త దిశలను జయించి వారి రూపాలను ప్రతిమలుగా చెక్కించిన కడియాలను కాలికి ధరించినాడు. ఓడిన రాజుల బొమ్మలను చెక్కించిన గండ పెండేరాలు ధరించడం నాటి రాజులకు పౌరుష చిహ్నం. ఆ కడియాన్ని బొమ్మ పెండెము, గండపెండెము అంటారు. గండడు= వీరుడు. (''ఆడించె బొమగొని యానసంబు'' అని గోదాదేవి వర్ణనలో వాక్యం చూడు.)

రాట్+ నికరంబు= అన్న సమాసం చాలా అందమైనది;

నుహనీయం= పవిత్రమైన; నిజ= తనయొక్క; వినిర్మల= స్వచ్ఛమైన; యశః= కీర్తి అన్న సరసికిన్=చెరువునకు; గగనంబున్= ఆకాశాన్ని; కలహంసకంబున్=రాజహంసలుగా చేసెన్.

పూజింపదగ్గ స్వచ్ఛమైన కీర్తి అన్న సరస్సునకు ఆకాశాన్ని కలహంసగా మలిచినాడు అంటే ఆకాశం కంటే విశాలమైన కీర్తి కలవాడని తాత్పర్యం. సరస్సులో ప్రతిబింబించిన ఆకాశం రాజహంసగా పోల్చబడ్డది. అలంకారం రూపకం. ఆధేయమైన ఆకాశం కంటె ఆధారమైన కీర్తి గొప్పదని చెప్పడం వల్ల అధికాలంకారం కూడ ఉన్నది.

అశ్రాంత= ఎడతెరిపిలేని; విశ్రాణన= దానమన్న; ఆసార= జడివానయొక్క; లక్ష్మికిన్= సమృద్ధికి; కవి కదంబమున్= కవి సమూహాన్ని; చాతకములన్= వాన కోకిలలుగా; చేసెన్.

ఎడ తెగకుండా చేస్తున్న దానమన్న వర్షాలక్ష్మికి కవి సమూహము వానకోకిలలుగా చేయబడ్డది. దానము, త్యాగము అన్నవి రెండూ ఈవులే. దానము జలధారా పూర్వకంగా చేయబడుతుంది. త్యాగంలో అది ఉండదు. లోకంలో ధారపోసుకున్నాడు, ధారాదత్తం చేసాడు అన్నమాటలు వృథాగా పోగొట్టు కొన్నాడన్న అర్థంలో రూఢిపడ్డ జాతీయాలు. 'దాన త్యాగ పత్రమై' -2-42 చూడు.

ఈ పద్యం రాయల వారి తండ్రి వర్ణన. ఇతడే తుళువ వంశస్థాపకుడు. విజయ నగరపీఠం మీద తొట్టతొలిగా తుళువ వంశ ప్రభుత్వాన్ని స్థాపించిన మహావీరుడు. అంతకు ముందు సాళువ వంశం పాలించేది. సాళువ నరసింగరాయల సేనాని యితడు. కనుక యీ వర్ణన స్వాభావికం తప్ప అతియోక్తి కాదు. '' ఎవ్వాని విజయంబు లెరిగించు శాసన స్తంభంబు లాశాంత శైలతతులు'' అన్న పారిజాతం పీఠికలో 12వ పద్యం చూడు.

**తే.** **ఆ నృసింహ ప్రభుండు తిప్పాంబ వలన**
**నాగ మాంబిక వలన నందనులఁ గాంచె**
**వీర నరసింహ రాయ భూవిభుని నచ్యు**
**తాయతాంశజు శ్రీకృష్ణరాయ నిన్ను.** **31**

ఆ నృసింహ ప్రభుండు= ఆ నరస రాయలు, తిప్ప+అంబ వలనన్; నాగమ+ అంబిక వలనన్= తిప్పమ్మ, నాగమ్మ అను దేవేరుల ద్వారా, నందనులన్= కుమారులను; అచ్యుత+ ఆయత = శ్రీకృష్ణునియొక్క అధికమైన; అంశజున్= అంశ వల్ల పుట్టిన; శ్రీకృష్ణరాయ=శ్రీకృష్ణదేవరాయప్రభూ; నిన్నున్= నిన్నును; వీరనరసింహ రాయ= వీరనరసింహరాయలన్న పేరుగల; భూవిభుని= భూభర్తను; కాంచెన్= కన్నాడు.

ఆ నరస నాయకునికి యిద్దరు భార్యలు తిప్పాంబ, నాగాంబ. మొదటి భార్య నరసింహరాయలకు తల్లి కాగా, నాగమాంబ రాయలవారి తల్లి. ఈమె పేరు మీదుగనే నాగలాపురమని (ప్రస్తుతం హోస్పేట) ఒక శాఖా నగరాన్ని (శాటిలైట్ సిటి) కృష్ణదేవరాయలు నిర్మించినాడు. రాయల వారికి మరొక సోదరుడు

అచ్యుతరాయలని పేరుగలవాడున్నాడు. అతని విషయం పెద్దనగాని, తిమ్మన కాని చెప్పలేదు. కారణం రాయల వారి కాలంలో అతడు చంద్రగిరిలో బందీగా ఉన్నాడు. రాయల వారి మరణానంతరం అతడే రాజైనాడు. ఈ అభిషేకోత్సవం శ్రీకాళహస్తి దేవాలయంలో వేయికాళ్ల మంటపంలో చేసుకున్నందున ఆ మండపానికి అచ్యుతరాయ మండపమని పేరు వచ్చింది. ఇప్పటికీ అది వాడుకలో ఉన్నది. ఈ అచ్యుతరాయల కాలంలోనే న్యూనిజ్ అన్న పోర్చుగీసు చరిత్రకారుడు వచ్చి శ్రీకృష్ణ దేవరాయలు, అచ్యుత దేవరాయలకు సంబంధించిన చరిత్రను మన కందించినాడు. (పద్యంలో అచ్యుతశబ్దం - అచ్యుతరాయల నాకర్షించటం చిత్రం)

క. వీర నృసింహుఁ డు నిజ భుజ
దారుణ కరవాల పరుష ధారాహత వీ
రారియగుచు నేకాతప
వారణముగ నేలె ధర నవారణ మహిమన్. 32

వీర నృసింహుడుః ఆ వీర నరసింహ రాయలు; నిజ=తనయొక్క; భుజ=చేతిలోఉన్న; దారుణ=భయంకరమైన; కరవాల=కత్తియొక్క, పరుష=కఠినమైన; ధారా=అంచుచేత; ఆహత=మిక్కిలి నరకబడ్డ; వీర+అరి=శత్రువీరులు కలవాడు; అగుచున్=అవుతూ; ఏక= ఒకే; ఆతప వారణము= ఎండనుండి కాపాడేదిగొడుగు, ఏకచ్ఛత్రాధిపత్యము (వహించి); కన్=అగునట్లుగా; అవారణ= ఎదురులేని; మహిమన్=శక్తితో; ధరన్=భూమిని; ఏలెన్=పాలించినాడు.

ఇతని పరిపాలనము తొమ్మిదేళ్లు. నరసనాయకుని తర్వాత విజయ నగర ప్రభువైనాడు. ఇతనికి శ్రీకృష్ణదేవరాయలు సేనాపతిగా వ్యవహరించేవాడు. తన తరువాత రాజ్యం కుమారులకు పోకుండా రాయలు ఆక్రమిస్తాడని చిన్నతనంలో అతని కళ్లు పీకించవుని అప్పాజీకి ఆజ్ఞపెట్టినట్లు అతడు ఏదోజంతువు కళ్లు చూపించి రాయల కళ్లుగా భ్రమింప చేయించి, శ్రీకృష్ణ దేవరాయలను రక్షించినట్లు ఒక జనశ్రుతి రాయవాచకం మొదలైన గ్రంథాల్లో కనిపిస్తుంది.

*క. వారలలో తిప్పాంబ కు*
*మారుఁడు పరిపంక్తి కంథి మందాచలమై*
*వీర నరసింహరాయుడు*
*వారాసి పరీత భూమి వలయంబేలెన్.* *(పారిజాతం. పీఠిక-15)*

తిమ్మన, పెద్దనలిద్దరూ కందపద్యమే వ్రాసి చేతులు కడుక్కున్నారు.

క. ఆ విభు ననంతరంబు ధ
రా వలయముఁ బూని తీవు రహిమై దిరు మ
ల్దేవియును నన్నపూర్ణా
దేవియుఁ గమలాబ్జముఖులు దేవేరులుగాన్. 33

ఆ విభు ననంతరంబ= ఆ రాజు తర్వాత; ఈవు=శ్రీకృష్ణదేవరాయా! నీవు; ధరావలయమున్-పూనితి= భూమండలాన్ని ధరించావు; రహిమై=సంతోషంతో; తిరుమల్దేవియును, అన్నపూర్ణా దేవియున్= ఆ పేర్లు గల రాణులిద్దరూ; కమలాబ్జ ముఖులు=కమలము, చంద్రుని వంటి ముఖాలు గల ఆ ఇద్దరు, దేవేరులుగాన్= భార్యలుగా

వీరనరసింహ రాయల తర్వాత శ్రీకృష్ణదేవరాయలు విజయనగరానికి రాజైనాడు, ఆయన కిద్దరు పట్టపురాణులున్నారు. తిరుమల దేవి, అన్న పూర్ణాదేవి. ఇందులో మొదటి ఆమెయే పట్టమహిషి. రాయలు రాజు కాకపూర్వమే శ్రీరంగ పట్టణాన్ని జయించి దానికి పాలకుడైన వీరశ్యామల రాయకుమార్తె తిరుమల దేవిని వివాహం చేసుకున్నాడు. ఇది 1510కి పూర్వం. 1516నాటికి కళింగ గజపతిని జయించి అతని కుమార్తె అన్నపూర్ణను వివాహం చేసుకున్నాడు. వీరిద్దరి కంటె పూర్వమే చిన్నాదేవి ఉన్నది.

క. ఆ విభు ననంతరంబ ధ
రావలయము దాల్చి కృష్ణరాయడు చిన్నా
దేవియు శుభమతి తిరుమల
దేవియును c దనకు గూర్చు దేవేరులు గాన్. (మనుచరిత్ర పీఠిక-33)

ఈ పద్యంలో చివరి రెండు పాదాలు మార్చి శ్రీకృష్ణదేవరాయలు ఇలా ఎందుకు చేశాడు? అన్నది సమాధానం చెప్పవలసిన ప్రశ్న. పెద్దన గారి పీఠికలో ఆశ్వాసాంతాలలో రాయలవారు గజపతిని జయించిన సాక్ష్యమున్నది. కాని అన్నపూర్ణాదేవి వివాహప్రసక్తి కనిపించదు. కనుక మనుచరిత్ర తర్వాత ఈవివాహం జరగడం ఆముక్తమాల్యద వ్రాయడం సంభవించి ఉండవచ్చు. మరి చిన్నాదేవి ప్రసక్తి రాయలవారుతన కావ్యంలో ఎక్కడా చేయలేదు. తిమ్మన, పెద్దనలు చేశారు. ఆముక్త మాల్యదనాటికి చిన్నాదేవి పరమ పదించి ఉండవచ్చునని కొంద రంటారు. అందుకే ఆమెపేరు ఆముక్త మాల్యదలో ఎక్కడ కనిపించదు. ఆమె 1517 జనవరి తర్వాత డిసెంబరు లోపున దివంగతురాలైనదట :

సీ. తొలఁగెను ధూమకేతు క్షోభ జనులకు,
నతివృష్టి దోష భయంబు వాసెc
గంటకాగము భీతి గడచె, నుద్ధత భూమి
భృత్కంటకంబెల్ల నెత్తు వడియె,
మాసె నఘస్ఫూర్తి, మరు భూములందును
నెల మూడు వానలు నిండc గురిసె
నాబాల గోపాల మఖిల సద్ద్విజమును
నానందమున మన్కి నతిశయిల్లెc
తే॥ బ్రజల కెల్లను గడు రామరాజ్యమయ్యెc
జారుసత్త్వాఢ్య, యీశ్వర నారసింహ

భూవిభుని కృష్ణరాయ యభ్యుదయ మొంది
పెంపుతో నీవు ధాత్రిఁ బాలింపఁ గాను. 34

చారుసత్త్వ+ ఆఢ్య= అందమైన బలసంపద కలవాడా!; ఈశ్వరనారసింహ= ఈశ్వర రాజుయొక్క కొడుకైన నారసింహుడను పేరుగల; భూవిభుని= భూమి పరిపాలకునియొక్క( కుమారుడైన); కృష్ణరాయ=శ్రీకృష్ణరాయ ! నీవు; అభ్యుదయము+పొంది= అభివృద్ధిపొంది; పెంపుతోన్=సమృద్ధితో; ధాత్రిన్=రాజ్యాన్ని; పాలింపగాన్=పరిపాలిస్తూఉండగా;

జనులకున్=ప్రజలకు; ధూమకేతు క్షోభ=తోకచుక్క వలన బాధ; తొలగెను; అతివృష్టి దోషభయంబు = అధికమైన వానల దోషము వలన కలిగే భయము; పాసెన్=పోయింది.

కంటక = శత్రువులయొక్క; ఆగమ=రాకవల్ల కలిగే; భీతి=భయం; కడచెన్=పోయినది; ఉద్ధత=మదించిన; భూమి భృత్=రాజులయొక్క; కటకం= రాజధాని లేదా శిబిరాలు; (గజపతి రాజధాని కటక్) ఎల్లన్=అన్నీ; ఎత్తు వడియెన్=బలము లేనివైనాయి. ( ఎత్తు వడడం జాతీయ ప్రయోగం. బహుశా ఎత్తు నుండి పడుట శబ్దం కావచ్చు. ఒకప్పుడు ఐశ్వర్యంతో తులతూగి అదంతా పోయిన స్థితిని సూచించే శబ్దం).

అఘస్ఫూర్తి= పాపంయొక్క స్ఫురణ; మాసెన్=నశించెను; మరుభూములందును= ఊసరక్షేత్రాలలో కూడా; నెలన్=నెలకు; మూడు వానలు= మూడేసి వర్షాలు; నిండన్=తృప్తి కరంగా; కురిసెన్=కురిశాయి.

అఖిల=సమస్తమైన; సత్+వ్రజమునున్=సజ్జనుల సమూహమంతా; ఆబాలగోపాలము= పసివాళ్లనుండి పశువుల కాపర్లదాకా; ఆనందమునన్= ఆనందంతో; మన్కిన్=బ్రతుకుచేత; అతిశయిల్లెన్=పెంపైనది; ప్రజలకెల్లన్= అందరి ప్రజలకు=కడున్;మిక్కిలి; రామరాజ్యము=శ్రీరామ చంద్రుని రాజ్యం లాగా; అయ్యెన్= ఐనది. (సత్ - సాధుపురుషులు(పండితులు). వ్రజము-గొల్లపల్లె ఈ అర్థం ఆబాలగోపాలమన్నమాటకు అన్వయిస్తుంది).

ఈశ్వర నరసింహరాయల కొడుకువైన శ్రీకృష్ణదేవరాయా! నీవు అభ్యుదయం పొంది పెంపుతో రాజ్యం పాలిస్తూఉంటే జనులకు ధూమ కేతు క్షోభ, అతివృష్టి భయం పోయాయి. శత్రురాజుల దండు రావడం నశించింది. మదించిన శత్రురాజుల రాజధానులన్నీ ఎత్తు పడ్డాయి. పాపమన్న మాటకూడా లేకుండా పోయింది. మరుభూమిలో సైతం నెలకు మూడు వానలు కురుస్తున్నాయి. ఆబాలగోపాలంగా ఉన్న సజ్జనుల సమూహం సంతోషంతో బ్రతుకుతున్నది.పల్లెలనుండి పట్టణాలదాకా సుఖంగా ఉన్నది. కనుక నీ పరిపాలన శ్రీరామ చంద్రుని పరిపాలనతో సమానంగా ఉంది.

విశే : ఈ పద్యంలో భారతీయ ఆదర్శ చక్రవర్తి పరిపాలనా వైభవం చిత్రించ బడింది. రామరాజ్యమంటే ధర్మపరిపాలనకు ఆదర్శమైనది. ప్రపంచంలో మేధావులంతా ఆదర్శ చక్రవర్తిని గురించి నిర్వచించారు. ఈ సిద్ధాంతం వాల్మీకి మహర్షితో ప్రారంభమైంది. భారతం, దాన్ని అనుసరించి శ్రీకృష్ణదేవరాయలవారు

ఆదర్శరాజ్య పరిపాలనను గురించి వివరించారు. కౌటిల్యుని అర్థశాస్త్రం ఆదర్శ ప్రభుత్వాన్ని నిర్వచించింది. దాని స్వరూప వర్ణన యీ పద్యం. ఈ పద్యంలో వివరాలకు నాల్గవ ఆశ్వాసంలో యామునాచార్యుడు చెప్పిన రాజనీతి దగ్గర చూచుకోవాలి. ఈతి బాధలు 2-43వ పద్యం దగ్గర చూచుకోవాలి. ఇవి లేకుండా ప్రజలు సంతోషంతో బ్రతకడం ఎలాఉంటుందో, ధర్మప్రభువు సింహాసనాధిష్ఠితుడు కాగానే పంచభూతాలు కూడా ఎలా సహకరిస్తాయో ఈ పద్యం అద్భుతంగా చిత్రించింది.

చక్రవర్తి తన ధర్మమయమైన మనస్తత్వంతో ప్రజల సుఖాలను స్వప్నంలో కూడా భావిస్తాడు. కనుక వారు ధర్మమయంగా జీవిస్తారు. కనుక అఘస్ఫూర్తి మాసిపోవడం, నెల మూడు వానలు కురవటం వంటివి సంభవిస్తున్నవి. రెండవ పాదంలో చక్రవర్తి పరాక్రమాభ్యుదయాన్ని చెప్పారు. రాయల వారి పరాక్రమం జగద్విదిత మైనది. ముందు ముందు ఈ విషయం స్పష్ట మవుతుంది.

క. **తునియలు తొమ్మిది యఁట పదు**
**నెనమండ్రట మోచు వారనేకప కిటికూ**
**ర్మ నగాహు లేటి లావరు**
**లని తావక బాహు వొకడ యవని భరించెన్.** 35

తునియలు=ఖండాలు; తొమ్మిది యఁట=తొమ్మిదఁట.(అట ఆశ్చర్యార్థకం, అవహేళన పూర్వకంగా అన్నమాట); మోచువారు=మోసేవారు; పదునెన మండ్రట=పద్దెనిమిది మంది అట; అనేకప=అష్ట దిగ్గజాలు; కిటి=వరాహం; కూర్మ=తాబేలు; నగ=సప్తపర్వతాలు; అహి=పాము (ఆదిశేషుడు) (ఎనిమిది దిగ్గజాలు+వరాహం+ కూర్మం+సప్తపర్వతాలు+ ఆదిశేషుడు=పద్దెనిమిది) ఏటి= ఏమాత్రపు; లావరులు=బలవంతులు (అని ఎగతాళి); అని=అని చెప్పి నిరసించి; తావక బాహువు=నీభుజం; ఒకడ= ఒక్కటే; అవనిన్=సమస్త భూమండలాన్ని; భరించెన్=మోసింది.

తా : ఈనాడు పంచఖండాలుగా భూమండలం విభక్తమైనట్లు పూర్వకాలం నవఖండాలుగా విభక్తమైనది. ఈ పురాణోక్తి ఆధారంగా ఈ పద్యం పుట్టింది. శ్రీకృష్ణదేవ రాయలు తన రాజ్యాన్ని కూడా తొమ్మిది మండలాలుగా విభజించినట్లు చరిత్ర చెబుతుంది. ఈ చారిత్రిక సత్యాన్నే ఈ పద్యంలో సాలంకారంగా కవి చెప్పింది.

అలం : వ్యతిరేకం. పదునెనిమిది కంటే భుజానికి ఆధిక్యం చెప్పబడటం వలన ఈ అలంకారం వ్యంగ్య మౌతున్నది.

అష్టదిగ్గజాలు :- **ఐరావతః పుండరీకో వామనః కుముదోఽఞ్జనః,**
**పుష్పదంతః సార్వభౌమః సుప్రతీక స్తు దిగ్గజాః** - అని అమరం

(2-38 పద్యంలో పుష్పదంత ద్విపంబు దక్షిణ దిగ్గజంగా చెప్పబడిన పద్యం పోల్చు.)

సప్తకుల పర్వతాలు :- **మహేంద్రో మలయః సహ్యః శుక్తిమాన్ ఋక్షపర్వతః,**
**వింధ్యశ్చ పారియాత్రశ్చ సప్తైతే కులపర్వతాః ॥**

ఈ పద్యం మను చరిత్రలో లేదు. 34 దాకా మనుచరిత్రలో పద్యాలు గ్రహించి ఈ పద్యం మాత్రం రాయలే వ్రాసు కొన్నాడు. మరల 36 పెద్దన గారి పద్యమే. ఈ విధంగా పెద్దనగారి పద్యాల నడుమ రాయలవారు పద్యముత్యాలు సంఘటించటం ప్రత్యేకంగా చూచుకోదగ్గ చారిత్రిక సత్యాలు. 34వ పద్యాన్ని పారిజాతం పీఠికలో 16,17,19 పద్యాలతో పోల్చు.

సీ. తొలు దొల్త నుదయాద్రి శిలఁదాకి తీండ్రించు*
యసి లోహమున వెచ్చనై జనించె;
మఱి కొండవీడెక్కి మార్కొని నలియైన
యల కసవాపాత్రునంటి రాఁజె;
నట సాఁగి జమ్మిలోయఁబడి వేగిదహించెఁ
గోన బిట్టేర్చెఁ గొట్టాన c దగిలెc
గనకగిరి స్ఫూర్తి c గరచె; గౌతమిఁగ్రాఁచె;
నవుల నాపొట్నూర రవులు కొనియె;

తే. మాడెములు వ్రేల్చె, నొడ్డాది మసి యొనర్చెఁ
గటక పురి c గాల్చె గజరాజు గలఁగి పఱవఁ
దోఁక చిచ్చన; నౌర నీ దురవగాహ
ఖేలదుగ్ర ప్రతాపాగ్ని కృష్ణరాయ! 36

కృష్ణరాయ!(సంబోధన); నీ=నీయొక్క; దుర్- అవగాహ=ప్రవేశింపరాని, లేదా ఊహింప నలవికాని, అంటే శత్రురాజులకు రాయల యుద్ధనీతి అంతు పట్టేది కాదని తాత్పర్యం. ( ఉద్ధురతన్ అని మను చరిత్రలో ఉండగా రాయలవారు ఆ శబ్దాన్ని మార్చి ఇలా వ్రాయడం భావించదగ్గ విషయం) ఖేలత్=క్రీడిస్తున్న; ఉగ్ర=తీక్షమైన; ప్రతాపాగ్ని=శత్రురాజులను తపింపజేసే పరాక్రమ మన్న అగ్ని; తోకచిచ్చు- అనన్=లంకను తగుల బెట్టిన ఆంజనేయ స్వామి తోక నిప్పు అన్నట్లుగా ( ఉత్ప్రేక్ష)

తొలుదొల్తన్=మొట్టమొదటగా; ఉదయాద్రి= ఉదయగిరి దుర్గము (నెల్లూరు దగ్గర ఉన్న గజపతి గిరిదుర్గం. దీన్ని జయించడానికి రాయలవారికి తొమ్మిది లేదా పదునెనిమిది నెలలు పట్టిందని చరిత్రకారుల అంచనా) శిలన్=రాతిని; తాకి=తగిలి; తీండ్రించు=మండు; నీ; అసి=కత్తియొక్క; లోహమునన్= ఇనుమున్నలోహంతో; వెచ్చనై=వెచ్చగానై; జనించెన్=పుట్టెను.

(పూర్వకాలం చెకుముకి రాళ్లమధ్య దూదిపెట్టి కొట్టి నిప్పు చేసుకొనే వారు. కనుక అది ఆధారంగా ఈ పాదం వచ్చింది) శ్రీకృష్ణ దేవరాయలు గజపతి సామ్రాజ్యాన్ని కబళించడం ఉదయగిరితో ప్రారంభించాడు.)

మఱి=తర్వాత; కొండవీడు=కొండవీటిదుర్గం; ఎక్కి=ప్రాకి; మార్కొని= ఎదిరించి (కర్త ఆదుర్గపాలకుడు అయిన కసవాపాత్రుడు) నలియైన=నలినలిగా అయిపోయిన, నలిగి పోయిన; అల= ఆ; కసవాపాత్రున్= ఆపేరుగల గజపతి సామంతుని; అంటి =అంటుకొని, రాజెన్=మండెను.

కొండవీటి పరిపాలకుడు కసవాపాత్రుడు. ఈ శబ్దంలో కసవు=గడ్డిని, అంటుకొని ఉదయాద్రిలో పడ్డ నిప్పురవ్వ రాజుకొన్నది. ఉదయగిరి తర్వాత కొండవీటిదుర్గం గజపతి సామ్రాజ్యంలో బలమైనది. కనుక రాయలవారు దాన్ని పట్టుకొన్నారు.

అటసాగి= అక్కడినుండి బయలుదేరి; జమ్మిలోయన్= ఆపేరుగల లోయలో ; పడి=ప్రవేశించి, వేగిన్=వేంగి దేశాన్ని; దహించెన్=కాల్చింది. (జమ్మిలోయ తెలంగాణాలో ఉంది. రాయలవారి సైన్యం కొండపల్లిని జయించాక బెజవాడ దగ్గరనుండి రెండు పాయలుగా చీలి ఒకటి తూర్పు కోస్తా ప్రాంతం మీదుగా కటకందాకా ఆక్రమిస్తూ పోతూఉంటే, మరొకసేన తెలంగాణా దుర్గాలను జయిస్తూ జమ్మిలోయనుండి గోదావరి ఒడ్డున ప్రధాన సైన్యంతో కలిసినట్లు చరిత్ర) కోనన్=కోనసీమను; లోయల్లో అడవిని/ బిట్టు= మిక్కిలి; ఏర్చెన్=కాల్చెను; కొట్టానన్=కొట్టము అను పేరుగల నగరాన్ని; తగిలెన్=ముట్టుకొన్నది. కొట్టము=పశువులశాల, తోకచిచ్చు అన్న అర్థంలో; కనకగిరి=బంగారు కొండయొక్క; స్ఫూర్తిన్=కాంతిని; కరచెన్=కరిగించెను; గౌతమిన్=గోదావరిని; క్రాచెన్=కాగబెట్టింది; అవులన్= ఆతరువాత; ఆపొట్నూరన్=ప్రసిద్ధమైన పొట్నూరన్న నగరంలో; రగులుకొనియెన్=రాజుకొన్నది; మాడెములు= ఆపేరుగల సీమను; ప్రేల్చెన్=తగల బెట్టెను. ఒడ్డాదిన్= ఓఢ్రదేశాన్ని; మసి=బూడిద; ఒనర్చెన్=చేసెను; గజరాజు=గజపతి ( ఏనుగుల రాజు); కలగి=భయపడి; పరవన్=పారిపోగా; కటకపురిన్=గజపతి రాజధానియైన కటక నగరాన్ని; కాల్చెన్=దహించెను.

తా :- గజపతి సామ్రాజ్యం నెల్లూరి నుండి కటక్ దాకా విస్తారమైన రాష్ట్రం. శ్రీకృష్ణ దేవరాయలు గజపతిని జయించడానికి చేసిన జైత్రయాత్ర తూర్పుదిగ్విజయాత్రగా బహుప్రసిద్ధి పొందినది. ఏ క్రమంలో గజపతి సామ్రాజ్యాన్ని ఆయన ఆక్రమించాడో ఆవరుస తప్పకుండ ఇక్కడ చెప్పబడింది. రాయలవారి భుజప్రతాపం ఒక మహాగ్నియై ఉదయగిరి, కొండవీడు, జమ్మిలోయ, వేగి, కోన, కొట్టాము, కనకగిరి (ప్రస్తుతం మహారాష్ట్రంలో కల్యాణి నగరమో, లేక కోస్తా ప్రాంతములో ఆ పేరుగల పట్టణమో), పొట్నూరు, మాడెములు, వడ్డాది, కటక్ నగరం. ఇవన్నీ మండిపోయాయి. అందుచేత తూర్పుకోస్తా ప్రాంతమంతా ఇంచు మించు ఒక జ్వాలాతోరణంలాగా మండి పోయిన దృశ్యం (అడవులు, లోయలు వరుసగా మండడం చూస్తాం). భావిస్తే ఈపద్య భావసౌందర్యం అవగతమవుతుంది. ఇదే తోక చిచ్చంటే. ఒక తోక చిచ్చు వినువీధిలో మండుతూ కనిపించినట్లు ఈ తోకచిచ్చు ఈ ప్రాంతాలన్నిటినీ కబళించింది.

ఆముక్త ప్రథమాశ్వాసాంతంలో ఉదయగిరి పాలకుడు (ప్రహరేశ్వర పాత్రుడు, గజపతి పినతండ్రి) ఎలా లొంగి పోయినాడో వర్ణింప బడింది. ద్వితీయాశ్వాసాంతంలో కొండవీటి విజయం చెప్పబడింది. జమ్మిలోయలో షితాబ్ ఖాన్ అన్నపేరుగల ఒక తెలుగు వీరుడు గోల్కొండనవాబు సామంతుడు రాయల వారి సైన్యాన్ని విలుకాండ్రసేనతో ఎదిరించినట్లు చరిత్ర. ఇతని కాలంలోనే చరిగొండ ధర్మన్న తన చిత్ర భారతాన్ని వ్రాసాడు. షితాబ్ఖాన్ను చిత్తాపుఖానుగా ఆ కావ్యం చెప్పింది. పొట్నూరు దగ్గర రాయల విజయస్తంభం నాటించిన విషయం ముందు రాబోతున్న 40వ పద్యం చెబుతున్నది.

ఉ. చిత్రము కృష్ణరాయ నృపశేఖర! నీదగు ధాటి కోడి స
ర్వత్ర నిలింప కామినుల వాడకు ( గాఁ పులు వోదు రుత్కల
క్షత్రియ పాత్రులెల్లఁగసుగందని మేనులఁదొంటి పెద్ద లే
సూత్రము ( బన్నినారొ బల సూదను వీటికి ( గొండ వీఁటికిన్. 37

కృష్ణరాయ నృపశేఖర=నృపశేఖరుడవైన శ్రీకృష్ణదేవరాయా!; ఉత్కళ=కళింగదేశానికి పాలకులైన; క్షత్రియ=క్షాత్రవంశీయులైన; పాత్రులు= ఆపేరు గల రాజులు; గజపతికి పదహారు మంది పాత్రులు సామంతులుగా ఉన్నారని చరిత్ర. (ప్రస్తుతం ఈ పాత్రశబ్దమే పాత్రో అని వ్యవహారంలో ఉంది.) ఎల్లన్=అంతా; నీదగు=నీదైన; ధాటికిన్=దాడికి; సర్వత్ర=అన్ని చోట్ల; ఓడి= ఓడిపోయి; నిలింపకామినుల వాడకున్=దేవతాస్త్రీల పేటకు (వీరస్వర్గానికి) కాపులు-పోదురు=కాపురముండడానికి వెళ్తారు. ఎలాగా? అంటే కసుగందని మేనులన్= ఏమాత్రము కందిపోని శరీరాలతో (కసుగాయలు అన్న ప్రయోగంలో కసుశబ్దానికి లేత అని అర్థం. 'ఏరకుమీ కసు గాయలు' అని ప్రయోగం) చిత్రము= ఇది అద్భుత విషయం కాదా?; తొంటిపెద్దలు=ప్రాచీనాచార్యులు; బలసూదను=బలుడను రాకాసిని చంపిన యింద్రునియొక్క; వీటికిన్=నగరమైన అమరావతికి; కొండవీటికిన్=కొండవీడన్న పేరుగల నగరానికి ( ఇంద్రుని నగరమంటే రాజమహేంద్ర వరం. కొండవీడంటే ఆ ప్రాంతంలో ఉన్న గిరిప్రదేశాలు. ఓడి పోయి పాత్రులు అక్కడ దాక్కున్నారని చమత్కారము); ఏ సూత్రము పన్నినారో = ఏ రహస్యమార్గం కల్పించారో.

తా : కృష్ణరాయల ధాటికి కొండవీటిలోని పాత్ర సామంతులంతా, కసుగందని శరీరాలతో- క్షతగాత్రులు కాకుండానే స్వర్గంలోని అప్సరసల వాడలకు వెళ్లారు. ఇది చాలా విచిత్రం. పూర్వకాలంలోని పెద్దలు ఈకొండవీటికి స్వర్గానికి ఏ సొరంగమార్గం వేసారో కాని ఇది చాలా చిత్రము.

విశే : వీరస్వర్గానికి సంబంధించిన అర్థంతోపాటు కొండవీటి నుండి, రాజమహేంద్ర వరానికి పారిపోయినారన్న చారిత్రకార్థం కూడా సంభావించ దగ్గదే. ఈ చరిత్ర సంబంధమైన అర్థం లేకపోతే పెద్దన గారు వ్రాసిన 36వ పద్యం తర్వాత రాయల వారి పద్యం కల్పించి వ్రాయ నక్కరలేదు. తర్వాతి పద్యం కూడ రాయలవారు వ్రాసినదే. కనుక ఈ రెండు పద్యాలు వ్రాయవలసిన ఆవశ్యకత భావిస్తే బహుశా కొండవీడును జయించడంతో గజపతి సామ్రాజ్యసౌధం కూలడం ప్రారంభమైనది. దీనికి పోషకంగా 38 వ పద్యంలో చెప్పినభావం.

ఉ. కూరిమి ( గృష్ణరాయ నృపకుంజర చేరెఁ గళింగ రాజ్యల
క్ష్మీ రమణీలలామ నిను మిన్నులు ముట్టిన మోహనాలతోఁ
గారణ మట్ల లక్ష్మి గసుగందని వేడుకఁ గృష్ణరాయనిం
జేరున కాక, వావి సెడఁ జెందునె సోదరుఁడైన రుద్రునిన్? 38

కృష్ణరాయ నృపకుంజర=కృష్ణరాయ రాజశ్రేష్ఠుడా! ; కళింగరాజ్యలక్ష్మీ= గజపతి సామ్రాజ్యలక్ష్మి అన్న; రమణీలలామ=శ్రేష్ఠురాలైన సుందరి; నిను=నిన్ను; కూరిమిన్ =ప్రేమతో; మిన్నులు ముట్టిన= ఆకాశం

తాకిన; మోహనాలతో = జెండాలతో (మోహంతో); చేరెన్=సమీపించినది; కారణము, అట్లన్= దీనికి హేతువు సరియైనదే. ఏలాగంటే, లక్ష్మి=లక్ష్మీదేవి, కసుగందని వేడుకన్= తొలివలపు కోరికతో, వాడిపోని వలపుతో; కృష్ణరాయనిన్=శ్రీకృష్ణుని; చేరున కాక=పొందుతుందే కాని, నావి=బంధుత్వం,వరుస; చెడన్=చెడిపోగా; సోదరుడైన= తోబుట్టువు అయిన; రుద్రుని=రుద్రగజపతిని; చెందునె=పొందునా?

తా :- కృష్ణరాయ ! కళింగ రాజ్యలక్ష్మి అన్న సుందరీ రత్నము ఆకాశమంటే ముగ్ధమోహనమైన ప్రేమతో, జెండాలతో కసుగందకుండా నిన్ను వరించింది. ఇది సమంజసమే. ఎందుకంటే లక్ష్మి; నారాయణావతారమైన కృష్ణుని వరిస్తుంది తప్ప సోదరుడైన రుద్రుని వరిస్తుందా?

విశే : ఆముక్త ద్వితీయాశ్వాసాంత పద్యంలో కళింగ గజపతి కుమారుడైన వీరభద్ర గజపతిని, అతని అంతః పురాన్ని ప్రాణాలతో పట్టు కొని విజయనగరానకు రాయలు బందీలుగా తీసుకొని వచ్చాడు. ఈ ఘన విజయంతో కళింగ గజపతి నడుము విరిగి పోయింది. ఇందుకే తన కూతురైన అన్నపూర్ణాదేవిని రాయలకిచ్చి యుద్ధాంతంలో పెండ్లి చేసి సంధి కుదుర్చుకున్నాడు. పెద్దనగారు ఈ వివాహప్రసక్తి తేలేదు. ఈ విషయం పూర్వమే ప్రస్తావించ బడింది. (133వ పద్యం చూడు) ఈవివాహాన్నే రాయల వారిక్కడ భంగ్యంతరంగా ఆకాశాన్ని తాకే కేతనాలతో గజపతి సామ్రాజ్యలక్ష్మి అన్నపూర్ణాదేవి రూపంలో తనని వరించి వచ్చినదని చమత్కరించాడు. ఇక్కడ నృపకుంజర లోని కుంజర శబ్దం సాభిప్రాయమైనది. గజపతికి గజత్వం పోయి తనకు సంక్రమించినదని చెప్పడం. ఇంతేకాక గజం చక్రవర్తికి మంగళ ప్రదమైన చిహ్నం. గజాంతమైన వైభవమని ఒక మాటఉన్నది. పారిజాతాపహరణం చిట్ట చివరి పద్యంలో చివరి పాదంలో ఈ వైభవం స్తుతింపబడింది. ''మత్తగజ యూథ మదమగ్న సుఖ మంగళ మహాశ్రీ'' అని. ఈ అన్నపూర్ణాదేవి వివాహకథ చరిత్ర ప్రసిద్ధమైన సత్యం. అది అద్భుతమైన విషయంగా రాయలు వర్ణించడంచేత గజపతి విజయం చాలా మహత్తరమైన విషయమని చెప్పడం.

సీ. కచసక్త ఫణి కంచుకము మౌళి వీరకే
దారంపుఁ బాగ చందంబు నొందఁ,
గలయ నంగమున మర్కట కీటకృతమైన
మగ్గంబు నేత్ర సంపద వహింప
ధ్వాంత గహ్వర శిలా తాడితాలిక చిక్క
ణాస్ర పంకము చంద్రమై పొసంగఁ
దనుభృశ శ్రాంత వేష్టనలగ్న బర్హిబ
ర్హంబు మువ్వన్నె చుంగై చెలంగ,

తే. నిద్రమేల్కాంచి, సెలయేట నీడఁ గాంచి,
గోపవేషంబు సెడి , తొంటి భూప వేష

మగుట యవ్వన మహిమఁగా నలికి యచటు
విడుచు గజరాజు నీధాటి వింధ్యవాటి. 39

నీధాటిన్= నీదాడికి; వింధ్య వాటిన్=వింధ్యారణ్యంలో; గజరాజు=గజపతి ( ఏనుగులరాజు)

కచ=జుట్టులో; సక్త=అంటుకున్న; ఫణి కంచుకము=పాము కుబుసం; మౌళిన్=తలపై, నీర కేదారపు+పాగా=రణరంగోచితమైన తలపాగా; చందంబున్= తీరును; పొందన్=పొందగా;

అంగమున్=శరీరం మీద, శరీరానికి; కలయన్=అంతటా వ్యాపించిన, అల్లుకున్న, మర్కట కీట=సాలెపురుగుచేత; కృత=నేయబడ్డ; వంగ్గరబు=పటము; నేత్రసంపద=వస్త్రసమృద్ధి; వహింపన్=వహించగా, పొందగా;

ధ్వాంత=చీకటి కల; గహ్వర=గుహయొక్క; శిల=రాతిచేత; తాడిత= ఎదురు దెబ్బ కొట్టబడ్డ; అళిక=నుదుటిపై; చిక్కణ=చిక్కనైన; అస్రపంకము= నెత్తుటి బురద; చంద్రమై=సింధూరమై, పొసంగన్=అందగించగా.

తను=దేహముయొక్క; భృశ=అధికమైన; శ్రాంత=అలసటచేత; వేష్టన= పొర్లినందువల్ల; లగ్న=తగుల్కొన్న; బర్హిబర్హంబు=నెమలి కన్ను; మువ్వన్నెచుంగై= మూడురంగులకుచ్చుగా, చెలంగన్=ప్రకాశిస్తే; నిద్రమేల్కాంచి=నిద్రనుండి మేలు కొని; సెలయేటన్=కొండవాగులో; నీడన్=తన ప్రతిబింబాన్ని; కాంచి=చూచి; గోపవేషము=పశుల కాపరి వేషం; చెడి=తొలగిపోయి; భూపవేషము=రాజుయొక్క వేషము; అగుట=సంభవించడం; ఆ+వన= ఆ అడవియొక్క; మహిమ గాన్=మాహాత్మ్యమై; అలికి= భయపడి; అచటు= ఆ వింధ్యవాటిని; విడుచున్=వదలి పెట్టును

తా :- కళింగ గజపతి రాయలవారి చేతిలో ఓడిపోయి వింధ్యాటవులలో దాక్కున్నాడు. పసుల కాపరి వేషం కట్టి, తన రాజవేషాన్ని మార్చు కొన్నాడు. ఇది పద్య సందర్భం. ఈ గోపవేషంలో ఉన్న రాజు గుహలో దాక్కున్నాడు. నిద్రపోయి లేచి గుహనుండి బయటకు వస్తున్నాడు. గుహలోనుండి వంగి రావాలి కనుక అలా వస్తుంటే అతని జుట్టుకు ఆ గుహల రాళ్లలో ఉన్న పాము కుబుసం అంటు కొంది. అది బంగారు, వెండి జరీ అంచున్న యోధుని తలపాగా వలె ఉన్నది. (బహుశా రాయలవారి బొమ్మలో మనం చూచే తలపాగా ఈ నీర కేదారపు పాగాయేమో) ఒళ్లంతా సాలె బూజులు అంటుకొన్నవి. అవి సన్నని దువ్వలు వలు వలే ఉన్నాయి. చీకటిలో వస్తున్నాడు కనుక నుదుటికి ఒక గండశిల తగిలింది. అది చిట్లి అక్కడ నెత్తురు బురదకట్టి పేరుకొని పోయింది. అది పెద్ద కుంకుమ బొట్టు లాగాఉన్నది. బాగా అలిసి పోయినందువల్ల (భయంతో అడవులన్నీ తిరిగాడు కనుక) నిద్రపోయి తెలియకుండానే అటునిటు పొర్లినందు వల్ల ఆజుట్టుకు నెమలి ఈక తగుల్కొన్నది. అది తలపాగాలో మూడురంగుల కుచ్చులాగా ఉంది. గుహనుండి బయటపడి నీళ్లు త్రాగటానికి సెలయేటిలో వంగినపుడు తాను వేసుకున్న మారు వేషం తొలగి పోయి తనయథార్థ రాజవేషం అమరినదేమిటి? బహుశా ఇది యీ వన మహిమ కాబోలు అని భయపడి వింధ్యవాటి నుండి మరొక అడవికి పారిపోతున్నాడు.

విశే : ఇదొక అద్భుత భావసంపన్నమైన పద్యం. ఆనాటి రాజుల వేషధారణ ఎలా ఉంటుందో చిత్రిస్తున్నది. మన ప్రాచీన చక్రవర్తుల వేష ధారణ ఎలా ఉంటుందో చిత్రిస్తున్నది. మన ప్రాచీన చక్రవర్తుల వేష భాషాదులు ఎలా ఉండేవో మనకు తెలియదు. కాని రాయల వారి కావ్యంలో తన రాచఠీవి అనేక సందందర్భాలలో ఆయనకు తెలియకుండానే ప్రతిబింబించి రాజోచిత వేషభాషాదులను చిత్రించింది. ద్వితీయాశ్వాసంలో మధురాచక్రవర్తి వర్ణన అంతా దీనికి సంబంధించినదే. మరీ 39 చక్రవర్తిత్వాన్ని చిత్రిస్తున్నది. 75వ పద్యంలో రాజోచిత వేషాలంకరణ చిత్రిత మైనది నాల్గవ ఆశ్వాసంలో 43వ పద్యం పరమవీర మహేశ్వరుడైన చక్రవర్తి వర్ణన. 58వ పద్యం అతని సింహాసన, ఆస్థాన వర్ణన. ఈ విధంగా ఒకానొక ప్రాచీన చక్రవర్తి ఆముక్త మాల్యదలో మనకు వర్ణనల నుండి ఉన్మేషిస్తున్న మూర్తి విశేషము మన భావనా నేత్రానికి అందుతున్నది.

మనుచరిత్రలో గజరాజు ఓడిపోతే అతని అంతఃపుర స్త్రీలు వింధ్యారణ్యంలో దాక్కున్నారని పెద్దన గారు ఒక అందమైన పద్యం వ్రాసారు.

*ధర కెంధూళులు కృష్ణరాయల చమూధాటీ గతిన్ వింధ్య గ*
*హ్వరముల్ దూఱఁగఁ జూచి తారచటఁ గాఁపై యుండుటన్ జాలన*
*చ్చెరువై యెట్టని వింత చీఁకటులు వచ్చెన్ జూడరే యంచు వే;*
*సొరిదిన్ జూతురు వీరరుద్ర జగరాట్ శుద్ధాంత ముగ్ధాంగనల్.*

ఈ పద్యంలో అంతఃపురస్త్రీ వర్ణన చేయబడితే పై పద్యంలో ఓడిన రాజు వర్ణింప బడటం గమనింపదగ్గ విషయం. ఇది ఆస్థాన కవి వర్ణన. అది ఒక రాజుతానై చేసిన వర్ణన. పెద్దనగారి పద్యాన్నే గ్రహిస్తే రాజు తనకే తలవంపులనుకున్నాడు కాబోలు. పెద్దన గారి పద్యం గ్రహించలేదు దీని రహస్యం 4వ ఆశ్వాసంలో రాజనీతిలో ఉన్నది. 4-267 పద్యం చూడు.

పెద్దన గారి పద్య భావం మధురమైనది. రాయలగారి పద్యభావం ప్రౌఢమైనది. ఒక రాచ దర్జా ఉన్నది.

ఇందులో గజపతి ఓడి పోయిన సంగతి చెప్ప బడింది కదా! ఇంకా రాయలు బెజవాడలోనే ఉన్నాడు తప్ప సింహాచలం దాకా నడవలేదు. కాని ఓడిన విషయం భావికాలంలో రాబోతున్నది. ఇక్కడ భూతలకాలంగా చెబుతున్నాడు. ఎలా కుదురు తోంది? అని ఒక ప్రశ్న. రాయలు గజపతిని జయించి తిరిగి విజయనగరానికి వచ్చి భువన విజయం నిర్మింపజేసి తర్వాత ఎప్పుడో ఈ కావ్యం ప్రారంభం చేశాడు. అప్పటికి యిది భూతకాల విషయమై పోయింది. ప్రస్తుత సందర్భం ఆస్థాన జ్యోతిష్కులు చెప్పినట్లున్న తర్వాతి కాలంలో గాని ఇది వ్రాయ బడలేదు.

అలం : భావికం. ఉదాత్తం.

భూత భవిష్యత్తులకు సంబంధించిన ఏ విషయమైన, అద్భుతమైనదాన్ని ప్రత్యక్షీకరింప బడటం భావికం.

ఉదాత్తం : లోకాతిశయమైన సంపద్వర్ణన; లేదా అద్భుత వ్యక్తుల చరిత్ర వర్ణన. ఈ రెండలంకారాల సమ్మిశ్రణం ఈ పద్యం.

చ. అభిరతి c గృష్ణరాయ, విజయాంకము లీవు లిఖించి తాళస
న్నిభముగ c బొట్నునూరికడ నిల్పిన కంబము సింహభూధర
ప్రభు తిరునాళ్లకుండిగు సుర ప్రకరంబు కళింగ మేదినీ
విభునపకీర్తి కజ్జలము వేమఱు పెట్టి పఠించు నిచ్చలున్. 40

కృష్ణరాయ! = ఓ కృష్ణరాయ ప్రభూ! ఈవు= నీవు; విజయ+ అంకములు= గెలుపునకు సంబంధించిన బిరుదు చిహ్నలు; లిఖించి=చెక్కించి; పొట్నునూరికడ= పొట్నూరి దగ్గర (ఈ గ్రామం భీముని పట్నం సమీపంలో ఉన్నది కాని అక్కడ యీ విజయస్తంభం మాత్రం లేదు); తాళసన్నిభముగన్= తాటిచెట్టుతో సమానంగా; నిల్పిన =నాటిన; కంబము=విజయస్తంభము; సింహభూధర=సింహాచలమన్న క్షేత్రంలో ఉన్న; ప్రభు=స్వామియొక్క; తిరునాళ్లకున్= ఉత్సవాలకు; డిగు=క్రిందికి వచ్చు; సురప్రకరంబు =దేవతల సమూహము; కళింగ మేదినీ విభు=కళింగ రాజ్యప్రభువుయొక్క; అపకీర్తి = చెడ్డ కీర్తి అన్న, కజ్జలమున్=కాటుకను; వేమఱు= అనేక సార్లు; పెట్టి=పూసి, నిచ్చలున్= నిత్యమును; అభిరతిన్=మిక్కిలి ఆసక్తితో; పఠించున్=చదువుతుంది.

తా . శ్రీ కృష్ణదేవరాయా! నీవు పొట్నూరి దగ్గర నీ విజయాన్ని చెక్కించి నాటించిన తాడి చెట్టువలె ఎత్తైన విజయస్తంభమందున్న నీవిజయాన్ని సింహాచలస్వామి తిరునాళ్లకై ఆకాశంనుండి దిగివస్తున్న దేవతలకు కనిపించింది. ఇది ఏమా? అని వాళ్లు చదవ బోతే అక్షరాలు సరిగా కనిపించలేదు. అపుడు వాళ్లు ఓడిపోయిన గజపతియొక్క అపకీర్తి అనే మసి ఆ శాసనానికి పూసి మిక్కిలి ఆసక్తితో పఠిస్తున్నారు.

విశే : ఈ శాసన స్తంభం 1516 మార్చినాటిది. శాసనాలను పఠించే పద్ధతి ఆధారంగా ఈ రమణీయ భావన చేయబడింది. తాళపత్రగ్రంథాలను, శాసనాలను మసిపూసి చదివితే అక్షరాలు స్పష్టంగా కన్పిస్తాయి. అందుకని దేవతలకు గజపతి ఓడి పోయినందువలన అతని కీర్తి చెడిపోయి, ఆ అపకీర్తి ఇక్కడ కజ్జలంగా పోల్చ బడి చెప్పబడింది.

ఒక చారిత్ర కాంశాన్ని కవిత్వంగా పరిణమింపజేయడం ఎలా? అంటే ఈ పద్యం ఉదాహరణగా తీసికొని చర్చించవచ్చు.

ఈ విజయం భారతదేశ చరిత్రలో ఒక అద్భుత ఘట్టం కనుక కవులు దాన్ని రక రకాలుగా కీర్తించారు. రాయలకు ప్రధాన మంత్రి శేఖరుడైన సాళువ తిమ్మరుసు అగస్త్య రచిత బాలభారతానికి చేసిన 'మనోహర' మన్న వ్యాఖ్యాన అవతారికలో ఈ ఉదంతాన్ని యిలా ఉత్ప్రేక్షించాడు. 'ప్రళయ జల మగ్నమైన భూదేవిని ఉద్ధరించిన ఆదివరాహంయొక్క వాడియైన కోర లాగా' ఉన్నది అని రాయల జైత్రయాత్రలలో ఇదీ; మూడవసారి రాయచూరిపై జరిపిన యుద్ధయాత్ర చాలా అపూర్వఘట్టాలు. సింహాచల స్వామి తిరుణాల వైశాఖ పౌర్ణమినాడు జరుగుతుంది.

సీ. సనకాది దివిజమస్కరి ఫాల గోపీచం
దన పుండ్ర వల్లిక ల్నాకి నాకి,
సెలసి హాహా హూహూవుల దండియల తంత్రి
ద్రెవ్వసింగిణులుగా ( దివిచి తివిచి,
సప్తర్షికృత వియజ్ఝ్ఝర వాలుకాలింగ
సమితి ముచ్చెల కాల్ల ( జమరి చమరి,
రంభాప్రధానాప్సరః పృథూరోజ కుం
భంబు లెచ్చట ( గన్న ( బట్టిపట్టి

తే॥ తిరుగు హరి పుర సురతరు సురల మరగి
బహుళ హళహళి భరిత కల్బరిగ నగర
సగర పురవర పరిబృఢ జవన యవన
పృతన భవదసి ననిఁదెగి కృష్ణరాయ! 41

కృష్ణరాయ= కృష్ణరాయా!; అనిన్=యుద్ధంలో; భవత్+అసిన్= నీ కత్తితో; బహుళ= అతి శయమైన; హళ హళి= సందడితో; భరిత= నిండిన; కలబరిగ నగర=గుల్బర్గాపురవుయొక్క; సగరపురవర= సాగరపట్టణంయొక్క; పరిబృఢ= ప్రభువులయొక్క; జవన=వేగం కల; యవన= మహమ్మదీయులయొక్క; పృతన= సేన; తెగి= చచ్చి; హరిపుర= ఇంద్రుని నగరమైన అమరావతిలో ఉన్న; సురత రు= కల్పవృక్షాలయొక్క; సురలన్= మద్యాన్ని; మరగి= రుచిపడి; తిరుగున్= ఈ వర్ణించిన రీతిగా దేవలోకంలో సంచరిస్తున్నది.

తా : శ్రీకృష్ణదేవరాయా! యుద్ధంలో నీ కత్తి దెబ్బలు తిని మరణించిన గుల్బర్గా, సాగర్ పట్టణాలకు ఏలికలైన మహమ్మదీయ రాజులయొక్క సేన అధిక కోలాహలంతో అమరావతి నగరంలో కల్పవృక్షాల మద్యం సేవిస్తూ దేవలోకంలో సంచరిస్తున్నది.

సనక+ ఆది=సనకుడు మొదలైన; దివిజమస్కరి=దేవతలయొక్క మునుల ఫాల= నుదుటిపైనున్న; గోపీచందన= ఆపేరుగల గంధంతో పెట్టిన; పుండ్రవల్లికల్= ఊర్ధ్వపుండ్రాల రేఖలను; నాకినాకి=చెరిగి పోయే దాకా నాల్కతో తుడిచి,తుడిచి.

సనక సనందాది దేవతామునులు పైవిధంగా కల్లుత్రాగిన మహమ్మదీయులకు ఎదురు పడితే కోపంతో వారినొసళ్లపైనున్న గోపిచందనంతో తీర్చబడ్డ ఊర్ధ్వపుండ్రాలను నాకి పడేస్తున్నారు. సనక సనందాదులు నల్గురు దేవతా మునులు. వీరు నారాయణ భక్తులు. కనుక వైష్ణవులు ధరించే నిలువు బొట్లు పెట్టుకున్నారు. మహమ్మదీయులు కనుక సహించలేక వాటిని చేతితో తుడవకుండా నాలుకతో నాకి వేస్తున్నారు. దేవతౌఘము, పితౄఘము, మానవౌఘము అని మునులు మూడు తెగలుగా నున్నారు.

హాహాహూహూవుల=హాహా, హూహూ వులన్న దేవ గాయకులయొక్క; దండియలను=వీణలను; సెలసి=గుంజుకొని; తంత్రి=తీగ; త్రెవ్వన్=తెగిపోయేటట్లుగా, సింగిణులుగాన్=వింధ్ల యేటట్లుగా; తివిచి తివిచి=మాటి మాటికి లాగి

హాహ హూహూవులు గంధర్వ గాయకులు. వారు వీణలు ధరించి పాడుతూ వస్తుంటే సంగీతం సరిపడనివారు కనుక యవనులు వారిచేతుల్లోని వీణలను బలంగా గుంజుకొని ధనుస్సుల నారి లాగినట్లు వీణ తంత్రులను తెగ్గొడుతున్నారు.

సప్తర్షి=సప్తఋషుల చేత; కృత=చేయబడ్డ; వియజ్ఝరి= ఆకాశగంగలో; వాలుకాలింగ= ఇసుకతో చేయబడ్డ లింగాలయొక్క; సమితిన్=సమూహాన్ని; ముచ్చల కాళ్లన్=చెప్పుల కాళ్లతో, చమరి చమరి=పామి పామి.

సప్తర్షులు ఆకాశగంగ ఇసుక తిన్నెల మీద ఇసుకతో లింగాలు చేసి పూజలు చేస్తుంటే సహించని వీరు చెప్పుల కాళ్లతో రాచిపారేస్తున్నారు.

కశ్యపోఽత్రిః భరద్వాజో విశ్వామిత్రశ్చ గౌతమః,
జమదగ్నిః వశిష్ఠశ్చ సప్తైతే ఋషయః స్మృతయః ॥

రంభా=రంభయన్న అప్సరస; ప్రధాన=ముఖ్యురాలుగా కల; అప్సరః=అప్సరలయొక్క; పృథు=పెద్ద; ఉరోజ=స్తనములన్న; కుంభంబులు=నిండు కుండలు; ఎచ్చటన్ కన్నన్= ఎక్కడ కనిపించినా; పట్టిపట్టి= ఒత్తి ఒత్తి; తిరుగు అన్నక్రియతో అన్నిపాదాలు అన్వయిస్తాయి.

రంభాదులైన అప్సరలు ఎక్కడ కనిపించినా వారి బలుపులైన కుచకుంభాలను పట్టు కోవడమే పనిగా ఉన్నారు.

నాటి కాలంలో పంచబహమనీ సుల్తానుల పరిపాలన సాగుతోన్నది. జయించిన నగరాలను కొల్లగొట్టడంలో జరిపిన అల్లర్లను ఈ పద్యం స్వభావోక్తి రమణీయంగా వర్ణిస్తున్నది. విజయనగర చరిత్ర వ్రాసిన చరిత్రకారులు అందరూ తల్లికోట యుద్ధంలో విజయనగరాన్ని మహమ్మదీయులు ఎలా ధ్వంసం చేశారో విపులంగా వర్ణించారు. ఆనాటి వైషమ్యాలకు ఈ పద్యం దర్పణం.

ఈ పద్యమూ రాయలు వ్రాసిందే. ఎత్తుగీతిలో హ్రస్వాక్షర బహుళమైన రచన జాగ్రత్తగా గమనించాలి. ఈ రచనలో ఒక తీవ్రత; వేగం ఉన్నది. ఓజోగుణ సహితంగా కనిపిస్తుంది. ఇలాంటి పద్యాలు రాయల వారి రచనలో ముందు ముందు గోచరిస్తూ ఉంటాయి. 2-39 పద్యం కూడా ఇలాగే ఉంటుంది. ఆయన శైలిలో ఇదొక ప్రత్యేకమైనది. ఒకానొక ఒళ్లుతెలియని శివం రచనలో అనుభూత మవుతుంది. ఇట్టి శబ్దాలంకార భూయిష్ఠమైన రచన ఒక మహావేశాన్ని కల్పిస్తుంది.

మ. అలుక స్ఫోటక ఘట్టికా ఖురపుటీ హల్య స్వరాసాని పు
చ్ఛలువో దున్ని చలచ్చమూ గజమదాసారప్లుతి న్గిర్తిపు

ష్కల సస్యంబిడి, యేకధాటి, బళిరాకట్టించితౌ దృష్టికే
దులఖానో(గ కపాల మర్థప హరిద్భూ జాంగల శ్రేణికన్. 42

అలుకన్=కోపముతో, ఏకధాటిన్ = ఎడ తెరిపి లేని దాడితో; అర్థప=ధనపతి యైన కుబేరుని యొక్క; హరిత్=దిక్కునందున్న; భూ=ప్రదేశంలో; జాంగల=మెట్ట చేలయొక్క; శ్రేణిన్=సమూహంలో; ఘోటక=గుర్రాలయొక్క; ధట్టికా=సేనలయొక్క, ఖురపుటీ= డిప్పల్లాగా ఉన్న (గొరిజలు) గిట్టలన్న; హల్యన్=నాగళ్ల సమూహంతో, ఖురాసాని పుచ్చలు=ఖురాసాన్ దేశంలో పుచ్చకాయల వంటి తలకాయలను(పుచ్చలు అన్న మాటను పుచ్చెలన్న అర్థస్ఫూర్తితో చదువు కోవాలి. రాయలు ఖురాసాన్ దేశాన్ని జయించాడు. ఆదేశ సేనల పుచ్చెలను తరిగాడని స్ఫూర్తి) పుచ్చ-పాదులను; పోన్దున్ని=నాశనమయ్యేటట్లుగా దున్ని; చలత్=నడుస్తున్న; చమూ=సేనలో, గజ= ఏనుగులయొక్క, మద=దానజలముయొక్క; ఆసార=జడివానయొక్క; ప్లుతిన్=తడుపుతో; కీర్తి=యశస్సున్న; పుష్కల=నిండైన; సస్యంబు=పైరును; ఇడి=పెట్టి; ఏదులఖాన+ ఉగ్రకపాలము=బీజాపూర్ సుల్తాన్ అయిన ఏదుల్ఖాన్యొక్క భయం కరమైన పుర్రెను; దృష్టికిన్=దృష్టి దోష నివారణార్థం; కట్టించితౌ= దిష్టి బొమ్మగా నిల బెట్టితివి కదా; భళిరా=భలే! ఆశ్చర్యం.

తా :- కృష్ణ దేవరాయా! నీదాడిలో ఖురాసాన్ మహమ్మదీయులనే పుచ్చతోటలను అశ్వసైన్యంయొక్క దొప్పల వంటి గిట్టలనెడి నాగళ్లతో దున్ని అదే సేనలో నడుస్తున్న మదించిన ఏనుగులయొక్క దానజలంతో దున్నిన ఆ జాంగల క్షేత్రాలకు తడిపెట్టి పుష్కలంగా కీర్తి సస్యాన్ని నాటి ఏదులఖాన్ పుర్రెను దానికి దృష్టి పిడతగా కట్టించావు కదా! ఓహో! ఏమాశ్చర్యం !

ఈ పద్యంలో ఏదులఖాన్ వధ చెప్పబడింది. ఇతడెప్పుడు రాయల చేతిలో హతుడైనాడొ వివరాలకు పీఠిక జూడు.

అలుకన్ అన్న మాటతో ఏదులఖాన్ అనేకసార్లు తన చేతిలో తప్పించుక పోతే చివరి సారిగా అతడు తటస్థపడినపుడు కలిగిన కోపోద్రేకాన్ని ధ్వనిస్తోన్నది. ఈపద్యాన్ని అనుసరించి రాయలు ఖురాసాన్ దేశాన్ని జయించాడా? అన్న ప్రశ్న తగుల్తోంది. ఈదేశం కాబూల్ ప్రాంతంలో ఉంది. ఇది సంగతం కాకపోతే ఏదులఖాన్ సేనలో ఆఖురాసాన్ దేశస్థులైన మహమ్మదీయులు సైనికులుగా ఉన్నారేమో? చిత్రమేమంటే మనుచరిత్రలో ప్రవరుని యింటికి వచ్చిన సిద్ధుడు తాను తిరిగిన దేశాదులను ప్రస్తావిస్తూ 'హింగుళా పాదాంభోరుహములన్ సేవించితి' నన్నాడు. ఈదేవి కాబూల్ ప్రాంతంలో ఉన్న శక్తిపీఠాలలో ఒక శక్తిపీఠమట. అందు చేత ఖురాసాన్ను జయించడ మన్న విషయం చారిత్రక సత్యమేమో ననిపిస్తుంది. ఖురాసాన్ పుచ్చావేయాలని ఒకజాతి పుచ్చ వున్నది.

చ. సుమతి ఁ బునః పునా రచిత షోడశదాన పరంపరా వసం
తముల ననంత విత్తము ననంత ననంత మహాగ్రహార బృం

దమును నొసంగు నిన్నొరసి తారెన రాక కదా నిలింప భూ
జములు వహించు దుర్యశము షట్పద కోకిల కైతవంబునన్. 43

పునః పునా= మాటిమాటికి; రచిత=చేయబడ్డ, షోడశదాన=పదునారు దానముల; పరంపరా= శ్రేణి అన్న; వసంతములన్=వసంతఋతువులలో; అనంత=అంతులేని; విత్తమున్=ధనాన్ని; అనంత=అంతములేని; అనంతన్=భూమిని; మహత్=గొప్ప; అగ్రహార బృందమును=అగ్రహార సమూహాన్ని; సుమతిన్=మంచి మనస్సుతో; ఒసంగు= ఇచ్చే; నిన్నున్, ఒరసి=ఘర్షించి; తారు=తాము; ఎన=సాటి; రాక కదా=రానందువల్ల కదా !; నిలింపభూజములు=కల్పవృక్షాలు;షట్పద=తుమ్మెదలు (ఆరు పాదాలు కలవి); కోకిల= పికములన్న; కైతవంబునన్=మిషతో; దుర్యశమున్=అపకీర్తిని; వహించున్= మోస్తున్నవి.

తా : శ్రీకృష్ణదేవరాయా! మాటిమాటికి నీవు చేస్తున్న షోడశ మహాదానములన్న వసంత ఋతువులో అనంతమైన ధనాన్ని భూమిని, అగ్రహారాలను ఇస్తున్నావు. నీ యీదానం మీద స్పర్ధవహించిన కల్పవృక్షాలు తుల రాలేక తుమ్మెదలు కోకిలలు అన్న మిషచేత అపకీర్తిని మోస్తున్నవి. అపకీర్తి నలుపుదనాన్ని సూచించేది ఈ తుమ్మెదలు, కోకిలలు.

నేటికి హంపీలో ఈ షోడశ మహాదానాలు చేసిన స్థలంలో తాడి చెట్లవలె ఎత్తుగా ఉన్న రెండు తులా స్తంభాలున్నాయి. తులాదండం మాత్రం లేదు. ఇక్కడే యీదానాలు రాయల వారు చేసేవారని ప్రతీతి. ప్రతి విజయానంతరం రాయల వారు ఆయా పుణ్యక్షేత్రాలకు వెళ్లి అక్కడున్న దేవాలయాలకు విరివిగా రత్నాభరణాది దానాలు చేసేవారని, విజయ నగరంలో ప్రతి విజయానంతరం కవులకు, పండితులకు ఈ షోడశ దానాలు చేసేవారని పండితుల అభిప్రాయము. పైగా నాటి కాలంలో యీ పద్ధతి వుండేది. ఒకే చోట ధనం కూడబడకుండా సంఘంలో విస్తరించే పద్ధతులలో ఈ దాన విషయం ఒకటి.

పారిజాతాపహరణం ప్రథమాశ్వాసాంత పద్యం -

*ప్రతి వర్ష వసంతోత్సవ*
*కుతుకాగత సుకవి నికర గుంభిత కావ్య*
*స్మృతిరోమాంచ విశంకిత*
*చతురాంతః పుర వధూప్రసాదన రసికా !*

అన్న సాక్ష్యం వల్ల వసంతోత్సవాలు రాయలు జరిపించే వాడని తెలుస్తోంది. (పేయస్ వ్రాతల వల్ల దసరా ఉత్సవాలు జరిపించే వాడని తెలుస్తోంది) ఈ వసంతోత్సవాల్లో ఈ షోడశ మహాదానాలు నిర్వహించే వాడని రాయల పద్యం వల్ల స్పష్ట పడుతున్నది. అందుకని 'షోడశ దాన పరంపరా వసంతముల్' అని చెప్పబడింది.

అలం : అపహ్నవం, హేతూత్ప్రేక్ష.

తే. ప్రబల రాజాధి రాజ వీర ప్రతాప
రాజ పరమేశ్వరార్థ దుర్గా నటేశ

సాహితీ సమరాంగణ సార్వ భౌమ
కృష్ణరాయేంద్ర! కృతి వినిర్మింపు మనిరి. 44

ప్రబల=సప్తాంగ సమృద్ధిగల, రాజ=రాజులకు; అధిరాజ=పైన ఉన్న చక్రవర్తీ!; వీర ప్రతాప= మహావీరులను తపింపచేసే పరాక్రమ శాలీ!; రాజ పరమేశ్వరా=రాజులందు పరమేశ్వరుడవైన వాడా! రాజశ్రేష్ఠుడా!; అర్థ=పురుషార్థములన్న; దుర్గ=పార్వతికి; నటేశ=నాట్య మూర్తి అయిన శివుడా!; సాహితీ=సాహిత్యమందు; సమరాంగణ= యుద్ధ క్షేత్రంలో; సార్వభౌమ=మహాచక్రవర్తీ! లేదా సాహిత్యమన్న యుద్ధ రంగంలో చక్రవర్తి; కృష్ణరాయేంద్ర=కృష్ణరాయప్రభూ!; కృతిన్=కావ్యాన్ని; వినిర్మింపుము=విశిష్టంగా నిర్మించుము; అనిరి=పండితులన్నారు.

ఈ పద్యమంతా రాయల వారి బిరుదులతో నిండి ఉంది. సాహితీ సమరాంగణ సార్వభౌమ అన్న మాటకు ఆనాడు పండితుల మధ్య వాదోపవాదాలు జరగటం, జయించిన వారు సన్మానింప బడటం ఉండేది. గౌడ డిండిమ భట్టును జయించి అతని కీర్తి చిహ్నమైన కంచు ఢక్కను పగుల గొట్టించిన శ్రీనాథుని ముత్యాల శాలలో ప్రౌఢ దేవరాయలు కనకాభిషేకంలో ముంచి తేల్చినట్లు కవి సార్వ భౌముడే చెప్పుకొన్నాడు. అలాగే తెనాలి రామకృష్ణుడున్ను.

*ఉదయంబస్తనగంబు సేతువు హిమవ్యూహంబునుం జుట్టిరా*
*విదితంబైన మహిన్ మహాంధ్రకవితా విద్యా బలప్రౌఢినీ*
*కెదురేరీ సరసార్థ బోధ ఘటనా హేలా పరిష్కార శా*
*రద నీ రూపము రామకృష్ణ కవిచంద్రా! సాంద్ర కీర్తీశ్వరా !*

అన్న పద్యంలో విద్యాబల ప్రౌఢి ప్రదర్శనలకా కాలం సమరాంగణంగా ఉన్నదన్న మాటే కదా!

అర్థ దుర్గానటేశ- సగం వామ భాగంలో దుర్గ కల శివుడా! అని చెప్పుకోవచ్చు. ధనమన్న దుర్గకు శివుడైన వాడని చెప్పవచ్చు. కాని దుర్గా శబ్దమే ఎందుకు ప్రయుక్తం కావాలి. ఈ అర్థాలు సమాధానం చెప్పలేవు. ఈ నాటికీ శిథిలాలైన దుర్గాల్లో ప్రథమ ద్వారం దగ్గర మహిషాసుర మర్దనిలేదా దుర్గ విగ్రహాలు కనిపిస్తాయి. అలాగే ఆంజనేయ స్వామి విగ్రహాలున్నాయి. ఈ విగ్రహాలు దుర్గాన్ని రక్షించడం కోసం పెట్టారు. రెండవాశ్వాసంలో రాజును గురించి వర్ణిస్తూ రాయలు అతివిచిత్రమైన అంశాలను చెప్పాడు. (2-39) 'శతకోటి మంత్ర, భృత్య భూతార్థ శాంభవ భూమికుండు' అని ఆరాజు శివుడు మంత్ర శక్తులను వశం చేసుకున్న వాడు గనుక.

వ. అని విన్నవించినఁ బ్రహృష్టాంత రంగుండ నై' 45

విన్నవించిన = వారా విధంగా మనవి చేయగా; ప్రహృష్ట = బాగా సంతోషపడ్డ; అంతరంగుండనై = హృదయము గలవాడనై.

తా : విన్న వించినన్, ఈమాట శ్రీకృష్ణ దేవరాయలు వ్రాసి ఉండడు అని వేదం వారు పై 'అంత' అని మార్చారు. కాని మహా చక్రవర్తి దగ్గర ఎంత పండితుడైనా మనవి చేసుకోవాల్సిందే.

## షష్ఠ్యంతాలు

క. అంభోధి కన్యకాకుచ
కుంభోంభిత ఘుసృణ మసృణ గురువక్షునకున్
జంభారి ముఖాధ్యక్షున
కంభో జాక్షునకు సామి హర్యక్షునకున్. 46

అంభోధి=సముద్రముయొక్క; కన్యకా=కూతురైన లక్ష్మియొక్క; కుచకుంభ=కుండల వంటి స్తనముల చేత; ఉంభిత=పూయబడ్డ; ఘుసృణ=కుంకుమచేత; మసృణ=స్నిగ్ధమైన; గురు=పెద్ద; వక్షునకున్= ఎదురు రొమ్ము కలవానికి; జంభారి=జంభాసురుని చంపిన ఇంద్రుడు; ముఖ=మొదలైనవారికి; అధ్యక్షునకున్=రాజైనవానికి; అంభోజ+ అక్షునకున్ =పద్మదళాల వంటి నేత్రాలు కలవానికి; సామి=సగం; హర్యక్షునకున్=సింహమైన వానికి.

తా ॥ లక్ష్మిదేవి కుచమండలమునందున్న కుంకుమ విష్ణువుయొక్క వక్షఃస్థలమున కంటినది దానిచేత ఆ రొమ్ము కాంతివంతమైంది. ఇంద్రాదులకు కూడా పరిపాలకుడైనవాడు, సగం శరీరంలో మృగరూపమున్న వాడూ అయిన శ్రీవేంకటేశ్వర స్వామికి.

అలం : వృత్త్యను ప్రాస.

విశే :- షష్ఠీ విభక్తి కల పద్యాలు కనుక వీటిని షష్ఠ్యంతాలు అంటారు.

క. మర్దిత కాళియ ఫణికిఁ గ
పర్ద భృదజ బింబితాచ్ఛపదనఖఘృణికిన్
దోర్దండ శార్ఙ్గ కిణి కఘ
కర్దమదిన మణికి దనుజ కరివర సృణికిన్. 47

మర్దిత=త్రొక్కబడ్డ; కాళియ ఫణికిన్=కాళియుడను పాము గలవానికి; కపర్దభృత్= జటా జూటంగల శివుడు; అజ=బ్రహ్మ; బింబిత=ప్రతిబింబించిన; అచ్ఛ=స్వచ్ఛమైన; పదనఖఘృణికిన్= పాదాల గోళ్ల కాంతులు గలవానికి; దోర్దండ=దండమువంటి బాహువుకల; శార్ఙ్గ= ఆపేరు గల ధనుస్సుయొక్క; కిణికిన్=కిణములు-కాయలు కలవానికి; అఘ=పాపమన్న; కర్దమ=బురదకు; దినమణికిన్=సూర్యుడైన వానికి; దనుజ= రాక్షసులనే; కరివర=మదించిన ఏనుగులకు; సృణికిన్=అంకుశమైన వానికి

తా : కాళియుని మర్దించిన వానికి, పాదనమస్కారం చేస్తున్న శివుడు, బ్రహ్మ ప్రతి బింబించిన కాలి గోళ్ల కాంతులు కలవానికి; శార్ఙ్గమనెడు ధనుస్సుయొక్క నారి తగలడం చేత కాయలు కాసిన భుజాదండం కలవానికి, పాపమన్న బురదను పిండించటంలో సూర్యుని వంటివాడు, రాక్షసులన్న మదపుటేనుగులకు అంకుశమైనవాడు అయిన శ్రీవేంకటేశ్వర స్వామికి.

అలం : అంత్యాను ప్రాస.

ఫణికిన్, ఘృణికిన్, కిణికిన్, సృణికిన్ అన్న కూర్పులో ఈ అలంకారం.

క. గుహ పుష్కరిణీ తట ఘన
గహన గుహాఖేట వంచక పులిందునకున్
ద్రుహిణాండ తుందున కయా
వహ దీర్ఘాపాంగ దృక్ కృపాస్యందునకున్. 48

గుహ= కుమారస్వామియొక్క; పుష్కరిణీ= కోనేటి యొక్క; తట=గట్టుపై; ఘన= గొప్ప; గహన= అడవులలోను; గుహా=గుహలలోను; ఆఖేట=వేటాడే; వంచక పులిందునకున్= మాయారూపియైన ఆటవికునకు; ద్రుహిణాండ= బ్రహ్మాండము; తుందునకున్= కడుపులో కలవానికి; అయ+ అవహ=శుభాలను చేకూర్చె; దీర్ఘ=పొడవైన; అప+ అంగ= కడకంటి; దృక్=చూపుయొక్క; కృప= దయయొక్క; స్యందునకున్= ప్రవాహం కలవానికి.

తా : కుమార పుష్కరిణి ప్రాంతమందలి అడవుల్లోనూ, గుహల్లోనూ, బోయవాని వేషంతో వేటాడే వానికి, సకలలోకాలు కడుపునం దున్న వానికి, శుభాలను ఒడగూర్చే దీర్ఘమైన కడగంటి చూపుల నుండి దయను వర్షించే వానికి శ్రీవేంకటేశ్వరునకు.

అలం : అంత్యాను ప్రాస.

''దీర్ఘాపాంగ కరుణ వాహ్యంధునకున్'' అని పాఠాంతరం.

కరుణవాహి= దయారసం. (వాహి= నీరు) ఈపాఠం వావిళ్ల వారిది

దీన్ని మార్చి పైరీతిగా వేదం వారు దృక్-కృప అని వ్రాశారు.

క. బంధుర రథాంగ ధారా
గంధ వహాప్త జ్వలచ్ఛిఖా పటల పున
స్సంధుక్షణ ఘృత రాహు ప
లాంధో సృక్స్రుతికి వేంకటాచల పతికిన్. 49

బంధుర= అందమైన; రథాంగ= సుదర్శనమన్న చక్రాయుధముయొక్క; ధార= అంచు యొక్క; గంధవహ= వాసనలను మోసే గాలియొక్క; ఆప్త= స్నేహితుడైన అగ్నియొక్క; జ్వలత్= మండుతున్న; శిఖా= జ్వాలలయొక్క; పటల= సమూహముయొక్క; పునః = తిరిగి, మరల; సంధుక్షణ= దహించేపనిలో; ఘృత= నేయి యైన; రాహు= రాహువన్న; పల+ అంధః= మాంసమే భోజనంగా గల రాక్షసునియొక్క; అసృక్= రక్తముయొక్క; స్రుతికిన్= స్రావము గల వానికి; వేంకటాచలపతికిన్= శ్రీవేంకటేశ్వర స్వామికి.

తా : సుదర్శన చక్రధారలన్న అగ్నిలో రాక్షసులను హోమం చేయడానికి రాహువుయొక్క కంఠరక్త స్రావము హోమద్రవ్యమైన నేయి అయినది. అంటే ఈ ఆజ్యధారచేత అగ్ని మరీ మండి మిగిలిన

రాక్షసులందరినీ దహించింది. శ్రీవేంకటేశ్వర స్వామికి పైవన్నీ విశేషణాలు. ఈ పద్యంలో అమృత మథన సమయంలో మోహినీ రూపధారిణియైన విష్ణువు రాహువుతల తెగనరికాడు ఆ కథను ఇక్కడ అనుసంధించు కోవాలి.

వ. నా విన్నవింపఁ బూను నాముక్త మాల్యదా మహా ప్రబంధమునకు ఁగథాక్రమం బెట్టి దనిన. 50

నావిన్నవింపంబూనుః నాయొక్క విన్నవించుటకు మొదలు పెట్టిన; ఆముక్త మాల్యదా; మహా ప్రబంధమునకున్ః మహాకావ్యానికి; కథాక్రమంబుః కథయొక్క వరుస; ఎట్టిది+ అనినః ఎలాంటిదంటే

కవి తన కావ్యానికి పెట్టిన పేరు ఆముక్త మాల్యద తప్ప విష్ణు చిత్తీయం కాదు. ఈ పేరు భక్తికి సంబంధించిన, మతవిషయంకాగా, కవి పెట్టిన పేరు రసానికి సంబంధించిప విషయం. ఆఃచక్కగా; ముక్తః ధరించినట్టి; మాల్యః కొప్పులోని దండను; దాః ఇచ్చినది; భగవంతున కర్పించినదిఃగోదాదేవి.

ఈ ఆముక్త మాల్యద అన్న సమాసము చూడి కుడుత్త నాచ్చియార్ తమిళ సమాసానికి సంస్కృతీకరణం. చూడిః చూడమునందు; కుడుత్తఃధరించిన; నాచ్చియార్ఃతల్లి. (అమ్మవారు).

## కావ్య ప్రారంభం

శ్రీవిలు బుత్తూరి సౌధ వర్ణన :

మ. లలితోద్యాన పరంపరా పిక శుకాలాప ప్రతిధ్వానము
ల్వలభీ నీలహరిన్మణీ పికశుక స్వాన భ్రమం బూన్ప మి
న్నులతో రాయు సువర్ణ సౌధముల నెందుం జూడ ఁ జెన్నొంది శ్రీ
విలుబుత్తూరు సెలంగుఁబాండ్య నగరోర్వీ రత్న సీమంతమై. 51

పాండ్యనగరఃమధురానగరము (దేశ రాజధానిగాగల); ఉర్వీఃదేశమునకు; రత్న సీమంతమైః రత్నాల పాపట బొట్టై శ్రీవిలుబుత్తూరుః ఆపేరుగల పట్టణము (ఒట్టి విలుపుత్తూరు కాదు. శ్రీ విలుపుత్తూరనే వాడుక. సంస్కృతంలో దీన్నే ధన్విపురమన్నారు; పద్యంలో ఇది ప్రధాన వాక్యం. మిగిలిన పద్యమంతా దీన్ని సమర్థించేది.) లలితఃమృదువైన; ఉద్యాన పరంపరా ఃతోటల వరుసలయందున్న; పికఃకోకిలలు; శుకఃచిలుకలు; ఆలాపఃకూతలయొక్క; ప్రతిధ్వానముల్ఃప్రతిధ్వనులు; వలభీః ఇంటివసారా ముందు చూరులలో ఉన్న లేదా గృహముయొక్క పై భాగమందున్న; నీలః ఇంద్రనీలములయొక్క; హరిత్+మణిః పచ్చల చేత (అందం కోసం మలచబడి అలంకరించ బడ్డ); పికశుకఃకోకిలలు, చిలుకల యొక్క; స్వానఃధ్వనులన్న; భ్రమన్ఃభ్రాంతి; పూన్పన్ఃకలిగించగా; మిన్నులతో రాయుః ఆకాశమంటే; సువర్ణ సౌధములన్ః బంగారు మేడలతో; ఎందున్ చూడన్ః ఎల్లెడలా (ప్రతిదానిలా) చెన్నొందిఃఅందగించి; చెలంగున్ఃప్రకాశిస్తుంది.

తా : మధురా నగరమే రాజధానిగా గల పాండ్యదేశమన్న భూదేవికి రత్నాల పాపట బొట్టుగా,

శ్రీవిలుపుత్తూరన్న పట్టణమున్నది. ఆనగరం చుట్టూ అందమైన ఉద్యానవనా లున్నాయి. అందులో ఉన్న కోకిలలు, చిలుకలు, పాడుతూ ఉంటే అవి నగరంలోని ఇండ్ల చూరుల్లో అలంకారార్థం అమర్చిన ఇంద్రనీలములు, పచ్చలతో చేసిన పికశుకాలు పాడితే ప్రతిధ్వనులు లాగా ఉన్నాయి. ఈ భ్రాంతి ప్రజలకు కల్పిస్తున్నది.

అసలు పాడుతున్నది ఉద్యానవనాలలో పక్షులు కాని నగరవీథులలో పోతున్న ప్రజలకు ఈకృత్రిమ శుకపికాలు పాడుతుంటే ఉద్యానవనాలు ప్రతిధ్వనిస్తున్నట్లు భ్రాంతి కలుగుతున్నది. ఆనగరంలో మిక్కిలి ఉన్నతమైన బంగారు మేడలున్నాయి. ఇందు చేత ఆ నగరం పాండ్యదేశానికి పాపట బొట్టుగా ఉన్నది.

విశే :- ఈ విలుపుత్తూరు ప్రస్తుతం మధురానగరానికి 70-80 కిలోమీటర్ల దూరంలో ఉంది. ఇక్కడే గోదాదేవి, ఆమెను పెంచిన తండ్రి పెరియాళ్వారు పుట్టి పెరిగారు . కనుక శ్రీవైష్ణవమతానికి ఆధార భూతులైన వీరిద్దరి జన్మ చేత ఆ నగరం ఉర్వీరత్న సీమంతమైనది.

నగరంలో ఉన్నత సౌధాలు; చుట్టూ తోటలు దేశ సౌభాగ్యాన్ని సంపదను సూచిస్తున్నాయి. ఆ రోజుల్లో ప్రతి ఊరు చెట్ల తోపులతో నిండారి పచ్చగా ఉండేది.

చ. మలిచి పయోజ కోశముల మాడ్కి నొనర్చిన పద్మరాగ పుం
గలశపు టెల్లిడాల్బొమిడికంబులతో నపరంజి యోడుబి
ల్లల నలవైజయంతము చలంబున గెల్వఁగ దంశితంబులై
నిలిచిన యట్లు మాడువు లనేకము లుల్లసిలు న్పురంబునన్. 52

పైపద్యంలో చెప్పబడ్డ విల్లుపుత్తూరులోని స్వర్ణ సౌధాల వర్ణన ఈ పద్యం. పురంబునన్= విల్లుపుత్తూరిలో; మాడువులు=మేడలు; అనేకములు=చాలా; ఉల్లసిల్లు =సొంపుగా ఉన్నాయి; (ఎందుచేత? అంటే సమాధానం చెప్పబడుతున్నది) మలిచి= చెక్కి; పయోజ కోశముల మాడ్కిన్= తామర మొగ్గల వలె; ఒనర్చిన=చేసిన; పద్మరాగపున్ =పద్మరాగ మణులతో (చేసిన); కలశపు=చెంబు; ఎల్లిడాల్= ఎల్లని కాంతి గల; బొమిడి కంబులతోన్=శిరస్త్రాణములతో (శిరమును దెబ్బతాకకుండా కాపాడేది గనుక); అపరంజి=బంగారు; ఓడు బిల్లలన్=పెంకులతో; అల= ఆప్రసిద్ధమైన; వైజయంతమున్ = ఇంద్రుని సౌధాన్ని; చలంబునన్=పట్టుదలతో; గెల్వగన్=జయించటానికి; దంశితంబులై=కవచాలు తొడిగినవై; నిలిచిన యట్లు=నిలబడ్డ రీతిగా. ( ఉల్లసిల్లున్)

తా : ఆ నగరంలో మేడలనేకం ఉన్నాయి. పద్మరాగపు మణులతో చెక్కిన కలశాల శిఖరాలు కలిగి బంగారు రంగు పెంకులు కప్పబడియున్నవి. ఆకాశమంత ఎత్తు కలిగి ఉన్నవి కనుక. ఇది ఎలా ఉందంటే ఒక మహోన్నతుడైన వీరుడు శిరస్త్రాణము, కవచము తొడుక్కొని యుద్ధసన్నద్ధుడై నిలబడి నట్లున్నది.

విశే : ఈ గృహనిర్మాణం నేటికీ కేరళదేశంలో కనిపిస్తుంది. పెద్దపెద్ద మాడువులు మంగుళూరు పెంకుతో కప్పబడి శిఖరాగ్రములో కలశాలు స్థాపించబడి నేటికీ మనకు కనిపిస్తున్న వాస్తు దృశ్యం. రాయలవారిలో ఆనాటి వాస్తువు అనేక యితర విషయాలతో బాటుగా కనిపించడం విశేషం.

అలం :- ఉత్ప్రేక్ష. ఎత్తుగా ఉన్న మేడలు యుద్ధ సన్నద్ధులై నిలబడ్డ వీరులు అన్నట్లున్నవి గనుక. ఈ పోలిక రాజస్వభావానికి తగియున్నది. కావ్యంలో, కవిలో ఉన్న రాజస్వభావం అనేకరీతులలో వ్యక్తమౌతుంది.

సీ. పాథోధి జలయుక్తిఁ బ్రాఁచి పట్టిన దిశా
కరులు నాఁదగు మరకతపుఁ గరులఁ,
గరులఁ దొండము సిక్కఁ గబళించి మ్రింగిన
హరులు నాఁ దొండ మొప్పగుఁ దదశ్మ
హరులు, దాచిన తాపలమర నేనుఁగు దోయి
నీరార్చు నపరంజి నీటి వ్రాఁత
శ్రీలు, దత్పార్శ్వ చిత్రిత శంఖ చక్రముల్
రత్నంపుఁదిన్నెలఁ బ్రతి ఫలింపఁ

తే॥ బెఱ పురాళి గృహశ్రీలఁ బెండ్లి యాడ
భవన రాజులు గట్టిన బాసిక మనఁ
దనరు, మణితోరణములతో ద్వార వితతిఁ
బరఁగు వీథులు పురి సూత్ర పట్టినట్లు. 53

పురిన్=నగరంలో;. పాథోధి=సముద్రమందలి; జల=నీటియొక్క; యుక్తిన్=కూడిక చేత; ప్రాచి పట్టిన= పాకుడు పట్టిన; దిశాకరులు నాన్=దిగ్గజములు అన్నట్లుగా; తగు=తగిన; మరకతపు (గరులన్=మరకతపు మణులతో చేసిన ఏనుగుల; కరుల= ఏనుగులయొక్క తొండము; చిక్కన్=బయటకు మిగిలినట్లుగా; కబళించి= ఆక్రమించి; మ్రింగిన=మ్రింగినట్టి; హరులు నాన్=సింహములో అనునట్లుగా; తొండము, ఒప్పు, అగు=తొండము క్రిందికి వ్రేలాడునట్టి; తత్= ఆ; అశ్మ=రాయి; తదశ్మ = ఆ మరకతపు మణితో చేసిన; హరులు=సింహాలు; తాచిన తాపలు=చెక్కిన మెట్లు; అమరన్=కుదురుగా ఉండగా; ఏనుగు దోయి= ఏనుగుల జంట; నీరు+ ఆర్చు=జలకమాడించి; అపరంజి =బంగారు; నీటివ్రాత=నీటితో వ్రాసిన; శ్రీలున్=లక్ష్మీదేవి ప్రతిమలు; తత్ పార్శ్వ= ఆ మేడల ద్వారాల కిరుపైపుల; చిత్రిత=చిత్రింపబడ్డ; శంఖ చక్రముల్=పాంచజన్యము, సుదర్శనము; రత్నంపుతిన్నెలన్=రత్నాల అరుగులలో; ప్రతిఫలింపన్=ప్రతిబింబింపగా; పెఱ= ఇతర; పుర=నగరాల; ఆళి= సమూహముయొక్క; గృహశ్రీలన్= సౌధసౌభాగ్యాలను; పెండ్లియాడన్= వివాహం చేసుకోవడానికి; భవన రాజులు= మేడలన్న రాజులు; కట్టిన= బంధింప జేసిన; బాసికము=వివాహ వేళ వధూవరులముఖాలకు మంగళార్థం కట్టుకొనేది; అనేది=అన్నట్టుగా; తనరు= ఒప్పెడు; మణి తోరణములతోన్ =రత్నాల తోరణాలతో (తోరణమంటే మామిడాకులు దండలు కట్టు కోవడానికి ద్వారం పైభాగంలో చెక్కబడ్డ 'ఆర్చి'), ద్వార వితతిన్=ద్వారాల

సమూహాలతో; వీధులు= బజారులు; సూత్రపట్టి నట్లు= దారం పట్టుకున్నట్లు; పరగున్= వంకర లేకుండా ఋజువుగా ఉన్నాయి

తా : ఆ నగరంలో వీధులు దారం పట్టు కున్నట్లుగా వంకరలేకుండా ఋజువుగా ఉన్నాయి. ఆ వీధుల ప్రక్క ద్వారాలు వాటిక్రిందుగా మెట్లవరుసలు ఎలా ఉన్నాయంటే ఆ మెట్లకిరుప్రక్కలా అలంకారార్థంగా నిర్మించబడ్డ పచ్చల ఏనుగులు, వాటిపైన పచ్చల సింహాలు ఉన్నాయి. ఆ ఏనుగులు పచ్చలతో చెక్క బడినందున నిత్యమూ సముద్రజలంలో ఉండడం వలన ప్రాకుడు పట్టిన ఏనుగులులా ఉన్నాయి. ఆ ఏనుగుల తొండాలు మాత్రం తొండం మిగిల్చి తలలు కబళించిన పచ్చల సింహాలున్నాయి. ఇక మెట్లవరుసలు బంగారు జిలుగు నీటితో చిత్రింపబడ్డ ఏనుగులజంట తొండాలతో నీరు చిమ్ముతూ అభిషేకిస్తున్న లక్ష్మీదేవి ప్రతిమలతో సొగసుగా ఉన్నాయి. ద్వారాల పార్శ్వాలు శంఖ చక్రాలు అలంకరింపబడియున్నాయి అవి క్రిందనున్న రత్నాల అరుగులలో ప్రతిబింబిస్తున్నాయి. ద్వారాలపై మణితోరణాలు ఎత్తున కనిపిస్తున్నాయి. అవి ఎలా ఉన్నాయంటే ఇతర నగరాల గృహలక్ష్ములను వివాహం చేసుకోవడానికి ఈనగరం భవనాలన్న రాకుమారులు కట్టిన బాసికాలు అన్నట్లుగా ఉన్నాయి.

విశే : ఈపద్యంలో నాటి సౌధనిర్మాణ స్వరూపం అద్దంలోని ప్రతిబింబంలాగా వర్ణింప బడినది.

మనం వీధులలో నుండి గృహాలలోనికి పోతున్నామని భావించాలి. ఆ గృహానికి ఇరువైపుల రతనాల తిన్నెలున్నాయి. మధ్యలో మెట్లనుండి ద్వారం సమీపించాలి. ఈ మెట్లమీద గజలక్ష్మి బొమ్మలు చెక్కబడి యున్నాయి. ఆవిడను జలంతో అభిషేకిస్తున్నట్లు బంగారు జిలుగు నీటితో చిత్రింప బడ్డాయి. మెట్లకు అటూ ఇటూ రెండువైపులా మోకాటి ఎత్తున గోడలున్నాయి. ఆ గోడల పైభాగాన ఏనుగు తలలు, వాటిని మింగుతున్న సింహాల తలలు క్రింది భాగమంతా ఆ ఏనుగుల తొండాలు వ్రేలాడు తున్నట్లుగా నిర్మింపబడియుంది. ఈ మెట్లెక్కి పైకి వెళ్లాము. ఆ ద్వారం ఇరువైపులా శంఖచక్రాలు చెక్కింపబడియున్నాయి. ద్వార అగ్రభాగాన మణితోరణ మున్నది. అది బాసికం లాగా ఉన్నది. ఈ పోలికను వదిలితే వర్ణన మంతా నాటి సౌధనిర్మాణ వాస్తువును అద్భుతంగా చిత్రిస్తున్నది. నేటికీ పల్లెలలో అక్కడక్కడ ఈ విధమైన నిర్మాణాలు కనిపిస్తున్నాయి. నేటిమన వాస్తు నిర్మాణమంతా పాశ్చాత్య అనుసరణంతో వచ్చింది. భారతీయ గృహ నిర్మాణ వైఖరి మనదేశ వాతావరణానికి అనుకూలంగా వచ్చింది. ఈ దృష్టితో ఈ పద్యాన్ని చూడాలి. పై పద్యంలో ఇంటిపై కప్పు - అంతకుముందు పద్యంలో ముంజూరూ వర్ణింపబడ్డాయి.

అలం : ఉత్ప్రేక్ష. గృహ వైభవం అద్భుతంగా చిత్రింప బడింది ఉదాత్తం. శంఖచక్రాలు, లక్ష్మీదేవి ప్రతిమలు ఉండడం ఆ నగరం పరమ భాగవతుల నివాసమని సూచన. రాబోతున్న విష్ణు చిత్తుని వర్ణన కిది సూచిక.

చ. పగడపుఁ జాయ చెందిరము ఁ బ్రామిన పాండ్యవధూ కుచంబులన్
నగు నరుణంపు బొండ్లముల నారికెడంబులు వజ్ర కుట్టిమం

బగు పథముం జెలంగు భవనాహృత శేషిత రత్న రక్షక
భ్రగ తరు సంతతిం బ్రథమ భార్య c బురిన్ గిఱవుంచె వార్ధినాన్. 54

పగడపుం జాయ=పగడాల వన్నె కల; చెందిరము=కుంకుమ; ప్రామిన=పూసిన; పాండ్య వధూ=పాండ్య దేశ స్త్రీలయొక్క, కుచంబులన్=స్తనాలను; నగు=అపహసించు,తిరస్కరించు; అరుణంపు= ఎర్రని; బొండ్లములను=లేత కొబ్బరి కాయలతో; వజ్ర కుట్టిమంబు=వజ్రాల తిన్నెలు కల; అగు పథమున్=అయిన మార్గము, భవన=మేడల నుండి; ఆహృత=తీసికొని రాబడిన వాటినుండి; శేషిత=మిగిలిన; రత్న రక్షకున్=రత్నాలను కాపలా కాయడం కోసం; వార్ధి=సముద్రుడు; అభ్రగ= ఆకాశంలో తిరిగేవారగు దేవతలయొక్క; తరు=చెట్లయొక్క; సంతతిన్=సమూహాన్ని; ప్రథమ భార్యన్= మొదటి భార్యను (గంగాదేవిని); పురిన్= ఆ విలుపుత్తూరులో; కిఱవు= కుదవ; ఉంచెన్ నాన్= ఉంచెనో అన్నట్లు; చెలగున్= ఒప్పుతున్నవి.

తా : ఆ నగరంలో వజ్రాలతో కట్టిన తిన్నెలున్న యింటిలోపలకు తీర్చిన దారులును ఇరు ప్రక్కల నున్న కొబ్బరి చెట్లు ఎలా ఉన్నాయంటే సముద్రుడు తాను ఊరి నుండి తెచ్చుకోగా మిగిలిన రత్నాల కోసం కుదువగా తన పెద్ద భార్య అయిన గంగను, పుత్రులగు కల్పవృక్షాలను నగరంలో ఉంచాడా అన్నట్లుగా ఉన్నాయి.

అప్పుతీసుకొన్నవాడు కుదువ పెట్టడంలోక రీతి కనుక రత్నాకరుడే భవనాలనుండి అప్పుతెచ్చుకొన్నాడు. తీర్చే దాకా గంగను కల్పవృక్షాలను కుదువ పెట్టాడు. 2-3లో నాల్గో పాదంతో పోల్చు.

విశే : పై పద్యంలో ద్వారం వరకు భవన వర్ణనం చేసి కవి యీపద్యంలో ద్వారం నుండి ఇంటిలోపలకు వేసినదారిని వర్ణిస్తున్నాడు. ప్రహరీ ద్వారం దగ్గరినుండి గృహ ప్రధాన ద్వారం దాకా మధ్యలో ప్రాంగణం వదలి ఇండ్లు కట్టు కోవడం మన కలవాటు. కనుక ఆ దారి వర్ణన యీ పద్యం. ఆ దారి గంగలాగా తెల్లగా రాళ్లచేత కట్టబడిఉంది. అటూ యిటూ కల్పవృక్షాల్లాగా కొబ్బరి చెట్ల వరుస లున్నాయి. ఆ చెట్లకు ఎర్రని బొండా లున్నాయి. అవి పాండ్య దేశస్త్రీలయొక్క కుంకుమ పూసిన స్తనాల వలె ఉన్నాయి. ఈ పద్యం కూడా భవన వర్ణనమే.

అలం : ఉపమ, ఉత్ప్రేక్ష.

ఈనాటికి గృహనిర్మాణం మనకు ఇలాగే ఉన్నది.

క. కోరకిత నారికేళ
క్ష్మారుహములు రత్న కుట్టిమంబులc దోఁపన్
ద్వారము లయత్న కృత శృం
గారముఁగను నలికి ముగ్గు ఘటియించి రనన్. 55

కోరకిత=మొగ్గ తొడిగిన; నారికేళక్ష్మారుహవయులు=కొబ్బరి చెట్లు; క్ష్మా= భూమి నుండి; రుహం=పుట్టినది(చెట్టు); రత్న కుట్టిమంబులన్=రత్నాల అరుగులలో; తోపన్=ప్రతిబింబించగా; ద్వారములు= వాకిళ్లు; అయత్న కృత= ప్రయత్నం లేకుండానే; శృంగారముగను=అందంగా; అలికి=పేడతో పామి; ముగ్గుఘటియించిరనన్= ముగ్గులు పెట్టారో అన్నట్లుగా ఉన్నవి అని క్రియను పూరించు కోవాలి లేదా శృంగారమున్= అందాన్ని; కనున్= పొందుతున్నవి అని యైనా అన్వయించు కోవాలి.

తా : పై పద్యంలో చెప్పిన భావమే క్రింది పద్యంలో విస్తృతం చేయబడు తున్నది. ఆ వజ్రాలు పొదిగిన దారిలో లేదా తిన్నెలలో మొగ్గ తొడిగిన కొబ్బరి చెట్లు ప్రతిబింబిస్తున్నాయి. అవి ఎలాఉన్నవంటే ఎవరో దేవతలు వచ్చి గృహ స్త్రీలతో పనిలేకుండానే అలికి ముగ్గు పెడితే తమ ప్రయత్నం లేకుండానే సహజమైన సౌందర్యాన్ని ద్వారాలు పొందుతున్నవి.

విశే : ఇది చాలా అందమైన భావం. కొబ్బరి చెట్ల పూత తెల్లని పొడవైన కుచ్చులుగా పెద్ద దొన్నె ఆకునుండి సాగి వస్తాయి. ఆ కుచ్చులకు లేత వడ్ల గింజలలాంటి పువ్వులుంటాయి. ఇంచుమించు యీ కొబ్బరి పూలు అప్పుడే వరిపొట్ట చీల్చుకొని బయట పడుతున్న లేత వడ్ల కంకుల్లా ఉంటాయి. కాకపోతే కొబ్బరిపూలు చాలా పెద్దవి. కనుక ఈ పూలు క్రింది రత్నాల తిన్నెలలో ప్రతిబింబించి ముగ్గులు పెట్టినట్లున్నాయనడం చాలా సహజమైన వర్ణన.కనుక మొదటి రెండు పాదాలలో స్వభావోక్తి అలంకారం, కాగా ఆధారంగా క్రింది రెండు పాదాలలో ఉత్ప్రేక్ష పుట్టింది. ఉత్ప్రేక్ష అలంకారానికి స్వభావోక్తి పుష్టిని కలిగిస్తున్నది. ఇంతవరకు గృహవర్ణన సాగింది.

మొదటి పద్యంలో ఉద్యాన వనాలతో ఆవరింప బడ్డ శ్రీ విలుపుత్తూరు. అక్కడ ఉన్న బంగారు మేడలను చెప్పి, రెండవ పద్యంలో ఆ మేడల ఔన్నత్యాన్ని, స్వరూపాన్ని వర్ణించి, మూడవపద్యంలో వీథినుండి ప్రహరీ ద్వారం దాకా ఉన్న శిల్పాన్ని వర్ణించి, తరువాతి పద్యంలో ప్రధాన ద్వారం నుండి ఇంటిలోపలికి పోయే దారి అటూ ఇటూ కొబ్బరిచెట్ల వరుసలను చెప్పి, ఆ కొబ్బరి చెట్లు గృహాంగణమును తన సొబగుతో అలంకరించడమే కాక రత్నాల తిన్నెలలో ప్రతిబింబించి ప్రాంగణాన్ని ముగ్గులతో వన్నె పెడుతున్నవి. ఈ మొత్తం కలిపి చూస్తే ఒక గృహ నిర్మాణ సౌందర్యం గోచరిస్తుంది. పాఠకుడు శ్రీ విలుపుత్తూరు వీథులలో నుండి ద్వారం గుండా గృహ ప్రాంగణ పథం మీదుగా ఇంటిలోకి ప్రవేశించాడన్న మాట. ఈ పద్ధతిగా ప్రాచీన కవు లెవరూ వర్ణించలేదు. ఈ నాల్గు పద్యాలు సౌధ వర్ణన.

మ. శయపూజాంబుజముల్ ఘటిం దడఁబడన్, జన్దోయి లేఁ గౌనుపై
దయ ఁ దప్పన్ బసుపాడి, పొగడపు బాదంబొప్పఁ జెంగల్వ డి
గ్గియ నీరచ్యుత మజ్జనార్థము గటింగీలించి దివ్యప్రబం
ధ, యుగాస్యల్ ద్రవిడాంగనల్ నడుతు రుద్యానంపు లోఁ త్రోవలన్. 56

ద్రవిడ+ అంగనల్= ద్రావిడస్త్రీలు; పసుపు+ ఆడి=పసుపు పూసుకొని స్నానం చేసి; (పసుపాడి అంటే స్నానం చేసి అని అర్థం. అంటే పసుపు పూసుకొని స్నానం చేయడం ప్రాచీన నాగరికత కనుక); చెంగల్వడిగ్గియ=

ఎఱ్ఱకలువలు విచ్చిన బావి; నీరు= నీటిని; అచ్యుత మజ్జనార్థము = శ్రీహరియొక్క అభిషేకం కోసం; కటిన్=నడుముపై; కీలించి=మోపి; శయ=చేతిలో నున్న; పూజ+ అంబుజముల్= పూజకోసం తేబడుతున్న కలువపూలు; ఘటిన్=కుండలో; తడబడన్=కొట్టు కొంటుండగా; చన్+దోయి=కుచ యుగ్మము; లేఁగౌనుపైన్= లేతనడుము మీద; దయన్ తప్పన్= జారి తప్పి పోగా; దివ్య ప్రబంధ= ఆళ్వారులు వ్రాసిన దైవస్తుతులతో; యుక్= కూడుకున్న; ఆస్యల్=ముఖాలున్న వారై; ఉద్యానంపులోత్రోవలన్=తోటల లోపలి దారులలో; పాగడపు= ఒకరకమైన కడియాలు గల; పాదంబు=చరణము; ఒప్పన్=తళుక్కుమని అందగించగా, నడుతురు= నడుస్తారు.

తా : ఊరి చుట్టూ తోటలున్నాయని మొదటి పద్యంలోనే చెప్పాడు కనుక ఆతోటలలో నడబావులున్నాయి. అందులో ఎఱ్ఱకలువలు వికసించి ఉన్నాయి. అందులో దిగి స్నానం చేసి పాండ్యస్త్రీలు శ్రీహరి అభిషేకం కోసం నీరు నింపిన కుండలను రొండిపై పెట్టు కొని చేతిలో ఎఱ్ర కలువపూలు కుండనీటిలో తడబడుతుండగా కడియాలతో అందమైన పాదాలు ప్రకాశిస్తుండగా, ఆళ్వారులు రచించిన దివ్యప్రబంధాలు పాడుకుంటూ తోటలోపలి దారుల నుండి వస్తున్నారు..

విశే : సహజసుందరంగా వర్ణించటంలో కృష్ణదేవరాయలు చాలా నిపుణులు. ఆ ఊరి స్త్రీలు నిత్యం ప్రాతః కాలంలో చేసే పనులలో మొదటిది యిందులో వర్ణింపబడినది. అప్పుడే స్నానం చేసి బావి నుండి పైకి వచ్చినవాళ్ల ఆర్ద్ర సౌందర్యం ఈపద్యంలో వర్ణింప బడింది. శరీరం మీద తడి ఆరలేదు. అప్పటి అందం ఈ పద్యంలో వర్ణింప బడింది. చన్దోయి ---- దయ తప్పన్ కుచచలనం. ఆర్ద్ర ఆచ్ఛాదనం చేత స్పష్టంగా కనిపిస్తున్నది. రొండి పై నీటి కుండలో ఎఱ్ఱకలువలు తడబడుతున్నట్లుగా ఈ స్తనద్వయం కూడా తడబడుతున్నది. పాగడపు పాదంబొప్పన్=పరిశుభ్రంగా కడగ బడ్డ పాదం కనుక అరుణవర్ణం కొట్టవచ్చినట్లు ప్రకాశిస్తున్నదని తాత్పర్యం, వారిముఖాలు దివ్యప్రబంధ వాసనలతో అందంగా ఉన్నాయి.

దివ్యప్రబంధాలంటే పన్నెండు మంది ఆళ్వారులు ఆయాక్షేత్రాలను అక్కడున్న దేవతామూర్తులను దర్శించి చేసిన వర్ణనలు లేదా స్తుతులు వీటన్నిటిని కలిపి నాలాయిర దివ్యప్రబంధ మంటారు. (నాలాయిర=నాలుగు వేలు). ఆ దివ్య ప్రబంధాలలో క్షేత్రవర్ణనలు అన్నీ సహజ ప్రకృతి వర్ణనలతో చాలా అందంగా కవితా మయంగా ఉంటాయి. ఆ ఛాయలే రాయలవారి విలుపుత్తూరు వర్ణనల్లో ఉన్నాయి. అంటే విలుబుత్తూరు వర్ణన ఒక దివ్యప్రబంధ మన్నమాట. లోత్రోవలో-అనటం వల్ల పురుషులు ఆ ఛాయల్లో లేరని ధ్వని. పైపద్యం దాకా గృహవర్ణన- ఇక్కడ నుండి గ్రామపరిసరాల వర్ణనం

మ. కలయ న్నీలమయంపుఁదల్లియొుఱ దాకం దేట నీరొప్పు ర
థ్యల కూపంబుల మీఁలఁ జూచి వలభి వ్యాసంగి తుంగ ద్రుశా
ఖలలో నుండి గుభాలునన్ లకుముకుల్ క్రందై పడున్ లేచుఁ బ్రు
చ్చిలి గేహేందిర ద్రావిడీ పరిచితిం జెండాడు చందంబునన్. 57

గేహ+ ఇందిర=గృహలక్ష్మి; ప్రుచ్చిలి=చాటునదాగు కొని; ద్రావిడీ పరిచితిన్= పరిచయమున్న ద్రావిడ

స్త్రీలతో; చెండు=బంతి; ఆడు చందంబునన్= ఆడుతున్నదో అన్నట్లుగా; లకుముకుల్= ఆ పేరు గల పిట్టలు (సంస్కృతంలో టిట్టిభ మంటారు) కలయన్= అంతటా; నీలమయంపు= నీలమణితో చేయబడ్డ; తల్లి- ఒర=పైనున్న పెద్ద ఒఱ; తాకన్=తగిలేటట్లు; తేటనీరు=స్వచ్ఛజలం; ఒప్పు=ప్రకాశించే; రథ్యలకూపంబులన్=వీథి బావులలో; మీలన్=చేపలను; చూచి (లకుముకులు కర్త) వలభి= ఇంటి ముందు చూరులలో; వ్యాసంగి=కూడు కొని యున్న; తుంగ= ఎత్తైన; ద్రు=చెట్లయొక్క; శాఖలలో నుండి= కొమ్మలలోనుండి; గుభాలునన్= హఠాత్తుగా (ధ్వన్యనుకరణ శబ్దం) అలాంటిధ్వని చేస్తున్న గుభాలు మన్న ధ్వనిని అనుకరిస్తూ; క్రందై=గుంపుగా; పడున్, లేచున్=పడుతున్నవి, లేస్తున్నవి.

తా. : ఆవూళ్లో వీథి బావులలో చేపలున్నాయి. వాటికోసం యింటి ముందు పై భాగం దాకా పెరిగిన చెట్ల కొమ్మలలో లకుముకి పిట్టలు కూర్చుండి ఈ చేపల కోసం గుబాలున బావినీళ్లలోకి దూకి ఆ చేపలను ముక్కులతో కరచుకొని తిరిగి చెట్ల కొమ్మలలోకి ఎగిరి పోతున్నాయి. ఇదీ దృశ్యం. ఇది ఎలావున్నదంటే గృహలక్ష్మి గృహస్త్రీలయందున్న స్నేహం వల్ల తాను కనిపించకుండా బంతి ఆట ఆడుతున్నదా అన్నట్లుంది. ఆ బంతి లకుముకి పిట్టల గుంపు. ఆడుతున్న మనిషి కనిపించకుండా బంతి మాత్రమే కనబడుతున్నదని అర్థం.

విశే : లకుముకి పిట్టలకు బంతులకు పోలిక. రెండూ ఒకే రకంగా ఉంటాయి కనుక. ఇంటి చూరులకు తాకుతున్న చెట్టు కొమ్మలు అనడం వల్ల ఆ కొమ్మలే గేహేందిర హస్తాలు. హస్తానికి లేత చిగురాకులు కల కొమ్మకు పోలిక.

అభిజ్ఞాన శాకుంతలంలో కాళి దాసన్నాడు మణి కట్టువరకు బయటకు చాచిన వనదేవతల హస్త భాగాలతో వనదేవత వృక్ష కిసలయములే హస్తాంగుళులుగా కలిగినది. అందుచేత మణి కట్టువరకే చేయి చాపి అని వర్ణించినట్లు ఇక్కడ రాయల వారు కూడా అదే విషయాన్ని ధ్వనిస్తున్నారు. ద్రావిడ స్త్రీల బంతి ఆట సుప్రసిద్ధమైనది. గోదాదేవి కథలో మరలా ఈ అంశం స్పృశింపబడుతుంది.

గృహలక్ష్మి రాజ్యలక్ష్మిలాగా అదృశ్యరూపంలో ఉండే నిండుదనం – శోభ

మ.స్ర. స్వనిలింపావాస దత్వాశన దతల మిథస్తార తమ్యంబు లీరెం
డును దీనుల్గాంచు నమ్మాడువులన యడుగందోచు నుద్యద్రతోన్మే
షన సిద్ధ ద్వంద్వ బృందాలయ బిలతట కల్యాణ మంథాద్రులో నా
వన జాక్ష స్యందన ద్వంద్వము లిఖిత నరావాప్త దాంపత్యమొప్పున్. 58

లిఖిత=చిత్రింపబడ్డ; నర= స్త్రీ పురుషులచేత; అవాప్త=పొందబడ్డ; దాంపత్యము= భార్యాభర్తృ భావము; వనజ+ అక్ష=తామరపూల వంటి నేత్రాలున్న లక్ష్మీ నారాయణుల యొక్క; స్యందన= రథాలయొక్క; ద్వంద్వము=జంట; స్వ= తమయొక్క; నిలింప= దేవతలకు; ఆవాసదత్వ=నివాసమిచ్చుటయొక్క; అశనదతల= ఆహారమిచ్చుట; మిథః= పరస్పరం; తారతమ్యముల్= ఎక్కువ తక్కువలు; (ఈ రెండును నివాస, ఆహారమిచ్చుట అన్నవి); దీనుల్=పేదలు; కాంచు=పొందు; అమ్మాడువులన= ఆ మేడలనే

(దీనులనడానికి బదులు పాఠాంతరంగా మిన్నులని కొన్నిచోట్ల కనిపిస్తున్నది. ఆకాశమంత ఎత్తున్న మేడలని అర్థం. ఇది మొదటి పద్యంలో చెప్పబడ్డ మిన్నులతో వ్రాయు సువర్ణ సౌధముల్ అన్న మాటకు పొసగి వున్నది) అడుగన్= అడగటానికై; తోచు=కనిపిస్తున్న; (డోఁగు అని వేదం వారి పాఠం. దాని ప్రకారం మోకాళ్లతో నడచి వచ్చి అని అర్థం చెప్పి ఇది వినయాన్ని సూచిస్తున్నదని వారు వ్రాశారు) ఉద్యత్= అందమైన, రత= కామక్రీడలలో; ఉన్మేళన= పెనవేసుకొన్న; సిద్ధద్వంద్వ= సిద్ధుల జంటలయొక్క; బృంద= సమూహంయొక్క; ఆలయ= నివాసమైన; బిల= గుహలు; తట= ఒడ్లు కల; కళ్యాణ= బంగారు; మంథ= సముద్రాన్ని మథించిన; అద్రులో= కొండలలో; నాన్= అన్నట్లుగా, ఒప్పున్= ప్రకాశిస్తున్నవి.

తా : ఆ విల్లుపుత్తూరులో లక్ష్మీనారాయణులకు చెరొక రథమున్నది. వాటిపై నరనారీ ద్వంద్వకామ క్రీడలు చెక్కబడి యున్నవి. అవి ఎలా ఉన్నాయంటే దేవతలకు నివాసమిచ్చిన మేరుపర్వతం, సముద్రాన్ని మథించి సుధనిచ్చిన మంధర పర్వతం, ఈ రెంటియొక్క చరియలలో, గుహలలో సిద్ధదంపతులు క్రీడిస్తున్నారు అలాంటి ఆ రెండు పర్వతాలు విలుపుత్తూరులో మిన్నులంటే సౌధాలు కూడా దీనులైన వారికి నివాసమూ, ఆహారమూ ఇస్తున్నవని తెలిసి తారతమ్య పరీక్ష కోసం ఆవూరు వచ్చాయో అన్నట్లు ఆ రథాలున్నాయి. అంటే ఉన్నతమైన రథాలు మేరు, మంధర పర్వతాల్లాగా ఉన్నాయి. ఆ రథాలమీదున్న నరనారీ ద్వంద్వం పర్వత బిలాల్లో క్రీడిస్తున్న సిద్ధదంపతులట్లున్నారు. ఆ రథాలు రెండూ ఉన్నత సౌధాల మధ్య కొండల్లాగా ఉన్నాయి.

విశే :- దేవతలను ఊరేగించడానికి దేవాలయాల్లో రథాలుండడం ప్రసిద్ధి. ఈ ఊరేగింపు వేడుకలు నేటికీ మన ఊళ్లలో ఉన్నవే. విజయనగరంలో విరూపాక్షుని తేరు తిరుణాల జగత్ప్రసిద్ధమైంది. పండుగలలో ప్రజలు దేవతా విగ్రహాలను కూర్చోబెట్టి అలంకరించిన రథాలను లాగటం నాల్గవ ఆశ్వాసంలో వర్షర్తువు సందర్భంగా 4-93వ పద్యంలో వర్ణింప బడింది.

అలం : ఉత్ప్రేక్ష. ద్వితీయ పాదంలో రెండునూ - అడుగందోచు ఈ బిందుపూర్వక అక్షరాలకు యతి మైత్రి పాటింపబడింది

## గుడిచేటుల వర్ణన

సీ. సవలయ ధ్వని గాఁగ సారె వ్రేయు నదల్పు
    యతినైన గుండె జల్లన c గలంప,
సుడిసిన మొగమెత్తి చూడకుండు పరాకు
    కుసుమ బాణుని నైన cగువిటు c జేయ
శ్రీకార్యపరుల c గాంచిన లేచి మ్రొక్కు నం
    జలికి నింద్రుండు నక్కొలువు c గోర
హరిగృహోపసర శంఖాక్కర్ణనకు cద్రిప్పుc
    గడగంటి జిగి ప్రజ c గాఁడి పాఱc

తే॥ గవఱు లుంకించి వ్రేయఁగొప్పువిడ నవలి
కరమున నమర్పఁబైటలో మరుని బటువు
బిల్లక్రియ c బట్టుఁగంచెల c బిగువు c జన్ను
నిక్క c దిన్నెల c బాత్రాళి నెత్తమాడు. 59

సవలయధ్వని=గాజుల గలగలతో కూడు కొన్నది, కాగన్=అగునట్లుగా; సారెన్=పాచికను; వ్రేయు=వేసేటపుడు చేసే; అదల్పు=అదలింపు; యతినైన=సన్యాసినైన; గుండె; జల్లు అనన్=జల్లుమనగా; కలంపన్=కలత పొందింపగా; సుడిసినన్= ఎదురుపడగా; మొగము= ముఖము; ఎత్తి=పైకెత్తి, చూడకుండు=చూడకుండునట్టి; పరాకు=మైమరుపు; కుసుమ బాణుని= పూలే బాణాలుగా గల మన్మథుని; అయిన=సైతం; విటున్=క్షుద్రుడైన విటునిగా; చేయన్=చేయగా; శ్రీ కార్యపరులన్=(దేవాలయాల్లో కైంకర్యం చేసే శ్రీభాగవతులను) కాంచినన్=చూస్తే, లేచి= ఆటను ఆపి నిలబడి, మ్రొక్కు అంజలికిన్= నమస్కరింపగా పట్టిన అంజలికోసం; ఇంద్రుండున్= ఇంద్రుడు సైతం; ఆ కొలువున్= దేవాలయాల్లో భక్తులు చేసే కైంకర్యాన్ని; కోరన్= కోరుకోగా, లేదా ఆ నమస్కారం పెట్టేవారి కొలువును కోరు కోగా; హరి గృహ=శ్రీహరి కోవెలలో; అవసర=పూజానైవేద్య సమయాలలో మ్రోగే; శంఖ= శంఖధ్వనియొక్క; ఆకర్ణనకున్=వినుటకై; త్రిప్పు=త్రిప్పునట్టి; కడగంటి జిగి= కంటి కొసల యందున్న తళుకు; ప్రజన్=ప్రజలను; గాఁడిపాఱన్= దూసుకొనిపోగా; గవఱులు=పాచికలను; ఉంకించి=ప్రయత్నించి ఊపి; వ్రేయన్=గిలకరించి వేయగా, కొప్పు=కబరీభరం; అవియన్=విడిపోగా; అవలికరమునన్=అవతలి చేత్తో; అమర్పన్= కొప్పుముడి పెట్టగా; పైటలోన్=పయ్యెద నుండి; మరుని=మన్మథునియొక్క; బటువు బిల్ల క్రియన్=దృఢమైన గుండ్రని దిండులాగా; పట్టు కంచెలన్=పట్టు రవికలో; బిగువుఁ జన్ను= కఠినస్తనము; నిక్కన్=నిక్కపొడుచుకోగా; తిన్నెలన్=అరుగుల మీద; పాత్ర+ ఆళి=వేశ్యలసమూహం; నెత్తము+ ఆడున్=జూదమాడును.

తా : వీధి అరుగులపై కూర్చొని వేశ్యలు జూదమాడుతున్న వైనం ఈ పద్యంలో అద్భుతంగా చిత్రింపబడింది. వారు సారెలు వేస్తున్నపుడు చేసే ధ్వనులు సన్యాసులు గుండె కోతగా ఉన్నది. దారిలో మన్మథుడు ఎదురు పడ్డా మొగం ఎత్తి చూడకుండా ఉండే పరాకు మన్మథుని సైతం వాపిరి గొట్టు విటుని చేస్తున్నది. వీరు తిన్నెల మీద కూర్చొని యుండగా దేవాలయంలో కైంకర్యం చేసే శ్రీభాగవతులు దారినే పోతున్నపుడు లేచి అంజలిస్తారు. ఆ అంజలి తనకు లభించలేదే అని ఇంద్రుడు దేవాలయ కైంకర్యాన్ని అభిలషిస్తున్నాడు. దేవాలయంలో పూజాసమయంలో మ్రోగేశంఖధ్వనికి కడకన్నులు ప్రక్కకు త్రిప్పగా వాటి ధాళధళ్యము ప్రజల హృదయాలను కోసుకొని పోతున్నది. ఒక చేత్తో సారెలు ఉంకించి వేసేటప్పటికి కొప్పు విడిపోయింది. మరొక చేత్తో దాన్ని ముడుచు కోవడానికి చేయి పైకెత్తేసరికి సందులో నుండి పట్టు రవికలో నిక్కబొడుచుకున్న స్తనవృత్తము మన్మథుడు మోచేతిక్రింద వేసుకొన్న గుండ్రని దిండులా ఉంది.

విశే : ఇక్కడ నుండి వచ్చే రెండు, మూడు పద్యాలలో విలుపుత్తూరు వేశ్యలు వర్ణింప బడుతున్నారు.

పూర్వకాలం దేవాలయాల్లో ఆటపాటలకు వీరుండేవారు. వీరినే దేవదాసీలు అన్నారు. దీనికే తెలుగు పేరు 'గుడి చేటి'. ఈ సంప్రదాయ స్వరూప ప్రతీకయే వేయిపడగలులో గిరిక పాత్ర. తొలిరోజుల్లో వారు కేవలం దైవ కైంకర్యం కోసమే తమను తాము సమర్పించు కొన్నారు. ఇందుకే యీ విలుపుత్తూరు వేశ్యలను కవయిత్రులుగా, నాట్యకత్తెలుగా, సుందరులుగా చిత్రించినాడు తప్ప చెడుగా చిత్రింప లేదు. దీనికి వ్యతిరేకంగా ద్వితీయాశ్వాస మధురా నగర పుష్పలావికల వర్ణనలతో పోల్చి చూస్తే ఇక్కడ వీరి పవిత్రత అర్థమవుతుంది. ప్రాచీన వాఙ్మయంలో యీ వేశ్యలు గొప్పకళా తపస్వినులుగా, నాగరికతా సంస్కృతులకు నిధులుగానే చిత్రింపబడ్డారు. ఈ వర్ణన ఆ సంస్కృతి పవిత్రంగా ఉన్న రోజుల్లో నిది

అలం : స్వభావోక్తి.

ఎత్తుగీతిలో బిగువు చన్నుతో మరునిఁ బటువు బిల్ల ఉపమింపబడింది కనుక ఉపమాలంకారం.

సీ. వీడెంపుఁ బలుకెంపు విరిసి వెన్నెల గాయ
వరి గింజ నొకటఁ బల్వరుసఁ దోమ,
నొరసి యొత్తిన మణుంగొందక మైనె, ని
గ్గులు దేరఁ బసుపిడి జలకమాడ,
ముదుక గాకుండఁ బయ్యెదలోనె గేలార్చి
కలయఁ జంటను నొంటఁ గలపమలద,
రతిరయచ్ఛిన్న సూత్రమునఁ జిక్కక ముత్తె
ములు, రాల గర గరికలు వహింపఁ,

తే. బొలసిననెయొట్టి నరునైనఁ గులముఁ దెలియఁ
బ్రభుత సెడి పల్లవుఁడు పేద వడిన నేద,
నృపతి వెలి యంతిపురముగా నెన్న మెలఁ గ
బాసఁ గృతి సెప్ప వలఁతు లప్పద్మముఖులు. 60

ఆ+పద్మముఖులు=తామరపూవువంటి ముఖాలు కలవారు (పైన వర్ణింప బడ్డ వేశ్యాస్త్రీలు); పలువరుసన్=దంతముల సమూహాన్ని; వీడెంపు=తాంబూలం యొక్క, బలు= మిక్కిలి; కెంపు= ఎరుపు; విరసి=విచ్చి; వెన్నెల గాయన్=వెన్నెలను కురియగా; వరిగింజ ఒకటన్= ఒకే వరిగింజతో; తోమన్=తోముకొనగా;

ఒరసి యొత్తిన=అదిమిపట్టి వత్తినప్పటికి; మణుంగు=సన్నని వస్త్రం (మడుగు, మడుంగు); ఒందక=అంటక; మైనె=శరీరమందె; నిగ్గులు తేరన్=కాంతులు వ్యాపింపగా; పసుపిడి=పసుపు పెట్టి; జలక మాడన్= స్నానం చేయగా;

ముదుక కాకుండన్=దట్టంగా కాకుండా; కలయన్=అంతటా; చంటను=చనులయందు; ఒంటన్=

ఒంటియందు, కలపము=పరిమళ ద్రవ్య మిశ్రమాన్ని (కస్తూరి గంధం మొదలైన వాని మిశ్రమము) పయ్యెదలోనె=పయ్యెదయందే; కేలు+ అర్చి=చేతిని ఆడిస్తూ; అలదన్=అద్దకోగా; రతి=సురతవుయొక్క; రయం=వేగం చేత; ఛిన్న=తెగిపోయిన; సూత్రమునన్=దారాన; చిక్కక=నిలవకుండా; ముత్తెములు = ముత్యాలు; రాలన్=రాలిపోగా; గరగరికలు వహింపన్=నిర్లక్ష్యమందగా,

సొలసిననె = తారసిల్లినంత మాత్రాన; ఎట్టి నరుడైనన్= ఎలాంటి మనిషినైనా; కులము తెలియన్=వంశమును విచారించుటకు; పేదవడినన్=పేదవాడు అయిపోతే; ఏదన్=పోషించుటకు; నృపతి=రాజు; వెలి=బయట; అంతఃపురముగాగన్= అంతఃపురాలుగా; ఎన్నన్= ఊహించడానికి; తగినట్లుగా; మెలగన్=ప్రవర్తించడానికి; బాసన్= దేశభాషలలో; కృతిసెప్పన్=కావ్యం చెప్పడానికి; వలతులు=నేర్పు కలవారు.

తా : ఈ పద్యంలో ఆనాటి కాలంలో వేశ్యా నాగరికతా సంస్కృతి కళా జీవనాదులు యథాతథంగా వర్ణింపబడ్డాయి. వారి నాగరికతలో ఉన్న సౌకుమార్యం పద్యం మొదటి మూడు పాదాలలో వర్ణింపబడింది. పండ్ల కంటిన తాంబులపు కెంపు కాంతి విరిసిపోగా ఒకే వడ్లగింజతో దంతధావనం చేస్తారు. (బహుశా ఇది ఆనాటి పద్ధతి యేమో) సన్నని వస్త్రముతో ఎంత అదిమి పట్టి తుడిచినా పోకుండా శరీరానికే పసుపునిగ్గులు పట్టేటట్లుగా స్నానం చేస్తారు. స్తనమండలం మీద, శరీరం మీద పయ్యెదలోనే చేయిపెట్టి కలపమలదు కోగలరు (పయ్యెద తీయకుండానే అదొక నేర్పుతో ఈ పని చేస్తారు) సురత వేగంలో ముత్యాల దండలు తెగి పోయినా 'అయ్యో!' అని బాధ పడరు. ఎలాంటి మనిషి అయినా తమను సమీపిస్తే కులం తెలిసికొని గాని దగ్గరకు రానీయరు. ఐశ్వర్యం కోల్పోయి విటుడు పేదవాడు అయితే అతనిని నిరసించకుండా ఆదుకుంటారు. వారి గృహాలు రాజుగారి కోటబయటనున్న అంతఃపురాలుగా ఉంటాయి. (అంటే అంత ఐశ్వర్యం కలవి) దేశభాషలలో కావ్యాలు చెప్పగల విదుషీమణులు. వారు పద్మముఖులు తప్ప సామాన్యస్త్రీలు కారు

విశే :- ఈ పద్యంలో రాయల వారి కాలంలో విజయనగరంలో ఉన్న వేశ్యాజన జీవన విధానంలోనే నాగరికత; సంస్కృతి; కళావైదుష్యం, అక్షుద్రస్వభావం, ఐశ్వర్యం యథాతథంగా వర్ణింపబడ్డాయి. ఇందులో విట సంపర్కం పేర్కొన బడిన వేశ్యలందున్న ఉన్నతస్వభావమే వర్ణింపబడినది. వారిలో ధనాసక్తి కంటే కళాసక్తి మిక్కుటము. ధర్మదృష్టి అధికమని చెప్పబడింది.

రాయలవారి కాలంలో వచ్చిన విదేశీ రాయబారులు మనకు అందించిన చరిత్ర ప్రకారం విజయనగరంలో వేశ్యలు శరీరం మీద ఉన్న నగలతో, వారి ఐశ్వర్యముతో, వారిగృహసమృద్ధి రాజులకే అప్పపెట్టే టంత సంపన్నలుగా చెప్పబడ్డారు. వారి వృత్తి మీద వేసేపన్ను విజమనగర రక్షక బృందం జీతాలకు సరిపోయేటంత ఆదాయం వచ్చేదని చెప్పారు. మృచ్ఛకటికంలో వసంతసేన గృహవర్ణనకు మహాకవి శూద్రకుడు ఒక అంకమే వెచ్చించాడు. క్రీడాభి రామంలో మాచల్దేవి వైభవ వర్ణనమూ ఇలాంటిదే.

ఇందుకే మధురాపుర వర్ణనలో 75వ పద్యంలో ఈ భోగిని అంతఃపురానికి రాజు పోయిన విషయం

వస్తుంది. అక్కడ కూడా మరొక అంతఃపురంగానే చెప్ప బడింది. కనుక ఆనాటికీ నాగరికత వారియందు నిగ్గులుతేరి కళాత్మకంగా ఉన్నదని చరిత్ర చెబుతున్నది.

ఉ. అంచిత హారవల్లి వలయాభరణంబుల తక్కఁ ద్రోయుఁ జి.
ల్మంచుఁ బసిండి, యేణమద మంగముఁ జేర్చుట తక్కరోయు జి
డ్డంచు జవాది, ధూపితమ యందుట తక్క విదుర్చుఁ బూవుఁ జె
మ్మంచు, జిలుంగె దక్కనగు యౌవత మొత్తు నటంచు నన్యమున్. 61

యౌవతము= యువతీసమూహము (వేశ్యాజనం); అంచిత= ఒప్పైన; హారవల్లి= తీగలవంటి ముత్యాల హారములతో చేయబడిన; వలయ+ ఆభరణంబుల్= అలంకారములైన గాజులు; తక్కన్= తప్ప; పసిండి= బంగారాన్ని; చిల్మ= చిలుముపట్టే లోహము; అంచున్= అని చెప్పి; త్రోయున్= పరిత్యజించును; ఏణమదము= కస్తూరిని; అంగమున్= శరీరమునందు; చేర్చుట= పూసుకోవడం; తక్క= తప్ప; జవాది= పునుగు; జిడ్డు+ అంచున్= జిడ్డుగా ఉన్నదని; రోయున్= ఏవగించు కొంటుంది; ధూపితము= అగరుధూపం; అందుట తక్కన్= వేసుకోవడం తప్ప; చెమ్మ+ అంచున్= తడిగా ఉన్నాయని; విదుర్చున్= పారవేస్తుంది; జిలుంగె= సన్నని వస్త్రాలు; తక్కన్= తప్ప; అన్యమున్= ఇతరవస్త్రాలను; ఒత్తునటంచు= శరీరానికి ఒత్తు కుంటాయని; నగున్= తిరస్కరిస్తుంది.

తా : ఆ ఊళ్లో ఉన్న వేశ్యాజనం ముత్యాలహారాలు; ముత్యాల గాజులే ధరిస్తారు తప్ప చిలుము పడుతుందని బంగారు నగలు ధరించరు. శరీరానికి కస్తూరే పూసుకుంటారు తప్ప జిడ్డుగా ఉంటుందని పునుగు పూసుకోరు. జుట్టుకు అగరు ధూపం వేస్తారు తప్ప చెమ్మగా ఉంటాయని పూలు కూడ ధరించరు. సన్నని నగిషీ చీరలు ధరిస్తారే తప్ప శరీరాన్ని ఒత్తు కుంటాయని మిగిలిన వాటిని పరిత్యజిస్తారు.

విశే :- నాటిస్త్రీ వేష భూషణాలంకరణ, నాగరికత ఇక్కడ వర్ణింపబడినది. బంగారు కంటే ముత్యాల హారాలే వారికి ప్రియము. జవాదికంటే కస్తూరియిష్టం పూలవాసనలు బాగాఉన్నా జుట్టు తడి అవుతుందని సాంబ్రాణి, అగరు ధూపాన్ని జుట్టుకు పట్టిస్తారు. ఒకప్పుడు మన దేశంలో ఈ సుకుమార మైన నాగరికత ఉండేది.

అలం : పరిసంఖ్య.

ఉ. వేవిన మేడఁబై వలభి వేణిక ఁ జంట వహించి విప్పఁగాఁ
బూవులు గోట మీటు తఱిఁ బోయెడు తేటుల మ్రోఁత కామిశం
కావహ మౌఁగ్ధ్యతాభ్యసన లౌటను దంతపు మెట్ల వెంబడిం
జేవడి వీణ మీటుటయుఁ జొక్కాడ లించుటయు స్సరింబడన్. 62

వేవినన్(వేగినన్)= తెల్లవారగా; మేడపై= మిద్దెపైనున్న; వలభిన్= వసారాలో; వేణికన్= జడను; చంటన్ వహించి= స్తనాలపై వేసుకొని; విప్పగాన్= విప్పుతుండగా; పూవులు= పూవులను; గోటన్= గోటితో; మీటుతఱిన్= ఎగచిమ్మేటపుడు; పోయెడు= పోతున్న; తేటులమ్రోత= తుమ్మెదల ధ్వని;

కామి=కాముకులకు; శంక+ ఆవహమాన్=సందేహాన్ని కల్పిస్తున్నది; కృత= చేయబడ్డ; అభ్యసనలు= వీణాభ్యాసం కలవారు; అవుటన్=అయినందు వల్ల; దంతపు మెట్ల వెంబడిన్=వీణ కమర్చిన దంతపు మెట్లపై; చేన్=చేతితో; వడిన్=వేగంగా; మీటుటయున్=వాయించడం; చిక్కు=జుట్టు చిక్కు; ఎడలించుటయున్= తీసుకోవడం; సరింబడన్=సమానంగా ఉండగా (కాముకులకు వేశ్యలు వీణ వాయిస్తున్నారన్న భ్రాంతి కలిగింది).

తా : తెల్లవారగనే వారయువతులు మేడపై వసారాలో నిలిచి జడను వక్షః స్థలము మీద వేసుకొని విప్పుకుంటూ పూలను గోటితో చిమ్ముతున్నారు. పూలమీద తుమ్మెదలు ఎగిరి పోతున్నాయి. ఈ దృశ్యం వీధిలో పోతున్న కాముకులకు ఎలా కనిపించిందంటే ఆ వేశ్యలు వీణా వాదనంలో గొప్పనైపుణ్యం కలవారు కనుక దంతపు మెట్లను మీటుతూ వీణవాయిస్తున్నారని భ్రాంతిపడ్డారు. ఉరఃస్థలం మీద ఉన్న జడ వీణగా పూవులు దంతపు మెట్లుగా తుమ్మెద మ్రోత వీణాధ్వనిగా భ్రమపడ్డారు.

స్త్రీలు తెల్లవారి నంతనే లేచి జడను విప్పి రాత్రిధరించిన పూల దండలను విదిలించడం చాలా సహజమైన దృశ్యం. ఆ దృశ్యం ఆధారంగా ఈ పద్యం పుట్టింది. వీణ ఒడిలో పెట్టుకొని వాయించడం నేటిపద్ధతి. ఆనాడు ఫిడేలు లాగా రొమ్ముల కానుంచి వాయించే పద్ధతి ఉండేదని ప్రాచీన సాహిత్యంలో తెలుస్తున్నది. భాసుని స్వప్నవాసవ దత్తలో వీణను కమానుతో వాయించినట్లుగా ఉన్నది. కనుక ఈ వీణను ధరించడం, వాయించడంలో కొన్నిఘట్టా లున్నట్లున్నాయి. రఘువంశంలో కాళిదాసు గ్రీష్మర్తువులో ఈ వర్ణన చేసాడు.

> స్నానార్ద్ర ముక్తేష్వనుధూపవాసం విన్యస్త సాయంతన మల్లికేషు ।
> కామో వసంతాత్యయ మంద వీర్యః కేశేషు లేభే బల మంగనానామ్ ॥ (16 - 50)

తలస్నానం చేసి ధూపం వే సుకున్న ఆర్ద్రకేశపాశంలో సాయంత్రం విచ్చిన మల్లె పూలు ధరిస్తే ఆ కేశపాశం నుండి మన్మథుడు బలం పుంజుకున్నాడు. ఇక్కడ సాయంకాల పుష్పధారణ చెప్పబడితే రాయల వారు తెల్లవారిన యీ దృశ్యాన్ని వర్ణించారు.

అలం :- భ్రాంతిమంతం.

> ఆళివచః కార్పణ్యం
> బా లేమల చెవులసోఁకఁ దధమాన్వయ జీ
> ర్ణాలావణ్యుల పిలుపున
> కై లాభముఁ దెలిపె నేని నవి శ్రీలగుటన్. 63

ఆళి= చెలికత్తెయొక్క; వచః= మాటలను; కార్పణ్యంబు=లోభం; లాభమును=ధన లాభమును; తెలిపెనేని= ఎరిగిస్తే; అధమ +అన్వయ= తక్కువ జాతి కలవానియొక్క; జీర్ణ=వృద్ధులయొక్క; అలావణ్యుల= అందంలేని వికార రూపులయొక్క; పిలుపు నకై=పిలుపుల కోసం; ఆలేమల= ఆస్త్రీలయొక్క;

చెవులు= కర్ణములు; శ్రీలు= లక్ష్ములు (శ్రీ అక్షరము వంటి ఆకారము కలవి కనుక శ్రీలు); అగుటన్= అయినందువల్ల; సోకదు= తాకదు.

తా : చెలికత్తెలు లోభ దృష్టితో తక్కువ జాతి వారియొక్క, వృద్ధుల యొక్క, వికార రూపులయొక్క ఆ అభ్యర్థనను వేశ్యలు నిరసిస్తారు. ఎందుచేతనంటే తమ చెవులే శ్రీలు కనుక. అంటే చెవులు శ్రీకారం లాగా ఉన్నాయని చెప్పడంతో పాటు అలాంటి విటులను వారు చేరదీయరు. వారెంత ధనవంతులైనా సరే ఈ భావం వేశ్యలయొక్క ఔన్నత్యాన్ని, ఠీవిని చెబుతున్నది.

59 నుండి ఇంతవరకు విలిపుత్తూరు వేశ్యల వర్ణన. మధురా నగర వర్ణనలో పుష్పలావికల వర్ణనలు రాబోతున్నవి. వాటితో ఇవి పోల్చు కొని చదువుకోవాలి. ఇదే ఆశ్వాసంలో 73వ పద్యంలో, నాల్గవ ఆశ్వాసం 36వ పద్యంలో ఈ వేశ్యలు స్పృశింప బడతారు. వీటన్నిటిని ఒక దగ్గరకు చేర్చుకొని చదివితే ఆనాటి వేశ్యయొక్క సంపూర్ణ స్వరూపం మనకు గోచరిస్తుంది. వారు మృచ్ఛకటిక నాయిక యైన వసంతసేన లాంటివారు తప్ప ఒట్టి బజారు చెడిపెలు కారు. వసంతసేన కామ కళాయోగిని తప్ప కాముకి కాదు. ఇందుచేతనే ఆమె రూపం శిల్పంలో మలచ బడి మన కీ నాటికి లభించింది. వేశ్యా శిల్పాలున్నాయంటే నాటి సమాజంలో ఆవిడ స్థాన మేమిటో మన మూహించు కోవాల్సిందే.

## హంసలు

చ. ద్రవిడ కుటుంబి నుల్పసుపు రాచిన రత్నపు ౘాప క్రింద నం
బువు దెరవాఱఁగా నిదుర వోయి గరుత్తతి పచ్చ ౘాఱినన్
భవన సరో మరాళ ములు భర్మమయచ్ఛద గుచ్ఛ విస్ఫుర
ద్దివిజధునీ మరాళ వితతిభ్రమఁబూన్చు ౘ బురిభ్రమించుచున్. 64

భవన= ఇండ్లయొక్క; సరః= దీర్ఘికలలో (దిగుడు బావులలో); మరాళములు= హంసలు; ద్రవిడ కుటుంబినులు= ద్రావిడ ఇల్లాండ్రు; పసుపురాచిన= పసుపురాచిన, స్నానార్థం పసుపు ముద్ద పెట్టిన లేదా పసుపుకొమ్మును రాచిన; రత్నపు తాపక్రింద = రతనాల మెట్టు క్రింద; అంబువు= నీరు; తెరవాఱగాన్= వాకలు వేయుగా(పొర్లగా) నిదురవోయి= నిద్రించి; గరుత్తతి= ఈకల గుంపు; పచ్చఁబారినన్= పసుపు వన్నె అంటగా; పురిన్= విలుపుత్తూరిలో; భ్రమించుచున్= సంచరిస్తూ; భర్మమయ= బంగారపు; ఛద= రెక్కలయొక్క; గుచ్ఛ= గుంపుతో; విస్ఫురత్= ప్రకాశించే; దివిజధునీ= ఆకాశగంగలోని; మరాళ వితతి= అంచల గుంపనెడి; భ్రమన్= భ్రాంతిని; పూన్చున్= కలిగిస్తాయి.

తా. : ద్రావిడ స్త్రీలు తాము స్నానార్థం నూరుకున్న దిగుడు బావుల మెట్ల క్రింద నిద్ర పోయి లేచి విహరిస్తున్న పెంపుడు హంసల రెక్కలకు ఆ పసుపు అంటు కొన్నది. అవి చూచే వారికి బంగారు రెక్కలతో ఆకాశగంగలో విహరించే హంసల్లాగా ఉన్నాయి అన్న భ్రాంతి కల్పిస్తున్నాయి.

విశే : ఆనాటికాలంలో ఇంటి ఆవరణలోనే తోటలు, దిగుడు బావులు ఉండేవి. అందులో పెంపుడు హంసలు, నెమళ్లు ఉండేవి.

ఈపద్యంలో హంసలు ఆకాశగంగలో హంసల్లాగా భ్రాంతిని కల్పిస్తున్నందున అలం. భ్రాంతి మంతం. ఈ భ్రాంతి శ్రీ విలుబుత్తూరు వైకుంఠమన్న స్ఫురణ కల్గించేది.

## బాతులు

మ. తల (బక్షచ్ఛుట c గ్రుచ్చి బాతువులు కేదారంపుc గుల్యాంతర
స్థలి నిద్రింపఁగc జూచి యారెకు లుష స్స్నాత ప్రయాత ద్విజా
వలి పిండీకృత శాటికల్సవి c దదావాసంబు c జేర్పంగ రే
వుల డిగ్గ న్వెసఁబాఱువాని c గని నవ్వున్ శాలి గోప్యోఘముల్. 65

బాతువులు=బాతులు; పక్షచ్ఛటన్=రెక్కల ఈకల గుంపులో; తలన్=తలను; గుచ్చి= దోపి; కేదారంపు=వరిపైరున్న మళ్లయొక్క; కుల్య=కాలువలయొక్క; అంతరస్థలిన్= నడిమి చోట; నిద్రింపగన్=నిద్రిస్తే; ఆరెకులు=నగర రక్షకులు; (ఆరక్షక సంస్కృత రూపం)చూచి; ఉషః=వేకువలో; స్నాత=స్నానం చేసి; ప్రయాత=వెళ్లిన; ద్విజ=బ్రాహ్మణులయొక్క; ఆవలి=సమూహంయొక్క; పిండీకృత=పిడుచలుగా చేయబడిన; శాటికల్=వస్త్రాలు; సవి=అని; తత్+ ఆవాసంబున్=వారి వారి యింద్లకు; చేర్పంగన్=చేర్చడం కోసం; రేవులన్=స్నాన ఘట్టాలలోకి; డిగ్గన్=దిగితే; వెసన్=వేగంగా; పాఱువానిన్=పరిగెత్తుతున్న బాతులను; కని=చూచి; శాలిగోపీ= వరిపైరును కాపలా కాస్తున్న స్త్రీలయొక్క; ఓఘముల్=సమూహములు; నవ్వున్=నవ్వును.

తా : విలుపుత్తూరు చుట్టూ మాగాణి పొలాలున్నాయి. ఆ పొలాల్లో వరిపైరు ఏపుగా పెరిగినది. ఆ వరిమళ్లకు కాలువలు తీయబడ్డాయి. ఆ కాలువల అంచుల్లో బాతులు తెల్లవారు ఝామున రెక్కల సందులలోకి తలలు దూర్చి పడుకున్నాయి. వాటిని చూచి కాలకృత్యాలకు వచ్చిన ఆరెకులు 'అయ్యో! పాపం!' బ్రాహ్మణులు తెల్లవారు ఝామున వచ్చి స్నానం చేసి వస్త్రాలను పిండుకొని ఆ పిండిన ముద్దలను తీసుకోవడం మరిచి వదలి వెళ్లి పోయారనుకొని వాటిని తిరిగి వాళ్లయిళ్లకు చేర్చాలని రేవులలోకి దిగారు. ఈదిగిన చప్పుడు విని బాతులు లేచి పరిగెత్తడం మొదలు పెట్టాయి. ఇది చూచి వరిమళ్లను కాపలా కాస్తున్న స్త్రీలు నవ్వారట. ఇదొక అద్భుతమైన భ్రాంతి మదలంకారం.

విశే ॥ ఊరికి ఆనుకొనియున్న చెరువులలో మనం నిత్యమూ చూసే దృశ్య మిది. ఈ వాస్తవికమైన విషయాన్ని యింత రమణీయంగా చిత్రించటం యితరత్ర కనిపించదు. బాతులు బహువచనం. బాతు. ఏ. వ. కాని యిక్కడ బాతువులని ప్రయోగింపబడింది. నాటికి యీ బాతులు పోర్చుగీసు నుండి వచ్చాయని చరిత్ర వేత్తలంటారు. ఇతర కావ్యాల్లో మనకు హంసల వర్ణన లున్నాయి తప్ప ఇలా బాతుల వర్ణనలు కనిపించవు. ప్రాతః కాలంలో బ్రాహ్మణ స్నానాలు, వస్త్రాలు పిండుకోవడం, చాలా సహజమైన అంశాలు. ఆ తడిముద్దలు బాతులుగా కన్పించడమూ సహజమే. కాని ఆరెకులు అలా అనుకోవడం మాత్రం రాజ్యపరిపాలనలో ఉన్న ధర్మాన్ని చెబుతున్నది. విజయ నగర పరిపాలనలో దొంగతనాలు లేవని పాశ్చాత్య చరిత్రకారులు వ్రాసారు. ఏ వీథిలోనైనా దొంగతనం జరిగితే ఆ వీథికాపలాకాసే ఆరెకులు

ఆ నష్టాన్ని భరించాలి. ఆనాటి పరిపాలన పద్ధతి యిలా ఉండేదట. అందుకని దొంగతనాలు జరిగేవికావు. మనిషిలో ధర్మబుద్ధిలోపించని కాలం కనుక ఇలాంటి వర్ణనలు వచ్చాయి. శాలి గోపి వర్ణనలు 'గాథా సప్త శతి' లోను కాళిదాసాదుల కావ్యాలలోను చాలా రమణీయంగా చేయబడ్డవి. పాఠకులు పోల్చి చూచుకోవాలి.

## పొలాలు

మ. సొరిదిం బేర్చిన తీఁగ మల్లియలు ఖర్జూరంబులు న్పుష్పమం
జరులు న్మామిడి గుత్తులున్ గుసుమము ల్సంపెంగలు న్పచ్చగ
న్నెరులు న్పాళలు గల్గి రాజనపు c గాంతిం దారుము ల్చూపి చే
లరుదార న్నగు c బూవు c దో cటల c బలా కానీక దంభంబునన్. 66

సొరిదిన్= క్రమముగా; పేర్చిన= వర్ధిల్లిన; తీగమల్లియలున్= తీగగా ప్రాకే మల్లైలు ( మల్లైలు గుబురు చెట్లుగా, తీగలుగా రెండురకాలుగా ఉంటాయి కనుక.); ఖర్జూరంబులున్= ఖర్జూరములు; పుష్పమంజరులున్= పూలరెమ్మలు; మామిడి గుత్తులున్; కుసుమముల్= కుసుమ ధాన్యము; పూలు; సంపెంగలున్; పచ్చగన్నెరులున్; పాళలున్= ఆపేరుగల ధాన్యము (పెద్ద డొప్పలతో నున్న కొబ్బరి వంటి పూలు) ; కల్గి= కలవై; రాజనపు కాంతిన్= రాజనాలన్న వరియొక్క వన్నె చేత; తారు= ఆ వరి పొలాలు; ముల్చూపి= ముల్లుమొగ్గి (త్రాసుముల్లు బరువు వైపు వాలుతుంది); పూవుతోటలన్= పుష్పోద్యానాలను; అరుదు ఆరన్= ఆశ్చర్యం కలిగేటట్లుగా; బలాక= కొంగలయొక్క; అనీక= గుంపులన్న; దంభంబునన్= మిషచేత; నగున్= పరిహసించును.

తా : ఈ పద్యంలో వరిధాన్య విశేషాలు చెప్పబడ్డవి. తీగమల్లైలు, ఖర్జూరాలు, పుష్పమంజరులు, మామిడి గుత్తులు, కుసుమాలు, సంపెంగలు, పచ్చగన్నేరులు, పాళలు,రాజనాలు. ఇవేపేర్లు పూలచెట్లలోను ఉన్నాయి. కాని ఒక్క రాజనం అన్న పేరు మాత్రం వరిపైరులలోనే ఉన్నది. ఆపేరుగల పుష్పం లేదు. అందుచేత వరిపైరు వైపుకే బరువు తూగింది. కనుక ముల్లు చూపిస్తూ పూలతోటలను పొలాలు తమపై ఎగిరిపోయే కొంగలబారుల మిషతో పరిహసిస్తున్నాయో అన్నట్లుగా ఉన్నాయి.

విశే : ముల్ - ముల్లు శబ్దములో ద్విత్వ, ఉత్వములు లోపించిన రూపం. వరి పైరుకు ముల్లు లుండడం సహజం. కనుక ఆ ముల్లు ఈనెల తరువాత వరి కంకికి ఉంటుంది. వరిశరత్కాలానికి గాని పండదు. అందుకే కంకుల కోసం బలాకలు పైన ఎగురుతున్నాయి. అవి పొలాల తెల్లని నవ్వుల్లాగా ఉత్ప్రేక్షింపబడ్డాయి.

రాజనము - రాజాన్నము అన్నపదానికి రూపాంతరం. రాజులు మాత్రమే భుజించే సన్నని జాతిగల ధాన్యవిశేషం. ఈ రాజాన్న వర్ణన ప్రాచీన సాహిత్యంలో ఎక్కువగా కనిపిస్తుంది. ఈ ప్రస్తుత పద్యంలో నాటి ధాన్య విశేషాలు మన కందింప బడ్డాయి. 40,50 ఏళ్ల క్రితం దాకా ఉన్న ధాన్య విశేషాలు ఇవాళ లేవు. ( ఆ ధాన్య విశేషాలన్నీ విశ్వనాథవారి సాహిత్యంలోనే కనిపిస్తాయి. ఢిల్లీభోగాలు, పాలాగ్రు గడము వంటివి)

అలం : పొలాలు తోటల కంటే గొప్పవిగా చెప్పబడ్డవి. కనుక వ్యతిరేకం. 'బలాకానీక దంభంబునన్ నగున్' అన్న చోట అపహ్నవ ఉత్ప్రేక్ష.

పొలాలు పండి ఒరిగి యున్నవి. పైన బలాకలు ఎగురుతున్నవి. ప్రక్కన తోటలున్నాయి. 65వ పద్యంలో వర్ణింపబడ్డ కాలువలు, బాతులు, ఆరెకులు, శాలిగోపికలు ఇవన్నీ ఒక అద్భుత ప్రకృతి దృశ్యం బొమ్మగా గీయబడింది. పాఠకుడు దీన్ని భావించాలి.

చ. బలసిన హల్లకచ్ఛటలపైఁ దమ జుంజురు ముండ్లు రాయఁగాఁ
గలమము లుండుఁ బండి యొఱుగం బడి నీరెడలింపఁ దృష్ణలోఁ
దలకొన, వంగి మున్ జలముఁ ద్రావెడు క్రిందటి వ్రేళ్లు మీఁదటన్
నిలిపి, మరందమాను కరణి న్నికటోపవనానిలా హతిన్. 67

కలమములు= వరిపైరులు; పండి=పక్వమై; నీరు=పొలంలో ఉన్నజలం; ఎడలింపన్=బయటకు పోగొట్టగా; ఒఱుగంబడి=కంకి బరువుతో వాలిపోయి; నికట= సమీపంలో ఉన్న; ఉపవన=పూదోటలయొక్క; అనిల=గాలియొక్క; ఆహతిన్=దెబ్బచేత; బలసిన=చుట్టూ అల్లుకొని ఉన్న; హల్లక= ఎర్రకలువలయొక్క; ఛటలపైన్=సమూహం మీద; జుంజుఱు ముండ్లు= సన్నని వాడియైన చింపిరి ముండ్లు; రాయగాన్=రాసుకోగా; లోన్=లోపల; తృష్ణ=దప్పిక; తలకొనన్=కలుగగా; వంగి= ఒరిగి (నీళ్లు త్రాగడానికి కాల్వలోనికి వంగినట్లు); మున్=పూర్వము(పొలాలలో నీళ్లున్నప్పుడు); జలము త్రావెడు= నీరానెడు; క్రిందటి వేళ్లు=దుబ్బు మొదట ఉన్న వేళ్లు; మీదటన్=తలలపై; నిలిపి= ఉంచుకొని; మరందం= ఆ ఎర్రకలువలలోని తేనె; ఆను కరణిన్= త్రాగు తున్నాయో అన్నట్లుగా; ఉండున్=కనిపిస్తాయి.

తా : వరిచేల చుట్టు ప్రక్కల చెరువు లున్నాయని 65వ పద్యంలోనే చెప్ప బడింది. ఆ చెరువులు ఎర్రకలువలతో సొగసుగా ఉన్నాయి. వరిపొలాలు పంట బరువుతో ఆ ఎర్రకలువలపైకి ఒరిగి పడిపోయాయి. ఆ ప్రక్కనే ఉన్న పూల తోటలనుండి గాలి వీస్తోన్నది. ఆ గాలికి ఈ వరికంకులు కదులుతూ తమ సన్నని వాడియైన ముండ్లు ఎర్రకలువలను రాస్తున్నాయి. ఇది ఎలా ఉన్నదంటే వరి పొలాలనుండి నీరుబయటకు చిమ్మబడింది. వరిపైరుకు దప్పిక వేసింది. అందుకని క్రింది వేళ్లను మీదికి తెచ్చుకొని కలువలలో ఉన్న తేనెను త్రాగుతున్నాయో అన్నట్లుగా ఉంది.

విశే 65 నుండి ఇంతవరకు వరిచేల వర్ణన. రాయల వారిలో ఈ పల్లెటూ రివర్ణనలు విస్తారంగా, రమణీయంగా కనిపిస్తాయి. ఇంత విస్తృతంగా తెలుగు దేశ పల్లీయ సౌందర్యం పాశ్చాత్య చిత్రకారులు గీసిన ప్రకృతి దృశ్యచిత్రాల్లాగా రాజస్థాన్ చిత్రాల్లాగా మరలా ఒక్క విశ్వనాథ సాహిత్యంలోనే కనిపిస్తుంది. ఇది దేశభక్తి ఉన్న రచనా పద్ధతి.

## పనసలు

చ. అడుగునఁ బండి వ్రీలి యసలై మధువుట్టఁగఁ ద్రాఁగుదేంట్లు మ
ల్లడి గొని చుట్టురాఁ, బనసలన్ప్రొలుచు న్గలు గుండ్ల తోడ నీ

డ్వడు పెనుబండ్లు, భిన్నకట పాంసుల భూరిమదాంబు సేచనా
జడ దృఢ శృంఖలాయుత వసంత నృప ద్విరదాధి పా కృతిన్. 68

పనసలన్=వేరు పనస చెట్లయందు; కలుగుండ్లతోడన్=రాతిగుండ్లతో, బండ రాళ్లతో; ఈడ్వడు= ఈడు పడు (సమానమగు); పెనుబండ్లు=పెద్దఫలాలు; అడుగునన్= ,భూమిలోనే వ్రేళ్లకు; పండి=పక్వమై; వ్రీలి=పగిలి; అసలు+ ఐ=బురదయై; మధువు= తేనె; ఉట్టగన్=పైకి ఉబికి వస్తుండగా; తేంట్లు=తుమ్మెదలు; త్రావన్=త్రాగుటకు; మల్లడిగొని =మూగి; చుట్టున్= ఆ ప్రదేశానికి చుట్టూరా, రాన్=ముసురుకోగా; భిన్న= స్రవించు; కట=చెక్కిళ్లుగల; పాంసుల=దుమ్ము కొట్టుకొన్నవై; భూరి= అధికమైన; మద + అంబు= దాన జలం, సేచన=కారుస్తున్న; అజడ=కదిలే; దృఢ=గట్టి; శృంఖల=గొలుసుతో; యుత =కూడుకొన్న; వసంత=వసంతునియొక్క (వసంతు డనెడి); నృప=రాజుయొక్క; ద్విరద= ఏనుగుయొక్క; అధిప= రాజుయొక్క; ఆకృతిన్= ఆకారంతో; పొలుచున్= ఒప్పారును.

తా : ఆ ఊరి తోటలలో వేరుపనస చెట్లున్నాయి. అవి చెట్టు వేరుకు కాస్తాయి. కనుక వేరుపనస అనిపేరు. కొమ్మ పనస కొమ్మల మధ్య కాసేది. ఈ వేరు పనస పండు దిగినట్లు గాని, పండినట్లుగాని మనకు ఎలా తెలుస్తుందంటే అక్కడ ఉన్న నేల పగిలి ఆ పగుళ్లలో పనస తొనలరసం స్రవిస్తే దానిమీద చీమలు, తుమ్మెదలు మూగుతాయి కనుక బండరాళ్లలాగా ఉన్న ఆ పండ్లు పగిలేసరికి నేలమీది తీపి వాసనకు తుమ్మెదలు మూగాయి. ఈ దృశ్యమెలా ఉన్నదంటే వసంతుడన్న చక్రవర్తియొక్క పట్టపు టేనుగు దవడల నుండి మదజలం స్రవిస్తూ ఉంటే దాన్ని కట్టి వేసే గొలుసులాగా ఉన్నది. అది కదిలే గొలుసు.

విశే : పనసపండ్లు వసంతుని పట్టపు టేనుగుల్లాగా ఉన్నాయని, దాని మదజలమే పనసపండ్ల రసమని, మూగిన తుమ్మెదలే ఏనుగును బంధించిన గొలుసని, పోల్చబడ్డది. ఈపోలిక కోసం పండి వ్రీలి భిన్నకట; అసలు=పాంసుల; మధువుట్టగ=భూరిమదాంబుసేచన; మల్లడి కొన=దృఢ; తేంట్లు=శృంఖల; చుట్టురాన్=యుత; పెనుబండ్లు=మదద్విర దాధిప ఈ విధంగా అన్ని విషయాలను సమానంగా తూచి చేసిన యీ విశేషణ ప్రయోగం సంపూర్ణ ఉపమను నిష్పన్నం చేస్తున్నది కనుక

అలం : పూర్ణోపమ. దీనినుండి మదద్విర దాధి పాకృతిన్ అన్నచోట ఉత్ప్రేక్ష ఏర్పడుతున్నది.

నాల్గవ ఆశ్వాసంలో రాజనీతిలో ఈ పనస పండ్ల పోలిక చెప్పబడింది. చూ. 4. 271. ప. (మద - పాఠాంతరం)

## అరటి తోటలు

ఉ. చాల దళంబుగాఁ బృథుల చంపక కీలనఁ బొల్చు బొందుఁదో
మాలె లనంగఁ బండి మహి మండలి చీఁకుచు వ్రాలి గంధమూ
ర్చాలస యైన భృంగ తతి నాఁ దుదకప్పుమర న్ఫలావళు
ల్ప్రీలి గెలల్సుగంధి కదళీ వనపంక్తుల నొప్పు నప్పురిన్. 69

అప్పురిన్= ఆ నగరంలో; సుగంధి=మంచి వాసన గల; కదళీవన=అరటి తోటలయొక్క; పంక్తులన్= గుంపులలో; చాలన్= మిక్కిలి; దళంబుగాన్= దట్టంగా; పృథుల=పెద్ద; చంపక= సంపంగి పువ్వులయొక్క; కీలనన్=కూర్పుచేత; పొల్పు=అందమైన; బొందు= లావైన; తోమాలెలు= ఆకులు, పూలతో కట్టిన దండలు; అనంగన్= అన్నట్లుగా; గెలల్= అరటిగెలలు; పండి= పక్వమై; ఫల + ఆవళులు= పండ్ల గుత్తుల; వ్రీలన్=పగిలి పోగా; మహీ మండలి= నేలపై; చీఱుచున్=రాచుకుంటూ; తుదకప్పు= పళ్ల చివరలపై ఉన్న నలుపు; వ్రాలి=సంపెంగలపై మూగి, మూర్ఛ=సొమ్మసిల్లి; అలసయైన=వశము తప్పిన; భృంగతతి= తుమ్మెదల గుంపు; నాన్=అన్నట్లుగా; అమరన్=అమరికతో; ఒప్పున్= సొగసుగా ఉన్నది.

తా : విలిపుత్తూరులో చుట్టూ అరటి తోటలున్నాయి. ఆ తోటలలో చెట్లకు పెద్ద పెద్ద గెలలు పండి నేలమీద జీరాడుతున్నాయి. ఆ పండ్లు పగిలి సుగంధాన్ని చిమ్ముతున్నాయి. పండ్ల చివళ్లు నల్లని మొనలు కలిగియున్నాయి. పసిమి వన్నె కల పండ్ల చివళ్ల నలుపుగలిగిన పెద్ద పెద్దగెలలు ఊరు చుట్టూ జీరాడుతూ గుండ్రంగా కనిపిస్తున్నాయి. ఇది ఎలా ఉన్నదంటే పెద్ద సంపంగి పూలను ఆకుల నడుమ నడుమ చేర్చి దట్టంగా కట్టిన పొడవైన లావైన దండల్లాగా ఉన్నాయి.

ఆ ఊళ్లో మన్నారు స్వామి కంఠానికి నగరశ్రీ కట్టిన పూల దండలాగా ఉన్నదన్నమాట. ఆయన మెడలో వేసిన సంపంగి పూల దండలాగా అరటి తోటలున్నాయి. ఈ భావన భవిష్యత్తులో గోదాదేవి వేయబోయే దండల కథను ధ్వనించడం సంగతి అలావుంచి ఈ వర్ణనమే చాలా అపూర్వమైనది. రాయల వారి అలంకారాలు వట్టి అలంకారాలు కావు. అవి నేటి విమర్శలో మనం చెప్పే ప్రతిమలు, ప్రతీకల వంటివి. బాహ్య ప్రకృతి దృశ్యాన్ని వర్ణిస్తున్నట్లుగా ఉన్న ఆ పదార్థంలో ఆత్మతత్వాన్ని లేదా దివ్యత్వాన్ని స్పృశించే లక్షణం రాయలవారి వర్ణనల లో ఉన్నది. ఈ ఆంతర తత్వ స్పర్శ వర్ణనమే Mystic Poetry = మార్మిక కవిత్వమంటున్నాం. భారత దేశంలో వచ్చిన పద, సంకీర్తన కవులలో ఈ లక్షణముంటుంది ఈ కవితలో భక్తుడే నాయిక. భగవంతుడు నాయకుడు. కవి పాట ఒక విరహ గీతిక. ఈ ప్రణయం దివ్యం తప్ప భౌమం కాదు. ఈ నాయిక పేరు వైష్ణవి. ఈ కవిత పేరు మార్మిక కవిత. తెలుగు సాహిత్యంలో ఒక ఆముక్త మాల్యదలోనే యీ మార్మిక కవితా ధోరణి భావించ దగినది. అలాంటి భావాలలో ఇది ఒకటి. కవి ఆకాశంలోకి ఎగిరి అక్కడనుండి క్రిందకు సారించిన దృష్టికి కనిపించిన దృశ్యం ఈ పండిన గెలలున్న అరటి తోటలు; స్వామి మెడలోని అలంకారమైన తోమాలగా కనిపించింది. ఈ భావనా దృశ్యాన్ని పాఠకుడు చూడక పోతే ఈ పద్య సౌందర్యం తెలియదు.

## పోక తోటలు

చ. మన కనురక్తి హెచ్చునిదె మందని కంఠము c గౌcగిలించి ని
క్కిన ఫణిరాజవల్లి యొఱి c గింపcగ నో యనc బూగముల్పురం
బునc బడు మట్టచే c జెఱకు ముత్తియము ల్పిటిలించి, తద్రసం
బనిశము వండు నంతిక తలాంతిక c జ్యోర్ణము c జేయు నప్పురిన్. 70

పూగములన్=పోకచెట్లు; కంఠమున్=కుత్తుకను; కౌఁగిలించి=చేతులు పెనవేసి; నిక్కినః పైకి ప్రాకిన; ఫణిరాజవల్లి=తమల పాకు తీగ; మనకున్=మనిద్దఱకు; అనురక్తి=అనురాగం; ఎరుపువన్నె; చెప్పటానికో అన్నట్లు; భరంబునన్= బరువుతో; పడు=రాలే; మట్ట చేన్= మట్టతో; చెఱకు ముత్తియములన్= చెఱకు గడలలోని ముత్యాలను; చిటిలించి=గడలను చిట్ల గొట్టి రాల్చి; తత్+రసంబు= ఆ చెరకు రసాన్ని; అనిశము=నిత్యము; వండు=వండు తున్న; అంతిక తల= సమీపప్రదేశంలో ఉన్న; అంతికన్=పొయ్యిలో; చూర్ణమున్=సున్నమును; చేయున్= చేస్తున్నవి.

తా : విలి పుత్తూరులో చెరకు తోటలు, పోకతోటలు, వాటిని ప్రాకిన తమలపాకుల తోటలున్నాయి. ఈ పోక మాకులకు తమల పాకుల తీగలు ప్రాకటం స్త్రీపురుషుని కౌగిలించుకున్నట్లుగా ఉంది. కనుక తీగలు పోక చెట్ల కంఠాలను నిక్కి కౌగిలించు కొని వాటికి చెబుతున్నాయి. మనమధ్య అనురాగం పెరగడానికి ఇదిగో ఒక మందు చూపిస్తామని చెప్పినట్లుగా పోకచెట్ల నుండి రాలుతున్న మట్టకు, చెరకు గడలు విరిగి పోతూ అందులో నుండి ముత్యాలు బయట పడి ప్రక్కనే బెల్లం వండే పొయ్యిలో పడి సున్నం అవుతున్నది. విశే : ఆకు తీగలు, ప్రాకిన పోకతోటలు, ప్రక్కనే చెరకు తోటలు, ప్రక్కనే బెల్లం వండుతున్న పొయ్యిలు. ఇదీ దృశ్యం. ఈ దృశ్యం నుండి పై భావం పిండబడింది. ముత్యాల చూర్ణమే .సల్ల సున్నం. తమలపాకులు; పోకలు ఉన్నాయి కనుక తాంబూలం తయారైంది. ఇది కలిగించేదే అనురాగం. అంటే ఎరుపు. స్త్రీపురుషులు తాంబూల సేవనం చేసి పరస్పర బాహు బంధనాలలో ఉండే దృశ్యం తోటమీద ఆరోపించ బడింది. ఈ సంకీర్ణ భావనలో పురుషుడు= పోక చెట్టు.

నాగవల్లి=స్త్రీ. ఈ ఉపమల నుండి ధ్వనించే స్త్రీ పురుష శరీర సౌందర్యం నిక్కిన సోక మ్రాకు అంటిపెట్టు కొని పైకిప్రాకే తమల పాకు తీగ ఎత్తైన పురుషుని కంఠాన్ని కౌగిలించు కోవడానికి తాను పొడవుగా తీగలాగా సాగింది. ఈ తీగలాగే సాగిన పొడవైన శరీరాలు భారతీయ శిల్పంలో చెక్కబడ్డాయి. వాటినే Elongated Body గా శిల్పవేత్తలు చెబుతారు. ఈ దృశ్యమే సాలభంజికాశిల్ప రహస్యం ( చూ. నా సాలభంజిక ) లతాతనువు అన్న మాటకు అర్థమిదే. రాయల వారి భావన సంకీర్ణమై దట్టంగా ఉంటుంది. ఈ సాంద్రతనే కాఠిన్యమనుకొని అభావుక లోకం బెదరి పోతుంది. రాయలవారి భావన కఠినం తప్ప శబ్దం కఠినం కాదు.

అలం : సమాసోక్తి. నాయికా నాయక తత్త్వ స్ఫురణవల్ల సమాసోక్తి. పద్యం మొత్తం మీద ఉత్ప్రేక్ష ముత్యాలు చెరకు నుండి, గజకుంభం నుండి, వెదురు నుండి పుడతాయని రత్న శాస్త్రం చెబుతుంది.

పాడుబడ్డబావులు

చ. అలరుఁ బురంబునం దొగల నంతర దామర ఁ బ్రాఁచిఁ గప్రపున్
వలపులు మీఱ, లో వలుద వాలుగ మొత్తను పోర, నీరు కో
ళ్కొలకొలమంచు ఁ గ్రుంకు మెడ గుంపుల వంపులు దోఁప మావితోఁ
పుల విరుల న్బయి న్నడువ ఁ బొల్చు పురాతన తీర్థ కుండముల్. 71

పురంబునన్= నగరంలో; మావి తోపులన్= మామిడి తోటలలో; పురాతన తీర్థకుండముల్= పూర్వకాలపు లేదా పాడు బడ్డ నీటిబావులు; అలరున్= ఒప్పుతూ ఉన్నవి. ( ఆ పాడుబడ్డ బావుల వర్ణన మిగిలిన పద్యమంతా)

తొగలన్=కలువలతో; అంతర తామరన్=నీటి మీదనే తేలే ఒకరకమైన తీగలతో; ప్రాచిన్= ప్రాకుడుతో; కప్రపున్ వలపులు= కర్పూరపు వాసనలు; మీఱన్= చిమ్ముతుండగా; లోన్= లోపల; వలుద=గుండ్రంగా బలిసిన; వాలుగ మొత్తము= వాలుగ చేపల సమూహం; పోరన్= కొట్టు కుంటూ ఉండగా; నీరుకోళ్= నీటియందుండే పక్షులు (ఇంటి కోడి, నిప్పు కోడి, అడవి కోడి ఇవన్నీ పక్షి విశేషాలు); కొల కొలమంచున్= కొల కొల మని కూస్తూ ( ఇది ధ్వన్యనుకరణ శబ్దం); క్రుంకు= మునిగే; మెడగుంపుల వంపులు=మెడల సమూహంయొక్క ఈ వంపులు ; తోపన్= కనిపిస్తుండగా; విరులన్= పూలతో; పైన్= నీటిపై; నడువన్=నడవడానికి; పొలుచున్= వీలైనట్లుగా ఉన్నవి.

తా : ఆ నగరంలో మామిడి తోటలున్నాయి. ఆ తోటల మధ్య తరాల క్రింద త్రవ్విన పెద్ద పెద్ద నీటి బావులున్నాయి. ఆ బావులలో అంతర తామర, కలువలు, ప్రాచి చేత కర్పూరపు వాసనలు వస్తున్నాయి. ఈ తీగల కడుగున బలిసిన వాలుగ చేపలు కొట్టుకుంటున్నాయి. వాటిని తినటానికి నీరు కోళ్ళు కలకల ధ్వనులతో కూస్తూ తమ మెడలను నీటిలోనికి ముంచుతున్నవి. వాటి వంపులతో ఈ పూల తీగలతో ఆ పాడు బడ్డ బావులు అందంగా ఉండడమే కాకుండా నీటిపైనంతా తీగల గుంపులు అల్లుకొని ఉండడం చేత నడచి పోవడానికి వీలైన ప్రదేశమే తప్ప ఇది బావి కాదు అని అనిపిస్తున్నది.

విశే :- అలం: స్వభావోక్తి. పల్లెటూళ్లలో పాడుబడ్డ బావులయొక్క వాస్తవిక వర్ణనమే యీ పద్యం.

కొలకొల+ అంచు - ఇక్కడ మకారాగమము వచ్చింది. ఇలాంటి ప్రయోగాలు ప్రాచీన సాహిత్యంలో చాలా ఉన్నాయి.

### సాయంకాలం

శా. సాయంకాలములం దదీశ మురజిత్సద్మస్వన ద్దుందుభి
స్వాయత్కాహళికా ప్రతిస్వనత దోఁప న్గుంజ గర్భంబుల
మ్రోయుం గేళివనిం గులాయగమనప్రోత్తిష్ఠదన్త స్సర
స్థాయి శ్వేత గరుద్గరుత్పటపటాత్కారంబుఁ గ్రేంకారమున్. 72

సాయంకాలములన్=దివసావసాన వేళ; కేళివనిన్= ఉద్యాన వనాలలో; కులాయ= గూళ్లకై; గమన=పోవటానికి; ప్రోత్తిష్ఠత్=పైకెగురుతున్న; అన్తస్సరః=కొలకులలో; స్థాయి= ఉన్న; శ్వేతగరుత్=తెల్లని రెక్కలుగల హంసలయొక్క; గరుత్=రెక్కలయొక్క; పట పటాత్కారంబున్= పటపటమన్న ఱెక్కల చప్పుడు; క్రేంకారమున్= క్రేం అన్నధ్వని; కుంజ గర్భంబులన్=పొదరిళ్ల నడుమ; తత్+ ఈశ= ఆ పట్టణానికి స్వామియైన; మురజిత్ =మురుడన్న రాక్షసుని జంపిన విష్ణువుయొక్క; సద్మ= గుడిలో; స్వనత్= మ్రోగుతున్న; దుంధుభి= భేరియొక్క; స్వాయత్= ఏపుగా మ్రోగుతున్న; కాహళికా=తుత్తురు బాకాల యొక్క; ప్రతిస్వనత=ప్రతిధ్వని లక్షణం;తోపన్ వినిపించగా; మ్రోయున్=ధ్వనిస్తాయి.

తా : సాయంకాల పూజాసమయాలలో ఆ ఊరి విష్ణు దేవుని గుడిలో ఢంకాలు, బాకాలు మ్రోగితే, వాటి ప్రతిధ్వనులో అన్నట్లుగా ఊరు చివర తోటలలో కొలకులలో విహరిస్తున్న తెల్లని రెక్కలు గల హంసలు తమ రెక్కలను పటపటా మ్రోగిస్తూ 'క్రేం, క్రేం' అన్న కంఠస్వరాలతో పొదరిళ్లలో నుండి ఒక్కసారి గూళ్లకు పోవడానికి లేస్తున్నవి. ఈ పొదరిళ్లలో మ్రోగుతున్న పక్షుల ధ్వనులు గుడిలో మ్రోగే ధ్వనులకు ప్రతిధ్వనులేమో అన్నట్లున్నాయి.

విశే : ఇందులో తోట, గుడి వర్ణింపబడ్డ అంశాలు. గుడికి దీటుగా తోటలో చప్పుడు వినిపించింది. కోవెలలో బాకాలు మ్రోగితే అంచల క్రేం కారాలు వినిపించాయి. గుడిలో ఒక పరమహంస ఉన్నాడు (పరమాత్మ). తోటలో హంస లున్నాయి.

అలం : భ్రాంతి, ఉత్ప్రేక్షల సంకీర్ణత. పక్షుల ధ్వనిని భేరి కాహళికా ధ్వనులకు ప్రతి ధ్వనులని భావిస్తున్నారు. కాబట్టి భ్రాంతి మంతం. ప్రతిధ్వను లేమో అన్నట్లుగా ఉన్నాయి అని చెబితే ఉత్ప్రేక్ష. కనుక ఈ రెంటికి సంక్లిష్టత చెప్పడం సమంజసం. దేవాలయాలు ఉన్న గ్రామాలలో ఇదొక అందమైన దృశ్యం.

మ. పొలయుం గాడ్పులుదఙ్మహాలయవదంభోజాక్ష వక్షస్తులస్య
లఘు స్రఙ్మకరంద బిందువుల c బణ్యారంపు c బుణ్యంపుcగం
పుల c దాపత్రయి మీటి వీట నటన ప్రోద్యోగ సజ్జీభవ
ల్లలనావర్జిత కైశిక క్షరితకల్హారాలి నల్లార్చుచున్. 73

వీటన్=నగరంలో; గాడ్పులు=గాలులు; నటన=నాట్యమన్న; ప్ర+ ఉద్యోగ=గొప్పపనికి; సజ్జీభవత్= ఆయత్తమవుతున్న; లలనా=దేవాలయ వేశ్యలచేత; ఆవర్జిత= ఒక ప్రక్కకు ఒరిగే టట్లు ముడిచిన; కైశిక=కొప్పులలో నుండి; క్షరిత=జారి పడుతున్న; కల్హారాళిన్= ఎర్రకలువల సమూహాన్ని; అల్లార్చుచున్=కదిలిస్తూ; ఉదక్= ఉత్తరాన; మహత్=గొప్ప; ఆలయవత్= ఆలయము గలవాడైన; అంభోజ+అక్ష=తామరపూల వంటి నేత్రాలు గల హరియొక్క; వక్షః= ఎదపై నున్న; తులసీ= తులసీదళాలతో గ్రుచ్చిన; అలఘు=పెద్ద; స్రక్=దండలయొక్క; మకరంద=తేనెయొక్క; బిందువులన్= బొట్లచేత; పణ్యారంపు= నైవేద్యాలైన పిండి వంటలయొక్క; పుణ్యంపు=పవిత్రమైన; కంపులన్=వాసనలచేత; తాపత్రయ= ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధి భౌతికములన్న మూడురకాల పాపాలను; మీటి= పోగొట్టి; పొలయున్=వీస్తాయి.

తా : ఆ నగరంలో గాలులు నగరానికి ఉత్తర దిశన దేవాలయంలో ఉన్న స్వామియొక్క మెడలోని పెద్దతులసీమాలల మీదుగా ప్రసరించి ఆ మాలికా వాసనలను పీల్చుకొని, తర్వాత నైవేద్యంగా అర్పింపబడ్డ పిండి వంటల సుగంధాలను ఒంటి నిండా అలము కొని తీవిగా వీస్తున్నాయి. అదే సమయంలో గుళ్లో పూజాసమయంలో నాట్యం కోసం సమాయత్త మవుతున్న దేవదాసీజనం కొప్పులలో అలంకరించు కొన్న ఎర్ర కలువలు జారుతూ ఉంటే వాటిని నిమురుతూ వీస్తున్నాయి.

విశే :- తమిళంలో ఈ స్వామికి పేరు వడప్పెరుం గోయిలుడైయాన్. దానికి సంస్కృతీకరణం ఉదజ్మహాలయవత్. రాయలవారు ఈ తమిళనామాలను చాలా అందంగా సంస్కృతీ కరించిన సందర్భాలు కావ్యంలో చాలా చోట్ల కనిపిస్తాయి. 'కంపు' శబ్దం పరిమళార్థంలో ప్రాచీన భాషలో ఉన్నది. తాపత్రయం - ఆధ్యాత్మిక తాపం. పంచభూతాల వల్ల కలిగే ఆధి భౌతికం. ఆధి భౌతికమంటే దైవాను గ్రహం లేక పోవడం చేత కలిగే బాధ. ఈ మూడింటిని పోగొడుతూ గాలి వీస్తున్నది. ఆ గాలిలో ఈ మూడింటిని పోగొట్టే లక్షణాలను ఆరోపించాడు. తులసిమాల వాసన ఆధ్యాత్మిక దుఃఖాన్ని; నైవేద్య పరిమళం ఆధి దైవిక దుఃఖాన్ని, వేశ్యల కొప్పుల్లోని ఎర్ర కలువల స్పర్శ చేత కలిగిన శీతలత్వ వాసనాదులు ఆధి భౌతిక దుఃఖాన్ని తొలగిస్తున్నవి. ఇక్కడ వేశ్యలు దేవాలయంలోని నాట్యకత్తెలు కనుక వారి కొప్పులలోని పూలు కూడ దేవార్పితము లైనవి. కనుక ఈ వర్ణన సమంజసంగా భావించాలి.

అలం : స్వభావోక్తి. ఈ పద్యం కూడా పై పద్యంలాగే సాయంకాల పూజా సమయాన్ని వర్ణిస్తున్నది.

ప్రాతః కాలం

చ. మలయపు గాలి రేలు వనమాలి విమాన పతాక ఘల్లు మం
చులియఁ బసిండి మువ్వగమి నొక్కొకమాటు గదల్ప, నుల్కి మి
న్నలము తదీయ హేమ వరణాంచల చంపక శాఖలందుఁ బ
క్షులు రొదసేయ, వేగెనని కూడుదురల్కలు దీఱి దంపతుల్. 74

రేలు= రాత్రిసమయాలలో; మలయపుగాలి= మలయ మారుతం; వనమాలి= వనమాల అన్న విశేషమైన కంఠహారం కలవాడు మన్నారు స్వామియొక్క; విమాన= ఆలయ శిఖరమందున్న; పతాకన్=ధ్వజస్తంభమందున్న జండాకు కట్టిన; పసిండి మువ్వగమిన్= బంగారపు మువ్వల సమూహాన్ని; ఘల్లుమంచు + ఉలియన్=ఘల్లుమని ధ్వనిస్తే; ఒక్కొకమాటు= అప్పుడప్పుడు ఆగి ఆగి; కదల్పన్=కదిలిస్తే; మిన్ను = ఆకాశాన్ని; అలము= ఆక్రమిస్తున్న; తదీయ= ఆ గుడియొక్క; వరణ=ప్రాకారముయొక్క; అంచల= చివరలపై; చంపక= సంపెంగ చెట్లయొక్క; శాఖలందున్= కొమ్మలలో; పక్షులు= పిట్టలు; ఉల్కి= ఉలిక్కిపడి ( ఇది ఉలికి పడు శబ్దానికి వ్యావహారిక రూపం); రొద సేయన్= సవ్వడి చేయగా; దంపతులు= భార్యా భర్తలు; వేగెన్+అని= తెల్లవారెనని; అల్కలు= ప్రణయకోపాలు; తీఱి=పోయి; కూడుదురు=కలుస్తారు.

తా : ఆ నగరంలో మలయ మారుతం మన్నారు స్వామి ఆలయ ధ్వజస్తంభ పతాకం తాకి దానికి వ్రేలాడే బంగారు మువ్వలను కదిలించే సరికి అవి కల కలమని ధ్వని చేసాయి. ఆ ధ్వనికి కోవెల ప్రహరీ గోడ పైదాకా పెరిగిన సంపంగి చెట్ల కొమ్మలలో పక్షులు ఉలిక్కి పడి లేచి రొద చేయడం ప్రారంభించాయి. అది విని తెల్లవారి పోయిందని దంపతులు ప్రణయ కోపాలు తీర్చుకొని కూడుతున్నారు.

అలం : భ్రాంతిమంతము.

విశే : ద్వితీయాశ్వాసంలో ఇదే గాలి వర్ణింపబడుతుంది. దానితో ఇదిపోల్చుకొని చదువుకోవాలి. అలాగే తర్వాతి పద్యంతో పోటీపడే వర్ణనలు కూడా రాబోతున్నాయి. నిలిపుత్తూరు, మధురానగర వర్ణనల ఔచిత్యాన్ని పోల్చి చూచుకోవాలి. (విశేషాలకు చూడు పీఠిక)

ముంగిళ్ళు

చ. కలమపు టెండుగుల్ ద్రవిడ కన్యలు ముంగిట (గాచుచుండి, త
జ్జలరుహనాభ గేహరురుశాబము సారెకు బొక్కు లాడఁ, గొం
డెలపయి కమ్మ గ్రామ్య తరుణీతతి డించిన పేఁప గంపలం
దలమగుచున్న చెంగలువ దండల (దోలుదు రప్పురంబునన్. 75

ఆ+ పురంబునన్= ఆ నగరిలో; ద్రవిడ కన్యలు= ద్రవిడ బాలికలు; ముంగిటన్=ముంగిట్లో; కలమపుటెండుగుల్= ఎండలో ఆరబోసిన కలమపు వడ్లను; కాచుచున్ - ఉండి= కాపలా గాస్తూ కూర్చుండి; తత్= ఆ, జలరుహనాభ=పద్మం నాభియందు గల హరియొక్క; గేహ=కోవెలకు చెందిన; రురుశాబము= లేడిపిల్ల; సారెకున్= మాటిమాటికి; బొక్కులు+ ఆడన్= బొక్కుతూ ఉండగా, కొండెల పయికిన్= సిగలపై అలంకరించుకోవడానికి; అమ్మన్= అమ్మగా; గ్రామ్యతరుణీతతి పల్లెటూళ్ల నుండి వచ్చిన స్త్రీ సమూహం; డించిన= దింపుకున్న; పేఁప గంపలన్= పేను బెత్తంతో చేసిన తట్టలలో; దలము=దట్టము; అగుచున్న= అవుతున్న; చెంగలువ దండలన్= ఎర్రకలువల మాలలతో; తోలుదురు= ఆ లేడి పిల్లను తోలుతున్నారు.

తా : ఆ విలుపుత్తూరులో ఇళ్లముంగిళ్లలో పెద్దలు ధాన్యాన్ని ఎండ బోశారు. దాన్ని కాపలా కాస్తున్నారు అవివాహితలైన బాలికలు. ఈ సమయంలో పల్లెటూళ్ల నుండి ఎర్రకలువల దండలు అమ్మడానికి గంపలు వచ్చాయి. వాటిని బేరమాడుతున్నారు బాలికలు. ఇంతలో స్వామి కోవెలలోని పెంపుడు జింక పిల్లవచ్చి ఈ ధాన్యాన్ని బొక్కుతున్నది. అది చూచిన బాలికలు కొంటున్న ఎర్ర కలువల దండలతో దాన్ని అదిలిస్తున్నారు.

విశే : మన దేశంలో ఇది స్వాభావిక రమణీయమైన దృశ్యం. స్వామి కోవెల రురుశాబం కనుక దానిని కొట్టడానికి వీలులేదు. ఊరుకుంటే ధాన్యాన్ని బొక్కుతున్నది. కనుక సునాయాసంగా ఎర్రకలువల దండలతో అదిలిస్తున్నారు. తల్లులు లోపల పని చేసుకుంటూ పిల్లలను కాపలా పెట్టారు. ఆ పిల్లలకు పూలంటే మక్కువ. పల్లెల నుండి గంపలలో పూలు తెచ్చి అమ్మే కోనటం అతిసహజమైన విషయం.

అలం : స్వభావోక్తి.

పై నాలుగు పద్యాలు దేవాలయమున్న గ్రామంలోని పవిత్ర వాతావరణ వర్ణన. ఈ దేవాలయమే భారతీయ నాగరికతకు గుండెకాయ. కనుక కావ్యంలోనూ ఈ దేవాలయంలోని భగవంతుడే నాయకుడు. కనుక ఇది నాయకుని గృహవర్ణన. గుడిలో సాయంకాల పూజలు, మంగళవాద్యాలు, నాట్యాలు, నైవేద్య సమర్పణలు, తోటలలో పక్షుల రొదలు, ఆలయ విమాన పతాకలు కదిలిస్తూ వీచే గాలులు, అవి

ప్రేరణగా దంపతుల శృంగార సమావేశాలు, మధ్యాహ్నకాలంలో ఇళ్లముంగిళ్లలో ఉన్న ఈ చివరి పద్యం దృశ్యం ఇదంతా కలిపి ఒక అందమైన వాతావరణం.

భాగవతులు :

సీ. ఎదురేఁగి సాష్టాంగ మెరఁగి పాద్యంబిచ్చి,
నారికేళ కటాసనముల నునిచి,
నును బోఁక పొత్తిఁ గుట్టిన దొప్పగమితోడ
రంభా విశాలపర్ణములు పఱచి,
శాల్యన్న సూపాజ్య కుల్యా బహువ్యంజ
నక్షీర దధు లర్పణంబు చేసి,
వార్చిన పిదప సంవాహన మంఘ్రుల
కొనరిచి, తాంబూల మొసఁగి, కుశల

తే. మడిగి, పోయెద మన్న దవ్వనిచి, సిరికిఁ
దగిన సత్కృతి చేసి, ఖేదమున మగిడి
యర్చఁగావింతు రెపుడు నిట్లతిథులైన
భాగవతులకు నప్పురి భాగవతులు. 76

ఆ+ పురిన్= ఆ నగరంలో; భాగవతులు= భగవద్భక్తులు; అతిథుల్= తిథిలేకుండా ఆగంతుకులు; ఐన; భాగవతులకున్= భక్తులకు; ఎదురు+ ఏగి=నగరంలోకి ప్రవేశిస్తున్నపుడే ఎదురుగా వెళ్లి; స+ అష్ట+ అంగము= ఎనిమిది అంగములతో కూడునట్లుగా; ఎరగి= నమస్కరించి;పాద్యంబు=కాళ్లు కడుక్కోవడానికి నీళ్లు; ఇచ్చి; నారికేళ= కొబ్బరి చెట్ల ఆకులతో కుట్టిన; కట+ ఆసనములన్=చాపలు అన్న ఆసనాలపై; ఉనిచి=కూర్చోబెట్టి; నును= లేత; పోకపొత్తిన్=పోకచెట్ల ఆకులతో కుట్టిన; దొప్ప= దొన్నెలయొక్క; గమితోడన్ = సమూహంతోపాటుగా; రంభా= అరటి; విశాల=వెడల్పైన; పర్ణములు= ఆకులు; పఱచి= వేసి; శాలి+ అన్న=వరి అన్నము; సూప= పప్పు; ఆజ్యకుల్య=నేతి కాల్వలు; బహు= అనేక; వ్యంజన= కూరలు; క్షీర=పాలు; దధులు= పెరుగు; అర్పణంబు చేసి= సమర్పించి; వార్చిన పిదపన్= ఆచమనం చేసిన తర్వాత; (భోజనం పూర్తి అయ్యాక కాళ్లు చేతులు కడిగి ఆచమనం చేయడం ఆచారం) అంఘ్రులకున్=పాదాలకు; సంవాహనము= ఒత్తుట; ఒనరించి=చేసి; తాంబూలము= తమల పాకులతో చుట్టిన వీడెము; ఒసగి= ఇచ్చి; కుశలము+ అడిగి= క్షేమాలు విచారించి; పోయెదము+ అన్నన్ = అతిథులు తాము వెళుతున్నామనగానే; దవ్వు+ అనిచి= దూరం పంపించి; సిరికిన్= సంపదకు; తగిన= ఉచితమైన; సత్కృతి చేసి= సన్మానం చేసి (దక్షిణ యిచ్చి); ఖేదమునన్= దుఃఖంతో; మగిడి= తిరిగి వచ్చి; ఇట్లు= ఈ విధంగా; ఎపుడున్= నిత్యం; అర్చ గావింతురు = అతిథిసేవ చేస్తారు.

తా :- ఆ నగరంలో విష్ణుచిత్తు డున్నాడు. వారి అతిథిసేవలు ఈ పద్యంలో చాలా సొగసుగా వర్ణింపబడినవి.

అది పుణ్యక్షేత్రము కనుక దూరం నుండి వచ్చే భక్తులకు ఎదురుగా వెళ్లి యింటికి తీసికొని వచ్చి పాద ప్రక్షాళ నార్థం నీరిచ్చి వాళ్లు కడుక్కోగానే కొబ్బరి ఆకుల

చాపలు పరచి వారిని సుఖాసీనులను చేస్తారు. ఆ ఊరి నిండా అరటి తోటలుంటాయని చెప్పాడు. కనుక పెద్ద పెద్ద ఆకులు పరచి వాటిపైన లేత పోక పొత్తులతో కుట్టిన దొన్నెలు పెట్టి, వాటి నిండా అన్నం, పప్పు, నెయ్యి, అనేకమైన కూరలు, పాలు, పెరుగు సమర్పించి వారు భోజనం చేసినాక దూరం నుండి నడిచి వచ్చారు కనుక ఆయాసం పోవడానికి కాళ్లు ఒత్తి తాంబూల మిచ్చి క్షేమాలు విచారిస్తారు. అతిథులు సేదతీరి బయలు దేరు తుంటే వారిని ఊరి అవతల దాకా సాగనంపి (చెరువో, కాలువో వరకు అతిథులను సాగనంపడం ఆచారం) తిరిగి దిగులుతో ఇంటికి వస్తారు

విశే : సాష్టాంగము=రెండుచేతులు, రెండు కాళ్లు=నాలుగు; వక్షః-స్థలం-5, లలాటం=6; భుజములు=రెండు ఈ ఎనిమిది అవయవాలు నేలను తాకేటట్లుగా ప్రణామం చేయడం. ఇది ప్రాచీన కాలంలో పెద్దవారిని గౌరవించే పద్ధతి. విలిపుత్తూరు చుట్టూ అరటితోటలు, పోకతోటలు విస్తారంగా ఉన్నట్లు పూర్వవర్ణనలు చేయబడ్డాయి. కనుక పద్యంలో ద్వితీయ పాదం చాలా సహజంగా ఉంది. మన రాష్ట్రంలో ఈత, తాటి చాపలు మెండు. పాద సంవాహనం చేయడం అహంకారం లేని మనిషికే సాధ్యం. అతిథి సాక్షాత్తు శ్రీమన్నారాయణుడు. కనుక ఈ అతిథి అభ్యాగత సేవలు పూర్వకాలంలో దేశంలో ఉండేవి. ఆనాటి మనిషి నేటిమనిషి లాగా అహంకారి కాడు. స్వార్థపరుడు కాడు కనుక ఈ పద్యంలో వర్ణింపబడ్డ విషయం స్వభావోక్తి తప్ప అన్యం కాదు.

విష్ణుచిత్తుడు :

శా. అందుండుం ద్వయ సద్మ పద్మ వదనుం డద్వంద్వు (డశ్రాంత యో
గాందూబద్ధ మధు ద్విషద్ద్విర దుఁడన్వర్థా భిధానుం డురు
చ్ఛందో బృంద తదంత వాగపతనా సంజాత తజ్జన్యని
ష్పంద ద్వైత సుసంవిదాలయుఁడు నిష్ఠ న్విష్ణు చిత్తుండనన్. 77

అందున్= ఆ నగరంలో; (పైన వర్ణించిన భాగవతులలో) ద్వయ=ద్వయమన్న శ్రీ వైష్ణవ మంత్రమునకు; సద్మ=గృహమైన; పద్మ వదనుండు=తామర పూవు వంటి ముఖం కలవాడు; అద్వంద్వుడు=చలి, వేడి; స్త్రీ పురుషులు; సుఖదుఃఖాలు వంటి వాటికి అతీతుడైన వాడు; అశ్రాంత=నిత్యమూ; యోగ=యోగ మనెడు, అందూ=సంకెలతో; బద్ధ=బంధింపబడ్డ; మధుద్విషత్= విష్ణువన్న (మధువన్న రాక్షసున్ని చంపిన వాడు); ద్విరదుడు= ఏనుగు కలవాడు (ద్వి+రద=రెండు దంతాలు కలది); ఉరు=గొప్ప; ఛందః =వేదాల యొక్క; బృంద=సమూహం; తత్= ఆ వేదాలయొక్క; అంత=కడపటి భాగము లైన ఉపనిషత్తులయొక్క; వాక్=వాక్యములయొక్క; అపతన= చదవ కుండానే; సంజాత =పుట్టిన; తత్+జన్య=వేద వేదాంతముల వలన జన్మించే; నిష్పంద=సుస్థిరమైన; ద్వైత=జీవేశ్వరులకు సంబంధించిన; సుసంవిత్=మంచి జ్ఞానమునకు; ఆలయుడు= గృహమైన వాడు; అను+అర్థ=అర్థమునకు తగిన; అభిధానుండు=పేరుగలవాడు; నిష్ఠన్= విష్ణుభక్తియందు గలిగిన నిష్ఠతో; ఉండున్= ఉన్నాడు.

ఆ నగరంలో ఉన్న భాగవతులందరిలోకి పరమశ్రేష్ఠుడైన సార్థక నామధేయుడు విష్ణుచిత్తుడున్నాడు. అతడు ద్వయ మన్న శ్రీవైష్ణవ మంత్రమునకు ఆశ్రయమైన పద్మంవంటి ముఖం కలవాడు. స్త్రీ పురుష, శీతోష్ణ, సుఖదుఃఖాది ద్వంద్వానికి అతీతుడైన వాడు. (ద్వంద్వమంటే లోకం. చీకటి వెలుగులు ఒకటి ఉంటే మరొకటి ఉంటుంది. భగవంతుడు ఏక పదార్థం). నిత్యమూ భక్తి యోగమన్న గొలుసుతో హృదయంలో బంధింపబడ్డ విష్ణుమూర్తి అన్న ఏనుగు కలవాడు. వేద వేదాంతాలను చదవకుండానే జీవుడంటే, ఈశ్వరుడంటే ఏమిటో తెలిసినవాడు. ఇవి విష్ణుచిత్తుని లక్షణాలు.

విశే : అద్వంద్వుడు=గోదాదేవి కథలో విష్ణు చిత్తుడు కామప్రవృత్తి తెలియని వాడు అని చెప్పబడింది. (చూడు 5-156) అతనికి భార్య ఉన్నా కాముకుడు కాడు. శ్రీరామకృష్ణ పరమహంసకు శారదాదేవి ఉన్నట్లు అతనికి భార్యవుంది. శ్రీవైష్ణవం గృహస్థాశ్రమానికి, అద్వైతం సన్యాసాశ్రమానికి ప్రాధాన్య మిచ్చిన మతాలు. 3,4 మధురా చక్రవర్తి కథలో ప్రదర్శింపబడ్డ అంశాలు. మూడవ అంశమే అవతారిక 10వ పద్యంలో వర్ణింపబడ్డది

ద్వయమంత్రం - శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే.
శ్రీమన్నారాయణాయ నమః

ద్వయమంటే - జగత్పిత - జగన్మాతలకు = ఏకరూపభావన చేయటం. ప్రపద్యే = 1) స్వరూప సమర్పణ, భారసమర్పణ 2) నమః - 1. అహంకారనిరాసం 2. బాధ్యతను భగవంతుకివ్వడం.

విష్ణుచిత్తుడు= చిత్తంలో నిత్యమూ విష్ణువు కలవాడు. కనుక పెరియాళ్వారు= పెద్దభక్తుడు అని కీర్తింపబడ్డాడు.

వ. అమ్మహీసుర వరుండు ప్రకృతి కంటెఁ బరుండగు దన్నును, దనకంటెఁ బరుండగుఁ పరమేశ్వరుం, బరమేశ్వర ప్రసాద బహుజన కృత సుకృత ఫల రూపయగు నాచార్య కృప గుప్త దానంబు నిధానంబు ఁ దెలిపిన గతిం దెలుపఁగా, నాత్మీయ తదీయ శేషశేషిత్వ సంబంధం బనాద్యంబుగా ఁ దెలిసి; ''యీ తెలివి గలిగి యఖండ నిర్వృతింగాంచి సుఖించు పరమ యోగికి బహు క్లేశదంబులగు చదువులం బనియేమి? యీ వివేకంబు లేనివాని హేతువాదంబు, ధాతు వాదంబు; కాణాదంబు, ప్రాణాదంబు; కాపిలంబు, చాపలంబు; మీమాంస, హింస; వ్యాకరణం, బకరణం; బటుగాక చదువ దొరకొనిన నరునకు ఁ గాలంబు, నాలంబు విఘ్నంబులు సకలోద్యమఘ్నంబు, లందులకు సామగ్రి గిట గిటన; కొంతెఱుంగనగు మదంబు పుట పుటన; దుద ముట్టం జదివె నేనియు సముత్పన్న విజ్ఞానుడై త్రైగుణ్య విషయంబులగు వాని నాసీత ధాన్యందు నిష్ఫలంబైన పలాలంబును లబ్ధమధుండు సిక్థకంబును విడుచు వడువునం విడువవలయు ఁ గావున శాంతి దాంతి పరతంత్ర ఁ బరమైకాంగినైన నాకు మొదలనివి యధిగమింపం దుద విసర్జింప నేమి ప్రయోజనంబు, వాది భంజనంబు రాజరంజనంబును జేయుచుఁ బునర్జననంబులకు విసువనిజనంబులకు ఁ గానిమ్ము, మాదృశులకు దదీయ ఖ్యాతి యాతి, లాభంబు క్షోభంబు పూజనం బుద్వేజనం,'' బని వితర్కించి యుర్వర ఁబూర్వంబున సౌవీర భూరమణునకు గౌరవం బంగీకరించి బోధించి ముక్తి కనిచిన

భరత భూమి సురవతం సంబునుంబోలె దుర్విభావ్యబోధుండై పరమపదంబునను భాగవతుల కప్రాకృతంబులగు బహుభద్రమూర్తులు భరియించి భగవత్పరిచర్య సేయుటయె పరమ పురుషార్థం బగుట యెఱిఁగి యచటి రథ చరణ పాణి మాలికా కరణ కైంకర్యంబున కంకురిత కౌతూహలుండై చేయుచుండె. మఱియును. 78

ఆ+మహీసురవరుండు= ఆ బ్రాహ్మణ శ్రేష్ఠుడు; ప్రకృతికంటెన్= 24 తత్వాలు కల ప్రధాన మన్న అచిత్తు కంటే; పరుండు= వేరైన; తన్నున్= జీవుడైన తనను; తనకంటెన్= జీవుడైన తన కంటె; పరుండు=వేరైన; పరమేశ్వరున్=శ్రీ విష్ణువును; పరమేశ్వర ప్రసాద= భగవత్కృప చేత; బహుజన కృత సుకృత= అనేక జన్మలలో చేయబడ్డ పుణ్యముయొక్క; ఫలరూప=ఫలమే రూపముగా కలదైన; ఆచార్యకృప= తత్వబోధకుడైన గురువు అనుగ్రహము; గుప్తదానంబు= రహస్యంగా ఇచ్చిన దానం; నిధానంబున్= భూమిలో పాతివేసిన నిధిని; తెలిపిన గతిన్= చెప్పిన విధంగా; తెలుపగాన్= బోధింపగా (అచిత్తు= ప్రకృతి; చిత్తు= జీవుడు ఈ రెంటికంటె విశిష్టుడైన వాడు శ్రీ విష్ణువు కనుక ఈ మతం శ్రీ విశిష్టాద్వైతం.) ఆత్మీయ=తనది; తదీయ= భగవంతునిది; శేష శేషిత్వ సంబంధంబు= సేవకుడు, యజమాని అన్న సంబంధం (భగవంతునకు జీవునకు గల సంబంధం); అనాద్యంబుగా= నిత్యమైనదిగా (న+ ఆద్య=అనాద్య= ఆది లేనిది) తెలిసి= ఎరిగి; (విష్ణు చిత్తుడిలా అనుకున్నాడట) ఈ తెలివి కలిగి= ఈ జ్ఞానము కలిగినాక; అఖండ=సంపూర్ణమైన; నిర్వృతిన్= ఆనందమును; కాంచి=పొంది; సుఖించు సరమ యోగికి= పరమేశ్వర దర్శనంలో మైమరచి యున్న యోగికి; బహు= అనేక; క్లేశదంబులు= కష్టాన్ని కలిగించే; చదువులన్=చదువుతో; పని ఏమి= ఏమి పని; ఈ= ఇలాంటి; వివేకంబు= జ్ఞానం లేని వాని; హేతువాదంబు= చార్వాకమతం (కారణ కార్య సిద్ధాంతం); ధాతు వాదంబు=రసవాదం వంటిది (ఇనుము మొదలైన లోహాలను బంగారంగా మార్చే విద్య) అసత్యవిద్య; కాణాదంబు= కణాద మహర్షి వ్రాసిన వైశేషిక దర్శనం; ప్రాణాదంబు= ప్రాణాలు తీసేది; కాపిలంబు= కపిల మహర్షి చెప్పిన సాంఖ్య దర్శనము; చాపలంబు= చపలస్వభావం కలది; మీమాంస= జైమిని ముని వ్రాసిన పూర్వమీమాంసా దర్శనం; హింస=యజ్ఞయాగాదులలో పశుహింసను బోధించేది; వ్యాకరణంబు= శబ్దశాస్త్రం; (పాణిని చెప్పినది అష్టాధ్యాయి) దానిపై వరరుచి వ్రాసిన వార్తికమన్న లఘువివరణ; దానిపై వివరణాత్మకంగా పతంజలి మహర్షి వ్రాసిన మహాభాష్యము. దీనికి శబ్ద శాస్త్రమని పేరు) అకరణంబు= రక్షించేది కానిది; (నహి నహిరక్షతి డుకృఞ్ కరణే - అని శంకర భగవత్పాదుల భజగోవింద స్తుతిలో చెప్పినట్లు) చదువన్=చదువుకోవడానికి; దొరకొనినన్= ఒక వేళ పూనుకొంటే; కాలంబు= కాలము; న+అలంబు=చాలదు; విఘ్నంబులు= అంతరాయాలు; అఖిల=సమస్త; ఉద్యమ=ప్రయత్నాలను; ఘ్నంబులు= నాశనం చేసేవి; అందులకు=దానికై; సామగ్రి=సాధనసంపత్తి; గిటకిటన= మిక్కిలి తక్కువ; కొంత ఎఱుంగన్=కొంత తెలిస్తే; అగు+మదంబు=కలిగే గర్వము; పుట పుటన= అతిశయమైనది; తుద ముట్టక చదివెనేని= పారముముట్టేంత వరకు చదివితే; సముత్పన్న=పుట్టిన; విజ్ఞానుండు= శాస్త్రజ్ఞానం కల పండితుడు; త్రైగుణ్య విషయంబులగు వాని : సత్యం, రజస్సు, తమస్సు అన్న మూడు గుణాలు

గలిగిన ప్రపంచ విషయాలు; ఆసీతధాన్యుండు= తెచ్చుకొన్న ధాన్యం కలవాడు; నిష్ఫలంబైన =ఫలం లేని; పలాలంబున్=గడ్డిని; ఆలబ్ధమధుండు= తేనెను సేకరించుకొన్నవాడు; సిక్థకంబును= మైనమును; విడుచు వడువునన్= వదిలినట్లుగా; విడువ వలయున్==త్యజించాలి; కావునన్=కాబట్టి; శాంతి= బాహ్యేంద్రియ నిగ్రహము; దాంతి= అంతరింద్రియ నిగ్రహమును; పరతంత్రతను= పరాధీను లైనందువలన; పరమ+ ఏకాంగినైనన్= గొప్పవైరాగ్యముగల భక్తుడనైన; నాకున్; మొదలన్=ముందు; ఇవి= ఈ శాస్త్ర విద్యలను; అధిగమింపన్= అధ్యయనం చేయడం; తుదన్= చివరకు; విసర్జింపన్=త్యజించడానికి; ఏమి ప్రయోజనంబు= ఏమి లాభం; వాదిభంజనంబు=ప్రతివాదులను జయించడం; రాజ రంజనంబున్=రాజులను రంజింప చేయడం; చేయుచున్=చేస్తూ; పునర్జననంబులకున్= తిరిగి కలిగే జన్మలకు; విసుగని= విసుగులేని; జనంబునకున్=మనుషులకు; కాని=అగుగాక!; మాదృశులకున్= మాబోటి వారికి; తదీయ ఖ్యాతి= ఆ పాండిత్య సంబంధమైన కీర్తి; ఈతి= ఈతి బాధల వంటిది. (ఈతి బాధలని ఆరు. చూడు 2.43) లాభంబు= రాజుల వల్ల కలిగే ధనలాభము; క్షోభంబు=మనస్సునకు కలత; పూజనంబు=పూజాదులు; ఉద్వేజనంబు= మానసిక అవిశ్రాంతి లేదా గర్వము'', అని; వితర్కించి= బాగా ఆలోచించి; ఉర్వరన్= లోకంలో; పూర్వంబునన్=పూర్వ కాలంలో; సౌవీర భూరమణులకున్= సౌవీర మన్నదేశాన్ని పాలించిన రాజైన రాహూగణునకు; గౌరవంబు= గురుత్వాన్ని; అంగీకరించి= స్వీకరించి; బోధించి= జ్ఞాన బోధ చేసి; ముక్తికిన్=మోక్షమునకు; అనిచిన=అంపిన; భరత=భరతుడన్న; భూమి సురవతంసంబున్=బ్రాహ్మణోత్తముని; పోలెన్=వలె; దుర్విభావ్య బోధుండై= ఊహింపరాని జ్ఞానము కలవాడై; పరమ పదంబునన్= వైకుంఠము నందు సైతము, భాగవతులకున్=భక్తులకు; ప్రాకృతంబులు=ప్రకృతి పరిణామాలకు లోబడని దివ్యములైన; బహుభద్రమూర్తులు= అనేక కల్యాణ రూపాలు; భరియించి= ధరియించి; భగవత్పరిచర్య= విష్ణువును సేవించుటయే; పరమ పురుషార్థము= ఉత్కృష్టమైన పురుషార్థము (మోక్షము); అగుట ఎరింగి= కావడం తెలిసి; అచటి= ఆ నగరంలో ఉన్న; రథ చరణపాణి= చక్రము చేతిలో గల విష్ణువుయొక్క; మాలికా కరణ=పూలదండను కట్టుట అన్న; కైంకర్యంబునకు=సేవలకు (కింకరుడు=సేవకుడు, వానిచేష్ట కైంకర్యము); అంకురిత=మొలచిన; కౌతూహలంబు=కుతూహలము, కోర్కెగలవాడు; చేయుచుండెన్=పూల దండలు కట్టి భగవంతునికి అలంకరించడమన్న సేవలు చేస్తూ; మరియున్= ఇంకా.

తర్వాతి పద్యానికి అన్వయము :

ఈ వచనంలో విష్ణుచిత్తుని స్వభావం వర్ణింపబడ్డది. అతనికి చదవకుండానే చిత్తు అచిత్ ఈశ్వరసంబంధమైన జ్ఞానం, గురువు అనుగ్రహం వల్ల నిధి నిక్షేపాలు అంజనం వల్ల తెలిసినట్లుగా- తెలిసింది. (కళ్లకు ఒక రకమైన కాటుక వ్రాసుకుంటే నిధులు కనిపిస్తాయని అంటారు. కనుక గురు కృపనే అంజనంగా కవులు వర్ణిస్తారు. గురుకృపాంజన్ పాయో మేరే భాయి- అని ఏకనాథుని పాట ఉన్నది.) భగవంతుడు శేషి (స్వామి) జీవుడు శేషుడు (దాసుడు) అన్న జీవేశ్వర సంబంధం అనాది సిద్ధమైనదని

తెలిసింది. కనుక ఈ భగవత్ జ్ఞాన మన్న సుఖం మరిగిన యోగికి క్లేశకారకములైన చదువుల వల్ల ప్రయోజన మేమిటని అనుకొన్నాడట . కనుక వానికి హేతువాదం (చార్వాకమతం)= ధాతువాదం; వైశేషిక దర్శనం=ప్రాణాంతకం; సాంఖ్యశాస్త్రం=చాపల్యాన్ని కలిగించేది. పూర్వమీమాంస పశుహింస బోధిస్తున్నది. వ్యాకరణం రక్షించేది కాదు. అలా కాకుండా చదవడం మొదలు పెడితే కాలం సరిపోదు. కాదు కదా ప్రయత్నాన్ని విఘ్నాలు చెడగొడతాయి. విద్యకు కావలసిన సాధన సంపత్తికీ కొరతే. కొంచెం జ్ఞానం కలిగితే గర్వం విజృంభిస్తుంది. ఒకవేళ ఆసాంతం చదివితే కలిగే విజ్ఞానం వల్ల లౌకిక విషయాలన్ని పరిత్యజింప బడుతున్నాయి. ఎలాగంటే ధాన్యం తెచ్చుకొని గడ్డిని వదిలే రైతులాగా, తేనెను పిండుకొని తుట్టెను పారవేసే మనిషిలాగా. కాబట్టి యింద్రియ నిగ్రహం కల మాబోట్లకు యీ శాస్త్రాలు చదవడం దేనికి? చివరికి వదలి పెట్టడం దేనికి! ఒక వేళ పండిత మండలిని జయించి రాజుల వల్ల పొందే సన్మానాలు ఆకర్షణీయాలు కదా అంటే విరక్తుడనూ, భక్తుడనూ అయిన నాకు దేనికి? వాటిని కోరుకొనే వారికి అవి కావాలి. కాని మాబోటి వారికి ఆ కీర్తి ఈతి బాధ. ధనలాభం కలతను కలిగిస్తుంది. రాజసన్మానం గర్వాన్ని కలిగిస్తుంది అని ఆలోచించి పూర్వకాలంలో సింధు రాజునకు గురుత్వాన్ని అంగీకరించి బోధించి ముక్తి కంపిన జడ భరతుని వలె భావన కందని భగవత్ జ్ఞానము కలవాడై ఆ ఊళ్లో ఉన్న మన్నారు స్వామికి పూలదండలు కట్టి అర్పిస్తూ అదే యోగంగా బ్రతుకు తున్నాడు. ఎందుకంటే వైకుంఠంలో కూడా దివ్యదేహాలు ధరించి విష్ణువునకు పరిచర్యలు చేయడమే పరమ పురుషార్థము కనుక.

విశే: శ్రీవైష్ణవం భగవంతునిలో లీనమయ్యే సాయుజ్యమన్న ముక్తిని అంగీకరించక సాలోక్యం (వైకుంఠంలో నివసించడం), సారూప్యం (విష్ణురూపధారణ), సామీప్యం (భగవంతునికి సమీపంలో ఉండడం) అన్న మూడు ముక్తి భేదాలను అంగీకరించింది కనుక. వైకుంఠంలో కూడా భగవత్ పరిచర్య చేయడమే పరమ పురుషార్థమని చెప్పబడింది. దీనికి శ్రీరంగ స్వామి వర్ణన 7-34 వచనం చూడు. లేదా 6-98 చూడు. రాజ రంజనంబు రాబోయే కథా సూచికలు.

జడ భరతుని కథ పురాణ ప్రసిద్ధమైనది. జడ భరతుడన్న వాడు సవతి తల్లి కొడుకును పొలం కాపలాగా నియమించారు. అతడు మహాముని. ఆ దారినే రహూగణుడన్న సౌవీర రాజు సవారి ఎక్కి పోతున్నాడు. పల్లకీ మోస్తున్న బోయీలు జడభరతుని చూపించారట. రాజు దండించాడు. అపుడు జడ భరతుడు రాజునకు తత్త్వబోధ చేశాడు. భయపడి రాజు అతడి పాదాలపై బడి ఆత్మ విద్యను ఉపదేశింపమని వేడుకుంటే ఆ ముని అతనికి గురుత్వాన్ని అంగీకరించి బోధించి ముక్తికి పంపించిన కథ భాగవతంలో 5వ స్కంధం మొదటి ఆశ్వాసంలో ఉన్నది.

అలం : 1. బహు క్లేశదంబులు ----------విడుచు వడువునన్ - దీపకం.

2. హేతువాదంబు, ధాతువాదంబు -------అశరణంబు - అన్నచోట అంత్యాను ప్రాస.

క॥ న్యాయార్జిత విత్తంబున
నాయోగీశ్వరుఁడు వెట్టు నన్నం బాప్రా

లేయ పటీరాచాల ప
ధ్యాయాతాయాత వైష్ణ వావలి కెల్లన్. 79

ఆ యోగీశ్వరుఁడు=పై వచనంలోని, దానిపై పద్యంలోను విష్ణు చిత్తుడు మహాయోగిగా చెప్పబడ్డాడు కనుక దానిని సంగ్రహిస్తూ కవి యీ విశేషణం వాడటం గమనింప దగ్గది, న్యాయ+ ఆర్జిత విత్తంబున=న్యాయంగా సంపాదించిన డబ్బుతో; (న్యాయంలోకనీతి. ధర్మం తాత్త్విక నీతి) ఆ ప్రాలేయ పటీరాచల= మంచుకొండ మొదలు కొని గంధపు కొండ దాకగల (మలయ పర్వతం); పథ్యా=మార్గంలో; యాత+ ఆయాత=పోయేవారు, వచ్చేవారు అయిన; వైష్ణవ+ ఆవలికిన్= విష్ణు భక్తుల సమూహానికి; ఎల్లన్=మొత్తానికి; అన్నంబు= ఆహారం; పెట్టున్=సమర్పించును.

తా : ఆ వైష్ణవ యోగి హిమాచలం నుండి మలయ పర్వతం దాకా మధ్యనున్న మార్గంలో వచ్చేపోయే వైష్ణవ భక్తులందరికి న్యాయార్జిత ధనంతో అతిథి మర్యాదలు చేస్తున్నాడు.

విశే : యోగీశ్వర శబ్దం పై పద్య వచన తాత్పర్యాన్ని సంగ్రహించి రూపొందించినది. అతడు అతిథిమర్యాదలు ఎలా చేస్తున్నాడో క్రింది పద్యాలలో వర్ణింప బడుతోంది. గతించిన, రాబోతున్న విషయాలు రెంటికి పద్యం కొలికి పూసగా, లంకెగా వ్రాయబడడం కథా నిర్మాణంలో ఉన్న తర్కం, ఇది మహాకావ్య నిర్మాణంలో కనిపిస్తుంది.

న్యాయార్జిత విత్తమన్న మాట ఆనాటి మానవ మనస్తత్వానికి, సమాజానికి సంబంధించిన మాట. అధర్మ సముపార్జనము ఆనాటి మానవ మన స్తత్వంలో లేదు. ఒక శతాబ్దం వెనుకకు పోతే మనదేశంలో అతిథి మర్యాదలు, అన్న సంతర్పణ చేయని గృహముండేది కాదు. అందుచేత వర్ణింపబడ బోతున్న అతిథి సేవలు నాటివ్యక్తియొక్క విశిష్టతను సూచించే వాస్తవిక వర్ణనలు. ఇందుకే ప్రాచీన కావ్యాలలో ఈ అతిథి సేవలు వర్ణింప బడ్డాయి. సర్వ మానవులు దైవస్వరూపులన్న విశ్వాసం దీనికి హేతువు. ధనం స్వార్థం కోసం కాక దానం కోసమే వినియోగింప బడేది. ఈ విషయం ఈ కావ్య ద్వితీయాశ్వాసంలో వైశ్యవర్ణనలో సూచింపబడింది. (2-42 , ఇంకా చూ. 4-158)

పూర్వ కాలంలో కాశీరామేశ్వర యాత్ర బహుప్రసిద్ధమైనది. ఈ రెంటిని మనిషి సేవించాలన్న మతదృష్టి మానవుని కుండేది కనుక తీర్థయాత్రలు చేసేవారు. ఈ సామాజిక వాస్తవికాంశము ఈ పద్యానికి నేపథ్యంగా చూచుకోవాలి.

చ. గగనము నీరుబుగ్గ కెనగా జడి వట్టిన నాళ్లు భార్య క
న్నొగ సొరకుండ నారి కెడపుం బొరియ ల్లగిలించి వండన
య్యగపల ముంచి పెట్టుఁ గలమాన్నము నొల్చిన ప్రప్పు నాలుగే
న్నొగపిన కూరలు న్వడియ ముల్వరుగు ల్పెరుగు న్ఘృత ప్లుతిన్. 80

గగనము= ఆకాశము; నీరు బుగ్గకున్= నీరుపైకి పొడుచు కొని వచ్చే ఊటకు; ఎనగాన్=సమానంగా; జడి=

ముసురు; పట్టిన నాళ్లు=పట్టిన రోజులలో; భార్య= ఇల్లాలి యొక్క; కన్=కన్ను; పొగ=ధూమం; చొరకుండన్=సోకకుండా; నారి కెడపున్=కొబ్బరి; బొండియల్=చిప్పలు; తగిలించి=పొయ్యిలో పెట్టి; వండన్=వంట చేయగా; ఆ+అగపలన్= ఆకొబ్బరి చిప్పల గరిటలతో; కలమాన్నమున్=వరి అన్నము; ఒల్చిన ప్రప్పున్=పొట్టు తీసిన కంది బద్దలతో చేసిన పప్పు; నాలుగు+ ఏన్=నాల్గైదు (ఏన్= ఏను= ఐదు); పొగపిన= తాలింపు పెట్టిన; కూరలున్=కూరలు; వడియముల్=వడియాలు; వరుగుల్= ఎండబెట్టిన కూరగాయల ముక్కల వేపుళ్ళు; పెరుగున్=దధి; ఘృతప్లుతిన్=నేతి ధారలతో; ముంచి పెట్టున్,

తా : ఆకాశము నీటిబుగ్గకు సమానంగా ముసురు పట్టిన వాన కాలపు రోజులలో కంటికి పొగ సోకకుండా కొబ్బరి బుఱ్ఱలు పెట్టి భార్య వంట చేస్తే, భర్త కొబ్బరి చిప్పల గరిటెలతో ముంచి అన్నము, పప్పు, నాల్గైదు కూరలు , వడియాలు, వరుగులు, పెరుగు, నేతితో వడ్డిస్తున్నాడు.

విశే : ఇది వర్షాకాల భోజనం. విలిపుత్తూరు గృహ ప్రాంగణాలు కొబ్బరి చెట్లతో అందగిస్తున్నాయని 55వ పద్యంలో చెప్పాడు. కనుక వాటి బుఱ్ఱలు వంట చెరకుగా, వాటి చిప్పలు గరిటలుగా వాడుకోవటం సహజం.

గగనము నీరు బుగ్గ కెనగా - అన్నది చాలా అందమైన ప్రయోగం. చతుర్థ పాదం కూరలున్। వడియముల్ । వరుగుల్ పెరుగున్ । ఘృత ప్లుతిన్ ఈ విరుపుల వల్ల అతడు ధారాళంగా పెడుతున్నాడు అన్న విషయం ధ్వనిస్తున్నది.

చ. తెలి నులి వెచ్చ యోగిరము ఁ దియ్యని చారులు ఁ దిమ్మనంబులున్
బలుచని యంబళు ల్చెఱకు పాలెడనీళ్లు రసావళు ల్ఫలం
బులును సుగంధి శీతజలము ల్వడ పిందెలు నీరుఁజల్లయున్
వెలయఁగ ఁ బెట్టు భోజనము వేసవిఁ జందన చర్చమున్నుగన్. 81

వేసవిన్= ఎండాకాలంలో; చందన చర్చ= గంధపుపూత; మున్నుగన్=మొదటిదిగా; తెలి= తెల్లని; నులి వెచ్చ= కొంచెం వేడిగల; ఓగిరము= అన్నం; తియ్యని చారులున్= బెల్లం వేసిన చారు; తిమ్మనంబులున్= ఆపేరు గల తీపి పదార్థములు; పలుచని అంబళులు= పల్చని అంబళులు లేదా పులుసులు; చెఱకుపాలు=చెఱకు రసం; ఎడనీళ్లు = కొబ్బరినీళ్లు; రసావళుల్= తీపి భక్ష్యములు; (అతిరసములు= అరిసెలు) ఫలంబులును= పండ్లు; సుగంధి శీతజలముల్=వాసనగల చల్లని నీరు; వడపిందెలున్=వేసవి వడను పోగొట్టడానికి ఊరవేసిన మామిడి పిందెలు; నీరు చల్లయున్=నీరు ఎక్కువ కలిసిన మజ్జిగ; వెలయగన్=తృప్తిగా; భోజనము పెట్టున్.

తా : ఇది వేసవి కాల భోజనం గనుక అతిథులకు ముందుగా తాపం చల్లార్చే గంధపుపూత పెట్టి ఆ యా పదార్థాలు వడ్డిస్తున్నారు. ఆ చెప్పిన పదార్థాలన్నీ కూడా వేడిని పోగొట్టే పదార్థాలు .సుగంధి శీత జలములు అంటే కర్పూరమో, వట్టి వేళ్లో వేసిన చల్లని నీరు.

మ. పునుగుందావి నవౌదనంబు మిరియంపుం బొళ్లతోఁ జట్టి చు
య్యను నాదాఱని కూరగుంపు; ముకు మంద్రై యేర్చు నావం జిగు
ర్కొను పచ్చళ్లును, బాయసాన్నములు నూరుంగాయలున్, జేసుఱు
క్కను నేయుం, జిఱుపాలు వెల్లువగ నాహారంబిడు న్శీతునన్. 82

శీతునన్= శీతకాలంలో, పునుగున్ దావి=పునుగు వాసన వేసే; నవ+ ఓదనంబు= అప్పుడే వండిన అన్నము; మిరియంపున్ పొళ్లతోన్= మిరియాల పొడులతో; (ఆనాడు మిరపకాయలు లేవు లేదా ఈనాటి మిరప శబ్దం మిరియపు శబ్దమే కనుక ఉన్నవేమో మొత్తం మీద పోర్చుగీసు నుండి మనకు చిలీ దేశంనుండి ఈ మిరపకాయలు వచ్చాయంటారు.) చట్టి= మట్టి పాత్ర; చుయ్యను= చుయ్యిమను అనుకరణధ్వని; నాదు =ధ్వని; ఆఱని= అణగని; కూరగుంపు= కూరల సమూహం; ముకుమంద్రై=జలుబు పోగొట్టు మంద్రై? ఏర్చు=మండించు; ఆవన్= ఆవపొడితో; చిగుర్కొను=రుచి అతిశయించు; పచ్చళ్లను; పాయస+అన్నముల్=పయః-పాలు దానికి సంబంధించిన అన్నం పాయసాన్నం; ఊరుంగాయలున్= ఊరగాయపచ్చళ్లు; చే=చేయి; చుఱుక్కు అను నేయున్=చుఱుకు మనిపించే నేయి; చిఱు పాలు వెల్లు వగన్= చిన్నపాల సముద్రం కాగా; (చిఱుపాలు=మరగ కాచిన పాలు అని కొందఱు) ఆ హారంబు + ఇడున్= భోజనం వడ్డించును.

తా : చలికాలంలో పునుగు తావులీనే వేడి అన్నం కారపు పొళ్లతో చట్టి చుయ్యిమనే ధ్వని సద్దు మణగని కూరలు, జలుబు వదిలించగల ఆవపొడితో రుచించే పచ్చళ్లు, పాయసాన్నము, ఊరగాయలు, చేయి చురుక్కుమనిపించే నెయ్యి; పాలు చిన్న సముద్రం లాగా కాగా భోజనం వడ్డిస్తున్నారు.

ఇవన్నీ చలికాలంలో వేడి చేసే వంటకాలు. పూర్వ కాలంలో తినే ఆహారపదార్థాలతో నైవేద్యం చేసుకొనే పద్ధతి ఉండేది. రోగం రాకుండా భోజనం చేసే ఒక నాగరికత పల్లెటూళ్లలో ఉండేది. ఆ నాగరికత ననుసరించి యీ పద్యాలు వ్రాయ బడ్డాయి.

విశే : ఊరుంగాయలు : ఊరగాయ అని వ్యావహారిక రూపం. నూనెలో కారంలో ఊరునట్టి కాయ ఊరగాయ. ఊరుబిండి శబ్దం వంటిదే ఇది.

చ. కదళి గభీర పుష్ప పుటి కాచ్చుటఁ జేతుల నిప్పపిండిపైఁ
గుదురుగ నిల్పియోపు గతి గూనల నూనియ నించి, త్రాటము
న్నుదికిన శాటి వ్రేల, నది నొక్కొటఁ గ్రుంకిడి వత్తు రెందఱే
వదలక యాతనింట శనివారమున న్పరదేశి వైష్ణవుల్. 83

ఆతనింటన్= అతని యింట్లో; శనివారమున్=వైష్ణవుల కది పవిత్ర దినం కనుక; ఎందరేన్=చాలా మంది; వదలక= విడువక; పరదేశి వైష్ణవుల్= ఇతరదేశాల నుండి వచ్చిన విష్ణు భక్తులు; (ప్రాలేయ పటీరాచల మధ్య ప్రయాణించే తీర్థయాత్రికులు) కదళి=అరటియొక్క; గభీర=లోతైన; పుష్ప=పూలయొక్క;

పుటికః దొన్నెలయొక్క; ఛటన్‌=సమూహాన్ని; చేతులన్‌=చేతుల్లో; ఇప్పపిండిపైః ఒళ్లురుద్దు కోవడానికి చేసిన ఇప్పపిండి ముద్ద మీద; కుదురుగన్‌=కదలకుండా; నిల్పి=పెట్టి; ఓపుగతిన్‌=దొన్నె భరించేదాక; గూనలః=మట్టి కడవలలోని; నూనియః=నూనెను; నించిః=నింపి; త్రాటన్‌=త్రాడుతో; మున్నుః=ముందు; ఉదికిన శాటిః ఉతికిన బట్ట; ఒక్కటన్‌= ఒక్కేసారి; వ్రేలన్‌=వ్రేలాడుతుండగా; క్రుంకు+ఇడిః=నీటిలో మునిగి; వత్తురుః=వస్తారు.

తా : విష్ణుచిత్తుని యింటికి అనేకమంది వైష్ణవ భక్తులు అతిథులు. చేతులలో ఇప్పపిండి ముద్ద పెట్టు కొని దాన్నే కుదురుగా చేసికొని అరటి దొప్పలతో కుట్టిన దొన్నెలు పెట్టి ఇంట్లో గూనల నిండుగా ఉన్న నూనెను వాటిల్లో పోసుకొని త్రాడుతో ఉదికిన బట్ట వెనుక వ్రేలాడ దీసికొని నదిలో స్నానం చేసి ఎందరో ఆయ నింట్లో భోజనం చేస్తారు.

విశే : నూనె ఒంటి నిండా రాసుకొని ఇప్పపిండితో అభ్యంగన స్నానం చేయడం ఆనాటి పద్ధతి. త్రాటితో ఉతికిన బట్ట వ్రేలాడుతుండగా అన్నమాట మడి బట్టకు సంబంధించినది. అది వంటికి తాకకుండా త్రాటితో వ్రేలాడ తీసికొని నదికి పోయేవారు. ఇది వైష్ణవాచారం.

76 వ పద్యంలో పోక పొత్తి కుట్టిన దొప్పగమి - ఇక్కడ అరటి పూవు దొన్నె- ఈ పద్యంలో వైష్ణవ భక్తుల వర్ణన చాలా మధురంగా ఉంది.

శా. ఆ నిష్ఠానిధి గేహ సీమ నడురేయాలించిన మ్రోయు నెం
తే నాగేంద్ర శయాను పుణ్య కథలుం దివ్య ప్రబంధాను సం
ధాన ధ్వానము ''నాస్తి శాక బహుతా నా స్త్యుష్ణతా నాస్త్యపూ
పో నాస్త్యోదన సౌష్ఠవం చ కృపయా భోక్తవ్య'' మన్మాటలున్. 84

ఆ నిష్ఠానిధిః శ్రీవైష్ణవ మతముయొక్క నిష్ఠకు నిక్షేపమైన విష్ణుచిత్తునియొక్క; గేహసీమః=గృహంలో; నడు రేయిః అర్ధరాత్రి; ఆలించినన్‌=విన్నప్పటికి; నాగేంద్రశయానుః ఆదిశేషుడే శయనముగా గలిగిన విష్ణువుయొక్క; పుణ్య కథలున్‌=పవిత్ర మైన పురాణ కథలు; దివ్యప్రబంధః ఆళ్వారులు తమిళంలో వ్రాసిన ఆయా క్షేత్రదైవత స్తుతులయొక్క; అనుసంధాన=పారాయణముయొక్క; ధ్వానముః=ధ్వని; శాకబహుతాః కూరలయొక్క బహుత్వము; నాస్తిః లేదు; ఉష్ణతాః ఆహారపదార్థములయొక్క వేడి; నాస్తిః=లేదు; అపూపః=పిండి వంటలు; నాస్తిః=లేవు, అపూపః=పిండివంటలు; నాస్తిః=లేవు; ఓదన సౌష్ఠవంః=అన్నముయొక్క; పుష్కలత్వం; నాస్తిః=లేదు; కృపయాః=దయచేత; భోక్తవ్యంః=భుజింపదగినది; అను మాటలున్‌ః అన్న మాటలతో; ఎంతేన్‌=అతిశయంగా; మ్రోయున్‌=ధ్వనించును.

తా : శ్రీవైష్ణవ నియమ నిష్ఠాగరిష్ఠుడైన విష్ణుచిత్తుని యింట అర్ధరాత్రి ఐనప్పటికి ఈ మాటలు వినిపిస్తాయి. 1. శ్రీ మన్నారాయణునకు సంబంధించిన పవిత్రములైన కథలు. 2. వైష్ణవాళ్వారులు చేసిన ఆ యా క్షేత్ర దైవత స్తుతులు. 3. అర్ధరాత్రి వచ్చిన అతిథులతో ''అయ్యా! కూరలు ఎక్కువగా లేవు భోజన పదార్థాలు చల్లారి పోయినవి. పిండి వంటకములు కూడా లేవు. కనుక సౌష్ఠవమైన భోజనం పెట్టలేను. నన్ను మన్నించి ఉన్నది తినండి.'' అన్న ఈ మూడు రకములైన ధ్వనులతో అతని గృహాంగణము ఘూర్ణిల్లు తున్నది.

విశే : విష్ణుచిత్తుడు భాగవతాది పురాణములు శిష్యులు మొదలైన వారికి వ్యాఖ్యానిస్తాడని 5-36 చెబుతున్నది. ఇంతే కాక గోదాదేవి కూడా ఇంట్లో జరిగే ఈ పురాణ కథలన్నీ విన్నట్లు 5-37 పద్యంలో చెప్పబడింది. శ్రీవైష్ణవునకు విష్ణుపురాణం పరమ పవిత్ర గ్రంథం. తరువాత భాగవతాదులు. దివ్యప్రబంధములను ద్రావిడ వేదము అంటారు. అదీ నిత్య పారాయణ గ్రంథమే 4-190. పద్యంలో నాథముని అన్న శ్రీవైష్ణవుని నిత్య జీవితం వర్ణింపబడ్డది. ఇక్కడ విష్ణు చిత్తుని జీవితం చెప్పబడింది. శ్రీరంగ వర్ణనలో కూడా కనిపిస్తుంది. ఈ మొత్తం కలిపి చూస్తే శ్రీవైష్ణవ జీవిత మాధుర్యం తెలుస్తుంది.

ఈ పద్యంలో అతిథులతో విష్ణు చిత్తుడన్న మాటలు సంస్కృతంలో ఉన్నాయి. 4-6లో కూడా ఇట్లే ఉన్నది ఈ పద్యంలో వక్తలు దేవతలు. ప్రస్తుత పద్యంలో ప్రాలేయ పటీరాచల మధ్యనున్న తైర్థికులతో చేసిన సంభాషణ. ఆనాడు భారత దేశ భాష సంస్కృతం కనుక విష్ణుచిత్తుడు తమిళుడు. కనుక సంస్కృతాన్ని ఆశ్రయించడం పరమౌచిత్యం. నాగేంద్ర శయానుడు - శ్రీవిలుబుత్తూరు స్వామి విగ్రహమదే కనుక ఈ ఔచిత్యమూ సంభావ్యమే.

తే. ఇత్తెఱంగున నవ్వైష్ణవోత్తముండు
జాగరూకతఁ దైర్థిక భాగవతుల
కితర మెఱుఁగకే యెవ్వరే మేమి వేఁడి
రలయ కవి పెట్టి సంతుష్టి సలుపు చుండె. 85

ఈ+తెఱంగున= ఈ విధంగా (77 నుండి 84 వ పద్యం దాకా వర్ణింపబడ్డ పద్ధతి) ఆ+ వైష్ణవ+ ఉత్తముండు= శ్రీవైష్ణవుడైన ఆళ్వారులలో శ్రేష్ఠుడు (పెరియాళ్వారు); జాగరూకతన్= ఏమరు పాటు లేకుండా; (త్రికరణ శుద్ధితో) తైర్థిక భాగవతులకున్= తీర్థయాత్రలు చేసే భక్తులకు; ఇతరము= మరొకటి; ఎఱుగక, తెలియకుండా; ఎవ్వరు; ఏమి+ఏమి= ఏదేది; వేడిరి=కోరుకొన్నారో; అవి=వాటిని; అలయక= విసుగు లేకుండా; పెట్టి =సమర్పించి; సంతుష్టి=సంతోషాన్ని; సలుపు చుండెన్= కలిగిస్తున్నాడు.

ఈ పద్యం ముగింపు వాక్యం. పైన చెప్పబడ్డ విషయాలన్నిటిని ముగిస్తూ చెప్పిన మాట. ఒక కథాభాగాన్ని అంతం కావిస్తూ చెప్పే వైఖరికి ఈ పద్య మొక ఉదాహరణగా గ్రహించ వచ్చు. తైర్థిక - శబ్దం ద్వితీయాశ్వాసంలో పరిదేశిలిప్పని కథకు సూచన.

## ఆశ్వాసాంత పద్యములు

శా : బాలార్కాంశు విజృంభితామల శరత్పద్మాక్ష! పద్మా క్షమా
నీళా జాంబవతీశ ! యీశ బలభిన్నీ రేరుహోద్భూత ది
క్పాలామూల్య శిరోమణి ద్యుతి కనత్పాదాబ్జ ! పాదాబ్జఘా
లాలంకారకచావలీ మకరదీప్యత్కుండ లాంచన్ముఖా ! 86

బాల+ అర్క+ అంశు=లేతసూర్యుని కిరణాలతో; విజృంభిత= వికసింప జేయ బడ్డ; అమల=స్వచ్ఛమైన; శరత్కాలమందలి పద్మములవంటి; అక్ష=నేత్రాలు కలవాడా!; పద్మ= లక్ష్మీదేవి; నీళా= నీళాదేవి;

జాంబవతీ=జాంబవతీదేవులకు; ఈశ=భర్తయైన వాడా!; ఈశ=శివుడు; బలభిత్=బలుడను రాకాసిని చంపిన ఇంద్రుడు; నీరేరుహ=నీటి యందు పుట్టిన పద్మమునుండి; ఉద్భూత=పుట్టిన బ్రహ్మ; దిక్పాల=దిక్కులకు ఏలికలైన వారి యొక్క; ద్యుతి=కాంతులచేత; కనత్=ప్రకాశించే; పాద+అబ్జ=పాదపద్మాలు కలవాడా!; పాద+అబ్జ=నాల్గవభాగమైన చంద్రుని వలె (చవితి నాటి చంద్రునివంటి); ఫాల+అలంకార=ఫాల భాగానికలంకారమైన భూషణములైన; కచ+ ఆవలీ=ముంగురుల సమూహం కలవాడా!; మకర=మొసలియొక్క ఆకారంతో; దీప్యత్=వెలుగొందే; కుండల=చెవిపోగులతో; అంచత్=అందమైన; ముఖా=ముఖము కలవాడా!

తా : లేత సూర్యుని కిరణాలకు వికసించిన శరత్పద్మము వంటి నేత్రాలు కలవాడు, లక్ష్మి, భూమి, నీళ, జాంబవతీ దేవులకు భర్తయైన వాడు, రుద్రుడు, ఇంద్రుడు బ్రహ్మాది దిక్పాలకుల అమూల్య కిరీట రత్న కాంతులతో ప్రకాశించే పాద పద్మాలుండేవాడు. చవితి చంద్రునివంటి ఫాల భాగానికి అలంకారంగా ఉన్న ముంగురులు కలవాడు. మకర కుండలాలతో శోభించే చెవులు కలవాడు. ఇది శ్రీవేంకటేశ్వర స్తుతి. అన్నీ సంబోధనలే.

విశే : శరత్పద్మంలో ఎర్రని రేఖలుంటాయి. అదే విధంగా స్వామి నేత్రాలు కూడా కెంపు జీరలు కలవి. 3-85వ పద్యంలో విష్ణుమూర్తి వర్ణన మున్నది. అలాగే ఇతరత్రా కూడా ఉన్నాయి. ఇవన్నీ ఒక చోట పెట్టు కొని చూస్తే కావ్య నాయకుడు, కృతిపతీ అయిన విష్ణుమూర్తియొక్క సౌందర్యం వెల్లి విరుస్తుంది.

అలం. ముక్తపద గ్రస్తం.

క. జలచర, కిటి, హరి, వటు, భృగు
కుల, రఘుకుల, సీరి, బుద్ధ, ఘోటి, ప్రముఖో
జ్జ్వల జనికృత జనరక్షా !
యల మేల్మంగాభిధేందిరాలయ వక్షా ! 87

జలచర=నీటిలో సంచరించే చేప, తాబేలు; కిటి=పంది, హరి=సింహం; వటు=వామనుడు; భృగుకుల=భృగు వంశీయుడైన పరశురాముడు; రఘుకుల=రఘు వంశీయుడైన శ్రీరాముడు; సీరి=బలరాముడు, (సీరము=నాగలి - ఆయుధంగా కలవాడు - సీరి) బుద్ధ=బుద్ధుడు; ఘోటి=గుర్రమే వాహనముగా కల కల్కి; ప్రముఖ=మొదలైన; ఉజ్జ్వల= దివ్యములైన; జని=పుట్టుకచేత; కృత=చేయబడ్డ; జనరక్షా=ప్రజా సంరక్షణము కలవాడా!; అలమేల్మంగ; అభిధ=పేరుగల; ఇందిర=లక్ష్మికి; ఆలయ=నివాసమైన; వక్ష=వక్షఃస్థలము కలవాడా !

తా : దశవిధాలుగా అవతరించి శిష్టజనులను రక్షించిన వాడు. కలియుగంలో లక్ష్మీదేవికి మరొకరూపమైన అలమేలుమంగ వక్షఃస్థలమందున్నవాడు శ్రీ వేంకటేశ్వరుడు.

పద్యంలో శ్రీకృష్ణుడిని అవతారంగా చెప్పకుండా వదలటానికి కారణం ఆస్వామి దశావతారాలెత్తిన ఆదినారాయణుడు కనుక చెప్పనవసరం లేదు.

అలరు+మేలు=అలివేలు మంగ అన్నది తమిళనామం. అలరు= పద్మం. దానిలో ఉండే మేలైన=శ్రేష్ఠురాలైన; పైనున్న మంగ= స్త్రీ లేదా తల్లి= పద్మాలయ అని అర్థం.

**భుజంగ ప్రయాతము :**

బలద్విడ్వినిర్దిష్ట పాథోధరోరూ
పలాసార ధారాతపత్రీ కృతాద్రీ !
ఫలన్మూర్ధ చాణూర భంగోగ్ర బాహో !
కలాకృత్త కంసా ! శిఖండావతంసా ! 88

బలద్విట్=బలుడన్న పేరుగల రాక్షసునకు శత్రువైన ఇంద్రుడు, అతనిచేత; వినిర్దిష్ట= నిర్దేశింపబడ్డ; పాథోధర=నీటిని ధరించిన మేఘంయొక్క; ఉరు=పెద్ద; ఉపల=రాళ్లయొక్క; ఆసార=జడివానకు; ఆతపత్రీకృత=గొడుగుగా చేయబడ్డ; అద్రీ= కొండ కలవాడా!; ఫలత్=పగులుతున్న; మూర్ధ=తలగల, చాణూర=చాణూరుని; భంగ= చంపే; ఉగ్ర=భయంకరమైన; బాహో=చేతులు గలవాడా!; కలా=క్షణంలోని ముప్పదవ అంశలో; కృత్త=నరకబడ్డ; కంసా=కంసుడు కలవాడా; శిఖండ=నెమలిపింఛము; అవతంసా=తలపై అలంకారముగా కలవాడా!

తా : దేవేంద్రుడు కురిపించిన రాళ్లవానకు పర్వతాన్ని గొడుగుగా పట్టి గోపకులను కాపాడిన వాడా! బలిష్ఠములైన బాహువులతో చాణూరుని శిరస్సును గుద్దినవాడా! చిటికెలో కంసుని ఛేదించిన వాడా! నెమలి పురి తురాయిగా కలవాడా ! (చూ. 4-29)

**భుజంగ ప్రయాత లక్షణం :** య,య, య,య -అను త్ర్యక్షర గణములు. 1-8 యతి మైత్రి.

మ. ఇది కర్ణాటధరాధృతి స్థిరభుజాహేవాక లబ్ధేభరా
డుదయోర్వీధర, తత్పితృవ్య కృత నవ్యోపాయనోష్ణీష, ర
త్న దృగంచత్పద, కృష్ణరాయ వసుధాధ్యక్షోది తాముక్తమా
ల్యద నాశ్వాసము హృద్యపద్యముల నాద్యంబై మహిం బొల్పగున్. 89

కర్ణాటధర=కర్ణాట రాజ్యాన్ని; ధృతి=మోయటంలో; స్థిర=చలనంలేని; భుజ=బాహువులయొక్క; హేవాక= ఇచ్ఛామాత్రంగా; లబ్ధ=పొందబడ్డ; ఇభరాట్= గజపతియైన ప్రతాపరుద్రునియొక్క; ఉదయ+ ఉర్వీధర= ఉదయ దుర్గంలో; తత్ పితృవ్య= ఆగజపతికి పినతండ్రి చేత; కృత=చేయబడ్డ;నవ్య=నూత్నమైన; ఉపాయన=కానుక యైన; ఉష్ణీష=కిరీటముయొక్క; రత్న=మణులన్న; దృక్=చూపులతో; అంచత్=ప్రకాశిస్తున్న; పద=పాదాలుగల; వసుధాధ్యక్ష=రాజుచేత (శ్రీకృష్ణదేవరాయల చేత); ఉదిత=చెప్పబడ్డ; ఆముక్త మాల్యదన్= ఆకావ్యంలో; ఆశ్వాసమిది= ఈ ఆశ్వాసం; హృద్య పద్యములన్= అందమైన పద్యాలతో; ఆద్యంబై=మొదటిదై; మహిన్ = లోకంలో, పొల్పు+ అగున్=అందగిస్తుంది.

తా : ఇది శ్రీకృష్ణదేవరాయల వారు వ్రాసిన ఆముక్త మాల్యదలో ప్రథమాశ్వాసం. అది అందమైన పద్యాలు కలది. ఆ రాయలు కర్ణాట రాజ్యరమా రమణుడు (మనుచరిత్ర). కనుక కర్ణాట సామ్రాజ్యాన్ని అవలీలగా భుజాలపై మోస్తున్నాడు. అలాంటి భుజాలతో ఉదయగిరి దుర్గాన్ని ముట్టడించాడు. దాని

పరిపాలకుడు గజపతి పినతండ్రి. అతనిచే కానుకగా సమర్పింపబడ్డ కిరీట రత్నాలతో ప్రకాశించే పాదాలు కలవాడు.

విశే : రాయలవారి తూర్పుదిక్ జైత్రయాత్రలో గజపతులపై చేసిన తొలిదండయాత్ర. ఇది నెల్లూరు దగ్గరనున్న ఉదయగిరి విజయంతో ప్రారంభమైంది. అది పర్వత దుర్గము. దాన్ని జయించడానికి తొమ్మిది లేదా పదునెనిమిది నెలలు పట్టినదని చరిత్ర చెబుతోంది. చివరకు రాయలకు విసుగెత్తి ఒక రోజు రాత్రి ఇలా ప్రతిజ్ఞ చేసాడట. రేపు దుర్గపాలకుని శిరస్సును తన్నిగాని స్నానం చేయనని. అది విన్న దుర్గ పాలకుడు భయపడి బంగారు పళ్ళెంలో శిరస్సుకు మారుగా రత్న కిరీటాన్ని పంపించాడట. దీనితో దుర్గం స్వాధీనమైంది. పద్యంలో రత్నదృక్ ( అన్న మాటతో రత్నాలన్న చూపులు) దుర్గపాలకుని శిరస్సే రత్నమకుటంగా పరిణామం పొందిన దన్న అర్థస్ఫూర్తి యుంది.

ఈవిజయం 1512 లో. పాలకుడు గజపతి పినతండ్రి.

ఆశ్వాసాంతంలో కవి ఊరూ పేరూ చెప్పటం రివాజు.

అందరు కవులూ గద్యలు వ్రాస్తే ఈ కవి పద్యం వ్రాయటం క్రొత్త.

ఇది శ్రీ హర్షుని నైషధపద్ధతి.

పాఠాంతరం - హేలాక = విలాసంగా, లీలగా





# ఆముక్తమాల్యదా సౌందర్యం

## ద్వితీయాశ్వాసము

క. శ్రీనయన కువల యుగళా
నూన జ్యోత్స్నాయితస్మితోజ్జ్వల ముఖ! దై
త్యానీత సుర శ్రీ పున
రానయనక్రమణ! వేంకటాచల రమణా! 1.

శ్రీనయన కువల= లక్ష్మీదేవియొక్క నేత్రాల కలువ పూల; యుగళ= జంటకు, అనూన= అధికమైన; జ్యోత్స్నాయిత= వెన్నెల వలె అవుతున్న; స్మిత= చిరునవ్వుతో; ఉజ్జ్వల= ప్రకాశించే; ముఖ= ముఖము కలవాడా; దైత్య= రాక్షసులచే; ఆనీత= తీసికొని పోబడిన; సుర= దేవతలయొక్క; శ్రీ= ఐశ్వర్యమును; పునః= తిరిగి; ఆనయన = తెచ్చే; క్రమణ= ఆక్రమణం కలవాడా! ( క్రమణం= నడక, ఇక్కడ దండయాత్ర అని అర్థం లేదా పాదాక్రమణం కలవాడా!)

తా॥ లక్ష్మీదేవి కనులకలువల జంటకు అతిశయమైన వెన్నెల అవుతున్న లేతనవ్వుతో ప్రకాశించే ముఖం కలవాడా! రాక్షసులు తీసికొని పోయిన సురల సంపదలను తిరిగి తెచ్చే పాదాక్రమణం కలవాడా !

విశే॥ భగవంతుని ముఖంలో ఎప్పుడూ ఒక చెదరని చిరునవ్వు ముద్ర ఉంటుందని చెప్పబడ్డది. అవతార పురుషులయొక్క ముఖసీమలపై ఒక లోకోత్తరమైన స్మిత ముద్ర ఉన్నట్లు చూచిన వారు తెగ వర్ణించారు.

ఉదా॥ శ్రీరామకృష్ణ పరమహంస, షిర్డీసాయిబాబా వంటి వారి జీవిత చరిత్రలలో ఈ విషయం ఉన్నది.

సురశ్రీని తీసుకు రావడంలో పాదంతో తెచ్చిన వామనావతారానికి సంబంధించినది లేదా దశావతారాల్లో దేనికైనా అన్వయిస్తే క్రమణ శబ్దానికి దండయాత్ర అని చెప్పవచ్చు.

ఇది ఆశ్వాసాది పద్యం. కావ్య నాయకుని సంబోధన. ఇక్కడ శ్రీ వేంకటేశ్వర స్వామి కృతి పతి కనుక ఆ స్వామిని మనస్సులో నిలుపుకొని అతని ఉనికిని అనుభవిస్తూ చెప్పిన పద్యమిది. నాటకాలలో

ప్రరోచన లేదా ఉన్ముఖీకరణం అన్న ప్రస్తావాంగ మున్నది. ప్రేక్షకుల మనస్సులను నాటకముల వైపు ఆకర్షించే శిల్పవిధానమే యిది. శ్రోత అయిన భగవంతుని తనవైపునకు ఆకర్షించుకునే ప్రయత్నం కనుక యిది అలాంటిదని భావించాలి.

ఆశ్వాసమంటే పరిపూర్ణమైన ఉచ్ఛ్వాస. ఒక్కొక్క గుక్కలో చదువ దగ్గ కావ్య విభాగానికి ఆశ్వాస మని పేరు. ఉచ్ఛ్వాస నిశ్వాసాలు ప్రాణశక్తి అన్న హంసయొక్క రెండు రెక్కలు. కనుకనే లోకంలో వ్యక్తి మరణించినపుడు హంస ఎగిరి పోయింది అన్నమాట ఉంది. ఆశ్వాసాంత పద్యం నిశ్వాసం, ఆద్యపద్యం ఉచ్ఛ్వాసం. ఈరెంటి మధ్య కావ్యస్థితి ఉన్నది కనుక కృతిపతి ఆశ్వసాద్యంతములందు ఉండడం వలన కావ్య ప్రవాహానికి రెండు ఒడ్లు చక్కగా తీర్చబడి నట్లుయింది. ఈ పవిత్ర వాతావరణంలో కావ్యకథ శరన్నదిలాగా ప్రవహిస్తుంది కనుక ఆశ్వాస మంటే యిది.

వ. అవధరింపు మా సమయంబున c బాండ్యమండలంబున 2

అవధరింపుము=శ్రీవేంకటాచల రమణా! చిత్తగించవయ్యా! స్వామీ, ఆ సమయంబునన్= పూర్వాశ్వాసంలో వర్ణింపబడ్డ విష్ణుచిత్తునకు సమకాలీనంగా; పాండ్యమండలంబునన్=పాండ్య దేశంలో

మధురానగర వర్ణన

సీ. ఏ వీట సతుల పాలిండ్లపైc గంబూర
నవహారముల చిప్పకవుచు మాన్చు,
మలయజం బే వీటc దొలు చెక్క డులిచి మే
డల కిడ్డ మిగులు భూములకు డిగ్గుc,
గలచు నే వీటి సింహళ గజంబుల గాలి
చైత్ర వేళ నుదగ్దిశా గజంబుc,
దాల్తు రేవీటి ప్రాక్తన భూప నిర్మాల్య
మరకతంబులు పెఱ ధరణిపతులు,

తే. కపివర నియుక్త గిరి సదృగ్గహన నిలయ
గాత్రగాహిత కనక ముక్తా కవాట
గోపురావేదితోచ్చ్రితాక్షోభ్య వప్ర
దనదు దక్షిణ మధుర సాంద్రద్రుమధుర. 3

సాంద్ర= దట్టమైన ; ద్రుమ=చెట్లయొక్క; ధుర = బరువు కలది; దక్షిణ మధుర = ఉత్తర మధుర శ్రీకృష్ణుని జన్మదేశం కనుక ఇది దక్షిణ మధుర అనబడింది; తనరున్= కీర్తితో ప్రకాశిస్తున్నది; ఏ వీటన్= ఏ నగరంలో; సతుల= స్త్రీలయొక్క; పాలిండ్లపై= స్తనాలపై; గంబూర=కర్పూరం; నవ= క్రొత్త; హారములు= ముత్యాలదండలయొక్క; చిప్ప=ముత్యపుచిప్పయొక్క; కవుచున్= నీచువాసనను; మాన్చున్=పోగొట్టును.

ఆ నగరంలో స్త్రీలు తామ్రపర్ణినది నుండి క్రొత్త ముత్యాలు తెచ్చుకొని దండలుగా ధరిస్తారు. ఆ ముత్యపు చిప్పల నీచు వాసన ఇంకా ఇగిరి పోలేదు. కనుక ఈ వాసనను స్తనాలపై పూసుకున్న కర్పూరం పోగొడుతున్నది. ఈ రెండంశాలు ఆనాటి అలంకార విశేషాలు

ఏ వీటన్= ఏనగరంలో; మలయజంబు= మలయపర్వతంలో పుట్టిన గంధపు చెట్టు; తొలు చెక్క=మొదటి చెక్క; డులిచి= చెక్కి; మేడలకున్ ఆ నగరంలో మేడలకు; ఇడ్డ=వాడుకోగా; మిగులు=మిగిలినట్టిది; భూములకు= ఇతర దేశాలకు; డిగ్గున్= సరఫరా చేయబడుతుంది.

మలయపర్వతం సమీపంలో ఉంది కనుక అక్కడి చందనపు చెట్లనుండి మొదటగా తెచ్చిన చెక్కతో ఆ నగరంలో మేడలు కట్టుకున్న తరువాత మిగిలిన గంధపు చెక్క యితర దేశాలకు ఎగుమతి అవుతున్నది.

ఏ వీటి= ఏ నగరంయొక్క; సింహళ గజంబుల= సింహళ ద్వీపమునుండి తేబడిన ఏనుగుల (మదవాసనలు వీచే); గాలి=వాయువు; చైత్రవేళ =చైత్ర మాసంలో; ఉదక్ దిశ= ఉత్తర దిక్కునందలి; గజంబున్= ఏనుగును; కలచున్=కలత పెట్టును.

ఆ నగరం నిండా సింహళ గజాలున్నవి. చైత్రమాసంలో వాటి మదవాసనతో వీచేగాలికి ఉత్తర దిగ్గజమైన ''అంగన'' అనుపేరు గలదానిని కలత పెడుతుంది. సింహళ దేశం ఏనుగులకు ప్రసిద్ధి. ఉత్తర దిగ్గజము అంగన కనుక ఈ వీటి మదగజములు మగవి. వీటి వాసనకు ఆ దిగ్గజము వ్యామోహిత మౌతున్నదని తాత్పర్యం. వసంత ఋతువులోనే దక్షిణ దిక్కు నుండి ఉత్తర దిక్కుకు వీచే గాలులనే మలయ పవన మంటారు.

ఏవీటి; ప్రాక్తన= ప్రాచీన; భూప=రాజులయొక్క; నిర్మాల్య= ధరించిత్యజింప బడ్డ; మరకతంబులు=నాచువంటి పచ్చని రంగు గల రత్నాలు; పెటధరణీ పతులు= ఇతర దేశపు రాజులు; తాల్తురు=ధరిస్తారు.

ఆ నగర రాజు ధరించి పారవేసిన మరకత మణులను ఇతర దేశ రాజులు ధరిస్తారు.

కపివర=వానర రాజైన సుగ్రీవునిచేత; నియుక్త= నియోగింపబడ్డ; గిరి సదృక్= కొండల వంటి; గహన నిలయ= అడవులే నిలయములుగా గల కోతులయొక్క; గాత్ర= శరీరాలతో; గాహిత=ప్రవేశింపబడ్డ; కనక= బంగారు; ముక్త=ముత్యాలు; కవాట=ద్వారాలు కలదైన; గోపుర=పుర ద్వారాలతో; ఉచ్ఛ్రిత= ఎత్తు చేత; అక్షోభ్య= చెదరని; వప్ర=ప్రాకారం కలది.

సుగ్రీవుని ఆజ్ఞతో కొండల వంటి శరీరాలు గల కోతులు ప్రవేశించడానికి వీలైనంత ఎత్తైన ద్వారాలు కలిగి శత్రువులకు దుర్భేద్యంగా మధుర ఘనత వహించింది. (ఈవర్ణనకాధారం రామాయణం)

విశే॥ విలువుత్తూరు వర్ణనతో ప్రథమాశ్వాసం వ్రాయబడింది. మధురా వర్ణనతో ద్వితీయాశ్వాసం మొదలైంది. ఈ పద్యం ప్రథమాశ్వాసంలోని మొదటి పద్యంతో పోల్చి చూచుకోవాలి. ఈ పద్యం

చాలా బరువై రాజసంగా ఉన్నది. ఇది రాజనగరం. అది యోగీశ్వరనిలయం. కనుక అది దైవ సహితమై వినయ మధురంగా సత్త్వగుణ ప్రధానంగా ఉన్నది. ఈ విధంగా ఈ రెండాశ్వాసాలలో చేసిన వర్ణనలను పోల్చి చూచుకుంటే సత్త్వ రజోగుణం తెలుస్తుంది. అది ఆశ్రమం లాగా వర్ణింపబడ్డది. అక్కడ నుండి గురువు వచ్చి ఇక్కడ రాజును మేలు కొల్పే అంశం ముందు చెప్పబడబోతుంది. కనుక ఈ బ్రాహ్మణ క్షాత్ర శక్తుల స్వభావం మీద నాధారపడి ఈ రెండాశ్వాసాలు వ్రాయబడ్డాయి. (విప్ర+క్షత్ర= అనాటి ధర్మప్రభుత్వం చూ. నా 'శ్వేతచ్ఛత్రం')

అలం : అతిశయోక్తి.

క. శమనరిపు త్రిపుర భిదో
ద్యమవద్దో ర్వర్జ్య వలయిత స్వర్ణగిరి
భ్రమదంబై కాంచన వ
ప్రము దీప్రంబగుచు నప్పురంబున నొప్పున్. 4

ఆ+పురంబునకున్= ఆ నగరానికి; కాంచన వప్రము=బంగారపు కోట; దీప్రంబగుచు= ప్రకాశిస్తూ; శమనరిపు= యమునకు శత్రువైన శివునియొక్క; త్రిపుర= త్రిపురాసురుల యొక్క; భిద= భేదించటంలో; ఉద్యమవత్= ప్రయత్నవంతమైన; దోః= భుజాలతో; వర్జ్య= విడువబడ్డ; వలయిత= మండలాకారములైన; స్వర్ణగిరి= బంగారు కొండ (మేరు పర్వతంయొక్క); భ్రమ=భ్రాంతిని, దంబు= ఇచ్చునది; ఐ=అయి; ఒప్పున్= ఉన్నది.

తా॥ ఆనగరానికి చుట్టూ బంగారు కోట ఉన్నది. అది ఎలా ఉన్నదంటే త్రిపురాసురులను ధ్వంసం చేయడానికి బంగారు పర్వతాన్ని ధనుస్సుగా చేసికొని త్రిపుర దహనానంతరం అవతల పారవేసిన, మండలాకారమైన శివుని ధనుస్సులాగా ఉన్నది.

విశే॥ త్రిపుర +అసుర= త్రిపురాసుర కథ పురాణ ప్రసిద్ధమైనది. ముగ్గురు రాక్షసులకు బంగారు , వెండి, ఇనుప కోటలున్నాయి. ఆ మూడు ఆకాశంలో ఎగురుతున్నాయి. ఆ మూడు ఒకే దెబ్బకు కాని ధ్వంసం కావు. ఆ మహోద్యమంలో శివుడు మేరుపర్వతాన్ని ధనుస్సుగా చేసికొన్నాడు. త్రిపుర దహనానంతరం ఎక్కు పెట్టిన ఆ ధనుస్సును అలాగే వదలి వేసాడో అన్నట్లుగా ఆ కోట ఉన్నది. (ఈ పోలికలోని ఔచిత్యానికి చూ 39 పద్యం)

అలం : ఉత్ప్రే క్ష

రామాయణంలో శివధనుస్సు కథ ప్రసిద్ధ మైనది. ఇక్కడ వప్రమే శివధనుస్సుగా ఉన్నది. కనుక శత్రురాజుల కది దుర్భేద్య మైనది. కోట ధనురాకారంలో కనిపించాలంటే ఉపరితలం నుండి చూడాలి. ఆ ఉపరితలం నుండి చూచే చూపు ఉత్ప్రేక్ష.

ఉత్+ప్ర+ ఈక్ష= పైనుండి చక్కగా చూడటం. అని దానికి అర్థం. కనుక ఈ వర్ణన అద్భుతమైన ఉత్ప్రేక్ష.

తే. సారిదిఁగనుపట్టు హేమరశ్మలు సెలంగఁ
బొడవుకతమున సూక్ష్మమై పొల్పుఁ జూడఁ
బట్టణము కోట కొమ్మల పంక్తి గగన
మండల శ్రీకి సంపంగి దండ వోలె. 5

పట్టణము కోట కొమ్మల పంక్తి= మధురానగరమందలి కోట బురుజుల వరుస; సారిదిన్= క్రమంగా; కనుపట్టు=కన్పించే; హేమరశ్మలు= బంగారు వన్నెలు; చెలంగన్= ఒప్పుతూ ఉండగా; పొడవుకతమునన్= దీర్ఘత్వంచేత; సూక్ష్మమై=కొంచెం కొంచెంగా; చూడన్= దృష్టికి; గగనమండల శ్రీకిన్= ఆకాశ లక్ష్మికి; సంపంగి దండ వోలెన్= సంపంగి పూల దండ లాగా; పొల్పున్= అందగిస్తున్నది.

తా॥ మధురానగరం చుట్టూ ఉన్న కోటయొక్క కొమ్మల పంక్తి (కోట గోడ అగ్రభాగం మీద రావి ఆకు ఆకారంలో నిర్మించబడ్డ గోడలు, వాటి మధ్య రంధ్రా లుంటాయి. సైనికులు వీటి చాటునుండి రంధ్రాలగుండా కోటముట్టడించిన సేనలపై ఆయుధాలు ప్రయోగిస్తారు) సుదీర్ఘంగా వ్యాపించి ఉంది. దాని బంగారపు కాంతులు ఆకాశంలోకి వ్యాపిస్తున్నాయి. ఈ గుండ్రంగా ఉన్న సుదీర్ఘమైన కోట కొమ్మల వరుస బంగారు కాంతులీనుతున్నందున ఆకాశలక్ష్మి మెడలో ధరించిన సంపంగి పూల దండలా ఉంది.

విశే॥ కోట కొమ్మలు బంగారపు కాంతిలో ఉన్నాయి కాబట్టి సంపంగి పూలతో పోలిక. కోట పొడవుగా ఉన్నందున ఈ కొమ్మల పంక్తి చిన్నదిగా సంపంగి పూల దళాలుగా కనిపిస్తున్నది. అందుచేతనే సూక్ష్మంగా ఉంది. ఆకాశలక్ష్మి ధరించిన దండ కనుక సుదూరంగా కనిపిస్తున్నది. కనుక సంపంగి పూల దండ అన్న ఉపమానం చాల ఉచితంగా అందంగా ఉంది. (పోల్చు- శ్రీరంగ వప్రవర్ణన)

అలం : ఉపమాలంకారం

కొండలపైనెక్కి కోట కొమ్మల పంక్తిని చూస్తే కనిపించే దృశ్యమిది. రాయల వారి అంతః పురం చుట్టూ ఉన్న కోట కొమ్మలు ప్రక్కనే ఉన్న కొండ పైనెక్కి చూస్తే ఈ దృశ్యమే కనిపిస్తుంది. రాచనగరు ఈకొండ నాను కొని ఉంది. పాశ్చాత్య చరిత్ర కారులు నగర సంపూర్ణ దర్శనానంతరం ఈ కొండపై నెక్కి చూచేవారట. అప్పుడది పాశ్చాత్య దేశ నగరమైన రోమ్ కంటే పెద్దదిగా సంపన్న మైనదిగా, సుందర మైనదిగా కనిపించిందట. లాంగ్ హర్స్ట్ ( ఈ శతాబ్దం వాడే) హంపీశిథిలాలు అన్న గ్రంథం వ్రాసాడు. ఆయన ఈ కొండపై నెక్కి చూస్తే దక్షిణదేశంలో ఇంతకంటె అందమైన దృశ్యం లేదని అనిపించిందట.

ఈ మధురా నగర వర్ణన మంతా ఆనాటి పాశ్చాత్య చారిత్రకులు చెప్పిన దానికి యథార్థవర్ణనలు తప్ప అతిశయోక్తులు కావు. ఆనాటి దేశ సంపన్నతకు విజయనగరం ఒక ప్రతీక. దానికి వర్ణనలు అలంకార రూపాలు.

మ. పరిఖం దత్పుర కామినీ జనము లంభః కేళి సల్పంగ ఁ ద
ద్గురు వక్షోరుహ లిప్తసంకుమద కస్తూరీ మిళచ్చంద నా

గురు పంకంబుల సౌరభంబుల ( జుమీ కుంభీనసావాస ని
ర్జర కల్లోలిని కందు భోగవతి నా(జన్సంజ్ఞ( గల్గెన్తగన్. 6

తత్ పుర= ఆ మధురా నగరంలోని; కామినీ జనముల్= ప్రౌఢ స్త్రీ సమూహం; పరిఖన్= అగడ్తలో; అంభః కేళిన్= జలక్రీడలు; సల్పంగన్= చేస్తే; తత్= ఆస్త్రీల; గురు= పటువైన; వక్షోరుహ=రొమ్మున మొలిచిన స్తనాలపై; లిప్త= అలదబడ్డ; సంకు మద=జవ్వాది తోను; కస్తూరీ=మృగమదంతోను; మిళత్=సమ్మిశ్రితమైన; చందన=మంచిగంధంయొక్క; అగురు= అగరుగంధంయొక్క; పంకంబుల= బురదలయొక్క (పూతలయొక్క) సౌరభంబులన్=వాసనల వల్ల; చుమీ=సువూ; కుంభీనస= పాములయొక్క; నివాస= నిలయమైన పాతాళంలోని; నిర్జర=దేవతలయొక్క; కల్లోలినికిన్ =నదికి భోగవతి; నాన్=అనగా, సంజ్ఞ=పేరు; తగన్= తగ్గట్లుగా; కలిగెన్=కలిగింది.

తా॥ కోట గోడ బయట వైపు చుట్టూ అగడ్త ఉన్నది. దానినిండా నీరు నిండి ఉంది. అందులో నగరస్త్రీ సమూహం నిత్యమూ స్నానం చేస్తుంది. వారి కఠిన స్తనమండలం మీద అలదు కొన్న కస్తూరి జవ్వాది గంధపు పూతల వాసనలు నీటిలో కలిసి పోయి పాతాళం వరకు వ్యాపించివున్నందున అక్కడి నదికి భోగవతి అన్నపేరు కలగడానికి హేతువైనది.

విశే॥ అగడ్త పాతాళమంత లోతు కల్గియున్నది. గంగ ఆకాశం నుండి పృథ్విపైకి దూకి అక్కడ భాగీరథీ అన్న పేరుతో, పాతాళంలోకి ప్రవహించి భోగవతి అన్నపేరుతో ప్రసిద్ధమైంది. స్వర్గంలోని పాయకు మందాకినీ యనిపేరు. దేవ, మర్త్య, నాగ లోకాలలో మూడు పాయలుగా ప్రవహించినందుననే 'త్రిపథగ' అన్న పేరు వచ్చింది. నాగులు భోగులు కనుక అంటే పాముల పడగలు= భోగాలు కలవి. అష్టభోగాలన్న ప్రసిద్ధి ఉన్నది. 1. అందమైన యిల్లు 2. శయ్య 3. వస్త్రం 4. నగలు 5. పుష్పం 6. గంధం 7. తాంబూలం 8. స్త్రీ . ఈ ఎనిమిది భోగద్రవ్యాలు. భోగవతి యన్నపేరు కామినీ జనుల గంధస్పర్శ వల్ల వచ్చినదని కల్పించబడ్డది.

కామిని అన్న శబ్దం సార్థకంగా ప్రయోగింపబడ్డది. కామం కలది. అదే లేక పోతే గురువక్షోరుహాలు కాని, సంకుమద కస్తూరి ద్రవ్యపు పూతలు కాని ఉండవు. ఈ స్త్రీలు విలిపుత్తూరు లోని గ్రామీణ యువతులు కారు. నాగరకులు ఈ దృష్టితో ఈ వర్ణనలు చూచుకోవాలి. విలిపుత్తూరులో తోటలలో బావిస్నానాలు చెప్పబడ్డవి. అక్కడ కామినీ కస్తూరికాది వర్ణన లేదు. వారు భాగవత స్త్రీలు.

అలం : నిరుక్తి.

తే . కాద్రవేయులు భూమియు(గై కొనంగ
నురగ లోకంబు వెడలి తత్పరిఖనీట
నెగసి తోడనె క్రుంకుదుర్నిలువ లేక
తత్తటా బద్ధ గారుత్మతముల కులికి. 7

కాద్రవేయులు=పాములు (కద్రువ సంతానం గనుక); భూమియున్=భూలోకాన్ని కూడా; కైకొనంగన్= ఆక్రమించడానికి; ఉరగలోకంబున్=నాగలోకాన్ని; వెడలి= బహిర్గమించి; తత్= ఆ (పైనవర్ణించబడ్డ); పరిఖ= అగడ్తయొక్క; నీటన్= నీటిలో; నెగసి= ఎగిరి; తోడనె= వెంటనే; తత్= ఆపరిఖయొక్క; తట= ఒడ్డుపై; ఆబద్ధ= అంతటా కట్టబడ్డ; గారుత్మతములకున్= గరుడ పచ్చలకు, ఉలికి=భయపడి; నిలువలేక= నిలబడ లేక, క్రుంకుదుర్=మునిగి పోతారు.

తా॥ పాతాళంలోని నాగులు భూలోకాన్ని కూడా ఆక్రమించడానికో అన్నట్లు ఆ అగడ్త నీటిలో పైకి తేలి అగడ్త ఒడ్లపైనున్న ప్రాచిపట్టిన రాళ్లను చూచి గరుడ పచ్చలుగా భావించి భయపడి నిలువ లేక మరల మునిగి పోతున్నాయి.

విశే॥ గరుడ పచ్చలు అన్న మణి విశేషాలు గరుత్మంతుని పేరు గలవి కనుక ఆనామ శ్రవణంతోనే పాములు భయపడి పోతాయి. ఆ గరుడపచ్చలు సర్పవిషాన్ని హరిస్తాయంటారు.

తే. తరుణ శైవాల జలజపత్త్రములు వొదువ
మరకతచ్ఛాయ c బొల్చు c దత్పరిఖ జలము
కోట బంగారు సేయుట కొఱకు మున్ను
బ్రహ్మపిడిచిన మందాకు పసరనంగ. 8

తత్= ఆ; పరిఖజలము= అగడ్తలోని నీరు; తరుణ= లేత లైన; శైవాల= నాచుతీగలు; జలజపత్రములు= తామరాకులు; పొదువన్= కప్పుకోగా; మర కతచ్ఛాయన్=మరకతమణుల కాంతులతో; పొల్చున్= అందంగా ఉన్నది; కోటన్= కోటను; బంగారు సేయుట కొఱకున్= బంగారంగా మార్చడానికి; మున్ను= పూర్వం, బ్రహ్మ= బ్రహ్మదేవుడు; పిడిచిన=పిండిన; మందు+ ఆకు= ఓషధీపత్రం; పసరు+ అనంగన్=పసరన్నట్లుగా.

తా॥ ఆ అగడ్త నిండా నాచు, తామర తీగల ఆకులున్నాయి. అవి నీటిపైన అలము కొని యున్నందున చూడడాని కదంతా పూర్వం బ్రహ్మ దేవుడు కోటను బంగారం చేయడానికి పిండిన మందాకు పసరు లాగుంది. 4వ పద్యంలో మేరు ధనుస్సు 5,7 లో బంగారుగా చెప్పబడటం గమనించాలి.

అలం : ఉత్ప్రేక్ష.

విశే॥ పూర్వకాలంలో రసవాద మని యుండేది. పాషాణాది లోహాలను ఆకుపసరు పిండి బంగారంగా చేసేవిద్య. దీనికోసం నేటికీ మనిషి తపన పడుతూనే ఉన్నాడు. వేమనలో ఈ రసవిద్యకు సంబంధించిన పద్యాలు చాలా కనిపిస్తాయి. ఆంగ్లంలో దీనిని 'Alchemy' అంటారు. దీనికి సంబంధించిన విషయం ఆధునిక మనస్తత్త్వ శాస్త్రవేత్తలు చాలా లోతుగా విచారించారు. ఈ రస విద్యపై ఆధార పెట్టి పై వర్ణన చేయబడ్డది.

చ. అడుగున నుండియున్నదిలమై చదలంటెడు కోట నొప్పుప్రోల్
చెడని కడంక దంచనపుc జేతుల గంగను కాసె c దూఱc గా

నడుమన యున్కిఁ జేసి యల నాక పురిన్ సరికై పెనంగి లా
వెడలగఁ బట్టి ద్రేయుటకు నెత్తెనన్నను మల్లుపోరిలోన్. 9

అడుగున నుండి యున్=పునాది దగ్గరనుండి; పదిలమై=దృఢమై; చదలు= ఆకాశాన్ని; అంటెడు=తాకే; కోటన్=ప్రాకారంతో, ఒప్పు= అందమైన; ప్రోలు=నగరం; దంచనపు చేతులు =ఫిరంగులన్న చేతులు; గంగ+అను=గంగ అన్న; కాసెన్=నడుముకు కట్టుకునే వస్త్రం; తూఱఁగాన్= దూరేటట్లు; సరికై=సమానత్వం కోసం; అలనాకపురిన్= ఆ ప్రసిద్ధమైన అమరావతి నగరాన్ని; చెడని=సడలని; కడంకన్=పూనికతో; మల్లుపోరిలోన్= మల్లయుద్ధంలో; నడుమన= అంతరిక్షంలో, మధ్యలో; ఉన్కిచేసి= ఉన్నందు వల్ల; పెనంగి=పెనవైచి; లావు= బలం; ఎడలగన్=పోగా; పట్టి= కాసెకోకలో చేయి దూర్చి (బంధించి) పట్టుకొని; ద్రేయుటకున్= క్రింద పడవేయటానికి, ఎత్తెను= అమరావతిని పైకెత్తెను; అనన్= అనడానికి; చనున్=తగును.

తా॥ మధురానగర ప్రాకారం పునాది దగ్గరనుండి దృఢమై ఉన్నది. దాని మీద ఫిరంగు లమర్చబడియున్నాయి. అని ఆకాశంలోకి చొచ్చుకొని చూస్తున్నవి. ఇది ఎలా వుందంటే పైన అమరావతి నగరానికి ఆకాశగంగ అగడ్తగా ఉంది. మధురానగరం అమరావతితో పోటీపడుతున్నది. ఈ రెండు నగరాలు జట్టీలై మల్లయుద్ధం చేస్తున్నవి. మధురానగరం కోట అన్న జట్టీ తన చేతులన్న ఫిరంగులు చాచి ఆకాశగంగ అన్న అమరావతీ మల్లును కాసెకోకలోకి దూర్చి పట్టుకొని క్రింద పడవేయడానికి పైకెత్తెనో అన్నట్లున్నది.

విశే॥ వర్ణితాంశం ఏమిటంటే బలిష్ఠమైన కోట గోడలమీద ఆకాశం చూస్తున్న ఫిరంగులతో శత్రు దుర్భేద్యంగా ఉంది. ఆ ఫిరంగులు పాలవెల్లి ( ఆకాశగంగ) లోకి చొచ్చినట్లున్నవి. ఈ దృశ్యం పై విధంగా మల్లుపోరుగా ఉత్ప్రేక్షించబడింది. రాత్రి పూట మనకు కనిపించే పాల వెల్లినే ఆకాశ గంగ అంటారు. అది స్వర్గానికి అగడ్త. అదే కాసెకోకగా ఉత్ప్రేక్షించబడింది.

ఆ రోజులలో మల్లయుద్ధాలు జరుగుతుండేవి కనుక అది పునాదిగా ఈ ఊహ చేయబడ్డది. (1-52) పద్యంలో కూడా ఒక యోధుని లక్షణం సౌధాలపై ఆరోపింప బడ్డదానితో పోల్చి చూడు.

అలం : ఉత్ప్రేక్ష.

గంగనుకాసె : బాలవ్యాకరణంలో ఈ ప్రయోగం ఉదాహరించబడింది

తే. ఉదుటు గుబ్బలు గల తల్పు టురము సూచి
గందపట్టెలు సూచి, బంగారు సూచి
వీటివాకిటి చోటనే విడువ కెపుడు
సుట్లువెట్టుచునుందురు సోమరవులు. 10

సోమరవులు= చంద్రసూర్యులు; ఉదుటుగుబ్బలు=నిక్క పొడుచుకొనియున్న వట్రువస్తనములు, (కోట ద్వారాలకు లోహమయమైన గుబ్బలు తామర మొగ్గల ఆకారంతో అమర్చబడేవి. అవే యిక్కడ గుబ్బలు).

కల= ఉన్న; తల్పుటురము=తలుపన్న ఎదురురొమ్ము; గంధ పట్టెలు= తలుపుల కమర్చబడ్డ అడ్డ కొయ్యలన్న గంధపు రేఖలు; చూచి= బంగారు తలుపుల కమర్చబడ్డ బంగారు రేకుల చూచి; పీటి వాకిటి చోటన్= నగరద్వారం దగ్గరే (నగరమన్న నాయికయొక్క ఇంటి వాకిటిలోనే) విడువక= వదలక; ఎపుడున్= ఎల్లప్పుడు; చుట్లు పెట్టుచున్= చుట్టు తిరుగుతూ; ఉందురు= ఉంటారు.

తా॥ నగర ప్రాకారానికి విశాలోన్నతములైన ద్వారాలున్నాయి. అవి చాలా దృఢంగా ఉన్నాయి. దానికి నిలువుగా అడ్డంగా గట్టి కోసం కొయ్య పట్టెలు అమర్చబడ్డాయి. వాటిపై ఇత్తడి గుబ్బలు తామర మొగ్గల ఆకారంలో అతక బడియున్నవి. తలుపుకి బంగారు రేకు తాపడం చేయబడ్డది. ఇది ఆనాటి ప్రాకార ద్వార దృశ్యం. ఇది కావ్య భాషలో చిత్రించబడ్డది. ఆ గుబ్బలు వక్షోజాలు. ఆ కొయ్యలు గంధపు గీరలు. ఆ బంగారు రేకు కంచుకం. పురి నాయిక. ఆమె సౌందర్యానికి ఆకర్షింపబడ్డ సూర్య చంద్రులు విడువకుండా ప్రహరి కాస్తున్న దానిలాగా అక్కడే తారట్లాడుతున్నారు.

అంటే సూర్య చంద్రులు ఎత్తైన ప్రాకారాన్ని దాట లేక ఒక ప్రక్కనే సంచరిస్తున్నారు అన్నమాటతో అయనవిధి (దక్షిణాయన, ఉత్తరాయణ) సూచిస్తున్నట్లున్నది. (5-96) పద్యంలో ఉత్తరాయణ విషయం చెప్పబడింది. బహుశా ప్రస్తుత పద్యంలో దక్షిణాయనం సూచింపబడినట్లున్నది?

**అలం :** రూపకాలంకార సంయుక్తమైన ఉత్ప్రేక్ష.

నగరం నాయికతో గుబ్బలు మొదలైనవి అంగాలుగా రూపించబడినందు వల్ల రూపకం. దీనికి శ్లేష కూడా భూమికగా ఉన్నది. గుబ్బలు, గంధపు పట్టెలు అన్న శబ్దాలకు రెండర్థాలున్నవి కనుక.

### సౌధవర్ణనం

**మ.** స్థిర సౌధాగ్ర విహారి యౌవత రతిచ్ఛిన్నాచ్ఛ హారస్ఫుర
ద్గురు ముక్తావళిఁ జేటికల్విరులతోఁ గూడంగఁద్రోయ, న్నిజో
దరలగ్నంబగు దాని, నెమ్మొగి లధస్థంబై తటిన్ రాఁ, నా
కరమభ్రంబని యంద్రుగా కుదధిఁ దక్కన్బుట్టునే ముత్తెముల్. 11

సౌధ= మేడలయొక్క; అగ్ర=పైభాగాలలో; విహారి=క్రీడిస్తున్న; యువత= యువతీయువకులైన జంటలయొక్క; రతి= కామక్రీడలలో; ఛిన్న= తెగిన; అచ్ఛ= స్వచ్ఛమైన; హార= ముత్యాల సరాలయొక్క; స్ఫురత్= ప్రకాశించే; గురు=పెద్ద; ముక్త=ముత్యాలయొక్క; ఆవళిన్=సమూహాన్ని; చేటికలు= పరిచారికలు; విరులతో కూడం గన్=పూలతో పాటుగా; త్రోయన్= ఊడ్చివేయగా; నెమ్మొగులు=నిండు మేఘం; అధస్థంబై= సౌధాగ్రభాగాల కంటె క్రింద ఉన్నట్టిదై; నిజ=తనయొక్క; ఉదర=కడుపులో; లగ్నంబు=తగుల్కొన్నదై; అగుదానిన్= అయిన ముత్యాలనే; స్థిరన్= భూమిలో; అభ్రంబు= మేఘం; ఆకరం= ముత్యాలకు జన్మస్థానం; అని అంద్రుగాక=లోకులంటారు కాని; ముత్యముల్= ముత్యాలు; ఉదధిన్=సముద్రంలోనే; తక్కన్= తప్ప; పుట్టునే= మరొక చోట సంభవిస్తాయా!

తా॥ ముత్యాలు సముద్రంలోనే పుడుతాయి తప్ప మేఘాలలో పుట్టవు, కాని మేఘాలలో పుడుతాయని లోకులు భ్రమిస్తున్నారు. దానికి కారణ మేమంటే మధురా నగరంలో సౌధాగ్రాలలో యువతీ యువకులు రతి క్రీడా విహార మగ్నులైనప్పుడు వారి మెడలలోని ముత్యాల దండలు తెగి ముత్యాలు క్రింద పడిపోగా తెల్లవారి చేటికలు వచ్చి వాడి రాలి పోయిన పూలతో పాటుగా ముత్యాలను కూడా ఊడ్చి మేడలపై నుండి క్రిందకు పారబోస్తారు. అవి మేడల కంటే క్రింద ఉన్న మబ్బులలో పడి వానధారలతో సముద్రాలలో పడుతున్నవి.

విశే॥ ముత్యాలు మేఘాలలో పుడతాయని అవి వడగళ్లవలె పెద్దగా ఉంటాయని బృహత్సంహిత

అలం : అత్యుక్తి.

మ. ఘనసౌధాళి వియద్ధునీ జలధివీకన్నావలై నీడ దోఁ
ప నెలంత ల్వణి గాకృతి న్సరకు మార్పన్గోలల న్గట్టి యి
చ్చు నిజద్వీప విచిత్ర పట్ట వసన స్తోమంబునాఁ బొల్చుఁ బె
ల్లనిలాన్యోన్య విమర్శి తన్నగర నాకానేక కేతుచ్ఛటల్. 12

ఘన సౌధ+ఆళి= గొప్పమేడల సమూహం; వియత్= ఆకాశ; ధునీ=నది అన్న; జలధిన్= సముద్రంలో; వీకన్= స్పష్టంగా; నీడన్=మేడల నీడలలో; నావలై= ఓడలై; తోపన్= భ్రమింప జేయగా; నెలంతల్= ఆ మేడలలోని స్త్రీలు; వణిక్+ ఆకృతిన్=వ్యాపారుల వలె; సరకు మార్పన్=వస్తువులను మార్చుకోవటానికై; కోలలన్=గడలకు; కట్టి=వ్రేలాడగట్టి; నిజద్వీప= తమ దీవులలోని; విచిత్ర= అద్భుతములైన ; పట్టవసన=పట్టువస్త్రాల; స్తోమంబు=సమూహం; నాన్=అన్నట్లుగా; అనిల=గాలికి; అన్యోన్య=పరస్పరం; విమర్శి= ఒరుసుకొనే; తన్నగర=మధురానగరముయొక్కయు; నాక=స్వర్గలోకము యొక్కయు; అనేక=పెక్కైన; కేతు=జండాలయొక్క; ఛటలు= గుంపులయొక్క; పెల్లు= ఆధిక్యం; పొల్చున్= ఒప్పును.

తా॥ మధురాపురంలో మేడలు ఆకాశగంగలో నీడలై ప్రతిబింబిస్తున్నాయి. వాటికి జండాలున్నవి. మేడలలో స్త్రీలున్నారు ఇవన్నీ మిన్నేటిలో ఓడలై ప్రతిబింబిస్తున్నవి. అమరావతీ నగరంలోని మేడలు కూడ అలానే ప్రతిబింబిస్తున్నవి. గాలికి రెండునగరాల జండాలు అన్యోన్యం పెనవేసుకుంటున్నవి. ఇది ఎలాఉన్నదంటే వేరు వేరు దీవుల నుండి తెస్తున్న పట్టు వస్త్రా లను రెండు ఓడలలోని వారు పొడుగాటి గడలకు వాటిని కట్టి మార్చు కొంటున్నట్లుగా ఉన్నది.

అలం : ఉత్ప్రేక్ష.

ఇందులో విషయమేమంటే ఎత్తైన మేడలు పెద్ద ఓడల లాగా ఉన్నాయి. రెంటికి జండాలుంటాయి. కనుక పోలికలో అధిక సాదృశ్యంచిత్రించబడ్డది. ఆ మేడలు నీటిలో ప్రతిబింబిస్తూ నీటిలో తేలే ఓడలలాగా ఉన్నాయి. ఆ రోజులలో నౌకావ్యాపారం ఉండేది కనుక ఈ పోలిక సంభవించింది. విదేశాలతో నౌకావ్యాపారం జరగటం వల్లనే విజయ నగర చక్రవర్తులు రేవుపట్టణాలను ఎక్కువగా అభివృద్ధి చేసినట్లు చరిత్ర చెబుతున్నది. ఈ కావ్యంలో 4వ ఆశ్వాసంలో రాజనీతిలో రాజు రేవు పట్టణాలను అభివృద్ధి చేయాలని చెప్పబడ్డది. చూడు 4-245.

ఉ. సోరణ గండ్లరాఁ గొౌదమ చుక్కలు పట్ట సతుల్కవాటముల్
చేరుప మౌక్తికంబులని చిల్లులు పుత్తురు దమ్మటంచుఁబో
ల్పారు వితాన హారముల యందొగి హారత వ్రేలి ప్రొద్దుపోఁ
గా రతి డస్సి గాడ్పులకుఁ గాఁ దెఱవన్జను విచ్చి మేడలన్. 13

మేడలన్=పైరీతిగా వర్ణింపబడ్డ సౌధాలలో; కొదమ చుక్కలు= చిన్ననక్షత్రాలు; సోరణ గండ్ల= కిటికీల గుండా; రాన్=లోపలకు రాగా; సతుల్=మేడలలోని నెలతలు; పట్టన్= వాటిని బంధించడానికి; కవాటముల్=కిటికీల తలుపులు; చేరుపన్=మూస్తే; తమ్మున్= ఆ నక్షత్రాలను; మౌక్తికంబులు= ముత్యాలు; అని=అనుకొని; చిల్లులు పుత్తురు=రంధ్రాలు వేస్తారు; అటంచున్=అనుకొని; పొల్పారు= అందమైన, వితాన=మేలుకట్టుయొక్క; హారములయందున్= ముత్యాల సరాలలో; ఒగిన్=క్రమంగా; హారతన్=దండల రూపంలో; వ్రేలి=వ్రేలాడి; ప్రొద్దుపోగా=ప్రొద్దు పోయిన తర్వాత; రతిన్=మదన క్రీడకు; డస్సి= అలసి; గాడ్పులకు గాన్=చల్లగాలి కోసం; తెఱవన్=కిటికీల తలుపులు తీయగానే; విచ్చి=హారాలనుండి విడివడిపోయి; చనున్= తప్పించుకొని పోతాయి.

తా॥ ఆ నగరంలో మేడలు ఆకాశంలోకి చొచ్చు కొనియున్నందువలన కొదమ చుక్కలు కిటికీల గుండా ప్రవేశిస్తే స్త్రీలు వాటిని ముత్యాలని చెప్పి భ్రమించి పట్టుకో బోతే, అవి తనుకు రంధ్రాలు వేస్తారని భయపడిపైన వ్రేలాడుతున్న ముత్యాల హారాలలో తామూ ముత్యాలై వ్రేలాడుతూ అర్ధరాత్రికి రతిక్రీడలలో అలిసిపోయిన స్త్రీలు గాలికోసం కిటికీల తలుపులు తీయగానే బయటకు పరుగెత్తి పోతున్నవి.

అలం : అతిశయోక్తి.

ఉ. ఆ పురి సౌధవీథి నధరాధర భూముల గర్జమున్నుగా
నాపయికి న్వినంబడని యట్లుగ వ్రాలు ఘనాళిఁ దార్చిలీ
లాపరతన్ ఘటింపుదురు లాస్యము సేయఁగ మేఘరంజనా
లాపముసేసి పోషిత కలాపి ఁగలాపి కలాప కుంతలల్. 14

ఆ పురిన్= ఆనగరంలో; సౌధవీధిన్= సౌధాల సమూహంలో; కలాపి=నెమళ్లయొక్క; కలాప= పింఛాల వంటి; కుంతలల్=కేశపాశాలు గల స్త్రీలు; అధర+ అధర భూములన్= మిక్కిలి క్రింద ఉన్న ప్రదేశాలలో; గర్జ మున్నుగాన్=ఆపయికిన్= ఆ స్త్రీలున్న పై ప్రదేశాలకు; వినంబడని యట్లు= వినిపించనట్లు; వ్రాలు= క్రిందకు దిగే; ఘన=మేఘాల యొక్క; ఆళి=గుంపును; మేఘరంజని=మేఘరంజని అన్న రాగాన్ని; ఆలాపముఁ జేసి= పాడి; తార్చి=తామున్న ఎత్తైన ప్రదేశాలకు ఆకర్షించి; పోషిత కలాపిన్=పెంపుడు నెమలిని; లాస్యముసేయగన్=నటింపగా; ఘటింపుదురు= సంఘటిస్తారు.

తా॥ నెమళ్లు వానకాలంలో ఆడుతూ కేకారం చేస్తాయి. కనుక మధురానగర సౌధాలలోని స్త్రీలు సౌధాలకంటే క్రిందుగా ఉన్న మేఘాలను రంజింపజేసి పైకి ఆకర్షిస్తున్నారు. ఆ మేఘాల ఉరుములకు నెమళ్లు ఆడుతున్నవి.

విశే॥ ఆ నగరంలోని స్త్రీలు సంగీత విద్యావతులు. నెమలి పింఛంవంటి కురులు కలవారు.

ఆ నాటి స్త్రీలు పొడవైన కేశపాశం కలవారిగా కవులు వర్ణించడమే కాక శిల్పులు శిల్పాలలో కూడా చెక్కారు. కనుకనే గోదాదేవిని 5వ ఆశ్వాసంలో 38వ పద్యంలో వర్ణిస్తూ ఆమె కేశపాశాన్ని మన్మథుని డాలుగా; గిత్తమూపురం లాగా ఉన్నదన్నాడు.

అలం : అతిశయోక్తి.

చ. అనిమిష పట్టణంబు పురహర్మ్య పతాకలు మువ్వ మ్రోఁతతోఁ
దన గృహ పంక్తిపైఁ గలశతామరసంబులఁ గప్పఁగ్రిందనుం
డును నిజలక్ష్మి చేసరిపణుల్ మొఱయంగఁ దదీయలక్ష్మిశం
కను మొగ మెత్తి చూచుతఱిఁ గన్నులు కేళికి మూయఁగాఁబలెన్. 15

అనిమిష పట్టణంబు=దేవనగరం, పుర=మధురాపురముయొక్క; హర్మ్య=సౌధాలయొక్క; పతాకలు=జండాలు; మువ్వ మ్రోత తోన్= మువ్వల ధ్వనులతో; తన= తనయొక్క; గృహపంక్తిపై= ఇండ్ల వరుసలపైన; కలశతామరసంబులపైన్=తామర మొగ్గల వంటి కలశములను; కప్పగాన్= చేతులతో మూయగా; క్రిందన్= ఆ జండాలకు క్రిందగా; నిజలక్ష్మి=స్వర్గలక్ష్మి; చేసరిపణుల్= చేతులకున్న బంగారు గొలుసులు; మొఱయంగన్= ధ్వనించగా; శంకన్= శంకతో; మొగము- ఎత్తి; చూచు తఱిన్= చూచే సమయంలో; తదీయలక్ష్మి=మధురానగరమన్న లక్ష్మి; కేళికిన్=వేడుకగా; కన్నులు= స్వర్గలక్ష్మియొక్క నేత్రాలను; మూయగా బలెన్=మూసి యున్నట్లు పోలె; ఉండున్ = ఉన్నది.

తా॥ మధురా నగరంలోని సౌధాలపై జండాలు చిరుమువ్వలు కట్టబడి గాలికి శబ్దిస్తుంటాయి. స్వర్గపురలక్ష్మి సౌధాలపై బంగారు కలశా లున్నవి. ఈ పతాకలు మాటి మాటికి కదులుతూ ఆ కలశాలను కప్పుతున్నవి. ఇది యెలా ఉన్నదంటే స్వర్గలక్ష్మి ఆ పతాకలకు క్రిందనున్నది కనుక వాటి మువ్వల మ్రోతకు ఎవరో స్త్రీ చేతి బంగారు గొలుసుల మ్రోత అని పైకి చూస్తున్నప్పుడు మధురానగర లక్ష్మి ఆ నేత్ర పద్మాలను వేడుకగా మూసినట్లున్నది.

భావ మేమంటే పైపద్యాలలో లాగానే సౌధాలు ఆకాశమంత ఎత్తున్నవి. వాటి శిఖరాలకు పణులు పతాక లమర్చబడియున్నవి. పతాకల మువ్వల మ్రోతచే సరిపణులు, పతాకలు హస్తాలుగా, కలశ తామరసంబులు కన్నులుగా కప్పటం దాగుడు మూతలుగా, కలశ తామరసంబులు పైకి నిక్కబొడుచు కొని ఉండడం మొగం ఎత్తి చూడటంగా ఉత్ప్రేక్షింపబడింది.

అలం : అతిశయోక్తి తో పోషింప బడ్డ ఉత్ప్రేక్ష.

చ. ఘనరత శంపఁ గంచ మిడి కాటుక ఁదీర్చి, పునుంగినోష్మఁద
ట్టినది యలంది, కైశికము తేవఁ బ్రభాత శశాంకు మోప వి
చ్చిన నవ హల్ల కాళిఁ గయిసేసి, సతుల్పతితో రమింతు, ర
మ్మని జరఠాంగన ల్కలహము ల్కృప నేడ్తురు ఁ దీర్పమేడలన్. 16

మేడలన్= మధురానగర సౌధాలలో; సతులు= భార్యలు; అమ్ముని జరఠ+ అంగనల్ = మునుల భార్యలైన వృద్ధస్త్రీలు; ఏడ్వురున్= ఏడుగురు; కృపన్= వాత్సల్యంతో; కలహములు తీర్పన్= పొలయలుకలు పోగొట్టగా; ఘన=మేఘంలో; గత= ఉన్న; శంపన్= మెరుపులో; కంచము=పళ్ళెము; ఇడి= పెట్టి; కాటుకన్ తీర్చి= ఆకంచానికంటిన కాటుకను కన్నులకు పెట్టుకొని; ఇన=సూర్యునియొక్క; ఊష్మన్=వే డితో; తట్టినది= చాదినట్టి, పునుంగున్= పునుగన్న వాసన ద్రవ్యాన్ని; అలంది=పూసుకొని; కైశికమున్= కేశపాశమును; ప్రభాతశశాంకున్= తెల్లవారు ఝాము జాబిల్లికి; మోపన్=తగిలింపగా; విచ్చిన=వికసించిన; నవ=నూతన్నమైన; హల్లక=చెంగలువల; ఆళిన్=సమూహంతో; తేవన్= అందంగా, కయిసేసి=అలంకరించుకొని; పతితోన్=భర్తతో; రమింతురు=క్రీడిస్తారు.

తా॥ మధురా నగర సౌధాలలో సతులు పొలయలుకతో రాత్రి గడచిపోగా తమ ప్రణయ కలహాలను సప్తర్షుల భార్యలైన పెద్దముత్తైదువలు వాత్సల్యంతో తీరిస్తే పొలయలుకలు పోయిన స్త్రీలు గబగబా అలంకరించుకొని ప్రభాత వేళ పతితో రమిస్తున్నారు. ఆ అలంకరణ విధానమే పద్యంలో చెప్పబడింది. మేఘాల్లోని మెరుపుల్లో కంచం పెట్టి కాటుక తీసి కళ్లకు అలంకరించుకొని ప్రభాత వేళ పతితో రమిస్తున్నారు. ఆ అలంకరణ విధానమే పద్యంలో చెప్పబడింది. మేఘాల్లోని మెరుపుల్లో కంచంపెట్టి కాటుక తీసి కళ్లకు అలంకరించుకున్నారు రాబోతున్న సూర్యోదయపు వేడికి ఈ పునుగును కరిగించుకొని పూసుకున్నారు. కబరీ భరంలో క్రొత్త చెంగలువ పూలను తురుము కొని తెల్లవారు ఝామున జాబిల్లికి తాకించి వికసింపజేసుకున్నారు.

అలం : అతిశయోక్తి.

పద్యంలో వర్ణింపబడ్డ అలంకరణ విధానం ఆనాటి నాగరికతకు చిహ్నంగా ఉన్నది. కలువలు రాత్రిపూటనే వికసిస్తాయి. 1-75 లో కూడా చెంగలువలే చెప్పబడినందున నాటివారికి అని స్రీలిపాత్రను లనుకోవాలి. సతులు+పతి= అన్న బహువచన ఏకవచన తాత్పర్యం ఆనాడు బహుపత్నీత్వానికి సూచనగా గ్రహించాలి. శిల్పాల్లో కూడా ఇలాంటివి కనిపిస్తాయి.

చ. రవియను దివ్వెఁ గేతువు చెరంగున మూసి ధుతోర్ధ్వ యంత్రవా
ర విరళ ఘర్మయై కలరవాల్పరవోక్తుల వాంత ధూపరా
జివరనిశ న్గనన్మదన చేతులఁ జాతురి నెయ్యపుంగురుం
జువిదలు దార్ప విష్ణుపద మొత్తుఁ బురీగృహలక్ష్మి నూత్న తన్. 17

కనన్=చూడగా; పురీగృహలక్ష్మి=మధురాపుర సౌధలక్ష్మి; నూత్ననాన్=నవోఢయో అన్నట్లుగా (క్రొత్తపెళ్లికూతురు); వాంత=పైకి చిమ్మబడిన; ధూపరాజి=పరిమళ ద్రవ్యాల పొగ (అనెడి); వరనిశన్=మంచి రాత్రిలో; నెయ్యపు=స్నేహభావమున్న; కురుంజు=దూలాలపైనున్న గుజ్జులన్న; ఉవిదలు= స్త్రీలు (కొఱవంజి స్త్రీలు); చాతురిన్=నేర్పుతో; మదన చేతులన్= ఆ దూలాలపై నున్న అడ్డుపట్టెలన్న చేతులతో; తార్పన్= భర్తయైన విష్ణువు వద్దకు చేర్చగా; రవియను దివ్వెన్=సూర్యుడన్న దీపాన్ని; కేతువు

చెరంగునన్= జండాగుడ్డ పయ్యెదతో; మూసి= కప్పి; ధుత= చిమ్మబడ్డ; ఊర్ధ్వయంత్ర= నీటిని పైకి చిమ్మే యంత్రాలయొక్క; వాః= నీరన్న; అవిరళ= దట్టమైన; ఘర్మ= చెమట కలది; కలరవ= పావురాలయొక్క; అల్పరవ= వినిపించీ వినిపించని కంఠధ్వనులన్న; ఉక్తులన్= మాటలతో; విష్ణుపదము= విష్ణుపాదాలని (విష్ణుపదమంటే ఆకాశం); కనత్= ప్రకాశించే; మదన= కామం కలదై; చేతులన్= హస్తాలతో; ఒత్తున్= ఒత్తుతున్నది.

తా॥ మధురాపుర లక్ష్మి కొత్తపెళ్లి కూతురు కనుక కురుంజాలన్న చెలికత్తెలు మదన చేతులన్న హస్తాలతో భర్తయైన విష్ణుని కడకు కిటికీల నుండి బహిర్గమిస్తున్న పరిమళ ధూపమన్న చీకటిలో తారుస్తున్నారు. నవోఢ కనుక సూర్యుడన్న దీపాన్ని జండా చెరగుతో కప్పి వారి యంత్రాలు చిమ్మేనీరన్న చెమట గలదై పావురాల లేత కంఠస్వరాలన్న తలుపులు కలదై మహా విష్ణు పదాన్ని ఒత్తుతున్నది. ఆ సౌధంలో పావురాలు కువకువ కూస్తున్నవి. వారి యంత్రాలు (ఫౌంటెన్స్) పైకి నీరు చిమ్ముతున్నవి, కిటికీల పరిమళ ధూపాలు చాళ్లుగా బయటకు వస్తున్నవి. ఇది సౌధ స్వరూపం. దీన్ని మహాకవి సౌధలక్ష్మి భర్త దగ్గరకు చేర్ప బడ్డప్పుడు అతని స్పర్శకు సాత్త్విక భావోదయం పొందినదిగా వర్ణిస్తున్నాడు. 1. స్వేదం- ఊర్ధ్వయంత్రాలు చిమ్మేనీరు, పావురాల కూతలు; మణిత స్వనాలుగా చిత్రించబడడం అతిలోకమైన భావన. పతాకలు సూర్యమండలాన్ని ఆచ్ఛాదిస్తున్నాయి. కురుంజువిదలు= కొఱవంజిస్త్రీల దౌత్యం దక్షిణాంధ్ర వాఙ్మయంలో సుప్రసిద్ధమై కనిపిస్తుంది.

అలం : సమాసోక్తి.

చ. గిఱికొను గోపురాగ్ర పరికీలిత పంకజరాగ రశ్మిఁగ
ట్టెఱ యగు చాయఁబొల్చు దివసేంద్రుఁడు సక్కన మింటఁబోవుచో
మఱచి విధాత పాటలిమ మధ్యమ సంధ్యకుఁ జేయలేని యా
కొఱఁతయుఁ దీర్చుకోఁ దొగరు కొల్పిన కైవడిఁ బట్టణంబునన్. 18

విధాత= సృష్టికర్త; మరచి= మరచి పోయి; మధ్యమ సంధ్యకున్= మధ్యాహ్నకాలానికి; పాటలిమన్= ఎరుపును; చేయలేని= కల్పించలేని; ఆ కొఱఁతయున్= ఆ వెలితిని; తీర్చుకోన్= తీర్చుకోవడానికి; తొగరు= ఎర్రదనం; కొల్పిన కైవడిన్= కల్పించినాడో అన్నట్లుగా; పట్టణంబునన్= నగరంలో; దివస+ ఇంద్రుడు= పగటి రాజైన సూర్యుడు; చక్కనన్= సరిగా నెత్తిపై; మింటన్= ఆకాశంలో; పోవుచోన్= పోతున్నపుడు; గిఱికొను= వృత్తాకారంగా ఆవరిస్తున్న; గోపుర= శిఖరంయొక్క; రశ్మిన్= కాంతులచే; కడు+ ఎఱ = కట్టెర= మిక్కిలి ఎరుపు; అగుచాయన్ = అయిన వన్నెతో; పొల్చున్= ప్రకాశిస్తున్నాడు.

తా॥ సూర్యుడు మధ్యాహ్నకాలంలో నగర గోపురాలకు సరిగా నడునెత్తిపైన ఆకాశానికి రాగానే గోపురాలపై కూర్చబడ్డ పద్మరాగ మణుల కాంతులు సూర్యుని చుట్టూ వలయాలు వలయాలుగా వ్యాపించినందువల్ల అతడు మిక్కిలి ఎర్రగా కనిపిస్తున్నాడు. ఇది ఎలా ఉందంటే బ్రహ్మ ప్రాతః సాయం సంధ్యలో సూర్యుని ఎర్రగా చేసి మధ్యాహ్నకాలంలో చేయలేక పోయినాడు. ఆ కొరతను ఈ విధంగా తీర్చు కొంటున్నాడో అన్నట్టుగా ఉంది.

అలం : సూర్యుడు స్వగుణమైన స్వచ్ఛతను కోల్పోయి పద్మరాగమణుల అరుణిమను పొందినట్లు చెప్పబడటం వల్ల తద్గుణం. దానినుండి కల్పించ బడ్డ ఉత్ప్రేక్ష.

11 నుండి 18 వ పద్యం దాకా విజయనగరంలోని సౌధాలు విపరీతంగా వర్ణింపబడ్డవి. దీనికి కారణం ఆనాటి విజయ నగర వర్ణన చేసిన చరిత్ర కారులలో కనిపిస్తున్నది. పేయస్ మొదలైన పాశ్చాత్య చరిత్రకారులు రాయలవారి అంతఃపురమైన 'మలయకూటాన్ని,' కొలువు కూటమైన 'భువన విజయాన్ని' అద్భుత నిర్మాణాలుగా దీర్ఘంగా వర్ణించారు. కనుక విజయనగరంలో నాడు సౌధనిర్మాణ మొక ప్రత్యేక వాస్తుశిల్పంగా గణుతి కెక్కినది. నేటికీ మనకు దక్కిన కట్టడాలు వాటిని గూర్చి వివరించిన హంపీక్షేత్రమన్న ఆధునిక కావ్యంలో కూడా కీ.శే. కొడాలి వెంకట సుబ్బారావుగారు చాకలిదాని మేడలాంటి పద్యాలు వ్రాశారు. కాబట్టి ఈ సుదీర్ఘ వర్ణన వెనుక ఆనాటి సౌధపు ఔన్నత్యం, సంపన్నత, సౌందర్య మాధారంగా ఉన్నట్లూహించుకోవాలి.

## పుష్పలావికలు

సీ॥ వెలది, యీ నీదండ వెల యెంత?
నాదండ, కును వెలబెట్ట నెవ్వని తరంబు?
కలువఁదావులుగానమలికదంబక వేణి?
కలువతావులు వాడకయ కలుగునె?
కడివోదు నాకిమ్ము పడతి యీ గేదంగి,
నన ఁగడివోమి ముందటికిఁ జూడు
జాతులేవంబుజేక్షణ? పద్మినులు సైత;
మును నున్న యెడ జాతులునికి యరుదె?

తే॥ గీ॥ యనుచు ఁదొలినుడి నభిలాష లెనయ మూఁగి
పలుకుతోడనె నర్మగర్భంబు గాఁగ
నుత్తరము పల్లవ శ్రేణి కొసఁగు చలరు
లమ్ముదురు పుష్ప లావిక లప్పురమున. 19

ఈ పద్యమంతా పుష్పలావికల సరస సల్లాపాలు. పద్యంలో మొదటి అర్ధభాగం విటుని ప్రశ్న. రెండవ సగం పుష్ప లావికల సమాధానం.

వెలది= ఓ చెలువా !(వెలదానా); ఈ నీదండ= నీ ఈ పూలదండ ( నీ దండ చేయి); వెలయెంత= ఖరీదు ఎంత?; నాదండకును; వెల పెట్టన్= ఖరీదు పెట్ట డానికి; ఎవ్వని తరంబు= ఎవనికి సామర్థ్యమున్నది? అని పుష్పలావికల సమాధానం.

ఈ పాదంలో దండ శబ్దం రెండర్థాలలో ప్రయోగింపబడటం వల్ల సరసోక్తి అయినది. శృంగారార్థాన్ని మర్మంగా ఉంచి మాట్లాడటమే ఈ పద్యంలో స్వారస్యం. ఆ నాటి స్త్రీలకు కంచుక ధారణం లేదు. కనుక దండలు స్పష్టంగా కామోద్రేకంగా కనిపిస్తున్నవి. అందుకని యీ సంభాషణ పుట్టింది.

అలి కదంబక వేణి= తుమ్మెద చాలు వంటి జడకలదానా; కలువతావులు= కలువ పూల వాసనలు (స్థానములు); కానము=చూడము (కనిపించడం లేదని ప్రశ్న); కలువ తావులు=అవి విచ్చేసరస్సులు అంటే మర్మాంగం, నాభిస్థానాలు అని; మరియొక అర్థం కలువన్=మనమిద్దరం కలుసుకోవడానికి; తావులు=ప్రదేశాలు అని కూడా చెప్పు కోవాలి; కలువ తావులు= కలువల ప్రదేశాలు; వాసనలు వాడకయ= అనుభవించకుండానే, వాడిపోకుండానే; కలుగునె=కలుగునా?

మనిద్దరి మధ్య పరిచయం లేకుండానే; సంగమం అసంభవం కదా !

పడతి=వెలది; ఈ గేదంగి ననన్= ఈ మొగలి పువ్వును; కడివోదు= వాసన చెడదు; నాకు ఇమ్ము=నాకును ఇమ్ము.

పడతీ ! వాసన చెడని ఈ గేదంగి పువ్వును నాకివ్వు . రహస్యార్థం గేదంగి పూవు వంటి నీ అవయవాన్ని నాకివ్వు. అది లేక నాకు కడి=ముద్ద దిగదు.

మర్మాంగార్థంలో గేదంగి పువ్వు ఉపమానం లేదా ప్రతీక.

కడి పోదు=పరిమళం చెడకుండా ఉండడం; ముందటికి జూడు=ముందుకు చూడు; వాడితేకాని వాసన ఉండడం పోవడం తెలియదు కదా! రహస్యార్థం ముద్ద దిగక పోవడం ఇప్పుడే జరిగిన తర్వాత గేదంగిని వాడిన తర్వాత నీవేమవుతావో ఆలోచించుకో.

అంబుజ+ఈక్షణ = తామరల వంటి కనులు గలదానా !; జాతులు+ ఏవి = జాజిపూవులు; ఏవి = ఎక్కడున్నవి; నీవే జాతికి చెందిన దానవని ప్రశ్న. పద్మినులు = తామరల సమూహం; సైతము = కూడా; ఉన్నయెడ = ఉన్నచోట; జాతులు = జాజిపూవులు; ఉనికి = ఉండుట; అరుదే.

పద్మినీ జాతి స్త్రీలున్నచోట జాతిప్రశ్న ఏమిటి? అనిరహస్యార్థం. అనుచున్; తొలినుడి = మొదటి మాటతో; అభిలాషలు = కోర్కులు; ఎనయున్ = రేగగా; మూగి= కమ్ముకొని; పలుకు తోడనె = పలికిన వెంటనే; నర్మ గర్భంబుగాగన్ = లోపల శృంగారోక్తి కలదిగా ; పల్లవ శ్రేణికిన్ = విటుల గుంపుకు; ఉత్తరము = సమాధానం, ఒసగుచున్= ఇస్తూ; పుష్పలావికలు = పూలమ్మేస్త్రీలు; అలరులు = పువ్వులు; అప్పురమునన్ = అమ్మెదురు.

అంటూ మొదటి మాటతో కోర్కె కలిగిన పలుకుతో పాటు నర్మగర్భమైన సమాధానాన్ని యిస్తూ పుష్పలావికలు విటులకు పూలమ్ముతున్నారు.

మాటకు కోర్కె కలగటం, ఇచ్చిన సమాధానంలోనే రహస్యార్థం ఉండటం అప్రయత్నంగా

జరుగుతున్నది. లోకంలో స్పష్టార్థంలో ఒక మాట అన్నతరువాత కామపరమైన అర్థం స్ఫురించడం ప్రతి శబ్దంలోనూ కనిపిస్తున్నది. ఇదే విషయం ఎత్తుగీతిలో చెప్పబడ్డది.

అలం : వ్యాజోక్తి. శ్లేష

చ. సరసుల నర్మమింపుల నొసంగఁ గదంబపు దండఁ గట్టుచోఁ
గరఁగుటఁ దెల్పు దృక్తరళకాంతులు నుత్తర మిచ్చు నంతరాం
తరముల నవ్వులు న్గలువ తండము మొల్లలు నంచు మిన్ను గ్రు
చ్చిరహిని రిత్త నూలొసఁగి సిగ్గు వహింతురు పుష్పలావికల్. 20

పుష్పలావికల్ = పూలదండలమ్మే స్త్రీలు; సరసులు = రసికులైన విటులయొక్క; నర్మము = క్రీడాభావం; ఇంపులు = ప్రీతులు; కట్టుచోన్ = కట్టేవేళ; కరగుటన్ = మనసును ద్రవించినందులకు; తెల్పు = సూచించే; దృక్ = చూపులయొక్క; తరళ = తళుకు గల; కాంతులును = రశ్మలు; ఉత్తరము = జవాబు, ఇచ్చు = ఇవ్వడానికి, అంతరాంతరములన్ = కనుగొనడం; నవ్వులున్ = నవ్వులును; కలువ తండము = కలువల రాశి; మొల్లలు = మల్లెపూలు; అంచున్ = అని భ్రమపడి; మిన్నుగ్రుచ్చి = ఆకాశాన్ని పూలమాలగా గుచ్చి (శూన్యంలోనే గుచ్చుతూ); రహిన్ = అభిలాషతో; రిత్తనూలు = పూలు లేని వట్టి దారమే; ఒసఁగి = ఇచ్చి; సిగ్గు వహింతురు= లజ్జ వహిస్తారు.

తా॥ ఆ నగరంలో పుష్పలావికలు సరసులైన విటుల మాటలకు కరిగిపోయి దానిని సూచించే చూపులన్న నల్ల కలువపూలను, నవ్వులన్న మొల్లలను కదంబపు దండగా గుచ్చి పూలకు బదులుగా సరసులను అలరిస్తున్నారు. ఈ భావమే శూన్యాన్ని గుచ్చుతూ పూమాలలు కట్టినట్లుగా భ్రమించి వట్టిదారాన్ని విటుల కిస్తున్నారు అని చెప్పబడ్డది.

అలం : భ్రాంతిమంతం.

చూపులు నల్లకలువలుగాను, నవ్వులు మొల్లలుగాను భ్రమపడి అన్నవాక్యంలో క్రమాలంకారం కూడా ఉన్నది.

దృక్తరళకాంతులు --------నవ్వులు కలువ తండము మొల్లలునంచు అన్నవాక్యంలో ఈ అలంకార మున్నదని తాత్పర్యం.

స్వప్నవాసవదత్త నాటకంలో ఉదయనుని మూర్తి చూచి తనను తాను మరచి పోయిన వాసవదత్త సంగీతం నేర్చుకొనే వేళ శూన్యంలోనే చేయి తిప్పుతున్నది. వీణను వాయించడానికి బదులుగా అని చెప్పబడ్డ భావ మిక్కడ అతికి చూచుకోవచ్చు. పారవశ్యమున్న శృంగార భావన ఆలంకారికంగా చెప్పబడ్డ ఘట్టా లిలాంటివి సాహిత్యంలో కోకొల్లలు.

పద్మాస్యపురి ననుభవితకునీవ యె
త్తులువెట్టుదనఁగ రావలసెనిటకు,

దెలుపుమా జాముండు నల రింపో ఘటికాద్వ
యంబుందునలరింపో ! కంబుకంఠి !
యే వేఁడుటకు నీవు ఋతువేల చెప్పెద ?
వువిద ! మేముందాక నోర్వగలమె ?
చేరఁగారాదె, బాసికములోఁకిన
యంతనే చెడుననే యేణాయతాక్షి !
యనచుఁబరిబాషఁ బోలెఁ దమ్మానదోరల
నాడ, మోవిఁ జెఱఁగిడి, యాగునవ్వు
కంటనిగుడ, విరుల్ నాంచుకరణిఁ జల్లు
సరసపుజలంబె జాణలమదులు కొలుపు ముఖపద్మం 21

పద్మాస్య = పద్మముఖీ (పద్మాలమ్ముతున్న వనిత కనుక) కావాలని విటుని కోర్కె; పురిఁ = నగరంలో; అనుభవితకున్ = అనుభవించేవానికి; ఎత్తులు = దండలు, ఎదురొత్తులు; కంబుకంఠి = శంఖం వంటి కంఠంకలదానా !; జాము + ఉండు = ఒకనాడు పాటుండే; అలగు = పూవు, సంతోషం, ఇంపో ? ఇంపా? ఘటికాద్వియంబు రెండు గడియలపాటు; ఎన్ = నేను; కడుటకున్ = కోరితే, ఋతువు = ఆరుఋతువులో ఒకటి; బహిష్టు; ఓర్వఁగలవె = ఓర్చుకోగలమా; బాసికము = దండకడియం (వధూవరుల ముఖపట్టం) ఏణ+ ఆయత+ అక్షి = లేడి కనులవలె విశాలమైన నేత్రాలుకలదానా ? అనుచు = అంటూ; పరిభాషన్ పోలెన్ = సంకేతశబ్దాలచేతను వలె; తమ్మిన్ = పుష్ప లావికలను గూర్చి; ఆస దొరలన్ = కోరిక పొరిలి పోగా; ఆడన్ = విటులు చెప్పగా; మోవిన్ = పెదవిని; చెఱగు + ఇడి = కొంగు అడ్డంగా పెట్టి కొని; అగునవ్వు= ఆపు కొనే నవ్వు; కంటన్ = కనులలో; నిగుడన్ = వెలువడగా; విరుల్ = పూలు; నాన్చు కరణి = తడిపేమిషచేత; చల్లు = చిమ్మే; సరసపుజలంబే = సరసోక్తులను నీళ్లే; జాణలన్ = విటులను; మరులు కొల్పు = కామప్రేరకా లౌతున్నవి.

తా॥ విశే॥ పద్యంలో ఎత్తులు, అలరింపు (అలరు, ఋతువు) బాసికము, శబ్దాలు కామశాస్త్ర పారిభాషికాలు. కనుక ఎత్తుగీతిలో పారిభాషికశబ్దం వాడబడింది. ఈ శబ్దాలపై శ్లేష ఉన్నది. విటులు పరిభాషలో ప్రసంగిస్తే పుష్పలావికల మనస్సులో అభిలాషలు తరంగితాలైనవి. వారు నవ్వుకొన్నారు. ఆ నవ్వుల కొంగులతో కప్పుకొన్నా అది కన్నులగుండా బహిర్గతమౌతున్నది. ఆ సందర్భంలో వాళ్ల పూలు వాడిపోకుండా వాటిపై చిలకరించే నీళ్లే విటులను మరులు కొలిపే సరసపు జల్లు అయినది.

( సరసపు జలంబు = రసయుక్తమైన జలము)

విటుల సరస సంభాషణకు పద్మాస్య, కంబుకంఠి, ఏణాయతాక్షి వంటి సౌందర్య సూచకాలైన సంబోధనలే సాక్ష్యం చెబుతున్నాయి. విటులు కామశాస్త్ర పారంగతులుగా నాటి సాహిత్యం వర్ణిస్తున్నది. క్రీడాభిరామంలో ఈ విషయం స్పష్టంగా ఉంది. మృచ్ఛకటికంలో విటుని పాత్ర చూసుకోవాలి.

సీ. ఇంద మన్నటి దంత కుందాభఁగూడి ని
చ్చలపుఁ జూపులు మున్న సంభ్రమింప,
వెల యొప్ప కవలఁ బో విఱుచు మోవియుఁ గోప
మొదవెడు చూపు మోమోటఁ ద్రిప్పఁ,
దిరిగిన సస్మితోక్తియుఁ జూపు టొయ్యార
ములు నగుఁ గాదను పలుకు లుడుప,
నవి గాని కావొ నీకను పర సాపత్న్య
సంపాదనం బుబ్బు నింపుఁ బెనుపఁ,

తే. చతుర వచన విలాసాంగ సౌష్ఠవములఁ
బసిఁడి ఁదా నిచ్చినట్టి యప్పణతి మఱవఁ
బతికిఁ గైదువు లందిచ్చు రతి విధమున
విటుల కిత్తురు మఱి వారు విరులు పురిని. 22

ఇందము = ఇదిగో; అన్ +తఱిన్ = అనే సమయంలో; దంత = పండ్లనెడి; కుంద = మల్లెపూల; ఆభన్ = కాంతితో; కూడి = కలిసి; నిచ్చలపు ఁ జూపులు = ఏకాగ్రమైన చూపులు; మున్న = ఆదిలోనే; సంభ్రమింపన్ = తొట్రుపడేటట్లు చేస్తే (విటులను)

వెల = ధర; ఒప్పక = అంగీకరింపక; అవలఁబోన్ = ఆవలకు పోగా; విఱుచు మోవియు=పెదవి విఱిచిన తీరు; కోప మొదవెడు చూపు = కోపంతో చూచిన చూపు; మోమోటన్ త్రిప్పన్ = మొగమాటంతో వెనుకకు వచ్చేటట్లు చేయగా

తిరిగినన్ = తిరిగి తన కడకే రాగా; సస్మిత+ఉక్తియు = చిరునవ్వుతో కూడుకొన్న మాట; చూపుట+ ఒయ్యారములు = చూపులలో విలాసాలు; అగున్- కాదు = వెల అవును కాదు; అను = అన్నట్టి; పలుకులుడుపన్ = మాటలు విటులకు పోగొట్టగా

నీకున్; అవిగాని = దాని పువ్వులే కాని; కావో = పనికిరావో; అను = అన్న; పరసాపత్న్య= ఇతరులైన పుష్పలావికలతో సవతి తనముయొక్క; సంపాదనంబు = కల్పించు కోవడం; ఉబ్బున్(విటులకు) = గర్వం; ఇంపున్ = ప్రీతిన్; పెనుప = పెంచగా

చతురవచన = చాతుర్యంతో కూడిన మాటలు; విలాస = ఒయ్యారంతో కూడుకున్న; అంగసౌష్ఠవములన్= అవయవముల పొంకము; పసిఁడి ఇచ్చినట్టి = బంగారు నాణాలను ఇచ్చిన, అప్పణతిన్ = ఆస్త్రీని; మఱవన్ = మఱచిపోగా; పతికి = మన్మథునికి; కైదువులు = ఆయుధాలు; అందిచ్చు; రతివిధ మునన్= రతీదేవి లాగా; వారు = పుష్పలావికలు; విరులు = పూలు; విటులకు+ ఇత్తురు = విటుల కిస్తున్నారు.

తా ॥ ఇదిగో తీసికో అనే సమయంలోనే మల్లెపూల దంతకాంతులతో కూడిన నిశ్చలమైన చూడ్కులే ముందుగా విటులకు వేడ్క కలిగింపగా, పుష్ప లావిక చెప్పిన ధర కుదరక విటుడు మరొక పూలమ్మి

కడకు పోతున్నపుడు పెదవి విరిచిన తీరు సాసూయముగా చూచిన చూపులోని శృంగార భావాలకు ముగ్ధుడై విటుడు మరలా తన దగ్గరకే మోమోటతో త్రిప్పగా;

ఆ విధంగా విటులు వెన్కకు తిరిగి రాగానే పుష్పలావిక ప్రదర్శించిన సవిలాస దృష్టి, సస్మితమైన పలుకులకు వ్యామోహ పడ్డ విటుడు ఆమె చెప్పిన ధరను అవును కాదన్న మాట లేకుండా చేసింది.

అపుడు పుష్పలావిక ఆ విటులకు పూలిస్తూ దాని పూవులు నీకంత ఇష్టమా ? అన్న సాపత్న్య భావాన్ని చూచి విటులు తమ సరసత్వానికి సంతోషించి గర్విస్తున్నారు.

ఈ విధంగా నేర్పుతో కూడిన మాటలతో, ఒయ్యారంతో కూడిన అంగ సౌష్టవంతో పూర్వం దీనారా లిచ్చిన స్త్రీని మరపింప చేస్తూ పతికి ఆయుధాలు అందించే రతీదేవిలాగా విటులకు పుష్పాలు ఇస్తున్నారు.

విశే॥ ముందటి పద్యం విటుల సంభాషణ కాగా, ఈపద్యం పుష్పలావికల చేష్టా సౌందర్యాన్ని వర్ణిస్తున్నది. మొదటి సీసం నాలుగు పాదాలు ఒక క్రమంలో నిబంధింప బడ్డవి. ఒక విటుడు పుష్పలావిక దగ్గరకు రాగానే ఆనిడ పూలివిగో అని యివ్వడం, ఆ ధర కతడు అంగీకరించక అవతలికి పోతుంటే ఈమె పెదవి విరవడం, ఆ అందానికి ముగ్ధుడై తిరిగి వెనుకకు రావడం, వచ్చిన వెంటనే అతనిని నవ్వులతో ముంచెత్తటం, అవతలి దాని దగ్గరకు పోవడం ఇష్టమా? అని దెప్పిపొడవటం ఇదీ క్రమవిన్యాసం.

వ్యాకరణం : ఇందము. దీనికి వ్యవహారరూపం ఇందా !

చ. దలమగు చంద్రఖండములు దారలు , సాంకవ మొప్పు పాణి పా
టలమగు దంతపుంగరవటంబు శశాంకుఁడు, గుంకుమైన చీ
రల రల జిగి కెంపు, గా బయటి రథ్యల నొప్పుదు రిందు కాంతవే
దుల పయి సంధ్యయే బహుత ( దోఁచె నన న్పురి గట్టి వాల్పతుల్. 23

పురిన్ = మధురాపురంలో; బయటి రథ్యలన్ = బయటి వీథులలో; గట్టి వాల్పతుల్ = పరిమళద్రవ్యాలమ్మే స్త్రీలు; దలము+అగు = అధికమైన; చంద్రఖండములు = కర్పూరపుముక్కలు; తారలు = నక్షత్రాలు (కాగా) ; సాంకవము = జవ్వాది (సంకువు= జవ్వాది పిల్లి . దానినుండి వస్తుంది కనుక సాంకవం); పాణి పాటలము = హస్తముయొక్క తెలుపు ఎరుపు కల వన్నె; అగు = అంటిన; దంతపున్ కరవటంబు = ఏనుగు దంతంతో చేసిన భరణి; శశాంకుడు = చంద్రుడు ( కుందేలు మచ్చగా కలవాడు) కాగా; కుంకుమ= సింధూరం; ఐన = అంటిన; చీరల జిగి = చీరల కాంతి; కెంపుగా = ఎర్రవన్నె కాగా, ఇందు కాంత వేదులపయి = పాల రాళ్ల తిన్నెలపై; సంధ్యయే = సంధ్యా కాలమే; బహుతన్= అనేకంగా; తోచెన్ = ఉదయించింది అన్నట్లుగా; ఒప్పుదురు = ప్రకాశిస్తున్నారు.

విశే॥ ప్రధాన వీధులలో పాల రాళ్లతిన్నెలపై గట్టి వాల్పతులు పరిమళ ద్రవ్యాలు విక్రయిస్తున్నారు. ఆ ద్రవ్యాలలో అనేకంగా కర్పూరఖండాలున్నాయి. అవన్నీ నక్షత్రాలు, గులాబి వన్నెగల హస్తాలలో దంతపు

భరిణెలలో జవ్వాదిని విక్రయిస్తున్నారు. అది శశికాగా కుంకుమ అంటుకున్న చీరల కాంతి సంధ్యా రాగం కాగా సంధ్యాకాలమే అనేక రూపాలు ధరించి వచ్చినదా అన్నట్లున్నారు. జవ్వాది నిండిన దంతము భరిణె చేతి గులాబి వన్నె ప్రతిబింబించివున్నందున శశాంకుడిగా రూపించడం చాలా అద్భుతంగా ఉంది. ఈచంద్రుడు సంధ్యాకాల చంద్రుడు కనుక ఎరుపు, తెలుపు వన్నెలతో ఒప్పారుతూ నడుమ నల్లని గుర్తుతోనున్నాడు దంతపుభరిణె, తెల్లని చంద్రుడు, భరిణెలోని జవ్వాది, చంద్రునిలోని మచ్చ. పాణి పాటల కాంతి చంద్రునిపై వ్యాపించిన సంధ్యాకాంతి. ఇంత వరకు ఐదు పద్యాలు పుష్పలావికల వర్ణన. ఆనాడు విజయనగరంలో వేరు వేరు అంగళ్లు కల బజారులు వేరువేరుగా ఉండేవి. అంటే పూలమ్మే బజారు వేరు. రత్నాలమ్మే బజారులు వేరు. ఆవిషయమే యిక్కడ ప్రస్తావిత మౌతున్నది. ఆనాటి సంఘంలో ఇట్టి సన్నివేశం ఉన్నట్లుగా ప్రాచీన సాహిత్యం నిరూపిస్తున్నది. నేటికీ యిలాంటి సంఘటనలు కద్దు.

## గజవర్ణన

సీ. ఉపరిష్ఠ జన వారణోక్తికిఁ జెవి దార్చి
యమ్మొగంబై బయల్చిమ్మి చిమ్మి,
గవనువెన్నార యమిన్నవియ దట్టించు తో
త్ర ధరు బందపు దాంట్లఁ దఱిమి దఱిమి
చలువ చే ద్వార వేదు లెఱింగి నిల్చి త
జ్జన జిఘృక్షకుఁ గేలు సాఁచి, సాఁచి,
డిండిమంబుల కుబ్బ గండాల్పదాన మే
ఱులుగఁ దద్వహు ఱూల ఱువ్వి, ఱువ్వి,

తే. గీ. వేణుకాహతులకు వీడు వెడలి వెడలి
పరపథ గజధ్వనికిఁ బోక తిరిగి తిరిగి
ధృకుటులు వైరులకుఁ బంపు కృత్యలన వ
శానుగతిఁ జేరు వెలిఁ గరు లగ్గలికల. 24

కరులు = ఏనుగులు; ఉపరి = తమపైన ; ష్ఠ = ఉన్న; జన = మావటీని; వారణ = నివారించే; ఉక్తికిన్ = మాటకు; చెవిన్ తార్చి = చెవియొగ్గి; ఆ+మొగంబై = ఆమావటీని వైపు తల ఎత్తి; బయల్ = ఆకాశం; చిమ్మి చిమ్మి = మాటి మాటికి మీటి;

ఏనుగు మదించి ఉన్నది. కనుక పైన కూర్చున్న మావటీడు అంకుశంతో పొడుస్తున్నాడు. లేదా అదిలిస్తున్నాడు. ఆ అదిలింపు మాటకు చెవి యొగ్గి మాటి మాటికి అతని వైపునకు మొగమెత్తి చూస్తూ తొండంతో ఆకాశాన్ని చిమ్ముతోంది.

గవ= నగర ద్వారము; వెన్ను = తనవీపు; ఒరయన్ = తాకు తుండగా; మిన్ను= ఆకాశం; అవియన్ = బ్రద్దలయ్యేటట్లుగా; దట్టించు = అదలించు; తోత్రధరున్ = అంకుశం ధరించిన మావటీని; బందపు దాంట్లన్ = సంకెళ్లు గల కాళ్లతో దాట్లుపెడు తూ; తఱిమి తఱిమి = వెంటపడి తరిమి

ఏనుగులు ఎత్తైనవి కనుక గవను ద్వారాలకు వీపురాచుకుంటున్నవి. మావటీడు అంకుశంతో అదిలించబోతే బంధాలు వేసిన కాళ్లతోనే గెంతుతూ అతని వెంట పడి తరుముతున్నవి. వాటి ఘీంకారాలకు ఆకాశం బ్రద్దలవుతున్నది.

చలువ చేన్ = చల్లగా ఉన్నందున; ద్వారవేదులు = ద్వారాల ప్రక్కన ఉన్న అరుగులు; ఎఱింగి = తెలిసి; తత్ = అరుగులపై ఉన్న; జన = జనులలో ; జిఘృక్షకున్= పట్టు కోవాలన్న కోరికతో; కేలు= తొండము; చాచి చాచి = మాటి మాటికి చాస్తూ. చల్లగా ఉన్నందున వీధివాకిలి అరుగులను గుర్తించి వాటిపైనున్న మనుషుల పట్టుకోవాలన్న కోరికతో తొండాన్ని మాటి మాటికి చాచి చాచి ఏనుగు మదించియున్నందున చల్లదనమున్న అరుగుల దగ్గర శరీరం చల్లబరుచుకొనడానికి నిలబడి అరుగులపై నున్న జనాన్ని తొండంతో పట్టుకోవాలని ప్రయత్నిస్తున్నది.

గండ = చెక్కిళ్లనుండి స్రవించే; అల్ప = కొంచమైన; దానము = మదజలం; డిండిమంబులకు = ఢక్కాధ్వనులకు; ఏఱులుగన్ =ఏఱులగునట్లుగా; ఉబ్బన్ = విజృంభించగా; తత్+వహున్ = ఆఢక్కాను ధరించిన వానిని; ఱాలన్ = ఱాళ్లతో; ఱువ్వి ఱువ్వి = విసిరి విసిరి

చెక్కిళ్లనుండి మదజలం అల్పంగా స్రవిస్తున్నది. ఇలాంటి ఏనుగును బెదరగొట్టడానికి ఢంకాలు మ్రోగిస్తున్నారు. దానికి రెచ్చిపోయిన ఏనుగు చెక్కిళ్లనుండి మదస్రావం కాల్వలై పొంగులెత్తగా డిండిమం మ్రోగించే వారిపై రాళ్లు రువ్వు తున్నది.

వేణుక+ఆహుతులకున్ = వెదురు కర్ర దెబ్బలకు; వీడు = నగరం; వెడలి వెడలి = బయటకు వెళ్లి; పర పథ = మరొక దారిలోని; గజధ్వనికిన్ = ఏనుగుల ఘీంకారాలకు; పోక = నగరం దాటి పోకుండా; తిరిగి తిరిగి = మరలా ఊరిలోకి ప్రవేశించి; వశా = ఆడు ఏనుగుల; అనుగతిన్ = వెంబడించడం వల్ల; వెలిన్ = ఊరి వెలుపల; అగ్గలికలన్= విజృంభణతో; దృక్పుటలు = చూపుల దొన్నెలు; వైరులకున్= శత్రువుల మీదికి; పంపు = ప్రయోగించిన; కృత్యలు = సంహారదేవతలు; అనన్= అన్నట్లుగా; చేరున్ = సమీపిస్తున్నవి.

తా॥ మదించిన ఆ ఏనుగును మావటివాడు పొడవైన వెదురు బొంగులతో కొడితే, అది నగరం బయటకు పరిగెత్తుతుంటే ఇంతలో వేరే రాజమార్గంలోని ఏనుగులు ఘీంకరింపగా మరలా నగరంలోకి వెనుకకు తిరిగాయి. ఇంతలో ఆడ ఏనుగు కనిపించేసరికి ఊరి వెలుపల వెన్నంటి పోతున్నది. ఆ మదపు టేనుగు ఆడు ఏనుగులను చూస్తున్న చూపులు పాండ్య చక్రవర్తి శత్రురాజ సంహారార్థం ప్రయోగించే ఉగ్రశక్తులో అన్నట్లున్నాయి.

విశే॥ పద్యమంతా మదించిన ఏనుగుయొక్క సహజమైన వర్ణన కనుక స్వభావోక్తి అలంకారం. చివరి

వాక్యంలో ధృక్పుటలు కృత్యలుగా చెప్పబడ్డ సందర్భంలో ఉత్ప్రేక్ష. పాండ్య చక్రవర్తి చతురంగ బలాలను వర్ణిస్తూ ఏనుగుల వర్ణన చేస్తున్నాడు కవి. పాండ్య చక్రవర్తి మంత్రశాస్త్ర వేత్తగా చెప్పబడటం ఆలోచించ దగ్గ విశేషం. ఆనాటి చక్రవర్తులు మంత్రుల మంత్ర బలంతో పాటు 'దైవ మంత్ర బలం కూడా కావాలి' అన్న విషయం గుర్తించినవారుగా తెలుస్తోంది. బహుశా శ్రీకృష్ణ దేవరాయల కీశక్తులు ఉండి ఉండాలి (చూ. 4లో రాజనీతి; 4-153, స్థలవర్ణనతోపోల్చు)

ఉ. పై ననిశంబు సల్లుకొను పాంసువుపై ఖగతుండ ఖండితా
లాన మహా మహీరుహ ఫలచ్యుత బీజము లుత్‌క్షిపత్కరాం
భోనిబిడాప్లుతి న్మొలవఁ బోల్చు నగమ్యతఁ దూలుచు న్పురో
ద్యానముల న్మదేభములు ప్రాణము తోడి నగంబులో యనన్. 25

పుర+ ఉద్యానములన్ = నగరం బయటి తోటలలో; మద+ ఇభములు = మదించిన ఏనుగులు; పైన్ = తమమీద; అనిశంబు = ఎప్పుడూ; చల్లుకొను = తొండంతో చల్లుకొనే; పాంసువుపైన్ = దుమ్ముమీద, ఖగ = పక్షులయొక్క; తుండ = ముక్కులతో; ఖండిత=తురుమబడ్డ; ఆలాన = ఏనుగులను బంధించే స్తంభాలైన; మహా = పెద్ద; మహీరుహ = చెట్లయొక్క; ఫల = పండ్లనుండి; చ్యుత = రాలిన; బీజములు = గింజలు; ఉత్‌క్షిపత్ = పైకి చల్లుకొనే; కర = తొండంతో(చిమ్మే); అంభః = నీటియొక్క; నిబిడ=దట్టమైన; ఆప్లుతిన్ = తడపడంవలన; మొలవన్ = మొలకెత్తగా; అగమ్యతన్ గమనశక్తి లేనందువల్ల; తూలుచున్ = అటూ ఇటూ కదులుతూ; ప్రాణము తోడి = ప్రాణాలున్న; నగంబులో యనన్ = కొండలో అన్నట్లు; పోల్చున్ = ఒప్పును;

తా॥ ఏనుగులను పెద్దపెద్ద చెట్లకు కట్టివేశారు. ఇవి మాటిమాటికి వీపుల మీద మట్టిని చిమ్ముకుంటున్నవి. ఆపైన తొండంతో నీళ్లు చిమ్ముకొంటున్నవి. గింజలు రాలి మొలకెత్తాయి. అందుచేత ఏనుగులు కదులుతున్నందున ఆ ప్రాణశక్తి కలవైన కొండలు.

అలం : ఉత్ప్రేక్ష.

ఈ రెండు పద్యాలు ఏనుగుల వర్ణనలు. తర్వాత నాలుగు పద్యాలు అశ్వవర్ణనలు. అధిక గజ సైన్యంగల రాజులు గజపతులు. అశ్వసైన్యం కలవారు అశ్వపతులు. అంటే మహమ్మదీయ రాజులు. నరపతులంటే కాల్బలం ఎక్కువగల విజయనగర చక్రవర్తులు. ఆనాడు ఈ ముగ్గురు రాజులున్నారు. మహమ్మదీయులను జయించడానికి శ్రీకృష్ణదేవరాయలు అశ్వసైన్యాన్ని చాలా అభివృద్ధి చేశాడు. ఈ చారిత్రకాంశాన్నే క్రింది పద్యాలు నిరూపిస్తున్నవి. ( ఈ గజవర్ణనలు ఇతరత్రా లేవు)

అశ్వ వర్ణన

శా. మౌని క్రోధ విధూత పత్త్రముల మా మాతో సపత్త్రిల్లదా
కానీ రండని కేకరాక్షి రుచి మొక్క ల్పక్కల న్సా ర్జ తూ

ణానల్పాహిపకల్ప కాండ తతులం దారం బురిం బొల్చునా
జానేయంబులు ఫేనహాస మిడి కై జామోర లల్లార్చుచున్. 26

పురిన్ = మధురానగరంలో; ఆజానేయంబులు = జాతిగల గుఱ్ఱాలు; మౌని = శాలిహోత్రు డన్న మునియొక్క; క్రోధ = కోపంతో; విధూత = పోయిన; పత్త్రములు= రెక్కలున్న వారము; ఔ = అయిన; మాతోన్, సపత్త్రల్గదా = ఱెక్కలున్నవారు కదా!; కానీ; రండు; అని; కేకర+ అక్షి = కడ కన్నులయొక్క; రుచి = కాంతులయొక్క; మొక్కల్ = మొలకలు; ప్రక్కలన్ = తమయొక్క రెండు ప్రక్కలందు (కట్టబడ్డ); శార్ఙ్గ = ధనుస్సులతో కూడిన; తూణ = అంబుల పొదులలోని; అనల్ప = సాటిలేని; అహిప = పాముల రాజుయొక్క, కల్ప = (సామ్యం కల) సమానమైన; కాండ = బాణాల యొక్క; తతులన్ = గుంపులో; తారన్ = ప్రసరించగా; ఫేనహాసము = నురుగు వంటి నవ్వు; ఇడి = కలవై; కైజామోరలు = కళ్లెము పైకెత్తి బిగబట్టిన ముఖాలు; అల్లార్చుచున్= కదిలిస్తూ, పొల్చున్ = ఒప్పును.

తా॥ మధురానగరంలో వేగంగా పరిగెత్తే జాతి గుర్రా లున్నాయి. అవి కళ్లాలతో బిగించ బడ్డ పైకెత్తిన ముఖాలు కదిలిస్తూ కడకంటితో తమ వీపుల ఇరుప్రక్కలా వ్రేలాడ కట్టబడ్డ ధనుర్బాణాలను చూస్తున్నవి. ఆచూపులెలా ఉన్నాయంటే ''మేము ముని కోపంతో రెక్కలు రాల్చుకున్నాము. సర్పరాజుల వంటి బాణాల్లార ! మీ కేమో రెక్కలున్నాయి. అయినా పరిగెత్తడంలో మాతో పోటీకి రండి'' అని కోర కన్నులతో చూస్తున్నట్లు ఉన్నాయో అన్నట్లున్నవి. తల పంకించడం; ఊ ! కానివ్వండి అన్న కోపంతోను, కళ్లాలు బిగించబడ్డ నోటినుండి నురుగ దొబ్బలు ప్రసరించడం పరిహాస పూర్వకంగా అవి నవ్వుతున్నాయో అన్నట్లున్నవి. రౌతులు మిక్కిలి అదలించిన గుర్రాలవేగం వర్ణితమైనది.

కడకంటి దృష్టి; నోటి నురుగు; కైజామోర ఇవి గుర్రాలకు సహజమైన విషయాలు. ఈ లక్షణాలను బాణాంలో పోటీ పడ్డట్లుగా చిత్రింపబడటం వల్ల అలంకారం ఉత్ప్రేక్ష. అంటే గుర్రాలు బాణం కంటే వేగంగా పరిగెత్తగలవి అని భావం.

విశే॥ ఆజానేయం = ఆఫ్రికా ఖండంలో ఒక దేశం. అక్కడి నుండి వచ్చిన గుర్రం. అతి ప్రాచీన కాలంలో గుర్రాలకు రెక్కలుండేవట . అందుచేత ఇవి ఆకాశంలో ఎగురుతూ ఉండేవి. వాటిని చూచి యింద్రుడు శాలిహోత్రుడన్న మునితో ఈ గుర్రాల ఱెక్కలు తెగ కొట్టమని అంటే అతడు ఒక దర్భను అస్త్రంగా మంత్రించి కోపంతో ప్రయోగిస్తే ఆ అస్త్రం గుర్రాల రెక్కలను నరికి వేసిందట. ఈ పురాణ కథ ఈ పద్యాని కాధారం.

చ. 'చలమున సింగిణీ తరకసంబుల cగట్టక మాన, రంప పె
న్నెల గతి మాగతి న్వెనుకc జిక్కక మానదు, తప్పిదారి వె
న్నెలసినమారు పెన్నెలయ కుండుట నొచ్చెము సాది కోటి' కం
చలమిన చింతc ద్రవ్వి కొను నంఘ్రి తుద న్బరిలోని వాహముల్. 27

పురిలోని వాహముల్ = నగరంలోని గుర్రాలు; చలమునన్ = శత్రువుల మీద కోపంతో; సింగిణీ తరకసంబులన్ = సింగాణి విండ్లతో కూడిన అమ్ముల పొదులలో; కట్టక = కట్టకుండా; మానరు = మా రౌతులు వినరు; అంప పెను సెలగతి = బాణాలయొక్క గొప్ప అలుగులయొక్క గమనము; మా గతిన్ = మా నడకలో; వెనుకన్ = వెనుకకు; చిక్కన్ = చిక్కకుండా; మానదు; తప్పిదారి = దారితప్పి, ఒకవేళ, వెన్ను బలిసినన్ = మా రౌతుల వీపులకు తగిలితే; తారు = తాము; మున్ను ముందుగా; ఎఱుగకుండుట= ఈ విషయం తెలుసుకోక పోవడం; సాది కోటికిన్ = రౌతుల సమూహానికి; ఒచ్చెము= కొరత; అంచున్ = అనుకుంటూ; అలమిన చింతన్ = మనస్సులో వ్యాపించిన దిగులుతో; అంఘ్రితుదన్ = కాలికొసగిట్టతో; త్రవ్వికొనున్ = నేలను త్రవ్వుకొంటున్నది.

తా॥ గుర్రం గిట్టలతో నేలను త్రవ్వడం స్వభావకమైన విషయం. అది ఎలా ఉందంటే గుర్రాల మనస్సులో ఈ చింత ఉన్నదట. మా రౌతులు మా వీపులకు ధనుర్బాణాలను కట్టకుండా మానరు. శత్రువుల మీద కోపంతో వాటిని ప్రయోగించినపుడు మాతో పాటుగా లేదా మాకన్నా ముందుగా ఆ బాణాలు పరిగెత్తలేక వెనకబడిపోతాయి. అప్పుడు శత్రువులకు నాటుకోవలసినవి మా రౌతుల వీపులకే నాటుకుంటాయి కదా! ఈ విషయం మాపైనున్న రౌతులకు తెలియదే? ఎలాగ? అన్న చింతతోనో అన్నట్లు కాలిగిట్టలతో నేలను త్రవ్వుతున్నవి.

అలం : హేతూత్ప్రేక్ష.

నేలను త్రవ్వడం అన్నది చింతతో కాదు. ఈ హేతువు కాని దాన్ని హేతువుగా చెప్పినందువల్ల హేతూత్ప్రేక్ష.

పై పద్య భావమే ఈ పద్యంలో కూడా మరొక రకంగా చెప్పబడింది.

**ఉ. అంజ సమాన వాయుగణ మంతయు ఖంజతఁ జిక్క, నాజవో**
**ష్మంజనియించి చిక్కని సమానపు వాయువులో నొకండు గ**
**ల్మిం జనియించు దుర్యశము మేల్కొని లోహన వేళ వాజులూ**
**ర్పం జెడుమాణి బంధ ముకురంబుల కాళిమ పేరఁ గార్కొనున్. 28**

వాజులు = గుర్రాలు; అంజన్ = ఒక్క అంగలోనే; సమానవాయు గణము = తమతో సమానంగా పరిగెత్తే గాలుల సమూహం; ఖంజతన్ = వేగం చాలనందువల్ల; చిక్కన్ = వెనుక బడిపోగా; ఆ జవ = వేగం వల్ల పుట్టిన; ఊష్మన్ = వేడివల్ల; చిక్కని = చేతికందని; వెనుకపడని; సమానపు వాయువు = సమాన మన్న పేరుగల గాలి; లోన్ = శరీరంలో; ఒకండు = ఒక్కడు; కల్మిన్ = ఉండడం వల్ల; జనియించు = పుట్టే; దుర్యశము = అపకీర్తియే; మేల్కొని = గుర్రాలు నిద్రలేచి; లోహన వేళన్ = ఆహారంతినే సమయంలో; ఊర్పన్ = నిట్టూర్పుగా; చెడు = వన్నె మాసిపోయే; మాణి బంధ ముకురంబులన్ = అద్దాలవంటి సైంధవ లవణపు బిళ్లలయొక్క; కాళిమ = నల్లదనమన్న; పేరన్ = మిషతో; కార్కొనున్ = నల్లబడును.

తా॥ గుర్రాలకు తెల్లవారగానే సైంధవ లవణాన్ని దాణాగా పెడతారు. దాన్ని గుర్రాలు ఆఘ్రాణించేసరికి

దాని తెల్లదనం నలుపుగా మారిపోయింది. అది ఎలా ఉన్నదంటే తమతో సమానమైన వాయువుల నన్నింటిని గెలిచిన సమానమన్న పేరుగల నాభియందుండే వాయువును గెలువ లేమైతిమే అన్న అపకీర్తియొక్క నలుపులాగా ఉన్నది. అంటే గుర్రాలు వాయువేగం కలవని తాత్పర్యం.

అలం : కైతవాపహ్నుతి. సైంధవ లవణం మీద వ్యాపించిన నలుపునకు ఒక వ్యాజం చెప్పబడింది కనుక.

శరీరంలో పంచ వాయువు లున్నట్లు యోగశాస్త్రం చెబుతున్నది. 1. ప్రాణం 2. అపానం 3. సమానం 4. ఉదానం 5. వ్యానం. వీటి స్థానాలు యథాక్రమంగా హృదయం, గుదం, నాభి, కంఠం, సర్వశరీరం. (పద్యంలో ఉన్న యోగ శాస్త్ర రహస్యానికి చూడు పీఠిక.)

మ. ఇలఁ బాదద్వయి రాయ నల్కొసగు నెంతేఁ బాఱుచోఁ; నంకవ
న్నెలు రెండై లఘువంద కీర్తి యిడు మున్నే యెక్కుచోఁ, నిందు నెం
దుల కే మౌదు మటంచు సాదులలయన్, దూర్ణోచ్చము ల్వాజులం
దలరున్ బాహ్లిక పారశీక శకధట్టారట్ట ఘోట్టాణముల్. 29

తూర్ణోచ్చముల్ = వేగంగా పరుగెత్తే ఎత్తైన- వాజులు = గుర్రాలు; బాహ్లిక, పారశీక, ధట్ట, అరట్ట ఘోట్టాణముల్ = ఆదేశాలలో కొని తేబడ్డవి; అపారుచోన్ =పరిగెత్తే సమయంలో; ఇలన్ = నేలపై; పాదద్వయి = మా రెండు పాదాలు; రాయన్ = రాచుకోవడం వల్ల; ఎంతేన్ = ఎంతో; అల్క = భయం; ఒసగున్ = కలిగిస్తున్నవి; మున్నే = ముందుగానే; ఎక్కుచోన్ = ఎక్కేవేళ; అంక వన్నెలు రెండై = అంకె వన్నె క్రింద మరొకటి ఉన్ననే గాని ఎక్కడానికి సాధ్యం కానిది. (అంకె వన్నె = రౌతు ఎక్కడానికి గుర్రం వీపుకు వ్రేలాడదీసే ఇనుపవలయం); లఘువందన్ = తక్కువ తనంవల్ల; అకీర్తి = అపకీర్తి; ఇడున్ = కలిగించును; ఇందున్ = ఈ రెంటిలో; ఎందులకున్ = దేనికి; ఏమి+ అవుదుమో = ఏమౌతామో; అంచు = అంటూ; సాదులు = రౌతులు; అలయన్ = ఆయాస పడేటట్లుగా; అలరున్ = అందగిస్తున్నవి.

తా॥ జాతి గుర్రాలు పరిగెత్తేటప్పుడు శరీరాన్ని దీర్ఘీకరించి కడుపు నేలకు తగిలే టట్లుంటాయి. అప్పుడు రౌతులకు పాదాలు క్రిందకు రాచుకుంటాయి. ఎక్కేటప్పుడు గుర్రాలు నిలువెత్తున నిలబడియుంటాయి. కనుక రెండంకె వన్నెలు లేనిదే పైకెక్కి కూర్చోవడం అసాధ్యం రెండంకె వన్నెలు యోధునకు అపకీర్తికర మైనవి. కనుక ఈ రెండు మాకు చిన్నతనాన్ని కలిగిస్తున్నవి. ఎలాగో అని రౌతులు చింతించేటట్లుగా ఆయాదేశాలనుండి తేబడిన ఉచ్చములైన అశ్వాలు ఆ నగరంలో ఉన్నాయి.

అలం : అతిశయోక్తి.

### పణ్యయువతులు

సీ. ముడి విప్ప నడుగుఁదమ్ములనె వ్రాలుటఁ దేంట్లు
నెఱికురు లగుట సందియము గలదె?
కన నెంత వాని లోఁగొనుట నాదర్శంబు
నెమ్మొగం బగుట సందియము గలదె?

ఇఱి గౌను మింటిపై మెఱయుట c జక్రద్వి
తయి చన్ను లగుట సందియము గలదె?
పొలసు దొ ర్లఁగc జూచు కలికి చూపుల మీలు
దెలిగన్నులగుట సందియము గలదె?

తే. పొలసిననె తావి బుగులుకో నలరు దీఁగ
తిన్నని శరీర మగుట సందియము గలదె?
యనఁగc జెలువొంది సురత వైయాత్యనిధులు
పణ్యయువతులు పొలుతు రప్పట్టణమున. 30

ముడి విప్పన్ = జుట్టు ముడి విప్పినంతనే; అడుగు దమ్ములనె = తమ్ములవంటి అడుగుల పైనే; వ్రాలుటన్= పడడం వల్ల; నెఱి కురులు = పొడవైన వెంట్రుకలు; తేంట్లు = తుమ్మెదలు; అగుట = కావడానికి; సందియము కలదె = సందేహం లేదు; కనన్ = చూచినంతనే; ఎంత వారిన్ = ఎంత మగవారినైన; లో గొనుటన్ = లోబరచుకొనుట చేత; నెమ్మొగంబు = అందమైన ముఖం; ఆదర్శంబు = అద్దం; అగుట; సందియము కలదే.

ఇఱి+కౌను = సన్నని నడువు అన్న; మింటిపైన్ = ఆకాశంమీద; మెఱయుటన్= ప్రకాశించడంచేత; చన్నులు = స్తనాలు; చక్రద్వితయి = చక్రవాకం జంట; అగుట; సందియము కలదె?

పొలసు = చేపల శరీరం మీది పొలుసు బిళ్లల కాంతులు; దొర్లగ = పొర్లగా; చూచు = చూచే; కలికి చూపులన్ = అందమైన చూపులు కలవైనందున; తెలిగన్నులు = తెల్లని కన్నులు; మీలు = చేపలు; అగుట; సందియము కలదె ?

పొలసిననె = సమీపించినంత; తావి = వాసన; బుగులుకోన్ = గుప్పుమని క్రమ్ముకోగా; తిన్నని శరీరము = సన్నగా పొడవైన శరీరం; అలరు తీగ = పూలతీగ; అనగన్ = అన్నట్లు; చెలువు = అందం; ఒంది = పొంది; సురత వైయాత్య నిధులు = కామకేళికి సంబంధించిన పాండిత్యంలో నిధులైన; పణ్యయువతులు = వేశ్యలు; ఆ పట్టణమునన్ = ఆ మధురానగరంలో; పొలుతురు = అందగిస్తారు.

**తా॥** వారిజుట్టుముడి అడుగు దమ్ముల వరకు వ్యాపించియుంది. కనుక అవి తేంట్లు లేక పోతే పాదాలన్న కమలాలపై ఎందుకు మూగుతాయి? కనుక ఇందులో సందేహించ వలసిన పని లేదు

వారి ముఖాలు అద్దాలవలె మెరసి పోతున్నాయి. కనుకనే ఎంత ధీరుడైనా దానికి లోబడక తప్పదు.

వారి నడుములు సన్నమైనవి, ఆకాశం లాగా ఉన్నవి. అందుకే స్తనాలన్న చక్రవాకాలు ప్రకాశిస్తున్నాయి.

వారిచూపులు చేపలు కాకపోతే అవిపాలుసు దొర్లగా చూడలేవు. తెల్లగ్రుడ్ల చలనం పాలుసు దొర్లటం వారి శరీరాలు అలరు తీగలు. కాకపోతే వారు సమీపించగానే తావులెలా గుప్పు మంటాయి? ఈ విధంగా సురత పాండిత్య నిధులైన వేశ్య లా నగరంలో చెలువొందుతున్నారు.

అలం : ఉత్ప్రేక్ష.

విశే ॥ చరిత్ర ప్రకారం విజయనగరంలో ఆనాడు అందమైన వేశ్యలున్నారు. కనుక ఈ వర్ణన చారిత్రక సత్యమే.

మ. ప్రతతప్రాంత పిశంగ కుంకుమ జటాపాళీ కురంగీ మదా
సిత వీణాళి కలస్వనంబు లెసఁగం జెన్నారు కర్పూర పుం
జ తతుల్కంటికి నారదత్వమున మించన్గామినీ కామి సం
తతి కేలా యెడ ద్రెచ్చు ( గంతు కలహోన్మాదంబు లాప్రోలునన్. 31

ఆ ప్రోలునన్ = ఆ నగరంలో; ప్రతత = నిస్తారమైన (జడలకు విశేషం); ప్రాంత = చివళ్లు; పిశంగ = లేత పసుపు వన్నె కలవైన; కుంకుమ = కుంకుమ పువ్వు అన్న; జట = జడల యొక్క; పాళీ = సమూహం; కురంగీ మద = కస్తూరి అన్న; అసిత వీణ = నల్లని వీణలో; అళి = తుమ్మెదలయొక్క; కలస్వనంబులు = అవ్యక్తమధురములైన ; స్వనంబులు = ధ్వనులు;ఎసగన్ = అతిశయింపగా; చెన్నారు = అందమైన; కర్పూర = పచ్చకర్పూరం యొక్క; పుంజతతుల్= రాసుల గుంపులు; కంటికిన్ = చూపునకు; నారదత్వమునన్= నారదముని లక్షణముతో; మించన్ = అతిశయింపగా; కామినీ కామి సంతతికిన్ = కామినీ కాముకుల జంటలకు; కంతు = మన్మథునియొక్క; కలహ = క్రీడాయుద్ధముల యొక్క; ఉన్మాదంబులు = ఉద్రేకంబులు; ఏలా యెడ ద్రెచ్చున్ = ఎందుకు విరమిస్తాయి.

తా॥ ఆ నగరంలో కామినీ కాముకులయొక్క జంటలకు కలహం పెట్టడానికి తయారైన నారదముని పచ్చకర్పూరపు రాశి రూపంలో ప్రత్యక్షంగా కనిపిస్తున్నాడు. కర్పూరం తెల్లని కాంతితో చివళ్ల పసుపు వన్నె తేరిన కుంకుపూల రాశులున్నాయి. అవే నారదుని జడలు. కస్తూరి వీణలన్న పేరుగల కస్తూరి ద్రవ్య మున్నది. ఆ వీణనుండి వచ్చే మధురనాదమే తుమ్మెదల ధ్వని. ఆ వీణ నారదుని వీణ. ఆ తుమ్మెదల ధ్వని అతడు వాయించే మధుర గానం కాగా నారదముని కలహకర్తయై గృహాల్లో తాండవిస్తున్నాడు. కనుక మన్మథ క్రీడా యుద్ధాలకు ఎడ తెరపి లేదు.

అలం : ఉత్ప్రేక్ష.

జడలు కుంకుమ పూలు. వీణాధ్వనులే అళి స్వనాలుగా కనిపించినందున రూపకం. ఈ రూపకంచేత ఉత్ప్రేక్ష పుష్ట మౌతున్నది.

విశే ॥ కురంగీ మద - కస్తూరి మగలేడి బొడ్డునుండి వస్తుంది తప్ప ఆడులేడి నుండి కాదు. కాబట్టే కురంగి అని స్త్రీత్వం విధించనక్కర లేదని అన్నారు. కాని ప్రయోగ బాహుళ్యం అలాగే ఉన్నది. స్త్రీత్వ

వివక్ష సమాస సౌందర్య హేతువుగా భామహాచార్యులు చెప్పినాడు. వ్యాకరణ రీత్యా సాధువైనంత మాత్రాన కవి గ్రహించ నక్కర లేదు, కవి సౌందర్యారాధకుడు. కనుక ఇట్టి ప్రయోగాలు చారుతా హేతుకములని అతని వాదన

తే. నింగిటు త్రిశంకు కతన మాతంగ వాటి
యయ్యె, నిక నుండ దగ దని యవని కరిగి
నట్టి నక్షత్ర తారాగ్రహాలి యనఁగఁ
గాంతనవరత్న రాసులంగళ్లఁ బొలుచు. 32

అంగళ్లన్ = అంగళ్లలో; కాంత = అందమైన; నవరత్నరాసులు = తొమ్మిది రత్నాలగుట్టలు పొలుచున్ = ప్రకాశిస్తున్నవి.( ఎలాగంటే); నింగి = ఆకాశం; ఇటు = ఈ విధంగా; త్రిశంకు కతన = త్రిశంకుడను రాజుమూలంగా; మాతంగ వాటి = చండాలురున్న పేట; అయ్యెన్ = అయినది; ఇకన్ = ఇకపై, ఉండన్ తగదు అని = ఉండ కూడదని; అవనికిన్= భూమికి; అరిగినట్టి = వలసపోయినట్టి; నక్షత్ర = చుక్కలు; తార = చంద్రుని భార్యలైన ఇరవయ్యేడు నక్షత్రాలు; గ్రహాలి = సూర్య చంద్రాది నవగ్రహాలు; అనగన్ = అన్నట్లుగా, పొలుచున్ = అందంగా ఉన్నాయి.

తా॥ ఆకాశం అంటే స్వర్గం. త్రిశంకు ప్రవేశంచేత చండాల వాటిక అయినది. కనుక ఇకపై మన మిక్కడ ఉండ కూడదని అశ్విన్యాది 27 నక్షత్రాలు, సూర్యచంద్రాది నవగ్రహాలు, మిగిలిన చుక్కల గుంపులన్నీ భూమికి వలస వచ్చినాయో అన్నట్లు అంగళ్లలో నవరత్నాలు గుట్టగా పోసి అమ్ముతున్నారు.

అలం : ఉత్ప్రేక్ష.

విశే ॥ త్రిశంకుడు హరిశ్చంద్రుని తండ్రి. సశరీరంగా స్వర్గానికి పంపే యజ్ఞం చేయించమని వశిష్ఠుని అతని కొడుకులు నూరుగురిని ప్రార్థిస్తే వారు తిరస్కరించారు. అపుడు విశ్వామిత్రుడు ఆ పని నిర్వహించాడు. గురువు ఆజ్ఞను ఉల్లంఘించినందున త్రిశంకుడు స్వర్గానికి పోతే దేవతలు సహించలేక తలక్రిందులుగా క్రిందకు తోస్తే విశ్వామిత్రుడు ఆకాశంలో దక్షిణ దిక్కున మరొక స్వర్గనిర్మాణం చేసి దానికి త్రిశంకు స్వర్గమని పేరు పెట్టాడు. ఈ పురాణ కథపై ఆధారపడి వ్రాయబడ్డ పద్య మిది.

త్రి = మూడు; శంకువులు = మేకులు = పాపాలు కలవాడు. 1. గురు నాజ్ఞ నుల్లంఘించడం 2. చండాలత్వం 3. నిషేధింపబడ్డ ఆహారసేవనం

రత్నాలకు నక్షత్రాది సామ్యం చాలా అద్భుతంగా ఉంది. కాంతి కిరణ సంపుటి యందే కాక ఒక్కొక్క మణికి ఒక్కొక్క గ్రహం అధిదైవంగా చెప్పబడుతున్నది.

ఉదా : వజ్రానికి సూర్యుడు అధిదేవత. ఈ విషయం నాల్గవ ఆశ్వాసం శరదృతు వర్ణనలో 145, 149, 159 పద్యాలు చూడు.

నవరత్నాలు రాసులుగా విక్రయించటం, ఆనాడు విజయ నగరంలో పాశ్చాత్యులు చూచిన మనోహరమైన దృశ్యం. నగరసంపద కది చిహ్నం. కాని అస్థానపతితమైనవిగా కనిపిస్తున్నవి.

30,31,32- ఈ పద్యాలు 38 తర్వాత రావాలి. ఇక్కడ రావటం అస్థాన పతితంగా వర్ణనాను స్యూతి దెబ్బతింటున్నది. గజాశ్వ వర్ణనలు, చాతుర్వర్ణ్యం ఒక జాతి వర్ణనలు. ఇవి వేరు. బహుశ ఈ క్రమం వ్రాయస కాండ్రదోషం కావచ్చు.

చాతుర్వర్ణ్యం

చ. చిరసముపాశ్రితాగ్ని తడిఁ జెంది నశించు నటంచునో, కృతా
ధ్వరత ( దదగ్నిమైఁ నునికి దాన నొకంగము దాచుచేతనో,
పురధరణీసురుల్ నిగమభూధరము ల్జపయజ్ఞశీలురా
హరి ధనదాదులైన వలహస్తము సాఁపరు దానధారకున్. 33

33వ పద్యం నుండి 36 దాకా చాతుర్వర్ణ్యం వర్ణింపబడుతోంది. ఆనాటి సమాజ స్వరూప మది. వర్ణము మనః ప్రవృత్తి కనుగుణమైన వృత్తులకు చిహ్నం. అనగా బాహ్యకర్మకు గుర్తు. ఆ క్రమం మానసిక పరిణామానికి సంకేతం. నాటి పరిపాలన ఈ వర్ణాశ్రమాచార రక్షణగా ఉండేది. ఇది సామాజిక భద్రతకు సూచితమైన పరిపాలనా విషయంగా నాటి కవులు వర్ణించారు.

పుర = నగరంలోని; ధరణీ సురుల్ = బ్రాహ్మణులు; నిగమ భూధరముల్ = వేదపర్వతాలు; జపయజ్ఞశీలురు = జప, యజ్ఞవిధానాలే స్వభావంగా కలవారు (కనుక); ఆ హరి, ధనద, ఆదులు = ఇంద్రుడు, కుబేరుడు మొదలైనవారు; ఐనన్ = అయిన ప్పటికి; వలహస్తమున్= కుడి చేతిని, చిరసముపాశ్రితాగ్ని = చిరకాలం నుండి కూడబెట్టు కొన్న అగ్ని; తడి చెంది = తడిసి; నశించున్- అటంచున్ = ఆరిపోతుందన్న కారణంతోనో; కృత - అధ్వరతన్= యజ్ఞము చేసిన వారైనందువల్ల; తత్ - అగ్ని = ఆ యజ్ఞాగ్ని; మైన్= తన శరీరంలో; ఉనికిన్ = ఉన్నందువల్ల; దానన్ = ఆ శరీరంలో; ఒకంగము = ఒక అవయవము; దాచుచేతన్= దాచుకొని ఉన్నందునో; దానధారకున్ = దానం చేసేటప్పుడు వదిలే జలధారకు; చాపరు= కుడిచేయిచాపరు.

తా॥ ఆ నగరంలో బ్రాహ్మణోత్తము లున్నారు. వారు వేద పర్వతాలు. జపయజ్ఞ తత్పరులు, కనుక ఇంద్ర, కుబేరాదులు వచ్చి దానమిస్తా మన్నా కుడిచేతిని చాపరు. ఎందుచేతనంటే ఆ చేతిలో నిత్యమూ అగ్ని హోత్రాన్ని వేల్చడం చేత సంక్రమించిన అగ్ని, తేజస్సు ఉన్నందువల్ల, యజ్ఞాలు చేసినందువల్ల, శరీరంలో అగ్ని వున్నందువల్ల, దాన ధారకు అది తడిసి ఆరి పోతుందని దక్షిణ హస్తం చాపరు.

అలం : హేతూత్ప్రేక్ష.

విశే॥ దానధార, దానము, త్యాగము అన్నవి వేరు వేరు. దానం ఉదక పూర్వకంగా ఉంటుంది. త్యాగానికి అది ఉండదు. పోగొట్టుకున్నవాడు అన్న అర్థంలో ధారపోసుకున్నాడన్న ప్రయోగం వ్యవహారంలో ఉంది. బ్రాహ్మణుల కుడిచేతిలో అగ్ని ఉంటుందని శ్రుతి.

ఇతర కావ్యాల్లో బ్రాహ్మణ వర్ణన వేరు. ఇది వేరు. అక్కడ పండితులుగా చెప్పబడ్డారు. ఇక్కడ వైదిక కర్మ నిష్ఠులుగా చెప్పబడ్డారు. వర్ణమంటే విహిత కర్మాచరణం కనుక పాండిత్యాదులు ఎవరికైనా ఉండవచ్చు. కాని వైదిక కర్మానుచరణ ఆనాటి సమాజం బ్రాహ్మణునికే విధించింది. తర్క వ్యాకరణాది పాండిత్యం బలిసి పోయిన నాగరికతలో బ్రాహ్మణులకు వేద విద్య లుప్తమై పోయింది. ఇది కాలపరిణామంలో వచ్చిన మార్పు. ఇక్కడ మహాకవి వర్ణాశ్రమరక్షకుడైన రాజు . ఇతరులు కవులు. ఇంతే.

చ. ఉరవడిఁ బోరికై కవచ మొల్లరు మంత్రములందుఁ దక్క, సు
స్థిర భుజశక్తి నైదు పది సేయరు దత్తిన తక్క, మంటికై
పొరల రధీశుఁ డీ కమలబుద్ధి ఖలూరికఁ దక్క, వజ్ర దోః
పరిఘ వశీ కృతాన్య నరపాలకు లప్పురి రాకుమారకుల్. 34

ఆ+పురిన్ = ఆ నగరంలో; రాకుమారకుల్ = రాచబిడ్డలు; వజ్ర = వజ్రాయుధం వంటి; దోః పరిఘ = చేతి గుదియలచేత; వశీకృత = లొంగ తీసుకోబడ్డ; అన్యనరపాలకుల్ = ఇతర శత్రు రాజులు కలవారు (కనుక); ఉరవడిన్ = వేగంతో; మంత్రములందున్+ తక్క = మంత్రాలలో తప్ప; పోరికై = యుద్ధానికి; కవచము = మైమరువును; ఒల్లరు = అంగీకరించరు; సుస్థిర = పటిష్ఠమైన; భుజశక్తిన్ = బాహుబలం వల్ల; దత్తినన్ తక్క = దానంలో తప్ప; ఐదు పది సేయరు = అంజలించరు ( ఐదు వ్రేళ్లను పది వ్రేళ్లుగా చేయటం=దోసిలి పట్టటం) అధి+ ఈశుడు = రాజు; ఈక = ఇవ్వకుండ; ఖలూరికన్ తక్కన్ = గరిడీలో తప్ప; మంటికై = మట్టికోసం; అమలబుద్ధిన్ = పరిశుద్ధమైన మనసుతో పొరలరు = క్రిందపడి దొరలరు.

ఆ నగరంలో రాకుమారులు వజ్రాయుధం వంటి బాహు పరిఘలతో శత్రురాజులను లొంగ దీసుకోగలరు. కనుక మంత్ర జపవేళ తప్ప యుద్ధంలో కవచాన్ని అంగీకరించరు. దానవేళ తప్ప సుస్థిర భుజశక్తి కలవారైనందున శత్రువులకు అంజలించరు. పరిశుద్ధ మనస్కులైనందున గరిడీలో తప్ప రాజుగారి వద్ద కూడా మట్టి కోసం నేల మీదపడి పొరలరు.

విశే॥ కవచం = జపధ్యానాదులందు శరీరర అవయవ రక్షణార్థం దుష్టశక్తుల నివారణార్థం పఠించే మంత్రం, స్తోత్రం.

శా. దంభాపేత వితీర్ణ తోయములు రథ్యం దొట్టి హట్టస్థిత
స్తంభంబుల్ చిగిరించుచున్నవి యనన్ధర్మైక నిత్యార్జనన్
సంభూతంబగు పైఁడి కోటి కొకడై నానాఁటికిన్ హెచ్చుచ
య్యంభోదావళిఁ గప్పఁగేతువులు వైశ్యశ్రేణి పొల్చున్ బురిన్. 35

పురిన్ = నగరంలో; వైశ్యశ్రేణి = కోమటుల సమూహం; దంభ+అపేత = మిషలేనట్టి; వితీర్ణ -

దానముయొక్క, తోయములు = నీళ్లు; రథ్యన్ = ప్రధాన వీథిలో; తొట్టి = ఎగదొట్టి; హట్టస్థిత = అంగడి వీధిరోనున్న, స్తంభంబుల్ = స్తంభాలు; చిగిరించుచున్నవి అనన్ = చిగురు తొడుగు తున్నాయో అనునట్లుగా; ధర్మైకక నిత్యార్జనన్= నిత్యమూ ధర్మప్రధానంగా సంపాదించడంచేత; సంభూతంబు+ అగు = కలిగిన; పైడి = బంగారం; కోటికిన్ ఒకడై = కోటికి ఒకటిచొప్పున; నానాటికిన్ = రోజురోజుకు; హెచ్చుచున్ = సంఖ్యలో అధికముగుచు; ఆ + అంభోదావళిన్ = ఆ మేఘాల సమూహాన్ని; కేతువులు= జండాలు, కప్పన్ = ఆచ్ఛాదించగా, పొల్చున్ = శోభించును.

తా॥ ఆ నగరంలో వైశ్యవీధులు అనేక కేతువులతో ప్రకాశిస్తున్నాయి. అవి పైన మేఘపంక్తులను కప్పివేస్తున్నాయి ఆ వైశ్యులు నిత్యమూ ధర్మదృష్టితో ఆర్జించిన ధనాన్ని ధారాపూర్వకంగా దానం చేస్తున్నారు. ఆ దాన ధారలు రాచవీధులకు ఎగదొట్టి అక్కడున్న స్థంభాలు కూడా చిగిరించేటట్లు చేస్తున్నాయి. వారి సంపాదన కోటికి పడగలెత్తినట్లు ఒక్కొక్క జండా ఒక్కొక్క కోటికి ప్రకాశిస్తున్నది.

విశే॥ ప్రాచీన సమాజంలో వైశ్యుడు వ్యాపారి. క్షత్రియుడు రాజ్యరక్షకుడు. బ్రాహ్మణుడు విద్యారక్షకుడు. మిగిలినవారు క్షేత్ర, సస్య రక్షకులు. ఇందుకే వారిని కాపులన్నారు. విద్యకు కాపరి, రాజ్యమునకు కాపరి, డబ్బుకు కాపరి, పొలానికి కాపరి. ఈ విధంగా అందరూ వృత్తిరీత్యా కాపులే. నాటి వైశ్యుడు ధననిధి. అతనికి దానము విధింపబడింది. మనుస్మృతిలో ఈ విషయం ఉన్నది. ఇంతేకాక ప్రాచీన సమాజంలో గుడి, గోపురాదులు, సత్రాలు, తటాకాలు నిర్మించింది వైశ్యులే. బుద్ధదేవునకు విరివిగా విహారాదులు దానం చేసింది వీరేనని చరిత్ర చెబుతుంది. కనుక ఈ పద్యం ప్రాచీన సమాజంలో వైశ్యుడంటే ఏమిటి ? అన్నదానికి సమాధానంగా చెప్పబడింది. ఇతర కావ్యాల్లో వైశ్యులు కుబేరులు అని వర్ణింపబడితే ఇక్కడ దానధర్మములని చెప్పబడటం కవియొక్క సామాజిక పరిజ్ఞానానికి పరాకాష్ఠ. పై పద్యం కూడా చాతుర్వర్ణ్యలక్షణాన్ని ఇంతగా విచారించి చెప్పినవారు అరుదు. వీరి దానం దంభాపేతం. అంటే యేదో మిష పెట్టుకొని చేయడం కాక పవిత్ర దృష్టితో చేయబడుతున్నది. పద్య మిక్కడ ప్రారంభం కావడం కూడా వారి స్వభావానికి దీటురాయి.

తే. నృపుల పదహలరేఖల కెల్ల మాభు
జాగ్రహల రేఖలే మూల మనుచుఁగోటి
కొండలుగ ధాన్యరాసులు పండువీట
సుజన భజనైక విఖ్యాతి శూద్రజాతి. **36**

వీటన్ = నగరంలో, కోటి కొండలుగన్ = కోట్ల కొండలంత రాసులగా; ధాన్యరాసులు= సస్యరాసులు; పండున్ = ఫలిస్తున్న; వీటన్ = ఆ పట్టణంలో; సుజన భజనం = సజ్జన సేవయే; ఏక = ముఖ్యంగా కల; విఖ్యాతిన్ = కీర్తితో; శూద్రజాతి = నాల్గవ కులం; నృపుల = రాజులయొక్క; పద = పాదాలందున్న; హల = నాగేటి; రేఖలకున్ = గీరలకు, మా = మాయొక్క; భుజ+ అగ్ర = భుజాలపైనున్న; హలరేఖలే = నాగళ్ల వరుసలే, మూలము = ఆధారము; అనుచున్ = అనుచు (ఉన్నది).

తా॥ ఆ నగరంలో ధాన్యరాసులను కోట్ల కొండలుగా పండిస్తూ సజ్జనులను సేవిస్తూ, నాల్గవ కులం ఉన్నది. రాజుల పాదాలయందున్న నాగలి వంటి గుర్తుగల రేఖలకు మా భుజాలపైనున్న నాగళ్ల సమూహమే మూల కారణమని అంటూ సగర్వంగా ఆజాతి ఉన్నది.

నాల్గవ ఆశ్వాసం వర్ష ఋతు వర్ణనలో వీరి వర్ణన చాలా అద్భుతంగా విస్తృతంగా చేయబడుతుంది.

ఈ పద్యంతో చాతుర్వర్ణ్య వర్ణన పరిసమాప్త మైనది.

చ. ఉమియఁగ దన్న నవ్వ నన నొచ్చెము గాంచిన కొన్ని మ్రాఁకులా
ప్రమదల నప్పగింపు డని రంజిలు సేఁతలు గన్న చెట్లకున్
దమ కళిశృంఖలన్ బెనఁచి నమ్మక ముట్టెఁబురంబు c గంతు సై
న్యముఁగొని నా వెలిన్ శుక పికాదుల c గేళి వనాళి పొల్పగున్. 37

ఈ పద్యంలో దోహదక్రియలు వర్ణింపబడుతున్నవి. అకాలంలో లతలు పుష్పించడానికి స్త్రీలు చేసే వివిధ చేష్టలు దోహద క్రియలుగా కాళిదాసాది కవులు ప్రారంభించిన కవి సమయాలు.

ఉమియుగన్ = ఉమ్మి వేయడంచేత; తన్నన్ = తన్నగా; నవ్వన్ = ఎగతాళి చేయడంచేత; అనన్ = మాటలనడంచేత; ఒచ్చెము = అవమానము; కాంచిన = పొందిన, కొన్ని మ్రాకులు = కొన్ని చెట్లు; ఆప్రమదలన్ = తమ నవమానించిన మదవతులను; అప్పగింపుడు = మాకప్పగింపుడని; అని = అని; రంజిలు చేతలు = ఆనందించే చేష్టలు ( ఆలింగ నాదులు); కన్న = పొందిన; చెట్లకున్, తమకున్; అళిశృంఖలన్ = తుమ్మెదలన్న గొలుసులను; పెనఁచి = పెనవైచి; నమ్మక = అప్పటికీ ఆ చెట్లు ఆ ప్రమదలను తమకు అప్పగిస్తాయని విశ్వసించక; పురంబున్ = ఆ నగరాన్నే; కంతుసైన్యముఁగొని = మన్మధుని సేనను తోడు తెచ్చుకొని; వెలిన్ = నగరం వెలుపల; ముట్టెన్ నాన్ = ముట్టడి చేసినా అన్నట్లు, శుక పికాదులన్ = చిలుకలు, కోకిలలు మొదలైన పక్షులచేత; కేళి వన+ ఆళి=ఉద్యాన వనముల సమూహం; పొల్పగున్ = చెన్నారుచున్నవి.

తా॥ ఆ నగరం బయటా, లోపల ఉద్యానవనాలు ఏపుగా అందంగా ఉన్నాయి. వాటినిండుగా శుకపికాది పక్షి సమూహం సందడి చేస్తున్నది. పుష్పించిన లతావృక్షాలపై వలయాకారంగా తుమ్మెదలు పరిభ్రమిస్తున్నాయి. ఇది సహజ దృశ్యం. దీన్ని కవి అలంకార భాషలో పొదుగుతున్నాడు. ఈ తుమ్మెదలు, పక్షులు, తోటలపై ఎగరడమెలాయున్నదంటే ప్రమదలు కొన్ని చెట్లకు అవమాన కరమైన దోహదక్రియలు చేస్తారు. అవమానం పొందిన లతలు కోపంతో తమ నవమానించిన ఆ మదించిన స్త్రీలను మాకప్పగించండి అని చెప్పి అనుకూల దోహద క్రియలు పొందిన చెట్ల చుట్టూ తుమ్మెదలన్న గొలుసులు కట్టి, ఇంకా విశ్వసించక కంతుసైన్య మైన శుక పికాదులను తోడు తెచ్చుకొని నగరం వెలుపల తోటలను చుట్టు ముట్టినవో అన్నట్లున్నవి.

విశే ॥ కవి రాజైనందున యుద్ధ సంబంధమైన, రాజనీతి సంబంధమైన విషయాలను అలంకారాల ద్వారా

ప్రకటిస్తాడు. ఇందులో సేన నగరాన్ని చుట్టుముట్టిన వైనం అలంకార రూపంలో పొదగబడింది. శత్రువుని పట్టుకోవడానికి సేనను, గొలుసులను ఉపయోగిస్తారు. కనుక అవమానం పొందిన చెట్లు తమ శత్రువులు వారి స్నేహితుల ఇండ్లలో దాగియుంటారు. కనుక ఆ స్నేహితుల ఇండ్ల చుట్టూ రక్షణ దళాలను ఏర్పాటు చేశాయి. ఈ రాజనీతి పద్యంలో భావించ దగ్గ విషయం. నోటితో మద్యమును పొగడపై ఉమ్మి వేస్తే అది పుష్పిస్తుందట. తంతే పుష్పించేది అశోకం. గోరంటను కౌగిలించు కోవాలి. తిలకమును చూడాలి మామిడిని హస్తంతో స్పృశించాలి. చంపకమును కోపంతో చూడాలి. కొండ గోగుతో కబుర్లు చెప్పాలి. వావిలిపై నిట్టూర్పులు ప్రసరించాలి. సుర పొన్నను చూచి నవ్వాలి. ఇవి దోహద క్రియలు. (చూ. వసంత వర్ణన. 5వ ఆ. ము)

అలం : ఉత్ప్రేక్ష.

సీ. మదగంధ తారతమ్యము యామ్య కరికిఁ ద
 త్కరులకుం గన బలెఁ గటము లొరసి,
సురత శ్రమజ మౌటఁ జూపోపకయుబలెఁ
 గామినీ మృదు గండ ఘర్మముడిపి,
పరిమళ వాహేచ్ఛఁ బ్రాణమీ బలెఁ జించు
 మృగనాభి చర్మ భస్త్రికలు దూఱి,
అహిత పన్నగ భేదు లన బలె గృహ విటం
 కపుఁ గలాపుల నొయ్యగఱులు నిమిరి,

తే. వీటి సామగ్రిఁ గనుఁగొన, వేగ పడక,
నడవఁ దన దిక్కు పుష్పదంతద్విపంబు
నెక్కెనో యన జడగతి నెపుడుఁ బొలయు
నందుఁ జందన శిఖరి మందానిలుండు. 38

అందున్ = ఆ నగరంలో; చందనశిఖరి = గంధపు కొండమీదుగా వీచే; మంద = మెల్లని; అనిలుడు = గాలి, మలయానిలము;

యామ్య కరికిన్ = దక్షిణ దిక్కున ఉండే వామనమన్న పేరు గల దిగ్గజానికి; తత్కరులకున్ = ఆ నగరంలోని ఏనుగులకు; (24,25 పద్యాలు చూడు) మదగంధ = దానజలముయొక్క తావులలోని; తారతమ్యము = హెచ్చుతగ్గులు; కనన్ బలెన్ = పరీక్షించుటకో అన్నట్లు; కటములు = ఏనుగుల గండ స్థలాలను; ఒరసి = రాచు కుంటూ

మలయానిలమంటే మలయ పర్వతం నుండి వచ్చే గాలి. ఆ కొండపై గంధపు తోపులు విస్తారంగా ఉంటాయి. (రెండవ ఆశ్వాసం మొదటి పద్యంలో రెండవ పాదాన్ని చూడు) ఆ తోపులనుండి వాసనలను

గ్రహించి వచ్చిన గాలి నగరంలో నెమ్మదిగా ప్రసరిస్తున్నది. అది ఎలా ఉన్నదంటే తాను బయలుదేరిన దక్షిణ దిగంతములోని దిగ్గజానికి, మధురానగరంలోని ఏనుగులకు మదగంధ తారతమ్యం చూడడానికో అన్నట్లు నెమ్మదిగా వీస్తున్నది.

సురత శ్రమజము = కామక్రీడల బడలికచేత పుట్టినది; ఔటన్ = కావడం వల్ల; చూపు + ఓపకయు = జాలిచేత చూడ లేనందువల్ల; వలెన్ = అన్నట్లుగా; కామినీ= కాముకురాండ్రయొక్క; మృదు = మెత్తని, గండ = చెక్కిళ్ళలోని; ఘర్మము = చెమట; ఉడిపి = తుడిచి

13,16,17,19,20,21,31 పద్యాలలో కామక్రీడలు వర్ణింపబడ్డాయి. ఆ క్రీడలతో డస్సిపోయిన ప్రౌఢాంగనలను చూడలేకనో అన్నట్లు, వారి చెక్కిళ్లపై పొడమిన చెమటలు చల్లారుస్తూ గాలి వీస్తున్నది.

పరిమళ = వాసన; వాహ = వహించుటయందలి; ఇచ్ఛన్ = కోరికతో; ప్రాణమీ బలెన్ = ప్రాణమివ్వడానికో అన్నట్లు; మృగనాభి = కస్తూరి మృగం బొడ్డు అన్న; చర్మ భస్త్రికలు = తోలు సంచులలో; దూఱి = ప్రవేశించి

కస్తూరిమృగాల బొడ్డులన్న తోలుసంచులలో ఉన్న వాసనను గ్రహించడం కోసం ప్రాణం పోయడానికో అన్నట్లు ప్రవేశిస్తున్నది.

అహిత = శత్రువులైన, పన్నగ = సర్పాలను; భేదులు = భేదించేవి; అనబలెన్= అన్నట్లుగా; గృహ = ఇండ్లలో ఉన్న; విటంకపు = ఎత్తుగా ఉన్న గూళ్లలోని; కలాపులన్= పింఛములుగల నెమళ్లను; ఒయ్యన్ = మృదువుగా; గరులు = పింఛాలను; నిమిరి = చేతితో స్పృశిస్తూ;

పాములు పవనమే ఆహారంగా కలవి. ఆ సర్పాలను నెమళ్లు భక్షిస్తున్నవి. కనుక శత్రువుకు శత్రువైన నెమలిని చూచేటప్పటికి గాలికి ఎక్కడ లేని సంతోషం కలిగి మిద్దెల పైనున్న చెక్కగూళ్లలో ఉన్న నెమళ్ల రెక్కలు ప్రేమతో తడుముకుంటూ వీస్తున్నవి.

వీటిసామగ్రిన్ = ఆ నగరంలోని విచిత్ర వస్తు సంపదను ( ఇంతవరకూ వర్ణించిన విషయ మిదే); కనుగొనన్ = చూడడానికి; వేగపడక = త్వరపడక; తనదిక్కు = తాను వచ్చిన దిక్కునందున్న; పుష్పదంత ద్విపంబు = పుష్పదంత మన్న ఏనుగును; ఎక్కెనో అనన్ = ఎక్కినదో అన్నట్లు; జడగతిన్ = మందగమనతో; ఎపుడున్ = నిత్యమూ; పొలయున్ = వీస్తున్నది.

మధురానగరం అనంత విచిత్ర వస్తుసంపదకు కాణాచి. కనుక దాన్ని చూడడానికి చాలా దూరం నుండి వచ్చిన మలయపవనం నెమ్మదిగా వీస్తున్నది. ఆ మందగమనం ఎలాయున్నదంటే పుష్పదంతమన్న ఏనుగునెక్కి నగర సంచారానికి వచ్చిన మహారాజులాగా ఠీవిగా ఉన్నది.

**విశే॥** ఈ పద్యగమనం వర్ణితాంశమైన మలయపవనగతిగాంభీర్యాన్ని ధ్వనిస్తున్నది. వర్ణింపబడ్డ అంశక్రమం ఏనుగుల మదగంధ తారతమ్యం, కామినీ మృదుగండ ఘర్మము, మృగనాభి పరిమళము, అన్నీ సుకుమార వాసన ద్రవ్య విశేషాలే. నాల్గవపాదంలో పైవాసనలతో సమానమైన సౌందర్యం గల నెమలి. ఇది నేత్రేంద్రియ

ఆహ్లాదకరం కాగా, పైది నాసికానంద హేతువు. పద బంధాలు, సమాసాలు చాలా మృదువుగా ఉన్నాయి. అని పాఠకులు భావించుకోవాలి. 1-73; 74 పద్యాలలో విల్లుపుత్తూరిలోని గాలి వర్ణింపబడింది. దానితో పోల్చి చూచుకోవాలి. అక్కడ గాలి భక్తి పారవశ్యం గల వైష్ణవ స్వాముల వంటిది. కాగా ఇక్కడి గాలి వర్ణింపబడబోయే మహాచక్రవర్తి ఠీవి గలది.

మత్స్యధ్వజుఁడు (ప్రతినాయకుడు)

సీ. ద్విద్వయోపాయ ధీ విద్వద్వతంసంబు,
షాడ్గుణ్య చాతురీ చక్రవర్తి,
క్రీడాచలీకృత శ్రీఖండ గిరిరాజు,
కనకాద్రి ముద్రణ గ్రంథకర్త,
యందూ నిబద్ధాబ్ధ బృంద వేదండాళి;
వననిధి స్తంభ నాధునిక రఘువు,
తామ్ర పర్ణ్యమల పాథః కేళి హంసంబు,
లంకేశ మైత్రీ ప్రియంకరుండు,

తే. స్వస్తి కృద్వాస్తవ స్తుత్యగస్తి, మఘవ
మకుట మోటన శతకోటి మంత్రభృత్య,
భూత భూతాత్త శాంభవ భూమికుండు
దత్పురంబేలుఁ బాండ్య మత్స్యధ్వజుండు. 39

తత్ పురంబు = 38 పద్యాల దాకా వర్ణింపబడ్డ మధురా నగరాన్ని; పాండ్య మత్స్య ధ్వజుండు = జండాపై చేపగుర్తు గల పాండ్యరాజు; ఏలున్ = పరిపాలిస్తున్నాడు.

ద్వి = రెండు; ద్వయ = జంటల; ఉపాయ = ఉపాయములకు సంబంధించిన (సామ దానములు ఒకజంట, భేద దండములు మరొక జంట, మొదటిది సాత్త్వికం; రెండవది రాజసం. సాత్విక, రాజసిక, తామసిక భేదాలతో మూడు రకాల చక్రవర్తులుంటారని భారతీయ రాజనీతి గ్రంథాలు చెబుతున్నాయి.

ద్వి+ద్వయ = రెండు, రెండుగా విడివిడిగా చెప్పబడ్డాయి. ధీ = శేముషి యందు; విద్వత్ = పండితులలో; వతంసంబు = శ్రేష్ఠుడు; షాడ్గుణ్య = సంధి, విగ్రహ (శత్రుత్వం), యాన (దండెత్తడం), ఆసన (నిలవడం), ద్వైధీభావం, ఇదా, అదా అన్న మీమాంస; సమాశ్రయములన్న ఆరు గుణాలు గల రాజనీతియొక్క; చాతురీ = నేర్పుగల; చక్రవర్తి= సార్వభౌముడు.

ఆ మత్స్యధ్వజుడు సామ దాన భేద దండోపాయాలకు సంబంధించిన ప్రతిభ గల పండితులలో శ్రేష్ఠుడు. షాడ్గుణ్యములో ఏది ఎప్పుడు నేర్పుతో ప్రయోగించాలో తెలిసినవాడు కనుక చక్రవర్తి.

క్రీడ+ అచలీకృత = విహారపు కొండగా చేయబడ్డ; శ్రీఖండగిరి రాజు = మలయ పర్వతం కలవాడు; కనకాద్రి = బంగారు కొండపై; ముద్రణ గ్రంథ కర్త = ముద్రించిన స్వచరిత్ర గలవాడు. అతనికి మలయ పర్వతమే విహారాచలము; బంగారపు కొండపై తన బిరుదును ప్రకటించుకున్నవాడు. ( ఇదిపురాణ కథనం)

అందూ నిబద్ధ = గొలుసులతో బంధింపబడ్డ; అబ్దబృంద = మేఘాల సమూహమన్న; వేదండ+ ఆళి = ఏనుగుల సమూహం కలవాడు; వననిధి = నీటి పాతరయైన సముద్రమును; స్తంభన = బంధించటంలో; ఆధునిక = నేటికాలపు; రఘువు= రఘువంశీయుడగు శ్రీరాముడు. (అభ్ర- వేదంవారి పాఠం)

సంకెళ్లతో ఏనుగులను కట్టి వేసినట్లుగా మేఘాలను బంధించినవాడు, సముద్రంమీద వంతెన నిర్మించిన నేటి కాలపు రఘువు . తమిళ సింహళ దేశముల మధ్య చారిత్రక సంబంధాలున్నవి కనుక సముద్ర బంధనం రాఘవుని వలె చేశాడు. మేఘాలను బంధించటం అన్నది ఒక విచిత్ర విషయము. ఇతడు మంత్ర శాస్త్రవేత్తగా ముందు చెప్పబడుతున్నాడు. కనుక మంత్రశక్తితో కావలసినపుడు వర్షాలు కురిపించే శక్తి గలవాడు అని చెప్పుకోవాలి.

తామ్రపర్ణి = ఆ నదియొక్క; అమల = నిర్మలమైన; పాథః = నీళ్లలో; కేళి = క్రీడించే; హంసంబు= రాజహంస; లంక+ ఈశ= లంకాపాలకుడైన విభీషణుడితో; మైత్రీప్రియంకరుండు = స్నేహంతో ప్రీతిని కలిగించేవాడు.

తామ్రపర్ణి నదిలో విహరించే హంస, విభీషణుడితో చెలిమిని పాటించిన వాడు. ఈ వర్ణనలు రామాయణా న్ననుసరించి చేయబడినవి.

స్వస్తికృత్ = ఆశీర్వదిస్తున్న; వాస్తవస్తుతి = వాస్తవమైన పొగడ్త గల; అగస్తి = అగస్త్యముని కలవాడు.( ఇతడీరాజునకు మంత్రిగా పురాణకథనం)

అగస్త్యముని దక్షిణ దిశకు వచ్చి పాండ్య దేశంలో ఆశ్రమం కట్టుకొనియున్నాడని పురాణోక్తి. కనుక నిత్యమూ అగస్త్యమౌనియొక్క ఆశీర్వాదాలు పొందినవాడు.

మఘవ = ఇంద్రునియొక్క; మకుట = కిరీటాన్ని; మోటన = మొట్టే; శరకోటి= బాణసమూహం కలవాడు.

ఇంద్రుని మించిన పరాక్రమం కలవాడని తాత్పర్యం.

మంత్ర = మంత్రశక్తితో; భృత్య = సేవకులతో; భూత = భూతగణాలతో; ఆత్త = పొందబడ్డ, శాంభవ= శివసంబంధమైన; భూమికుండు = వేషం కలవాడు.

భూతగణాలను స్వాధీనం చేసుకున్నవాడు కనుక గణాధిపతియైన శివునివలె ఉన్నాడు. రాబోయే

యామునాచార్యుని కథలో చెప్పబడ్డ పాండ్య చక్రవర్తి వలె ఇతడు కూడా శివ భక్తుడు కావచ్చు. కనుక శాంభవ భూమికుడనబడ్డాడు. పాండ్యరాజులు అనాదికాలంగా మధుర మీనాక్షీ, సుందరేశ్వరుల భక్తులు.(పోల్చు 4-268)

విశే ॥ ఈ వర్ణనంతా శ్రీకృష్ణదేవరాయలకు సంబంధించినదే.

ఉ. ఇందు కులావతంస మతఁ డే తటి నేతరిగాఁ; డరిం బ్రజ
ల్కందఁగొనం; డొరుం డొరుతల న్వినిపించిన మాట డెందముం
జెంద ముదంబు దక్కి చెడ c జేయఁ డొరు, న్వినతాస్యు c డౌ నుతిం
పం దనుఁ; బంద నుం గొఱత పల్కఁడు శూరతఁ దాను మించియున్. 40

ఇందు = చంద్ర; కుల = వంశంలోని; అవతంసము = శ్రేష్ఠుడు; అతడు = ఆ మత్స్యధ్వజుడు; ఏ తటిన్ = ఏ సమయంలోను; ఏతరి = నీతిమాలినవాడు కాడు; ప్రజల్ = రాజునకు సంతానం జనులు కనుక వారిని ప్రజలు అన్నారు. ఈమాట రాజనీతి శాస్త్రంలోనిది. కందన్ = నొచ్చుకొనేటట్లుగా; అరిన్ = పన్నును; కొనండు = తీసుకోడు; ఒరుండు = మరియొకడు; ఒరుతలన్ = మరొకని మీద, వినిపించిన మాట = కొండెపుమాట; డెందమును చెందన్ = మనస్సులో నాటుకొనే టట్లుగా; ముదంబుతక్కి= కోపించి (సంతోషం కోల్పోయి); ఒరున్ = ఎవని పైన తాను కొండెములు విన్నాడో వానిని; చెడన్ చేయడు = శిక్షించడు; తనున్ = తనను; నుతింపన్ = స్తుతిస్తే; వినత+ ఆస్యుడౌన్ = వంచిన తలగలవాడగును; తాను ; శూరతన్= శౌర్యంలో; మించియున్ = అతిశయించి కూడా; పందనున్ = పిరికి వానిని కూడా; కొఱత + పల్కడు=తక్కువ చేయడు.

తా ॥ చంద్రవంశ శ్రేష్ఠుడైన ఆ మత్స్యధ్వజుడు ఎప్పుడూ రాజనీతి తప్పి పరిపాలించడు. ప్రజలు బాధపడేటట్లు పన్నులు వేయడు. చాటున ఉన్న వానిపై కొండెములు విన్నా అతని నేమి శిక్షించడు. తనను పొగడినపుడు తలవంచుకొంటాడు. గొప్పశూరుడై కూడా పిరికి వానిని సైతం తక్కువగా మాట్లాడడు. ఈ లక్షణాలన్ని మహాచక్రవర్తి స్వభావం. ఇలాంటి చక్రవర్తినే ధీరోదాత్తుడన్నారు ఆలంకారికులు. ఇలాంటి ధర్మపరిపాలకుడైన చక్రవర్తినే ప్రాచీనకవి నాయకునిగా చేసుకున్నాడు. ఈ పద్యంలో చెప్పబడ్డ విషయాలన్ని నాల్గవాశ్వాసంలో రాజనీతిలో విస్తరించి చెప్పబడతాయి. కనుక అక్కడ చూచుకోవాలి. శ్రీకృష్ణదేవరాయులు కూడా చంద్రవంశ క్షత్రియుడని తిమ్మన, పెద్దనాది కవులు స్తుతించారు. ఈ లక్షణాలన్నీ రాయలవారియందున్నట్లు ఆ కవుల వర్ణనలో చూచుకోవచ్చు.

సీ. పాటీర గిరి వన వాటి c గ్రీడించియు
నహి భయం బెఱుఁగఁ డావంత యైన;
నత్యంత మితభాష నవికత్థనుం డయ్యుఁ
బరుల c గేరడమున భంగపఱుచుఁ;
బ్రేమఁ దాఁ దామ్రపర్ణికి నాథుఁ డయ్యును
సద్గోష్ఠి చే ననంజనత మెలఁగు;

మహనీయ మహిమ ( దామధురాస్పదుం డయ్యు
లావణ్యకలన నుల్లాస మొందు;

తే. విషధిలహరి భిదోత్ప్రుతత్పృషత జటిల
వలదురు క్రమ తిమివర వాల పతన
తులిత పరబల కరిశిరస్థ్సల సముత్థ
బహుళ ముక్తా విముక్తాసి పాతుఁ డతఁడు. 41

అతడు = ఆ మత్స్యధ్వజుడు; విష+ధి = నీటికి నిధియైన సముద్రముయొక్క; లహరి = పెద్ద కెరటాలయొక్క, భిద = విరుపునుండి; ఉత్ప్రుతత్ = పైకెగిరే; పృషత = నీటి బొట్లచేత; జటిల = దట్టమైన; వలత్ = వెనుకకు తిరుగుతున్న; ఉరు = పెద్ద; క్రమ = ఎగిరే; తిమివర = తిమింగిలమన్న చేపయొక్క; వాలపతన = తోక దెబ్బతో; తులిత = సమానమైన; పరబల = శత్రుసేనలయొక్క; కరి = ఏనుగులయొక్క; శిరస్థ్సల = కుంభ స్థలం నుండి; సముత్థ = పైకెగిరిపడే; బహుళ = అధికమైన; ముక్త= ముత్యాలతో; అవిముక్త = వీడిపోని; అసి = కత్తియొక్క; పాతుడు = పడుట కలవాడు.

శత్రుబలం మహాసముద్రం వంటిది. రాజు బాహువు తిమింగలం వంటిది. కత్తి దాని తోక వంటిది. ఏనుగులే గొప్ప కెరటాలు; వాని కుంభ స్థలాలే తరంగాల పైభాగం మీద తోచే విరుపుల వంటివి. వాటిని నరికే సమయంలో కత్తితో కూడ బాహువు వెన్కకు రావడం తిమింగలం తోకతో అలలను కొట్టి మరలా వెనుకకు ఎగిరి దూకటం వంటిది. కత్తితో ఏనుగు తలను నరకటం చేపకెరటాలపైన వంపును కొట్టడం వంటిది. కత్తిదెబ్బకు కుంభస్థలం నుండి ముత్యాలు జల్లుగా ఎగిరిపడటం ఒక దెబ్బకు చెదరి పోయిన అల నీటితుంపర్లుగా వర్షించడం వంటిది.

**అలం :** అద్భుతమైన సాదృశ్యం కలది కనుక అద్భుతోపమ.

శ్రీకృష్ణదేవరాయల కత్తిదెబ్బకు ఏనుగుల కుంభ స్థలాలు తెగి పోయేవని చరిత్ర చెబుతున్నది కనుక ఈ వర్ణన రాయలవారికి సంబంధించినదే.

పాటీరగిరి = చందన పర్వతమైన మలయపర్వతం; వనవాటిన్ = అడవుల గుంపులో; క్రీడించియున్= విహరించి; ఆవంతయైనన్ = కొంచెంకూడా; అహిభయంబు=పాములవలని భయం (శత్రువువలని భయం); ఎఱుగడు.

గంధపు చెట్లుగల మలయ పర్వతం మీద క్రీడించినా అహిభయం ఆవంతయైన అతనికి లేదు. చందన వృక్షాలకు చల్లదనం కోసం పాములు చుట్టుకొనివుంటాయని కవి సమయం. కనుక అలాంటి పర్వతం మీద క్రీడించిన వానికి పాములవల్ల భయం లేకపోవడం విరోధం. అహి శబ్దానికి శత్రువన్న అర్థముంది. కనుక శత్రుభయం లేనివాడు అని అర్థంలో పైవిరోధానికి ఆభాస కలుగుతోన్నది. కనుక విరోధాభాసాలంకారం.

అత్యంత = మిక్కిలి; మిత భాషన్ = కొంచెంగా మాట్లాడడంచేత; అవికత్థనుండు = పొగడ్తలు సహించనివాడు; అయ్యున్ = అయినా; పరులన్ = ఇతరులను (శత్రువులను); కేరడమునన్ = ఎగతాళి మాటల్లో (కేరళదేశాన్ని, లడలకు అభేదం కనుక); భంగపరచున్ = వమ్ము చేస్తాడు.

అతడు మితభాషి కనుక పొగడ్తల కిష్టపడడు. అయినా ఇతరులను పరిహసిస్తాడు అనటం వల్ల విరోధం ఏర్పడి; శత్రువులైన కేరళ రాజులన్న అర్థాంతరంతో ఆభాసం ఏర్పడుతోంది కనుక విరోధాభాసం.

ప్రేమన్ = ప్రేమతో; తాను; తామ్రపర్ణికిన్ = ఆపేరుగల నదికి (పడమటి దిగ్గజముయొక్క భార్యకు); నాథుడు = పతి; అయ్యున్; సద్గోష్ఠిచేన్ = మంచివారితో సహవాసం చేయడంచేత; అనంజనతన్ = మాలిన్యం లేకపోవడంవల్ల. (అంజనమన్న ఏనుగు కాక పోవడంచేత) మెలఁగున్ = ప్రవర్తించును.

తాను ప్రేమతో తామ్రపర్ణి అన్న పడమటి దిక్కున ఉన్న ఆడ ఏనుగునకు పతియైన (మగ ఏనుగు పేరు అంజనము) అంజనం కావడం లేదు. దీని పరిహారం తామ్రపర్ణి శబ్దానికి నది అన్న అర్థంతో సంభవిస్తున్నది కనుక విరోధాభాసం.

మహనీయ = మహత్తరమైన; మహిమన్ = మహిమతో; తాన్; మధుర = మాధుర్యమునకు; ఆస్పదుడు = స్థానమైనవాడు; అయ్యున్; లావణ్య కళలన్ = లవణ భావంయొక్క ఉప్పదనంచేత (దేహ కాంతియొక్క); కలనన్ = కూడికచేత; ఉల్లాసమున్ = కాంతి (సంతోషం) పొందున్

గొప్పమహిమచేత తాను మాధుర్యానికి నిలయమైన లవణ భావం కలవాడగు తున్నాడు. ఈ రెంటికి విరోధం. దీనికి పరిహారం మధుర శబ్దానికి నగరమన్న అర్థం. లావణ్య శబ్దానికి దేహ కాంతి అన్న అర్థం చెబితే ఏర్పడుతున్నది.

విశే ॥ ఎత్తుగీతి రచన లఘ్వక్షర బాహుళ్యం కలిగినందువల్ల శైలి వేగవంతమై జటిలమై, గంభీరంగా ఉంది. కొన్ని చోట్ల రాయల వారి సీస పద్యరచనలో ఈ లక్షణం కనిపిస్తుంది. పీఠికలో 47వ పద్యం చూడు. ఇలాంటి రచనలో పారవశ్యం ఉంటుంది.

శా. దాన త్యాగ పతత్త్రమై తొలు పతత్త్రంబంబు ధారన్సదా
నానం, దత్సిత కీర్తి హంసి చను మింటం; గ్రొత్త నానేల, నా
నా నీరార్ద్ర పతత్త్రయయ్యు వడి మింటం బాఱు తజ్జాతి కే
లా నిల్చు న్గతి యన్యపత్రి గతిఁ బత్త్రైక ప్రదేశాప్లుతిన్? 42

దాన = జల ధారాపూర్వకమైన ఈవియు; త్యాగ = జలధార లేకుండా ఇచ్చేదానం; పతత్త్రము = రెక్కలుగా గలది; ఐ; తత్ = ఆరాజుయొక్క; సిత = తెల్లని; కీర్తి = యశస్సనెడి; హంసి = ఆడుహంస; తొలుపతత్త్రంబు= మొదటి రెక్క(దానం); సదా = ఎల్లప్పుడు; అంబుధారన్ = జలధారతో; నానన్ = నానిపోయిన; మింటన్ = ఆకాశంలో; చనున్ = ఎగిరి పోతుంది; క్రొత్తనాన్ ఏల = ఇది వింత అనరాదు; నానా = అనేకమైన; నీర = నీటితో; ఆర్ద్ర = తడిసిన; పతత్త్ర = రెక్కలు గలది; అయ్యున్ = అయినప్పటికి;

వడిన్ = వేగంగా; మింటన్ = ఆకాశంలో; పాఱు = ఎగిరే; తత్+ జాతికిన్= ఆహంస జాతికి; అన్యపతత్రి గతిన్ = వేరైన మరొక పక్షిలాగా; పత్ర = రెక్కలయొక్క; ఏక ప్రదేశ = ఒకభాగముయొక్క; ఆప్లుతిన్ = తడిచేత; గతి = నడక; ఏలా నిలుచున్ = ఎందుకు నిలుస్తుంది?

తా ॥ ఆ రాజు కీర్తిహంసకు రెండు రెక్కలున్నాయి. ఒకటి జలధారా పూర్వకంగా ఇచ్చేదానం. రెండు వేడకుండానే జలధారా పూర్వకం కానట్టి త్యాగం. ఒక రెక్క తడిసినప్పటికి ఆహంసి ఆకాశంలో ఎగురుతూనే ఉంది. అదేమీ వింతకాదు. అనేక జలాల్లో రెండు రెక్కలు తడిసినప్పటికి హంసలు ఆకాశంలో ఎగురుతూనే ఉంటాయి. ఇతర పక్షులైతే తడిసిన రెక్కలతో ఎగరవు.

అలం : కావ్యార్థాపత్తి.

సీ. శుక కదంబము గొలుసులచే నిబద్ధమై,
వారాంగనాగార కారఁ బడగ;
గిరికానికాయంబు లరిశూన్య బహుపుర,
హర్మ్యవాటికలఁ జెండాడుచుండఁ;
క్రందుగా నితరేతరంబు రాయిడి సేయు,
రాజులు దననూపురమున నొదుగ
నెగడు ననావృష్టి నిజ బలేభ స్ఫూర్తి;
సమదాన్యకరటి గండములఁజేర

తే ॥ దానవేళల నతివృష్టి తనకు హస్త
గతము గాఁగఁ, బ్రతాపాగ్నిఁ గ్రాగి పోవు
కంటకుల యందు శలభత గలయనడఁగ
నేలు నా పాండ్యుఁడు మహి నీ రీతిఁ గాఁగ. 43

శుక కదంబము = చిలుకల గుంపు; గొలుసులచే = గొలుసులతో; నిబద్ధమై = బంధింప బడి; వారాంగన = భోగస్త్రీలయొక్క; అగార = గృహాలన్న; కారన్ = చెరసాలలో;పడగన్ = పడిపోగా

వారాంగనలు తమ గృహాలలో పంజరాలలో పెట్టి చిలుకలను పెంచు కుంటున్నారు. కనుక రైతులకు పంట తినిపోకుండా ఈ విధంగా చిలుకలు బంధింప బడటంవల్ల ఒక యీతిబాధ తప్పింది.

గిరికా నికాయంబు = చిట్టెలుకల గుంపు; అరి = శత్రువులయొక్క; శూన్య = పాడుబడ్డ; బహు = అనేక; పుర = నగరాలలోని; హర్మ్య వాటికలన్ = మేడ వరుసలను; చెండాడు చుండన్ = నాశనం చేస్తుండగా;

మత్స్యధ్వజుడు జయించిన రాజ్యాలన్నీ ప్రజాశూన్యములై పోగా నగర సౌధాలలో చిట్టెలుకలు కాపుర ముంటున్నాయి. కనుక రైతులకు ఈ ఎలుకలన్న రెండవ యీతిబాధ తప్పిపోయింది.

క్రందుగాన్ = సందడిగా; ఇతర+ ఇతరంబు = పరస్పరం; రాయిడిసేయు = రాపిళ్లు కలిగించే; రాజులు = శత్రురాజులు, తన; నూపురమునన్ = గండ పెండెరములో; ఒదుగన్= ఒదిగిపోగా.

నిత్యమూ పరస్పరం సందడి చేస్తూ ఘర్షణ పడే శత్రురాజులు తన కాలి గండ పెండేరములో బొమ్మలై పడియున్నందున మరొక ఈతి బాధ తప్పిపోయింది.

విశే ॥ శత్రువులను జయించి వారి బొమ్మలను కాలి అందెలలో చెక్కించుకొని ధరించటం ఆనాటి రాజులకు పౌరుషచిహ్నం. కనుక మత్స్యధ్వజుడు శత్రువులనందరిని జయించి కాలి అందెలలో వారి ప్రతిమలు చెక్కించి ధరించాడు. ఈ అందెలనే బొమ్మ పెండేరము అని కూడా అంటారు.

నెగడు = విజృంభించే; అనావృష్టి = వర్షాభావం; నిజ = తనయొక్క; బల = సైన్యంలోని; ఇభ = ఏనుగులతో; స్పర్థి = పోటీపడే; సమద = మదంకల; అన్యకరటి = ఇతరుల ఏనుగుల యొక్క; గండములన్ = చెక్కిళ్లను; చేరన్ = చేరిపోగా

తన సేన లోని ఏనుగులతో స్పర్థవహించిన శత్రురాజుల గజ సైన్యం మత్స్యధ్వజుని గజసేనను చూడగానే భయపడి పోయినవి. అందుచేత వాటి మదం నశించిపోయి చెక్కిళ్లలో మదజలం ఇంకి పోయింది. కనుక అనావృష్టి ఈ విధంగా శత్రువుల గజసైన్యమును ఆశ్రయించినందువల్ల ఈ యీతిబాధ కూడా తప్పిపోయింది

అతి వృష్టి = అధికమైన వర్షం; దానవేళన్ = ఉదక ధారాపూర్వకంగా ఇచ్చే దానసమయంలో; తనకున్; హస్తగతము కాగన్ = చేతికి లోబడగా;

అతివృష్టి తాను చేసే దానవేళ ఉదకధారల నాశ్రయించినది. కనుక అతివృష్టి అన్న ఈ తి బాధ తప్పిపోయింది.

శలభత = మిడతల లక్షణం; ప్రతాపాగ్నిన్ = తనయొక్క శౌర్యమన్న నిప్పులో; క్రాగిపోవు=తగలబడి పోయే; కంటకులయందున్ = క్షుద్రులైన శత్రురాజులలో; కలయన్= అంతటా; అడగన్ = అణగి పోయినందున;

తన ప్రతాపాగ్నిలో శత్రువులు మిడతలై మరణిస్తున్నారు. కనుక మరొక ఈతిబాధ తొలగిపోయింది. ఆ పాండ్యుడు = ఆ మత్స్య ధ్వజుడు; మహిన్ = భూమిని; నిరీతిన్ = ఈతిబాధలు లేకుండా; ఏలున్ = పాలిస్తున్నాడు.

విశే ॥ ఈతి బాధలు ఆరు.

*అతి వృష్టి రనావృష్టిః మూషికాః శలభాః శుకాః,*
*అత్యాసన్నాచ్చ రాజానః షడేతే ఈతయః స్మృతాః॥*

అలం॥ రత్నావళి.

పద్యమంతా ధర్మపరిపాలనా వైభవాన్ని అద్భుతంగా చిత్రిస్తున్నది. ఇది శ్రీకృష్ణ దేవరాయల పరిపాలనకు గుర్తు.

వ. అమ్మహీ వల్లభుం డివ్విధంబున సామ్రాజ్యవైభవము లనుభవించుచుండఁ గొంత కాలంబున 44

ఆ+ మహీవల్లభుండు = ఆ పాండ్య చక్రవర్తి; ఈ+ విధంబునన్ = ఈవిధంగా; సామ్రాజ్య వైభవములు = సామ్రాజ్య ఐశ్వర్యాన్ని; అనుభవించుచుండన్ = అనుభవిస్తూ ఉండగా; కొంతకాలంబునన్ = కొంతకాలానికి

రంగావతరణం - గ్రీష్మ మల్లిక

*స్నానార్ద్ర ముక్తేష్వను ధూపవాసం*
*విన్యస్త. సాయంతన మల్లికేషు ।*
*కామో వసంతాత్యయ మందవీర్యః*
*కేశే షు లేభే బలమంగనానామ్. (రఘువం. 16.50)*

వసంత ఋతువు గడిచేసరికి కాముడు మందవీర్యుడైనాడు. కనుక తిరిగి తనశక్తిని- స్నానార్ద్ర కేశపాశం నుండి వస్తున్న ధూపవాసనలు విచ్చిన సాయంకాల మల్లికలు - ఔషధాలుగా చేసుకొని పుంజుకొన్నాడు .

ఇది కావ్యసం ప్రదాయమార్గంలో వచ్చిన ఋతువర్ణన. ఆమార్గ కర్త ఆయనే. మరొక పద్ధతి వర్ణన కాద్యుడు మహర్షి. రాయలీమార్గంలో పయనించిన వాడు. ఇందులో వాస్తవిక ఋతుసౌందర్యం విప్పిన నెమలి పింఛంలాగా గోచరిస్తుంది. ఇందులో ఉచ్చనీచ భేదం లేదు. సర్వప్రపంచమూ వస్తువే. ఆ వస్తుచిత్రణకు ఈ ఋతువర్ణనలో రహస్యం ఊహపై కట్టిన వర్ణన కాదు. మనకుపరిచితమైన లోకమే నూత్నంగా వర్ణితమై ఆవిష్కృతం కావటం ఆశ్చర్యం కల్గిస్తుంది.

కాళిదాసు ఋతుసంహారంలో గ్రీష్మ వర్ణన అరణ్య పరిమితం కాగా ఇక్కడ లోకమంతా వస్తువే. దానికి పరిమితి లేదు. ఎండిపోయిన తామరకాడ నుండి-(52) పేరు కొన్న ప్రాచి బీటలు వారటం దగ్గర నుండి - కొంగ చేపలవేట (53)- తోటల్లో ఏతంవేసె మాలుల జానపద గేయాలు (55) అగ్గిబొబ్బలైన మల్లెమొగ్గలు (56) - ఇలా ప్రతిదీ కవి మహర్షి దర్శనంలో సువర్ణ(న ) మై పోతున్నది.

గ్రీష్మంలో ఇంత అంద మెక్కడున్నదో నన్నంత అద్భుతవర్ణన.

కావ్యమీ మాంసాకారుడు ఋతువర్ణనలో నాల్గు దశలుండాలన్నాడు. నాల్గవది అనువృత్తి-రాబోయే ఋతుసూచన చేయుటం. గ్రీష్మాంతం లో 70వ పద్యంలో రాబోయే వాన కారుసూచన దీనికి సంబంధించిందే.

2. ఈ వర్ణన చక్రవర్తి విరక్తికి ప్రతీకగానూ గ్రహించవలసిందే.( కల్పవృక్షంలో రామవైరాగ్య ప్రతీకగా గ్రీష్మం వర్ణితమైనట్లు)

3. చక్రవర్తికి కలిగిన వైరాగ్యానికాబాట సారి బాపడు చదివిన చాటువు హేతువు. అత డారుబైట పండుకోవటానికి వేసవి కారణం. అతడు వృషగిరి తెప్ప తిరునాళ్ళకు పోయివస్తున్నాడు. అదివేసవిలో వచ్చేది.

ఇదీ సందర్భం.

తే॥ పాటల వసుంధరారుహ భాగధేయ
మాతత మరీచికాంబు వర్షాగమంబు
ధరణిఁ బొడ సూపె నంత నిదాఘసమయ
మదటుతో శాల్మలీ ఫల విదళనంబు. 45

అంతన్ = అలా ఉండగా; పాటల = కలిగొట్టు; వసుంధరారుహ = చెట్లయొక్క (భూమి నుండి పుట్టినది); భాగధేయము = అదృష్టము (అయినట్టి); ఆతత = విస్తారమైన; మరీచిక = ఎండమావులన్న; అంబు= నీటికి; వర్ష+ ఆగమంబు = వర్షా కాలముయొక్క రాక (అయినట్టి); నిదాఘసమయము = వేసవికాలము; శాల్మలీఫల దళ విదళనంబు= బూరుగు చెట్ల పండ్లను పగుల గొట్టే (వేసవి); అదటుతోన్ = తీవ్రంగా; ధరణిన్ = లోకంలో; పొడసూపెన్ = ప్రత్యక్ష మైనది.

పాటల వృక్షాలను వికసింప చేసేది కనుక వాటి పాలిటి అదృష్ట దేవత. ఎండ మావులన్న నీటికి వర్షఋతువూ, బూరుగు కాయలను పగుల గొట్టేదీ అయిన వేసవి కాలం హఠాత్తున ఒక రోజు భూమిపైకి అవతరించింది. వేసవి రాగానే పాటల వృక్షాలు పుష్పించడం; ఎండమావు లేర్పడటం, బూరుగు కాయలు పగిలి పోవడం జరుగుతుంది. కనుక అలంకారం స్వభావోక్తి.

(ఇక్కడి నుండి 70వ పద్యందాకా వేసవి కాల వర్ణన. ఆంధ్ర సారస్వతంలో ఈ వేసవి వర్ణన ఒక అపూర్వ సృష్టి. ఎండలలో చల్లని వెన్నెలలు చూచే కన్నులు కలవాడే కవి అని పిలువబడుతున్నాడు.)

సీ. నిర్ఝర ప్రబల వేణిక లింకఁ జట్రాలఁ; బేరిన ప్రాఁచి పెన్నేటు లెగసె;
నెఱుకులు పడియ నీరివుర గువ్వలఁ బట్టఁ; బోయునీరాడాడఁ బొలము నెఱసె
సురగాలి దవ దగ్ధ తరు పర్ణతతి రేఁపఁ; బావురాలని డేగ పదుపు దూఱె;
నిద్రిత ద్రుచ్ఛాయ నిలువక జరుగ, వెం; బడిగ నధ్వగపంక్తి పొడ లు వెట్టె;

తే. క్షేత్రపాలునకుదికినచీరలాఱు;
చాకిరేవుల గములయ్యె సకలదిశలుఁ
దెలుపులుగఁ దోఁచె నెండమావుల బయల్లఁ; గందెనివి
యొండ నన దిఙ్ముఖములురాఁజె.. 46

నిర్ఝర = సెలయేళ్లయొక్క; ప్రబల = అధికమైన; వేణికలు = ప్రవాహాలు; ఇంకన్ = ఇంకి పోగా; చట్రాలన్= ఏళ్లలో ఉన్న చట్టు బండలపై; పేరిన = పేరుకున్న; ప్రాఁచి = పాకుడు; పెన్నేటులు = పెద్ద బిళ్లలుగా; ఎగసెన్ = పగిలి పోయింది.

కొండలపైనుండి దూకే సెలయేళ్లపాయలు ఎండిపోగా వాటి మధ్యలో ఉన్న చట్టు బండలపై నీరున్నపుడు పేరుకొని పోయిన పాకుడు బిళ్లలు బిళ్లలుగా పగిలి పోయింది.

ఎఱుకులు = బోయవాళ్లు; పడియనీరు = చిన్న గుంటలలో నీరు; ఇవురన్ = ఇగిరి పోగా, గువ్వల బట్టన్ = గువ్వలను పట్టుకోవడానికి; పోయు = పోసే; నీరు = నీళ్లు; ఆడ+ ఆడన్ = అక్కడక్కడ; పొలము = బీటినేలలో; నెఱసెన్ = వ్యాపించెను.
అడవిలో పల్వల సమూహాల్లోని నీళ్లు ఆవిరై పోయాయి. నీళ్ల కోసం ఎరుకు వాళ్లు అక్కడక్కడ చిన్నచిన్న గుంటలు త్రవ్వి నీళ్లు పోసారు. అవి త్రాగటానికి వచ్చినగువ్వలను పట్టుకోవాలని వారి ప్రయత్నం. ఆ గుంటల్లోని నీరు పొలాల్లో అక్కడక్కడ కనిపిస్తుంది తప్ప చెరువుల్లోను గుంటల్లోను ఎక్కడా నీటి బొట్టు లేదు. (పోల్చు 51 పద్యం)

ఏడ, ఆడ శబ్దాలు గ్రామ్యాలని కొందఱు లాక్షణికులు అన్నా కవిత్రయమే ప్రయోగించిన జాడలున్నాయి. కనుక గ్రామ్యాలు కాదు.

సురగాలి = సుడిగాలి; దవ = దావాగ్నిలో; దగ్ధ= కాలిపోయిన; తరు = చెట్లయొక్క, పర్ణ = ఆకులయొక్క; తతిన్ = గుంపును; రేపన్ = ఎగుర గొడితే; పావురాలు+ అని = కాలి పోయిన ఆకులను చూచి పావురాలు అనుకొని; డేగ = గ్రద్దలయొక్క; పదువు = గుంపు; దూఱెన్ = మధ్యలో ప్రవేశించినది.

కార్చిచ్చులో పడి చెట్లు కాలిపోగా కాలిన అస్థి పంజరాల్లాగా ఆకులు సుడి గాలిలో అల్లాడుతున్నవి. వాటిని చూచి గ్రద్దలు పావురాలను కొని ఆ వ ాడిన ఆకుల గుంపుల్లోకి ప్రవేశించినవి.

అలం : భ్రాంతిమంతం.

కాలిన ఆకునకు పావురానికి సాదృశ్య మున్నందువల్ల పక్షులు భ్రాంతిపడ్డాయి. అద్భుతమైన అలంకారం.

నిద్రిత = నిద్రపోయిన వారియొక్క; ద్రు = చెట్లయొక్క; ఛాయ = నీడ; నిలువక = ఒకేచోట ఉండకుండా; జరుగన్ = అవతలికి జరిగిపోగా; వెంబడిన్ = దానితో పాటుగా; అధ్వగ పంక్తి = బాటసారుల గుంపు; పాడలు పెట్టెన్ = పొరలికలు పెట్టెను.

చెట్లనీడలలో మధ్యాహ్నవేళ ప్రయాణం చేస్తూ అలసిపోయిన బాటసారులు ప్రక్కనే ఉన్న బావులలో ఇంత నీరు త్రాగి సేద తేరి నిద్రపోయారు. ఆ నీడలు సూర్యగమనంతో పాటుగా చలిస్తున్నందున నిద్రపోయిన బాటసారులు కూడా తెలియ కుండానే నీడతోపాటు తొర్లుతున్నారు.

సకల దిశలున్; క్షేత్రపాలునకున్ = కాలభైరవునకు; ఉదికిన = క్షాళించిన; చీరలు = పంచలు; ఆఱు = ఎండే; చాకిరేవుల; గములు = గుంపు; అయ్యెన్ = అయినవి.

ఎండలో తెల్లగా మెరిసిపోతున్నందువల్ల అవి క్షేత్రపాలకుడు ఉదికి ఆరవేసిన తెల్లని వస్త్రాల్లాగా ఉన్నాయి.

క్షేత్రపాలుడు = కాలభైరవుడు.

అలం : ఉపమ.

తెలుపులుగ తోచు = తెల్లనివిగా కనిపించే; ఎండమావుల; బయ్యళ్లన్ = బహిః ప్రదేశాలలో; దిఙ్ముఖాలు = దిక్కులయొక్క ముఖాలు; ఎండన్ = ఎండలో; కందెన్ = కందిపోయినవి; ఇవి = దిక్కుల ముఖాలు; అనన్ = అన్నట్లుగా; రాజెన్ = రాజుకొన్నవి. (మండెను) దిక్కుల ముఖాలు ఎండలో కంది పోయినవో అన్నట్లుగా రాజుకొన్నవి ( మండు తున్నవి)

సుకుమారుల ముఖాలు ఎండలో కందిపోవడం సహజం కనుక దిక్కులన్న స్త్రీల ముఖాలు కందిపోయినవో అన్నట్లుగా రాజుకొన్నవి. దిగంతాలలో కార్చిచ్చు క్రమ్ముకొన్నది.

అలం : ఉత్ప్రేక్ష. పద్యం . 1,2,4, పాదాలలో స్వభావోక్తి.

విశే ॥ రాయలసీమలో ఎండలు మెండుగా వుంటాయి. కనుక ఈ వర్ణన అత్యంత రమణీయమైన సహజోక్తితో వర్ణింపబడ్డది.

చ. సరియగు నిట్టి వెట్ట నివి సర్వము నంచట మీఁది సృష్టికై
శరధిప దిఙ్మరుజ్జ్వలిత చండ తరాతపవహ్ని నాఱఁగా
గరువు లజుండు వీనిపయిఁగ ట్టె ననన్ గను పట్టె వెచ్చల
న్గరికిరి కాసరాంగములఁ గప్పిన ఱొంపులు నంద యాఱఁగన్. 47

వెచ్చలన్ = ఎండల వేడితో; కరి = ఏనుగు; కిరి = పంది; కాసర = దున్నలు; అంగములన్= దేహాలపై; కప్పిన = కప్పుకొనియున్న; ఱొంపులున్ = బురదలు కూడా; అంద = ఆ శరీరాల పైనే; ఆరగన్ = ఎండిపోగా; (ఇది ఎలావున్నదంటే) ఇట్టి వెట్టన్ = ఇలాంటి ఎండల్లో; ఇవి సర్వమున్ = ఆ జంతువులన్నీ; సరియగున్= మరణిస్తాయి; అంచున్ = అని; అట+ మీది సృష్టికై = తర్వాత రాబోయే సృష్టికోసం; వీని పయిన్ = ఆ జంతువుల వీపులపై; శరధిప = సముద్రపతియైన వరుణునియొక్క; దిక్ = పడమటి దిక్కు; మరుత్= గాలిచేత; జ్వలిత = మండింపబడ్డ; చండతర = మిక్కిలి తీక్ష్ణమైన; ఆతప = ఎండలన్న; వహ్నిన్ = నిప్పుతో; ఆఱగాన్ = మండగా; కరువులు = మూసలను; కట్టెను = కట్టినాడు; అనన్ = అన్నట్లుగా; కనుపెట్టెన్ = కనిపించినవి. (అంటి- వావిళ్ళపాఠం)

తా॥ ఆ తీక్ష్ణమైన వేసవి ఎండలలో ఏనుగులు, అడవి పందులు, అడవి దున్నలు వీపులపై పేరుకొన్న దట్టమైన బురద ఆరిపోవడమెలా ఉన్నదంటే ఈ జంతువులన్నీ ఈ వేసవిలో మరణిస్తాయన్న భయంతో బ్రహ్మదేవుడు రాబోయే సృష్టికోసం నిల్వ చేయమంటే అతడలాగే చేసాడట. ఆ నావను ప్రళయ సముద్రంలో విష్ణువు మత్స్యావతారమై తీరం చేర్చాడట.

ఒక వస్తువును తయారు చేయటానికి లేదా శిల్పాదులను నిర్మించడానికి మూసలు కట్టి అందులో లోహాన్ని కరిగించి పోయడం లోకంలో ఉన్నది. ఈ రెండు విషయాల ఆధారంగా ఈ పద్యంలో భావం రూపు దిద్దుకొన్నది.

వేసవి కాలంలో ఎక్కువ రొప్పే జంతువు లీ పద్యంలో వర్ణింపబడ్డవి.

మ. ధవ ధూమంపు దమంబులో దమరస ద్రవ్యంబు c బంకేజబాం
ధవ భాను ప్రతతుల్హరింప గుయి వెంట న్వెళ్లు శూన్యోరు కూ
ప వితానంబన c జూడc జూడ c బుడమి న్పాటిల్లి పై విప్పులై
యవసంబంచుల నాడcగా నెగసె వాత్యాళి రజశ్చక్రముల్. 48

రజః+ చక్రముల్ = సుడిగాలిలో గుండ్రంగా తిరిగే దుమ్ము; వాత్య+ ఆళిన్ = సుడి గాలి గుంపులో; చూడన్+ చూడన్ = చూస్తున్నంతలోనే; పుడమిన్ = భూమిపై; పాటిల్లి = పుట్టి; పైన్ = పైన (అంతరిక్షంలో పై భాగాన); విప్పులై = వైశాల్యము గలవై; యవసంబు= గడ్డిపరకలు; అంచులన్ = కొసలందు; ఆడగాన్ = తేలుతుండగా; ఎగసెన్ = ఆకాశంలో వ్యాపించాయి; (ఇది ఎలాఉన్నదంటే); తమ రసద్రవ్యంబు = తమ (ఎండిపోయిన); రస = జలమన్న; ద్రవ్యంబున్ = ధనమును; పంకేజబాంధవు = తామరల బంధువైన సూర్యునియొక్క; భాను = కిరణాలయొక్క; ప్రతతుల్ = సమూహం; దవ = కార్చిచ్చు నుండి పుట్టిన; ధూమంపు = పొగయన్న; తమంబులోన్ = చీకట్లో; హరింపన్ = దొంగిలిస్తే; కుయివెంటన్ = మొరపెట్టుకొనే పని కోసం; వెళ్లు = పైకెగిరిపోయే; శూన్య= పాడుబడ్డ; ఉరు = పెద్ద; కూప = బావులయొక్క; వితానంబు = సమూహమో యన్నట్లు.

రాయల సీమలో బావులలో నీళ్లు వేసవిలో ఇంకి పోవడం ఆ నూతులు కూడా చాలా లోతుగా త్రవ్వితే తప్ప నీరు పడక పోవడం సహజమే. ఇది ఉపమానాంశం లేదా ప్రస్తుతాంశం. వేసవిలో సుడిగాలులు వీచడం; అవి క్రింద చిన్నవిగా ఉండి పైకి పోను పోను విస్తృతం కావటం వాటిలో గడ్డిగాదం తేలియాడటం, సహజమైన అంశం ఇది ఉపమేయాంశంగా గ్రహించబడింది. రెండూ వేసవిలో ప్రస్తుతాంశాలే. ఈ రెంటిపై కట్టబడ్డ ఒక అందమైన భావ సముదాయం ఈ పద్యం ఆ సుడిగాలులు పాడుబడ్డ బావులు. తమ జలాన్ని సూర్యకకిరణాలు దొంగిలించు కొని పోతే సూర్యునితో మొరపెట్టుకోడానికో అన్నట్లు ఆకాశంలోకి ఎగిరిపోతున్నవో అన్నట్లుగా సుడిగాలులు గుండ్రంగా తిరుగుతున్నాయి. పాడుబడ్డ బావులు కనుక అంచుల మీద గడ్డిగాదం ఉండటం మట్టితో కప్పబడి పోవడం అత్యంత సహజాంశాలే, లోతైన బావులు కనుక మనంపైనుండి చూస్తే అడుగున చిన్నదిగా కన్పించడం స్వాభావికమే. కనుక బొంగరాల లాగా ఉన్న వాత్యాది రజశ్చ చక్రాలు పైకెగిరిపోయే శూన్య కూపవితానమో అన్నట్లుగా కన్పించడం సహజాతి సహజ విషయం విషయం. కనుక ఈ ఉత్ప్రేక్ష కృత్రిమంగా అనిపించదు. ఏ ఉత్ప్రేక్ష మనకు సహజరమణీయంగా ఉంటుందో దానిని సహజోత్ప్రేక్ష అనవచ్చు. మధురానగర వర్ణనలో ఎక్కువ కృత్రిమోత్ప్రేక్షలుంటాయి. ఋతు వర్ణనలో సహజోత్ప్రేక్షలు కనిపిస్తాయి. ఈ భేదాన్ని పాఠకులు గుర్తించాలి.

దొంగలు చీకట్లో తమపని చేసుకుంటారు కనుక ధవధూమంపు తమస్సులని చెప్పబడింది. సూర్యుడు పంకేజ బాంధవుడు. పంకేజములు నీళ్లలో వికసించేవి. కనుక ఆ నీటిని సూర్యకిరణా లపహరించాయి. కనుక బావులకు సూర్యునకు ఒక బాదరాయణ సంబంధం ఉన్నందు వల్ల తమమొర ఆ రాజు తీర్చగలడన్న నమ్మకం ఏర్పడుతున్నది. రాజ్యపాలనా సంబంధభావం

చ. పడమర వెట్ట నయ్యుడుకు బ్రాశన మొల్లక కూటిపేదలై
బడలిక నూడు నచ్చిలువ బ్రగ్గములన్ రవి యాజ్ఞ మాటికిన్
ముడియిడ c బిచ్చు గుంటు రథము న్నిలుప న్బయనంబు సాగమిన్
జడను వహించె నాcగ దివసంబులు దీర్ఘములయ్యె నత్తఱిన్. 49

అత్తఱిన్ = ఆ వేసవిలో; పడమర వెట్టన్ = పడమటి వేడితో; ఆ+ ఉడుకు = ఆ వేడి లేదా ఆ ఉడుకుతున్న; ప్రాశనము = అన్నము; ఒల్లక = ఇష్టపడక; కూటి పేదలై = అన్నము లేని పేదవారై; బడలికన్ = శ్రమతో; ఊడు = జారు; ఆ+ చిలువ = ఆ పాముల; ప్రగ్గములన్ = పగ్గాలను; పిచ్చుకుంటు = అనూరుడు; రవియాజ్ఞన్ = రథికుడైన సూర్యుని ఆజ్ఞతో; మాటికిన్ = ప్రతిసారి; ముడి + ఇడన్ = ముడి పెట్టడానికి; రథమున్= సూర్యరథాన్ని; నిలుపన్ = ఆపితే; పయనంబు = ప్రయాణం; సాగమిన్ = సాగనందున; దివసంబులు = పవళ్లు; జడను = అలసత్వాన్ని, ఆలస్యాన్ని; వహించెన్ = పొందెనో; నాగన్ = అన్నట్లుగా; దీర్ఘముల్ = పొడవైనవి; అయ్యెన్ = అయినవి.

వేసవిలో పగటి కాల మెక్కువ. దీనికి హేతువుకాని హేతువు సంఘటింప బడుతున్నది. అది ఏమంటే వేసవి కాలంలో పడమటి దిక్కు నుండి వేడిగాలులు వీస్తున్నవి. పాము గాలి మేపరి. కనుక ఆవేడి అన్నాన్ని తినలేక కూటి పేదలైనవి. ఆ శ్రమకు అవి వడిలిమాటి మాటికి జారిపోతుంటే రథికుడైన సూర్యుడు హెచ్చరిస్తుంటే సారథి కుంటి వాడైన అనూరుడు మాటి మాటికి దిగుతూ ఆ జారిపోయిన పగ్గాలను సరిచేస్తున్నాడు. ఇందువల్ల సూర్యుని ప్రయాణం సాగడం లేదు. కనుక సూర్యుడు పశ్చిమ దిక్కునకు చేరుకోవడం ఆలస్యమైపోయింది. ఈ కారణంగా పగళ్లు దీర్ఘము లైనవి.

పగటికాలం దీర్ఘం కావడమన్న సహజమైన అంశాన్ని ఈ రీతిగా ఉత్ప్రేక్షించినందు వల్ల అలంకారంలో అత్యంత రమణీయమైన సహజత్వం వచ్చింది.

ఉడుకు + ప్రాశనము = ఉడుకుంబ్రాశనమని సంధి చేసుకుంటే ఉడుకటన్నమన్న అర్థంలో కుదురుతుంది.

క. తరణి ఖర కిరణ శిఖ జగ;
మెరియింపcగcబొడమి గాలి నెగసిన భసితో
త్కర మనcగ శాల్మలీ తరు;
పరిణత ఫల తూల మర్కపథమున నెరసెన్. 50

తరణి = సూర్యునియొక్క; కిరణ = కిరణాలయొక్క; శిఖ = నిప్పు; జగము = ప్రపంచాన్ని; ఎరియింపగన్= మండింపగా; పొడమి = పుట్టి; గాలిన్ = గాలికి; ఎగసిన = పైకెగిరిన; భసిత = బూడిదయొక్క; ఉత్కరము= కుప్పయో; అనగన్ = అన్నట్లుగా; శాల్మలీ = బూరుగు; తరు = చెట్లయొక్క; పరిణత = పక్వమైన; ఫల= పండ్లయొక్క; తూలము = దూది; అర్కపథమునన్ = అంతరిక్షంలో (సూర్యమార్గంలో) నెరసెన్= వ్యాపించింది.

తా॥ సూర్య కిరణాల వేడికి ప్రపంచమంతా మండిపోగా దాని బూడిద ఏమో అన్నట్లుగా ఆకాశమంతా పగిలిన బూరుగు కాయల దూది కుప్పలు కుప్పలుగా వ్యాపించింది. 45వ పద్యంలో శాల్మలీ ఫల విదళనంబు = వేసవి అని చెప్పబడ్డది. దానికీ పద్యం పరిణామ క్రమంగా చూచుకోవాలి. వేసవిలో జిల్లేడు, బూరుగు కాయలు పగిలి దూది గాలికి కొట్టుకు పోవడం సహజ దృశ్యం. ఈ స్వభావోక్తి నాధారంగా చేసికొని వచ్చిన ఈ పద్యంలో వస్తూత్ప్రేక్ష. గాలికి లేచిన బూరుగు కాయలదూది అన్న వస్తువునకు మండిపోయిన ప్రపంచపు బూడిద హేతువైన వస్తువుగా చెప్పబడినందున.

చ. భరిత నిజాంబు బింబిత విభాకరబింబ విజృంభిత ప్రభాం
కురముల నధ్వనీన కృత కూపక పంక్తులు వొల్చె నబ్ధిరా
డ్విరహ భరంబునంబొడము వెచ్చకు శాంతి యొనర్ప వాహినీ
తరుణులు మేన దట్టముగ c దాల్చిన ముత్తెపు c బేరులో యనన్. 51

అధ్వనీన = బాటసారులచే; కృత = త్రవ్వబడిన; కూపక = చిన్నిచిన్ని నీటి గుంటల యొక్క; పంక్తులు= వరుస; భరిత = నిండిన; నిజ = తమయొక్క; అంబు = నీళ్లలో; బింబిత = ప్రతిబింబించిన; విభాకర బింబ = సూర్యబింబముయొక్క; విజృంభిత = ఏసరేగిన; ప్రభా = కాంతులయొక్క; అంకురములన్= మోసులచేత; వాహినీ తరుణులు = నదీకాంతలు; అబ్ధిరాట్ = తమకు భర్తయైన సముద్రునితోడి; విరహ = వియోగముయొక్క; భరంబునన్ = భారంతో; పొడము = కలిగే; వెచ్చకున్ = వేడికి; శాంతి+ ఒనర్పన్ = ఉపశమనం చేసుకోడానికై; మేనన్ = దేహంమీద; దట్టముగన్ = సాంద్రంగా; తాల్చిన = ధరించిన; ముత్తెపు + పేరులో అనన్ = ముత్యాల దండలో అన్నట్లుగా; పొల్చెన్ = అందగించినవి.

తా॥ వేసవిలో నదులు కూడా ఇంకి పోయినపుడు ఆ యిసుక తిన్నెలలో ప్రయాణం చేసే బాటసారులు కొంచెం పాయగా నీళ్లున్న చోట ప్రక్కన ఇసుకలో చిన్న చిన్న నీటిగుంటలు త్రవ్వి అందులో ఊరిన స్వచ్ఛమైన నీళ్లను త్రాగి ప్రయాణం సాగించటం లోకసహజమైన విషయం. ఆ విధంగా ఏర్పడిన గుంటల వరుసల నీళ్లలో మధ్యాహ్న సూర్యకాంతి ప్రతిబింబించి ఆ నీళ్లు తళతళా మెరిసిపోతున్నాయి. ఇవి ఎలా ఉన్నాయంటే నదీయువతికి సముద్ర సంగమం లేనందున కలిగిన విరహతాపాన్ని పోగొట్టుకోవటం కోసం ధరించిన ముత్యాల దండల వరుసలలాగా ఉన్నాయి.

విశే॥ భరిత అనడం వల్ల నీటిగుంటకు సరిపడినట్లుగా సూర్యబింబం ప్రకాశిస్తున్నది. సూర్యకిరణాల ప్రతిఫలనంచేత గుంటలలో నీరు అధికంగా మెరిసిపోవటం సహజం. ఇందుకని విజృంభిత శబ్దం వాడబడింది. నీటిగుంటలు సూర్యబింబం గుండ్రంగా ఉన్నందువల్ల ముత్యంలాగా ఉన్నది. నీరు తళతళ ముత్యం తారళ్యం ఉన్నది. ఈ పద్యంలో సూచింపబడ్డ విరహభరంబు క్రింది పద్యంలో వివరంగా వర్ణింపబడుతున్నది. తరుణులు శబ్దం యౌవనాన్ని సూచిస్తున్నది కనుక ఇసుకతిన్నెల నిండా కూపక పంక్తులున్నందున ముత్యాల దండల్లాగా కనిపించడం దూరం నుండి చూచినపుడు సహజమైన విషయం. దీనివల్లనే నదీకాంతలు తారుణ్యం - తరణిబింబ - ప్రతిబింబ సంబంధం. రచనలో ంబ- కారావృత్తితో వచ్చిన వేగం భావించదగ్గది.

అలం : వస్తూత్ప్రేక్ష.

మ. అతివృష్టి న్మును వార్ధిఁగూర్చు నెడ కాఁడౌటం దమిం గూర్చున
న్మతి లంచంబుగ హేమ టంకములు మింటం బొల్చు పర్జన్యదే
వత కీనెత్తిన కేలనాఁబొలిచె నిర్వారి స్రవంతి న్పయ
శ్చ్యుతి నమ్రచ్ఛద దృశ్య కర్ణికములై యున్నాళ నాళీకముల్. 52

మును = వేసవికి ముందుగా వచ్చిన వానకాలంలో; అతివృష్టిన్ = అధిక వర్షాలచేత; వార్ధిన్ = భర్తయైన సముద్రునితో; కూర్చు = కలిపే; ఎడకాడు = కుంటెన కాడు (దూత); అవుటన్ = అయినందువల్ల; తమిన్ = వాంఛతో; కూర్చున్ = ఇప్పుడు కూడా తమను సముద్రునితో చేరుస్తాడు; అన్‌మతిన్ = అన్న ఆలోచనతో; లంచంబుగన్ = లంచంగా; హేమటంకములు = బంగారు దీనారాలు ( ఆరోజుల్లో నాణేలు); మింటన్ = ఆకాశంలో; పొల్చు = ఉన్న; పర్జన్య దేవతకున్ = మేఘుడన్న దేవతకు; ఈన్ = ఇవ్వడానికై; ఎత్తిన = చాచిన; కేలు+నాన్ = చేయి ఏమో అన్నట్లుగా; నిర్వారి స్రవంతిన్ = నీళ్లు లేని ఏట్లో; ఉత్+నాళః పైకి సాగిన తూండ్లు కలవైన; నాళీకముల్ = తామరలు; పయః+ చ్యుతిన్ = నీరు ఇగిరి పోయినందున; నమ్ర = వాలిపోయిన; ఛద = రేకులు గలవై; దృశ్య=చక్కగా కనిపించే; కర్ణికములు = దుద్దులు కలది, ఐ; పొలిచెన్ = ఒప్పుతున్నవి.

ప్రస్తుతం వేసవి కనుక ఎక్కడా పాయల్లో నీరు లేదు. ఆ పాయ ప్రక్కన కొంచెం తడి బురద ఉంటే అందులో తామర కాడలు వాడి వ్రేలాడుతూ వడిలిపోయిన రేకులతో పుష్పించాయి. నీళ్లు లేనందువల్ల కాడలు పైకిసాగి కనిపిస్తున్నవి. నీళ్లుంటే పూలే కనిపిస్తాయి. పువ్వురేకులు వడలి వాడి పోయాయి. కనుక నడుమ నున్న దుద్దు స్పష్టంగా బంగారు దీనారాల్లాగా సూర్యకిరణాలు పడి మెరిసిపోతున్నది. ఇది వేసవిలో దృశ్యం. ఇది ఎలావున్నదంటే వానకాలంలో నదీకాంతలను పర్జన్యుడు శృంగార దూతయై సముద్రుని దగ్గరకు చేర్చాడు. పెల్లుగా వానలు కురిసినందున నదులు పొంగి వరదలు కట్టి సముద్ర సంగమం పొందాయని తాత్పర్యం. ఇప్పుడు వేసవి అయినందువల్ల మేఘుడు కురవటం మానివేసాడు. కాబట్టి ఆ మేఘునకు లంచంగా, విరహంతో కృశించిపోయిన తామర తూడుల వంటి బాహువులు ఎత్తుగా సాచి పైనున్న మేఘునకు కనిపించేటట్లుగా హస్తం నిండా బంగారు నాణేలు పోసుకొని వ్రేళ్లు అడ్డం రాకుండా వెనుకకు వ్రాల్చి మరీ లంచంగా చూపిస్తున్నాయో అన్నట్లుగా తామరలున్నాయి. ఎండిపోయిన నది విరహకాంత ఉన్నాళ నాళీకం దాని వడిలిపోయిన బాహువు. ఆమె చేతి వ్రేళ్లు నమ్రచ్ఛదములు. దుద్దులు దీనారాలు. ఈ విధంగా ఉపమానోపమేయాలన్నీ చాలా చక్కగా కూర్చబడ్డవి. కాళిదాసాది మహాకవులు శరత్కాల పద్మాలను వర్ణిస్తే కృష్ణదేవరాయలు ఎండిపోయిన తామర కాడను వర్ణిస్తున్నాడు. మానవ జీవితంలో చీకటి వెలుగులు రెండూ సమానంగానే ఉంటాయి. ఈ రెంటిని సమన్వయించ గలిగినవాడే మహాకవి. రాయలవారిలో యీ సమగ్ర దర్శనం ఉంది. ఎండిపోయిన నదిలో విరహిణీ సౌందర్యాన్ని దర్శించిన రాయల ప్రతిభకు రత్ననీరాజనం పట్టాలి. నాల్గవ ఆశ్వాసం

వర్షఋతువు వర్ణనలో 101 పద్యంతో పోల్చు. అక్కడ నదీకాంత సంయోగ శృంగారిణిగా చెప్పబడింది. ఇక్కడ వియోగిని కనుక కవి యీ కుడి ఎడమలుగానున్న జీవన సమగ్ర దర్శనం కలవాడన్నమాట. వ్రేళ్ళు- దళాలు - వెన్నకుద్రావాలటం సహజం కాదు. అది నాట్యహస్త్రం. అభినయాభ్యాసం వల్లనే అరచేయి బాగా విప్పుగా కన్పిస్తుంది.

సీ. నులివాడు నాఁచు వల్లుల గొంతొగర్చి లేఁ
బొల వల్చుగాలి వే పోక నొరఁగి,
కడకు వెళ్లఁగ నొక్క కడనుండి త్రొక్కుచు
నులుచలం జిఱుత గుల్లల నములుచు
నెండ్రి కాలిటికిన నెగసి యొక్కించుక
తొలఁగి శితత్రోటిఁ దూటి తినుచుఁ
దడియింకు నిలఁజేమ మడిలోని తమ్మిగుం
పులను జీలుగుల నెండలు గడపుచుఁ

తే. దనరు బక పంక్తులకు జాను దఘ్న మయ్యెఁ
జెరువు గమి; యుడుములన రేల్దిరిగెఁగుక్క
వసికి; బావులఁ బడుటకుఁ బసుల యెరువు
టెఱలకు మొసళ్లు; మలుఁగు మీనొబొఱియ దూఱె. 53

నులి = కొంచెం; వాడు = వాడి పోయిన; నాఁచు వల్లులన్ = ప్రాకుడు తీగలకు; గొంతు= కంఠం; ఒగర్చి= ఒగరు రుచితో రొప్పుకొంటూ; లేన్ = లేత; పొల = చేపల పొలుసు; వల్చు = వాసన లీను; గాలిన్ = గాలితో; వే = వడిగా; పోక = పోకుండా; ఒరగి = ప్రక్కకు ఒరిగి

ఈ పద్యంలో కర్త కొంగ. అది చెఱువులలో చేపలను వేటాడుతున్నది. ఆ కొంగ నాచుతీగలను తిన్నందువలన గొంతు ఒగర్చుకు పోయింది. ఇంతలో ఒక దిక్కు నుండి చేపల వాసనతో గాలి వీచింది. వెంటనే దానికోసం పోకుండా కొంచం సేపు ప్రక్కకు ఒదిగి నిల్చున్నది. ఎందుకంటే తొందర పడితే ఆ చేప దొరకదని.

కడకున్ = చివరకు; వెళ్లగన్ = వెళ్లడానికి; ఒక్క కడనుండి = మరియొక చివరనుండి; త్రొక్కుచున్ = బురదలో కాళ్లతో త్రొక్కి చూచుకుంటూ; ( ఆహార పదార్థాలైన ఎండ్రకాయలు, నత్తగుల్లలు, చేపలు ఉన్నాయా అని చూచుకోవటం); ఉలుచలన్ = ఆపేరుగల చిన్న చేపలను; చిరుత గుల్లలన్ = చిన్న నత్తగుల్లలను; నమలుచున్ = నములు కుంటూ.

చెఱువు ఆ దరికి పోవడానికి ఈ దరిన దిగి కాళ్లతో త్రొక్కి ఉలుచలు, చిఱుత గుల్లలున్నాయని తెలిసి పాడుచుకొని తింటూ అవతలి ఒడ్డుకి పోతున్నదన్నమాట.

ఎండ్రి = ఎండ్రకాయ; కాలు ఇరికినన్ = కాలును గిట్టలతో ఒత్తగా; ఎగసి = అదాటున పైకెగిరి; ఒక్కించుక తొలగి = ఒకకొంచెం ప్రక్కకు తప్పుకొని; శిత = వాడి యైన; త్రోటిన్ = ముక్కుతో; దూటి = గ్రుచ్చి; తినుచున్ = తింటూ

త్రొక్కుతూ నడుస్తున్న కొంగ కాలును ఎండ్రకాయ గిట్టలతో పట్టుకొన్నది. భీతితో అది హఠాత్తుగా పైకి ఎగిరి కొంచెం పక్కకు తప్పుకొని కోపంతో వాడియైన ముక్కును గ్రుచ్చి ఎండ్రకాయను పొడిచి తిన్నది. ( ఎగసి = ధాతువు భయాన్ని సూచిస్తే శిత విశేషణం కసిని ధ్వనిస్తున్నది.)

తడి = తేమ; ఇంకు = ఇంకిపోయిన ; ఇలన్ = నేలలో; చేమ మడివోని = చేమ కాడల మడివంటి; తమ్మిగుంపులన్ = తామర తీగల గుంపులో ; జీలుగులన్ = జీలుగు చెట్లలో; ఎండలు = ఎండలను; కడుపుచున్ = గడుపుకుంటూ;

తడి యింకి పోయిన చెఱువు బురదలో తామర గుబురు లున్నాయి. అది చేమ మడిలాగా ఉన్నది దానినీడలలో జీలుగు పొదల నీడలలో ఎండ వేళలను గడుపుకుంటూ ( కొంగ అవతలి ఒడ్డుకు ప్రయాణం చేస్తున్న దన్న మాట). తామర సాహిత్యంలో నిత్యమూ ఉపమానమే. ఇక్కడ మాత్రం ఉపమేయమైనది. చేమమడి ఉపమానంగా చెప్పబడింది. చేమాకులు, దుంపలు కూరలుగా ఉపయోగించుకుంటాం. దాని ఆకు తామరాకువలె ఉంటుంది. కనుక సాదృశ్యం సాటిలేనిది. చేమమడి, తామర గుంపులు ఒకే రకంగా ఉంటాయి. కనుక కొంగకు ఆతపత్రము లాగా ఉండడానికి హేతువైనది. దీన్ని అద్భుతమైన ఉపమానం అని వేదంవారు వ్యాఖ్యానించటం చాలా అందమైన విషయం.

తనరు = ఈ విధంగా ప్రవర్తించే, బక పంక్తులకున్ = కొంగలగుంపుకు; చెరువుగమి = తటాకసమూహం; జాను దఘ్న అయ్యెన్ = మోకాలి బంటి లోతు కలవైనవి. (బాగానీళ్లు తీసిన వని తాత్పర్యం.)

మొసళ్లు = నేలమీదతిరిగే మొసళ్లు; ఱేలన్ = రాత్రులందు; ఉడుములన్ = ఉడుములో యన్నట్లు; కుక్కవసికి = కుక్కల అరుపులకు; బావులన్+ పడుటకున్ = బావులలో పడిపోవటానికి; పసుల = పశువుల; ఎరువు టెరలకున్ = ఎరువులోనున్న పురుగులు మొదలైన ఆహారం కోసం; తిరిగెన్ = తిరుగుతున్నాయి.

వేసవిలో మొసళ్లు పశువుల ఎరువులో ఉన్న పురుగులు మొదలైన వాటిని తినటానికి ఊళ్లలోనికి వస్తే, వాటిని ఉడుములను కొని కుక్కలు పెద్దగా అరుస్తూ తరుముకుంటూ పోతే అవి బావుల్లో దూకాయి. ఈ విషయం నేటి మన అనుభవంలో లేదు. బహుశా రాయలసీమ రైతు కిలాంటి అనుభవా లుండవచ్చు. ఏమైనా రాయలవారు ఇలాంటి అద్భుత విషయాలు చెప్పడంలో గొప్ప నేర్పరి.

మలుగు మీన్ = ఆపేరుగల చేప; బొరియ దూరెన్ = తొర్రలో దూరినది. నీటి తడి కోసం లోతైన ప్రదేశాలలోకి వెళ్లి పోయినది.

అలం : స్వభావోక్తి.

విశే॥ ఈ వర్ణన తెలుగు సాహిత్యంలో ఆశ్చర్యకరమైనది. ఒక ఆంగ్ల కవి నత్తగుల్ల నడకను వర్ణిస్తే ఒక విమర్శకుడు అన్నాడు.'' ఇంత అద్భుతమైన వర్ణన చేయటానికి ఆ కవికి నత్తగుల్ల మీద ఎంత ప్రేమో?'' అని. అలాగే ఈ పద్యంలోని అద్భుత వర్ణన చేయడాని కెంతగా ప్రకృతి దర్శనం చేశాడో కాని మన కొక అందమైన వర్ణనను అనుగ్రహించాడు మహాకవి.

నులుగు మీన్ = క్రింది పద్యంలో చెప్పబడ్డ బొమ్మిడాయ అన్న అర్థంలో పాములాగా పొడవుగా ఉండే చేప అని వేదం వారు.

ఉ. మీటగు మీల నెల్ల మును మ్రింగి క్రమంబున నై న నెండపె
న్బీటిక వెంటఁ దోఁచు తొగ వేరు బడి న్గొడుపై చెలంగఁగాఁ
ద్రోటికఁ గర్దమద్రవముతోనె నశించిన బొమ్మిడాయడా
త్కూట కులంబులం దినె, బకోటకులం బజల హ్రదంబునన్. 54

బకోట కులంబు = పెద్ద కొంగల గుంపు; అజల = నీళ్ల లేని; హ్రదంబులన్ = చెరువుల్లో; మును = ముందుగా; మీటు + అగు = పెద్దవైన; మీలను + ఎల్లన్ = చేపలనన్నింటిని; మ్రింగి = కడుపార తిని; క్రమంబునన్ = క్రమంగా; ఐన = ఐనట్టి; (ఆనెన్ = తిన్నవి అని పాఠాంతరం) ఎండ = ఎండలకు (ఏర్పడ్డ); పెన్ = పెద్ద; బీటిక వెంటన్ = పగులు తోపాటుగా;తోచు = కనబడే; తొగవేరు బడిన్ = కలువ వేరు వెంబడిగా; కొడుపు + ఐ = గ్రుచ్చిన కర్రపుల్లగా; చెలంగగాన్ = ఒప్పుతూ ఉండగా; కర్దమ ద్రవముతోన్= బురదతడితో పాటు; నశించిన = చచ్చిపోయిన;(వెనయించిన - కలిసిన పాఠాంతరం) బొమ్మిడాయ = పాములాగా పొడవుగా ఉండే చేప, డాత్కూట = ముల్లు చేపలయొక్క; కులంబులన్ = గుంపును; త్రోటికన్ = ముక్కుతో; తినెన్ = తిన్నది. (కులంపులేజెనన్ లేతగ్రుడ్లగుంపు - పాఠాంతరం)

తా॥ కొంగల గుంపులు నీళ్ల లేని చెరువుల్లో దిగి చేపలను వేటాడుతున్నాయి. ముందుగా నోటి కందిన పెద్ద పెద్ద చేపలను కడుపార భుజించాయి. క్రమంగా ఎండలు ముదిరే సరికి చెరువుల్లో బురద కూడా నెర్రెలు పారింది. ఆ నెర్రెలలో కలువ వేర్లు నీటి కోసం అడుగునకు పోయాయి. వాటి ప్రక్కనే బొమ్మిడాయ అన్న చేపలు గుచ్చబడ్డ పుల్లల్లాగా ఉన్నాయి. అవి కూడా నీటికోసం కలువ వేళ్లతో పాటు నెర్రెలలో నుండి లోపలకు పోతూంటే క్రమక్రమంగా తడి ఆరిపోయి బురద బిగుసుకు పోయింది. అందులో చిక్కుకొని బొమ్మిడాయలు, చిన్న చిన్న చేపపక్కెలు చచ్చిపోతే ఈ కొంగలు తమ ముక్కులను లోపలకంటా గ్రుచ్చి తింటున్నాయి.

అలం: అద్భుత స్వభావోక్తి. బొమ్మడాయ బొమ్మిడాయగా లోకంలో ఉచ్చరింపబడుతుంది. అది చాల రుచిగల చేప. కనుకనే కొంగ అది ఎండిపోయినా దానిని వదిలిపెట్టలేదు. ఆ చేపముక్కు ముల్లులా ఉంది. కనుక కోసుగా చెక్కబడ్డ వెదురు పుల్లలాగా ఉన్నది అనడం చాలా అందమైన ఉపమానం.

శా. ప్రాతర్వేళల నట్టి వెట్ట సొగసై పాటిల్లెఁ గుంభోంభనో
ద్భూతాంబు ధ్వని వాద్యమై మరుదధః పుంజీ భవత్పాటల

ప్రాతామ్రేడిత సిక్త భూసురభిళారామాంబు కుల్యాబహు
స్రోతస్సంధుల సంధుయంత్ర నతికృత్ ప్రోద్గీత గేయౌఘముల్. 55

అట్టి వెట్టన్ = అట్టి బెట్టిదమైన ఎండాకాలంలో; ప్రాతర్వేళలన్ = ప్రాతః కాలాల్లో; మరుత్= గాలికి; అధః= క్రింది పాదులలో; పుంజీభవత్ = గుట్టలుగా అవుతున్న; రెట్టింపుగా; సిక్త = తడుపబడిన; భూ = నేలచేత; సురభిళ = వాసనగల; ఆరామ = తోటలయొక్క; అంబు కుల్య = నీటి కాల్వలయొక్క; బహు= అనేకములైన; స్రోతః = నీటికాల్వల యొక్క; సంధులన్ = మధ్యలో; అంధు = బావులయొక్క; యంత్ర= ఏతములను; నతికృత్ = కాలితో క్రిందకు త్రొక్కే వారిచేత; ప్ర+ ఉత్+ గీత = ప్రోద్గీత = మిక్కిలి గొంతెత్తి పాడిన; గేయ = పాటలయొక్క; ఓఘముల్= సమూహములు; కుంభ = ఏతపు బానలయొక్క; ఉంభన = ముంచటం వల్ల; ఉద్భూత = పుట్టిన; అంబుధ్వని = నీటి చప్పుడు; వాద్యము+ ఐ = మద్దెల వాద్యం కాగా; సొగసై = అధిక మనోహరమై; పాటిల్లెన్ = చెన్నారినవి.

తా॥ అంత నడివేసవిలో కూడా తెల్లవారు ఝాము వేళలు చాలా అందంగా ఉన్నాయట. ఎందుకంటే తోటల్లో ఏతపు కొయ్యలను త్రొక్కుతూ తోటమాలులు, జానపదులు గీతా లాలపిస్తున్నారు. వారి పాటకు నీటిలో మునిగే కుండ భుంభుమ్మని ధ్వని చేస్తుంటే జానపద వాద్యమైన గుమ్మెట మ్రోగినట్లున్నది. ఆ జానపదగేయానికి ఈ మాధుర్యాన్ని రెట్టింపు చేసేది మరొకటి ఉన్నది. అదేమంటే పాటలీ వృక్షాల క్రింద పాదులలో రాత్రికి రాలిన పువ్వులు గాలికి గుట్టలుగా పేరుకొనియున్నాయి. మడవలలో నుండి నీరు ప్రవహిస్తుంటే తడిసిన నేలవాసనను రెట్టిస్తూ ఈ పూలవాసనలు ఏసరేగుతున్నవి. ఈ వాసనలు, వారిపాటలు, ఏతపు బాన చేసే వాద్యధ్వనులు అన్నీకలిసి వేసవికాలంలో ప్రాతఃకాలాలను సొగసుగా చేస్తున్నవి. ఇలాంటి అందాలను చూడడానికి మనం పల్లెలకు పోవాలి. మన ప్రాచీన సాహిత్యమంతా పల్లీ శోభనుంచి వికసించిందే. ఇక్కడ ఆ పల్లెలలోని తోటల్లో తెల్లవారు ఝామున జరిగే ఒకానొక సుందర దృశ్యం. అద్భుత స్వభావోక్తిగా సంఘటింపబడినది. శ్రమలో ఈ సౌందర్యాన్ని దర్శించినవాడే మనిషి. సుఖపడటమంటే కూర్చొని తినడం కాదు. అందంగా శ్రమించడం. శ్రమలో సౌందర్యాన్ని చూడడం.

కాళిదాసు శాకుంతలంలో వేసవిలో సాయంకాలాలు అందంగా ఉన్నాయని అన్నాడు.

తే. మెండు మీఱిన పగఁటిబీఱెండ దాకి
యొల్లఁబోయిన లేఁబొండు మల్లెపొదల
తుదల ( జప్పటలై కడు దొడ్డలగుచుఁ
బొడమె మొగ్గలగము లగ్గి బొబ్బలట్ల. 56

మెండు మీఱిన = మిక్కిలి అతిశయించిన; పగటి బీఱెండ = పగటిపూట మిడిసి పడే ఎండ; తాకి = తగిలినందున; ఒల్లబోయిన = సొమ్మసిల్లిపడిన; లేబొండుమల్లెపొదలన్= లేతలైన బొండుమల్లెపొదలయొక్క; తుదలన్ = చివళ్లపై; అగ్గిబొబ్బలట్లు = కాలితే కలిగే బొబ్బల్లాగా;

మొగ్గలగములు = బొండు మల్లెల మొగ్గల గుంపు; చప్పటలై = కాంతిలేక అణగినవై; కడు = మిక్కిలి; దొడ్డలగుచున్ = పెద్దవౌతూ; పొడమెన్ = పుట్టినవి.

తా ॥ ఆ వేసవి కాలంలో పగటిపూట ఎండలకు తాళలేక బొండు మల్లెల పొదల చివళ్లపై మల్లెమొగ్గలు అగ్గి బొబ్బల్లాగా కనిపిస్తున్నవి. బొబ్బ ఏవిధంగా నిక్కబొడుచు కోకుండా అణగియుంటుందో అదే విధంగా మల్లె మొగ్గలు కూడా చివళ్లు చప్పగిల్లిపుడుతున్నవి.

అలం : ఉపమ

బొండు మల్లె మొగ్గలు అగ్గి బొబ్బల్లాగా ఉన్నాయనడంలో సాదృశ్య సౌందర్యం పట్టరానిదిగా కనిపిస్తున్నది.

మ. సుడి నాభి చ్ఛలన, స్సరోజములు చక్షుః ప్రక్రియ, న్నాఁచు క్రొ
మ్ముడి దంభంబున ఁ,, జక్రఫేన పటలంబు ల్చన్నులు న్నవ్వుగా
నడరం జేసి నిదాఘ భీతి సలిలంబాగామి బీజార్థమై
కడవం బెట్టిన వారి దేవతలు నాఁగాంతాళి యొప్పెన్ ప్రపన్. 57

దీనితో పాటుగా క్రిందిపద్యంలోను చలిపందిళ్లు, అక్కడ నీరు పోసె ప్రపాకాంతలు వర్ణింపబడుతున్నారు.

ప్రపన్ = చలిపందిళ్లలో; కాంతా+ ఆళి = అందమైన స్త్రీల సమూహం; సుడి = ప్రవాహంలో సుడి; నాభిచ్ఛలన్ = పొక్కిలి అన్న మిషతో; సరోజములు = తామర పూలు; చక్షుః ప్రక్రియన్ = నేత్రప్రకారముగా; నాచు = ప్రాకుడు; క్రొమ్ముడి = కొప్పునెడి; దంభమునన్ = వ్యాజంతో; చక్ర = చక్రవాక పక్షులయొక్క; ఫేన = నురుగుయొక్క; పటలంబుల్ = గుంపులు; చన్నులున్ = స్తనములు; నవ్వున్ = నవ్వులు; కాన్ = కాగా; అడరన్+చేసి = చక్కగా అమరించి; నిదాఘభీతిన్ = వేసవి భయంతో; ఆగామి = రాబోయే కాలంలో; బీజార్థమై = విత్తనాలకోసం; సలిలంబు = నీటిని; కడవన్ = కుండలో; పట్టి = నింపిన; వారి దేవతలు = జలదేవతలో; నాన్ = అన్నట్లుగా; ఒప్పెన్ = శోభించాయి.

తా ॥ చలువ పందిళ్లలో నీళ్లు పోసేస్త్రీలు జలదేవతల్లాగా ఉన్నారు. అందుకనే వారు కాంతలు = అందమైనవారు. ప్రవాహంలో సుడులే యిక్కడ నాభులు. అక్కడ సరోజములే నేత్రాలు. అక్కడ నాచు ఇక్కడ క్రొమ్ముడి. అక్కడ ఉన్న చక్రవాకాలే వక్షోజాలు. అక్కడి నురుగు గుత్తులే ఇక్కడ నవ్వులుగా పరిణమింప చేసి విధాత, రాబోయే కాలంకోసం రైతు విత్తనాలను దాచుకున్నట్లు బ్రహ్మకూడా జల దేవతలను ఈ ప్రపాకాంతలుగా చేసి నీటిని చలువ పందిళ్లలో బానలలో భద్రపెట్టుకున్నాడు. పూర్వకాలంలో ధాన్యాన్ని పెద్ద పెద్ద బానలలో నిలువ చేసుకొనేవారు.

అలం : సాపహ్నవోత్ప్రేక్ష.

ఈ ప్రపావర్ణనలు ప్రాచీన సాహిత్యంలో అక్కడక్కడా కనిపిస్తాయి. కాని యీ వర్ణన సాటిలేనిది.

ఆ చలువ పందిళ్లు నదీ ప్రవాహాలలో మునిగితే ఎంతచల్లగా ఉంటాయో అంత చల్లగా ఉన్నాయని భావం. అక్కడున్న స్త్రీలు శరీర సౌందర్యం కలవారే కాక మానసిక సౌందర్యం కలవారు కనుకనే జలదేవతలుగా వర్ణింపబడటం జరిగింది. ఎండల్లో దాహంతో వచ్చే పాంథులకు వారు దయతో నీరు పోస్తున్నారు తప్ప నేటి ఉద్యోగిలాగా కేవల విధి నిర్వహణ చేయడం లేదు. దాన్ని ధ్వనించే శబ్దం నవ్వు. వారు పాంథులను ప్రేమతో నవ్వుతూ ఆదరిస్తున్నారు. బాటసారి మానసికంగా, దైహికంగా సేద తీరుతున్నాడు.

సీ. సెగ కుల్కి మఱుఁగు c జొచ్చిన జహ్నురవిజ ల
సరణి మల్లెలతోడి జడలు మెఱయ;
వలి చన్నుకొమరు ముచ్చిలిన దిమ్మను తెఱం
గున ముంచు గరిగ కాఁగుల మునుంగ,
ధార లోఁ దోc చు కన్దళుకులు వాసితో
త్పల పత్త్ర పతన సంభ్రాంతి నొసఁగ,
దెలిమోము పస మెచ్చి తలయూఁచు టెఱఁగిమా
నక నవ్వు నేర్పు డెందముల c గరఁపc

తే. గీ. దెఱవ లిటు నీరు వోయు పందిరియ చేరి
యువల c గొఱగాక పిచ్చు గుంటై యనంగుc
డనుపు గొనc జొచ్చె c గల్లగుట్ట మర వారి
కధ్వగులు లాఁచి యిడు విడియముల పేర. 58

సెగకున్ = వేడికి; ఉల్కి = జంకి; మఱుగు చొచ్చిన = చాటున దాగిన; జహ్ను = ఆ పేరు గల మునివల్ల; జ = పుట్టినది గంగానది; రవిజ = సూర్యుని కుమార్తె యమునానది; సరణిన్ = పద్ధతిగా; మల్లెలతోడి జడలు = మల్లెపూలు పెట్టుకొన్న జడలు; మెఱయన్= ప్రకాశింపగా,

చలువ పందిళ్లలో నీరు పోసే యువతుల జడలలో మల్లెపూలు తురుము కున్నారు. ఆ జడ ప్రతిపాయలోను మల్లెల దండ అల్లబడియున్నది. దీన్ని పూలజడ అంటారు. ఇదెలా ఉన్నదంటే తెల్లని గంగానది, నల్లని యమునానది ఎండలకు భయపడి వారి శరణును జొచ్చినవో అన్నట్లున్నవి. నల్లని జడ రవిజ, మల్లెదండ జహ్నుజ.

అలం : ఉత్ప్రేక్ష.

వలి = చల్లదనం కల గుండ్రని; చన్ను = స్తనముయొక్క; కొమరు = అందం; ముచ్చిలినది = దొంగిలించిన దానిని; ఇమ్ము; అను తెఱంగునన్ = అన్న విధంగా; ముంచు గరిగ = నీళ్లు పోయడానికి యువతులు కుండలలో ముంచే ముంత; కాగులన్ = బానలయందు; మునుంగన్ = మునుగుతుండగా

బానలు వలి చన్ను కొమరును దొంగిలించి లోపల దాచుకున్నవి. దానిని శోధిస్తున్నదో అన్నట్లు

గరిగె మునుగుతున్నది. వలిశబ్దానికి చల్లదనము, వస్త్రువదనం రెండర్థాలు చెప్పాలి. ఎందుచేతనంటే వేసవిలో బావినీరు, మర్రినీడ, తాంబూలం, తరుణీస్తనం చల్లగా ఉంటాయని అవే శీతకాలంలో వేడిగా ఉంటాయని అనుభవజ్ఞుల మాట. కనుక ఈ రెండర్థాలు ప్రస్తుతోపయోగులే.

ధారలోన్ = బాట సారులకు పోస్తున్న నీటి ధారలో; తోచు = కనిపించే; కన్ + తళుకులు= కన్నుల తళతళలు; వాసిత = పరిమళంకోసం వేసిన; ఉత్పలపత్ర = కలువరేకులయొక్క; పతన = పడుటయొక్క; సంభ్రాంతి నొసగన్ = భ్రాంతి కలిగిస్తుండగా

బాటసారులకు వనితలు నీరు పోస్తున్నారు. వారు దోసిళ్లతో తాగుతున్నారు. పోసేటపుడు పోసేవారు ధారను చూస్తారు. కనుక చూస్తూ పోస్తారు కనుక ఆ ధారలో వారి కన్నులు ప్రతిబింబించాయి. అవి యెలా ఉన్నాయంటే వాసనకోసం నీటిలో వేసిన కలువపూలరేకులు నీటితో పాటు క్రింద పడుతున్నాయో అన్నట్లుగా భ్రాంతిని కలిగిస్తున్నాయి. వేసవిలో త్రాగే నీళ్లలో వట్టి వేళ్లు మొదలైనవి వేసుకోవడం ప్రాచీన నాగరికత. వాసనకు వాసన, వేడికి చలువదనం కలిగించే లక్షణమున్నందువలన వాటిని వేసుకోవడం భోగుల లక్షణం. త్రాగుతున్నవారు నీరు త్రాగడం తోపాటుగా పోస్తున్న వారి నేత్ర సౌందర్యాన్ని ఆస్వాదిస్తున్నారని భావం. ఈ భావమే తర్వాతి పద్యంగా రాబోతున్నది.

తెలిమోము = ప్రకాశించే ముఖముయొక్క; పసన్ = కాంతిని; మెచ్చి = త్రాగేవారుమెచ్చు కొని; తల ఊచుట = మెప్పుదలకు సూచనగా తలపంకించటం; ఎఱిగి = తెలిసి; మానక= నీరుపోయడం ఆపకుండా; నవ్వునేర్పు = నవ్వడంలోని జాణతనం; డెందములన్ = త్రాగేవారి మనసులను; కరపన్ = కరిగింపగా.

పైభావమే ఈ పాదంలోనూ కొనసాగింపబడింది. జలధారలో ప్రతిబింబించిన వనితల ముఖ సౌందర్యాని ఆస్వాదిస్తూ నీరు చాలన్నట్లు వారు తలవూపారు. ఆ శిరః కంపనం మీరు, మీ ముఖ సౌందర్యం చాలా ఆస్వాదనీయము అన్న భావాన్ని సూచిస్తున్న సంగతి పోసేవారికి తెలిసింది. దానికి వారు కోపగించకుండా చాలా నేర్పుగా నవ్వారట. ఒక సుకుమారమైన శృంగార భావం వ్యంగ్యసుందరమై భాసిస్తున్నది. రాయల వారి రచనలో ఎక్కడా ఇతర ప్రబంధాలలో లాగా శృంగారం మొరటుగా గోచరింపదు. ఒక సుకుమారస్పర్శగా చిత్రింపబడుతున్నది.

అలం : సూక్ష్మము.

తెఱవలు = స్త్రీలు; ఇటు = ఈ విధంగా; నీరు = నీరుపోసే; పందిరి = చలిపందిరినే; చేరి = ప్రవేశించి; అనంగుడు = దేహంలేని మన్మథుడు; అవలన్ = ఇతర ప్రదేశాలలో; కొఱగాక = పనికి రాక; పిచ్చుగుంటు+ ఐ = కుంటివాడై; కల్లగుట్టు = హృదయంలో దాచుకొన్న రహస్యం, లేని అధికారం; అమరన్ = ప్రకాశింపగా, ఉన్నట్లుగా; వారికిన్ = ఆస్త్రీలకు; అధ్వగులు = బాటసారులు; లాచి = ప్రీతితో, ఇడు = ఇచ్చే; విడియముల పేరన్ = తాంబూలపు మిషచేత; అనుపు = సుంకము; కొనక = పుచ్చు కోవడానికి; చొచ్చెన్ = పూనుకొన్నాడు.

ఈ విధంగా స్త్రీలు నీరు పోసే పందిరినే ఆస్థానంగా చెసికొని అనంగుడు ఇతరప్రదేశాలలో కొరగాని వాడైనాడు. ఇక్కడ మాత్రం తన ఏలుబడిని కొన సాగించు కొంటున్నాడు. నీరు పోసిన స్త్రీలకు మెచ్చుకొన్న బాట సారులు తమహృదయ రహస్యాన్ని ప్రకాశింపజేస్తూ ఆస్త్రీలకు తాంబూల మిస్తున్నారు. ఆ తాంబూలాను మన్మథుడు సుంకం తీసుకున్నట్లుగా ఉన్నది.

రాజైన వాడికి ప్రజలు సుంకం చెల్లిస్తారు. ఇక్కడ తాంబూలమే సుంకం. చెల్లిస్తున్నవారు నీరు త్రాగిన బాటసారులు. ఆ బాటసారులు తమ మనస్సులోని ప్రణయ భావాన్ని ప్రకాశింపజేస్తూ తాంబూలం ఇచ్చారు. కృతజ్ఞతగానూ.

అలం : సాపహ్నవోత్ప్రేక్ష

విశే ॥ 62వ పద్యంలో మన్మథునకు వేసవి విడిది స్థలం కాదని చెప్పబడింది. కాని అతనికి కొన్ని రహస్య స్థావరా లున్నాయి. అందులో చలువ పందిరొకటి.

చ. తొడిఁబడ నమ్మలక్కలని తూలుచు దీనత దోయి లొగ్గుచున్
వడ మఱి తేరఁదేర, నలవాక్యము లెన్నక, మోము గుబ్బలున్
గడుకొను కక్షదీప్తులు నెగాదిగఁ గన్గొను చిట్టకంపు ద్రాఁ
గుడుఁగని సన్నలన్నగిరి క్రోల్పక పాంథుఁ బ్రపా ప్రపాలికల్. 59

తొడిబడన్ = తొట్రుపడుతూ; అమ్మలు, అక్కలు అని = అమ్మాలారా! అక్కలారా! అని పిలుస్తూ; తూలుచు = తూగుతూ; దీనతన్ = దైన్యంతో; దోయిలి = దోసిలి; ఒగ్గుచున్ = పడుతూ; వడ = దప్పిక; మఱి తేరతేరన్ = క్రమంగా తేరుకున్న తర్వాత; అలవాక్యముల్ = ఇందాక అన్న అమ్మలు అక్కలు అన్నమాటను; ఎన్నక = గణింపక; మోమున్ = ముఖాన్ని; గుబ్బలున్ = స్తనాలను; కడుకొను = వ్యాపించే; కక్షదీప్తులున్ = బాహుమూల కాంతులను; ఎగాదిగన్ = క్రిందినుండి పైకి; పై నుండి క్రిందికి; ( ఎగువ దిగువ) ; కనను = చూచే; చిట్ట కంపు = మిషగల; త్రాగుడున్ = త్రాగుటను; కని = చూచి; పాంథున్ = బాటసారిని; క్రోల్పక = నీరు త్రాగించక; ప్రపా ప్రపాలికల్ = చలువపందిళ్లలో కాపరులు గానున్న వనితలు, సన్నలన్ = సంజ్ఞలతో; నగిరి = నవ్వారు.

తా॥ బాటసారులు ఎండలో తూలుతూ దైన్యంతో ''అక్కలారా! అమ్మలారా! కొంచెం దాహమిప్పించండి'' అంటూ వచ్చి నీరు త్రాగి సేద తీరాక ఇదివరకన్న మాటలు మరచి పోయి ఆ వనితలయొక్క ముఖస్తన బాహు మూల సౌందర్యాల్ని ఆస్వాదించడం మొదలు పెట్టారు. నీటి నాస్వాదిస్తూ నీరు త్రాగడాన్ని నటిస్తున్నారు. అది చూచిన స్త్రీలు నీరు పోయడమాపి పరస్పరం సంజ్ఞలు చేసుకుంటూ నవ్వారట. చూడవే ఈ మనుష్యుల మనస్తత్వమూ - ప్రవర్తనా - అన్నట్లు.

అలం : సూక్ష్మము. ( క్రోల్పక - కొందఱు - వావిళ్ళపాఠాంతరాలు)

తే. ఎసఁగు కట్టా వి|క్రియ నావి రెగయఁ బగటి
యెండ యుడు కాఱకుండు భూమండలమునఁ
బొలిచె మాపటఁ బండు వెన్నెల చకోర
పోత వితతికిఁ జాపట్టు వోసినట్టు. 60

ఎసగు = విజృంభించే ; కట్టావి|క్రియన్ = పెద్ద ఆవిరివలె; ( ఆవిరి = నేలనుండి పైకి లేచిపోతున్న నీటి ఆవిరి; ) ఎగయన్ = లేస్తుండగా; పగటి యెండ = పగటి ఎండవలని; ఉడుకు = వేడిని; ఆరకుండు = ఆరిపోని; భూమండలమునన్ = భూవలయం మీద; మాపటన్ = రా|త్రులలో; పండు వెన్నెల = తరపి వెన్నెల; చకోర పోత = వెన్నెల పిట్టల పిల్లల యొక్క; వితతికిన్ = గుంపునకు; చాపట్టు = చాపవలె వెడల్పైన దోసెను; పోసినట్లు= పోసిన విధంగా; పొల్చెన్ = అందగించినది.

తా ॥ రా|త్రి యయిన పగటిపూట ఆవిరులు |క్కిన భూమి వేడి చల్లారనే లేదు. ఆ వేడి నేలపైన తరపి వెన్నెల పడింది. అయినా చల్లదనానికి బదులుగా వేడినే వెలి|గక్కింది. ఇది ఎలా ఉందంటే వేడి పెనం మీద చాపట్టు పోసినపుడు పెనం ఆవిరులు కక్కినట్లుగా వున్నది. |ప్రకృతి మాత చకోర పక్షుల పిల్లలకు తరపి వెన్నెలను వేడినేల అన్న పెనం మీద చాపట్టు పోసినట్లున్నది.

అలం : వస్తూత్ప్రేక్ష.

సీ. పవలెల్ల దీర్ఘికాంబువు చల్లుపోరాట;
నలసి మృణాళికా జడములైన
బాహువుల్ తమదు కూర్పరముల కెదురుగా;
మలచి మూఁపులఁగరతలము లునిచి;
|ప్రాల్మాలి మిగుల నార్పని కమ్మ|క్రొమ్ముడిఁ;
దని మొగ్గ విరవాది దండ విరియ;
ధౌత గంధామోది శీతల స్తనములు;
వొందఁ గౌగిళ్లతో బోరగిల్లి,

తే. గీ. నారి కేళాసవపుఁ దీపుటూరు పొలయ,
వలిపె యొంటొల్లెతో నురస్థ్సలులఁ గూర్కు
|ప్రియుల వేకువఁ దొడ లెచ్చరించి కలసి
రెలమి ధన్యులు దఱపి వెన్నెల బయళ్ల. 61

పవలెల్లన్ = పగలంతా; దీర్ఘిక = దిగుడు బావులయొక్క; అంబువు = నీటిని; చల్లు = ఒకరిపై ఒకరు చల్లుకునే; పోరాటన్ = కలహంలో; అలసి = డస్సిపోయి; మృణాళికి = తామర తూడల వలె; జడములు= చల్లనివి; అలసిపోయినవి అయిన; బాహువుల్= చేతులను; తమదు = (పద్యాంతంలో చెప్పబడే ధన్యులైన)

తమయొక్క; కూర్పరములకు=మో చేతులకు; ఎదురుగాన్ = ఎదురయ్యే టట్లుగా; మలఁచి = మడచి, మూపులన్ = భుజాగ్రాలపై; కరతలముల్ = అరచేతులను; ఉనిచి = ఉంచి.

దంపతులిద్దరూ పగలంతా ఎండవేడిని పోగొట్టడంకోసం దిగుడు బావులలో స్నానమాడుతూ పరస్పరం నీళ్లు చల్లుకుంటున్నారు. ఈ జల క్రీడలతో అలసి పోయి దీర్ఘికలోని తామర తూడుల్లాగా అలసి పోయిన తమ చల్లని బాహువులను ప్రియులయొక్క మోచేతులకు క్రిందుగా దూర్చి వారి భుజాగ్రాలను అరచేతులను వేసి పండుకొన్నారు. (ప్రియులయొక్క ఉరఃస్థలములపై నిదుర పోతున్నారు.)

ప్రాల్మాలి = బద్ధకించి; మిగులన్ = మిక్కిలి; ఆర్పని = తడి ఆర్పుకోని; కమ్మక్రొమ్ముడి = కమ్మని వాసనగల కొప్పులో; తని మొగ్గ = సన్నని మొగ్గలైన; విరవాది=విరజాజుల; దండ = మాల; విరియన్ = వికసింపగా

జలక్రీడలతో అలసిపోయినందువల్ల సంపంగిమానె రాసుకొన్న జడముడి తడిసి పోయిన దానిని సరిగా ఆర్పుకోకుండానే విరజాజి మొగ్గల సన్నని దండను తలలో పెట్టుకొని అలాగే ప్రియుల వక్షఃస్థలాలపై బోరగిలి పడుకున్నారు. అర్ధమ రేతిరికి ఆ సన్నజాజి దండ విచ్చుకున్నది.

ధౌత = క్షాళింపబడ్డ; గంధ = వాసనకలవైన; ఆమోది = పరిమళిస్తున్న; శీతల= చల్లని; స్తనములు; పొందన్ = పొందేటట్లుగా; కౌగిళ్లతో; బోరగిల్లి = బోర్లాపడుకొని;

ప్రియురాండ్ర స్తనాలు వివిధ పరిమళ ద్రవ్యాలు పూయబడ్డవి. దిగుడు బావులలో ఈదులాడుతున్నపుడు అవి క్షాళితములైనా వాసనలు మాత్రం పోలేదు. అలాంటి స్తనాలతో ప్రియుల ఉరఃస్థలాలపై బోర్లాపడుకున్నారు.

నారికేళ = కొబ్బరి చెట్లయొక్క; ఆ సవపు = మద్యముయొక్క; తీపుటూరుపు= తీయని ఊర్పుగాలి; వలయన్ = వ్యాపించగా; వలిపె = సన్నని; ఒంటి వల్లెతోన్ = ఒకే చీరతో; ఉరస్స్థలులన్ = గుండెలపై, కూర్కు ప్రియలన్ = నిదురించే ప్రియురాండ్రను; వేకువన్ = తెల్లవారుఝామున; తొడలు= తొడలతో; హెచ్చరించి = హెచ్చరించి; ఎలమిన్=సంతోషంతో; తఱపి వెన్నెల బయళ్ళన్ = దట్టమైన వెన్నెలకాసే బాహ్య ప్రదేశాలలో; ధన్యులు = కృతార్థులైన భోగులు; కలిసిరి = కూడిరి.

కొబ్బరి చెట్లనుండి తీసిన మద్యం త్రాగినందువల్ల ఆ తీపి వాసనే నిట్టూర్పునుండి బహిర్గమిస్తున్నది. సన్నని ఒంటి వస్త్రంతో ఎదలపై బోరగిలి పడుకున్న ప్రియురాండ్రను ప్రియుడు తమ ఊరువులను కదిలించి నిద్రించే తరపి వెన్నెల బయళ్లలో మహాసంతోషంతో కలిసారు. అందుకని అదృష్టవంతులు

అలం : స్వభావోక్తి.

వేసవిలో ఆరుబయట పడు కోవడం మన కలవాటు. కనుక బయళ్లు అని చెప్పబడింది. పగలంతా జలక్రీడలతో అలసిపోయిన స్త్రీలు నాయికలు. పురుషులు నాయకులు. వారి శృంగార చేష్టా మాధుర్యం

ఈ పద్యంలో అద్భుతంగా వర్ణింపబడింది. సంభోగ శృంగార మాధుర్యాన్ని ఇలా సుకుమారంగా వర్ణించిన ఘట్టాలు సాహిత్యంలో చాలా అరుదు. అందమైన వర్ణనల్లో అందమైన వర్ణన. కేవలం భావలోకం కాదు. కేవలలోకం కాదు. రెంటి సంధి.

చ. హృదయము లెప్పుడున్ గదియకే తఱచౌ వెడ కౌగిలింతలున్
గదిరెడు మేలు కార్యములఁ గల్గక మాటలయందె కల్గుపె
న్జదురులు వట్టి శైత్యములుఁజాల ఘనంబయి మండు వేసవిన్
బొదలఁగ నిల్చె దంపతుల పొందులనార్యుల పొందు కైవడిన్. 62

దంపతులపొందు = భార్యాభర్తల కలయికను; మండువేసవిన్ = మండే వేసవి కాలంలో; హృదయములు = వక్షఃస్థలాలు (ప్రేమలు); ఎప్పుడున్ = నిత్యమూ; కదియకే= అంటుకోకుండానే; తఱచు+ఔ = తరిగిపోయినవైనట్టి; వెడ = తడిలేని; అనార్ద్రమైన; కౌగిలింతలున్ = కౌగిలించుకోవటాలు, కదిరెడు = సమీపించిన; మేలుకార్యములన్ = మంచిపనులలో (కలయికలలో); కల్గక = సంభవింపక, మాటలయందె = మాటలలో మాత్రమే; కల్గు = సంభవించే, పెన్ = పెద్ద; చదురులున్ = నేర్పులు (వట్టిమాటలు); వట్టి శైత్యములున్ = వ్యర్థమైన చలువలు (పనికిరాని తీయని మాటలు); చాలన్ = మిక్కిలి, ఘనంబయి = ఎక్కువై; పొదలగన్ = పెంపొందగ; అనార్యుల = దుర్జనులయొక్క; పొందు = స్నేహం; కైవడిన్ = వలె.; నిల్చెను.

తీవ్రమైన ఆ వేసవికాలంలో దంపతుల సమాగమాలు చెడ్డవారి స్నేహంలాగా ఉన్నాయి. చెడ్డవారి స్నేహంలో హృదయ స్పర్శలు లేని కౌగిలింతలు. కలిగే మంచి పనులేమి లేకపోయిన మాటలలో మాత్రం తీయదనం, నేర్పు ఉంటుంది. అలాగే దంపతుల సమాగమాలు కూడా హృదయాలు తాకని కౌగిలింతలతో సమాగమం దాకా పోకుండానే నేర్పుగా, తీయగా మాటలు చెప్పుకోవడంతో వేసవిరాత్రులు గడచిపోతున్నవి. పై వర్ణన ఆ వేసవిలో వెన్నెల వంటిది.

అలం : ఉపమ.

ఉ. తీలగు కంతువెంబడినె తెమ్మెరలున్ రవి దీప్తికల్కిపా
తాళముఁ బట్టుచుండఁ దమతావులు ముచ్చిలఁ బట్టి యోషధీ
పాలున కప్పగించె ననఁబై సురభి శ్వసనంబు నించెఁ గాం
తాలసవక్త్ర సీమ విటులార్చు నుశీరపుఁ దాళవృంతముల్. 63

విటులు = పల్లవులు; కాంత = ప్రియురాండ్రయొక్క; అలస = శ్రమతో కూడిన; వక్త్రసీమన్ = ముఖస్థలంపై; ఆర్చు = విసరుతున్న; ఉశీరపు = వట్టివేళ్ల; తాళవృంతముల్= విసనకర్రలు (మొవ్వ తాటాకుతో కట్టబడినది); తీలు+అగు = బలహీనపడ్డ; కంతు వెంబడినె = మన్మథునితో పాటుగానే; తెమ్మెరలున్ = చల్లనిగాలులు (తెన్ దక్షిణము నుండి వీచే, మెర = గాలి) మలయపవనం; రవిదీప్తికిన్ =

సూర్యుని కాంతికి; అళ్కి = భయపడి; పాతాళము పట్టుచుండన్ = పాతాళలోకానికి పోతూ ఉండగా; తను తావులు, ఆ వట్టివేళ్ల వాసనలను; (ముచ్చిలన్ = దొంగిలించినందుకు; పట్టి = ఆ తెమ్మెరలను బంధించి, ఓషధీపాలునకున్ = ఓషధులకు అధిపతియైన చంద్రునకు; అప్పగించెననన్= లప్పగించెనన్నట్లుగా; పైన్ = మీద; సురభిశ్వసనంబు = వాసన గాలిని;; నించెన్ = నింపెను.

తా॥ వేసవిలో మన్మథుడు తన పరాక్రమాన్ని కోల్పోయి అణగారి పోగా అతని సైదోడు అయిన మలయ పవనం కూడా ఎండలకు భయపడి పాతాళమంటినది. అలాపోతున్న గాలిని విటులు అలసిపోయిన ప్రియురాళ్ల ముఖాలపై స్వేదజలాన్ని పోగొట్టడానికి వీస్తున్న వట్టివేళ్ల విసనకర్రలు - పట్టుకొని తను వాసనలను దొంగిలించి పారిపోతున్న ఆ గాలులను బంధించి ఓషధులైన తమయొక్క దొరయైన చంద్రునకు అప్పగిస్తున్నావో అన్నట్లుగా ఉన్నాయి.

అలం : ఉత్ప్రేక్ష.

విశే॥ వేసవిలో మన్మథునకు తావులేదని పై పద్యంలోనే చెప్పబడింది కాని విటీవిటుల సమాగమాలు జరుగుతునే ఉన్నాయి. ప్రియురాలి అలసిపోయిన ముఖమున్నమాటతో జరిగిపోయిన పొందు చెప్పబడినట్లయినది. ఆ ముఖసీమపై అలముకొన్న అలసటను పోగొట్టడానికి, విటుల వట్టివేళ్ల విసన కర్రలు విసరుతున్నారు. వేసవిలో కాంతిలేని జాబిల్లివంటి కాంతముఖసీమ బడలిపోయిన చంద్రబింబం లాగా అలసిపోయి ఉన్నది.

వట్టివేళ్లు వాసన కలవి కనుక దాని మీద నీళ్లు చల్లి విసురుతున్నపుడు చల్లని వాసన గాలి వస్తుంది. అదే మలయపవనకార్యం తీరుస్తున్నది. ఈ ఊహ కల్పన చాలాక్లిష్టమైనది. సామాన్యంగా రాయలవారి ఊహలలో మాధుర్యం, కార్కశ్యం రెండూ ఉంటాయి. అది చక్రవర్తి సౌందర్యం లాంటింది. అతని తేజస్సు ఎంత ఆకర్షణీయమో అంత భయానకం కూడా. ఈ లక్షణమే రాయలవారి ఊహలలో కనిపిస్తుంది

చ. సమసి కథావశిష్టమగు చందనశైల సమీరణంబుఁ గృ
త్రిమగతి నింద్రజాలమునఁ దేఁదొడఁగెన్ భువిఁ దాల వృంతజా
లము; లది మాయ యౌటకుఁ దలంప దదీయ మయూరపింఛికా
భ్రమణమె సాక్షి గాదె, నగరంబున నట్టి కడింది వేసవిన్. 64

నగరంబునన్ = మధురానగరంలో; అట్టి కడింది వేసవిన్ = అలాంటి భయంకరమైన వేసవి కాలంలో; సమసి = అణగారి; కథ+అవశిష్ట = కథమాత్రమే మిగిలిన; అగు; చందనశైల = గంధపు కొండనుండి వీచే; సమీరణంబుల్ = గాలులు; తాళవృంత జాలముల్= విసన కర్రలగుంపు; భువిన్; భూమిపై; ఇంద్రజాలమునన్ = కనుకట్టు విద్యతో; కృత్రిమగతిన్ = కృత్రిమవిధంగా; తేన్+తొడగెన్ = తేవడానికి మొదలు పెట్టినది; అది = ఆ గాలిని తీసుకురావడం; మాయ అవుటకున్ = మాయ కావడానికి; తలంపన్= ఆలోచిస్తే; తదీయ = ఆ విసన కర్రలకు సంబంధించిన; మయూరపింఛికా = నెమలిపింఛం; భ్రమణమె = తిరగడమె; సాక్షి గాదె = సాక్ష్యం కదా!

తా॥ ఆ మధురానగరంలో వేసవి ప్రభావంతో మలయపవనం సమసి పోయింది. కనుక దానిని కృత్రిమంగా కనుకట్టు విద్యతో విసనకర్రలు భూమికి తీసుకురావడం ప్రారంభించాయి. అలా తేవటం మాయ అనడానికి ఆ విసనకర్రలైన నెమలిపింఛమే తార్కాణం కదా !

పై పద్యంలో వట్టివేళ్ల విసనకర్రలు చెప్పబడ్డవి. ఈ పద్యంలో నెమలిపింఛంతో తయారైన విసనకర్రలతో జనం వీచుకుంటే వచ్చేగాలిని కవి యీ విధంగా ఉత్ప్రేక్షించాడు. ఇంద్రజాలంలో నెమలిపింఛాలతో కనుకట్టు కలిగించడం సహజమైన విషయం.

తే. అట్టి వేసవి బెడదంపు వెట్టకతన
హస్తము సెమర్చి సారెకు లస్తకంబు
దుసికిలఁగఁ గాదె సవరింప వసము గాక
పుష్పబాణుని చెఱకు విల్పుడమిఁ బడియె. 65

అట్టి వేసవిన్ = ఆ భయంకరమైన వేసవియొక్క; బెడిదంబు = కఠినమైన; వెట్ట= వేడి; వలనన్= వల్ల; హస్తము = చేయి; చెమర్చి = చెమరించి; సారెకున్ = మాటిమాటికి; లస్తకంబు = పిడికిలితో విల్లు పట్టుకొనే చోటు; దుసికిలన్ కాదె = జారి పోయినందు వల్ల కదా! సవరింపక = చేతిలో నిలుపు కోవడానికి; వసముగాక = శక్యముగాక; పుష్పబాణుని = పూలే బాణాలుగా గల మన్మథుని; చెఱకువిల్లు = ఇక్షుధనుస్సు; పుడమిన్= భూమిపై; పడియెన్ = పడ్డది.

తా॥ వేసవిలో చెఱుకు నాటటం సహజం. అది యీ విధంగా ఉత్ప్రేక్షించ బడుతున్నది. వేసవికాలంలో అరచేయి చెమరించినందువల్ల మన్మథుని చేతిలో చెఱకు విల్లు నిలువడం లేదు. అతడు పట్టు కోవడానికి ఎంత ప్రయత్నించినా భూమిపై పడనే పడ్డది. వేసవిలో మరునకు తావు లేదనటం తాత్పర్యం.

అలం : హేతూత్ప్రేక్ష.

మ. తరుణుల్దల్లి యొఱన్కుచంబు లునుపం దచ్ఛైత్యము ల్దీములై
పెరరేపం జనుదెంచె ఁగాక! రవిదీప్తిం గ్రుంగి పాతాళగ
హ్వరముల్ దూఱిన వారి నీ యదుకు ఁ ద్రాళ్లా లెచ్చు? నాదీర్ఘత
చ్ఛిర కృష్టింగను నీటి శైత్య మలరించె న్నూతులందత్తఱిన్. 66

ఆ తఱిన్ = వేసవిలో (తఱి = సమయం లేదా కాలం); నూతులందున్ = బావుల్లో; తరుణుల్ = యౌవన వతులు; తల్లి యొఱన్ = తల్లి ఒఱమీదఁపై ఒఱను తల్లి ఒఱ అనడం నేటి వ్యవహారంలో ఉంది); కుచంబులు = స్తనాలు; ఉనుపన్ = ఉంచగా; తత్+శైత్యముల్ = వాటియందున్న చలువలు; దీములు = ఆకర్షించే పక్షులు (వేటకాండ్రు ఆయా మృగ పక్షులను వేటాడటానికి పెంచుకొనే ఆయాజాతి మృగ పక్షులు వీటిని ప్రయోగించి అడవిలో మృగ పక్షులను ఆకర్షిస్తారు); ఐ; పెరరేపన్ = ప్రేరేపించగా; (ప్రేరేపగా అంటేనే చాలు. దాని మీద ఇంచుక్ ప్రత్యయం చేర్చనక్కర లేదు. కాని వ్యవహారంలో అలాగే

ఉంది ) చనుదెంచెన్ గాక = వచ్చాయి గాని; రవి దీప్తిన్ = సూర్యుని ప్రతాపానికి; క్రుంగి = అణగారి; పాతాళ గహ్వరముల్ = పాతాళ లోకంలోని గుహలలోనికి; దూఱిన= ప్రవేశించిన; వారిని = నీటిని; ఈ అదుకు త్రాళ్లా తెచ్చున్ = అనేకం ముడులు వేసిన ఈ త్రాళ్లా తెచ్చేది? నాన్ = అన్నట్లుగా; దీర్ఘ = పొడవులై; తత్ = ఆ చేత్రాళ్లయొక్క; చిర = ఎక్కువకాలం; కృష్టిన్ = లాగుటను; కను = పొందిన; నీటి = నీళ్లయొక్క; శైత్యము = చల్లదనము; అలరించెన్ = సంతోషం కలిగించింది.

**తా॥** వేసవి కాలంలో రాయల సీమ బావుల్లో నీరు పాతాళ లోకం పట్టింది. కనుక ఇదివరకు చేత్రాడు చాలక ఇంట్లో ఉన్న త్రాటి తుంపులన్నీ ముడి పెట్టి పొడవైన త్రాడుగా చేసి ఎక్కడో పాతాళ మంటిన నీటిని స్త్రీలు చేదుతున్నారు. ఆ చేదటానికి కూడా చాలాకాలం పడుతున్నది. ఇది ఎలావున్నదంటే సూర్యుని ప్రతాపాగ్నికి భయపడి నీటిచలువలు పాతాళ గహ్వరంలో దాగుకున్నాయి. (శత్రురాజులు శ్రీకృష్ణదేవరాయల పరాక్రమానికి వింధ్య గహ్వరాలు దూరినట్లుగా) ఆ నీటిలో చల్లదనాన్ని ఆకర్షించడానికి తల్లి యొఱమీద తరుణులు ఒరిగినపుడు (నీళ్లులాగటానికి త్రాళ్లు అందటం లేదు కనుక ఒరగ వలసి వచ్చింది) వారి స్తనాలు తల్లి యొఱకు తాకి అందులోని చల్లదనాలు దీములై పాతాళలోకం దాకా పోయి అక్కడ జలశైత్యాలను ఆకర్షించుకొని పైకి తెచ్చినట్లున్నవి. అదే సత్యం కాక పోతే ఈ అదుకు త్రాళ్లకు అంతలోతు నీటిని లాగే శక్తి ఎక్కడిది?

విశే ॥ హేతూత్ప్రేక్ష

ప్రథమాశ్వాసంలో ద్రవిడాంగనలు దిగుడు బావుల్లో నీళ్లు తెచ్చుకొనే విధానంతో దీనిని పోల్చు కోవచ్చు.

మ. స్వ నిదానోగ్ర నిదాఘు వైఖరినె యూష్మన్మల్లిక ల్కామినీ
కనదానీల కచాగ్ర పంక్తి నెఱి యల్గాఁ బాపఁగాఁ బాటల
ఘనతం దేనియ సోనఁ గూర్చె; నది యౌఁగా ; నాభియున్నిర్విషం
బును దోఁబుట్టువులయ్యు వేర్పడ గుణంబుల్చూపఁగాఁ జూడమే? 67

స్వ = తమకు; నిదాన = మొదలి కారణమైన; ఉగ్ర = తీక్ష్ణమైన; నిదాఘు = వేసవి యొక్క; వైఖరినె = వలనే; మల్లికల్ = మల్లెలు; ఊష్మన్ = వేడి చేత; కామినీ = కామవతి యైన స్త్రీ యొక్క; కనత్ = ప్రకాశించే; ఆనీల = అంతటా నల్లగా ఉన్న; కచ = వెంట్రుకల యొక్క; అగ్ర = చివళ్లయొక్క; పంక్తిన్ = వరుసను; నెఱియలుగా = నెర్రెలుగా (పాయలుగా); పాపగాన్ = విడదీయగా; పాటలల్ = పాదిరి పువ్వులు; తేనియ సోనన్ = తేనెకాలువలు; ఘనతన్ = అధికంగా, ఊర్చెన్ = విడిపోయిన వెంట్రుకలను ఏకం చేసింది; అది = ఆ విధంగా చేయడం; ఔగాన్ = సరే కదా? నాభియున్ = విషము; నిర్విషంబును= అమృతము; తోబుట్టువులయ్యున్ = ఒకే సముద్రంలో పుట్టిన సోదరులైనా; వేర్పడన్ = వేరుపడేటట్లు; గుణంబుల్ = గుణాలు (విషం చంపేది, అమృతం బతికించేది); చూపగాన్; చూడమే = చూడటం లేదా !

లోకంలో ఒక తల్లి కడుపున పుట్టిన పిల్లలందరు ఒకే గుణం కలవారు కారు. వేరు వేరు గుణాలు కలవారు కావడం చూస్తున్నాం కదా! విషమూ, అమృతము రెండూ అమృత మథన కాలంలో ఒకేసారి పుట్టాయి. కనుక తోబుట్టువులు. కాని ఒకటి ప్రాణిని చంపుతున్నది. మరొకటి బ్రతికిస్తున్నది. ఇవి రెండు విరుద్ధ గుణాలు కదా! వేసవిలో కామినులు పూలజడలు, మల్లెలతో అల్లుకుంటున్నారు కనుక జడ పాయలు పాయలుగా విడదీయబడుతున్నది. ఇది యెలా ఉన్నదంటే మల్లెల వేడిని మళ్లా ఆర్ద్రమైన కేశపాశం నెర్రెలు గొట్టి పగిలే నేలలాగా అయి పోతున్నది. ఆ పాయలైన జుట్టును పాటల పుష్పాలు కూడదీసి ఒకటిగా చేస్తున్నది. అంటే జడ ముడులు వేసికొని వాటిపై కలిగొట్టు పూలదండలను పెట్టు కొంటారని భావం. ఇది అమృత లక్షణంగాను పైది విష గుణంగాను ఉత్ప్రేక్షించబడటం హేతూత్ప్రేక్ష.

శా. తారుణ్యాతిగ చూత నూత్న ఫలయుక్తై లాభిఘార స్వన
ద్ధారా ధూపిత శుష్యదంబు హృత మాత్స్య చ్ఛేద పాకోద్గతో
ద్గారంపుంగన రార్చు భోగులకు సంధ్యా వేళలం గేలి కాం
తారాభ్యంతర వాలుకాస్థిత హిమాంత ర్నారి కేళాంబువుల్. 68

భోగులకున్ = అనుభవజ్ఞులైన స్త్రీ పురుషులకు; సంధ్యావేళన్ = సాయంకాలాల్లో; తారుణ్య= తరుణ దశను; అతిగ = అతిక్రమించే; చూత = మామిడియొక్క; నూత్న = క్రొత్తవైన; ఫల = కాయలతో; యుక్త = కూడు కొన్న; తైల = నూనెయొక్క; అభిఘార= తిరగ పోతయొక్క (తిరగమోత అని వ్యవహారం); స్వనత్ = మ్రోగుతున్న; ధార = జాలుచేత; ధూపిత = తిరగ మోత వేయబడ్డ; శుష్యత్ = ఇంకి పోతున్న; అంబు = నీళ్ల నుండి; హృత = పట్టు కొని తేబడ్డ; మాత్స్య = చేపల; ఛేద = ముక్కలయొక్క; పాక= కూరతో; ఉద్గత = బయలకు వస్తున్న; ఉద్గారంపు = త్రేపులయొక్క; కనరు = కారమును; కేళికాంతార= క్రీడావనాలలోని; అభ్యంతర = నడుమ; వాలుక = ఇసుకలో; స్థిత = పాతిపెట్టిన; హిమ = చల్లని; అంతర్నారికేళ = కొబ్బరి బోండాలలోని; అంబువుల్= నీళ్లు; ఆర్చున్ = పోగొట్టును.

తా॥ ఆ వేసవిలో అనుభవజ్ఞులైన వారు ముదురు మామిడి కాయల ముక్కలతో నీళ్లింకి పోతున్న చెరువులనుండి పట్టి తెచ్చిన చేపల ముక్కలను కలిపి నూనె ధారలతో శబ్దిస్తున్న తిరగ బోతలు పెట్టుకొని మధ్యాహ్న భోజనం చేస్తారు. సాయంకాలం అయ్యేసరికి తిన్న ఆ చేపల కూర కారపు త్రేపులు వస్తున్నాయి. వాటిని పోగొట్టు కోవడానికి మధ్యాహ్నమే కోసి ఇసుక పాతరలలో పూడ్చి పెట్టబడ్డ కొబ్బరి బోండాలను కొట్టుకొని త్రాగుతున్నారు.

అలం : స్వభావోక్తి.

ఈ కావ్యంలో అక్కడక్కడ విచిత్ర వంటకాల విషయం చెప్పబడటం చూస్తే చక్రవర్తియొక్క రుచి విశేషాలు లేదా ఆ నాటి మానవునియొక్క భోగ లక్షణం ఆశ్చర్యంగా కనిపిస్తుంది. భోజనాన్ని రుచిమంతంగా చేసికొని ఆస్వాదించడమే భోగ లక్షణం.

కేవలం పొట్ట నింపు కోవడానికి తినడం పశు లక్షణం. అందుకే భోగులుగా చెప్పబడింది.

తారుణ్యాతిగ మామిడి, పండె దశను దాటి ముదిరినది. నూత్న = కొత్తగా వచ్చిన కాయ; వట్టి పోయిన చెరువుల నుండి ఆఖరుసారిగా వచ్చిన చేపలు కనుక అమితమైన ఆసక్తితో తెచ్చుకొని తినడం. వాలుకాస్థితఈనాడు మనకు రిఫ్రిజిరేటర్స్ లాంటిది. తాటి కాయలు కూడా ఇలాగే రాత్రులు బావిలో నానవేసి తెల్లవారే వాటిని కొట్టుకొని చల్లని ముంజలు తినడం కూడా పల్లెలలో ఉన్నది.

క. గ్రామ గ్రామంబున నొక
సామంతున కిడిన చలువ చప్పరములు త
న్వై మేదినిఁ గుంపటిలోఁ
దామరలుం బోలె నట్టి తఱి నొప్పారెన్. 69

అట్టి తఱిన్ = ఆ వేసవికాలంలో; గ్రామ గ్రామంబునన్ = ప్రతియూరిలో; ఒక సామంతునకున్= రాజు తన సామంతునికోసం; ఇడిన = ఏర్పరచిన; చలువ చప్పరముల్= చలువపందిళ్లు; మేదినిన్ = భూమిపై; తన్వై = విస్తారమై; కుంపటిలో = నిప్పుకుంపట్లలో; తామరలుం బోలెన్ = తామరపూలవలె; ఒప్పారెన్ = ఒప్పినవి.

తా॥ తీక్ష్ణమైన ఆ వేసవి కాలంలో సర్వవసుంధర కూడా నిప్పుల కుంపటిలాగా ఉంటే - ప్రతి ఊళ్లో రాజుగారు తన సామంతుని కోసం వేసిన చలువ పందిళ్లు తామరల తీగల గుంపుగా ఉంది.

అలం : ఉపమ, లోకోక్తి.

విశే॥ బహుశా ఆ రోజుల్లో రాజే చలువ చప్పరాలు కట్టించి సామంతునకు ఇచ్చేవాడు కాబోలు. సామంతుడంటే కొన్ని గ్రామాలకు అధిపతి. 53వ పద్యంలోని నాల్గవ పాదంలో చేమమడివోని తమ్మిగుంపులు అన్నచోట చెప్పినట్లు తామరల పొదలు చలువలకు నెలవులు. కనుక కుంపటిలో తామరలు అని చెప్పబడింది. ఇదొక లోకోక్తి. కనుక లోకోక్తి అలంకారం.

తే.గీ. తోటఁబగలుండి, మల్లెలు దుఱిమి, కావు
లమర మాపైన నిక్షు యంత్రముల కొయ్యఁ
జేరు ప్రజవొల్చె భావి వృష్టికిని గ్రుడ్ల
తో మధురి మేచ్చుడిగు నెఱ్ఱచీమలనఁగ. 70

తోటన్ = తోటలలో; పగలు = పగలంతా; ఉండి = పనిచేసుకుంటూ ఉండి; మాపైనన్= సాయంకాలం కాగా; మల్లెలు తురిమి = కొప్పులో మల్లెలు పెట్టు కొని; కావులు = కావిబట్టలు; ఒప్పుతుండగా; ఇక్షుయంత్రములకున్ = ఇరుకు గానుగల దగ్గరకు; ఒయ్యన్=క్రమంగా; చేరు = మూగుతున్న; ప్రజ = తోటమాలు లైన జనులు; భావి = భవిష్యత్తులో రాగల ; వృష్టికిన్ = వానలకు; (భయపడి); గ్రుడ్లతోన్= గ్రుడ్లను తలపై మోచుకొని; మధురిమ + ఇచ్చన్ = మనసులోని కోరిక చేత; డిగు = చేరుతున్న; ఎఱ్ఱ చీమలు; అనగన్ = అన్నట్లుగా; పోలిచెన్ = ఒప్పారెను.

తా॥ పగలంతా తోటలలో పని పాటలు చేసుకుంటూ గడిపి సాయంకాలం అయ్యేసరికి కొప్పుల్లో మల్లెపూలు పెట్టుకొని కావి బట్టలతో జనం చెఱకు గానుగల దగ్గర మూగుతున్నారు. ఇది యెలా ఉన్నదంటే రాబోయే వానకాలం కోసం భయపడి దిగే ఎఱ్ఱ చీమలు లాగా ఉన్నారు.

విశే॥ ఆరోజుల్లో పురుషులు కూడ కొప్పులు పెట్టుకోవడం; పూలు పెట్టు కోవడం ఉండేది - నాటి వారికి కావి వస్త్రాలంటే చాలమోజు; చెఱకురసం వేడిని పోగొట్టే శీతల పానీయం. కనుక ప్రజలు సాయంకాలాల్లో అక్కడ మూగుతున్నారు. కావి వస్త్రాలు కట్టు కున్నవారు, ఎఱ్ఱ చీమల్లాగా ఉన్నారు. నెత్తిమీద మల్లెపూలు చీమనెత్తి మీద గ్రుడ్లు, గానుగ దగ్గర మూగటం చీమల గుంపు అన్నట్లున్నారు. చీమలు గ్రుడ్లు ధరించటం వానకాలాన్ని సూచిస్తున్నది.

పరదేశి విప్రుడు

క. అప్పెను వేసవి విభవము
విప్పుగ ఁ దన్నగర నికట వృషగిరి హరికిం
దెప్ప తిరునాళ్ల రా, ముద
మొప్ప న్పరదేశి విప్రుఁడొక్కఁడు భక్తిన్. 71

అ+పెను = ఆ తీవ్రమైన; వేసవిన్ = వేసంగియొక్క; విభవము = వైభవము; విప్పుగన్= విచ్చుకోగా (విస్తారం కాగా); తత్ + నగర = ఆ మధురానగరానికి; నికట = సమీపంలో ఉన్న; వృషగిరి హరికిన్ = వృషగిరి అనుపేరుగల పుణ్యక్షేత్రంలోని విష్ణువునకు; తెప్ప తిరునాళ్ల = తెప్పలతో చేసే ఉత్సవం, రాన్ = రాగా; ముదము+ ఒప్పన్ = సంతోషాతిశయముతో; ఒక్కడు; పరదేవిప్రుడు = వైదేశికుడైన బ్రాహ్మణుడు; భక్తిన్ = భక్తితో; తర్వాతి పద్యానికి అన్వయము.

తా॥ ఆ విధమైన ప్రచండమైన వేసవి ఏసరేగిన రోజుల్లో మధురానగరానికి సమీపంలో ఉన్న వృషగిరి స్వామి తెప్పతిరునాళ్ల ఉత్సవం వచ్చింది. అది దర్శించడానికి సంతోషంతో ఒక పరదేశ బ్రాహ్మణుడు భక్తితో.

విశే॥ మధురకు సుమారు 10 కిలో మీటర్ల దూరంలో అళఘర్ కోవెల అన్న పుణ్యక్షేత్ర ముంది. అక్కడ స్వామిపేరు సుందర బాహువు చాలా మంది ఆళ్వారులు ఆ స్వామిపై దివ్యప్రబంధాలు (స్తోత్రాలు) రచించారు. కనుక ఈ అళఘర్ కోవెల వైష్ణవులకు ఒక పుణ్యక్షేత్రం. తెప్పోత్సవం ఆషాఢమాసంలో జరుగు తుంది.

క. సేవించి పోవుతఱి మధు
రావిభవముఁ జూడ వచ్చి శ్రాంతి మెయిన్ మా
పావైఘ నీటఁ గృతసం
ధ్యా విధియై నృపపురోహితావాసమునన్. 72

సేవించి = ఆ వృషగిరి సుందర బాహు స్వామిని కొలిచి; పోవుతటిన్ = తిరిగి వెళ్లే సమయంలో; మధురా విభవమున్ = మధురానగర వైభవాన్ని (ఈ ఆశ్వాస ప్రారంభంలో అది వర్ణింపబడింది కదా) చూడన్= చూడడానికి; వచ్చి = వృషగిరి నుండి మధురానగరానికి వచ్చి; శ్రాంతి మెయిన్ = అలసటతో; మాపు= సాయంకాలం; ఆ వైఘనీటన్ = ఆ వైగైనది నీటిలో; కృత = చేయబడ్డ; సంధ్యా = సంధ్యాకాలం; విధి+ ఐ = వైదిక కర్మలు కలవాడై; నృప = రాజుయొక్క; పురోహిత = పురోహితుని; ఆవాస = ఇంటిలో

తా॥ అళగర్ కోవెలకు వచ్చిన వారెల్ల మధురానగరాన్ని దర్శించటం ఒక అలవాటు. ఎందుకంటే అది మరొక విజయనగరం కనుక. కాబట్టి ఈ బ్రాహ్మణుడు కూడ చూడడానికి వచ్చి నగర మంతా తిరిగి అలసిపోయి సాయంకాలం వైగై నదిలో సంధ్యా విధులన్నిటిని తీర్చుకొని రాజుగారి పురోహితుని యింటిలో. తర్వాతి పద్యానికి అన్వయము. ఈ రెండు పద్యాలే కందములు. రెండూ అసంపూర్ణ క్రియలతో ముగిసి పోయినవి. నీరస కథాభాగం కనుక త్వర త్వరగా కథను తేల్చి వేసే పద్ధతి. నాటకంలో ప్రవేశిక వంటివి

సీ. పరిపక్వ సురభి రంభా ఫలంబుల తోడ,
దళమెక్కు పనస పెందొనల తోడ,
ఘృత పిండ నిభ కర్కరీ ఖండములతోడc,
బలుదెఱంగుల మావి పండ్లతోడ,
గోస్తనీ మృదు గుళుచ్ఛ స్తోమములతోడc,
గప్పు లేఁజీన వడ ప్రప్పుతోడ,
సు మధుర స్థూల దాడిమ బీజములతోడc,
దనుపారు రసదాడి గనెలతోడc

తే॥ బానకంబ తిథులకిడ్డc, దానుగ్రోలి
యర్చనాదత్త చందన చర్చc దేలి,
విరులు సిగ c దాల్చి కర్పూర వీటిc జారు
కొట్టుచు ద్విజుండు వెన్నెల బిట్టుగాయ 73.

పరిపక్వ = బాగా మగ్గిన; సురభి రంభాఫలంబులతోడన్ = కర్పూర వాసనగల అరటి పండ్లతో (కర్పూర చక్కెరకేళి అని ఒక విధమైన అరటి అది మంచి వాసన వేస్తుంది) దళము+ ఎక్కు = బలిసిన; పనస = పనసపండ్లయొక్క; పెన్ = పెద్ద; తొనల తోడన్ = తొనలతో (తొన రూపాంతరం తొల మునగ ములగ లాగా) ఘృతపిండ=పేరిన నేతిముద్ద; నిభ = వంటి; కర్కరీ = దోసకాయల; ఖండములతోడన్= ముక్కలతో; పలుతెఱంగుల = అనేక రకాల; మావి పండ్లతోడన్ = మామిడి పండ్లతో; గోస్తనీ = ద్రాక్షయొక్క; మృదు = మెత్తని; గుళుచ్ఛ = గుత్తులయొక్క స్తోమములతోడన్= సమూహంతో; కప్పులు=

పొట్టు; ఏఱిన = ఏఱివైచిన; వడప్రప్పు తోడన్ = పెసర పప్పుతో; సుమధుర = అతి మధురమైన; స్థూల = లావైన; దాడిమ బీజములతోడన్ = దానిమ్మగింజలతో; తనుపు ఆరు = తృప్తి కలిగించే చల్లనైన; రసదాడి = ఆ పేరుగల అరటి పండ్లయొక్క; గనెల తోడన్ = ముక్కలతో; అతిథులకున్ = ఆగంతులకు (చెప్పకుండా వచ్చేవారు); పానకము = బెల్లపు పానీయము; ఇడ్డన్ = ఇవ్వగా; తానున్ = తాను; క్రోలి = త్రాగి; అర్చన = అతిథి పూజార్థం; దత్త = ఇవ్వబడ్డ; చందన చర్చన్ = మంచిగంధపు మైపూతతో; తేలి = మునిగి లేచి; విరులు = పూలు; సిగన్ = జుట్టులో; తాల్చి = ధరించి; కర్పూర వీటిన్ = పచ్చ కర్పూరపు తాంబూలం; చౌరుకొట్టుచున్ = వడిగా నములుకుంటూ; వెన్నెల; బిట్టు = ఎక్కువగా; కాయన్ = కాస్తుండగా; ద్విజుండు= ఆ పరదేశి బ్రాహ్మణుడు.

పద్యమంతా పురోహితుని ఇంటిలోని భోజన వైభవం. కర్పూర చక్రకేళి, బలిసిన పన తొనలు, పేరిన నేతి ముద్దల లాగా ఉన్న పందిరి దోసకాయల బద్దలు, అనేక రకాల మామిడి పండ్లు, మెత్తగా ఉన్న ద్రాక్షగుత్తులు, పొట్టు లేక కడిగిన వడ పప్పు; మిక్కిలి తీయగా ఉన్న బలిసిన దానిమ్మగింజలు, చల్లగా ఉండి రసదాడి అరటి ముక్కలతో బాటుగా అతిథులకు పానకం కూడా ఇచ్చారు. దానితో ఫలాహారం పూర్తి అయిందన్న మాట. ఆ విదేశీ బ్రాహ్మణుడు తాను పానకం త్రాగి గృహస్థు అర్పించిన మంచిగంధాన్ని వంటికి పూసుకొని కొప్పులో పూలు పెట్టుకొని కర్పూర తాంబూలం గుప్పుగుప్పున నములుతూ వెన్నెల పిండార బోసినట్లు కాస్తుండగా.

**అలం :** స్వభావోక్తి.

పద్యంలో చెప్పిన వస్తువులన్నీ చలువగల పదార్థాలే. ఆనాడు ఋతువునకు ఉచితమైన ఆహారం తీసుకొనే నాగరికత ఉండేదని తెలుస్తున్నది. ఈ విషయమే ప్రథమాశ్వాసంలో విష్ణుచిత్తుని అతిథి సేవల దగ్గర చెప్పబడింది. 68వ పద్యంలో మాంసాహారుల భోజన భోగంలాగా శాకాహారుల భోజన భోగం చెప్పబడింది. చౌరుకొట్టుచున్ అన్న క్రియ లోకంలో జబురు కొను అన్నరూపంలో కనిపిస్తున్నది. చమురు కొన్నాడు, అంతా ఆక్రమించాడు అన్న అర్థంలోనే జబురు కొన్నాడు అని ఉంది. చేతికందిన దంతా లాక్కున్నాడని అర్థం. ఇక్కడ కర్పూర వీటియొక్క వాసన ప్రక్కలకు వ్యాపిస్తుండగా అన్న అర్థంలో ప్రయోగించి ఉండవచ్చు . సూర్యరాయాంధ్ర నిఘంటువులో ఈ క్రియ నుదాహరించి 'లొట్టలు వేయుచు నమలు' అని అర్థాలిచ్చి మొదటి ఉదాహరణగా

'ఒండొంటి యాకుతో నొన గూడు చుండ గొంటు వక్కలు చౌరు గొట్టుచు నమలి' అన్న అష్ట మహిషీ కల్యాణం లోని ద్విపద వాక్యా లుదాహరించారు. రెండవ ఉదాహరణగా

ఆముక్త మాల్యదలోని ప్రస్తుత వాక్యాల నుదాహరించారు.

తే॥ మాత్రసంచి తలాడగా, మార్గవేది
నొక్క ండార్యులు, గీత లొండొకండు, దా సు

భాషితంబులుగా c, దోడి బ్రాహ్మణౌఘ
ముబుసు పోకకుఁ జదువఁ బరున్న వేళ. 74

మాత్రసంచి = భుజాని కటూ ఇటూ వ్రేలాడే తిత్తులు గలసంచి (గాజుల మలారంలాగా పూర్వకాలంలో ప్రయాణికులు వస్తువులుంచుకునే సంచి); తలాడ = తలగడ; కాన్= కాగా; మార్గవేదిన్ = పురోహితుని ఇంటి ముందున్న వీథి అరుగుపైన; ( ప్రథమా శ్వాసంలో విలిపుత్తూరు వర్ణనలో ఆనాటి గృహ నిర్మాణం గురించి చెప్పబడ్డది కదా) తోడి బ్రాహ్మణ + ఓఘము = తనతో పాటున్న బ్రాహ్మణ సమూహంలో; ఒక్కఁడు = ఒకడు; ఆర్యలన్ = ఆర్యావృత్తాలను; ఒండొకండు = మరొకడు; గీతలున్ =వేదాంతగీతలు; తాన్ = త్రైర్థికుడైన అపరదేశి బ్రాహ్మణుడు; సుభాషితంబులుగాన్ = సూక్తులుగా; ఉబుసు పోకకున్ = కాలక్షేపంగా; పరున్నవేళన్ = పండుకొన్న సమయంలో; చదువన్ = చదువుతుండగా

తా॥ ఆ పురోహితుని యింటిలో ఎందరో బ్రాహ్మణులు ఫలాహారం సేవించి కర్పూర తాంబూలం నములుతూ వేసవి కాలం కనుక వీథి అరుగులపైన మాత్ర సంచులే తలదిండ్లుగా చేసుకొని పండు కొన్న సమయంలో కాలక్షేపం కోసం ఒకడు ఆర్యావృత్తాలు, మరొకడు గీతలు చదువుతుంటే ఈ పరదేశ బ్రాహ్మణుడు తానుకూడా సుభాషితం చదువుతున్నాడు. ముందుకు అన్వయం.

విశే॥ నాటికాలంలో తీర్థయాత్రలు చేసే బ్రాహ్మణులు పురోహితుల ఇండ్లకు అతిథులు కావడమన్న ఆచారముండేది కాబోలు అని దీన్ని బట్టి మనం అనుకోవాలి. ఆ రోజుల్లో పురోహితులు రాజునకు కూడా గౌరవింపదగినవారు. నాల్గవ ఆశ్వాసంలో చెప్పబోయే రాజనీతిలో పురోహితుడు ఒక మంత్రి అని, అతడు రాజుకు హితవర్గం లోనివాడని చెప్పబడ్డది. కనుక ఈ భోజన సంపద ఇంత విస్తారంగా వర్ణింపబడ్డది.

రాజు భోగిని దగ్గరకు పోవటం

సీ. పన్నీటితో c గదంబము సేసి పూసిన
మృగనాభి పస రాచనగరు దెలుపఁ,
బాటలానిలము లార్పఁగ c దపారపుఁజుంగు
లలరు c దావికి మూగు నళుల c జోఁప,
కర్ణడోలామౌక్తి క చ్ఛాయ లెగఁబ్రాఁకు
నురుహార రుచులఁద్రస్తరికి cదన్న,
శశికాంతి చెంగావి దశమలంచిన కేల
స్వర్ణత్సరువు వాఁడి వాలు మెఱయ,

తే. మెలఁత యడపముఁ దేఁ జరన్మేరు వనఁగ,
దలవరులు గొందఱొలసి ముంగల c జనంగ,

నర్థి రథ్యాన్తరాంతః పురాంతరమున
భోగినీ సంగతికి రాజు పోవుచుండి. 75

పన్నీటితోన్ ; కదంబము చేసి = మిశ్రము చేసి; పూసిన = పూసుకున్న; మృగనాభి = కస్తూరియొక్క; పస = వాసన; రాచనగరున్ = రాచనగరు లక్షణాన్ని; తెలుపన్ = పట్టి ఇవ్వగా,

ఇది రాజు వర్ణన. అతడు కస్తూరిలో పన్నీరు పోసి ఆ మిశ్రమాన్ని శరీరానికి రాసుకున్నాడు అది చుట్టు ప్రక్కల వ్యాపిస్తున్నది ఆ వాసనలు ఇతడు రాచనగరు నుండి వస్తున్న వ్యక్తి అన్నవిషయాన్ని చెప్పకుండానే చెబుతున్నవి. ఇది నిశావర్ణన; వ్యక్తి కనిపించడం లేదు కనుక ఇలా చెప్పబడింది.

పాటల = కలిగొట్టు పూలమీదుగా వీస్తున్న; అనిలములు = గాలులు; ఆర్పగన్= కదిలిస్తున్నందు వల్ల; తపారపు = తల పాగా యొక్క; చుంగులు = కుచ్చులు; (శ్రీకృష్ణదేవ రాయల చిత్రంలోని తలపాగాను చూడు), అలరుఁదావికిన్ = పూలవాసనలకు (రాజు కూడ సిగలో పాటల పుష్పాలు ధరించాడు కనుక); మూగు = అలముకొనే; అళులన్ = తుమ్మెదలను; జోపన్ = చెదరగొట్టుచుండగా.

అతడు సిగలో పాటల పుష్పాలు ధరించినాడు. దానిమీదుగా వీచేగాలులు తలపాగా చెంగులను కదిలిస్తున్నవి. అవి పూలవాసనలకు మూగుతున్న తుమ్మెదలను తరిమి వేస్తున్నవి. రాజుగారు కనుక ఆయన వేంచేస్తుండగా చోపుదారులు బెత్తాలతో ప్రజలను తరుముతూ దారి చేస్తున్నట్లు.

కర్ణ = చెవులకు; డోల = ఊగుతున్న; మౌక్తిక = ముత్యాల; ఛాయలు = కాంతులు; ఎగఁ బ్రాకు= పైకి ప్రసరించే; ఉరు = పెద్ద; హార = ముత్యాల సరాలయొక్క; రుచులన్= కాంతులను; త్రస్తరికిన్ = క్రిందకు; తన్నన్ = తన్నుతుండగా;

చెవులకు ముత్యాల అంట్లున్నవి. అవి రాజు నడుస్తున్నపుడు ఊయలవలె ఊగుతున్నవి. ఆ ఊగటం మెడలోని ముత్యాల పేరుల కాంతులు పైకి ప్రసరిస్తుంటే క్రిందికి తన్నుతున్నట్లుగా ఉన్నది. ముత్యాలు వేసవిలో చల్లదనాన్ని కలిగిస్తాయి కనుక అవి అలంకారాలుగా ధరించాడు.

శశికాంతి = చంద్రుని కాంతి వంటి వన్నెగల; చెంగావి = ఎర్రని వస్త్రముయొక్క, దశన్ = అంచును; మలంచిన = మలిపిన (పట్టు కొన్న); కేలన్ = చేతిలో; స్వర్ణ = బంగారంపు; త్సరువు = పిడిగల; వాడివాలు = పదునైన కత్తి; మెఱయన్ = ప్రకాశిస్తుండగా

ఉదయిస్తున్న ఎరుపు వన్నెగల చంద్రకాంతితో సమానంగా ఉన్న చెంగావి పంచె అంచును పైన వేసికొన్న మలిపిన చేతిలో బంగారపు పిడిగల పదునైన కత్తి ప్రకాశిస్తున్నది. అతడు మహారాజు కనుక ఖడ్గము తత్ చిహ్నము గనుక అది విడువకూడదు.

నెలత = ఒకస్త్రీ; అడపము = తాంబూల సామగ్రి గల పెట్టె; తేన్ = తెస్తుండగా; కొందరు తలవరులు= శరీర రక్షకులైన తలారులు కొందఱు; బలిసి = బారులు తీరి; ముంగలన్ = ముందర;

చనంగన్ = పోతుండగా; చరత్ = కదలుతున్న; మేరు = బంగారు కొండ; అనంగన్ = అన్నట్లుగా; రాజు= ఆ మత్స్యధ్వజుడు (ఇతనికి వల్లభ దేవుడని పేరు); అర్థిన్ = అభిలాషతో; రథ్యాంతర = మరొక వీథిలోని; అంతఃపురం యొక్క; అంతరమునన్ = లోపల; భోగినీసంగతికిన్ = పట్ట మహిషికాని భార్య కూటమికై; పోవుచుండి= పోతూ

ఒక స్త్రీ తాంబూలపు పెట్టె (తాంబూల కరండము) ( ఆ మెపేరు తాంబూల కరండవాహిని) తెస్తుండగా; తలారులు కొందరు ముందు నడుస్తుండగా అంతఃపురంలోనే ఉన్న మరొక వీథిలోని వేశ్యా సమాగమానికై నడుస్తున్న బంగారు పర్వతమో అన్నట్లు పోతున్నాడు.

'దశ మలంచిన' అన్న మాటకు పాఠాంతరంగా 'దసిలి మించిన ' అని వావిళ్లవారు గ్రహించి దసిలి = రుమాలు అన్న అర్థం వ్రాసారు.

ఒక మహారాజోచిత వేష వర్ణన ఈ పద్యంలో కనిపిస్తుంది. నాల్గవ ఆశ్వాసంలో కూడా రెండవ పాండ్యుని వర్ణన వస్తుంది. (4-58) పీఠికలో 39వ పద్యంలో కూడ రాజ వర్ణన ఉన్నది వీటన్నిటిని కలిపి మనస్సులో భావిస్తే శ్రీకృష్ణదేవరాయల చక్రవర్తి మూర్తి భాసిస్తుంది. అది ఆనాటి రాజవేషం. అంతః పురాంతరమున అంటే మరియొక అంతఃపురం. రాణి వాస మొక అంతిపురి. కాగా భోగినీ వాసంకూడా ఈ అంతి పురివలెనే సంపద్వంతమైయున్నది. మృచ్ఛకటికంలో వసంతసేన గృహవైభవం ఒక అంకమంతా వర్ణింపబడింది. అలాగే విజయనగరంలో వేశ్యల సంపద్వర్ణన ఆనాటి పాశ్చాత్య చరిత్ర కారులు విస్తృతంగా వర్ణించారు. వారు రాజుకే అప్పు పెట్టగలిగిన సంపద కలవారని. నేడు మనం చూస్తున్న హంపి కేవలం రాయల వారి అంతఃపురం మాత్రమే. దానికి చేరువగా కక్షాంతరంలో ఉన్న మరియొక అంతఃపురానికి రాజు రహస్యమార్గంలో వెళుతున్నాడు. ఈ కల్పన నగరనిర్మాణాన్ని లీలగా సూచిస్తున్నది. దీని వివరాలకు పేయస్ వ్రాసిన చరిత్ర చూడు. (భోగిని = దేవదాసి, ఇక్కడ రాజు ఉంపుడు గత్తె. బజారు వేశ్యకాదు; నృత్య = సంగీత విద్యా నిపుణయైన వేశ్య (నృత్తరవళి)

చ. వినియె నెలల్చతుర్ద్వయిని వృష్టి దినాళికి, రాత్రికై దివం
బున, జరకై వయస్సునను, బూని, పరంబున కిప్పుడు ద్యమం
బనువుగఁ జేయఁగా వలయు నంచుఁ బురోహిత ధర్మ మాత్మగీ
ర్ణ్కోన నలవిప్రుఁడా ద్విజులలోన సుభాషితము స్ఫురింపగన్. 76

పూని = (పూనుకొని) ప్రయత్నముతో; వృష్టిదిన + ఆళికిన్ = వానాకాలం రోజులకోసం; నెలల్ చతుర్ద్వయిని = నాలుగు X రెండు = ఎనిమిది మాసాల పాటు; రాత్రికై = రాత్రికోసం; దినంబునన్ = పగలే; జరకై = ముసలితనంకోసం; వయస్సునను= యౌవనంలోనే; పరంబునకున్ = పరలోకం కోసం; ఇప్పుడు = బ్రతికియుండగానే; ఉద్యమంబు = ప్రయత్నము; అనువుగన్ = చక్కగా; చేయగావలయున్= చేసుకోవాలి; అంచున్ = అంటూ; పురోహిత :- పురః = భవిష్యత్తునకు; హిత = మేలైన; ధర్మం =

నడవడి; ఆత్మన్ = హృదయంలో; కీల్కొనన్ = లగ్నమయ్యేటట్లుగా; ఆ ద్విజులలోన్= పై పద్యంలో చెప్పిన బ్రాహ్మణ సమూహంలో; అల విప్రుడు = వృషగిరి తెప్పతిరుణ్ణాళ్లకు పోయివస్తున్న బ్రాహ్మణుడు; సుభాషితమున్ = సూక్తిని; పఠింపగన్ = చదువగా; వినియెన్=ఆ రాజు విన్నాడు.

తా॥ భోగినీ సంగతికి పోతున్న రాజు వీధి అరుగు మీద ఉబుసుపోకకు పరుండి సుభాషితాలు చదువుతున్న బ్రాహ్మణుల మాటలు విన్నాడు. పై పద్యంలో చెప్పబడ్డట్లుగా ఆ వృషగిరి తిరునాళ్లకు పోయి వస్తున్న బ్రాహ్మణుడు కర్పూర వీటిని నములుతూ ఒక సుభాషితం చదివాడు. దాని అర్థమేమంటే వానకాలంలో సుఖ పడాలంటే మిగిలిన ఎనిమిది నెలలు కష్టపడి సంభారాలు కూర్చుకోవాలి. వానకాలంలో బయటకు పోవటం కుదరదు కనుక. రాత్రిపూట సుఖం కోసం పగలు కష్టపడాలి ముసలితనంలో సుఖంగా బ్రతకాలంటే యౌవనంలోనే కష్టపడాలి. అలాగే పరలోక సుఖం కోసం ఈ లోకంలో కష్టపడాలి. ఇది భవిష్యత్తులో రాబోయే పరలోక సంబంధమైన హితాన్ని బోధిస్తున్నది. కనుక రాజు హృదయంలో ఆ అర్థం నాటుకొని పోయింది.

విశే॥ ఆ రోజులలో సుభాషితాలు, నీతి, ధర్మ శతకాలు విస్తారంగా చదువుకొనేవారు. యాభై యేళ్ల క్రితందాకా విద్యార్థి ప్రారంభదశలో శతకాలే చెప్పేవారు. నేడా పద్ధతి పోయినందువల్ల నీతి, ధర్మ ప్రబంధం నేటి మనిషికి లోపించి పోయింది. అంతేకాక సుభాషితాన్ని దాని కవితా శైలిని ఆస్వాదించే కవితా లక్షణం జాతిలో చచ్చిపోయింది. భర్తృహరి సుభాషితాలు వంటి మహా గ్రంథాలు కూడా పఠనక్రమం నుండి భ్రష్టమైపోవటం జాతిలో ధర్మదృష్టి కవితాస్వాదన లోపించి పోయినాయనడానికి గుర్తు. సంస్కృత భాషలో సుభాషిత గ్రంథాలు, వానిసంకలనాలు అనేకం ఉన్నాయి. తెలుగులో చాటు పద్య సంకలనాలు లేకపోలేదు. నేటి సాహిత్య విద్యార్థి కనీసం వీటిని చదివి జీవితానికి అన్వయించు కోగలగాలి. ఈ పద్యానికి మూలమైన సుభాషిత శ్లోకమిది.

> వర్షార్థ మష్టౌ ప్రయతేత మాసాన్, నిశార్థ మర్థం దివసే యతేత।
> వార్ధక్యహేతోర్వయసా నవేన పరత్రహేతో రిహ జన్మనా చ ॥

రాజేమో భోగిని యింటికి పోతున్నాడు. అతని దృష్టి భోగలగ్నమై యున్నది. సుభాషితమేమో మోక్షదృష్టిని బోధిస్తున్నది. ఆ రాజు బహుశా బహు సుకుమార ప్రవృత్తి కలవాడై యుండాలి. లేకపోతే యిది విన్నంత మాత్రాన విరక్తుడు కాగలడా ! అలాగే యామునాచార్యుడు కూడా ! బుద్ధదేవుడు ముసలివాని శవాన్ని, రోగిని చూచి సన్యసించాడంటే బహుశా ఆనాటి మానవు డుత్తమ సంస్కారవంతుడై సుకుమార ప్రవృత్తి కలవాడై యుండాలి. మరొక దుష్టుడైన రాజై ఉంటే ఈ విప్రుని బంధించి ఉండేవాడు.

ఒక కథ ఉంది

ఒక రాజున్నాడట. అతని ఆస్థాన విదూషకుని పిలిచి నీకంటె బుద్ధి తక్కువ సన్న్యాసి నాకు కనిపించలేదు. కాబట్టి ఉత్తముడైన తెలివి తక్కువ వానిని సన్మానించటం కోసం ఈ బంగారు కాశ్మీర శాలువా నీకివ్వ దలిచాను అని చెప్పాడు.

చాలాకాలం గడిచింది. రాజు చావబోతూ విదూషకుని పిలిపించి అన్నాడట 'వెళ్ళిపోతున్నాను' అని. 'ఎక్కడకు' అని విదూషకుని ప్రశ్న. రాజు - 'ఎక్కడికేమిటి ? ఎలా తెలుస్తుంది ?' అని. విదూషకుడు నవ్వి 'వెళ్ళే చోటు తెలియకుండా అక్కడ ఏమీ ఏర్పాట్లు లేకుండా ఎలా వెళ్ళగలవు ప్రభూ! నాకు నీ కంటె తెలివి తక్కువ సన్నాసి కన్పించలే'దంటు ఆకాశ్మీరశాలువా రాజుకే కప్పాడు.

నాటి మానవ మనస్తత్వ మిది.

ఈ పద్యం నగర నిర్మాణ వైఖరిని ధ్వనిస్తున్నది. అంతఃపురం - పురోహితవాసం - భోగిని అంతఃపురం ఈక్రమంభావించదగ్గది. కౌటిలీయం వంటివీ నగరనిర్మాణాన్ని వివరించాయి.

క. విని, తద్గ్రంథార్థము నె, మ్మనమున నూహించి, తెలిసి, మ్రాన్పడి, కడకుందన
మోసమునకు భయపడి; జనపతి యటు చనక నిలిచి, సంతాపమునన్. 77

తత్ = ఆ; గ్రంథ = సుభాషితంయొక్క, అర్థము = తాత్పర్యము; విని = ఆలకించి; నెమ్మనమునన్ = మనస్సులో; ఊహించి = భావించి; తెలిసి = స్పష్టం చేసుకొని; మ్రాన్పడి= రిచ్చవడి; కడకున్ = తుదికి; తన మోసమునకున్ = తనకు తానై చేసుకున్న ఆత్మవంచనకు; భయపడి = భీతుడై; జనపతి = రాజు; అటు చనక = భోగిని యింటికి పోక; సంతాపమునన్ = దుఃఖముతో; నిలిచి = నిలబడిపోయి.

తా॥ ఆ సుభాషితార్థం విన్నతోడనే దానిని గూర్చి భావించాడు. అంటే తదర్థంలో తన్మయత్వం పొందాడని. భావన అంటే తన్మయత్వం తప్ప తర్కించి ఊహించడం కాదు. ఎప్పుడైతే ఆ భావంలో మునిగి పోయాడో అప్పుడతనికి తెలిసిపోయింది. తెలిసేసరికి మ్రాన్పాటు కలిగింది. ఓహో ! తనకు తానే ఎంత మోసం చేసుకున్నానని భయపడ్డాడు. భోగిని యింటికి పోకుండా దుఃఖంతో అలాగే నిలబడి పోయాడు. ఎవరూ? జనపతి.

ఈ పద్యరచన చాలా ఆశ్చర్యకరమైనది. రాజు పొందిన భావావేశాన్ని పాఠకుల అనుభవంలోకి పరిణమింపజేస్తున్నది కనుక రచన అద్భుతమైనది. మామూలుగా చూస్తే చిన్న పద్యం. అల్పశబ్దం. అతిశయమైన భావమూ లేదు. అలంకారమూ లేదు. వట్టి నిరలంకృత శబ్దం. కాని శ్మశాన వాసియైన శివుని గాంభీర్య మెంతటిదో ఈ పద్యమూ అంతటిదే. రాజులో కలిగిన క్రమ పరిణామాన్ని పద్యం ఆగిపోతూ ఆగిపోతూ నడవటం వల్ల ధ్వనిస్తున్నది. పద్యం విని అన్న క్రియతో మొదలైంది. సంతాపమునన్ అన్న మాటతో అంతమైంది. ఈ మధ్యలో తనలో జరిగిన క్రమపరిణామం ప్రచండమైన వేగంతో ఒక సుడి తిరిగినట్లు ఒక మెరపు మెరసినట్లు చకచకా జరిగిన పరిణామాన్ని వర్ణిస్తున్నది. కనుక ఊహించి తెలిసి, మ్రాన్పడి, భయపడి, చనక, నిలిచి ఈ అసంపూర్ణ క్రియలన్నీ అతనిలో అతడు పడ్డ ఆర్తిని ధ్వనిస్తున్నని.

కాళిదాసు శాకుంతలం పంచమాంకంలో తెరచాటున హంసపదిక చూళిక చదివింది. దానిభావం: 'నిన్న ఆ విధంగా తుమ్మెదా! నీవు మామిడి పూగుత్తిని ముద్దాడి, దానిని విస్మరించి, నేడు తామర

పూవు మోజులో పడ్డావు' అని. దూరాన విదూషకునితో నడుస్తున్న రాజది విని ఇదే విధంగా ఆత్మగతంగా భావించి మ్రాన్పడి 'రమ్యాణి వీక్ష్య' అన్న ప్రసిద్ధశ్లోకాన్ని అన్నాడు. యామునాచార్యుడు కూడా చతుర్థాశ్వాసంలో శ్రీరంగనాథుని పదపద్మాలను చూచి యిలాగే మ్రాన్పడి పోయాడు (4.202). ఈ విధమైన పరిణామం ఎవడో పూర్వ జన్మవాసన గల మహాభావుకుడికి మాత్రమే కలుగుతుంది. అందుకని ఈ చిన్నపద్యం చాలా అద్భుతమైంది. కవియొక్క ఆత్మ పరిపక్వతను ఆవిష్కరిస్తున్న పద్యమిది.

ఉ. ఎక్కడి రాజ్యవైభవము? లెక్కడి భోగము ? లేటి సంభ్రమం?
బక్కట ! బుద్బుద ప్రతిమ మైన శరీరము నమ్మి మోక్షపుం
జక్కి గణింపకుంటి; యుగ సంధుల నిల్చియు గాలు చేతిబల్
త్రొక్కుల నమ్మను ప్రభృతులున్ దుద రూపఱకుండ నేర్చిరే. 78

అక్కట = అయ్యో; ఎక్కడీ రాజ్య వైభవములు = ఈ సామ్రాజ్య ఐశ్వర్యాలు ఎక్కడ?; భోగములు = లౌకిక సుఖానుభవాలు, సంభ్రమంబు = వేగిరపాటు; బుద్బుద = నీటి బుడగకు; ప్రతిమము = ఆకృతి; ఆకారము; ఐన = అయినట్టి; శరీరమున్ = దేహమును; నమ్మి = విశ్వసించి; మోక్షపు చక్కిన్ = మోక్షమార్గాన్ని; గణింపక = విచారణలోనికి తీసుకోక; ఉంటిన్ = ఇన్నాళ్లు బ్రతికాను; యుగ సంధులన్ = యుగాలయొక్క సంధ్యలలో కూడ; నిల్చియున్ = ఉండి; కాలు చేతి = యుమునిచేత; బల్ త్రొక్కులన్=గొప్ప ఆపదల వల్ల; ఆ మను ప్రభృతుల్ = ఆ మనువు మొదలైనవారు కూడా; తుదన్ = చివరకు; రూపు+అఱక = రూపం నశింపక; ఉండన్ నేర్చిరే = బ్రతుక గలిగినారా?

తా॥ అయ్యో! ఈ రాజ్య వైభవాలేమిటి? ఈ భోగాలేమిటి? వీటికోసం యింత ఆరాట మేమిటి? ఇదంతా నీటి బుడగవంటి శరీరం కోసమే కదా! యుగాల మధ్య కాలాలు బ్రతికిన మనువు వంటివారు కూడా యముని దెబ్బకు రూప రేఖలు లేకుండా పోయారే? విషయమిలా ఉండగా నేను మోక్షం సంగతి ఊహలోకి రాకుండా కూడా బ్రతికాను కదా! ఈ పద్యమంతా రాజుపడ్డ సంతాపాన్ని ఆవిష్కరిస్తున్నది.

క. ఉన్నట్లయుండ నద్దరి; కిన్నరులను నావ చేర్పు క్రియ వెసఁదాఁబో
కున్నట్ల యుండి కాలం; బున్నరులకు వయసుఁబుచ్చి మోసము దెచ్చున్ 79

ఉన్నట్లు+అ = ఉన్నట్లుగానే; ఉండన్ = ఉండగా; నరులన్ = ప్రయాణీకులైన జనాన్ని; ఆ+దరికిన్ = అవతలి ఒడ్డుకు; నావ = పడవ; చేర్పు క్రియన్ = చేర్చేవిధంగా; కాలంబున్= కాలం కూడా; తాన్ = తాను; వెసన్ = త్వరగా; పోకున్నట్ల యుండి = కదలకున్నట్లుగా ఉండి; నరులకున్ ; వయసుఁబుచ్చి = బాల్య యౌవనాదులను త్రోసివేస్తూ; మోసము తెచ్చున్ = మోసం కలిగిస్తుంది.

తా॥ పడవలో కూర్చున్న వారికి అది నడుస్తున్నట్లు తెలియదు. కూర్చున్నవాళ్ల కూర్చున్నట్లే ఉన్నంతలోనే బాటసారులను పడవ అవతలి ఒడ్డుకు పట్టిస్తుంది. అలాగే కాలం కూడా. నడుస్తున్నట్లు ఎవరికీ

తెలియకుండానే బాల్యాన్ని యౌవనంగా, యౌవనాన్ని వార్ధక్యంగా పరిణమింపజేసి చివరకు మృత్యువు వాత పడవేస్తుంది.

**అలం :** అప్రస్తుత ప్రశంస.

విశే॥ ఈ పద్య భావం కూడా చాలా అద్భుతమైనది. కాలం = పడవ, ఈ రెంటి నడక ఎవడి అనుభవంలోనుండదు. కాలచక్రం బయట తిరుగుతున్నట్లు మనమనుకుంటాం తప్ప అది నాలోపలే ఉండి నాశరీరాన్ని పరిణమింపచేస్తుందని ఎవడనుకుంటాడో వాడే ఆత్మాన్వేషి కాగలడు. పడవ నీటిమీద నడుస్తుంది. నది ఇవతలి ఒడ్డునుండి అవతలి ఒడ్డుకు పోవడానికి పడవ ఆధారం. ఈ భావం ప్రాచీన ఆధ్యాత్మిక మహాకవి యిక్కడ అతకటం రాయల వారిలో ఉన్న మార్మిక కవిని బయట పెడుతున్నది.

చ. సగరు నలుం బురూరవు c ద్రిశంకుసుతు న్బురుకుత్సుcగార్త వీ
ర్యు గయు cబృథుం భగీరథు సుహోత్రు శిబిం భరతుం దిలీపునిన్
భృగుకులు యౌవనాశ్వు శశిబిందు ననంగుని నంబరీషు c బూ
రు గురుని రంతి రాఘవు మరుత్తుని c గాలము కోలుపుచ్చదే. 80

సగరున్; నలున్ ; పురూరవున్; త్రిశంకు సుతున్ = త్రిశంకుని కొడుకైన హరిశ్చంద్రుని; పురుకుత్సున్; కార్తవీర్యున్; గయున్; పృథున్, భగీరథున్ ; సుహోత్రున్; శిబిన్, భరతున్, దిలీపున్; భృగుకులున్ = భార్గవ వంశంలో పుట్టిన పరశురాముని; యౌవ నాశ్వుని = యువనాశ్వుని పుత్రుడైన మాంధాతను; శశిబిందున్; అనంగున్; అంబరీషున్; పూరుగురుని = పురుని తండ్రియైన యయాతిని; రంతిన్; రాఘవున్ = శ్రీరాముని; మరుత్తునిన్; కాలము; కోలుపుచ్చదే = చంపలేదా !

సగరుడు; కార్తవీర్యుడు, హరిశ్చంద్రుడు, నలుడు, పురూరవుడు, పురుకుత్సుడు- వీరినే షట్చక్రవర్తు లంటారు.

గయుడు, అంబరీషుడు, శశిబిందుడు, అనంగుడు, పృథుచక్రవర్తి, మరుత్తుడు, భరతుడు, సుహోత్రుడు, దిలీపుడు, రాముడు, నృగుడు, రంతిదేవుడు, యయాతి, మాంధాత, భగీరథుడు- ఈ పదహారుగురు షోడశమహారాజులు. వీరి కథలే ప్రాచీన పురాణేతిహాసాలలో బహుధాప్రశంసింపబడ్డవి. ఆదర్శ చక్రవర్తులైన వీరే తరువాతి వారికి మార్గ దర్శకులైనారు. షోడశమహారాజుల చరిత్ర మహాభారతంలో చాలా చోట్ల వస్తుంది. తిక్కనగారు షోడశ మహారాజులను 16 సీసపద్యాలలో అద్భుతంగా వర్ణిస్తాడు. (చూడు. శాంతిపర్వం). అక్కడ కూడ చనిపోయిన వారి కోసం ధర్మరాజు దుఃఖిస్తుంటే శ్రీకృష్ణుడు ఈ షోడశ మహారాజుల కథలను చెప్పి వారిని కూడా కాలం క్షమించలేదయ్యా! కాలస్వభావ మింతే! అని ఓదారుస్తాడు. అదే మార్గంలో ఇక్కడ రాజుకూడా బాధ పడుతున్నాడు. ఈ ధర్మ చక్రవర్తులు ప్రాగ్రూప ప్రతిమలు. పురాణకథలంటే ప్రాగ్రూపచరిత్రలే

క. కాన c దటి చ్చల మగురా;
జ్ఞానందము మరగి యింద్రియారాముcడనై,

పో; నింతనుండి పరలో;
కానందమునకె యత్న మాపాదింతున్. 81

కానన్ = కాబట్టి; తటిత్ = మెరుపువలె; చలము+ అగు = అస్థిరమైన; రాజ్యానందమున్= రాజ్యసంబంధమైన సంతోషాన్ని; మరగి = అంటి పెట్టుకొని; ఇంద్రియ = ఇంద్రియములే; ఆరాముడను+ ఐ = విహారవనాలుగా కలవాడనై లేదా నివాసస్థలము కలవాడనై; పోను = నశించను; ఇంతనుండి = ఈక్షణం నుండి, పరలోక = ఆముష్మిక; ఆనందమునకె = సుఖమునకె; యత్నము = ప్రయత్నము; ఆపాదింతున్ = చేస్తాను.

తా॥ కాబట్టి మెరుపువలె క్షణికమైన రాజ్యసౌఖ్యాలను అంటి పెట్టుకొని ఇంద్రియ విషయాలే విహార వనాలుగా క్రీడించకుండా మోక్ష సౌఖ్యానికై ఈ క్షణం నుండి ప్రయత్నం చేస్తాను.

3-58 వ పద్యంలో కూడా రాజ్యలక్ష్మిని కని మెరుపనే ఉదాహరించాడు. కాబట్టి శ్రీకృష్ణదేవరాయలలో ఈ ఆధ్యాత్మిక దృష్టి ఉన్నది. విజయ నగర సామ్రాజ్యాన్ని తనవరకు ఎందరో పరిపాలించారు. ఈ చరిత్ర అంతా తెలిసినదే. కనుక ఈ భావం ఆయనలో నాటుకొని ఉండి యుండాలి.

అలం : కావ్యలింగం.

తార్కికలింగం వేరు. ఆలంకారికుల లింగం అలంకారం. కనుక వేరు చేయడానికి కావ్యశబ్దాన్ని కలిపి కావ్యలింగ మన్నారు. తార్కికులు చెప్పిన హేతువు (లింగం) శాస్త్రీయ మైనది. కావ్యలింగం రస భావసంబంధమైన అలంకార విశేషం. ఇక్కడ పరలోకానందమునకు ప్రయత్నించడానికి ఒకానొక హేతువు చెప్పబడింది. అది తటిచ్చలమైన రాజ్యానందము. ఉపమానమైన తటిచ్చలము సుందరమైనందువలన అలంకార మౌతున్నది.

ఆరామశబ్దము గృహము, తోట, దొడ్డి కలిగిన విశాలగృహం. భగవంతునకు ఈ ప్రపంచ మంతా గృహమట. బృహదారణ్య కోపనిషత్తులో లోకులు అతని ఆరామాన్ని చూస్తున్నారు తప్ప ఎవరూ అతనిని చూచిన వారు లేరు అన్న మంత్ర వాక్యముంది. కనుక ఇంద్రియారామము అంటే ఇంద్ర ధనుస్సు లాంటి ఆకర్షణీయమైన విశ్వం.

రాయల వారికి వేద వేదాంత విద్య కరతలామలకమని ముందు తెలుస్తుంది.

క. *వర్గత్రయ పరత ముహుః*
*స్స్వర్గక్ష్మామధ్య మాధ్వజాంఘాలికతా*
*దుర్గతియు నొల్ల; మఱి యప*
*వర్గదు దేవేల్పుఁజింగి వాని భజింతున్.* 82

వర్గత్రయ పరతన్ = ధర్మార్థకామములన్న త్రివర్గమే ప్రధానంగా కలవాడనై; ముహుః = మాటి మాటికి;

స్వర్గ = స్వర్గలోకానికి; క్ష్మా = భూలోకానికి; మధ్యను = నడుమ; అధ్వ = బాటలో; జాంఘాలికత = పిక్కకొలది పరిగెత్తే; దుర్గతియున్ = దుస్థితిని; ఒల్లన్ = అంగీకరించను; మఱి = అలా కాకుండా; అపవర్గ = మోక్షాన్ని; దుడు = ఇచ్చేవాడు (త్రయీ వర్గం ధర్మార్థకామాలు, అపవర్గము నాల్గవదైన మోక్షపురుషార్థం) ఏ వేల్పు = ఏ దేవుడో! వానిన్ = అలాంటి వానిని; ఎఱిగి = తెలిసికొని; భజింతున్ = సేవిస్తాను.

తా॥ ఇన్నాళ్లు ఇంద్రియారాముడైనందున ధర్మార్థ కామాలన్న పురుషార్థ దృష్టితో ప్రవర్తించాను. దీని వల్ల స్వర్గానికి పోయి తిరిగి భూమి మీద పుట్టి ఈ విధంగా మాటి మాటికి ఈ రెంటి మధ్య పరిగెత్తే దుస్థితి నాకొద్దు. మోక్ష ప్రదాతయైన స్వామి ఎవడో తెలుసుకొని అతనినే సేవిస్తాను. (బతికివుండగా చేసుకున్న పుణ్యం వశాత్తు స్వర్గానికి వెళ్లి ఆ పుణ్య ఫలమైన భోగాలనుభవించి తిరిగి జన్మిస్తారట.

'క్షీణే పుణ్యే మర్త్య లోకం విశంతి' - పుణ్యం నశించిన తర్వాత భూలోకంలోకి వస్తారు అన్న పురాణోక్తిని గురించి రాజు ఇలా భావించారు.

క. అని తలచి మెచ్చి, యవ్వి;
ప్రునకు న్వీటి కరండమున ముద్రితమై
యునిచిన యొక ముదుపార;
క్షునిచే నిప్పించి, నగరు సొచ్చి, నిశ చనన్. 83

అని తలచి = పై విధంగా భావించి, మెచ్చి = మెచ్చుకొని; ఆ+విప్రునకున్ = ఆ సుభాషితం చదివిన బ్రాహ్మణునకు; వీటి కరండమునన్ = తనతో పాటుగా వస్తున్న స్త్రీ చేతిలో ఉన్న. తాంబూలం పెట్టెలో; ముద్రితమై = రాజముద్ర కలదైన; ముడుపు = ధనం; ఆ రక్షుని చేతన్ = తనముందు నడుస్తున్న తలారులలో ఒకనిచేత; ఇప్పించి = బ్రాహ్మణునకు అందేటట్లు చేసి; నగరు = అంతఃపురం; చొచ్చి = ప్రవేశించి; నిశ చనన్ = రాత్రి గడచి పోగా;

తా॥ పై విధంగా ఆలోచించి సుభాషితానికి మెచ్చుకొని చదివిన విప్రునకు తాంబూలపు పెట్టెలో రాజముద్రగల దీనారాలను తలవరిచే అతనికిప్పించి తిరిగి అంతఃపురానికి వెళ్లి ప్రభాతం కాగానే. ఈపద్యం కూడా 77 వ పద్యం లాగానే అసంపూర్ణ క్రియా బహుళమై యున్నది. అతనిలోని తొందరను తెలియజేయడం కోసం కవి యీ రచనను స్వీకరించాడు.

క. కొలువై బహు సమయంబుల;
మెలఁగెడు కోవిదులఁగూర్చి 'మీ మీ శాస్త్రం
బులలో నెవ్వడు మోక్షం,
బెలయించునొ చూచి నిశ్చయింపుఁ డటంచున్. 84

కొలువు + ఐ = కొలువు తీర్చి (వివాహమై అన్న ప్రయోగం లాంటిది. తాను కొలువు ఎలా అవుతాడు? కాని ప్రయోగ మలాగే ఉంది) బహుసమయంబులందున్ = అనేక శాస్త్రాలలో; మెలఁగెడు = జీవిత

మంతా గడిపే; కోవిదులన్ = పండితులను; కూర్చి = సభలో చేర్చి; మీ మీ శాస్త్రంబులలోన్ = మీరు చదివిన శాస్త్రాలలో; ఎవ్వడు = ఏ దేవుడు; మోక్షంబు = ముక్తిని; ఎలయించునో = కలిగించునో; చర్చి = పరిశీలనం చేసి; నిశ్చయింపుడు = నిర్ధారణ చేయండి; అటంచున్ = అని పలికి

తా॥ కొలువు తీర్చి సకల శాస్త్ర పండితులను రావించి మీ మీశాస్త్రాలలో మోక్ష ప్రదాత యైన భగవంతుడు ఎవరో తేల్చి చెప్పండి అని అంటూ 4-271లో రాజు దైనందిన కార్యక్రమం వర్ణింపబడింది. 'కొలువై' అన్నమాట దాన్ని బట్టి చూచు కోవాలి. ఇక్కడ రాజు ఒక దుఃఖంలో మునిగి యున్నాడు కనుక ఇతర కార్యక్రమాలను త్రోసి పుచ్చి పండిత గోష్ఠి మాత్రమే చేశాడని చెప్పాలి.

తే. గీ. వాద మొనరించి గెలిచి తత్త్వంబు దెలుపు
వాని కని బీరపువ్వుల c బోని టంక
సాల వాటులు నించి యాస్థాని cగట్టc
గాల సర్పము గతి వ్రేలు జాలెc జూచి. 85

వాదము = తర్కసహితమైన వాదము; ఒనరించి = చేసి; గెలిచి; తత్త్వంబు = ఆధ్యాత్మిక రహస్యము, తెలుపువానికిన్ = ప్రకటించిన వానికి, బీరపువ్వులన్ పోని = పచ్చని బీరపువ్వుల వంటి; టంకసాలలో ముద్రించిన బంగారు నాణెములను; నించి = నింపి; ఆస్థానిన్ = కొలువు కూటంలో; కట్టన్ = వ్రేలాడదీయగా; కాలసర్పముగతిన్ = నల్లని త్రాచులాగా; వ్రేలు = వ్రేలాడే; జాలెన్ = సంచిని; చూచి

తా॥ వివాదంలో ఎవడైతే గెలిచి తత్త్వస్థాపన చేస్తాడో ఆ పండితుని కోసమని బీరపువ్వులవంటి పచ్చని బంగారు దీనారాలను నింపి, వలసంచిని ఆస్థానంలో వ్రేలాడ గట్టారు. అది కాలసర్పంలాగా వ్రేలాడుతున్నది.

నాణెములను బీరపువ్వులతో పోల్చటంలోని అందమేమంటే ఆనాడు రాగి కలపని మేలిమి బంగారాన్నే ఉపయోగించేవారు. రాగికలిపితే బంగారం ఎరుపెక్కుతుంది. కలపని బంగారం పచ్చగా ఉంటుంది. దాన్నే మేలిమి బంగార మంటారు. పూలు విచ్చిన బీరపాదు చాలా అందంగా ఉంటుంది. రాయలవారి పోలికలు చాలా వరకు పల్లెటూరి జీవితానికి అత్యంత సన్నిహితంగా ఉంటాయి. కాల సర్పమన్న ఉపమానంతో పండితుల కది భయానకంగా ఉన్నదని ధ్వనిస్తున్నది.

అలం : ఉపమ.

క. హరు నొకcడన, నుమ నొకcడన
హరినొకcడన, శిఖి నొకడన, నర్కునొకcడనన్
గరిముఖు నొకcడన, రజనీ
శ్వరునొకcడన, నజు నొకcడన, వాదైన తఱిన్. 86

ఒకడు = ఒక పండితుడు; హరున్ = (మోక్షప్రదుడైన వేలుపు); శివుడు, అనన్ = అనగా; ఒకడు =

మరియొకడు; ఉమన్ = పార్వతిని; అనన్, ఒకడు = మూడవవాడు; హరిన్ = విష్ణువు; అనన్; శిఖిన్ = అగ్నిని; అర్కున్ = సూర్యుని; కరిముఖున్ = ఏనుగు ముఖముగలవాడు విఘ్నేశ్వరుని; రజనీశ్వరున్ = రాత్రికి అధిపతియైన చంద్రుని; అజున్ = బ్రహ్మను; వాదు = వివాదం; అయిన తరి = కల్గిన సమయంలో.

తా॥ విద్వాంసులమధ్య చర్చ జరిగింది. వారి వారి మతానుసారంగా శివుడు,పార్వతి, విష్ణువు, అగ్ని, సూర్యుడు, గణపతి, చంద్రుడు, బ్రహ్మ మొదలైన దేవతలను ప్రతి పాదించారు. ఆ సమయంలో.

పద్యంలో బ్రహ్మ, చంద్రులు కూడ చేర్చబడటం విచారించ దగ్గ అంశం. ఇతర దైవాలను పూజించటం ఉన్నది. బ్రహ్మ కెక్కడా గుడి, గోపురాలు లేవు. కాని దేశం మొత్తం మీద ఒకటి రెండు చోట్ల ఉన్నాయి. అలాగే చంద్రోపాసన కూడా (మహమ్మదీయులలో ఉన్నది.) ఇందులోనే గోదాదేవి కథలో విష్ణుచిత్తుడు భగవంతునితో పెట్టుకున్న మొరలో సూచింపబడినది. దేవీ ఆరాధనలో చంద్రునకు ప్రాధాన్యముంది. చంద్ర బింబాన్ని దేవీస్వరూపంగా ఆరాధించడం ఉన్నది. కాని దీనికి హరిహర ఆరాధన లాగా స్పష్టత లేక పోవచ్చు గుడి గోపురాలు కట్టి పూజాది కార్యము నిర్వహించక పోయినా ఉపాసనామార్గంలో ఉన్నది. సూర్య దేవాలయం కోణార్క లాంటి చోట్ల ఉన్నది. సూర్య చంద్రులు - శ్రీ విద్య సంప్రదాయంలో ప్రత్యేకార్థాల్లో ఉన్నాయి.

తే. విల్లిపుత్తూరులో నల్ల విష్ణుచిత్తుఁ
డతుల తులసీ సుగంధి మాల్యమును మూల
మంత్రమున నక్కు చేర్పఁబో మన్ననారు
దారమధురోక్తి నవ్విధ మాన తిచ్చి. 87

విల్లి పుత్తూరు లోన్ = అక్కడ విలిపుత్తూరులో; అల్ల విష్ణుచిత్తుఁడు = ప్రథమాశ్వాసంలో చెప్పబడ్డ వైష్ణవుడు; అతుల = సాటిలేని; తులసీ = తులసియొక్క; సుగంధి = వాసనలు గల; మాల్యమును = దండను; మూలమంత్రమునన్ = అష్టాక్షరి యున్న ప్రధానమంత్ర పఠనంలో; అక్కునన్ = మన్నారు స్వామియొక్క వక్షఃస్థలంలో, చేర్పబోన్ = చేసే సమయంలో; మన్ననారు = విలిపుత్తూరు దేవుడు; ఉదార = గంభీరమైన; మధుర = తీయనైన; ఉక్తిన్ = శబ్దంతో; ఆ+విధము = మధుర రాజాస్థానంలో చదివే వాదవైఖరి; ఆనతిచ్చి = సెలవిచ్చి.

తా॥ శ్రీవిలిపుత్తూరులో ఆ విష్ణుచిత్తుడు మంచివాసన గల తులసిదండను అష్టాక్షరి జపిస్తూ స్వామి మెడలో వేయబోగా ఆయన గంభీరమైన మధురమైన మాటలతో మధురానగర వృత్తాంతాన్ని చెప్పి

విశే॥ అష్టాక్షరి జపహోమార్చన వేళల్లోనే అనుసంధించాలి కనుక. 5-92లో గోదాదేవి ద్వయమంత్రంతో అర్చించినట్లున్నది. అది అందరకూ నిత్యానుసంధేయం ఇక్కడ విగ్రహం మాట్లాడినట్లు చెప్పబడుతున్నది. ఈ విషయాలు ఉపాసకులకు వింతగా కనిపించవు. కాని వారికి వింతగా ఉంటాయి. నేటి మనిషి యీ మార్గం నుండి దూరం వచ్చాడు. కనుక అతనికి విశ్వాసం లేదు కాని శ్రీరామకృష్ణపరమహంస వంటి వారి జీవితచరిత్రను చదివితే ఇందులో ఏదీ విడ్డూరం అనిపించదు.

శ్రీఅరవిందులకు ఒక శిష్యుడుత్తరం వ్రాస్తూ అన్నాడు ''ప్రొద్దున లేచి మేజా మీద ఉన్న మీ ఫోటోను చూస్తున్నాను. అది కదలుతున్నది. ఇది సత్యమా ? భ్రాంతా ?'' అని. దానికి సమాధానంగా వారొక లేఖలో వ్రాశారు. ''అది భ్రాంతి కాదు. నీ చైతన్యం అంతర్ముఖమైనది కనుక ఆ క్షణంలో నా చైతన్య మక్కడ ఉన్నది. కనుక సత్యమే. యోగంలో ఇలాంటివి చాలా సామాన్యవిషయాలు అని వ్రాసిన దానిని బట్టి ఇది చాలా సత్యమైన విషయం. బహిర్ముఖుడైనపుడు లోకచలనం ఎలా తెలుస్తుందో అంతర్ముఖుడైతే దేవతాచలనం కూడా తెలుస్తుంది. భక్తుడు, భగవంతుడు- వీరిద్దరి మధ్య సంభాషణ పరావాక్కులో జరుగుతుంది. మనం మాట్లాడే భాష వైఖరీ వాక్కు. పరావాక్కు అక్షరాశ్రితం కాదు వైఖరి లాగా.

**ఉ.** నేఁడు, మహామతీ, మధుర నీవు రయంబునఁ జొచ్చి, యందుఁబాం
డీఁడు దివాణము న్నెఱయ నించినఁ బ్రేలెడు దుర్మదాంధులన్
బోఁడిమి మాన్చి, మన్మహిమముం బ్రకటించి హరింపు శుల్కమున్
వాఁడును రోసినాఁ డిహము; వైష్ణవుగా నొనరింపు సత్కృపన్. 88

మహామతీ = గొప్పప్రజ్ఞావంతుడా; నేడు = ఈవేళ; నీవు ; మధుర; రయంబున = వేగముగా; చొచ్చి = వెంటనే వెళ్లి; అందున్ = ఆ మధురలో; దివాణమున్ = కొలువు కూటము; నెఱయన్ = ఉండేటట్లుగా, పాండీడు = పాండ్యరాజు; నించినన్ = నింపగా; ప్రేలెడు = వాగుతున్న; దుర్మద+అంధులన్ = అహంకారముతో గుడ్డివారుగా అయిన వారిని; పోఁడిమి = అహంకారాన్ని; మాన్చి = పోగొట్టి ; మత్ = నా; మహిమమున్ = మహాత్మ్యము; ప్రకటించి = స్పష్టంచేస్తూ; శుల్కమున్ = ఆ జాలెలోని ధనాన్ని; హరింపు = స్వీకరించు; వాఁడునున్ = వాడుకూడా (పాండ్యుడు); ఇహము రోసినాడు = ఈ లోకాన్ని ఏవగించుకుంటున్నాడు; వైష్ణవుగాన్ = విష్ణుభక్తునిగా; సత్కృపన్ = దయతో; ఒనరింపు = చేయుము

తా॥ ఓ మహాప్రాజ్ఞుడా ! ఈ వేళే నీవు వెంటనే మధురానగరం ప్రవేశించి పాండ్యరాజు కొలువు కూటంలో చేరిన దురహంకారులైన పండితుల మదాన్ని పోగొట్టి, నా మహిమను ప్రకటించి ఆ శుల్కాన్ని స్వీకరించు. ఆ రాజు కూడా మోక్షాసక్తుడైనాడు కనుక అతనిని వైష్ణవునిగా తీర్చి దిద్దు

విశే॥ మహామతి చదువుకోకుండానే తత్త్వజ్ఞానం కలవాడు. దానినే ప్రజ్ఞ, వివేకం అంటారు. ఈ విషయం విష్ణుచిత్తుని గురించి చెప్పినపుడు ప్రథమాశ్వాసంలో 1 - 78లో కవి చెప్పనే చెప్పాడు. ఇక్కడ భగవంతుడు ప్రేలెడు దుర్మదాంధులంటున్నాడు. అంటే యిది పాత్ర అంటున్న మాటా? లేక కవి మాటా ? ఇది పాత్రవాక్కు. పండితుడు దురహంకారంతో భగవద్దర్శనం లేకుండా తర్కిస్తాడు కనుక వాడు ఇక్కడ నిరసింపబడుతున్నాడు. ఇది కోపంతో అన్నది కాదు. నిజం చెప్పటం. పరమహంస జీవితంలో ఇలాంటి వారి ప్రసక్తి రావడం ఆయనా సుకుమారంగా నిరసించడం జరిగింది. అందుచేత ఇది కవి వాక్యం కాదు

**తే. గీ.** అనిన వడవడ వడఁకి సాష్టాంగ మెఱఁగి
సమ్మదాశ్రులు పులకలు ముమ్మరింప
వినయ వినమిత గాత్రుఁడై విప్రవరుఁడు
వెన్నునకు నిట్లని భక్తి విన్నవించె. 89

అనినన్ = అనగానే; వడవడ వడఁకి = గడ గడ వణకి; సాష్టాంగము = ఎనిమిది అవయవాలు నేలను తాకేటట్లుగా; ఎఱఁగి = నమస్కరించి; సమ్మద+ అశ్రులు = సంతోషబాష్పాలు; పులకలు = పులకరింతలు; ముమ్మరింపన్ = ఇబ్బడి ముబ్బడి కాగా; వినయ వినమితః వినయముతో వంపబడ్డ; గాత్రుడై = శరీరం కలవాడై; విప్రవరుఁడు = బ్రాహ్మణోత్తముడు; భక్తిన్ = భక్తితో; వెన్నునకున్ = విష్ణువునకు; ఇట్లని = ఈ క్రింది విధంగా; విన్నవించెన్ = విన్నపం చేశాడు.

తా॥ ఆ విధంగా భగవంతుడనే సరికి గడ గడా వణికి పోయి విష్ణుచిత్తుడు సాష్టాంగముగ నమస్కారమిడి హర్ష బాష్పాలు పులకరింతలు అధికం కాగా వినయంతో శరీరాన్ని వంచి విప్రవర్యుడు భక్తితో స్వామి నిలా అర్థించాడు.

ఈ పద్యంలో వడవడ వడకి = కంపము; సమ్మదాశ్రులు = బాష్పము; పులకలు= రోమాంచము ఇవి సాత్త్విక భావాలు. ఏ భావమైనా ఉచ్చదశలో భావింపబడ్డప్పుడు సాత్త్విక భావోదయ మౌతుంది. రసానుభవంలో వీటి ప్రాధాన్య ముంది. వినమితగాత్రుడు కావటం భక్తియొక్క అభినయ విశేషం. విన్నంచుట రాజైన వానికి భటుడైన వాడు చెప్పుకొనేమాట విన్నపం.

శా. స్వామీ ! నన్ను, నితఃపురాపఠిత శాస్త్రగ్రంథ జాత్యంధు, నా
రామక్ష్మా ఖనన క్రియాఖరఖనిత్రగ్రాహితోద్యత్కిణ
స్తోమాస్నిగ్ధకరు, న్భవద్భవనదాసు, న్వాదిఁగాఁ బంపుచో
భూమీ భృత్సభ నోట మైన నయశంబున్ మీకుఁ గాకుండునే ? 90

స్వామీ = భగవంతుడా !; ఇతః = ఇంతకు; పురా = పూర్వం; అపఠిత = చదువబడని; శాస్త్రగ్రంథ = ఆయాశాస్త్రగ్రంథాల్లో; జాతి+ అంధున్ = పుట్టుగ్రుడ్డిని; ఆరామః గుడిపూల తోటయొక్క; క్ష్మా = నేలలో; ఖనన = త్రవ్వడమన్న; క్రియా = పనిలో; ఖరః కాఠిన్యంగలదైన; ఖనిత్ర = గడ్డపారను; గ్రాహిత = పట్టుకోవడంచేత; ఉద్యత్ = ఉదయిస్తున్న; కిణ = కాయలయొక్క; స్తోమ = సమూహంతో; అస్నిగ్ధ = గరుకైన; కరున్ = చేతులున్న; భవత్ = నీయొక్క; భవనదాసున్ = గుడిలో దాస్యం చేసేవాడినైన; నన్నున్; వాదిఁగాన్ = శాస్త్రవాదాలు చేసేవానిగా; పంపుచోన్ = పంపితే; భూమీ భృత్ = రాజుయొక్క; సభన్ = ఆస్థానంలో; ఓటము = అపజయం; ఐనన్ = కలిగితే; అయశంబున్ = అపకీర్తి; మీకు = తమకు; కాకుండునే = చెందదా?

తా॥ సర్వలోకాలకు యజమానివైన స్వామీ ! ఇంతకు ముందు నేనేమీ శాస్త్రగ్రంథాలు చదవలేదు. మీ పూలతోటలో నిత్యమూ గడ్డపారతో పనిచేసినందువల్ల నాచేయి కాయలు కాచి కర్కశత్వం పొందింది. ఇలాంటి మీ సేవకుని రాజసభకు వాదించడానికి పంపిస్తే వచ్చే అపయశస్సు తమదే కదా !

**అలం** : పరికరము.

విశే॥ స్వామీ అన్న సంబోధనతో పద్యం ప్రారంభం కావడం విశేషశిల్పం. శ్రీవైష్ణవం ప్రకారం భగవంతుడే యజమాని. భక్తుడు అతని యాజ్ఞననుసరించే సేవకుడు మాత్రమే. కనుకనే 'భవద్భవన దాసున్' అని

ప్రయోగింపబడింది. 'భూమీభృత్' ఒక దేశానికి ఏలిక. భగవంతుడు జగత్తున కంతటికీ రారాజు. కనుక నీకు సామంతుని వంటి అతని సభకు శాస్త్రగ్రంథాలు చూడని నాబోటివాడు వెళ్ళినపుడు కలిగే అపకీర్తి నీకే కదా ! ఇది దాసునకు చెందదు. ఎందుకంటే ఫలాఫలాలు యజమానివి తప్ప సేవకునివి కావు. ఇది శ్రీవైష్ణవ మతరహస్యం. ఇందుకే దాసరికథలో కూడ రాక్షసునితో దాసరి అన్నాడు. 'ఫలంబు పరమేశముఖోల్లాసంబ' ఆజ్ఞాకైంకర్యంబులకు ననుమతి కైంకర్యంబులకు ఫలపరిమాణ గణన ప్రపన్నున కెక్కడిది ? కాన బంధకంబగుట'' అని. గీతలో కూడా భగవంతుడు నీకు కర్మాధికారముందే తప్ప ఫలాధికారం లేదన్నాడు. ఇందుచేత ఈ పద్యం వైష్ణవమత రహస్యానికి నిధి.

కొందరన్నారు. అతనేమీ చదువుకోకుండానే ఇంత సంస్కృత సమాసభూయిష్ఠమైన రచన చేయగలడా ? అనగలడా ? అని కాని ప్రథమాశ్వాసంలో విష్ణుచిత్తుడు అతిథులతో సంస్కృతంలో సంభాషించినట్లు చెప్పబడింది. కనుక అతనికి సంస్కృతం వచ్చు. శాస్త్రగ్రంథాలు చదువలేదు. ఈ విషయం కూడా ప్రథమాశ్వాసంలో 78వ వచనంలో చెప్పబడ్డది. ఇందుకనే కవి ఈ పద్యంలో 'శాస్త్ర' అన్న మాటను యతిస్థానంలో ప్రయోగించాడు. ఇందువల్ల విష్ణుచిత్తుడు శాస్త్రాలు చదువలేదు తప్ప సంస్కృత భాష తెలియని వాడు కాడు.

మ. గృహ సమ్మార్జనమో, జలాహరణమో, శృంగార పల్యంకికా
వహనంబో, వనమాలికా కరణమో, వాల్లభ్యలభ్యధ్వజ
గ్రహణంబో, వ్యజనాత పత్రధృతియో, ప్రాగ్దీపి కారోపమో,
నృహరీ ! వాదము నాకు ? లేరె యితరుల్నీ లీలకుం బాత్రముల్ ? 91

గృహ సమ్మార్జనమో = దేవాలయాన్ని ఊడ్చడమో; జలాహరణమో = అభిషేకార్థం నీళ్ల తేవడమో; శృంగార = అందమైన ఊరేగింపులో; పల్యంకికా = పల్లకి; వహనంబో= మోయడమో; వనమాలికా = పాదాల పర్యంతం వ్రేలాడే దండను; కరణమో = కట్టటమో; వాల్లభ్య = గరుత్మంతుని బొమ్మగల జెండా ( ఇది భగవద్దాసులకే లభంచే అనుగ్రహవిశేషం) ; లభ్య = పొందదగినదైన; ధ్వజ = పతాకముయొక్క, గ్రహణంబో = మోయటమో; వ్యజన = విసనకర్రలయొక్క; ఆతపత్ర = గొడుగుయొక్క; ధృతియో = ధరించడమో; ప్రాక్ = ముందు; దీపికా = దీపాలయొక్క; ఆరోపమో = వెలిగించడమో; నృహరీ = నరసింహస్వామీ !; వాదము నాకు = వాదము అని అనకు; నీ లీలకున్ = నీ ఆటకు; పాత్రముల్ = తగినవారు (వేషధారులు), ఇతరుల్ లేరె = వేరెవ్వరు లేరా !

స్వామీ ! నేను మీ ఆలయాన్ని చిమ్మి, అభిషేకంకోసం నీళ్లు మోసి, ఊరేగడానికి అలంకరించిన పల్లకిని మోసి, నీ జండాలను మోస్తూ, నీకు వీచోపులు వీస్తూ, గొడుగు పడుతూ, నీ ఊరేగింపులో నీ పల్లకికి[2] ముందు కాగడాలు వెలిగిస్తూ బ్రతికే నన్ను వాదిగా చేయకు. నీ లీల ప్రదర్శించాలంటే తగిన వారు ఎందరో ఉన్నారు కదా !

విశే॥ శ్రీవైష్ణవంలో స్వామికైంకర్యమే పరమ సేవగా చెప్పబడ్డది. గుడిలో విగ్రహం అర్చావతారం అందరకు అందుబాటులో ఉండే దైవస్వరూపమదే. కాబట్టి ముక్తి సాధన మదే. ఈ కావ్యంలో కూడా నాయకుడు

అర్చావతారమైన శ్రీవిల్లిపుత్తూరులోని మన్నారు స్వామియే కనుక ఈ సేవలు కైంకర్య విశేషాలుగా కవి గుది గుచ్చడం జరిగింది. (నాదము లేల ? లేరె - పాఠాంతరం 1) వీనిని ఘట దాసుడంటారు. 2) సంధ్యా సమయంలో గుడిలో దీపాలుంచటం ఇవన్నీ చేసేవానినే భగవద్దాసుడంటారు. ఈ శబ్దం సాంకేతికం.

పద్యం చాలా సొగసైన కూర్పు కలది. నేటికీ పుణ్యక్షేత్రాలలో, దేవాలయాల్లో ఈ సేవా విశేషాలు దర్శన మిస్తాయి.

మన్ననారు విష్ణుచిత్తు ననుగ్రహించుట

తే ॥ అనినఁ దద్భక్తి కెద మెచ్చి యచ్యుతుండు
మొలకనగవొప్ప శ్రీదేవి మోము సూచి,
'వాదితనిచేత గెలిపింతు; నాదుమహిమ
మువిద ! కను' మని ప్రాభవం బొప్పఁ బలికి. 92

అనినన్ = విష్ణుచిత్తు డీ విధంగా అంటే; అచ్యుతుండు = శ్రీమహావిష్ణువు; తత్ + భక్తికిన్ = ఆ విష్ణుచిత్తుని భక్తికి; ఎదన్ = హృదయంలో; మెచ్చి = మెచ్చుకొని; మొలక నగవు = లేత నవ్వు; ఒప్పన్ = ప్రకాశింపగా, శ్రీదేవి = లక్ష్మీదేవి; మోము = ముఖము; చూచి = చూచి; ఉవిద = లక్ష్మి !; వాదు = వాదము; ఇతని చేతన్ = ఇతని చేతనే ; గెలిపింతున్ = గెలిపిస్తాను; నాదు మహిమ = నాయొక్క మహత్త్వము; కనుము = చూడుము; అని; ప్రాభవంబు = ప్రభులక్షణం; ఒప్పగా = ప్రకాశింపగా; పలికి = అని.

తా॥ విష్ణుచిత్తు డలా అనేసరికి అతను భక్తికి, వినయానికి భగవంతుడు ఆనందించి ప్రక్కనున్న లక్ష్మీవంక చిరునవ్వుతో చూస్తూ ఇతని చేతనే వాదు గెలిపిస్తాను. చూస్తూ ఉండు అని జగన్నాయక లక్షణం ప్రకాశించేటట్లుగా అని.

ఇక్కడ లక్ష్మీదేవి ప్రసక్తి దేనికి? యామునాచార్యుని కథలోనూ ఇలాగే. అతని కథ కూడా లక్ష్మీదేవికే చెప్పినట్లున్నది. భగవంతుడెక్కడ కావ్యంలో వర్ణింపబడ్డా, లక్ష్మితో పాటుగానే ఉన్నట్లు కవి చిత్రించాడు. ఎందుకంటే మతం ప్రకారం ఇది శ్రీవైష్ణవం. లక్ష్మిని ముందుంచుకున్న విష్ణువును అర్చించే మతం. రసదృష్టితో ఈ కావ్యంలో ప్రధానరసం శృంగారం. నాయికా నాయకులు వీరిద్దరే. కాకపోతే లక్ష్మిస్థానంలో గోదాదేవి రాబోతున్నది. ఈ రసమత సమన్వయం కావ్యంలో విశిష్ట నిర్మాణం.

క. 'నీ యిచ్చయె ? మిన్నక పో
వోయి; మునిప్రవర ! నిన్ను నొప్పింతును భూ
నాయకు సభ; నిందులకై
యేయడ్డము వలవ దవల నేనున్నాఁడన్'. 93

మునిప్రవర = భక్తశ్రేష్ఠుడా !; నీ యిచ్చయె = నీ యిష్టమా; మిన్నక = మాట్లాడకుండా; పోవోయి = వెళ్లవయ్యా !; భూనాయకు సభన్ = రాజు కొలువుకూటంలో; నిన్ను; ఒప్పింతున్ = గెలిపిస్తాను; ఇందులకై =

ఈ విషయంలో; ఏ అడ్డము = నిరుద్ధమైన మాట ఏదీ; వలవదు = పనికిరాదు; అవలన్ = పైన; నేనున్నాడన్ = నేనున్నాను.

తా॥ ఓయి ! మునిశ్రేష్ఠుడా ! నీ యిష్టానిష్టాలతో పనిలేదు. మాట్లాడకుండా వెళ్లు. రాజు సభలో నీకు విజయాన్ని కల్పించే విషయం మాకు సంబంధించినది కనుక వ్యతిరేకపు మాటలనకుండా వెళ్లు. అన్నిటికీ పైన నేనున్నాను కదా !

ఈ పద్యంలో భగవంతుడు జగత్పాలనను కార్యాకార్య విచక్షణతను తనయందు ఆరోపించుకొంటున్నాడు. సర్వానికి తానే మూలమని స్పష్టంగా చెబుతున్నాడు. కనుక సేవకుడైన విష్ణుచిత్తుని ఇష్టానిష్టాల ప్రసక్తి లేదు. ఫలాఫలాలకు కర్తగా పైన తానే యున్నాడు.

శ్రీవైష్ణవం ప్రపత్తి యోగాన్ని ప్రచారం చేసింది. భగవంతుని శరణు అని అతని ఆనతి చొప్పున నడచుకోవడమే ప్రపత్తియోగం. దాని లక్షణమే చిన్న పద్యంగా అభివ్యక్తమైంది. పైగా రాజైన వాడు సేనానాయకుని యుద్ధాలకు నియమిస్తాడు తప్ప అతని యిష్టానిష్టాలను మనసులో పెట్టుకొని ప్రవర్తించడు గదా ! కనుక ప్రభు ఆజ్ఞాలక్షణం ఈ పద్యంలో మృదువుగా చిరునవ్వుతో గూడుకొని ప్రసరించినట్లు కవి వ్రాయడం చాలా అద్భుతమైన విషయం.

'అవల నేనున్నాడన్' అన్నమాట తృతీయాశ్వాసం ప్రారంభపద్యంలోనే తెలుస్తుంది. చూ. 3-4.

ఆ॥ అనిన, మాఱు వలుక నలికి యయ్యాళు వా
రియ్య కొనియెఁ బోవ; నింతలోనఁ
బద్మనయనుఁ డతని పయనంబుఁ దూఁగింపు
మనుచు నంబి తోడ నాన తిచ్చె. 94

అనినన్ = భగవంతుఁడావిధంగా అన్నాక; అయ్యాళువారు = ఆ పెరియాళ్వారు; మాఱు పలుకన్ = సమాధానం చెప్పడానికి; అలికి = భయపడి; పోవక = మధుర వెళ్లడానికి; ఇయ్యకొనియెన్ = ఒప్పుకొన్నాడు; ఇంతలోన = ఇంతలోపు; పద్మనయనుడు = తామరపూల వంటి నేత్రాలున్న శ్రీవిష్ణువు; అతని = విష్ణుచిత్తుని; పయనంబు = ప్రయాణము; తూగింపుము = సిద్ధం చేయి; అనుచున్; నంబితోడన్ = గుడిపూజారితో; ఆనతిచ్చెన్ = ఆజ్ఞాపించాడు.

తా॥ భగవదాజ్ఞకు మారుమాటాడడానికి జంకి విష్ణుచిత్తుడు పోవడానికి అంగీకరించాడు. ఈ లోపల గుడి పూజారితో భగవంతుడు విష్ణుచిత్తుని ప్రయాణానికి కావలసిన ఏర్పాట్లు చేయుమని ఆజ్ఞాపించాడు.

### విష్ణుచిత్తుఁడు మధుర కేఁగుట

క. అనతిఁ బడి, శ్రీభండా
రాన న్పంబడముఁ దనదు ప్రాఁతందలమున్

స్థానికుఁ డొసంగి పనుపం
గా, నానతిఁ బడిన నిమితకాండ్రు వహింపన్. 95

ఆనతిన్ = నంబితో భగవంతుడు చెప్పిన ఆజ్ఞను; పడి = అనుసరించి; స్థానికుడు = పారుపత్తేదారు; శ్రీభండారానన్ = శ్రీవారి బొక్కసంనుండి; సంబడమున్ = దారిబత్తెమును; తనదు = తనయొక్క; ప్రాత; అందలమున్ = పల్లకిని; ఒసంగి = ఇచ్చి; పనుపంగాన్ = పంపిస్తే; నిమితకాండ్రు = పల్లకి మోసే బోయవారు; వహింపన్ = పల్లకిని మోయుగా.

తా॥ నంబినుండి స్వామి ఆజ్ఞను పారుపత్తేదారు పొంది కోవెల బొక్కసంనుండి దారిబత్తెము నిచ్చి తన పాతపల్లకీలో అతనిని కూర్చునుమని ప్రయాణాన్ని తూగిస్తే స్థానికుని ఆనతిచేత ఆ పల్లకీని బోయలు మోస్తూ వెళ్లారు.

పాఠాంతరం - సంబడమునందు ప్రాయందలమున్.

క. లావు గల యద్దె గుఱ్ఱపుఁ
జావడముల మీఁద మాత్ర సంచులు దూలన్
గ్రేవల నేకాంగులు రా,
వీవధముల నఱిసె లవనివిభునకుఁ గొనుచున్. 96

లావుగల = బలసిన; అద్దె = బాడుగకు తీసుకోబడ్డ; గుఱ్ఱపు = గుఱ్ఱాల; చావడముల మీదన్ = తట్టుల మీదన్; మాత్రసంచులు = అసిమి సంచులు; తూలన్ = అటు ఇటు ఊగుతూ ఉండగా; క్రేవలన్ = ప్రక్కలయందు; ఏకాంగులు = సన్యాసులైన భక్తులు; రాన్ = రాగా; అవని విభునకున్ = మధుర రాజుకోసం; వీవధములన్ = కావళ్లలో; అరిసెలు = తీయని పిండివంటలు; కొనుచున్ = పట్టించుకొంటూ.

తా॥ బలిసిన అద్దెగుఱ్ఱపు తట్టులమీద కావలసిన సంబారాలను మాత్రసంచులలో పెట్టి అవి మోస్తూరాగా; పల్లకి కిరుప్రక్కల విరక్తులైన భక్తులు వస్తూ ఉండగా కావళ్లలో అరిసెలన్న భక్ష్యవిశేషాలను రాజుకోసం తీసుకొంటూ (ముందరి పద్యానికి అన్వయం.)

(అద్దె - అట్టె - పాఠాంతరం)

సీ. భక్తిఁ ద్రోవకు సాధ్విపరికరంబులు వెట్టి
కట్టిన పారివిళంగాయ గమియు,
నెనటి పోఁతలు గాఁగ నేర్పరించిన చిరం
తనపు శాలిక్షేమ తండులములు,
వడిఁబెట్టి లోఁజెఱకడము సాఁబాలూన్పఁ
జెలఁగు సంబారంపుఁ జింతపండు,

పెల్లు లోహండి కావళ్ల కొమ్ముల వ్రేలు
గిడ్డి మొత్తపు నేతి లడ్డిగలును,

తే. పెరుఁగు వడియంబులును, బచ్చివరుగు, బేడ
లురుతరాచ్యుత పూజోపకరణ పేటి
కలును సాత్తిన సాత్తని కులము బలసి
విధి నిషేధము లెఱిఁగి తే మధురకరిగె. 97

సాధ్వి = పతివ్రతయైన విష్ణుచిత్తుని భార్య; భక్తిన్ = భర్తపైనున్న అత్యంత ప్రేమతో; త్రోవకున్ = ప్రయాణానికై; పరికరంబులు = సంబారాలు; పెట్టి = ఉంచి; కట్టిన = మూటకట్టిన; పారివిళంగాయ గమియున్ = వేయించిన బియ్యపు పిండి బెల్లపు పాకంలో పోసి చేసిన ఉండల సమూహం; ఎసటి పోతలు కాగన్ = ఎసట్లో వేసుకోవడానికి వీలుగా; ఏర్పరించిన = పరిశుభ్రంచేసిన; చిరంతన = ప్రాతపడిన; శాలి = వడ్లయొక్క; క్షేమ = క్షేమార్థమైన; తండులములు = బియ్యము; వడిఁబెట్టి = పరిశుభ్రంచేసిన; లోన్ = లోపల; చెఱకడము = బెల్లము; సాఁబాలు = సగం భాగం; ఊన్పన్ = ఉంచగా, చెలగు = అందమైన (రుచిగల); సంబారంపు = సంబారపు దినుసులు చేర్చిన చింతపండును.

(చెఱకడము = జీఱగుడము = జీలకర్రతో కలిపిన బెల్లం,) లోహండి = వంట బిందెల; కావళ్ల కొమ్ములన్ = కావడుల చివళ్లకు, వ్రేలు = వ్రేలాడుతున్న; పెల్లు = అధికమైన; గిడ్డి మొత్తపు = అనేక గోవులయొక్క; నేతి లడ్డిగలును = నేయి కల సన్నని మూతిపాత్రలు; (లోహి+అండి = ఇత్తడితో చేసిన పెద్ద అండా) పెరుగువడియంబులును = పెరుగు కలిపి చేసిన వడియాలు; పచ్చివరుగులు = ఉడక బెట్టని వరుగు = మామిడి, దోస మొదలైన కాయలను కోసి ఎండబెట్టిన ముక్కలు; బేడలు = పప్పులు, ఉరుతర = పెద్ద; అచ్యుత = విష్ణువుయొక్క; పూజోపకరణ = పూజాసామాగ్రి పెట్టుకున్న పెట్టెలు (నిత్యపూజకోసం విఘ్నం లేకుండా విగ్రహాలు పూజా సామగ్రి పెట్టు కొన్న పెట్టెలు); సాత్తిన = సిగలు, జందెములు ధరించిన వారు; సాత్తని = అవిలేని వారు అయిన కులంవారు (వైష్ణవమతస్థులు); బలసి = చుట్టుకొని; విధినిషేధముల్ = శాస్త్రము చెప్పిన చేయవలసిన విధులు; చేయరానివి; ఎఱిఁగి = తెలిసిన వారై; తేన్ = తెస్తుండగా; మధురకున్+అరిగెన్ = మధురకు వెళ్లెను.

ఈ పద్యంలో విష్ణుచిత్తుని ప్రయాణ పద్ధతి వర్ణింపబడినది. పతివ్రత అయిన అతని భార్య ప్రేమతో ప్రయాణంలో ఉపయోగించుకోడానికై అనేక సంబారాలు పెట్టి బియ్యమూ, బెల్లం కలిపి కట్టిన తీపి పదార్థాలు మూట కట్టి, ఎసటిలో పోసి వండుకోవడానికి వీలుగా పరిశుభ్ర పరచిన పాతబియ్యము, చక్కగా వడకొట్టి పుల్లాపుడక లేకుండా ఏరిన జీలకర్ర, బెల్లంతో కలిపి సగభాగం చింతపండుతో కలిపి కట్టిన సంబార ద్రవ్యం, మంచి ఆవునేతి పిడతలు, వ్రేలాడే కావళ్లు మోసుకుంటూ పెరుగు వడియాలు, పచ్చివరుగులు, పప్పులు నిత్యపూజ కోసం ఉపకరించే సాధనాల పెట్టెలు తగిన జనులు మోసుకొని వస్తుండగా తలపై సిగలు జందెములు ధరించిన వైష్ణవులు, అవి లేని వైష్ణవులు, తనను పరివేష్టించుకొని విధినిషేధాలు ఎరిగిస్తూవెంట రాగా విష్ణుచిత్తుడు మధురకు ప్రయాణమై వెళ్లాడు.

విశే॥ ఆనాటి కాలంలో ప్రయాణసన్నాహాలు, నైఖరులు ఎలా ఉండేవో ఈ కావ్యంలో రెండు, మూడు చోట్ల వర్ణించాడు. దాసరి కథలో బ్రహ్మరాక్షసుని పూర్వరూపమైన సోమశర్మ ప్రయాణవర్ణన మరొకటి కనిపిస్తుంది. రెండు భిన్నంగా చేయబడ్డవి. ఈ పద్యంలో విష్ణుచిత్తుని భార్య స్మరింపబడ్డది. ప్రథమాశ్వాసంలో అతిథి మర్యాద సందర్భంలో కూడ ఈమె స్మరింపబడింది. చివరి ఆశ్వాసంలో గోదాదేవి వివాహ సందర్భంలో కూడా ఈ సాధ్వి వర్ణన వస్తుంది. ఈ మూడు చోట్లా ఒక మెరుపు తీగలా మెరిసి పోయిన పాత్రయిది. శ్రీ విశిష్టాద్వైతం సన్యాసం కంటె గృహస్థాశ్రమానికి ప్రాధాన్యతము నిచ్చినందువల్ల నాయకుడైన విష్ణువు లక్ష్మీసహితుడై ఎలా కావ్యంలో వర్ణింపబడుతున్నాడో అలాగే విష్ణుచిత్తునితో పాటు అతని భార్య కూడా.

అలం : స్వభావోక్తి.

చ. యమ నియమాది లభ్య, ద్రుహిణాది జరన్మరు దిభ్య, సంసృతి
శ్రమహర నామకీర్తన, ముర ప్రవికర్తన, పాతకావలీ
దమన, రమాంగనాకమన, తామరసాయతనేత్ర, భక్త హృ
ద్భ్రమ తృణదాత్ర, భూయువతి రంజన, వర్ణజితాభ్రఖంజనా ! 98

యమనియమ = అంతరింద్రియ, బహిరింద్రియ నిగ్రహంచేత; లభ్య = పొందదగిన వాడా !; ద్రుహిణ = బ్రహ్మ; ఆది = మొదలైన; జరత్ = ముసలి; మరుత్ = దేవతలకు; ఇభ్య = ప్రభూ !; సంసృతి = సంసారమనే; శ్రమ = కష్టాన్ని; హర = పోగొట్టే; నామకీర్తన = నామసంకీర్తనం కలవాడా !; ముర = మురాసురుని; ప్రవికర్తన = కత్తిరించిన వాడా!; పాతక = పాపాలయొక్క; ఆవలీ = సమూహాన్ని; దమన = అణచేవాడా !; రమ+అంగన = లక్ష్మి అన్న స్త్రీచే; కమన = కామించబడువాడా!; తామరస = తామర పూలవంటి; ఆయత = విస్తారమైన; నేత్ర = కనులు గలవాడా; భక్త = భక్తులయొక్క; హృత్ = హృదయాలలో; భ్రమం = అజ్ఞానమన్న; తృణ = గడ్డికి; దాత్ర = కొడవలి అయిన వాడా!; భూయువతిరంజన = భూమి అన్నయౌవన వతిని సంతోషపెట్టే వాడా !; వర్ణ = దేహకాంతితో; జిత = జయింపబడ్డ; అభ్ర = మేఘం; ఖంజనా = కాటుక పిట్టలు గలవాడా !

తా॥ యమ నియమాది రూపమైన యోగంతో సాధ్యమైనవాడా ! పురాణవ్యక్తులైన బ్రహ్మాదిదేవతలకు ప్రభువైన వాడా ! సంసార దుఃఖాన్ని కేవలం నామసంకీర్తనతో పోగొట్టేవాడా ! మురాసురుని ఖండించినవాడా! పాతక సమూహాన్ని నాశనం చేసేవాడా!రమాపతీ ! విశాల పుండరీకనయనా ! భక్తులహృదయాల్లోని అజ్ఞానాన్ని తొలగించేవాడా ! భూదేవీ వల్లభా ! నల్లని శరీర వర్ణం కలవాడా!

అలం : అంత్యానుప్రాసం.

యమనియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ , సమాధులు అని ఎనిమిది యోగాంగము లున్నాయి. ఈ అష్టాంగయోగంతో సాధ్యమయ్యేవాడు భగవంతుడు. భూ యువతి రంజన! కావ్యంలో నాయిక గోదాదేవి భూదేవే కనుక కావ్యనాయికా స్మరణ కూడా ఉంది.

క. దోర్ధార్ధృత దుర్ధర గో
వర్ధన ! రాధానురాగ వర్ధన ! లీలా
వార్ధుషికా, యిషికాకృత
వార్ధశ్రవసైక నేత్రవైకృతి నిపుణా ! 99

ధార్ = కాడినంటి; దోః = బాహువుచేత; ధృత = ధరింపబడ్డ; దుర్ధర = ఇతరులకు ధరించడానికి అశక్యమైన; గోవర్ధన = ఆ పేరుగల పర్వతమెత్తిన వాడా !; రాధా = రాధకు; అనురాగవర్ధన = ప్రేమను పెంచినవాడా; లీలా = విలాసార్థమైన; వార్ధుషికా = వడ్డీవలన బ్రతికే వాడా ! (వడ్డీవ్యాపారి); ఇషిక = గడ్డిపోచతో; కృత =చేయబడ్డ; వార్ధశ్రవస = ఇంద్రుని కొడుకైన కాకాసురునియొక్క, (వృద్ధశ్రవసుడు = పెద్దలవల్ల అనేకం విన్నవాడు ఇంద్రుడు); ఏకనేత్ర = ఒక కంటియొక్క; వైకృత = వికృతిని కల్పించుటలో; నిపుణా= నైపుణ్యం కలవాడా !

తా॥ గోవర్ధన ధారీ !, రాధామనోహర ! వడ్డికాసులవాడా ! కేవలం దర్భపోచతో కాకాసురుని ఒంటి కంటివానిని చేసినవాడా !

అలం : వృత్యనుప్రాసం.

మా. ద్రుహిణజ ముఖమౌని స్తోమ నిస్తంద్ర భాస్వ
ద్దహర విహర మాణాతామ్ర పాదాంబు జాతా !
బహిర బహిరపార ప్రాణికోటి ప్రపూర్ణా !
మహిమ వినుత వాణీ మాధురీ వేద్యపర్ణా ! 100

ద్రుహిణ = బ్రహ్మనుండి; జ = పుట్టిన నారదుడు; ముఖ = మొదలైన; మౌని = మునులయొక్క; స్తోమ= సమూహం యొక్క; నిస్తంద్ర = నిద్రతూగులేని; భాస్వత్ = ప్రకాశించే; దహర = హృదయాకాశంలో; విహరమాణ = విహరిస్తున్న; ఆతామ్ర= మిక్కిలి ఎర్రనైన; పాద+ అంబుజాతా = పాదపద్మాలు కలవాడా ! బహిః = వెలుపల; అబహిః = లోపల; అపార = అనంతమైన; ప్రాణికోటి = జీవసముదాయంతో; ప్రపూర్ణ నిండిన వాడా; మహిమ = ప్రభావంయొక్క; వినుతి = ప్రస్తుతి యయిన; వాణీ = సరస్వతి యొక్క; మాధురీ = తీయదనము; వేది = తెలిసిన; అపర్ణా ! పార్వతి కలవాడా !

తా॥ నారదాది మహామునులు ఎవని పాదపద్మాలను నిత్యజాగరూకులై హృదయాకాశంలో దర్శిస్తున్నారో, సకలజీవరాశికి బయటా లోపల ఎవడు నిండియున్నాడో, ఎవని మహిమను సరస్వతి గానం చేస్తుంటే ఆ గానమాధుర్యాన్ని తెలిసి పార్వతి సంతోషిస్తున్నదో అలాంటి శ్రీవేంకటేశ్వరస్వామికి సంబోధనలు.

మాలిని: న, న,మ,య,య అను త్ర్యక్షరగణములుంటాయి. యతి: 1-9; ప్రాసనియమమున్నది.

మ. ఇది భూమండన కొండవీడు ధరణీ భృద్దుర్గపూర్వాద్రి భా
స్వదిభేశాత్మజ వీరభద్రజన జీవగ్రాహ రాహూయమా

ణ దృఢాంచద్భుజ కృష్ణరాయ మహీభృన్నామాస్మదాముక్త మా
ల్యద నాశ్వాసము హృద్యపద్యము ద్వితీయంబై మహింబొల్పగున్. 101

ఇది = ఈ; ఆశ్వాసము = కావ్యవిభాగం; హృద్యపద్యము = హృదయాన్ని కరిగించే పద్యాలు కలది; భూ= భూమికి; మండన = అలంకారమైన; కొండవీడు = ఆ పేరుగల; ధరణీభృత్ = కొండపైనున్న; దుర్గ= దుర్గంలోను; పూర్వాద్రి = ఉదయగిరి దుర్గంలోను; భాస్వత్ = సేనాదులతో ప్రకాశించే; ఇభ+ఈశః గజపతియొక్క; ఆత్మజ = కుమారుడైన; వీరభద్ర = వీరభద్రపాత్రునియొక్క; జన = బంధువులయొక్క; జీవ = ప్రాణాలను; గ్రాహ = గ్రహించుటలో; రాహూయమాణ = రాహువువలె అవుతున్న; దృఢ = కఠినమైన; అంచత్ = ప్రకాశించే; భుజ = బాహువులు కల; కృష్ణరాయ మహీభృత్= కృష్ణరాయ భూపాలకుడన్న; నామ = పేరుగల; అస్మత్ = నాయొక్క; ఆముక్తమాల్యదన్ = అపేరుగల కావ్యంలో; ద్వితీయంబై = రెండవది యై; మహిన్ = లోకంలో; పొల్పగున్ = శోభిస్తున్నది.

తా॥ ఆముక్తమాల్యదలో ఇది రెండవ ఆశ్వాసం. అది హృద్యపద్యాలతో శోభిస్తున్నది. దాని కర్త శ్రీకృష్ణదేవరాయలన్న పేరు గల చక్రవర్తి. ఆయన వీరభద్రగజపతిని ఓడించి అతని బంధుజనాన్ని ప్రాణాలతో పట్టుకొన్నాడు. ఆ వీరభద్రుడు కొండవీడు, ఉదయగిరి దుర్గాలకు ఏలిక.

ప్రథమాశ్వాస గద్యలో ఉదయగిరి దుర్గాన్ని పట్టుకొన్న వైనం వర్ణింపబడింది. అక్కడ దానికి పాలకుడుగా గజపతి పినతండ్రి చెప్పబడ్డాడు. అతని పేరు ప్రహరేశ్వరపాత్రుడు. దానిని పట్టుకున్న తేది 1512. తరువాత కొండవీటి దుర్గాన్ని పట్టుకున్న తేది 1514. ఈ రెంటి మధ్య చిన్నచిన్న దుర్గాలు చాలా ఉన్నాయి. వాటిని పారిజాతాపహరణ కర్త నంది తిమ్మన అవతారికలో వర్ణించాడు. వీరభద్రగజపతిని ప్రాణాలతో బంధించి అతని రాణివాసాన్ని కూడా విజయనగరానికి తెచ్చి చెరసాలలో ఉంచినాడని అతడందులోనే చనిపోయాడని కొందరు వ్రాశారు. మరికొందరు వీరభద్రజగపతిని కర్ణాటక ప్రాంతం మలయుబెన్నూరు సీమకు పాలకునిగా చేసినాడని వ్రాసినారు.

ఇదే నిజం రాజనీతి.



# ఆముక్తమాల్యదా సౌందర్యం

## తృతీయాశ్వాసము

కం. శ్రీక్షితి నీళావర! దను, జోక్ష ప్రాణహర! దంష్ట్రి కోత్కృత్తహిర
ణ్యాక్ష క్షపాచర! కృపా, వీక్షాదృత బాహులేయ! వేంకటరాయా! 1

శ్రీ = లక్ష్మీదేవి; క్షితి = భూదేవి; నీళా = నీళాదేవి. ( ఈముగ్గురికి); వర = భర్తయైనవాడా!; దనుజ = రాక్షసుడైన; ఉక్ష = ఎద్దుయొక్క; ప్రాణహర = ప్రాణాలను తీసినవాడా!; దంష్ట్రిక = కోరల చేత; ఉత్ = పైకి ఎగురవేసి; కృత్త = నరకబడ్డ; హిరణ్యాక్ష= ఆపేరుగల; క్షపాచర = రాక్షసుడు కలవాడా!; కృప = దయగల; వీక్ష = చూపుల చేత; ఆదృత = ఆదరింపబడ్డ; బాహులేయ = కుమారస్వామి కలవాడా! వేంకటరాయా = శ్రీ వేంకటేశ్వరా!

ఈ పద్యంలో శ్రీవేంకటేశ్వరునికి నాలుగు విశేషణాలు వేయబడ్డాయి. లక్ష్మీ, భూ, నీళా దేవులకు భర్తయైనవాడు, ఎద్దు రూపెత్తిన రాక్షసుని సంహరించినవాడు, వరాహరూపమెత్తి ( దంతాలతో) కోరలతో పైకెగుర వేసి హిరణ్యాక్షుని నరికినవాడు, దయాదృష్టితో కుమారస్వామిని ఆదరించినవాడు.

రెండవ విశేషణానికి సంబంధించిన కథ భాగవతంలో ప్రసిద్ధమైంది. నీళాదేవి కుంభకుడన్న వాని కూతురు. కాలనేమి అన్న రాక్షసి కొడుకులు ఆబోతు రూపాలతో గొల్లపల్లెను బాధిస్తుండగా వానిని చంపినవానికి తన కూతురు నిచ్చి పెళ్లి చేస్తానని కుంభకుడు చాటిస్తే శ్రీకృష్ణుడు వానిని సంహరించి నీలను పెళ్లి చేసుకున్నాడు. శ్రీవిశిష్టాద్వైత మతాచార్యులు, ఆళ్వారులు శ్రీకృష్ణునికి నీలపై ఎక్కువ ప్రేమ అన్నట్లు అనేక సార్లు స్తుతించారు. శ్రీకృష్ణదేవరాయలకు శ్రీకాకుళాంధ్రదేవుడు కలలో అగుపించి ఆముక్తమాల్యదను వ్రాయ మన్న సందర్భంలో 'ఏమును దాల్చిన మాల్య మిచ్చునప్పిన్నది' - అన్న వాక్యంలో 'నప్పిన్నది' అంటే నీళాదేవి. గోదాదేవికి, ఈమెకు వైష్ణవాచార్యులు అభేదం చెప్పుకున్నారు. తిరుమలపై గుడిప్రక్కనున్న కొలనుపేరు 'స్వామి పుష్కరిణి'. స్వామి అంటే కుమార స్వామి. సప్తమాశ్వాసాంతంలో 'స్కంద సరస్త తటీరమణ' - - - అన్న పద్యంలో స్వామి పుష్కరిణి పేర్కొన బడ్డది. బాహులేయుడుబహుళ అధికమైన కృత్తికలకు కుమారుడు. కృత్తికలు ఆరుగురు.

విశే॥ స్తుతి పూర్వకమైన ఈ పద్యంలో క్షకార పరుషప్రాస వల్ల కవి సాధించిన ప్రయోజన మేమిటి? శ్రీ.క్షితి - శకారానికి ఊనికి లేదు. అది విడి శబ్దం. అలాగే నాల్గవ పాదంలో కూడా తేల్చి ఉచ్చరింపబడుతున్నది. మధ్య రెండు పాదాలలో క్షకారం మాత్రం కఠినోచ్చారణ మైనది ఈ ఉచ్చారణ స్వామి రాక్షస సంహారంలో ప్రదర్శించిన వీరరస భావాలకు వ్యంజకమైనది. ఇందుచేతనే ఈ రెండు క్షకారాలు కూడా ప్రక్కనున్న సంయుక్తాక్షరాలతో గురుత్వాన్ని పొందింపబడ్డాయి. దీనివల్ల రచనలో ఓజోగుణం కనిపిస్తుంది. దీన్నే మనం పద్యరచనా శిల్పం అంటాం.

'దంష్ట్రికోత్కృత్త' అన్న నాల్గవ విశేషణంలో సంయుక్త, ద్విత్వాక్షరాల సంయోజన, దంష్ట్రికోత్కృత్త అన్నచోట సంధి, ఈ వాక్యమంతా కూడ వీరరౌద్రరసవ్యంజకమైన పరుష సామగ్రి.

**వ. అవధరింపు, మట్లరిగి యవ్విష్ణు చిత్తుండు.** 2

అవధరింపుము = చిత్తగింపుము; ఆ+విష్ణుచిత్తుండు = ఆ విష్ణుచిత్తుడు, అట్లు = ఆ విధంగా; అరిగి = వెళ్లి.

విశే॥ అవ్విష్ణుచిత్తుండు అన్నమాట త్రికసంధి లేకుండ కూడ వ్రాయవచ్చు. ఈ త్రికం ప్రయోజనం, అట్లు = ఆ విధంగా అన్నమాటా ఈ రెండూ పూర్వాశ్వాసంలో భగవంతునకు తనకు జరిగిన సంభాషణ నంతా, ఆకర్షిస్తున్న మాటలు. అంటే త్రికంవల్ల భగవంతుని చేత పంపబడ్డ మహాభక్తుడు విష్ణుచిత్తుడు అని ధ్వని 'అట్లు' అన్నమాట చేత దేవాలయాధికారి విష్ణుచిత్తుని భార్య కలిసి విష్ణుచిత్తుని ప్రయాణంచేసిన వైనమంతా. అట్లు చేత వ్యక్త మౌతుంది.

## విష్ణుచిత్తుని రాజసభా ప్రవేశం

**శా. నిత్యంబు న్ప్రతిహారి వాదమగుట న్విజ్ఞప్తి లేకంపఁ, దా**
**న త్యూర్జస్వలుఁ డౌట భూపతియు సభ్యవ్రాతమున్శంకమై**
**ప్రత్యుత్థానముఁ జేసి నిల్వఁగ, సభాభాగంబు సొత్తెంచి యౌ**
**న్నత్యప్రోజ్జ్వల రాజదత్త వరరత్న స్వర్ణ పీఠస్థుఁడై.** 3

నిత్యంబున్ = ప్రతిరోజు, వాదమగుటన్ = కొలువులో పండితుల వాదం జరగటం వల్ల; ప్రతిహారి = ద్వార పాలకుడు; విజ్ఞప్తి = రాజునకు విన్నపం; లేక = చేయకుండానే; అంపన్ = పంపగా; తాన్ = ఆ విష్ణుచిత్తుడు; అతి = మిక్కిలి; ఊర్జస్వలుడు = తేజస్సు కలవాడు; ఔటన్ = అయినందున; భూపతియున్ = రాజును; సభ్యవ్రాతమున్ = సభాసదుల సమూహమును; శంకమైన్ = జంకుతో; ప్రత్యుత్థానమున్ + చేసి = లేచి స్వాగతము చెప్పి; నిల్వగన్ = నిలబడి ఉండగా, సభాభాగంబు = కొలువుకూటమును; సొత్తెంచి = ప్రవేశించి; ఔన్నత్య = ఎత్తు చేత; ప్ర+ ఉజ్జ్వల = మిక్కిలిగా ప్రకాశిస్తున్న; రాజదత్త = రాజుచేత అర్పించబడ్డ; పీఠ = ఆసనంపై; స్థుడు+ ఐ = కూర్చున్నవాడై

తా॥ ప్రతిరోజు సభలో వాదోపవాదాలు జరుగు తున్నందున దౌవారికుడు (ద్వారసంబంధ పరిపాలకుడు) లోపలనున్న రాజుగారికి విన్నవించు కొమ్మని విష్ణుచిత్తునకు ప్రవేశాన్ని కల్పించాడు. ఆ విష్ణుచిత్తుడు మిక్కిలి తేజోవంతుడై ఉండడం వల్ల రాజు, సభాసదులు ఎవరో మహనుభావుడు అయియుండవచ్చున్న శంకతో లేచి స్వాగతం చెప్పి అలానే నిల్చియుండగా విష్ణుచిత్తుడు కొలువులోనికి ప్రవేశించి రాజుగారు ఏర్పాటు చేసిన ఎత్తైన మణులు పొదిగిన బంగారు పీఠంపై కూర్చున్నాడు.

విశే ॥ అతుర్ధ్యార్జస్వలుడు - అన్న దానికర్థం క్రిందిపద్యంలో 'హరితనచేతో గతినొలయ' అన్న మాటతో చెప్పబడుతున్నది. అతని శరీరంలోకి హరితేజస్సు ప్రవేశించి నందువల్ల అతని ముఖమండలం దివ్యతేజస్సుతో వెలిగి పోతున్నది. రెండవ ఆశ్వాసంలో విష్ణుచిత్తునితో భగవంతుడు 'నీ ఇచ్ఛయే? ---అవల నేనున్నాడన్' - అన్న మాటకు ఈ నాలుగు పద్యాలలో సాక్ష్యం చెప్పబడినట్లయినది. ''నీవెళ్లు. తర్వాత సంగతి నేను చూచుకుంటాను'' అని భగవంతుడు అన్నాడు కనుక విష్ణుచిత్తుని మనసులో విష్ణువు ప్రవేశించినాడు. అందుకే అతనిని విష్ణుచిత్తుడన్నాడు. విష్ణువు ఆయన చిత్తమున ప్రవేశించినందు వల్ల.

కం. ఆతిథ్యము గొని, హరి తన
చేతోగతినొలయ, రంతుసేయని విద్వ
ద్వ్రాతంబుఁ జూచి, 'లాఁతుల
మా తరవాయుడుగ? మాటలా డుం'డనుచున్. 4

ఆతిథ్యమున్ = అతిథి సత్కారాన్ని; కొని = స్వీకరించి; చేతోగతిన్ = చిత్తవృత్తిలోకి; హరి = నారాయణుడు; ఒలయన్ = వ్యాపించగా; రంతు = వాదం; చేయని = చేయకుండా ఉన్నట్టి; విద్వత్ = విద్వాంసులయొక్క; వ్రాతంబున్ = సముదాయాన్ని; చూచి; తరవాయి = ప్రారంభించిన వాదాన్ని; ఉడుగన్ = చేయకుండా మానుకోడానికి; లాతులమా = మన మేమి పరాయి వాళ్లమా?; మాటలాడుండు = సంభాషించండి; అనుచున్ = అంటూ

తా॥ రాజుగారు అర్పించిన అతిథిసత్కారాన్ని పొంది ఏమి మాట్లాడకుండా కూర్చున్న పండితులతో మనం పరస్పరం స్నేహితులమే కాని పరాయివాళ్లం కాము కనుక వాదం ప్రారంభించండి అని అంటూ

విశే ॥ తరవాయి అన్నమాట వ్యవహారంలో తర్వాత, మిగిలినది, కొరత అన్న అర్థాలలో నేటికి ప్రయోగంలో ఉంది. ఈ అర్థం కూడా ఇక్కడ చెప్పుకోవచ్చు. వాదం సగంలో ఆపారు కనుక మిగిలినది ముగించండి అని అన్నట్లు చెప్పుకోవచ్చు. అతుర్ధ్యార్జస్వలత్వమే వారిని మౌనులను చేసింది.

తే. కలిపయోక్తులలోనె తత్ప్రతిభఁ దెలిసి,
నగవు దళుకొత్త రాజు నెమ్మొగముఁ జూచి,
'యీవు మాధ్యస్థ్యమున నున్న నేము గొన్ని
నొడివెదము మాట' లని తదనుజ్ఞ వడసి. 5

కతిపయ = కొన్ని; ఉక్తులలోనే = మాటలలోనే; తత్ = వారియొక్క; ప్రతిభన్ = ప్రజ్ఞాశక్తిని; తెలిసి = తెలిసికొని, నగవు = లేతనవ్వు; తళుకు+ ఒత్తన్ = అందంగా మొలకెత్తగా; రాజు; నెమ్మొగమున్ = అందమైన ముఖాన్ని; చూచి; ఈవు = నీవు; మాధ్యస్థ్యమునన్ = మధ్యస్థభావమునందు (పక్షపాతం లేని పరీక్షకునిగా); ఉన్నన్ = ఉంటే; ఏము = మేము; కొన్ని = మాటలు; నుడివెదము = చెప్పగలము; అని= చెప్పి; తత్ = ఆరాజు యొక్క; అనుజ్ఞ = అనుమతిని; పడసి = పొంది.

తా॥ కొన్ని మాటలతోనె పండితుల తెలివి తేటలు గ్రహించి వారి లోతులేని ప్రతిభకు నవ్వుకొని రాజు నెమ్మొగం చూస్తూ ' నీవు మధ్యవర్తిగా ఉంటే మేము కూడా కొన్నిమాటలు చెబుతాం' అంటూ అతని అనుమతితో.

విశే॥ ప్రతిభ - ప్రతిక్షణం వికసించే ప్రజ్ఞాశక్తి; (Intitutive Mind)

నగవు-తళుకొత్తు = కొంచంగా నవ్వు ముఖానికి కాంతులద్దగా. ఈ నవ్వు భగవంతునిది తప్ప విష్ణుచిత్తునిది కాదు. ఆత్మానుభవ మున్న మహాపురుషుని ముఖంలో చిరునవ్వుతో కూడిన తేజస్సుంటుందని, ఆ నవ్వు జగన్మోహనంగా ఉంటుందని శ్రీరామకృష్ణ పరమహంస వంటి వారిని చూచిన వారన్నారు. గీతలో కూడ భగవంతుడు అర్జునుడు ప్రశ్నించినపుడల్లా 'నవ్వుతూ ఇలా అన్నాడు' అనే ఉంటుంది. అంటే నవ్వు ఆత్మశక్తి, పరమేశ్వర రూపం.

### విష్ణుచిత్తుని వాదవర్ణన

సీ. అందులో నొక మేటి కభిముఖుండై యాతఁ
డనిన వన్నియును మున్ననువదించి;
తొడఁగి యన్నిటి కన్ని దూషణంబులు వేగ
పడక తత్సభ యొడఁబడగఁ బల్కి;
ప్రక్క మాటల నెన్న కొక్కొక మాటనె
నిగ్రహస్థాన మనుగ్రహించి;
క్రందుగా రేఁగినం గలఁగ కందఱఁ దీర్చి
నిలిపి; యమ్మొదలి వానికినె మగిడి

తే. మఱి శ్రుతి స్మృతి సూత్ర సమాజమునకు
నైక కంఠ్యంబు గల్పించి, యాత్మమతము
జగ మెఱుంగఁగ రాద్ధాంతముగ నొనర్చి;
విజితు గావించి దయవాని విడిచి పెట్టి. 6

అందులోన్ = ఆ ప్రతివాదులలో; ఒక మేటికిన్ = ఒక గొప్ప పండితునకు; అభిముఖుండు+

ఐ= ఎదురుగా తిరిగిన వాడై; ఆతడనినవి = అతడన్నవి; అన్నియున్= అన్నిటిని; మున్ను = ముందుగా; అనువదించి = మరలా తాను చెప్పి;

అక్కడున్న పండితులలో ఒక ప్రతిభావంతుడైన పండితునికి ఎదురుగా తిరిగి అతను చెప్పిన మాటలన్నీ ముందు తాను తిరిగి చెప్పి, ( ఇంతే కదా! మీరు చెప్పేది అన్నట్లుగా)

తొడగి = ఆ పండితుడన్న మాటలను ఖండించుటకు (పూనుకొని); అన్నిటికిన్ = అతడు చెప్పిన వానికన్నిటికి; అన్ని దూషణంబులు = ప్రతిదానికి ఒక్కొక్క దోషమును; వేగపడక = తొందరపడక; తత్సభ = ఆ సభ; ఒడబడగన్= అంగీకరించునట్లుగా; పల్కి

ఆ పండితుడు చెప్పిన ప్రతివాక్యంలోను దోషాలను చూపించి ఆ సభ అంగీకరించేటట్లుగా పలికి, తొందరపడక పోవడం నిండుదనాన్ని సూచిస్తున్నది.

ప్రక్కమాటలన్ = ప్రక్కనున్న పండితులు మాట్లాడే మాటలను; ఎన్నక= గ్రహించక; ఒక్కొక్క మాటనె = ఒక్కొక్క మాట చేతనే; నిగ్రహస్థానము = పరాజయకారణాన్ని; అనుగ్రహించి = దయతోచెప్పి

ప్రక్కవారు ఏవేవో మాటలంటున్నా వాటిని సరకు చేయక ప్రతివాది వాదాంశాలలో ఒక్కొక్కదానికి పరాజయ హేతువును దయతో చెప్పి అనుగ్రహించడం దేనికంటే కేవలం వాదం కోసమే కాకుండా సత్యస్థాపనకు అని తాత్పర్యం.

క్రందుగాన్ = సందడిగా; రేగినన్ = వాదానికి మూగితే, కలగక = కలత పడక; అందఱన్ ; తీర్చి = సమాధానపరచి; నిలిపి = మాట్లాడకుండా చేసి; ఆ+మొదలివానికినె= మొట్టమొదట ప్రారంభించాడో వానితోనే; మగిడి = తిరిగి.

ప్రతి వాదులందరూ కలిసి విష్ణుచిత్తుని వాదాన్ని ఖండించడానికి దొమ్మిగా రేగితే వారందరికి సమాధానం చెప్పి ఎవనితో తాను ప్రధానంగా వాదిస్తున్నాడో వానివైపుకే తిరిగి

మఱి = విశేషించి; శ్రుతి = వేదము; స్మృతి = ధర్మశాస్త్రాలు; సూత్ర = బ్రహ్మసూత్రాలయొక్క; సమాజమునకు = సమూహానికి; ఐక కంఠ్యంబు= ఏక వాక్యతను; కల్పించి= స్థాపించి; ఆత్మమతమున్= తన యొక్క శ్రీవైష్ణవాన్ని; జగము+ ఎఱుగన్ = లోకమంతా తెలుసుకొనేటట్లు; రాద్ధాంతముగన్=సిద్ధాంతంగా, ఒనర్చి = చేసి; వానిన్ = ఆ ప్రతిస్పర్ధిని; విజితుగాన్ = జయింపబడ్డవానిగా; కావించి = చేసి; దయన్ = దయతో; విడిచి పెట్టి = వదలి పెట్టి.

ఈ విధంగా ప్రతివాదులనందరను జయించిన తర్వాత వేద ధర్మశాస్త్ర బ్రహ్మ సూత్ర సమూహమంతా ఒకే సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తున్నాయని స్థాపించి తన వైష్ణవమతాన్ని జగత్తంతా తెలుసుకొనేటట్లు సిద్ధాంతంగా స్థాపించి ప్రతివాదిని జయించి దయతో విడిచిపెట్టి.

కం. 'నీవేమంటివి ర'మ్మం
చావలి వానికిని మగిడి యట్లనె వానిం

గావించి; యొకఁ డొకఁడు రా
నా విప్రుఁడు వాదసరణి నందఱ గెలిచెన్. 7

నీవు; ఏమి; అంటివి = అన్నావు; రమ్ము = వాదించడానికి పూనుకో; అంచు = అంటూ; ఆవలివానికిన్= అవతలి వానికి; మగిడి = తిరిగి; అట్లనె = ఆ విధంగానే; వానిన్ = వానిని కూడా; కావించి = రావించి; ఒకడు+ ఒకడు రాన్ = ఒక్కొక్కడు వాదించడానికి రాగా; ఆ విప్రుడు = ఆ బ్రాహ్మణుడైన విష్ణుచిత్తుడు; వాదసరణిన్ = వాదక్రమంలో; అందఱున్ = పండితులందరిని; గెలిచెన్ = జయించాడు.

అన్యమత నిరసనము

సీ. 'జగదుద్గతికిని బీజము ప్రధాన' మన నీ
క్షత్యాది వీశు నశబ్దవాదిఁ
బొరి 'నీశుఁడేన' నాభోగమాత్రేత్యాద్యు
దాహృతి స్ఫూర్తి మాయావి వాది,
'ఫలియించు (గ్రియయ' నా ''ఫలమత'' యిత్యాది
సర్వేశు ఁగొనని యపూర్వవాది,
'శాస్త్ర యోనిత్వా' ది సరణి నీశ్వరునిఁ దె
ల్పెడు ననుమాన మన్పీలువాది
తే. 'నిత్యులం దెల్ల నిత్యుఁడన్ శ్రుత్యురూక్తి
క్షణిక సర్వజ్ఞ తేషి సౌగత వివాది,
'ననుపపత్తేర్న' యను సూత్ర మాది యైన
వాణి నృపతీశు ఁబ్రత్యక్షవాది గెలిచె. 8

జగత్ = విశ్వముయొక్క; ఉద్గతికిన్ = జన్మకు (మొలకెత్తటానికి); బీజము= కారణం (విత్తు); ప్రధానము = ప్రకృతి; అనన్= అని (వాదించే) వి+ ఈశున్, వి = విగత = లేనట్టి; ఈ శున్= జగత్ప్రభువైన ఈశ్వరుడు (సృష్టికి ఈశ్వరుడు కారణం కాదు అనే సాంఖ్యవాదిని) అశబ్దవాదిన్, అశబ్ద = వేదమే ప్రమాణం కాని అనుమాన ప్రమాణంతో సాధించే; వాదిన్ = వాదించే పండితుని; ఈక్షతి+ ఆదిన్ = 'ఈక్షతేర్నాశబ్దం' మొదలైన బ్రహ్మసూత్రాలతో; గెలిచెన్ = జయించాడు.

సాంఖ్యదర్శనం ప్రకారం ఈ సృష్టికి మూలకారణం ప్రకృతి తప్ప ఈశ్వరుడు కాదు. కనుక ఈ మతం వేద ప్రామాణ్యంతోనేకాక అనుమాన ప్రమాణంతో మూల ప్రకృతి కలవని అంగీకరించినందువల్ల ''యస్మిన్ శబ్దఃఏవ ప్రమాణం నభవతి తత్ అశబ్దం అనుమానితం - ప్రధానమిత్యర్థః'' శ్రీభాష్యం. (శబ్దం ప్రమాణం కానిది అశబ్దం. అదే అనుమానించబడే మూల ప్రకృతి) అలాంటి సాంఖ్యవాదిని 'ఈక్షతే ర్నాశబ్దం'. ఇది బ్రహ్మసూత్రాలలో 1-1-5వ సూత్రంతో సాంఖ్య మతస్థుని ఓడించినాడని తాత్పర్యం.

పారిన్ = చక్కగా; ఈశుడు = ఈశ్వరుడు; ఏన = నేనే; నాన్ = అని (వాదించే); మాయానివాదిన్= మాయయే జగత్తుయొక్క ఉన్కికి హేతువని చెప్పే అద్వైతిని;

(మాయావృతుడైనవాడు మాయాని - మాయా - వివాదిన్ అనీ విడదీయవచ్చు)

భోగమాత్ర+ ఆది+ ఉదాహృతి = భోగమాత్ర అన్నదొక బ్రహ్మసూత్రం(4-4-21). అలాంటి సూత్రాలను ఉదాహరించి; స్ఫూర్తిన్ = స్ఫురణ శక్తితో; గెలిచెన్. మాయయే జగత్కారణం తప్ప ప్రత్యేకించి ఒక దేవుడు ఈ సృష్టిని చేయలేదు. ఇది అద్వైత వాదం. దీన్ని ఖండించడానికి భోగమాత్ర వంటి బ్రహ్మసూత్రాలను ఉదాహరించి గెలిచాడు.

క్రియయ = యజ్ఞమే; ఫలియించును = స్వర్గాది ఫలాన్నిస్తుంది, నాన్ = అని; సర్వేశున్ = పరమేశ్వరుని; కొనని = అంగీకరించని; అపూర్వవాదిన్ = అదృష్టమును వాదించే పూర్వ మీమాంసకుని, ''ఫలం అతః'' - అన్న బ్రహ్మసూత్ర ఉదాహరణంతో (గెలిచి)

ఈశ్వరునిన్ = అనుమానమే. తర్కంలో అనుమానమన్నది ఒక ప్రమాణం. పొగను జూచి అగ్ని ఉంటుంది అని అంగీకరించడం అనుమాన ప్రమాణం. కారణ, కార్యాలన్న జంటలో ఒకదానిని చూచి మరొకదాన్ని భావించటం. తెల్పెడున్ = చెబుతుంది; అన్ = అనే; పీలువాదిన్ = పరమాణువుల సంయోగంతో జగత్తు ఏర్పడుతున్నది అని చెప్పే వైశేషిక దార్శనికుని; శాస్త్రయోనిత్వ+ ఆది = శాస్త్రయోనిత్వం మొదలైన బ్రహ్మసూత్రాలయొక్క పద్ధతితో; గెలిచెన్ = గెలిచెను.

నిత్యము నందెల్లన్ నిత్యుడు = నిత్యులకు నిత్యుడు; అన్ = అన్నట్టి; శ్రుతి = వేదసంబంధమైన, ఉరు+ ఉక్తిన్ = సూత్రంతో; క్షణిక = క్షణకాలం మాత్రమేఉండే; సర్వ = సకలమైన; అర్థత = పదార్థాలయొక్క భావాన్ని; ఈక్షిన్ = చూచే; సౌగత వివాదిన్= బౌద్ధమత వాదిని; గెలిచెన్ = గెలిచాడు.

బౌద్ధులు ప్రపంచంలోని సర్వవస్తువులు క్షణకాలం మాత్రమే ఉంటాయని చెబుతారు. అందుచేత వారిని క్షణిక వాదులంటారు. అలాంటి వారిని 'నిత్యులందెల్ల నిత్యుడు' (నిత్యోఽనిత్యానాం)అన్న శ్రుతి వాక్యంతో ఓడించాడు.

నృపతి = రాజే; ఈశు = ఈశ్వరుడనే; ప్రత్యక్షవాదిన్ = ప్రత్యక్షంగా చూస్తున్నదే ప్రమాణమనే భౌతికవాది; ''అనుపపత్తేర్న''(1-2-3) అన్నదొక బ్రహ్మసూత్రం; ఆదియైన = మొదలైన వానిని; వాణిన్ = వాక్కుతోనే; గెలిచెన్ = గెలిచెను.

చార్వాక మతం ప్రత్యక్ష ప్రమాణాన్నే అంగీకరిస్తున్నది. వారికి రాజే భగవంతుడు. మరొక ఈశ్వరుడున్నాడని వారంగీకరించరు. అలాంటి వారిని 'అనుపపత్తేర్న' మొదలైన బ్రహ్మసూత్రాంతో జయించాడు.

శా. విద్వద్వందితుఁ డాతఁ డిట్లు సుఖ సంవిత్తత్త్వ బోధైక చుం
చు ద్వైపాయన సూత్ర సద్ప్రుతుల నీశున్మన్నిరూపించి, పైఁ

దద్విష్ణుత్వము దాని కన్య దివిష ద్వ్యావర్తనంబు న్విశి
ష్టాద్వైతంబును దేటగాఁ దెలుప మాటాడె బ్రమాణంబులన్. 9

విద్వత్ = పండితులచేత, వందిత = స్తుతింపబడిన; ఆతడు = ఆ విష్ణుచిత్తుడు; ఇట్లు= ఈవిధంగా; సుఖ = ఆనందము; సంవిత్ = జ్ఞానము అయిన; తత్త్వ = బ్రహ్మ పదార్థము యొక్క, బోధ+ ఏక = ముఖ్యమైన బోధకు; చుంచు = సమర్థమైన; ద్వైపాయన = ద్వీపము నందు జన్మించిన వ్యాసమహర్షియొక్క; సూత్ర = బ్రహ్మసూత్రములన్న గ్రంథంచేతను; సత్ = ప్రామాణిక; శ్రుతులన్ = వేద వాక్యాంచే; ఈశున్= ఈశ్వరుని, నిరూపించి = స్పష్టంచేసి; పైన్ = తర్వాత; తత్ = ఆ భగవంతునియొక్క; విష్ణుత్వము = విష్ణుస్వరూపానికి; దానికిన్ = ఆ విష్ణు తత్త్వానికి; అన్య = ఇతర; దివిషత్ = దేవతల యొక్క; వ్యావర్తనంబు= భేదాన్ని; విశిష్టా ద్వైతంబును = విశిష్టాద్వైతమతాన్ని; తేటగాన్ = స్పష్టంగా; తెలుపన్ = బోధించడానికి, ప్రమాణంబులన్ = ప్రమాణ వాక్యాలను; మాటాడెన్ = ప్రసంగించినాడు.

విద్వాంసులకు పూజ్యుడైన విష్ణుచిత్తుడు ఈ విధంగా సచ్చిదానంద రూపమైన పరమేశ్వరుని ఉనికిని బ్రహ్మసూత్రాల ద్వారా స్థాపించి తర్వాత ఆ పరమాత్మ విష్ణువని, ఇతర దేవతలకంటె అతని భేదాన్ని విశిష్టాద్వైత మత ప్రకారం శ్రీమన్నారాయణుడే పరదైవతమన్న సిద్ధాంతాన్ని స్థాపించడాని కనేక ప్రమాణాల నుదాహరించాడు.

విశే॥ పై పద్యంలో బ్రహ్మసూత్ర పాండిత్యం ప్రదర్శింపబడ్డందువల్ల నెంటనే క్రింది పద్యం విద్వాంసులచేత పూజింపబడిన అన్న వాక్యంతో ప్రారంభం కావడం విష్ణుచిత్తుని పాండిత్యాన్ని సభ అంగీకరించిందని చెప్పడమే. ఈ పద్యంలో నాస్తిక దర్శనాలను ఖండించి పరమేశ్వరు డొక్క డున్నాడని స్థాపించడం, అతడే విష్ణువని నిర్ధారించడం ఇతర దేవతలకంటే ఇతడు పరుడైనవాడు, వేరైనవాడు అని స్పష్టంగా నిరూపించడం, విశిష్టాద్వైత మత స్వరూపాన్ని స్థాపించడం అన్న నాలుగు విషయాలు చెప్పబడ్డాయి. విశిష్టాద్వైవతం = చిదచిత్తులతో కలుపుకొని తద్విశిష్టమైన ఆత్మపదార్థం (నారాయణుడు) అభిన్నంగా - ఏకంగా వున్నదని చెప్పేమతం. అవయవి (శరీరం) అవయవాలకుండే అవినాభావసంబంధమే ఆత్మకూ చిదచిత్తులకున్నవని చెప్పేమతం. ఆ పరమేశ్వరుడు విష్ణువనడానికి తగిన ఉపపత్తులను క్రింది పద్యంలో చెబుతున్నాడు.

సీ. ఆది నారాయణుండాయె నొక్కఁడ; బ్రహ్మ
లేఁడు; మహేశుండు లేఁడు, లేదు
రోదసి, లేఁడు సూర్యుఁడు, లేఁడు చంద్రుఁడు,
లేవు నక్షత్రము, ల్లేవు నీళ్లు;
లే దగ్ని, యట్లుండ 'లీల నేకాకిత
చనదు; పెక్కయ్యెద ననుచు నయ్యెఁ
జిద చిద్ద్వయంబు సొచ్చి' యని ఛాందోగ్యంబు
దెలిపెడు; నంత రాదిత్య విద్య

తే. నర్కులోఁ బుండరీకాక్షుఁ డతఁడ యగుట
కక్షిణీయని యష్ట దృక్త్ర్యక్ష దశ శ
తాక్ష విధి రుద్ర శక్రాదులందు నొకఁడు
కామి కాశ్రుతి యే విలక్షణత ఁ దెలిపె. 10

ఆదిన్ = అగ్రమునందు (మొట్టమొదటిగా); నారాయణుండు = నారాయణుడు; ఒక్కఁడ=ఏక స్వరూపంగా; ఆయెన్ = సర్వత్రా వ్యాపించియున్నాడు. ( ఇక్కడ ఒక్కడు అన్నమాట సంఖ్యావాచకం కాదు. అవిభక్తమైన అఖండ తత్త్వమని అర్థం. తనను తాను అనేక రూపాలలో విభజించి విస్తరించడమే సృష్టి. కనుకనే సృష్టికి అనేక మని పేరు.) బ్రహ్మ లేడు; మహేశుండు = శివుడు; రోదసి = ఆకాశం; లేదు = లేదు; సూర్యుఁడు లేడు; చంద్రుడు లేడు; నక్షత్రముల్ లేవు; నీళ్లు లేవు; అగ్ని లేదు; అట్లుండన్; ఏకాకిత= ఒంటరిగా ఉండడం (ఏకత్వం); చనదు = తగదు; లీలన్ = క్రీడార్థంగా; పెక్కు = అనేకం; అయ్యెదన్ = అవుతాను; అనుచున్ = అంటూ; చిత్ = చేతనవంతులైన జీవులు; అచిత్ = చేతన వంతం కాని; ప్రకృతి= ప్రకృతిలో, ద్వయంబు = జంటను; చొచ్చి = ప్రవేశించి; అయ్యెన్ = అనేకమైనాడు; అని = ఈ విధంగా; ఛాందోగ్యంబు దెలిపెడు = ఆ పేరుతో నున్న ఉపనిషత్తు తెలుపుచున్నది.

అంతర+ ఆదిత్య విద్యన్ = లోపలి సూర్యుడనెడు విద్యలో; అర్కులోన్ = సూర్యునిలో; పుండరీకాక్షుడు = పద్మ నేత్రుడు; అతడ = ఆ నారాయణుడే; అగుటకున్= కావడానికి; అష్టదృక్ = ఎనిమిది నేత్రాల వాడు= బ్రహ్మ - త్రి+అక్ష = మూడునేత్రాలు కలవాడు శివుడు; దశశత+అక్ష = పదినూర్ల నేత్రాలు కలవాడు ఇంద్రుడు; ఆదులు = మొదలైన వారి; అందున్ = లోపల; ఒకడు కామికిన్ = ఒకడు కాకపోవడానికి; ఆ శ్రుతియే= ఆఛాందోగ్య ఉపనిషత్తే; అక్షిణీ = రెండు కన్నులు; అని; విలక్షణతన్ = భేదాన్ని; తెలిపెన్= చెప్పినది.

సృష్టికి పూర్వమున్నది ఏకమైన శ్రీనారాయణ తత్త్వం. అక్కడ బ్రహ్మలేడు, శివుడు లేడు; ఆకాశం లేదు; సూర్యచంద్ర నక్షత్రాదులు లేవు. నీరు, అగ్ని లేవు. ఈ స్థితిని అసత్తు అని వేదాలు వర్ణించాయి.

ఈ అసత్ స్థితి ( ఏమీ లేక పోవడం) బాగా లేదని ఆ శ్రీమన్నారాయణుడు సృష్టిగా వికసించి అనేకమైనాడు. ఏవిధంగా అంటే ప్రకృతి, జీవులు అన్న జంటలో ప్రవేశించి సృష్టిలో పరిణమించాడు. సూర్యునిలో ఉన్నది శ్రీమన్నారాయణుడే అని, ఆ ఉపనిషత్తే రెండు తామర పూవుల వంటి నేత్రాలు కలవాడని వర్ణిస్తూ, ఎనిమిది నేత్రాలుకల బ్రహ్మ ను, మూడు నేత్రాలు కల శివుని, సహస్రనేత్రుడైన ఇంద్రుని వేరు చేసి చెప్పింది. కనుక శ్రుతి శ్రీవిష్ణువే పరదైవమని ఉద్ఘోషిస్తున్నది అని శ్రీవైష్ణవాన్ని స్థాపించాడు.

విశే॥ ఈ పద్యం కూడా రాయలవారి వేదోపనిషత్తుల పాండిత్యాన్ని దివ్యంగా స్థాపిస్తున్నది. ఈ పద్యమంతా ఛాందోగ్య ఉపనిషత్తునకు సంబంధించినది. ''ఏకోహవై నారాయణ అసేత్. నబ్రహ్మ నేశానో నాపో

నాగ్నీషోమౌ నేమేద్యావా పృథివీ నక్షత్రాణి నసూర్యా నచంద్రమాః- స ఏకాకీనర మేత - ''ఛాందోగ్యం చివరివాక్యానికి లీలన్ అని కవి కలపటం లోకవత్తులీలాకైవల్యం- అన్న బ్రహ్మసూత్రపాండిత్యం కారణం. తదైక్షతబహుస్యాం ప్రజాయేయేతి- అనేన జీవేనాత్మనా అను ప్రవిశ్యనామరూపే వ్యాకరవాణి - (ఛాందోగ్యం)'అర్కులో' అన్నది. తస్యయథా పుండరీక మేవ మక్షిణీ - రెండు కన్నులు కలవాడన్న ద్వివచనప్రయోగంవల్ల నారాయణుడేనని శ్రుతి నిర్ధారిస్తున్నది

లోకవత్తు లీలాకైవల్యం -(బ్రహ్మసూ. II 1-33) లోకంలో లాగానే సృష్టికూడా క్రీడలోకమంటే చిత్+ అచిత్స్వరూపం. .. వావ్యంలో ప్రకృతి వర్ణనలు అచిద్వర్ణములు. జీవులు= పాత్రలు చిద్వర్ణనలు అంతరాత్మకావ్యనాయకుడు కనుక కావ్యం సృష్టి. కేవల లీలాకైవల్యం = రసాత్మకం.

శ్రీవిశిష్టాద్వైతము అన్నమాటను ఈపద్యం నిర్వచిస్తున్నది. చిత్తు, అచిత్తులకంటె విశిష్టుడైన శ్రీమన్నారాయణ తత్వాన్ని వ్యాఖ్యానించింది. కనుక విశిష్టాద్వైతమని-పేరు వచ్చింది అంతరాదిత్య విద్య ఛాందోగ్యోపనిషత్తులో ఉన్నది.

శ్రుతి వాక్యాలను అనువదించకూడదన్న సంప్రదాయం ఉంది. మహాకవి అనువదించడమే కాకుండా ఆ ఉపనిషత్ శైలిని కూడ పట్టుకున్నాడు. వేద మంత్రాలను శ్రీఅరవింద మహాయోగి అనువదించినట్లు. పద్యంలో లేదు, లేడు, లేవు, లేవు అని పలుమార్లు ఆవృత్తం కావడం వల్ల ఒక శూన్యస్థితి ఎలావుంటుందో మన అనుభవానికి అందని విషయం. కనుక దాన్ని మానవ చేతనానుభవంలోకి తీసుకు రావడం కోసం ఉపయుక్తములైనవి. నాసదీయ సూక్తమని ఋగ్వేద సూక్త మున్నది. సృష్టి పూర్వస్థితిని వర్ణిస్తూ ఆ సూత్రం ఇలా అన్నది. అక్కడ ''సత్తు లేదు. అసత్తు లేదు. ఏమున్నదో ఎవడికీ తెలియదు.'' అలాంటి ఒక మహాశూన్యస్థితిని వ్యంజించేవి లేడు, లేవు శబ్దాలు. కనుక ఈ పద్యం తెలుగు భాషలో ఒక అపూర్వ శైలికి ఉదాహరణ.

మ. తులలేకుండు స్వరూప రూప గుణభూతు ల్దోఁచు నేతచ్ఛ్రుతిన్;
దలమై లోవెలిఁ దానె యున్కిఁ దెలిపె న్నారాయణం; బారుణం
బుల సామాన్య విశేషరీతి నిఖిలంబు న్శబ్ద జాలంబు ని
ర్మల నారాయణ శబ్దమందునె, తుదన్బర్యాప్తమయ్యె న్శ్రుతిన్. 11

ఏతత్+ శ్రుతిన్ = ఈ ఛాందోగ్య ఉపనిషత్తులో; తుల = సాటి; లేకుండు = లేనట్టి; స్వరూప= నారాయణ స్వరూపం, గుణ = గుణాలు; భూతులు = ఐశ్వర్యాలు; తోచున్ = కన్పిస్తున్నాయి; తలము+ ఐ= నిండారి; లోన్ = చరాచరములకు లోపల; వెలిన్ = వెలుపల; తానే = నారాయణుడే; ఉన్కిన్ = ఉండడం; నారాయణంబు = నారాయణోపనిషత్తు; తెలిపెన్ = చెప్పింది; శ్రుతిన్ = వేదంలో; ఆరుణంబులన్ = అరుణము లన్న భాగాలలో; అఖిలంబున్ = సమస్తమైన; శబ్దజాలంబు = శబ్దసమూహం; సామాన్య విశేషరీతిన్ = సామాన్య విశేష న్యాయముచేత; నిర్మల = స్వచ్ఛమైన; పరమేశ్వరుని నిరంజన శుక్లాది శబ్దములతో ఉపనిషత్తు వర్ణిస్తుంది. అదే ఇక్కడ నిర్మల శబ్దంతో చెప్పబడుతోంది) నారాయణ

శబ్దమందుః నారాయణుడన్నమాట లోనే; తుదన్ = చివరకు; పర్యాప్త = పర్యవసానము; అయ్యెన్ = అయినది. ఈ ఛాందోగ్యం వల్లనే శ్రీమన్నారాయణునితో సాటిలేనట్టి దివ్య స్వరూపం, దివ్యమంగళ విగ్రహం, అనంతగుణాలు, ఐశ్వర్యాలు ఉన్నవని చెప్పబడింది. సర్వమునకు తానే బయటా, లోపల నిండియున్నాడని స్థాపిస్తున్నది. ఇక అరుణములన్న భాగాలలో బ్రహ్మ, ఇంద్రాది శబ్దాలన్నీ సామాన్య విశేష న్యాయంగా నారాయణ శబ్దంలోనే పర్యవసిస్తున్నదని వేదార్థ సంగ్రహంలో శ్రీమద్రామానుజముని వ్యాఖ్యానించాడు ఈ పద్యంలో కూడా రాయల వారి వేద వేదాంగ విద్య ప్రదర్శింపబడింది. ఆయన ఈ ఉపనిషత్తులన్నీ జాగ్రత్తగా చదివి ఉన్నాడన్న మాటే కదా! ఈ శాస్త్రీయ దృష్టి ప్రాచీన రాజ సభలలో తాండవించేది. ఆ సభావైభవాన్ని మూర్తి కట్టించడం కోసమే రాయలవారు వర్ణించాడా అన్నట్లుంది. రాయలవారి భువన విజయంలో ఇలాంటి సభలు జరిగాయని ఆ మహాపండితులంతా రాయలకు విద్వత్ప్రభారాయలన్న బిరుదాన్ని ఇచ్చినట్లు చరిత్ర చెబుతున్నది.

1) స్వరూపం = సత్యజ్ఞానానందాత్మకమైనది; (2) రూపం = దివ్యమంగళ విగ్రహాలు; (3) గుణాలు - సృష్టికవసరమైన సత్యసుకృత్య, సర్వజ్ఞద్యానులు (4) భూాలు - ఉభయవిభూాలుము నిత్యవిభూాలు - వైకుంఠం (శ్రీరంగనాథకర్లన) లీలావిభూతులు(సృష్టి- కావ్యం) సామాన్యవిశేషన్యాయం = అన్న సూక్తి ప్రకారం సామాన్య వాచకాలు సన్నిహిత విశేష వాచకముంటేతదర్థ. బోధనమే అవుతాయి.

ఉదా:- గాం( ఎద్దు - ఆవు) ఆనయ(తీసుకొనిరా) అన్నపుడు గోశబ్దం సామాన్యవాచకం రెంటినీబోధిస్తుంది. సన్నిహిత 'బలీవర్దం'- అన్న శబ్దం వృషభాన్నేబోధిస్తుంది. ఇది విశేషవాచకం ఇది పై సామాన్య వాచకానికి దీని అర్థమే చెప్పాలి. అనటం నిర్విశేష సామాన్యం.

కం. వా 'దపహత పాప్మాది
వ్యో దేవ' యనంగ c బరcగు సూక్తుల మీcదం
బాదగు నారాయణ పద
మే దేవాంతరము లేమి కీ శ్రుతిc దీర్చెన్. 12

అపహత పాప్మ దివ్యో దేవ = ఇది ఉపనిషద్వాక్యం. 'ఏష సర్వభూతాంతరాత్మా. అపహతపాప్మాదివ్యో దేవ ఏకో నారాయణః' అని సుబాలోపనిషత్తు శ్రీమన్నారాయణ తత్త్వాన్ని వ్యాఖ్యానించింది. సర్వభూతాలకు అంతరాత్మ అయిన ఈ శ్రీమన్నారాయణుడు ఒక్కడే పాపరహితుడు. దివ్యుడు నైన ఏక దైవము. అనంగన్ = అనగా; పరగు = ప్రసిద్ధమైన; సూక్తులమీదన్ = మంత్రవాక్యాలపై; పాదు = కుదురైన; నారాయణ పదమే = నారాయణ శబ్దమే; దేవ+అంతరము లేమికిన్ = నారాయణుని కంటె మరియొక దేవత లేదని; ఈ శ్రుతిన్ = సుబాలోనిషత్తులోని పై వాక్యంలో; తీర్చెన్= స్పష్టపరిచింది.

సుబాలోపనిషత్తులో ఒక్క నారాయణుడే పరమాత్మయని చెప్పబడింది. అతని కంటె వేరు దేవుడు లేడని విష్ణు చిత్తుడు నిరూపించాడు. ఇతరోపనిషత్తుల్లో సృష్టికర్త పరమాత్మా అనిచెప్పాయి. కానీ ఈ ఉపనిషత్తు నారాయణుడేనని తేల్చింది.

వ. 1) తొల్లి జామదగ్న్యభయంబునం బరిత్యక్త రాజ్యుండై వైరాగ్యంబున దివోదాసాత్మజుండగు ప్రతర్దనుండు జనార్దను నెఱుంగక యపవర్గకాంక్ష నింద్రు నారాధించిన నతండు సన్నిహితుండై 'మాము పాస్వ' యనుటయు;

2) ముందు గర్భమునందుండియు నఖండిత తపస్తులిత వామ దేవుండగు వామదేవుండు 'సూర్యోఽహం మనురహం కక్షీవానహమ్మ'ని శరీర వాచక శబ్దంబు శరీరి పర్యంతంబు పోవుటం జేసి చిదచిచ్ఛరీర కుండగు నప్పరమాత్ముం గూర్చి యనుసంధించెననియుం దెలిసి;

3) చేతనుండైన తా జగత్కారణంబు గామి విబుధులందెల్ల విజ్ఞాన వృద్ధుం డగు నా వృద్ధశ్రవుండు తదనుసంధాన న్యాయంబున నుపదేశించె నని శ్రుతి సూత్రముఖంబుల నిగమాంతశాస్త్ర ఫక్కికం జాల వక్కాణింపబడు, నాత్మయు నవనియు ననల పవన గగన కాల వృత్త్యు ప్రభృత్యఖిల చిదచిత్ప్రపంచంబు లతని శరీరంబు లనియు నందె వినంబడు; నట్లగుట నశేష దివషచ్ఛరీరంబు లన్నారాయణ శరీరంబులే కదా, 4) యని ముముక్షువున కప్పుండరీకాక్షుం దక్క నేవ్వక్తి నైన నుపాసించవచ్చునే? విష్ణునకుం దత్తత్కాల విగ్రహంబు లగుటం బ్రహ్మరుద్రార్జున వ్యాస భాను భార్గవాది భజనంబు త్రైవర్గికునకుం గాక యపవర్గ కాంక్షుల కయుక్తం బని స్మృతి చెప్పుం; నదియునుంగాక యీశ్వరునకుం జేతనునకు నిత్యసంబంధంబు 'మాతా పితా భ్రాతా నివాస శ్శరణం సుహృద్గతి ర్నారాయణ' యని సమస్తంబునకుం బరాయణంబుగా నతనిం బ్రతిపాదించు శ్రుత్యంతరంబు గల, దట్టి పరమేశ్వరుం గనుటకుం దగిన యోగంబుం జెప్పెద; ఖాండిక్య కేశిధ్వజ సంవాదంబు విను'' మని యిట్లనియె. 13

1. తొల్లి = పూర్వం; జామదగ్న్యభయంబునన్ = జమదగ్ని కుమారుడైన పరశురాముని భయంతో; పరిత్యక్త = వదిలిపెట్ట బడ్డ; రాజ్యుండై = రాజ్యం కలవాడై; వైరాగ్యంబున = విరక్తితో; దివోదాస+ ఆత్మజుండు+ అగు = దివోదాసుని కొడుకైన; ప్రతర్దనుండు = ఆపేరుగలవాడు; జనార్దను నెఱుంగక = విష్ణువుని తెలియక; అపవర్గ కాంక్షన్ = మోక్ష కాంక్షతో; ఇంద్రు = ఇంద్రుని; ఆరాధించినన్ = పూజిస్తే; అతండు = ఆ ఇంద్రుడు; సన్నిహితుండై = సాక్షాత్కరించి; మామ్ = నన్ను; ఉపాస్వ = ఉపాసింపుము; అనుటయు = అంటే.

పూర్వకాలం పరశురాముని భయంచేత ప్రతర్దనుడను వాడు రాజ్యాన్ని వదలి పెట్టి విరక్తుడై ఇంద్రు నారాధిస్తే అతడు ప్రత్యక్షమై తన నుపాసింపుమన్నాడు. తననే కదా ఇన్నాళ్లు ఇత నారాధించింది. కాబట్టి ఈ నన్ను ఇంద్రునిలో నున్న అంతర్యామి స్వరూపమైన శ్రీహరి అని బోధ పడుతోంది. ఈ ఇంద్ర ప్రతర్దన వృత్తాంతం కౌషీతకి బ్రాహ్మణోపనిషత్తులోనున్నది.

2. ముందు = పూర్వం; గర్భమునందున్ = తల్లి కడుపులో; ఉండియున్ = ఉన్నప్పుడు కూడా; అఖండిత = ఎడతెరపి లేని; తపః = తపస్సుతో; తులిత = సమానమైన; వామదేవుండు = శివుడు;

అగు= అయిన; వామదేవుండు = ఆపేరుగల ఋషి; అహం= నేను; సూర్యః = సూర్యుడను; మనుః = చంద్రుడను మనువు; కక్షీవాన్ = కక్షీవంతుడన్న పేరుగల ఋషిని; శరీర వాచక శబ్దంబు = దేహమునకు పేరైన మాట; శరీరి పర్యంతంబు=శరీరమునందున్న ఆత్మవరకు; పోవుటన్ జేసి = వ్యాపించడం వల్ల; చిత్ అచిత్ శరీరకుండు = చిత్తులగు జీవులు, అచిత్తులగు శరీరవము తన శరీరవముగా గల; పరమాత్మ(గూర్చి= పరమాత్ముని గురించి; అనుసంధించెను = అన్వయించెను; తెలిసి= ఎరిగి.

వామదేవ మహర్షి మాతృగర్భమందుండగనే మహర్షియై మాట్లాడినట్లు వేదం చెబుతోంది. ఈవిషయం ఋగ్వేద సంబంధమైన ఐతరేయ ఉపనిషత్తులో ఉంది. అందులో మూడవ అధ్యాయంలో **' ఈశ్వరః చిత్ అచిత్ చ ఇతి పదార్థత్రితయం హరిః' ఈశ్వరః చిత్ యుక్తా జీవ దృశ్యం అచిత్ పునః,** అని ఉంది. అంటే ఈశ్వరుడు, చిత్తు, అచిత్తులన్న మూడు వస్తువులున్నవి. ఈశ్వరుడే శ్రీహరి. చిత్తు జీవుడు కాగా అచిత్తు చూస్తున్నదంతా. కాబట్టి చూడ బడుతున్న విశ్వంలోని పదార్థాలు జీవులు. వీరి నామాలన్నీ ఈశ్వరుడైన శ్రీహరికే అన్వయిస్తాయని తాత్పర్యం. చేతనుడైన తానే జీవస్వరూపుడైన తాను (అనగా ఇంద్రుడు) జగత్కారణంబు కామి = జగత్కర్త కాకపోవడం; విబుధులందు = పండితులలో; ఎల్లన్ = అందరిలో; విజ్ఞానవృద్ధుడు = జ్ఞానంలో తలపండిన వాడు; అగు = అయిన; ఆవృద్ధశ్రవుండు= ఆ ఇంద్రుడు ( వృద్ధ = పండితులనుండి ; శ్రవుండు = విన్నవాడు); తత్ = ఇదివరకు చెప్పిన అనుసంధాన న్యాయంబున = సకల నామాలు, చిత్, అచిత్‌లకంటె విశిష్టుడైన ఈశ్వరునికే అన్వయిస్తాయన్న న్యాయంతో; ఉపదేశించెన్ = బోధించాడు అని; శ్రుతి సూత్రవముఖంబులన్ = బ్రహ్మసూత్రద్వారంగా; బ్రహ్మసూత్రప్రథమధ్యాయం ప్రథమపాదంలో 4 సూత్రాల్లో ఇంద్ర ప్రాణాధికరణముంది. కౌషీతకి ఉపనిషత్తులో ఇంద్రుడు ప్రతర్దనునకు చేసిన బ్రహ్మవిద్యోపదేశఘట్టంలోని వాక్యాలీ అధికరణంలో పూర్వపక్షంగా చేయబడిన ది. ఈ విషయమువిక్కడ అనుసంధించుకోవాలి. నిగమ+అంత శాస్త్ర ఫక్కికన్ = వేదాంత శాస్త్ర మార్గంలో; చాలన్ = మిక్కిలిగా; వక్కాణింపబడున్ = చెప్పబడుతుంది; ఆత్మయున్ = అంతర్యామి స్వరూపుడైన జీవాత్మ; అవనియున్ = భూమి; అనల = అగ్ని; పవన = వాయువు; గగన = ఆకాశం; కాల = త్రికాల స్వరూప మైనది; మృత్యు = మరణం; ప్రభృతి = మొదలైన; అఖిల = సమస్తమైన; చిత్ = జీవుని; అచిత్ = ప్రకృతితో; ప్రపంచంబు = సృష్టి; అతని శరీరంబులు = శ్రీహరికి తనువులు; అనియున్ = అనికూడా; అందే = ఆ శ్రుతి సూత్రాలలోనే; వినంబడున్ = వినబడుతుంది; అట్లగుటన్ = అలా కావడం వల్ల; అశేష = అనంత; దివిషత్ = దేవతలయొక్క; శరీరంబుల్ = తనువులు; ఆ+నారాయణ = సకలేశ్వరుడైన ఆ శ్రీమన్నారాయణునియొక్క శరీరంబులే కదా !

ఇంద్రుడు ప్రత్యక్షమై నన్ను ఉపాసించు అన్న దానిలో నేను ఎవడో వివరింపబడింది. జీవుడు, ప్రకృతి ఈ రెంటియొక్క పేర్లు అంతర్యామి అయిన పరమేశ్వరునకే అన్వయిస్తాయి గనుక ఇంద్రాది దేవతలు కూడా నారాయణుని శరీరమే కనుక నన్ను అంటే నారాయణుడు అని స్పష్టం చేశాయి. 'అపహతపాప్మా' నంటిమాటలు శరీరియైన నారాయణున కన్వయిస్తాయి తప్ప శరీర స్థానీయుడైన ఇంద్రునకన్వయించవు కనుక 'మాం' అంటే అంతరాత్మ శ్రీహరి అని తాత్పర్యం.

4. ముముక్షువునకు = మోక్ష వాంఛ గలవానికి; ఆ పుండరీక+అక్షున్ = ఆ పద్మ నేత్రుని; తక్క = వదలి; ఏ వ్యక్తిని అయినన్ = ఎవరినైన; ఉపాసించ వచ్చునె = సేవించ వచ్చునా !; విష్ణునకు; తత్ = ఆయాకాల వేళలకు సంబంధించిన; విగ్రహంబులు = శరీరాలు; అగుటన్ = అయినందువల్ల; బ్రహ్మ; రుద్ర; అర్జున; వ్యాస; భాను = సూర్యుడు; భార్గవ = పరశురాముడు; ఆది = మొదలైన వారియొక్క; భజనంబు = సేవ; త్రైవర్గికునకున్ కాక = ధర్మ, అర్థ, కామములను కోరుకొను వానికే తప్ప; అపవర్గ కాంక్షులకున్ = మోక్ష వాంఛ కలవారికి; అయుక్తంబు = తగదు; అని; స్మృతి శాస్త్రం; చెప్పున్ = చెబుతుంది. అదియున్ గాక = అంతే కాక; మాత = తల్లి; పిత = తండ్రి; భ్రాత = సోదరుడు; నివాసః = ఇల్లు; శరణం = రక్షకుడు; సుహృత్ = స్నేహితుడు; గతిః = గతియైనవాడు; నారాయణః = నారాయణుడే. మాతా, పితా, భ్రాతా, నివాసః శరణం, సుహృద్, గతిః చ నారాయణః - అని.

యథాతథంగా సుబాలోపనిషత్తునుండి గ్రహింప బడింది. పరాయణంబుగాన్ = పరమాశ్రయంగా; అతనిన్ = నారాయణుని; ప్రతిపాదించు = విధిస్తున్న; స్మృత్యంతంబు = మరొక ఉపనిషత్తు; యోగంబు = జీవేశ్వర సమన్వయాన్ని చెప్పే సాధన విశేషం; చెప్పెదన్ = వివరిస్తాను; ఖాండిక్య కేశిధ్వజ సంవాదంబు = వీరిద్దరికి సంబంధించిన కథను; వినుము; అని; ఇట్లనియెన్.

సర్వమునకు పరమాత్మ శ్రీమన్నారాయణుడే అని వేదవేదాంతాలలో ప్రతిపాదింపబడినట్లు విష్ణుచిత్తుడు మధురా చక్రవర్తికి వివరించి, బ్రహ్మరుద్రాదులు ఆయాసమయాలలో కొన్ని ప్రయోజనాల కోసం శ్రీమన్నారాయణుడు ధరించిన శరీరాలే కనుక. మోక్షం కావాలనుకున్న వారికి వారి నారాధించుట కర్తవ్యం కాదు. ధర్మార్థకామములన్న త్రివర్గాభిలాషులైతే ఆరాధించవచ్చు అని నిర్ధారణ చేశాడు. విష్ణుచిత్తుడు సభలో అడుగు పెట్టక ముందు ఆయాపండితులు వేరే వేరే దైవాలను ప్రతిపాదించినట్లుగా3 - 86 పద్యంలో చెప్పబడింది. వారందరూ నారాయణుని శరీరాలు తప్ప నారాయణు కాదని ఇక్కడ వేదవేదాంత బ్రహ్మసూత్ర సారంగా ప్రతిపాదించాడు. బ్రహ్మ - రుద్రార్జున వ్యాస - సహస్రకరాః భార్గవాః కకుత్స్థాత్రేయ కపిల - బుద్ధాద్యాయే సహస్రశః శక్త్యావేశావతారాస్తు- విష్ణోః తత్కాల విగ్రహాః అనుపాస్యా ముముక్షూణాం - యథేం ద్రాగ్న్యాది దేవతాః -(పాంచరాత్రం) ఈ వచనం శ్రీవిశిష్టా ద్వైతజీవనాడి.(చూ. తత్త్వోపహారం)

ఇక్కడనుండి ఖాండిక్య కేశిధ్వజ సంవాదమన్న ఒక అద్భుత కథ చెప్పబడుతోంది. ఈ కథాశైలిని గూర్చి కీ।శే॥ కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారు ఇలా అన్నారు. ''ఖాండిక్య కేశిధ్వజ సంవాదము నందు తిక్కనగారు కథ నడిపించు తీవియున్నది.'' అని ఈ కథ ఇతి హాసశైలిలో గంభీరంగా కూర్చబడ్డది. చిన్న చిన్న తెలుగు మాటలు, అల్పసమాసాలు, ఛందస్సులు ఒక విచిత్ర వాతావరణ కల్పన, సంభాషణ నిర్మాణంలో గజిబిజితనం లేకపోవడం చిన్న చిన్న కందాల్లో, తేటగీతుల్లో సంభాషణలు గుదిగ్రుచ్చబడ టం వాక్యనిర్మాణం, ఇవన్నీఇతి హాసశైలీలక్షణాలు.

ఖాండిక్య కేశిధ్వజ సంవాదం

మ. జనకాఖ్యాఖిల రాజ మొప్పు నిమి వంశం; బందు ధర్మధ్వజుం
డను భూజాని మితధ్వజాఖ్య వసుధాధ్యక్షుం జగద్రక్షణా

వనజాతాక్షు c గృతధ్వజాఖ్యుc గనియె; న్వారిద్దఱు న్గర్మఠున్
ఘన విజ్ఞానుc గ్రమంబునం గనిరి తత్ఖాండిక్యుc గేశిధ్వజున్. **14**

జనక+ ఆఖ్య = జనకుడన్న పేరుగల; అఖిల = సమస్తమైన; రాజము = రాజులుకల; నిమివంశంబు = నిమి అన్న పేరుగల వానికులం; ఒప్పున్ = జగత్ప్రసిద్ధమైనది; అందున్= అందులో; ధర్మధ్వజుండు; అను; భూజాని = రాజు; మితధ్వజ = మితధ్వజుడన్న; ఆఖ్య = పేరుగల; వసుధ+ అధ్యక్షున్ = రాజును; జగద్రక్షణ = లోక రక్షణలో; వనజాత+ అక్షున్ = పుండరీకాక్షుడైన (విష్ణునితో సమానుడు) కృతధ్వజ+ ఆఖ్యున్ = కృతధ్వజుడన్న పేరు గలవానిని; కనియెన్ = కన్నాడు; వారిద్దరున్ = ఆ ధర్మధ్వజుడు, కృతధ్వజుడు; క్రమంబునన్ = వరుసగా; కర్మఠున్ = వైదికకర్మలైన యజ్ఞయాగాలు చేసేవాడైన; తత్ ఖాండిక్యున్ = వేదకర్మలో ప్రసిద్ధుడైన ఖాండిక్యుని; ఘన విజ్ఞానున్ = గొప్పవిజ్ఞానం గలవాడైన; కేశిధ్వజున్ = కేశిధ్వజుడన్న వానిని; కనిరి.

తా॥ నిమి అన్న పేరుగల రాజవంశంలో రాజులందరుకు జనకుడన్నదే పేరు. ఆ వంశంలో ధర్మధ్వజుడు, కృతధ్వజుడని యిద్దఱు కొడుకులు జన్మించారు. ఆ మితధ్వజునికి కర్మిష్ఠియైన ఖాండిక్యుడు, కృతధ్వజునకు బ్రహ్మజ్ఞాని యైన కేశిధ్వజుడు జన్మించారు.

అలం॥ వారిద్దరు---------కేశిధ్వజున్- క్రమాలం కారం ఉన్నది.

మితధ్వజునకు ఖాండిక్యుడు, కృతధ్వజునకు కేశిధ్వజుడు అన్న క్రమంలో కూర్చబడింది కనుక. కుంతకాచార్యుల ప్రకారం ఇది అలంకారం కాదు. ఉపమానోప మేయాలు లేవు కనుక.

విశే॥ ఈ కథ కర్మమార్గం, జ్ఞాన మార్గం రెండింటిలో ఏది మోక్షసాధనమన్న జిజ్ఞాస రాగా ఆ సమన్వయం కోసం చెప్పబడ్డది. అద్వైతం కేవల జ్ఞానమార్గాన్ని స్వీకరించి కర్మమార్గాన్ని నిరాదరిస్తుంది. కేవల జ్ఞానమే మోక్షసాధనమని అద్వైత విశ్వాసం. కనుక అద్వైతం సన్యాసాన్ని ప్రధానంగా చెబుతుంది. కాని శ్రీవిశిష్టాద్వైతం రెంటినీ సమన్వయించి జ్ఞానకర్మ సముచ్చయ వాదాన్ని స్థాపించింది. అందుచేత కథాతాత్పర్యాన్ని ప్రారంభంలోనే ఈ నాందీ శ్లోకం వంటి పద్యంలో సూచన ప్రాయంగా కవి నిక్షేపించడం కథనశిల్పంలో ఒక విశేషం. (కర్మ = అవిద్య; జ్ఞానం = విద్యఅని ఈ శాపారహస్యం)

కం. వారిరువురు దమలోపల;
వేరము cగొని, రాజ్యకాంక్ష విజిగీషువులై,
హోరాహోరిగ c బోరిరి;
బారాదిదినంబు లవని ప్రజలు దలంకన్. **15**

వారు+ ఇరువురున్ = ఆ ఇద్దరు; తమ లోపల = పరస్పరం; రాజ్యకాంక్షన్ = రాజ్యం మీద కోరికతో; వేరమున్ = వైరమును, కొని = వహించి; విజిగీషువులు+ ఐ = పరస్పరం గెలవాలని కోరుకొని; బారాది దినంబులు = చాలకాలం; అవని ప్రజలు = భూజనులు; తలంకన్ = భయపడేటట్లుగా; హోరాహోరిగన్= ఎడతెరపి లేకుండా; పోరిరి = కలహించారు.

తా॥ ఆ ఖాండిక్య కేశిధ్వజులిద్దరు ఒకరి రాజ్యాన్ని మరొకరు కబళించాలని పరస్పరం శత్రువులై చాలాకాలం భయంకరంగా యుద్ధం చేసారు.

విశే॥ బారాది. అన్యదేశ్యం. బార అన్న హిందుస్థానీ శబ్దం (12) ఇదే చాలాకాలమన్న అర్థంలో తెలుగులో ప్రవేశించింది. బారసి అన్నా ఇదే. ఈ శబ్దాన్ని 4-50లో రాయలే ప్రయోగించాడు. ద్వాదశి అన్న అర్థంలో ద్వాదశి శబ్దం యొక్క వికార రూపం బారసి. శ్రీనాథుని దగ్గరనుండి తురుష్క, హిందుస్థానిశబ్దాలు తెలుగు లోనికి బారంబాటగా వచ్చి చేరి పోయాయి. రాయల వారిచే ఈ శబ్దాలు అక్కడక్కడ ప్రయోగింపబడ్డట్లు తెలుస్తుంది.

బారాసి - పాఠాంతరం

'హోరా' శబ్దం గూడా శబ్ద శాస్త్రజ్ఞులకు చిక్కుపెట్టిన మాట. ఇది హోరా అన్న గ్రీకుశబ్దమని పండితులు భావించారు.

చ. పలపల వేగ నిచ్చలును ఫౌఁజులు దీర్చి యతండు నాతఁడున్
వెలువడి వచ్చి; యిక్షుమతి వేణిక యేపిరిగాఁగ వీఁగుచున్
దలపడుచున్ బెనంగఁగఁ గృతధ్వజనందన సైనికావళీ
హాళహాళికిం జెడ న్విఱిగె నార్తి మితధ్వజనందనుం డనిన్. 16

అతండున్, ఆతడున్ = ఆఖాండిక్య కేశిధ్వజు లిద్దరు; నిచ్చలు = నిత్యము; పలపల వేగన్ = పీచుపీచుగా తెల్లవారగనే (తూర్పున తెలుపు రేఖలు రాగానే) ఫౌజులుదీర్చి = సేనలను వ్యూహాలుగా నిర్మించుకొని; వెలువడి వచ్చి = సేనాశిబిరములనుండి బయటకు వచ్చి; ఇక్షుమతివేణికన్ = ఇక్షుమతి నదీప్రవాహం; ఏపిరిగాఁగన్ = హద్దుకాగా వీఁగుచున్ = ప్రొద్దు క్రుంకగనే యుద్ధమును ముగిస్తూ; తలపడుచున్ = తెల్లవారగనే ఎదుర్కొంటూ; పెనంగన్ = కలహింపగా; అనిన్ = యుద్ధంలో; కృతధ్వజనందన = కృతధ్వజుని కొడుకైన కేశిధ్వజునియొక్క; సైనిక = సేనలయొక్క; ఆవళి = సమూహంయొక్క; హాళహాళికిన్ = ధాటికు; ఆర్తిన్ = దుఃఖంతో; మితధ్వజ నందనుడు = ఖాండిక్యుడు; చెడన్ = ఓడి; విఱిగెన్ = పారిపోయాడు.

తా॥ ఆ దాయాదులైన ఇద్దరు తూర్పు దిక్కున పలుచగా తెలి రేఖలు విచ్చే వేళకు నిత్యమూ సేనా వ్యూహాలు తీర్చుకొని ఇక్షుమతీ నదిని సరిహద్దుగా చేసికొని చాలకాలం యుద్ధం చేశారు. చివరకు కేశిధ్వజుని సేనల శౌర్యానికి ఖాండిక్యుని సేనలన్నీ చెడిపోగా పలాయితుడైనాడు.

విశే॥ ఫౌజు - హిందుస్థానీ శబ్దం.

హాళాహాళి - హాళహాళి - సంభ్రమము, కలకలధ్వని, సందడి, శౌర్యము ఆటోపము అన్న అర్థాలలో సూర్యరాయాంధ్ర నిఘంటువు ఈ శబ్దాన్ని గ్రహించింది. ఇది కన్నడ శబ్దమని కూడా చెప్పింది.

'ఏపిరి' శబ్దం పిరియు = విడిపోవు అన్న అర్థంలో తమిళ ధాతువు ఉన్నదని వే.దం.వారు

వ్రాసారు. కాని ఏపిరి అన్న మాట నిఘంటువులో లేదని వారన్నారు. కాని సూర్య రాయాంధ్ర నిఘంటువులో 'హద్దు' అని అర్థం ఇచ్చి ప్రయోగాంతరం లేదని యీ పద్యాన్నే ఉదాహరించింది. వేదం వారన్నట్లుగా 'పిరి' అని గ్రహిస్తే ఇక్షుమతి వేణికయే అని వాక్యాన్ని విరుచుకొని 'పిరిగాగ' నిడిపోయే సరిహద్దుకాగా అని అన్వయించు కోవచ్చు.

ఈ కథలో వచ్చే శబ్దవిశేషాలను గుర్తించాలి. పలపల, ఫౌజులు, ఏపిరి, హాళహాళి, చెడన్ విఱుగు ఇలాంటి చిన్న చిన్న శబ్దాలు కాహళసంధించినట్లు ప్రయోగించేనేర్పు తిక్కనగారిది. ప్రాబంధిక పద్యరచనా సౌందర్యం ఈ కథలో ఉండదు. ఐతిహాసిక రచనా సారళ్యం, ఔచిత్యమే ఉంటాయి.

కం. చెడవిఱిఁగి యడవిఁ బడి, యెడ
నెడ ఁగట్టుల తుదల ఁగోటి యిడి, లోఁగడకున్
దడుకు వొడిపించి, యాకుల
గుడిసెల వసియించె మంత్రి గురు భటయుతుఁడై. 17

చెడ విఱిగి = పారిపోయి; అడవిన్+పడి = అడవిని పట్టి; ఎడనెడన్ = అక్కడక్కడ; గట్టుల తుదలన్ = కొండల కొనలపై; కోటి యిడి = వేగుల వారిని నిలిపి; లోఁగడకున్= నివసించడానికి; తడుకు = కంప; పొడిపించి = నాటి; ఆకుల గుడిసెలన్ = పర్ణశాలలో; మంత్రి గురు భ టయుతుడు = మంత్రులతోను, గురువులతోను, భటులతోను కలిసి; వసియించెన్ = నివసించినాడు.

తా॥ ఆ ఖాండిక్యుడు పరాజితుడై అడవికి వలసపోయి దారి పొడుగునా శత్రు సంచారాన్ని పసిగట్టి చెప్పడానికి వేగుల వాండ్రను కొండ గుట్టలపై కాపలా ఉంచి అడవిలో ఒక రహస్య ప్రదేశంలో చుట్టూ కంప పాతించి ఆ ఆవరణలోపల ఆకు గుడిసెలలో మంత్రి గురుభటా దులతో పాటుగా నివసిస్తున్నాడు.

విశే॥ కోటియిడి = ఇది వేదం వారి పాఠం. కోపులిడి అని వావిళ్ల పాఠం. కొట్టి కాండ్రు అన్న ప్రయోగం కూడా ఈ కథలోనే 86వ పద్యంలో ఉంది. ఆ శబ్దాన్ని 'గొట్టి కాండ్రు' గా గ్రహించి వేగుల వారని వావిళ్ల వ్యాఖ్యానం చెబుతుంది. కొటికాడు, కొట్టిగాడు ఈ రెండు రూపాంతరా లనుకోవాలి. పూర్వకాలంలో రాజునకు శత్రువుల సమాచార మందించే పద్ధతి ఈ పద్యంలో చెప్పబడ్డది. హంపీ మొదలైన చోట్ల నేటికీ మిగిలిన కోటబురుజులు శత్రుసంచారాన్ని రాజునకు నివేదించే సాధనాలుగా నిర్మించబడ్డవి. రాత్రిపూట అయితే కాగడాలు వెలిగించి, పగటిపూట అయితే కూతలు పెట్టి అవతల ఉన్న మరియొక గుంపునకు శత్రుసమాచారాన్ని సంజ్ఞలద్వారా అందించే పద్ధతి ఉండేదని మన కీ పద్యం వల్ల తెలుస్తోంది. పీఠికలో గజరాజు వింధ్యవాటికి పారిపోయిన ఉదంతం స్మరిస్తే ఈనాటి మనకు ఆనాటి యుద్ధాలు, పారిపోవటాలు, అడవిలో తలదాచు కోవటం లాంటివి సూచన ప్రాయంగా నైన తెలుస్తాయి. ఈ విధంగా కావ్యాలు కూడ సామాజిక, చారిత్రక సత్యాలను చిత్రిస్తాయి.

చెడవిఱిగి, అడవిపడి, గట్టులతుదల, కోటియిడి, లోగడకున్, తడుకు పొడిపించి, ఆకుల

గుడిసెలన్ - సొగసైన తెలుగు మాటలతో ఒక అద్భుతమైన వాతావరణ కల్పన జరిగింది. ఈ విద్యలో రాయలు సిద్ధహస్తుడు. మంత్రులు, గురువులు అన్న మాటలు రెండు రాజనీతికి సంబంధించినవి గురువు ఆధ్యాత్మిక మార్గం చూపే వాడు. మంత్రి మంత్రాంగంలో తోడుపడేవాడు. ఈ విషయాలు నాల్గవ ఆశ్వాసంలో స్పష్టపడతాయి.

శా. ఆ కేశిధ్వజుఁ డంత నా నృపుని రాజ్యంబెల్లఁ జేర, న్ఫలం
బాకాంక్షింపక 'గెల్తు మృత్యువు నవిద్య, న్బుట్టకుందుం, దుదన్
జాకుందు న్వడి' నంచు యోగనియతిం జ్ఞానాశ్రయుండై మఖా
నీకంబు ల్రచియించు చందొకటికిం దీక్షించి తానున్న చోన్. 18

ఆ కేశిధ్వజుఁడు = గెలిచిన ఆ కేశిధ్వజుడు, ఆ నృపుని = ఆ ఓడి పోయిన ఖాండిక్యుని; రాజ్యంబు+ ఎల్లన్ = సమస్త సామ్రాజ్యం; చేరన్ = లభింపగా; అంతన్ = తర్వాత; ఫలంబు = యజ్ఞకర్మలకు ఫలమైన స్వర్గం; ఆకాంక్షింపక = కోరక; మృత్యువున్ = బ్రహ్మజ్ఞాన నిరోధక పాపం ; గెల్తున్ = జయిస్తాను; అవిద్యన్ = వేదకర్మలైన యజ్ఞాదులతో, పుట్టకుందున్= జన్మించా లనుకోను; తుదన్ = తుదకు; చాకుందున్ = చావబోను; అంచున్ = అని నిశ్చయించు కొని; వడిన్ = వేగంగా; యోగనిరతిన్ = యోగ నిరతితో; జ్ఞాన+ ఆశ్రయుండై = బ్రహ్మజ్ఞాననిష్ఠుడై; మఖ+అనీకంబుల్ = అనేక యజ్ఞములు; రచియించుచున్ = చేస్తూ; అందున్ = నాటిలో; ఒకటికిన్ = ఒకదానికి; దీక్షించి = దీక్షవహించి; తాను; ఉన్నచోన్ = ఉన్నపుడు.

**తా॥** ఖాండిక్యుని రాజ్యం కూడా తనకే లభించిన తర్వాత కేశిధ్వజుడు ఫలాన్ని కోరకుండా వేదయజ్ఞ కర్మ రూపమైన అవిద్య ద్వారా మృత్యువును జయిస్తాను. జనన మరణరూపమైన సంసార ప్రవాహం నుండి విడివడిపోతాను అని జ్ఞానమార్గనియతితో - యజ్ఞపరంపర లనేకం చేస్తూ ఒకానొక యజ్ఞానికి దీక్ష వహించిన సందర్భంలో.

**విశే॥** అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయా అమృత మశ్నుతే ( ఈశోపనిషత్) అవిద్యద్వారా మృత్యువును తరించి; విద్యద్వారా అమృతత్వాన్ని పొందాలి అన్న మంత్రానుసారంగా ఈ పద్యం వ్రాయబడ్డది. ముందు పద్యార్థ సందర్భంగా వ్రాయబడ్డట్లుగా ఈ పద్యంలో జ్ఞాన కర్మ మార్గాన్ని కవి ప్రతిపాదిస్తున్నాడు. కర్మమార్గం అవిద్య. (కర్మలంటే వేదం చెప్పిన కర్మలను, యజ్ఞ యాగాదులను నిర్వహించడం). విద్య అంటే జ్ఞానం. ఈ రెంటికీ ఈశావాస్యం సమన్వయాన్ని ప్రతిపాదిస్తుంది. ఆ మంత్రవాక్యార్థమిదే .

వేదాంతదేశికులు ఈశోపనిషత్తులో జ్ఞాన కర్మ సముచ్చయ వాదాన్ని స్థాపించారు. ఇందుకే రాయలవారు కూడా ఈ కథనే పట్టుకున్నారు. అద్వైత మత ఖండనకు విశిష్టాద్వైత మతానికి ఈ కథ ఒక ప్రబలమైన ప్రమాణం.

ఇయాజసోపి సుబహూన్ - యజ్ఞాన్ జ్ఞానవ్యపాశ్రయః బ్రహ్మవిద్యామధిష్ఠాయ - తర్తుం మృత్యుమవిద్యయా ( వి.పు = విష్ణుపురాణం. 6-6-12)

చ. పులు మఖశాలికానికట భూముల మేయుచు నేటి వెంట c బె
ల్లల మెడు నీఱముం దఱిసి యామ్యపతాకన ఘర్మధేను వా
కెళవున నాడు వాల భుజగిం గని గోం(డని యంగలార్చుచున్
గళగత ఘంట మ్రోయ నుఱుకం బిడుగుంబలె దాcకి యుద్ధతిన్. 19

ఘర్మధేనువు = యజ్ఞసంబంధమైన ఆవు; మఖశాలిక = యజ్ఞశాలకు; నికట = సమీపమునందున్న; భూములన్ = పచ్చిక బయళ్లలో; పులు = పచ్చికను; మేయుచున్= మేస్తూ; ఏటి వెంటన్ = నది పొడుగునా; పెల్లు = మిక్కిలి; అలమెడు = కమ్ముకొని యున్న; ఈఱమున్ = పొదను; దఱిసి = సమీపించి; ఆ కెళవున్ = ఆప్రక్కలో; యామ్యపతాక + అనన్ = యముని యొక్క జెండా అన్నట్లుగా; ఆడు = కదలుతున్న; వాలభుజగిన్ = తోక అన్నపామును; కని = చూచి; గోం(డు+ అని+ అంగలు+ ఆర్చుచున్= గోం(డుమని ధ్వని చేస్తూ (భయంతో అరుస్తూ); గళగత = మెడలోనున్న; ఘంట = గంట; మ్రోయన్ = మ్రోగుతుండగా; ఉఱుకన్ = పరిగెత్తగా; పిడుగున్‌బలె = పిడుగో అన్నట్లుగా ; తాకి = మీదపడి; ఉద్ధతిన్= ఉదుటుతో

తా॥ యజ్ఞధేనువు యజ్ఞశాలకు సమీపంలో ఉన్న బయళ్లలో పచ్చికలు మేస్తూ ఏటి ఒడ్డ వెంబడి పొదలుగా పెరిగిన గడ్డి దుబ్బులను సమీపించేసరికి ఆ పొదచాటున ఒక పులి పొంచివున్నది. ఆ పులి కనిపించకుండా దాని తోక మాత్రం కదులుతూ పొదపైకి కనిపిస్తున్నది. ఆ తోక పాములాగా యముని బావుటాలా కదులుతున్నది. అది చూచి ఆవు గోం(డుమని భయంకరంగా అరుస్తూ మెడలో ఘంటల పట్టెడ మ్రోగేటట్లుగా ఒక్క దూకు దూకింది. ఇక్కడ నుండి పులి ఆవును వేటాడడం 4 పద్యాలలో వర్ణింపబడుతోంది.

ఈ పద్యంలో నాటి రాజ సంప్రదాయ చరిత్ర అభివ్యక్త మవుతున్నది. రాజ్యాన్ని సుభిక్షంగా పాలించి శత్రునిర్మూలనం చేసి రాజులు ఆధ్యాత్మిక అన్వేషణకు ప్రయత్నించే వారు. అంతేకాని అలెగ్జాండర్‌లా ప్రపంచాన్నంతా జయించాలనుకునేవారు కారు. ఇదే కృష్ణదేవరాయల ప్రవృత్తి కూడా అయివుండాలి. లేకపోతే ఆధ్యాత్మిక విద్యకు పట్టు కొమ్మలైన జనక చక్రవర్తుల కధ చెప్ప నవసరం లేదు. గీతలో భగవంతుడైన కృష్ణుడు కూడా ఈ ఆధ్యాత్మిక విద్య జనకుని నుండి లోకవ్యాప్తి పొందినదనే చెప్పాడు. అంటే చక్రవర్తులు ఆధ్యాత్మిక విద్యావేత్తలుగా ఉండేవారు. ఇదే భారతీయ సంస్కృతిలోని ఐహికాముష్మిక సంప్రదాయం. రాజర్షి సంప్రదాయం

ఉ. గబ్బు సమక్షికం బయి మొగం బడువ, న్దరు షణ్ణముల్పడన్
ద్రొబ్బుచుc, గార్మొగిల్ల రొదతోc జెఱలాడెడు బొబ్బరింతగా
డ్పుబ్బి విసంజ్ఞ గాcగc జెవులూదిన, వల్లవుc డుర్వి c గూలcగా,
బెబ్బులి గొంతుక్రోల్గఱచి పెల్లున మార్మెడ ద్రెళ్ల దాcటుచున్. 20

గబ్బు = పులి నోటి దుర్వాసన; సమక్షికంబు = ఈగలతో కూడుకొన్నది అయి; మొగంబు+ అడునన్ =

ముఖాన్ని కొట్టగా; తరు పర్ణముల్ =చెట్ల ఆకులు; పడన్ = రాలేటట్లుగా; ద్రొబ్బుచు = పడదోస్తూ; కార్మొగిళ్లు = నల్లని మబ్బుల; రొదతోన్ = ధ్వనితో; చెఱలాడెడు = సమానమైన; బొబ్బరింత గాడ్పు = గర్జన గాలి; ఉబ్బి = ఉబికి; విసంజ్ఞ కాగ = స్మృతి తప్పిపోగా; చెవులూదినన్ = చెవులలో ప్రవేశించి నందువల్ల; వల్లవుడు = ఆవులకాపరి; ఉర్విన్ = భూమిపై; వాలగాన్ = పడిపోగా; బెబ్బులి = ఆ పెద్దపులి; గొంతు క్రోల్ = ఆవుగొంతు నాళాన్ని; కఱచి = కొరికి; పెల్లునన్= పెద్దగా; మూర్మెడ = మెడ మరొక ప్రక్కకు తిరిగే టట్లుగా; త్రెళ్లన్ = ఆవు కూలేటట్లు; దాటుచున్ = అంగలేస్తూ.

తా॥ పులి ఆవు మీద పడగానే ఆవునకు ఈగలు మూగిన దాని నోటి గాలి తన ముఖాన ముసురుకోగా దానికి ఊపిరాడ లేదు. అలాంటి ఆవును పులి పడద్రోసింది. ఆ ఆవు చెట్లమీద పడినందున ఆకులు రాలుతున్నవి. పెద్ద ఉరుములాంటి దాని గర్జన చెవుల్లో చొరబడి పెద్ద ధ్వని చేయడంవల్ల ఆవును మేపుతున్న కాపలావాడు మూర్ఛపోయినాడు. పులి ఆవు గొంతు పీకను కొరికి మూర్మెడ పడేటట్లుగా చేసింది. పెళ్ళున గొంతు విరిచింది.

అలం : స్వభావోక్తి. అద్భుతమైన సహజవర్ణన.

విశే॥ చెఱలాడెడు - చెఱపట్టెడు ( చెఱపట్టీలు. ఇదే ఉప్పెన బట్టెలుగా ఉత్తర హరివంశంలో ప్రయోగింపబడింది. ) చెఱపట్టెలాట పల్లోటూళ్లలో నేటికీ ఉన్నది. ఇదే చెర్లాటగా ప్రయోగంలో ఉన్నది. నేటిప్రయోగం బంతి ఆడుకోవడం. సొగసైన జాతీయం. ఇక్కడ అన్వార్థంలో = లక్ష్యార్థంలో ప్రయోగింపబడింది. పులి బొబ్బరింత ఉరుమును బంతిగా చేసికొని తంతున్నది. అంటే ఉరుము కంటే ఉగ్ర ధ్వని అని అర్థం.

ఆ.వె. తనువుఁ గొమ్ము గొరిజ గొనకుండ మలఁపుచుఁ
జప్పుడెసగఁ దోఁక నప్పళించి,
శోణితంబు గ్రోలుచునె నేర్పుమై ఘర్మ
గవిని గవికి నీడ్చు నవసరమున. 21

తనువున్ = పులి తన దేహానికి; కొమ్ము = ఆవు కొమ్ము; గొరిజ = ఆవుగిట్ట; కొనకుండ= తగలకుండా; మలపుచున్ = ఆవు శరీరాన్ని త్రిప్పుతూ; చప్పుడు + ఎసంగన్ = మిక్కిలి శబ్దించేటట్లుగా; తోకన్ = తోకతో; అప్పళించి = చరిచి కొట్టి; శోణితంబు = నెత్తురు; క్రోలుచున్ = త్రాగుతునే; నేర్పుమై = నేర్పుతో; ఘర్మగవిని = యాగధేనువును; గవికిన్ = గుహకు; ఈడ్చు = లాగుకొని పోయే; అవసరమునన్ = సమయంలో.

తా॥ ఆ పులి తన శరీరానికి ఆవు కొమ్ముగాని, గిట్టగాని తాకకుండా నేర్పుతో దానిని త్రిప్పుతూ పెద్ద ధ్వనితో తోకతో కొడుతూ, ఆ యాగధేనువుని తన గుహకు ఈడ్చుకొని పోతున్నపుడు.

విశే॥ ప్రతి పద్యంలోనూ తెలుగు మాటల కూర్పే ఎక్కువగా కనిపించడం గుర్తించాలి. కొమ్ము, గొరిజ

అన్న మాటలు చెట్టు - పుట్ట, నగా - నట్రా అన్న ప్రయోగంలాగా భాసిస్తున్నది తన శరీరానికి ఆవు శరీరం ఏమాత్రం తగలకుండా గుహకు ఈడ్చుకొని పోవడమే పులి నేర్పు. చాలా సహజమైన వర్ణన. వేదంవారీపద్యశైలిలో ఇమిడికను స్తుతించారు.

చ. పొలమరు లంది కూఁత లిడ, భూసురు లన్నదిలోన వార్చి, మ్రాఁ
కుల తుద లెక్కి, చప్పటలు గొట్టి యదల్పఁగ, సాహిణీలు మా
వులఁ బఱపంగ, వైచి సెలవు ల్వెస నాకుచుఁ బోయె వృక్షమం
డలికయి తేలుచున్ గుటగుట ధ్వని సారె మలంగి చూచుచున్. 22

పొలమరులు = పొలము కాపరులు; అంది = సమీపించి; కూతలిడన్ = కేకలు వేయడం చేత; భూసురులు= బ్రాహ్మణులు; అన్నదిలోన్ = ఆ ఇక్షుమతిలో; వార్చి = ఆచమనం చేసి; మ్రాఁకుల తుదల్ = చెట్ల చివళ్లు; ఎక్కి; చప్పటలు కొట్టి = చప్పట్లు మ్రోగించి; అదల్పగన్ = పులిని బెదిరిస్తే; సాహిణీలు = గుఱ్ఱపురౌతులు; మావులన్ = గుర్రాలను; పఱపంగన్ = తరుమగా; వైచి = గోవును వదలి (పులి), సెలవుల్ = పెదవి మూలలను; నాకుచున్ = నాకుతూ; గుటగుట ధ్వనిన్ = గుటగుటధ్వని చేస్తూ; సారెన్= మాటికి; మలంగి చూచుచున్ = వెన్క తిరిగి చూస్తూ; వృక్షమండలికి + అయి = చెట్ల గుంపులోనికి; తేలుచున్ = ఆకాశంలోకి ఎగురుతూ, వెసన్ పోయెన్ = వేగంగా పరి గెత్తింది.

తా॥ ఆ ప్రాంతంలోనే పొలాలకు కాపలా కాసేవారు అందరు చేరి కేకలు వేశారు. పాప పరిహారార్థం బ్రాహ్మణులు ఇక్షుమతిలో ఆచమించి చెట్ల పైకెక్కి చప్పటలు కొట్టి బెదిరించారు. ఇక రౌతులు గుర్రాలెక్కి పులిని వెన్నాడగా అది ఆవును వదలి పెదవి మూలలు నాకుతూ గుర్రున ధ్వనిచేస్తూ చెట్ల పొదలలోకి తేలుతూ మాటి మాటికి వెనుదిరిగి చూస్తూ వేగంగా పరిగెత్తిపోయింది.

అలం : స్వభావోక్తి.

పొలమరులు, భూసురులు, సాహిణులు - వీరందరూ కలిసి పులిని బెదిరించడం, అది గుటగుట ధ్వనిచేస్తూ, పెదవి మూలలు నాకుతూ పోవడం ఒక అద్భుత దృశ్యంగా పొడగట్టక మానదు.

తూలుచున్ - పాఠాంతరం

కం. జుఱుజుఱుకని నెత్తురు వెలి
కుఱుకుచు రొదసేయ, నఱితి యొడపిన యూర్పుల్
పఱవ, మిడి గ్రుడ్ల వణఁకుచుఁ
గొఱ ప్రాణముతోడఁ దన్నుకొను నమ్మొదవున్. 23

జుఱుజుఱుకు+అని = ఇది ధ్వన్యనుకరణ శబ్దం; నెత్తురు; వెలికిన్ = దేహం నుండి బయటకు, ఉరుకుచున్= ప్రవహిస్తూ; రొదసేయన్ = చప్పుడు చేయగా; అఱితి యొడిపిన = కంఠమందేర్పడ్డ

గాయమునుండియె; ఊర్పుల్ = నిశ్శ్వాసాలు; పఱువన్ = ప్రసరింపగా; మిడిగ్రుడ్లన్ = తేల వేచిన కళ్లతో; వణుకుచున్ = కంపిస్తూ, కొఱప్రాణము తోడన్ = కొనయూపిరితో; తన్నుకొను = తన్నుకొంటున్న; ఆ+మొదవున్ = ఆ గోవును.

తా॥ పులి ఆవు గొంతునాళాన్ని కొఱికి నందువల్ల నెత్తురు వరదలై ప్రవహింపగా కంఠ మందేర్పడ్డగాయం నుండి నిట్టూర్పుగాలులు ప్రసరింపగా గ్రుడ్లు తేలవేసి కొనవూపిరితో తన్నుకొంటున్న ఆ గోవును గురించి.

అలం : స్వభావోక్తి.

విశే॥ పులి ఆవును వేటాడటం ఈ ఐదు పద్యాలలో అద్భుతంగా కళ్లకు కట్టేటట్లుగా వర్ణింపబడ్డది. విశ్వనాధ వారు ఈ సంఘటనను గురించి ' ఇది లోకోత్తరమ్మైన వర్ణనాశక్తి గల ప్రతిభావంతుడు తప్ప ఇలా వ్రాయడన్నారు. చూ. వేయిపడగలు రాయలు మహాచక్రవర్తి కనుక వేటాడే వాడు కనుక ఈ పులి వేటను తప్పక చూచి ఉండాలి. నాల్గవ ఆశ్వాసం రాజనీతి లోకూడా జంతు స్వభావాన్ని చాలా అద్భుతంగా వర్ణిస్తాడు. చూడు. 4-241. ఈ వర్ణనాశక్తికి తోడు అతడు వాడిన తెలుగు పలుకుబడులు చాలా సొగసైనవి. పద్యరచన తిక్కనగారి రచనముద్ర కలిగి యున్నది.

సీ. విన్నవించుటయు ఋత్విజులఁ బ్రాయశ్చిత్త
 మడిగె రా; జడిగిన నడుగు మనిరి
వారు కసేరువుఁ దా రెఱుంగక పోయి;
 యతఁడును శునకుని నడుగు మనియె;
నతఁడు దాను నెఱుంగ నని పల్కి, 'నృప ! విను;
 మా ఋత్విజుల పిండు నా కసేరు
వేను నెఱుంగ లే, మిఁక నొక్క యేమె కా
 దిల మఱి యెవ్వాడు నెఱుఁగ; డెవ్వఁ

తే॥ డేని సప్తాంగములు నీకు నిచ్చి చెట్లు
వట్టి పెద్రాలతిప్పలు వట్టి తిరుగు
నట్టి ఖాండిక్యుఁ డొక్కఁడ యరయ నెఱిఁగె
నే నెఱుఁగు; వేఁడు మది కర్జ మేని' యనిన. 24

విన్నవించుటయున్ = భటులు రాజునకు నివేదిస్తే; రాజు కేశిధ్వజుడు; ఋత్విజులన్ = యజ్ఞం చేయించే బ్రాహ్మణులను; ప్రాయశ్చిత్తము = పాప పరిహార మార్గం; అడిగినన్= అడిగితే; వారు = ఋత్విజులు; తారు+ ఎఱుంగక = తాము తెలియక; పోయి = వెళ్లి; కసేరువున్ = కసేరు వన్నువానిని; అడుగుము, అనిరి, అతడును = ఆ కసేరువు కూడా; శునకునిన్ = శునకుడన్నువానిని; అడుగుము, అనియెన్; అతండున్ = ఆ శునకుడు కూడ; తాను; ఎఱుంగను; అని పల్కి = అని చెప్పి; నృప = రాజా; వినుము=

జాగ్రత్తగా ఆలకించు; ఆ ఋత్విజుల పిండు = ఆ ఋత్విక్కుల సమూహం; ఆ కసేరువు; ఏనునన్= నేను; ఎఱుంగలేము = తెలియలేము; ఇక; ఒక్క ఏమె కాదు = ఒక్క మేమే కాదు; ఇలన్= భూమిలో; మఱి = ఇక; ఎవ్వాడున్ = ఎవ్వడు; ఎఱుగడు = తెలియడు; ఎవ్వడేనిన్ = ఎవడైతే; సప్త+అంగములు = రాజ్యానికి సంబంధించిన ఏడు అంగములు; నీకున్ + ఇచ్చి = నీకు అర్పించి; చెట్లువట్టి = చెట్టూ చేమలు పట్టు కొని; పెన్‌రాల తిప్పలు = పెద్దరాళ్లు గల గుట్టలను; పట్టి = అంటుకొని; తిరుగున్ = తిరుగుతున్నాడో; అట్టి = అటువంటి; ఖాండిక్యుడొక్కడ = ఖాండిక్యుడొక్కడే; అరయన్ = ఆలోచించి చూస్తే; ఎఱిగెనేన్ , ఎఱుగున్ = తెలిస్తే తెలియవచ్చు; అది = నేను చెప్పింది; కర్జమేనిన్ = చేయదగిన దైతే; వేడుము = ఖాండిక్యుని అర్థించు; అనినన్ = అని అనగా !

**తా॥** అవుకాపరులు దానిస్థితి రాజునకు విన్నవిస్తే ఆయన ప్రాయశ్చిత్త మేమని ఋత్విక్కులను ప్రశ్నించాడు. వారు మాకు తెలియదు, కసేరువుని అడగమన్నారు. కసేరువు శునకుని అడగమన్నాడు. ఆ శునకుడు కూడా నాకు తెలియదని చెప్పి ''రాజా! ఇలా ఎందుకు తిరుగుతావు. నీ ఋత్విక్కులకు గాని, కసేరువుకు గాని, నాకు గానీ ఈ ప్రాయశ్చిత్తం తెలియదు. తెలిసిన వాడొక్కడే ఉన్నాడు. ఎవ్వడైతే తన సప్తాంగ సామ్రాజ్యాన్ని నీకు ఓడిపోయి చెట్లు, పుట్టలు, రాళ్లు, రప్పలు పట్టు కొని తిరుగుతున్నాడో ఆ ఖాండిక్యుడు ఒక్కడే తెలిసినవాడు. తెలిస్తే అతనికే తెలియాలి కనుక నీకిది మంచిదనిపిస్తే వెళ్లి అతన్ని అడుగు'' అని శునకుడు రాజుతో చెప్పాడు.

ఈ పద్యంలో ప్రబంధరచన కనిపించదు. కథను చకచకా చెప్పుకొని పోయే లక్షణం కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నది. అందుకని వాక్యం పద్యపాదానుగుణంగా విరగడం లేదు. సామాన్యంగా ఇది ప్రబంధాలలో కనిపించే సీసరచన కాదు. శ్రీనాథుని పద్ధతికంటె యిది భిన్నమైనది.

పద్యంలో వినిపించే పేర్లు అతి ప్రాచీన కాల వాఙ్మయంలోనివి. చెట్లు పట్టి, తిప్పలు పట్టి - ఇవి నానుళ్లు. చెట్లు చేమలు పట్టుకొని తిరుగుతున్నాడు అని లోకంలో నేటికీ వినపడుతున్నమాట. శునకుడు ఈ మాట నిలా అనడంలో అతని జాలి కనిపిస్తున్నది. అతను చెట్లు, గుట్టలు పట్టుకొనియున్న విషయమే 17వ పద్యంలో చెప్పబడ్డది. 'వేడు మది కర్జ మేని'- నేను చెప్పింది కర్తవ్యమని నీకనిపిస్తే అనేమాట ఒక మర్యాద పూర్వకమైన వాగ్విన్యాసాన్ని చెబుతున్నది. శునకుడు రాజుతో మాట్లాడు తున్నాడు కనుక ఆ మర్యాదను గౌరవాన్ని ప్రదర్శిస్తున్న వాక్యం.

చ. నరపతి పల్కె, మౌనివర ! నా రిపు నిష్కృతి వేడఁ బోయిన
నరహతుఁ జేసె నేని సవనంపు ఫలం బొడఁ గూడుఁ; గా కమ
త్సరగతి c జెప్పె నేని మఖతంత్ర మతంత్రము cగాక పూర్ణ మౌ;
నిరు దెఱఁగు న్మదీప్సితమె యేఁగెద' నంచు రథాధిరూఢుడై. 25

నరపతి = రాజు; పల్కెన్ = అన్నాడు. (పల్కె = వేదం వారి పాఠం. పల్కెన్ - వావిళ్ల వారి ప్రతి) మౌనివర= మునిశ్రేష్ఠుడా !; నా రిపున్ = నా శత్రువుని; నిష్కృతి = ప్రాయశ్చిత్తము; వేడబోయినన్ = అడగడానికి

పోతే; ధరన్ హతున్ చేసెన+ ఏని = నేలకూలిస్తే; సవనంపు ఫలంబు = యజ్ఞఫలం; ఒడఁగూడున్ = సిద్ధిస్తుంది; కాక = అలాగా కాకుండా; అమత్సర గతిన్ = ద్వేషం లేకుండా ప్రేమతో; చెప్పెన+ ఏనిన్ = చెబితే; మఖతంత్రము = యజ్ఞవిధి; అతంత్రము = విఫలము; కాక = కాకుండా; పూర్ణము+ ఔన్ = పూర్తి అవుతుంది; ఇరుదెఱఁగున్ = రెండు పద్ధతులు; మత్ = నాకు; ఈ ప్సితమే = ఇష్టమే; ఏగెదన్ = వెళతాను; అంచు = అంటూ; రథ+ అధిరూఢుడై= రథమెక్కిన వాడై.

తా॥ కేశిధ్వజుఁడన్నాడు. ' ఓయి మునిశ్రేష్ఠుడా ! ప్రాయశ్చిత్తాన్ని అడగడానికి పోతే అతడొక వేళ పూర్వ మాత్సర్యంతో నన్ను చంపాడే అనుకో. యజ్ఞఫలం సిద్ధించినట్లే; కాక మాత్సర్యాన్ని వదిలి పెట్టి మార్గం చెప్పాడనుకో. అప్పుడు నా యజ్ఞం పూర్తి అవుతుంది. ఈ రెండు పద్ధతులు నాకిష్టమే అని అంటూ రథ మెక్కి బయలుదేరాడు.

విశే॥ ఆనాటి రాజులు వారిస్వభావాలు ఈ కథలో చాలా అందంగా చిత్రింపబడటం గమనింపవచ్చు. ఇక్కడ కేశిధ్వజుడు ప్రాణాలను పణంగా పెట్టి ఖాండిక్యుని దగ్గరకు వెళుతున్నాడు. అతనికి యజ్ఞం పూర్తి కావాలన్న తపన ఉన్నది తప్ప ప్రాణభీతి లేదు. పైగా తనవల్ల అడవులు పట్టిన వానిదగ్గరకు తాను పోవడం ఇది లోకరీతికి విరుద్ధ మైనది. నాటి మానవుల్లో ఉన్న ఔదార్య లక్షణం. తనకంటే దైవం ప్రధానమైనది అన్న మత తాత్త్విక దృక్పథం బలీయ మన్నమాట. 'ఏగెదనంచు రథాధిరూఢుడై' = పోతాననటమూ రథమెక్కటమూ ఒకేసారిజరిగిందన్న మాట.

కం. హరిణాజినోత్త రీయుఁడు
నిరాయుధుఁడు నగుచు నతని నెల వగు నడవిన్
జొర, గొట్టికాంద్రు టెక్కముఁ
బరికించి, యెఱింగి, కలయఁబడి కూఁత లిడన్. 26

హరిణ+ అజిన = జింక తోలు; ఉత్తరీయుఁడు = పైవస్త్రంగా గలవాడు; నిరాయుధుఁడున్=చేతిలో ఆయుధం లేని వాడు; అగుచున్ ; అతని నెలవు = ఖాండిక్యుని యొక్క ఉనికి; అగు = అయిన; అడవిన్= అరణ్యమున; చొరన్ = ప్రవేశింపగనే; కొట్టికాంద్రు = వేగులవారు; టెక్కమున్ = రథంపైనున్న జెండాను; పరికించి = చూచి; ఎఱింగి = ఫలానా అని గుర్తించి; కలయబడి = ఒకే సారి గుంపుగా; కూతలు+ ఇడన్= కేకలు వేయగా;

తా॥ జింకతోలునే వస్త్రంగా ధరించినవాడు, చేతిలో ఆయుధం లేనివాడై కేశిధ్వజుడు ఖాండిక్యుడున్న అడవిలోకి ప్రవేశించగానే వేగులవారు జండా గుర్తును చూచి యితడు కేశిధ్వజుడని గుర్తించి ఒకేసారి గుంపుగా కేకలు పెట్టారు.

విశే॥ పద్యం నాల్గవపాదంలో అసంపూర్ణ క్రియలు కథావేగాన్ని ధ్వనిస్తున్నవి. ఇక్కడ కథకు ప్రాధాన్యము తక్కువ. విష్ణుచిత్తుడు చెప్పదలచుకొనేది వేరు. దానికి కథ శరీరం మాత్రమే. కాని కథ ఉండాలి. కనుక ఈ రెంటినీ సమన్వయంగా కథ చకచకా సాగిపోతుంది. ఇదొక విచిత్ర కథన పద్ధతి.

ఆ. వలస బెదర, నృపతి కలఁగక ప్రజ వగ
లార్పఁ బనిచి, కనుములందు నిలువ
వేఱు వేఱు యేర్చి, విలుమందిఁ బనిచి, తాఁ
దడుకు పెండె మలుక వొడమ వెడలి. 27

వలస = వలసవచ్చినవారు; బెదరన్ = భయపడగా; నృపతి = రాజు; కలగక = చెదరక; ప్రజవగలు = ప్రజల దుఃఖాన్ని; ఆర్పన్ పనిచి = తీర్చడానికి తగినవారిని పంపించి; కనుమలందున్ = కొండలసందుల్లో; నిలువన్ = శత్రువులను ఎదుర్కొనడానికై; వేఱువేఱు=వేరువేరుగా; విలుమందిన్ = విలుకాండ్రను; ఏర్చి = ఏర్పాటుచేసి; తాన్ = ఆ ఖాండిక్యుడు; అలుక పొడమన్ = కోపము పుట్టగా; తడుకుపెండెము= కంచె తలుపు; వెడలి = బయటకు వచ్చి.

తా॥ వలసవచ్చిన వారిలో స్త్రీలు శిశువులున్నారు గనుక వారు భయపడ్డారు. వారిభయాన్ని తగిన వారిని పంపి తీర్చి; కనుమలలో గొప్ప విలుకాండ్రను నిల్పి ఖాండిక్యుడు కోపంతో కంచెకు కట్టిన పెండెము తీసికొని బయటకు వచ్చి. (తడుకు - తడక. అడవిపుల్లలతో చేసినది).

కం. వచ్చు రిపుఁ జూపులనె చుఱు
పుచ్చుచు, సిరిఁ గొనుట మగుడఁ బొడముట రుష ము
చ్చిచ్చున లావెచ్చఁగ వి
ద్యుచ్చల చాపజ్య ( దూపు దొడుగుచు ( బలికెన్. 28

వచ్చు = వస్తున్న; రిపున్ = శత్రువును, చూపులన్ = చూపులతోనే; చుఱుపుచ్చుచున్ = దహిస్తూ; సిరిన్= తన రాజ్యలక్ష్మిని; కొనుటన్ = కొనుట (తీసుకోవడం); మగుడన్= తిరిగి; పొడముట = కన్పించడం; రుష = కోపము అన్న, ముచ్చిచ్చునన్ = ఈ మూడు అగ్నులతో; లావు+ ఎచ్చగన్ = బలం హెచ్చుకాగా; విద్యుత్ = మెరుపులాగా; చల = చలిస్తున్న; చాపమునన్ = ధనుస్సున; తూపు = బాణము; తొడుగుచున్ = సంధిస్తూ; పలికెన్ = అన్నాడు.

తా॥ వస్తున్న శత్రువును చూపుమంటలతోనే కాల్చివేస్తూ, తన రాజ్యాపహరణం చేయడం, తిరిగి యిలా కనిపించడం కోపమనే మూడగ్నులతో బలమెక్కువ కాగా మెరుపు తీగెలాగా కనిపిస్తున్న ధనుస్సున బాణం సంధిస్తూ ఇలా అన్నాడు.

లావెచ్చగా - వెచ్చనురిపాఠాంతరము

మ. ధన ధాన్యద్విర దాశ్వ గోగణ సమేతం బెల్ల సామ్రాజ్యమున్
గొనియుం జాలక తాటకేయ పలభు క్కూటా కృతిం జింకతో
లున నాచ్చున్నెఁడవై ప్రశాంతుగతి మాలోఁ జొచ్చి ప్రాణంబులున్
గొన నేతెంచెదె? దుర్మతీ, కెడపెద న్గూరంపు భల్లంబునన్. 29

దుర్మతీ = దుష్టబుద్ధీ; ధన =ధనము; ధాన్యము = సస్యము, ద్విరద = గజ; అశ్వ = గుర్రం; గో = ఆవులు, గణం = గుంపులతో; సమేతంబు = కూడిన; ఎల్ల సామ్రాజ్యమున్= రాజ్యమంతా, కొనియున్= హరించి కూడా, చాలక = తృప్తిలేక; తాటకేయ = తాటకి కొడుకైన మారీచుడు అన్న; పలభుక్ = మాంసం తినే రాక్షసునియొక్క; కూటాకృతిన్= కపటపురూపంతో; జింక తోలునన్ = జింక చర్మంలో; ఆచ్ఛన్నుడవు = కప్పబడవు; ఐ; ప్రశాంతుగతిన్ = కోరికలన్నీ శమించిన వారివలె; మాలోన్ = మాలోపల; చొచ్చి = ప్రవేశించి, ప్రాణంబులు = ప్రాణాలు కూడా; కొనన్ = హరించడానికి; ఏతెంచెదె = వస్తావా?; క్రూరంపు = వాడియైన; భల్లంబునన్ = బాణంతో, కెడపెదన్ = చంపుతాను.

తా॥ ఓరి దుష్టుడా ! ధనధాన్యములు గజాశ్వగోగణములతో కూడుకొన్న సమస్త సామ్రాజ్యాన్ని అపహరించింది చాలక మారీచుని లాగా జింకతోలు కప్పుకొని పెద్ద ముని వలె మాలో ప్రవేశించి మా ప్రాణాలు కూడా తీయడానికి వస్తావా! ఈ వాడియైన బాణంతోనిన్ను సంహరిస్తాను.

అలం : పదార్థ వృత్తినిదర్శన. విశే ॥ మారీచుడు జింకరూపంలో వచ్చి శ్రీరాముని మోసగించిన కథ స్మరింపబడుతున్నది. వీరు జనక వంశంలోని వారు. కనుక సీత తమందరకు ఆడపడుచు. ఆమె కథ చిలువలు పలువలుగా వాళ్ల యిళ్లల్లో చెప్పుకుంటారు. ఇందుకని ఖాండిక్యుని నోటివెంట దుర్మార్గుడైన మారీచుని విషయం అనుకోకుండా దొర్లిపడింది. వారివంశానికతడు నిత్యశత్రువన్నమాట. కేశిధ్వజుడు పాపం ప్రాయశ్చిత్తం కోసం వస్తే ఖాండిక్యుడింత మాటన్నాడు. అతని కెంత బాధ కలిగి ఉంటుంది ! అదే పెద్ద వృత్తాంతంగా వ్యక్తం చేయబడుతోంది.

మహాస్రగ్ధర. అనినం జేయెత్తి, ''యోహో ! యలుగక విను; కా ననాతతాయి; స్ప్రమాదం
బున వైకల్యంబు యాగంబునకుఁ బొడమ, నే భూసురశ్రేణి వేఁడన్,
నిను నావేదించి పంపెన్; 'నృప ! యతఁ డెఱుఁగు న్నిష్కృతి; న్వేఁడు పోపొ
మ్మని, కోప మ్మైన, రోప మ్మైన విడువు; మెట్లైన మే లింక'' నన్నన్. 30

అనినన్ = ఖాండిక్యుడావిధంగా అన్న తర్వాత; (కేశిధ్వజుడు) చే+ఎత్తి = చేతినెత్తి; ఆతతాయిన్ = నేను చంపడానికి వచ్చినవాడను; కాను; ఓహో !; అలుగకు = నాపై కోపించకు; విను = వినుము; ప్రమాదంబున= పొరపాటు వల్ల; యాగంబునకున్ = యజ్ఞమునకు; వైకల్యంబు = వికలత్వం; పొడమన్ = కలుగగా; నేన్ = నేను; భూసురశ్రేణిన్= ఋత్విజుల సమూహాన్ని; వేడన్ = ప్రార్థింపగా; నినున్ = నిన్ను; ఆవేదించి = తెలిపి, నృప = రాజా ! అతడు = ఖాండిక్యుడు; నిష్కృతిన్ = ప్రాయశ్చిత్తాన్ని; ఎఱుగున్ = తెలియును; వేడుః కోరుము; పోపొమ్ము అని = వెంటనే పొమ్మని; పంపెన్ = పంపించారు; కోపమ్ము; అయినన్ = అయినా సరే; రోపమ్ము = బాణం; అయినన్ = అయినా సరే; విడువుముః ప్రయోగించు; ఇంక = ఇక; ఎట్లు+ఐనన్ మేలు = ఎలాగైనా మంచిదే; అన్నన్ = అంటే.

తా॥ ఖాండిక్యుడావిధంగా అనేసరికి కేశిధ్వజుడు చేయెత్తి ''ఓహో ! నాపై కోపించకు. నేను ఆతతాయినై రాలేదు. ప్రమాదవశాత్తు నా యజ్ఞం మధ్యలో ఆగిపోయింది. దానికి ప్రాయశ్చిత్తమేమని ఋత్విక్కులను

అడిగితే వారు నీ పేరు చెప్పి నిన్ను వేడుకొమ్మని నన్ను పంపించారు. కనుక నా మీద నీవు కోపాన్ని ప్రయోగించినా సరే, బాణాన్ని ప్రయోగించినా సరే । ఏదైనా నాకు మేలే। అని అంటే.

విశే॥ *ఆతతాయి - ''అగ్నిదోగరదశ్చైవ శస్త్రోన్మత్తో ధనాపహః,*
*క్షేత్ర దారహర్తారౌషట్ ఏతే హి ఆతతాయినః ''* *(శుక్రనీతి)*

కొంపలకు నిప్పుపెట్టేవాడు; విషమిచ్చి చంపేవాడు; శస్త్రంతో సంహరించేవాడు; ధనాపహర్త; భార్యను అపహరించేవాడు; కుమారులను ఎత్తుకుపోయేవాడు - ఈ ఆరుగురు ఆతతాయిలు.

చేయెత్తుట = హెచ్చరిక చేయటానికి.

**అలం :** వికల్పం.

కోపమ్మైన, రోపమ్మైన విడువుము.

**వ. అనిన, నతండు తరుషండంబు సొచ్చి, మంత్రి పురోహిత ప్రభృతి సుహృజ్జనంబులకు 'దద్వృత్తాంతంబంతయుం జెప్ప, మంతనంబునకుం జొచ్చిన మంత్రు లిట్లనిరి. 31**

అనినన్ = అంటే; అతండు = ఖాండిక్యుడు; తరుషండంబు = చెట్లగుంపు; చొచ్చి = ప్రవేశించి; ప్రభృతి = మొదలైన; సుహృత్ + జనములకున్ = స్నేహితులకు; తత్ = కేశిధ్వజునకు సంబంధించిన; వృత్తాంతంబు = విషయము; అంతయున్ = సాంతము; చెప్పన్ = చెబితే; మంతనంబునకు = ఆలోచనకు; చొచ్చినన్ = పూనుకోగా; మంత్రు లిట్లనిరి = మంత్రు లిలా అన్నారు

## మంత్రాంగం

**కం. పాలు గల వాఁడు మన కొక**
**జాలి యిడక తానె తారసానకు వచ్చెన్;**
**వేళ యిదె; లెమ్ము, నృప ! కృప**
**చాలు, న్గారాకు మేపి చంపకు ప్రజలన్. 32**

పాలు కలవాడు = దాయాది; మనకున్; ఒక = కొంచెమైన; జాలియిడక = దుఃఖం కలిగించకుండా; తానె = తానే; తారసానకు = సంధికి; వచ్చెన్ = వచ్చినాడు. నృప = రాజా !; ఇదే; వేళ = సమయం; లెమ్ము; కృప చాలున్ = శత్రువుమీద దయచాలును; ప్రజలన్ = నీ ప్రజలను; కారాకు = కారపుటాకులు; మేపి; చంపకు.

ఇక్కడినుండి 47వ పద్యం దాకా మంత్రులు రాజునకు రాజనీతి ఉపదేశిస్తున్నారు. రెండు రకాల రాజు లుంటారు. 1. ఆధికారిక చక్రవ 2. ఆదర్శ చక్రవర్తి.

మొదటివానికి ఏమైనా సరే ఐశ్వర్యం, అధికారం చేజిక్కించుకోవడమే ప్రధానం. ఇక్కడ అలౌకిక ఆధ్యాత్మిక ధర్మం లేదు. రెండవవానికి దైవం, ధర్మం ప్రధానం తప్ప ఐశ్వర్యం కాదు.

భారతీయ రాజనీతిలో అధికారిక చక్రవర్తిత్వం ఆమోదింపబడలేదు. ధార్మిక ప్రభువే మనకు ఆదర్శ చక్రవర్తి. శ్రీరాముడు, ధర్మరాజు, అశోకుడు మొ॥ వారు. ఈ ధార్మిక ప్రభువుల కథలే షట్చక్రవర్తులు, షోడశ మహారాజుల కథలుగా భారతం కీర్తించింది. రాయలవారు కూడా మధురా చక్రవర్తి సర్వేదంలో రెండవ ఆశ్వాసంలో వారినే స్మరించారు. కనుక ఇక్కడ అధికారిక చక్రవర్తిత్వం బోధింపబడుతున్నది. భారతంలో ఆదిపర్వంలో కణికుడు దుర్యోధనునికి కూడా ఇలాంటి రాజనీతినే బోధిస్తాడు సభాపర్వంలో నారదుడు ధర్మరాజునకు బోధించిన రాజనీతి ఆదర్శచక్రవర్తికి సంబంధించినది కనుక భారతంలో దుర్యోధనుడు అధికారిక చక్రవర్తి కనుక ప్రతినాయకుడుగా చేయబడ్డాడు ధర్మరాజు అన్న శబ్దాన్ని తిరగేస్తే రాజ ధర్మం అవుతుంది. కనుక ఇతడే రాజైనట్లు భారతం చిత్రించింది ఈ సంప్రదాయమే రాయలవారు కూడా యామున రాజనీతిలోను, ఇక్కడ అనుసరిస్తున్నారు

ఉ. అంటలు గట్టి చెల్కలకు నాంద్రును బిడ్డలుఁ గూరఁగోయఁ బోఁ
గంటకముల్ పదాబ్జములుఁ గాడఁగదూసిన నొప్పిఁ గూయిడన్,
గంటికి నిద్ర గానకొదుగంగంబడి వేఁగెద మిందు; నొక్క మా
కంటయ కాదు; నీవు పడునట్టి యవస్థ వచింప శక్యమే ! 33

అంద్రును = భార్యలు, బిడ్డలు = పిల్లలు; అంటలు గట్టి = గుంపులుగా కూడుకొని; (అడవిలో జంతువులుంటాయి కనుక); చెల్కలకున్ = బీళ్లకు (చేలకున్ అని వావిళ్ల వారి పాఠము) కూరన్ = ఆకులు, కోయన్ బోన్ = కోయడానికి పోగా; పద+ అబ్జములన్ = తామరపువ్వులవంటి మెత్తని పాదాలలో; కంటకముల్ = ముళ్లు, గాఁడన్ = గుచ్చుకోగా; ఒనర్చిన = కలిగిన; నొప్పిన్ = బాధకు; కూయిడన్ = రొదచేస్తే; కంటికి నిద్రరాక యొదుగంబడి = నిద్రరాక ముడుచుకొని; వేగెదము = వేగుతున్నాము. ఇందున్ = ఈ బాధననుభవించటంలో; ఒక్క మాకు అంటయకాదు = ఒక్క మాకే యీ బాధలు కలుగుతున్నాయి అనడం కాదు; నీవున్ = నీవు కూడా; పడునట్టి = పడే; అవస్థ = బాధ; వచింపన్ = చెప్పడానికి; శక్యమే = శక్యమౌతుందా ?

తా॥ భార్యాబిడ్డలు కూరకోసుకొనిరావడానికి అడవిలోకి గుంపులు కట్టుకొని పోయినపుడు అసూర్యంపశ్యలైన వారి మెత్తని అడుగులకు ముళ్లు గుచ్చుకుంటే నిద్రలేక రోదిస్తున్న వారితో పాటు మాకు నిద్రరాక ముడుచుకొని పడుకుంటున్నాం. ఈ స్థితి ఒక్క మాకే కాదు. నీవు పడుతున్న అవస్థ కూడ వర్ణించడానికి తరం కానిదే.

పై పద్యంలో కారాకు అన్నమాటకిది వివరణ. ఇక్కడ స్త్రీ సంబంధంగా విషయాన్ని చెప్పడం వల్ల ఎలాంటి కఠినుడికైనా గుండె కరిగి పోతుంది. కనుక రాజులో ఆ జాలి కల్పించడానికి మంత్రులు తెలివిగా ఈ మాట అన్నారు.

పాఠాంతరాలు- (1)గాడనొనర్చిన (2) గానకొదుగం

తే. స్వా మ్యమాత్య సుహృ త్కోశ జనపద బల
దుర్గములు స్వామి గలిగినఁ దొలుతఁ గలవు;
అంగి సుఖియైన నంగంబు లటకు మునుపె
చాల సుఖు లౌట మనకు దృష్టంబు గాదె ? 34

స్వామి = రాజు; అమాత్య = మంత్రి; సుహృత్ = స్నేహితుడు; కోశ = ధనాగారం; జనపద = రాష్ట్రం; బల = చతురంగబలాలు; దుర్గములు = కోటలు; స్వామి = రాజు; కలిగినన్ = ఉంటే; తొలుతన్ = ముందుగానే; కలవు = ఈ షడంగాలు ఉన్నాయి. అంగి = అంగములు కలవాడు (జీవుడు), సుఖియైనన్ = సుఖాలు కలవాడైతే; అంగంబుల్=అవయవాలు; అటకున్ = అంతకు మునుపే; చాలన్ = మిక్కిలి; సుఖులు= సుఖము కలవి; ఔట = అగుట; మనకున్; దృష్టంబు కాదె = ప్రత్యక్షంగా కనిపించేదే కదా !

అలం : అర్థాంతరన్యాసం

విశే॥ రాజనీతిలో చెప్పబడే సప్తాంగాలు ఈ పద్యంలో చెప్పబడ్డాయి. దుర్గాలు మూడు రకాలు. జలదుర్గం = నది మధ్యలో కట్టబడేది; గిరిదుర్గం = కొండపై కట్టబడేది; మరుదుర్గం = ఎడారి ప్రదేశంలో కట్టబడేది ప్రాచీనకాలంలో ఈ దుర్గనిర్మాణం ప్రత్యేక వాస్తు కళ. దీనినిగూర్చి చరిత్రకారులు విజయనగర సామ్రాజ్యం మొదలైన వానికి కట్టబడ్డ దుర్గాలని గురించి కోటగోడల గురించి విశదంగా వ్రాశారు. ఈ అంగాంగి భావమేమతపరంగా శరీర-శారీరి సంబంధంగా చెప్పబడినది. చూ.శుక్రనీతి. 1-61.

కం. అతని పని దీర్చ రాజ్య
ద్వితయము నినుఁ జేరు, నెట్టి, వెరవున నైనన్
క్షితిపుల కరిజయము ధనో
న్నతియుఁ బ్రజా సదయరక్షణము ధర్మంబుల్. 35

అతని = అతనియొక్క; పనిదీర్చన్ = పనిపూర్తి చేస్తే (చంపితే); రాజ్య ద్వితయము=రెండురాజ్యాలు; నినున్ చేరున్ ; ఎట్టి = ఎలాంటి; వెఱవునన్ = ఉపాయంతో;ఐనన్ =అయినా; క్షితిపులకు = రాజులకు; అరిజయము = శత్రుజయం; ధన+ఉన్నతిన్ = అధిక ఐశ్వర్యము; ప్రజాసదయ రక్షణము = ప్రజలను దయతో రక్షించడం; ధర్మంబుల్ = రాజధర్మాలు.

తా॥ నీవు కేశిధ్వజుని కనుక సంహరిస్తే రెండు రాజ్యాలు నీకు లాభిస్తాయి. ఏ ఉపాయంతోనైనా శత్రు సంహారం చేసి అధికైశ్వర్యాన్ని పొంది ప్రజలను రక్షించడమే ధర్మం.

పాఠాంతరం - నీతి

కం. అన్యాయంబున దుస్సహ
మన్యుం డగు ప్రబలరిపుని మడియించిన ధ

ర్మన్యక్కృతి కగు నిష్కృతి
సన్యాయంబుగ c బ్రజాళి సంరక్షింపన్. 36

అన్యాయంబునన్ = అధర్మంగా; దుస్సహమన్యుండు = సహించడానికి వీలులేని కోపం (వైరం) కలవాడు; అగు = అయిన, ప్రబల రిపునిన్ = బలవంతుడైన శత్రుని; మడియించినన్= సంహరిస్తే; ధర్మన్యక్కృతికిన్ = ఈ ధర్మోల్లంఘనకు; ప్రజ+ ఆళిన్ = ప్రజాసమూహాన్ని; సన్యాయంబుగన్ = ధర్మవంతంగా; సంరక్షింపన్ = కాపాడుటయే; నిష్కృతి = ప్రాయశ్చిత్తము; అగున్ = అగును;

తా॥ కోపిష్ఠి, బలిష్ఠుడునైన శత్రువుని అన్యాయంగానైన సరే చంపి ఆ పాపనిష్కృతికి ప్రజలను సన్యాయంగా రక్షిస్తే సరి.

కం. తన రాష్ట్రము చెడ వచ్చిన;
ననిమిషపతి విప్రు డనక యాచార్యుc ద్రిశీ
ర్షుని cదునుమడె? విడువుము దయ;
నిను నమ్మిన ప్రజలు నవయ నీ దయ యేలా ? 37

అనిమిష పతి = దేవతల రాజు ఇంద్రుడు; తన రాష్ట్రము = తన సామ్రాజ్యము; చెడన్ వచ్చినన్ = నాశనం చేయడానికి వచ్చిన, విప్రుడు+ అనక = బ్రాహ్మణుడు అనకుండా; ఆచార్యున్ = గురువును; త్రిశీర్షునిన్ = విశ్వరూపుని; తునుమడె = సంహరించలేదా? దయ = కృప; విడువుము = వదిలి పెట్టుము; నినున్ = నిన్ను; నమ్మిన = విశ్వసించిన; ప్రజలు = నీవారు; అవయన్ = బాధపడగా; ఈ నీదయ; ఏలా = దేనికి ।

తా॥ తన సామ్రాజ్యాన్ని నాశనం చేయడానికి వచ్చిన గురువైన త్రిశీర్షుని బ్రాహ్మణుడని చూడకుండా ఇంద్రుడు సంహరించలేదా ! కనుక దయ వదలి పెట్టు. నీమీద నమ్మకముంచి అడవులకు గూడా నీవెంట వచ్చిన ప్రజలు అన్నము లేక కృశిస్తుంటే నీ కీ దయ దేనికి?

విశే ॥ ఇందులో ప్రస్తావితమైన దేవేంద్రవిషయం కౌషీతకీ బ్రాహ్మణంలో ఉంది. అనిమిషులు = నిమేషము= రెప్పపాటు లేని వారు దేవతలు.

కం. శిష్టు నిను నింతcజేసిన
దుష్టాత్ముని c బిలుకు మార్చి, దురితము పిదపన్
నష్టంబుగ, భూవల్లభ!
యిష్టాపూర్తములు సేసి యొసంcగcగ రాదే? 38

భూవల్లభ = రాజా !; శిష్టున్ = మహాత్ముడైన; నినున్ ; ఇంత cజేసిన = ఇంత బాధించిన; దుష్ట+ ఆత్మునిన్ = పాపాత్ముని; పిలుకు మార్చి = చంపి; పిదపన్ = తర్వాత; దురితము= పాపము; నష్టంబుగన్=

తీరిపోయేటట్లుగా; ఇష్టాపూర్తములు = క్రతువు చేయడం; చెరువులు త్రవ్వించడం మొ॥ వి; చేసి = నిర్మించి. ఎసఁగఁగ రాదే = ప్రఖ్యాతుడవు కావచ్చు గదా !

తే. ఇంక రెన్నాళ్లు సూచి, నీవంక ఁ దెగువ
గలుగ కుండిన ఁ బ్రజ లూళ్లు దలఁచి పోవ
మౌని వగుటయె యొండె, విహీన సంధి
నతని ఁగను టొండె గా కొండు మతము గలదె? 39

ఇంక రెన్నాళ్లు = ఇంకా రెండు రోజులు; చూచి = వేచి; నీవంకన్ = నీవల్ల; తెగువ = సాహసం; కలుగక+ ఉండినన్ = సంభవించక పోతే; ప్రజలు; ఊళ్లు తలఁచి = వారి వారిగ్రామాలు స్మృతికి దెచ్చుకుంటూ; పోవన్ = పోతే; మౌనివగుటయొ+ ఒండె = మునివి కావటమొక్కటే; విహీనసంధిన్ = సంధిలేకుండా; అతనిన్ = కేశిధ్వజుని; కనుట- ఒండె-కాక = చూడటం ఒకటితప్ప; ఒండుమతము = వేరొకమార్గం; కలదె = ఉన్నదా?

తా॥ ఇంకొక రెండు రోజులు చూచి నీనుండి ఏమి ప్రయత్నం కనిపించక పోతే నీ ప్రజలు తమ తమ ఊళ్లకు వెళ్లి పోవటం సత్యం. అపుడు నీవు ముక్కుమూసుకొని తపస్సు చేసుకోవడం కాని లేదా నీశత్రువు ఇంత భరణమిస్తే తిని పడివుండడం కాని తప్ప మరియొక మార్గం లేదు.

విశే॥ అలం : వికల్పాలంకారం.

ఇంక రెన్నాళ్లు = ఇదొక లోకోక్తి అంతే కాని సంఖ్యావాచకం కాదు.

కం. జనవర ! తపమునకుం జొ
చ్చిన ఁగన్నులు మూసికొంటె సెల; వింతియ కా
క నిదిధ్యాసకు బ్రహ్మం
బెనయునె? పరిభవపుశల్య మెదలో మెఱయున్. 40

జన వర = రాజా !; తపమునకున్ జొచ్చినన్ = తపస్సునకు పూనుకొంటే; కన్నులు = నేత్రాలు; మూసికొంటె = మూసుకొనుటే; సెలవు = ప్రయోజనం; పరిభవపు శల్యము= అవమానమన్న బాణపు ములికి; ఎదలోన్ = హృదయంలో; మెఱయన్ = సెలవేస్తుంటే; నిధిధ్యాసకున్ = ఏకాగ్ర ధ్యానమునకు; బ్రహ్మంబు = పరమాత్మ; ఎనయునె? = కలుగునా?

తా॥ ఓరాజా! నీవొక వేళ తపస్సునకే ప్రయత్నిస్తే కళ్లుమూసు కోవడం ఒక్కటే తప్ప ఏకాగ్రధ్యానానికి భగవంతుడు లక్ష్యంగా నిలువ గలడా? ఎందుకంటె హృదయంలో నిత్యమూ అవమాన శల్యము సెల వేస్తూనే ఉంటుంది కదా । ( నిధి ధ్యాస - ఇతడు కర్మిష్ఠి జ్ఞానయోగి కాడు. ఇదేతర్వాత 59-60 పద్యాల్లో వేడబోతున్నాడు.)

కం. అవమతిఁబితృఘ్ను లగు భూ
ధవుల వెదకి పిల్లపిల్లతరము దునిమి భా
ర్గవుడు ముని యయ్యె; మఱి వై
భవము వలదు శాంతి కైనఁ బగ దెగ కగునే ? 41

భార్గవుడు = భృగువంశీయుడైన పరశురాముడు; అవమతిన్ = అవమానంతో; పితృఘ్నులుఃతండ్రిని చంపిన వారు; అగు = అయిన, భూధవులన్ = రాజులను; వెదకిః వెతికి మరీ పట్టుకొని; పిల్లపిల్లతరము = పిల్లలకు పిల్లలైన వారిని సైతము; తునిమి = చంపి; ముని-అయ్యెన్ = తర్వాత తపస్సునకు వెళ్ళాడు; మరి = ఇంకా ఆలోచిస్తే; వైభవము వలదు = ఐశ్వర్యము వద్దనుకో; శాంతికి+ ఐనన్ = మనశ్శాంతికైనా; పగ తెగక = పగ తీర్చుకొనక; అగునే = సంభవించునా? కలుగునా.

తా॥ పరశురాముడు తన తండ్రిని చంపిన రాజునే కాక ఇతర క్షత్రియ వంశాలను పిల్లలు, పిల్లలకు పిల్లలైన వారిని మూడు తరాలదాకా వెదికివెదికి మరీ చంపాడు. ఆ తర్వాత కదా తపోవృద్ధికి వెళ్లింది. కాబట్టి ఐశ్వర్యం వద్దనుకున్నా మనశ్శాంతి కొరకైనా పగ తీర్చుకోక తప్పదు.

అలం :- అర్థాంతరన్యాసం.

పద్యంలో ప్రయోగింపబడ్డ లోకోక్తులు, నానుళ్లు గుర్తించాలి. పిల్ల పిల్ల తరము; అలాగే వాక్య విన్యాసంతో తెలుగుదనాన్ని భావించాలి. ఇఁక, మఱి వంటి మాటలు వాటి వాచ్యార్థమేమీ ఉండదు. లోక వ్యవహారంలో వాటి ప్రయోగంలో వాక్యానికి ఒక తెలుగుదనం కలుగుతుంది. ప్రతి పద్యంలోనూ ఈ తెలుగు వాక్యనిర్మాణాన్ని భావించాలి.

తే. పగయు వగయును లేక యేపాటి గన్న
నలరు సామాన్య సంసారి యగుట మేలు;
మఱి తగిలెనేని శాంతిచే మఱవఁ దగదు
రాజ్యభూమికఁ దాల్చిన రాజునకును. 42

పగయున్ = వైరమును; వగయున్ = దుఃఖమును; లేక = పాటింపక; ఏపాటి కన్నన్ = ఏమాత్రం దొరికిన; అలరు = సంతోషించే; సామాన్య సంసారి = మామూలు గృహస్థు; అగుట మేలు = కావడం మంచిది; రాజ్యభూమికన్ = రాజసంబంధమైన వేషము; తాల్చిన = ధరించిన; రాజునకును = రాజునకైతే; తగిలెనేని = పగవగ కలిగితే; మరి = ఇక; శాంతిచేన్ = శాంతమైన మనస్సుతో; మఱవన్ తగదు = మరచి పోవడం మంచిది కాదు.

తా॥ పగ, వగ సంభవించినపుడు వాటిని మరిచిపోయి దొరికిన దానికే సంతృప్తిపడే సామాన్యసంసారి కావడం మంచిది. మరి రాజు వేషం కట్టిన వారికి అలా కుదరదే! ఆ పగను వగను శాంతితో మరచిపోవడం కుదరదు. శత్రుసంహారం చేసి తీరవలసిందే.

మఱి = మదివావిళ్ళపాఠం

అలం :- అప్రస్తుత ప్రశంస.

కం. పులి మల డిగి యూళ్లకు న
క్షులరుజ రా జనము మాన్పుకోఁ బనిచి, గవిన్
నెలకొన సురియలు గొని చని
పొలియునొ? యూర గుయిరేఁగి పొడుచునొ? చెపుమా ! 43

పులి = వ్యాఘ్రము; అక్షుల రుజన్ = కంటివ్యాధితో; మలన్ = కొండనుండి; డిగి = దిగి; ఊళ్లకు రాన్ = ఊళ్లలోకి వస్తే; జనము = గ్రామస్థులు; మాన్పుకోన్ = ఆకన్నుల కలకను నివారించుకోమని; పనిచి = ఆపులిని తిరిగి కొండకు పంపి; గవిన్ = గుహలో; నెలకొనన్ = ఉండగా; సురియలు = చురకత్తులు; కొని = గ్రహించి; చని = ఆగుహకు వెళ్లి; పొలియునొ = చస్తారా ?; ఊరన్ = ఊళ్లో; కుయిరేగి = కేకలు వేస్తూ; పొడుచునొ= చంపుతారా ! ; చెపుమా = నీవే చెప్పు.

తా॥ పులికి కంటి జబ్బు వచ్చి దారి తెలియక కొండ దిగి ఊళ్లోకి ప్రవేశించినపుడు ప్రజలు అయ్యో! పాపం! అని చెప్పి దానిని 'రోగం పోగొట్టు కోమ్మా!' అని కొండ చేర్చి ఆ తర్వాత ఆ రోగం పోయిన తర్వాత గుహలో ఉన్నపుడు కత్తులు, ఈటెలు తీసికొనిపోయి చంపుతారా! లేక ఊళ్లోకి వచ్చినపుడే చంపుతారా! నీవే చెప్పు.

అలం :- అప్రస్తుత ప్రశంస.

రాయలవారికి జంతుస్వభావం తెలుసని ఇదివరకే చెప్పబడింది. పులి యీనినపుడు దాని కన్నులకు కలక వస్తుందట అప్పుడది ఊళ్లలోకి వస్తుంది. ఈ జంతు స్వభావమాధారంగా శత్రువు నీయింటికి వచ్చినపుడు చంపకుండా అతనిని అతని రాజ్యానికి పంపించాక చంపుతావా? ఇది ప్రస్తుతార్థం. దీనికోసం అప్రస్తుతమైన పులి వృత్తాంతం ఉపమానంగా తీసుకొని రాబడ్డది వాక్యనిర్మాణంలో కాని, పద్యరచన కాని అంతా తెలుగుదనమే. చెపుమా ! అని పద్యాన్ని ముగించడంలో మంత్రులు రాజు తెలివి తక్కువదనాన్ని తెగవేసి చెప్పినట్లయింది.

కం. ఈ వేళ బలియు నతనిం
బో విడిచితి పొమ్మ్మ పాడిఁ; బోయిన రాజ్యం
బేవిధిఁ గ్రమ్మఱు? నా వెర
పీవెర వని వ్రేలు మడిచి యేర్పడఁ జెపుమా ! 44

ఈ వేళన్ = ఈ సమయంలో; బలీయున్ = బలవంతుడైన; అతనిన్ = శత్రుని; ( ఆ కేశిధ్వజుని); పో విడిచితి పొమ్మ = పోయేటట్లుగా విడిచిపెట్టావు పో; పాడిన్ = న్యాయంతో; పోయిన రాజ్యంబు =

నీనుండివాడు గెలుచుకున్నరాజ్యం; ఏ విధిన్ = ఏ విధంగా; క్రమ్మఱున్ = తిరిగి వస్తుంది?; ఆ వెరపు = ఆ ఉపాయం; ఈ వెరపు = ఈ ఉపాయం; అని; వ్రేలు మడచి = వ్రేళ్లవంచి, ఏర్పడన్ = స్పష్టమయ్యేటట్లుగా; చెపుమా!

తా॥ బలవంతుడైన శత్రువుని ఇంటికి అతిథిగా వచ్చినపుడు చంపటం న్యాయం కాదని విడిచిపెట్టావు పో! అతడు తిరిగి వెళ్లినాక పోయిన రాజ్యం నీకెలా దక్కుతుంది? ఈ ఉపాయం, ఆ ఉపాయం అని వ్రేలు మడచి ఒక్కొదాన్ని చెప్పు.

విశే ॥ వ్రేలుమడచి - లోకోక్తి.

పో విడిచితి పొమ్ము; పోయిన రాజ్యంచే విధి క్రమ్మఱు, ఆ వెరవు - ఈవెరవు - చెపుమా! నేటికి వ్యవహారంలో ఈ వాక్యాలు ఇలాగే ప్రయోగింపబడుతున్నాయి.

తే. అలసతఁ బరున్న మనుజుండు కలియుగంబు;
దాపరం బెన్నఁ గూర్చున్న వాఁడు; త్రేత
యుత్థితుఁడు; యాయి మఱి కృతయుగ ; మ టన్న
నముచిదమనోక్తి ఋగ్బ్రాహ్మణమున వినమె? 45

అలసతన్ = సోమరితనంతో; పరున్న = పండుకొన్న; మనుజుండు = మనిషి; కలియు గంబు = కలియుగము; ఎన్నన్ = ఆలోచిస్తే; కూర్చున్నవాడు; ద్వాపరంబు = ద్వాపరయుగము; ఉత్థితుడు = లేచినవాడు; త్రేత = త్రేతాయుగం; మఱి = ఇక; యాయిః నడుస్తున్నవాడు; కృతయుగము; అటన్న = అంటూ చెప్పిన; నముచి దమన+ ఉక్తి = నముచి అన్న రాక్షసుని చంపిన ఇంద్రునిమాట; ఋక్బ్రాహ్మణమునన్ = ఋగ్వేదానికి సంబంధించిన బ్రాహ్మణ భాగంలో; వినమె = విన్నాము కదా !

తా॥ పనీ, పాటా లేకుండా సోమరిగా పడుకొన్న మనిషి కలియుగం; కూర్చున్నవాడు ద్వాపరయుగం. లేచి నిలబడ్డవాడు త్రేతాయుగం. నడుస్తున్నవాడు కృతయుగం అని ఋగ్బ్రాహ్మణంలో ఇంద్రుడు అన్నమాట మనకు తెలుసు కదా!

విశే॥ వేదములు, బ్రాహ్మణములు, ఆరణ్యకములు, ఉపనిషత్తులు అని నాలుగు విభాగాలుగా ఉన్నాయి. ఒక్కొక్క వేదానికి కొన్ని బ్రాహ్మణములు, ఉపనిషత్తులు అనుసంధింపబడి యుంటాయి. రాయలవారికి యీవేద వాఙ్మయమంతా కరతలా మలకంగా ఉంది. కనుక ఎక్కడో ఋగ్బ్రాహ్మణంలోని విషయాన్ని ఇక్కడ అనుసంధిస్తున్నాడు ఖాండిక్యునికి ఈ మాటలు చెప్పడంలో తాత్పర్యమేమంటే నీవు శత్రుసంహారానికై ఉద్యమించు అని ప్రబోధం.

యుగాలను మానవ స్వభావాని కనుసంధించి చెప్పటం ఒక అద్భుత ప్రతీక. ఆధునిక నాగరికతలో కష్టపడి శ్రమించి తినాలి అన్న దృష్టి మనిషికి పోయి సుఖలాలసత పెరిగిందని స్పష్టమే. ఇదే అలసత్వమంటే.

కం. ఛిద్ర ప్రహారి, రాష్ట్రో
పద్రవ పరిహారి; యాప్తభాషణ రుచి, వే
ళోద్రిక్తుండన్యవేళా
నుద్రిక్తుఁ డనల్పకాలమూర్వి భుజించున్. 46

ఛిద్రప్రహారి = రంధ్రమును అన్వేషించి దెబ్బకొట్టేవాడు; రాష్ట్ర+ ఉపద్రవ = దేశమునకు సంబంధించిన ఆపదలను; పరిహారి = తొలగించేవాడు; ఆప్త = ఆప్తులైన వారియొక్క; భాషణ = మాటలపై; రుచి = అభిరుచికలవాడు; వేళా = అనుకూలమైన కాలంలో; ఉద్రిక్తుడు = విజృంభించేవాడు; అన్యవేళా = కాని కాలంలో; న+ ఉద్రిక్తుడు = విజృంభించనివాడు; అనల్పకాలము = శాశ్వతకాలము; ఉర్వీన్ = భూమిని; భుజించున్= ( భరించున్ = పాలిళ్ళ) అనుభవిస్తాడు.

తా॥ శత్రువుయొక్క బలహీనతను చూచి తద్వారా వానిని చంపేవాడు రాష్ట్రానికి సంబంధించిన ఉపద్రవాలు తొలగించేవాడు, ఆప్తులైన వారి మాటలను వినడానికి ఇష్టపడేవాడు, అనుకూలమైనకాలంలో శత్రువుపైకి దండయాత్ర చేసేవాడు, కాని కాలంలో అలా చేయనివాడు శాశ్వతకాలం భూమిని పాలిస్తాడు

విశే॥ ఈ పద్యంలో రాజున కుండదగ్గ లక్షణాలు ఐదు చెప్పబడ్డాయి. ఛిద్రము, రాజనీతికి సంబంధించిన మాట. దీని విషయం 4వ ఆశ్వాసంలో రాజనీతిలో వస్తుంది. ఆప్తుడు- ఈ మాట కూడా రాజనీతికి సంబంధించినదే. రాజునకు హితులు, అహితులు, హితాహితులు అని మూడురకాల జను లుంటారట చూడు యామున రాజనీతి.

వ. లే లెమ్మనుటయుఁబ్రధానులకు భూనాథుం డిట్లనియె. 47

లే లెమ్మ = లెమ్మ లెమ్మ; అనడంలో వేగం ఉన్నది. లే లేవయ్యా! ఇకచాలు అన్నట్లుగా భావించాలి; అనుటయున్ = అంటే; ప్రధానులకున్ = మంత్రులతో; భూనాథుండు = రాజు; ఇట్లనియె = ఇలా అన్నాడు.

విశే ॥ లే లెమ్మ - అన్నమాట ఇప్పటికే చాలా ఆలస్యమైంది. త్వరగా ఉద్యమించు అన్న తీవ్రతను వ్యక్తం చేసే తెలుగుమాట.

కం. మీ నొడివినయది కార్యం
బౌ; నిప్పని సేయ రాజ్యమంతయు మనకున్,
వానికిఁ బరలోకము జిత
మౌ నొక్కట; నిందు వాసు లరయఁగ వలయున్. 48

మీ = మీయొక్క; నొడివినయది = చెప్పినమాట; కార్యంబు+ ఔన్ = తప్పక చేయదగినదగును; ఇప్పనిన్= మీరు చెప్పిన ఈ పనిని; చేయన్ = పూర్తి చేస్తే; ఒక్కటన్= ఒకేసారి; మనకు = మనకే మో,

రాజ్యము+ అంతయున్ = రాజ్యమంతా; జితమౌను = జయింప బడినదవుతుంది; వానికిన్ = వానికేమో; పరలోకము = శాశ్వతమైన పైలోకము; (జితము+ ఔన్) ఇందున్ = ఈ రెంటిలో; వాసి+ లు = తేడాలు; అరయఁగన్ - వలయున్ = విచారింపవలసియున్నది.

తా॥ మీరు చెప్పినది కర్తవ్యమే కాదనను. అది చేస్తే మనకు రాజ్యం లభిస్తుంది. వానికేమో శాశ్వతమైన పరలోక సుఖం లభిస్తుంది. ఈ రెంటి తారతమ్య పరీక్ష చేయాలి కదా!

విశే॥ పైన మంత్రులు చెప్పిన విషయమంతా లౌకిక రాజనీతికి సంబంధించినది. ఖాండిక్యుడు చెపుతున్నది అలౌకికవిషయం. అందుకే తారతమ్య పరీక్ష చేసుకోవాలి. అన్నాడు.

కం. పరలోక సుఖము శాశ్వత
మరయ, మహీరాజ్య సౌఖ్య మల్పా నేహః
పరిభోగ్యం; బిందులకై
దురితము కావించి తొలఁగుదునె పరమునకున్. 49

అరయన్ = వివేకంతో విచారిస్తే; పరలోక సుఖము = పరలోక సంబంధమైన సుఖము; శాశ్వతము = శాశ్వత కాలపర్యంతం ఉండేది; మహీరాజ్య సౌఖ్యము = భూసంబంధమైన రాజసౌఖ్యం; అల్ప = కొంచెమైనా; అనేహః = కాలమునకు మాత్రమే; పరిభోగ్యంబు = అనుభవింపదగింది; ఇందులకై = ఈ అల్పకాల రాజ్యసౌఖ్యం కోసమై; దురితము = పాపము; కావించి = చేసి; పరమునకున్ = శాశ్వతమైన పరలోక సౌఖ్యానికి; తొలఁగుదునె= దూరం కాగలనా?

తా॥ మీరు చెప్పిన రాజ్యసౌఖ్యం ఎంతకాల ముంటుంది? మనచేతిలో చచ్చిన వాడేమో శాశ్వత కాల సౌఖ్యాన్ని పొందుతున్నాడు. ఈ అల్పకాల సుఖంకోసం పాపం చేసి ఆ శాశ్వతకాల సుఖానికి దూరం కావడమెలాగా ?

విశే॥ మనకు స్వాతంత్ర్యం సిద్ధింపజేసిన మహామహులైన నాటి రాజకీయ నాయకులంతా ఈ ఆధ్యాత్మిక దృక్పథం కలవారే. తర్వాత్తర్వాత ఈ ధార్మిక దృష్టి లోపించి పాశ్చాత్య కలుషిత ఆధికారిక రాజకీయ దృష్టి ప్రబలిపోయింది. దానివల్లనే ఈ నాడు మనము హింసాక్రౌర్యాలకు బలైపోతున్నాం. దీనకి విరుద్ధమైన రాజనీతి ఇక్కడ ఖాండిక్యుని ద్వారా రాయలు ప్రసంగిస్తున్నాడు. ఇదే భారతీయుడు భావించిన ఆదర్శ చక్రవర్తి స్వరూపం.

కం. 'బద్ధాంజలిపుటు దీనున్
గ్రుద్ధుండై శరణు చొరఁగఁ గూల్చుట కడుఁ గీ
డుద్ధతి పరలోకార్జన
బుద్ధికి', నను కణ్వవాక్యములు దలఁప రొకో? 50

బద్ధ- అంజలి పుటున్ = చేతులు కట్టుకున్నవానిని; దీనున్ = దీనుడైన వానిని; శరణు చొరఁగన్ = శరణని వచ్చినపుడు; క్రుద్ధుండై = కోపించినవాడై; ఉద్ధతిన్ = అహంకారంతో; కూల్చుట = చంపడం;

పరలోక - ఆర్జన బుద్ధికిన్ = ముక్తిలోకాన్ని సంపాదించాలన్న కోర్కె గలవానికి; కడున్ = మిక్కిలి, కీడు= ఆపద; అను = అనెడు; కణ్వవాక్యములు= కణ్వునిమాటలు; తలపరు+ ఒకో = తలచరా ఏమి?

తా॥ దోసిలియొగ్గి దైన్యంగా శరణని వచ్చిన వాని పట్టుకొని కోపంతో అహంకరించి చంపడం పరలోక బుద్ధియైన వానికి తగదని కణ్వమహర్షి చెప్పిన మాటలు ఆలోచించి చూడండి.

విశే॥ మంత్రులు పరశురాముని కథ, ఇంద్రుని కథ చెప్పి తమ రాజనీతిని సమర్ధించుకున్నారు కాని రాజు ఈ కణ్వవాక్యాల ద్వారా వారి మాటలను తిరస్కరిస్తున్నాడు. ఈ కథలో ఈ వేదకాలంనాటి వాతావరణం చాలా విచిత్రంగా నైపథ్యంగా సంఘటించబడటం కథకొక ఐతిహాసిక లక్ష్యాన్ని తెచ్చి పెట్టింది

ఆ.వె.అనుచు వెడలి వచ్చి, యారాజునడిగి, త;
ద్ధర్మ నైచికీ వధక్రమంబు;
దెలిసి, తగిన నిష్కృతి వచింప; నాతండు;
మగుడఁ గ్రతువు సాంగముగ నొనర్చి. 51

అనుచున్ = అంటూ; వెడలి = వెలువడి; వచ్చి = బయటకు వచ్చి; ఆ రాజున్ = కేశిధ్వజుని; అడిగి = ప్రశ్నించి; తత్ = ఆ; ఘర్మ = యజ్ఞసంబంధమైన; నైచికీ = ఆవుయొక్క; వధ = వధయొక్క; క్రమంబు = ప్రకారము; తెలిసి = ఎరిగి; తగిన = ఉచితమైన; నిష్కృతి = ప్రాయశ్చిత్తము; వచింపన్ = చెప్పగా; ఆతండు = ఆ కేశిధ్వజుడు; మగుడన్ = తిరిగి; క్రతువున్ = యజ్ఞమును; స+ అంగముగన్ = సంపూర్ణంగా; ఒనర్చి = చేసి.

ఆ.వె. అవభృథాప్లుతోత్తమాంగుఁడై, ఋత్విక్స
దస్య గణముఁ బూజఁ దనిపి, పిదప
సూత మగధ వంది వైతాళిక ప్రభృ
త్యర్థికోటి కభిమతార్థ మొసఁగి. 52

అవభృథ = యజ్ఞం ముగిసాక చేసే స్నానంచేత; ఆప్లుత = చక్కగా తడిసిన; ఉత్తమ+ అంగుడై= శిరస్సుకలవాడై; ఋత్విక్ = యజ్ఞం చేయించే బ్రాహ్మణులను; సదస్య= సభ్యులయొక్క; గణమున్ = సమూహాన్ని, పూజన్ = సత్కారాలతో; తనిపి = తృప్తి పొందించి; పిదపన్ = తర్వాత; సూత; వంది; మగధ; వైతాళిక ప్రభృతి = రాజుయొక్క యశస్సును గానం చేసేవారు, మేలుకొలుపు పాడేవారు మొదలైన; అర్థికోటికిన్ = యాచక సమూహానికి; అభిమతార్థము = ఇష్టమైన ద్రవ్యాలను; ఒసగి = ఇచ్చి, (సూతులు = పౌరాణికులు; మాగధులు = వంశాన్ని కీర్తించేవారు; వంది = స్తోత్రపాఠకుడు; వైతాళికుడు= రాజునకు మేలుకొలుపు పాడేవాడు.)

తే. మఱియుఁ గోరినవారి యక్కఱలు తీర్చి
యును మనఃపూర్తి చాల కొయ్యనఁ దలంచి

'యకట ! గురుదక్షిణ యొసంగ నయితి' నంచు
మగుడఁ జని, శంక నతఁడు సంభ్రమపడంగ. 53

మఱియున్ = ఇంకా; కోరినవారి = అర్థించినవారియొక్క; అక్కఱలు = కోర్కెలు; తీర్చియును = తీర్చికూడా; మనఃపూర్తి = మనస్సంతుష్టి; చాలక = తీరక; ఒయ్యనన్ = క్రమంగా; తలంచి = ఆలోచించి; అకట = అయ్యో ! గురుదక్షిణ = గురువుగారికి దక్షిణ; ఒసంగన్ అయితి = ఇవ్వనైతిని; అంచున్; మగుడన్ = తిరిగి; చని = అడవికి వెళ్లి; అతడు = ఖాండిక్యుడు; శంకన్ = సందేహంతో; సంభ్రమపడంగన్ = తొట్రుపాటు చెందగా.

తా॥ ఈవిధంగా కోరినవారికెల్లా కోర్కెలు తీర్చిన అతని మనస్సు సంతుష్టి పడలేదు. ఏదో వెలితి అతనిని బాధిస్తున్నది. ఇదేమిటా ! యని అతడు తన మనస్సులోకి వెళ్లి చూచుకొన్నాడు. అతనికి ఆ కారణం తెలిసింది. అయ్యో ! గురువుగారికి దక్షిణ సమర్పించలేక పోతిని కదా ! అని అడవిలోనున్న ఖాండిక్యుని దగ్గరకు వెళ్లాడు. అది చూచిన ఖాండిక్యునకు సందేహంతోపాటు తొట్రుపాటు కలిగింది. ఇదేమిటబ్బా! మళ్లీ వచ్చాడని.

కం. వారించి, 'నీకు నెయ్యది
కోరిక ? యేతెంచినాఁడ గురుదక్షిణ యీ,
భూరమణ ! వేఁడు !' మనుటయు,
నారాజన్యుండు మఱియు నాప్తులతోడన్. 54

వారించి = నివారించి; భూరమణ ! = రాజా ! గురుదక్షిణయీన్ = గురుదక్షిణ ఇవ్వడానికి; ఏతెంచినాడన్ = వచ్చినాను; నీకున్; కోరిక = అభిలాష; ఎయ్యది = ఏదో; వేడుము = కోరుకో; అనుటయున్ = అన్నాక; ఆరాజన్యుండు = ఆ ఖాండిక్యుడు; మరియున్ = ఆ తర్వాత; ఆప్తులతోడన్ = మంత్రి జనులతో;

తా ॥ కేశిధ్వజుని చూచి ఖాండిక్యుడు తొట్రుపడితే దానిని వారించి కేశిధ్వజుడు అన్నాడు. రాజా ! గురుదక్షిణ యివ్వడానికి వచ్చాను. నీ కోరికేమో చెప్పు అని విన్న ఖాండిక్యుడు మరలా మంత్రులతో సమావేశమైనాడు.

విశేష హితులైనవారాప్తులు. కనుక అడవికి వచ్చారు.

కం. 'గురుదక్షిణ యిచ్చుట కీ
నరవరుఁ డేతెంచె; మీరు నా కనురక్తుల్;
పరికించి పదింబదిగా
నరయుఁడు మది నెద్ది మేలు ప్రార్థించుటకున్'. 55

ఈ నరవరుడు = ఈ రాజు; గురుదక్షిణ ఇచ్చుటకున్ = గురుదక్షిణ ఇవ్వడానికి; ఏతెంచెన్= వచ్చినాడు; నాకున్, మీరు, అనురక్తులు = హితులు; పదింబదిగా = ఆమూలాగ్రము చక్కగా; పరికించి = ముందు

వెనుకలు చూచి; మదిన్ = మనస్సులో; అరయుడు = విచారించండి; ప్రార్థించుటకున్ = అర్థించడానికి; ఎద్ది = ఏది; మేలు = మంచిది.

తా॥ ఈ కేశిధ్వజుడు నాకు గురుదక్షిణ ఇవ్వడానికి వచ్చాడు. మీరు నాయందు స్నేహభావం కలవారు కనుక తీక్ష్ణంగా ముందు వెనుకలు ఆలోచించి దేన్ని కోరుకోమంటారో చెప్పండి అన్నాడు.

ఉ. నావుడు, వార లమ్మనుజ నాథున కిట్లని రుబ్బి; 'నేఁడుగా
దైవము గల్గె ? వేగ గురుదక్షిణగాఁ జతురర్ణవీవృతో
ర్వీవలయం బశేషమును వే డుము, భూవర !; మమ్ము నందఱన్
బ్రోవుము; బాంధవాప్తజన పోషణ కంటెను బుణ్య మున్నదే ? 56

నావుడు = ఆ రాజు అలా అన్న తర్వాత; వారలు = మంత్రులు; అమ్మనుజ నాథునకున్= ఆ నరనాథునకు; ఉబ్బి = సంతోషించి; ఇట్లనిరి = ఇలా అన్నారు; నేడుగా = ఇవ్వాళ కదా ! దైవము = భగవంతుడు (అదృష్టము); కల్గెన్ = ఉన్నదని తెలిసింది (లభించింది); వేగన్ = త్వరగా; చతురర్ణవీ = నాలుగు సముద్రాలతో; వృత = ఆవరింపబడిన; ఉర్వీవలయంబు = భూమండలము; అశేషమును = మొత్తము; భూవర = రాజా !; గురుదక్షిణగాన్ = గురువునకు అర్పించే దక్షిణగా; వేడుము = కోరుకో; మమ్ము నందరన్= మమ్ములనందరిని; ప్రోవుము = రక్షింపుము; బాంధవ = చుట్టాలు; ఆప్తజన = మిత్రులయొక్క; పోషణకంటెన = పోషించడం కంటె; పుణ్యము; ఉన్నదే = కలదా !

తా॥ ఖాండిక్యు డీ విధంగా చెప్పగానే ఆప్తులు చాలా సంతోషించి ఆయనతో ఇలా అన్నారు. దైవమున్నాడనడానికి సాక్ష్యమివాళ కదా తెలిసింది. (నేడు కదా అదృష్టం ఫలించింది.) కాబట్టి రాజా ! నాలుగు సముద్రాలు చుట్టిన ఈ సమస్త మండలాన్ని గురుదక్షిణగా గ్రహించి మమ్మల్నందరినీ రక్షించు. ఆప్తులను కాపాడటంకంటే పుణ్య మేమీ లేదు.

'పోషణ కన్నను ధర్మమున్నదే ' అని వేదం వారి పాఠం.

దైవమంటే అదృష్టమని నిఘంటువులు చెప్పినా దేవుడనే అర్థంలోనే వ్యాప్తిలో ఉన్నది. కనుక రెండర్థాలు చెప్పుకోవాలి.

అలం : కావ్యలింగం. ఆప్తజన పోషణ కంటె ధర్మమున్నదే అన్న వాక్యంలో పుణ్యలబ్ధికి ప్రోచుట కారణంగా చెప్పబడింది కనుక.

ఉ. ఎన్నఁడు లావు గూడు మన ! కెన్నఁడగు న్నటి ? యయ్యె నేని పో
రెన్నిక యౌనె ? పోరిన జయింపనె చెప్పిరె ? నీదు భాగ్య సం
పన్నతఁ జేరెఁ గార్య మిటు; బంధు సుహృత్తతి కొక్క కీడు రా
కున్నటు లుండఁగానె సిరు లూరక చావక నోవ కబ్బునే ? 57

ఎన్నడు = ఎప్పుడు, లావు = బలము; మనకున్ = మనకు; కూడు = కలుగుతుంది; తఱి = సమయము; ఎన్నడు + అగున్ = ఎప్పుడు వస్తుంది; అయ్యెన్- ఏనిన్ = కలిగితే; పోరు = యుద్ధము; ఎన్నిక యౌనె = ఎంచుకోవచ్చునా ?; పోరినన్ = కలహిస్తే; జయింపనె చెప్పిరె = జయం కలుగుతుందనే చెప్పారా ! (ఎవరైనా); నీదు = నీయొక్క; భాగ్య = అదృష్టంయొక్క; సంపన్నతన్ = సమృద్ధిచేత; ఇటు = ఈ విధంగా (అనాయాసంగా); కార్యము = ఫలము, చేరెన్ = సమీపించెను; బంధు = బాంధవులు; సుహృత్ = స్నేహితులయొక్క; తతికి = సమూహమునకు; ఒక్క కీడైన = ఒక్క ఆపద అయినా; రాక = రాకుండానే; ఉన్నటులుండగానె = కదలక కూర్చొని ఉండగానె; (భాగ్య సంపన్నత చేకూరింది అన్వయం), సిరులు= భాగ్యము; ఊరక = అనాయాసంగా; చావక = మరణించక; నోవక = బాధపడక; అబ్బునె = కలుగుతుందా?

తా॥ మనకు బలసంపన్నత ఎప్పుడు చేకూరుతుంది ? ఎప్పుడు అనుకూల కాలం వస్తుంది. వస్తే యుద్ధం చేయవచ్చునా ? చేస్తే జయం మనకే కలుగుతుందన్న నిశ్చయమేమిటి? కనుక నీ చుట్టాలు స్నేహితులు ఒక్కరు కూడా గాయపడకుండా; చావకుండా ఒక్క కీడు లేకుండా నీ అదృష్టవశాత్తు కార్యం సుసంపన్నమైనది.

విశే॥ ఈ పద్యంలో ఒక రాజనీతి సూత్రం చెప్పబడింది. అది కథలో కలిసిపోయి వేరుగా కనిపించలేదు. బలము, కాలము అనుకూలంగా ఉన్నపుడే దండయాత్ర చేయాలి. జయాపజయాలు దైవనిర్ణయాలు కనుక సంధి, యుద్ధాలలో ఏది అనుకూలమైనదో జాగ్రత్తగా పరిశీలించి అనుసరించాలి. ఈ విషయాలు యామునాచార్యుని రాజనీతిలో వివరింపబడతాయి.

చ. అనవుడు నల్ల నవ్వి మనుజాధిపుఁ డిట్లను :– 'మీర లర్థసా
ధన పరతంత్ర కోవిదులు దక్క, మహాసుఖదాయి మోక్షమా
ర్గనయ విచార కోవిదులు గా రతిచంచల రాజ్యలక్ష్మి నే
మని చని వేఁడువాఁడఁ ? బరమార్థము వేఁడక యమ్మహామతిన్. 58

అనవుడున్ = అప్పుడలా చెప్పాక; మనుజ+ అధిపుడు = నరనాథుడు; అల్లనవ్వి = చిరునవ్వు నవ్వి; ఇట్లనున్ = ఇలా అంటున్నాడు; మీరలు = మీరందరు; అర్థ = రాష్ట్రసంపత్తియొక్క (అర్థశాస్త్రం = రాష్ట్రసంపత్తిని గురించి చెప్పిన శాస్త్రమని అర్థం); సాధన = ఉపాయము; పర = ముఖ్యమైన; తంత్ర = శాస్త్రంలో; కోవిదులు = పండితులు; తక్కన్ = తప్ప; మహాసుఖదాయి = శాశ్వత సుఖాన్నిచ్చే; మోక్షమార్గ = కైవల్యమార్గమునకు; నయ = తీసుకొని పోయే; విచార = ఆలోచనలో; కోవిదులు కారు = పండితులు కారు; ఆ+ మహామతిన్ = ఆ గొప్పజ్ఞానిని; చని = వెళ్లి; పరమ+ అర్థము = మోక్షము; వేడక = కోరక; అచంచలన్ = మిక్కిలి చపల స్వభావం గల; రాజ్యలక్ష్మిని = రాష్ట్ర శ్రీని; ఏమి+ అని = ఏ ముఖం పెట్టుకొని; వేడు వాడన్ = వేడుకొనేది.

తా॥ మంత్రులన్న మాట విని రాజు మందహాసం చేసి ఇలా అన్నాడు. మీరు ఐశ్వర్యరూపమైన రాజ్యసంపాదనను గురించి చెప్పే శాస్త్రంలో ప్రవీణులు తప్ప శాశ్వత సుఖదాయి మోక్షమార్గ విచారణలో

ప్రవీణులు కారు. ఆ మహాజ్ఞాన సంపన్నుని పరమార్థాన్ని గురించి వేడుకోక మిక్కిలి అస్థిరమైన రాజ్యలక్ష్మిని ఏ నోటితో యాచించేది?

విశే॥ అలం : పదార్థ హేతు కావ్యలింగం. మహాసుఖాలు మోక్షమార్గ యాచన అస్థిరమైన రాజ్యలక్ష్మిని యాచించక పోవడానికి కారణం కనుక.

మహామతి - విష్ణుచిత్తునితో భగవంతుడు మాట్లాడిన సందర్భంలో వాడిన మాట. 'నేడు మహామతీ (2.88)' అతిలోక సంబంధమైన విచారణ చేసేది. మహామతి. దైవసంబంధమైన విచారణ చేసేది. 'ఉన్మనస్సు' అని కూడా అంటారు (ఉత్+ మనస్సు= ఊర్ధ్వముఖమైన మనస్సు) = Higher mind. శ్రీ అరవిందుని మాట.

మందహాసం చేయటానికి కారణం మంత్రులు 56వ పద్యంలో చెప్పిన 'చతురర్ణ వృతోర్వీవలయ విశేషంబును వేడుము' ఎందుకంటే బాంధవాప్తజనపోషణ కన్నా పుణ్యమేమున్నది కనుక. దీనికోసం అంత సామ్రాజ్య మనవసరం కదా ! ఇందుకని రాజు నవ్వాడు. కనుక ఇక్కడ రాజంటే మోక్షమార్గనయ విచార కోవిదుడు తప్ప కేవల అధికార ఇచ్ఛగల ఆధునిక నాయకుడు కాడు.

పద్యరచనలో శిల్ప సౌందర్యం భావించాలి. 'మీరలు . . . . . . అన్న వాక్యాన్ని తక్క అన్న యతి స్థానం మీద సరిగ్గా మధ్యలోకి విరచడం, మహా సుఖదాయి . . . . . కోవిదులు కారు, అని మరలా యతి స్థానం మీద పాదం మధ్యలోకి విరవటం రెంటినీ సమానంగా తూకం వేయటం.

అతిచంచల - విజయనగర సామ్రాజ్యం ఎన్ని చేతుల మీదుగా దొర్లిపోయిందో రాయల అనుభవంలోదే కనుక ఇది వట్టి శ్రుత పాండిత్యం కాదు. అందుకని అతిచంచల అన్నాడు.

కం. నిమివంశోత్పన్నుల మఁట
మము బోటుల కకట రాజ్యమా లక్ష్యము ! ? వాఁ
డమలిన యోగాశ్రయుఁ; డు
త్తమయోగము గొనుట యుఁటవొ ? ధరఁ గొనుటుఁటవో ? 59

నిమివంశ = నిమిచక్రవర్తి కులంలో; ఉత్పన్నులము+ అట = పుట్టినవారమట; మము బోటులకున్ = మాలాంటివారికి; అకట = అయ్యో !; లక్ష్యము = ధ్యేయము; రాజ్యమా= వట్టి భౌతిక సంపద్రూపమైన సామ్రాజ్యమా ?; వాడు = కేశిధ్వజుడు; (ఇంతవరకు మహామతి, రాజు ఇలా అని ఇక్కడ వాడు అనటం అతనియందు సోదరభావాన్ని పొందటం); అమలిన = స్వచ్ఛమైన; యోగాశ్రయుడు = జ్ఞానయోగమునకు ఆధారమైనవాడు; ఉత్తమ = ఉత్కృష్టమైన; యోగమున్; కొనుట= గ్రహించుట; ఉఁటవొ= మంచిదా; ధరన్ = భూమిని; కొనుట = గ్రహించడం; ఉఁటవో = మంచిదా ?

తా॥ నిమిచక్రవర్తి దేహాభిమానాలు లేకుండా దేహబుద్ధిని త్యాగం చేసినవాడు. కనుక ఇలా సగర్వంగా రాజు చెప్పుకొంటున్నాడు. జనకవంశం ఆధ్యాత్మిక విద్యకు కాణాచి కనుక నిమి అని ఆ వంశకర్త పేరే చెప్పవలసి వచ్చింది. యోగమంటే ఇక్కడ ' ఈశోపనిషత్తులోని విద్య = జ్ఞానయోగం.

సీ. విడుఁ డని వీడు వెల్వడి వచ్చి ఖాండిక్యుఁ
డా రాజుఁ గనుఁగొని గారవమున
'గురు నిష్క్రయంబు నిక్కువముగా నొసఁగెదే' ?
యని పల్క, 'యిత్తుఁ దథ్యముగ' నన్న;
'నవనీతలేంద్ర ! నీ వధ్యాత్మరతుఁడవు;
దక్షిణ గురునకీఁ దలఁచి తేని,
సకల భవక్లేశ సంక్షయం బెయ్యది
యవ్విద్య బోధింపు'మనిన, నవ్వి,

తే॥ యహహా ! నిష్కంటకాస్మదీయాధిరాజ్య
మడుగ నొల్లక యిది యేటి కడిగి తిపుడు ?
క్షత్త్రియుల కెల్ల రాజ్యంబు కంటె మఱి ప్రి
యంబు గలదె ?, యటన్న నిట్లనియె నతఁడు. 60

విడుడు = వదలండి; వీడు = నెలవు; వెల్వడి (వెలి+పడి) వచ్చి = బయటకు వచ్చి; ఖాండిక్యుడు; ఆ రాజున్ = కేశిధ్వజుని; గారవమున = గౌరవంతో; కనుగొని = చూచి; గురునిష్క్రయంబు = గురువుగారికి సరియైన విలువ (దక్షిణ); నిక్కువముగా = నిజంగా; ఒసగెదే = ఇస్తావా !; అని పల్క = అని ప్రశ్నించి (అతడు); తథ్యంగా = నిజంగా; అన్నన్ = అంటే; అవనీతల +ఇంద్ర = రాజేంద్ర ! (ఇంద్రుడు వృద్ధశ్రవుడని ఇదివరకే పైపద్యాలలో వచ్చింది. కనుక ఈ రాజు కూడ జ్ఞానసంపన్నుడు అని సంబోధనలలోని ఔచిత్యం), నీవు; అధి+ఆత్మ = ఆత్మవిద్య; రతుడవు = తత్పరుడవు; గురునకున్; దక్షిణ+ఈన్ = ఇవ్వడానికి; తలచితివి+ఏనిన్ = సంకల్పిస్తే; సకల = సమస్తమైన; భవ = జన్మకు సంబంధించిన, క్లేశ = దుఃఖాలను; సంక్షయంబు = నశింపజేసేది; ఎయ్యది = ఏదో; ఆ విద్య = సద్విద్యను; బోధింపుము = ఉపదేశించుము; అనినన్ = అంటే; నవ్వి; కేశిధ్వజుడు; అహహ = ఆశ్చర్యము; నిష్కంటక = శత్రువులు లేని; అస్మదీయ= నాయొక్క; అధిరాజ్యము = సామ్రాజ్యం; అడుగన్ - ఒల్లన్= అడగడానికిష్టపడక; ఇది=ఈ ఆధ్యాత్మిక విద్యను; ఏటికి = దేనికని; ఇపుడు+ అడిగితి = ఇపుడు అడిగావు; మఱి = ఎందుకంటే; క్షత్రియులకు +ఎల్లన్ = రాజులందరకు; రాజ్యంబుకంటె = రాజ్యం కన్నా; ప్రియంబు కలదె = ఇష్టమైన వస్తువున్నదా ! అట+అన్నన్ = ఈ విధంగా అంటే; అతడు= ఖాండిక్యుడు; ఇట్లనియెన్.

విశే॥ విద్య - మోక్షవిద్య; అవిద్య = లోకసంబంధమైన విద్య. దీన్ని శాస్త్రమని; దాన్ని వేదమని అంటారు. ఈ విద్యావిద్యల చర్చయే ఈ కథా తాత్పర్యం. అవిద్య కర్మకాండ; విద్య జ్ఞానకాండ అని వేదము. ఇది ఉపనిషత్తని అద్వైతాచార్యులు విడదీస్తే రెంటి సమన్వయాన్ని శ్రీవిశిష్టాద్వైతవాదులు జ్ఞాన సముచ్చయ వాదంగా ప్రచారం చేసినట్లు ముందే చెప్పబడింది. విద్యయన్న మాట ఈశలోనిది. దానినిక్కడ వాడటం తెలిసి చేసినపని.

అహహా - ఈ ఆశ్చర్య ప్రకటన రాజ్యాన్ని వదలి అధ్యాత్మ విద్యను కోరుకోవడం కారణంగా. ఇది లోక విడ్డూరం కనుక.

మ. 'విను కేశిధ్వజ ! ధాత్రి వేఁడమికి నావేదించెదన్హేతువు; వ
జ్ఞునకుంగాక వివేకి కేల జనియించున్ లౌల్య మెందున్ ? రణం
బునఁ బాడిన్ రిపుఁగూల్చు వాఁడియుఁ బ్రజా పోషంబు ధర్మంబు రా
జున కౌ; నైన నశక్తుఁద్వద్విజిత రాజ్యున్నన్నఘం బంటునే ? 61

కేశిధ్వజ !; విను; ధాత్రిన్ = భూమిని; వేడమికిన్ = కోరుకోకపోవటానికి; హేతువు = కారణము; ఆవేదించెదన్ = నివేదిస్తాను; ఎందున్ = ఎక్కడైనా; అజ్ఞునకున్ = జ్ఞానం లేనివానికి; కాక = తప్ప; వివేకికిన్= విచారణశీలుడైన పండితునకు; లౌల్యము = లోలత్వం; అనురక్తి; ఏల జనియించున్ = ఎందుకు కలుగుతుంది ?; రాజునకున్ = పరిపాలకునకు; పాడిన్ = న్యాయంగా;; రణంబునన్ = యుద్ధభూమిలో; రిపున్ = శత్రుని; కూల్చు = సంహరించే; వాడియున్ = శౌర్యము; ప్రజాపోషంబు = ప్రజలను కాపాడుట; ధర్మంబు= విధి; అవున్ = అవును; అయినన్ = ధర్మమైనప్పటికి; త్వత్ = నీచేత; విజిత = జయింపబడ్డ; రాజున్ = రాజునైన; నన్ను; అశక్తున్ = శక్తిలేనివానిని; అఘంబు = పాపము; అంటునే = అంటదు.

తా॥ కేశిధ్వజ ! నేను రాజ్యాన్ని ఎందుకు కోరుకోలేదో కారణాన్ని చెబుతాను విను.

1. ఎక్కడైనా లోకంలో అజ్ఞానానికి అనురక్తి కలుగుతుంది తప్ప పండితునకు లౌల్యం కలుగుతుందా !

2. రాజునకు యుద్ధరంగంలో శౌర్యంతో శత్రువులను జయించటం, తద్వారా నిష్కంటక సామ్రాజ్య నిర్మాణం చేసి ప్రజారక్షణ చేయటం ధర్మమే కాని, నేను నీ చేతిలో ఓడి పోయినందువల్ల నాకా రాజ్యార్హత పోయింది కనుక నన్ను రాజ్యం పాలించలేక పోవటంవల్ల కలిగే పాపం అంటదు.

విశే॥ ఈ పద్యంలో ఒకగొప్ప రహస్యం చెప్పబడింది. సంఘంలో ఎవడి విధి వాడు సక్రమంగా నిర్వహించలేక పోతే అస్తవ్యస్తత ఏర్పడుతుంది సృష్టి చక్రగమనానికి విఘాతం ఏర్పడుతుంది. ఇదే అధర్మమంటే. ఈ విఘాతాన్ని కలిగించేవాడు అఘాయువు = పాపపంకిలమైన ఆయుస్సు కలవాడు, మోఘాయువు = అల్పకాలం జీవించేవాడు అని గీతలో శ్రీకృష్ణుడన్నాడు. కనుక స్వధర్మ పరిపాలన చేయక పోవటం వల్ల పాపం సంక్రమిస్తుంది. తాను రాజై ఉండి కూడా రాజ్యాన్ని ఎందుకు కోరలేదు? అన్న ప్రశ్నకు సమాధానమే ఈ పద్యం. ధర్మరహస్యాలు సూక్ష్మంగా ఉంటాయి. ఇది ఒకడు చెబితే తెలిసేది కాదు. అనుభవంలో నుండి రావలసిందే తప్ప. శ్రీకృష్ణదేవరాయలు ఈ స్థానంలో ఉన్నాడు.

సీ. నరనాథ ! యీ రాజ్య పరిపాలనారాతి
హననాది కృతరూప యగు నవిద్య
యనధికారికి విసర్జనముఁ గావింపంగఁ
గలుషంబు రాదధికారియైన

వాడు విసర్జింపవచ్చు వర్ణాచార
లోపంబుచే నగు పాప లేప,
మైన నే నిత్తుఁ గొమ్మనఁ గొను ధరణి భో
గమునకుఁ గాక ధర్మమున కగునె ?

తే॥ కాన సత్‌క్షత్రియులకు భైక్షంబు కీడు;
మత్ప్రధానులు వేఁడు సామ్రాజ్య మనెడు
పలుకు ధర్మచ్ఛలంపులోభం బయుక్త ?
మిది యెఱిఁగి రాజ్య మడుగ నే నిచ్చగింప. 62

నరనాథ = ఓయి కేశిధ్వజా !; ఈ; రాజ్య పరిపాలన = రాజ్యం పాలించడం; అరాతి= శత్రువులను; హనన = చంపటం; ఆది = మొదలైన; కృతరూప = చేయబడ్డ రూపం కల; అవిద్యన్ = అవిద్యను; అనధికారికిన్ = అర్హత లేని వానికి; విసర్జనము+కావింపన్ = త్యజింపడం వల్ల; కలుషంబు = పాపము; రాదు; అధికారి ఐనవాడు = అర్హుడైనవాడు; శక్తి కలవాడు; విసర్జింపన్ = త్యజిస్తే; వర్ణ+ఆచార = వర్ణధర్మము; ఆచారధర్మములయొక్క; లోపంబుచే = లోపించడం వల్ల; అగు = కలుగునట్టి; పాపలేపము = పాపపుపూత; వచ్చున్= కలుగును; అయినన్ = అయినా; నేను; ఇత్తున్ = ఇస్తాను; కొమ్ము = తీసుకో; అనన్ = అంటే; కొను = గ్రహించే, ధరణి = రాజ్యము; భోగమునకున్ కాక = అనుభవించడానికి తప్ప; ధర్మమునకున్ = ధర్మానికి; అగునె = అవుతుందా ? కానన్ = కాబట్టి; సత్‌క్షత్రియులకున్ = ఉత్తమ రాజవంశ్యులకు; భైక్షంబు = భిక్షము; కీడు = చేటు; మత్ = నా యొక్క; ప్రధానులు = మంత్రులు; సామ్రాజ్యమున్ వేడుము; అనెడు పల్కు= అన్నమాట; ధర్మచ్ఛలంపు లోభంబు = ధర్మమన్న ముసుగు కప్పుకొన్న రాజ్య కాంక్ష; అయుక్తము = పనికి రానిది; ఇది+ఎఱిఁగి = ఈ విషయమంతా తెలిసి; నేను; రాజ్యమడుగన్=రాజ్యమడగడానికి; ఇచ్చగింపన్ = కోరను.

**తా॥** ఓయీ రాజా ! ఈ రాజ్య పరిపాలనము శత్రుసంహారమన్న రూపంలో శోభిస్తున్న అవిద్యారూపకర్మను అధికారి కానివాడు విసర్జింపవచ్చు. దానివల్ల పాపం కలుగదు. అధికారి అయినవాడు విసర్జిస్తే వర్ణాశ్రమ ధర్మాలు లోపించడం వల్ల కలిగే పాపలేపమతనికి అంటుతుంది. అయినా ఇస్తాను తీసుకో ! అంటే తీసుకున్న రాజ్యం భోగానికి తప్ప ధర్మ నిర్వహణకు కాదే. క్షత్రియుడైన వానికి ఈ భిక్షపుకూడు హాని. ఇది పరధర్మం తప్ప స్వధర్మం కాదు. నామంత్రులు రాజ్య మడగ మనడం ధర్మం కాదు. ధర్మమన్న ముసుగు వేసుకున్న రాజ్యకాంక్ష. ఇది అయుక్తం కనుక యిదంతా విచారించి నేను నిన్ను రాజ్య మడగలేదు.

**విశే॥** తాను రాజ్యాన్ని అడగక పోవడానికి గల కారణాలు ఈ పద్యంలో వున్నాయి. స్వధర్మ నిర్వహణ అత్యంత ఆవశ్యకం. పరధర్మం త్యజించదగింది. క్షత్రియుడై కూడా రాజ్యపరిపాలన అన్న స్వధర్మం నుండి ఖాండిక్యుడు తప్పుకోవడం ఎలా సమర్థనీయమో ఈ పద్యంలో కవి స్థాపిస్తున్నాడు. రాజ్యపరిపాలన అవిద్య. అంటే కర్మకాండ. లౌకిక ధర్మ నిర్వహణ. కర్మయోగం = అవిద్య.

ఈశావాస్యంలోని ఈ మంత్రం ఈ పద్యానికి ఆధారం.

*''కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేత్ శతం సమాః*
*ఏవం త్వయి నాన్యథేతోఽస్తి న కర్మ లిప్యతే నరే ॥''*

కర్మలను నిర్వహిస్తూనే మనిషి నూరేళ్లు బ్రతకాలని కోరుకొనాలి. నీకర్తవ్యమిదే. ఇంతకంటే మార్గం లేదు. మనిషికి కర్మలేపనం లేదు.

పద్యంలో పాపలేపమన్న మాట యిక్కడిది.

కర్మరూపమైన అవిద్య త్యజించడానికి వీలు లేదు అని పై మంత్రం చెబుతుండగా ఇక్కడ ఖాండిక్యుడు తాను త్యజించడానికి కారణ మేమిటో వివరించడం చాలా అద్భుతమైన శాస్త్రరహస్యం.

''ధర్మచ్ఛలంపు లోభంబు'' - అన్నమాట చాలా అద్భుతమైంది. లోకంలో లౌల్యబుద్ధి అయినవాడు చెప్పే ధర్మ పన్నాలన్నీ యిలాగే ఉంటాయి. పైకి ధర్మం కనిపిస్తున్నా లోపల లోభమే ఉంటుంది. ఏదో ఒక కోరిక లేకుండా సామాన్యుడు మాట్లాడడు. ఇది మానవ స్వభావాన్ని నరుకుతున్న శబ్దఖడ్గం.

తే॥ ఆసపడుదురె బుధులు రాజ్యంబు, మమత
మానని జడాత్ము లట్ల హంమాన పాన
మత్తులకుఁ గాక, యది యేల ? మాదృశులకు ?
ననిన హర్షించి మెచ్చి యజ్జనకుఁ డనియె. **63**

మమత = మమకారము; మానని = వదలని; జడ = మూఢుడైన; ఆత్ములు+అట్లు = మనస్సు కలవారి వలె; బుధులు = పండితులు; రాజ్యంబు ఆసపడుదురే = ఆశిస్తారా!; అహంకారమన్న; పాన = త్రాగుడువల్ల; మత్తులకున్ = మూర్ఛపోయిన వారికి; కాక = తప్ప; మాదృశులకున్ = మాలాంటి వారికి; అది ఏల = అది ఎందుకు ?; అనినన్ = అంటే; హర్షించి = సంతోషించి; మెచ్చి = మెచ్చుకొని; ఆ జనకుడు = ఆ కేశిధ్వజుడు; అనియెన్ = అన్నాడు.

తా॥ అహంకార మద్యంతో కైపెక్కిన మూఢబుద్ధులు రాజ్యకాంక్షతో తపిస్తారు తప్ప బుధులైన మాలాంటివారు ఆశించరు. ఇక్కడ జనకుడన్న మాట చాలా ఔచిత్య శోభితమైన అధ్యాత్మ విద్యావేత్త అని అర్థం. జనకుడు = తండ్రి; ఉపనిషద్విద్య అన్న దేవికి (సీతకు) తండ్రి అని నిరుక్తి. కేనోపనిషత్తులో ఉపనిషద్విద్య ఉమాదేవిగా ఇంద్రునికి సాక్షాత్కరించిన కథ ఉన్నది. కనుక జనకుడంటే ఆధ్యాత్మిక విద్యను కన్నవాడే అని తాత్పర్యం.

ఆ. ఏ నవిద్యవలన మృత్యువుఁ దరియింప
ననఘ !; రాజ్యములు మఖాదికములుఁ

జేయుచున్నవాఁడ క్షీణింపఁ జేయుదుఁ
బుణ్యఫలము భోగభుక్తిచేత. 64

అనఘ ! (న+అఘ) = పాపం లేనివాడ !; ఏన్ = నేను; అవిద్యవలనన్ = యజ్ఞము మొదలైన కర్మలను ఆచరించడం వలన; మృత్యువున్ = పాపకర్మను; తరియింపన్= దాటడానికి; రాజ్యములు = రాజ్యపాలన; మఖ = యజ్ఞకర్మ; ఆదికములున్ = మొదలైనవాటిని; చేయుచున్నవాడను = చేస్తున్నాను; పుణ్యరూపఫలితాన్ని; భోగభుక్తిచేతన్= భోగానుభవాల వల్ల ! క్షీణింపజేయుదున్ = కృశింపజేస్తాను.

తా ॥ నేను అవిద్యవల్ల మృత్యువును తరించడం కోసమే రాజ్యపరిపాలన యజ్ఞకర్మలను చేస్తున్నాను. పుణ్యఫలితాన్ని భోగాలను అనుభవించడం వల్ల క్షీణింపజేస్తున్నాను.

విశే॥ *విద్యాం చావిద్యాంచ యస్తద్వేదోభయం సహ ।*
*అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయామృత మశ్నుతే ॥*

జ్ఞానాజ్ఞానములను రెంటిని ఒకటిగా దర్శించేవాడు అవిద్యచే మృత్యువును తరించి విద్యచే అమృతత్వము ననుభవిస్తున్నాడు.

*''యోగినః కర్మ కుర్వన్తి సంగం త్య క్త్వా ఆత్మశుద్ధయే''*
*యజ్ఞోదానం తపశ్చైవ పావనాని మనీషిణామ్'' (భ.గీ. 5-11; 18-5)*

యోగులు ఆసక్తిని వదలి ఆత్మశుద్ధికై కర్మలు చేస్తున్నారు. యజ్ఞ దాన తపస్సులు బుధులకు పావనములు.

పద్యమూలశ్లోకం- అహంహ్యవిద్యయామృత్యుం- తర్తుకామః కరోమివై రాజ్యం యాగాశ్చ వివిధాన్- భోగైః పుణ్య క్షయంతథా ( విష్ణుపురాణం.)

మృత్యువంటే అజ్ఞానావృతమైన జీవితం. పాప పంకిలమైన బ్రతుకు వక్రగతి పాపం- ఋజుగతి పుణ్యం. కాబట్టి లౌకిక కర్మలన్నీ ఆత్మశుద్ధి కోసం ఆసక్తిలేకుండా చేయడమే కర్తవ్యం. మోక్షం పుణ్యపాపాల కతీతమైంది కనుక. పుణ్యాన్ని క్షీణింపజేసుకోవాలి. దీనికి సాధనం భోగానుభవం.శ్రీరామానుజులు- 'అత్ర అవిద్యాశబ్దాభిహితంవర్ణాశ్రమ విహితం కర్మ - మృత్యుంబ్రహ్మజ్ఞానోత్పత్తి విరోధి ప్రాచీనం కర్మ - శ్రీభాష్యం'.

కం. మన యీ నిమివంశము పా
వన మగు భాగ్యమున, మనుజవర ! తత్త్వవివే
చన చింత నీకుఁ బొడమెను:
విను మింక వినుపింతు నే నవిద్యావిధమున్. 65

మనుజవర = మానవశ్రేష్ఠుడా !; మన = మనయొక్క; ఈ నిమివంశము = ప్రసిద్ధమైన యీ నిమివంశము; పావనము = పవిత్రమైనది (పవిత్రమగు); భాగ్యమున = అదృష్టం చేత; నీకున్ = నీకు;

తత్త్వనివేచనచింత = పరమాత్మయొక్క విచారణరూపమైన ఆసక్తి; పొడమెను = కలిగింది; ఇఁకన్; నేను; అవిద్యావిధమున్ = అవిద్యాక్రమాన్ని; వినిపింతున్= వినుము.

అవిద్యాంశం

ఆ. ఆత్మకాని మేన నాత్మబుద్ధియును న
స్వంబునందు మిగుల స్వత్వమతియు,
నవనివర ! యవిద్య యను మహాతరువు ను
త్పత్తి కీ ద్వయంబు విత్తు మొదలు. 66

అవని వర = రాజా!; అవిద్య = పుణ్యపాపరూపకర్మలనే; మహాతరువు = పెద్దచెట్టుయొక్క; ఉత్పత్తికి = జన్మకు; ఆత్మకాని మేనన్ = ఆత్మకాని శరీరం మీద; ఆత్మబుద్ధి యున్ = ఆత్మ అన్న ఆలోచన; అస్వంబు నందు = తనది కాని దానిపై; మిగులన్ = మిక్కిలి; స్వత్వమతియున్ = తనదన్న తలపు; ఈ ద్వయంబు = ఈ జంట; విత్తు మొదలు = ఆదియైన బీజము.

తా॥ రాజా! అవిద్య అన్న మహావృక్షానికి రెండు దళాలు గల ఆదిబీజ మున్నది. ఒక దళం ఆత్మకానట్టి శరీరం మీద ఆత్మ అన్న భ్రాంతి; తనదు కాని దాని మీద తనది అన్న కోర్కె. ప్రతి గింజలోను రెండు బద్దలుంటాయి. ఈ బీజానికి ఈ రెండు దళాలు. ఒక మహావిషయాన్ని ఇంత చిన్న ఛందస్సులో సులభంగా క్లుప్తంగా చెప్పటం కంటే కవితావిద్య ఏముంటుంది? ఇతిహాస పురాణాలలో ఈ పద్ధతి రచన ఉంటుంది ఈ పద్యానికి మూలం విష్ణుపురాణ శ్లోకం.

అనాత్మని ఆత్మబుద్ధిః య అస్వేస్వమితి యా మతిః ।
అవిద్యాతరు సంభూతి బీజం ఏతద్ద్విధాస్థితమ్ ॥

అవిద్యబీజంగా పుణ్యాపాపరూపకామ్యకర్మలజీవితమే వృక్షం. బీజమేవృక్షం. రెండు వేరు కావు. కనుక అవిద్యనేతరువన్నాడు.

కం. నరనాథ ! పాంచ భౌతిక
శరీరమున దేహి మోహసాంద్రతమ తమః
పరివృతుఁడై, యే, నిది, నా
పరికర' మని యవధి లేని భ్రమఁ బడి తిరుగున్. 67

నరనాథ = రాజా! ; పాంచభౌతిక = పంచభూత సమ్మిశ్రణంతో తయారైన; శరీరమునన్= దేహంలో; దేహి = జీవుడు; మోహ = వ్యామోహమన్న; సాంద్రతమ = మిక్కిలి దట్టమైన; తమః = చీకటిచే; పరివృతుడై = చుట్టుకోబడ్డవాడై; ఏన్ =నేను; ఇది నా పరికరము = ఇది నా వస్తువు; అని; అవధి లేని = అంతులేని; భ్రమన్ = భ్రాంతి అన్నసుడిలో; పడి = చిక్కి; తిరుగున్ = అక్కడక్కడే తిరుగుతున్నాడు.

తా॥ రాజా ! ఈ శరీరము పంచభూతాలతో నిర్మింపబడ్డది. లోపల బంధింపబడ్డ జీవుడు నేను, నాది అన్న భ్రాంతి - అజ్ఞానమన్న కటిక చీకటిలో పడి సుడిలో పడ్డ పురుగులాగా తిరుగుతున్నాడు.

విశే ॥ ''అంధం తమః ప్రవిశంతి యః అవిద్యా ముపాసతే''- 'ఈశోపనిషత్తు' అవిద్యనుపాసించేవారు గాఢాంధకారంలో ప్రవేశిస్తున్నారు.

ఇక్కడ అవిద్య అంటే అజ్ఞానము, మోహము కాదు. విద్యావిరుద్ధమైన వైదిక కర్మ. అదే నిరాసక్తంగా చేస్తే అవిద్య ఫలాపేక్షతో చేస్తే మోహం. ఈ తేడాను గుర్తించాలి.

కం. జల వసుధాంబర పవన
జ్వలనంబులకంటెఁ దా నజస్రంబు వెలిన్
వెలుఁగొందు నాత్మయుండఁగఁ
గళేబరము నెవ్వఁ డాత్మగా ఁదలపోయున్? 68

ఆత్మ = శ్రీమన్నారాయణునియొక్క ప్రతిబింబమైన వెలుగు; జల = నీరు; వసుధ = భూమి; అంబరః ఆకాశం, పవన = గాలి; జ్వలనంబుల కంటెన్ = అగ్ని కంటే; తాన్= ఆత్మపదార్థం; అజస్రంబు = నిత్యమూ; వెలిన్ = బయట, వెలుగొందు = ప్రకాశిస్తూ; ఉండగన్ = ఉండగా; ఎవ్వడు = ఏ మూర్ఖుడు; కళేబరమున్= శరీరాన్ని; ఆత్మగా, తలపోయున్ = అని అనుకుంటాడు.

తా॥ పంచ భూతాలకంటే అతీతుడై వెలుగుతున్న ఆత్మ వేరే ఉండగా శరీరమే ఆత్మ అని ఎవడు అనుకుంటాడు మూర్ఖుడు తప్ప.

సీ. వపు రుపభోగ్యముల్ నృప గృహ క్షేత్రాదు;
లవి బొంది వౌఁగాక యాత్మ వగునె ?
యట్లన పుత్రపౌత్రానీకములు నాత్మ
కాని మైఁ బుట్టుటఁగావు తనవి;
గాన మృత్యువుఁ గను కాయంబున జనించు
పుత్రాదు లెడ స్వత్వ బుద్ధి దగదు;
ఎపుడేని యాత్మ వేఱే యనునప్పుడె
యడరు భోగంబు లీయాత్మకంట;
తే॥ వట్లుగా కీ యొడలె యాత్మ యన్న నంటు
మృద్గృహము నిల్పు నెట్లల్కు మృజ్జలాది
నట్లు భౌతిక భోగాశనాది భౌతి
కాంగములు నిల్పు; భోగ మిం దాత్మ కెద్ది? 69

నృప = రాజా!; గృహ = ఇల్లు; క్షేత్ర = భార్య; ఆదులు = మొదలైనవి; వపుః+ ఉపభోగ్యముల్ = శరీరంతో భోగింపదగినవి; అవి = ఆ గృహక్షేత్రాదులు; బొందివి= శరీరానికి సంబంధించినవి; ఔన్+ కాక= అవుతాయి తప్ప; ఆత్మవి+ అగునె= ఆత్మకుసంబంధించినవి అవుతాయా ?

2. అట్లన్ = ఆవిధంగానే; పుత్ర = కొడుకులయొక్క; పౌత్ర = మనుమలయొక్క; అనీకములున్= సమూహములు; ఆత్మకాని; మైన్ = శరీరమునుండి; పుట్టుటన్ = పుట్టినందువల్ల; తనవి కావు = ఆత్మపదార్థమైన తనకు సంబంధించినవి కావు.

3. కానన్ = కాబట్టి; మృత్యువున్ కను = మరణించే; కాయంబునన్ = శరీరంనుండి; జనించు = పుట్టే; పుత్రాదుల ఎడన్ = కొడుకు మొ॥ న వారి విషయంలో; స్వత్వబుద్ధి= తనవారన్న తలపు; తగదు = కూడదు.

4. ఎపుడేనిన్ = ఎపుడైనా; ఆత్మవేఱే = ఆత్మపదార్థం శరీరం కంటె అతీతం; అనునప్పుడే = అని భావించినపుడె; అడరు = అధికమైన; భోగంబులు = విషయానుభవాలు; ఈ, ఆత్మకు అంటవు;

5. అట్లుగాక = అలాభావించకుండా; ఈ ఒడలె = ఈ అవయవాలే; ఆత్మ అన్నన్ = అనుకుంటే; అంటున్ = పాపం కలుగుతుంది; మృత్+జల+ ఆదిక = మట్టి, నీరు మొదలైన వాని చేత; అల్కు = అల్కునట్టి; మృత్+గృహము = మట్టియిల్లు; ఎట్లు= ఏవిధంగా; నిల్చున్ = నిలబడుతుంది? అట్లు = అదేవిధంగా; భౌతిక = బాహ్యమైన; భోగ = భోగాలు; అశన = అన్నము; ఆదిన్ = మొదలైన వానిచే; భౌతిక+ అంగములున్= పాంచభౌతికాలైన దేహాలును; నిల్చున్; ఇందు = నీటిలో; ఆత్మకున్; భోగమెద్ది= ఏ అనుభవమున్నది ?

ఓరాజా ! గృహ కళత్రాదులు దేహం చేత అనుభవింప బడేవి కనుక అని దేహానికి తప్ప దేహిని కావు. అలాగే పుత్రపౌత్రాదులును ఆత్మకాని శరీరం నుండి జన్మించినందువల్ల ఆత్మవికావు. కాబట్టి నశించే శరీరం నుండి పుట్టిన పుత్రాదులందు స్వత్వబుద్ధి తగదు. ఎప్పుడైతే శరీరం కంటే ఆత్మ వేరే అన్న అనుభవం కలిగిందో అపుడు ఈ భోగాలు ఆత్మకు అంటవు. అలా కాకుండా శరీరమే ఆత్మ అనుకుంటే అంటుకుంటాయి. అలుకుమట్టి నీళ్లతో మట్టియిల్లు ఎలా నిలుస్తుంది? అదే విధంగా భౌతికాలైన భోగాలతో అన్నము మొదలైన వానితో పాంచ భౌతిక శరీరం కూడా. కనుక యిందులో ఆత్మకు భోగమేదీ లేదు.

కేశిధ్వజుడు ఖాండిక్యునితో చెబుతున్నాడు అని విష్ణుచిత్తుడు మధురా చక్రవర్తితో చెబుతున్నాడు. కనుక కథలో నృప, నరనాథ అన్న మాటలు ఖాండిక్యునకు, మధురా ప్రభువునకు అన్వయిస్తూ రెండుకథలను పెనవేసి చెప్పటం చాలా అద్భుతమైన శిల్పం.

మట్టి ఇల్లు - నీరు మట్టితో అలకడం వల్ల భౌతిక అశనాది భోగాలతోనే శరీరం నిలుస్తుంది. అన్న సాలంకార వాక్యం చాలా సొగసుగా వున్నది. శాస్త్రీయమైన విషయాన్ని మన అనుభవంలో ఉన్న ఉపమానం ద్వారా స్పష్టం చేయుటమే అలంకార ప్రయోజనం.

మ. జని సాహస్ర బహు ప్రయాణ మగు సంసారంపు ద్రోవ న్సదా
చనుచుండు న్వన మోహఖేద మలమ న్సంసారిపాంథుండు వా
సన లన్ ధూళి ముసుంగు గాఁగ; నెపుడేన్ జ్ఞానంపు టుష్ణోదకం
బునఁ దత్క్షాళన సేయు, వాని కపు డమ్మోహ శ్రమంబు ల్దనున్. 70

సంసారి పాంథుండు = భ్రమసడి తిరిగే వాడి పేరే సంసారి, వాడే బాటసారి; వాడు; జని= జన్మల యొక్క; సాహస్ర = అనేకమైన; బహుప్రయాణము = దీర్ఘప్రయాణము; అగు = అయిన; సంసారంపు త్రోవన్ = జనన మరణ రూపమైన మార్గంలో; సదా = నిత్యము; చనుచుండున్ = ప్రయాణిస్తున్నాడు; ఘన = గొప్ప; ఖేద = దుఃఖం; మోహ = ఆసక్తి; అలమన్ = ఆవరింపగా; వాసనలు = సంస్కారములు; అన్ = అన్న; ధూళి = దుమ్ము; ముసుంగు కాగన్ = ముసుగు కప్పగా; ఎపుడేన్ = ఎన్నడైనా; జ్ఞానంపు+ ఉష్ణోదకంబునన్ = జ్ఞానమన్న వేడినీళ్లతో; తత్ = ఆధూళిని; క్షాళన+చేయున్ = కడుగు కుంటాడో; అపుడు, వానికిన్ = ఆ బాటసారికి; ఆమోహశ్రమంబున్ = నీది నాది అన్న వ్యామోహంతో కలిగిన ఆయాసమున్నూ; చనున్ = తొలగుతుంది.

తా॥ సంసారి యైన జీవుడొక నిత్య పాంథుడు. శాశ్వత కాలము జనన మరణరూపమైన సంసారమన్న బాటలో వేల జన్మల కాలము మీద ప్రయాణిస్తూనే వున్నాడు. ఆ దారిలో మోహసంబంధమైన దుఃఖాలు మిక్కిలిగా అలముకొంటున్నాయి. తనకు తెలియకుండా తనలో దాగి యున్న సంస్కార సంబంధమైన సంస్కారాలనేకం దారిలో దుమ్మై ముఖాన్ని ఆవరిస్తున్నది. అదృష్ట వశాత్తు ఎప్పుడైనా జ్ఞానమన్న వేడి నీళ్లు లభిస్తే వాటితో ఆధూళిని క్షాళించు కుంటాడో అపుడే వానికి నడక వల్ల కలిగిన మోహమన్న ఆయాసం తీరుతుంది.

అలం : రూపకం

విశే॥ సంసారిని పాంథునిగా చిత్రిస్తున్న ఈ పద్యం ఆధ్యాత్మిక విద్యకు మకుట ప్రాయమైనది. రచనలో కూడా ప్రథమ వాక్యం నిండా దీర్ఘాక్షరాల కూర్పుండడం వల్ల ఆ ప్రయాణ దీర్ఘత్వం ధ్వనిస్తున్నది. వేడి నీళ్లతో దుమ్ము కడుక్కుంటే పథశ్రమ తీరడం మన అనుభంలోనిదే. ఈ లోకాను భవాన్ని తెచ్చి జ్ఞానంతో సంస్కారం క్షాళనం చేసుకోవడమన్న మహావిషయాన్ని అందివ్వడం గొప్ప కవితాశక్తి.

తే॥ అట్టి మోహశ్రమం బాఱ నాశరీరి
స్వస్థుఁడై తా ననన్యాతిశయ మబాధ
మనఁగ విలసిల్లు నిర్వాణమును భజించు
ననఘ తొల్లియు నిర్వాణ ఖనియ గాన. 71

అనఘ = పాపలేపమంటని వాడా!; తాన్ = జీవుడు; తొల్లియున్ = మొదట్లో కూడా; నిర్వాణ = ముక్తికి; ఖనియ = గనియు; కానన్ = అవడం వల్ల; ఆశరీరి = ఆజీవుడు; అట్టి= అలాంటి; మోహశ్రమంబు = వ్యామోహం చేత పెట్టుకొన్న దీర్ఘప్రయాణం వల్ల కలిగిన శ్రమను; ఆఱన్ = తీరిపోగా; స్వస్థుడై = తనయందే తాను నిల్చిన వాడై = ఆత్మనిష్ఠుడై; అనన్య = సాటిలేని; అతిశయము = అధికమైనది; అబాధము = బాధలేనిది; అనఁగన్ = అన్నట్లు; విలసిల్లు = ప్రకాశించు; నిర్వాణమున్ = మోక్షాన్ని; భజించున్ = పొందును

తా॥ అలాంటి అవిద్యాశ్రమ తీరగానే జీవుడు తన తొల్తటి స్వరూపమైనముక్తిని పొంది అతిశయమైన సుఖరూపమైన స్థితిని పొందుతున్నాడు.

విశే॥ అనఘ - మాటి మాటికి ఈ శబ్దాన్ని వాడడంలో తాత్పర్య మేమంటే ఖాండిక్యుఁడు రాజ్యాసక్తత కోల్పోయినందు వల్ల రాజ్య పరిపాలనా అవిద్యా రూప కర్మలకు దూరమై పాప రహితుడైనాడు. ఆ విషయమే తాను చెప్పిన మాటల్లో స్పష్టం చేసినాడు. ఆత్మ ప్రాప్తి సాధనమైన విద్యాసేవనం చేస్తున్నాడు. ఆత్మ విద్యకు అధికారి అయినవాడు వీడు. ఎవడు అవిద్యతో మృత్యువును తరించాడోవాడే మోక్షవిద్యకు అధికారి అందుకని అనఘ! అన్న సంబోధన సాభిప్రాయం.

వ. 1) విను జనేశ్వర ! జలం బస్పృష్టదహనం బయ్యుఁ దదీయ యోగంబునఁ గలశోదరంబున నునికిం దా నతిశీతలంబయ్యు నుడికి శబ్దోద్రేకాది ధర్మంబులం బొందున, ట్లాత్మయుం బ్రకృతి సంబంధంబున నహమ్మానాది దూషితుండై ప్రాకృతంబులగు ధర్మంబులం బొందు;

2) వీని కత్యంత విలక్షణుండు నక్షయుండు నాత్మ; యట్లగుట నింత యనర్థ మూలంబగు నీ,యవిద్యాబీజంబు నీ కెఱింగించితి, నేవం విధంబులగు సకల క్లేశంబులకును సంక్షయకరంబు యోగంబుదక్క మఱి యొండు పాయము లే'' దనుటయు c బ్రీతుండై, ఖాండిక్యుండును ''మహాత్మా! యిన్నిమి వంశంబున, విజ్ఞాత యోగశాస్త్రార్థుండ వీవు; నాకు నయోగ్యంబు సమస్తంబు విస్తరింప వలయు '' ననినఁగేశిధ్వజుండు కృపాళుండై, ''మహీపాలా! విను మెందేని సంస్థితుండై ముని మఱి పునర్భవంబునకు రాక బ్రహ్మ సాధర్మ్యంబుఁ బొందు నట్టి యోగంబు c జెప్పెద, సావధానుండ వై విను'' మని యిట్లనియె. 72

1. జనేశ్వర = రాజా!; అస్పృష్ట = తాకబడని; దహనంబు = అగ్ని; అయ్యున్ = అయిన, తదీయ = దాని యొక్క; యోగంబునన్ = సమ్మేళనము వల్ల; కలశ = కుండయొక్క; ఉదరంబునన్ = కుండలో; ఉనికిన్ = ఉండడంచేత; తాను = నీరు; అతి = మిక్కిలి; శీతలంబు = చల్లనీరు; అయ్యున్ = అయిన, ఉడికి = వేడెక్కి; శబ్ద = గుడగుడ మన్నసవ్వడి; ఉద్రేక = పైకి పొంగడం; ఆది = మొదలైన, ధర్మంబులన్ = గుణాలను; పొందునట్లు = పొందిన విధంగా; ఆత్మయున్ = ఆత్మకూడా; ప్రకృతి ధర్మంబునన్ = పాంచ భౌతిక ప్రకృతి యొక్క కూడిక చేత; అహమ్మాన = నేను అన్నభావం; ఆది = మొదలైన వానితో, దూషితుండు+ ఐ = కలుషితుడై; ప్రాకృతంబులు = ప్రకృతి సంబంధములైన; ధర్మంబులన్ = గుణాలను, పొందున్ = పొందును.

తా॥ రాజా ! కుండలో నీరు క్రింది నిప్పుతో ప్రత్యక్ష సంబంధము లేకున్నా కాగి గుడగుడ మన్న ధ్వనులతో పైకి తెర్లినట్లు ఆత్మకూడా ప్రకృతి యొక్క సంబంధము వల్ల నేను నాది యన్న భావాలతో కలుషితుడౌతున్నాడు. (చూ.6వ పద్యం)

2. వీనికిన్ = అహంకార మమకారాది ప్రాకృత ధర్మాలకు; అత్యంత = మిక్కిలి; విలక్షణుండు = కేవలం విరుద్ధమైన లక్షణం కలవాడు; అక్షయుండు = నాశనము లేనివాడు; ఆత్మ = పరమేశ్వరరూపమై; మనిషి మనస్సునకు, ప్రాణమునకు అతీతమై యున్న చిదంశ; అట్లొగుటన్ = ఆత్మపదార్థము ఇలాంటిది ఐనందు వల్ల; ఇంతగా అనర్థమూలంబు = చెరుపులకు కారణమైన; ఈ అవిద్యా బీజంబు = ఈ

అవిద్య అన్న మహావృక్షానికి విత్తు; నీకున్ = ఎరింగించితిన్ = స్పష్టము చేశాను; ఏవం విధంబులు అగు= ఇలాంటి వైన; సకల క్లేశంబులకునున్ = అన్నిదుఃఖాలకు; సంక్షయకరంబు = నాశనహేతువు; యోగంబు = అష్టాంగయోగము; తక్క = వదిలి; మరియొండు = మరియొక; ఉపాయము = సాధన; లేదు, అనుటయున్ = అనడంతో; ఖాండిక్యుండును = శ్రోతయైన వాడు; ప్రీతుండై = సంతోషించిన వాడై.

తా॥ ఈ ప్రాకృత ధర్మాలకంటె మిక్కిలి విరుద్ధ గుణాలు గల్గి నాశనం లేని పదార్థం ఆత్మ కనుక ఈ క్లేశ స్వరూపమైన అనర్థాలకన్నిటికి మూలం అవిద్య. ఇలాంటి క్లేశాలన్నింటికి నాశన స్వరూపమైన యోగం తప్ప మరే ఉపాయం కానరాదు. 66 వ పద్యంలో చెప్పిన అవిద్యా తరువు మూలం చెప్పబడింది. *''యోగస్వరూపంఖాండిక్య ! శ్రూయతాంగదతోమమ యత్రస్థితోవచ్యవతే ప్రాప్యబ్రహ్మలయంమునిః''* (విష్ణుపురాణం)

3. మహాత్మా = విశ్వాత్మ! ( ఎవని, ఆత్మవిశ్వంతో సమైక్యమై ఆ భూమికలో నిలుస్తుందో వాడు విరాట్ పురుషుడు. అతనితో తాదాత్మ్యం పొందిన వాడు.) ఈ నిమివంశంబునన్ = మన యొక్క నిమి వంశంలో; ఈవు = నీవు; విజ్ఞాత = తెలియ బడ్డ; యోగశాస్త్ర = ఆశాస్త్రసంబంధమైన; అర్థుండవు = అర్థం గలవాడవు; నాకున్ = నాకు; ఆ యోగంబు; సమస్తంబు = అంతయు, విస్తరింపన్ వలయున్ = విశదంగా చెప్పాలి; అనినన్ = అంటే; కేశిధ్వజుండు; కృపాళుండై = దయగలవాడై; మహీపాల = రాజ్యపాలకుడా!; వినుము = సావధానంగా వినుము; ఎందేనిన్ = ఎక్కడైనా; పునర్భవంబునకున్ = పునర్జన్మకు, రాక = రాకుండా; బ్రహ్మసాధర్మ్యంబు = శ్రీమన్నారాయణునితో సమానగుణాలు కలవాడగుటను; పొందునట్టి యోగంబున్ = పొందించేటటువంటి యోగాన్ని; చెప్పెదన్ = వివరిస్తాను; సావధానుండవు అయి = సర్వజ్ఞానేంద్రియాలను శ్రవణమునందే కేంద్రీకరించిన వాడవై; వినుము ; అని; ఇట్లనియెన్ = ఈ విధంగా వివరించినాడు.

విశే॥ మహీపాలా ! విష్ణుచిత్తుడు ఈ కథను పాండ్యరాజునకు వినిపిస్తున్నాడు. కనుక ఈ పదం సార్థకం ఖాండక్యునకు నిజంగా ఈ పదం అన్వయించదు. అతడు రాజ్యభ్రష్టుడైనాడు గనుక. కృపాళుండు = అధ్యాత్మ విద్య ఈ స్వభావం లేనివాడు చెప్పడు. అందుకనే మహాత్ముడు ఎందేనిన్ = ఎక్కడైన అనటం వల్ల ఇల్లు అడవి కొండ ఏదైనా ఆఉనికి యోగాభ్యాసానికి అను కూలం కావాలి మూలంలో బ్రహ్మలయం= తెలుగులో శ్రీవైష్ణవం లయమంగీకరించక సాధర్మ్యాదులే చెప్పింది కనుక ఈ మార్పు గొప్పది బ్రహ్మసాధర్మ్యం. బ్రహ్మతో అత్యంతసామ్యం.

విద్యాంశ

ఆ. ప్రాణికోటి కెల్ల బంధంబు మోక్షంబు
చేరుటకును మనసు కారణంబు;
విషయసంగి యైన, విను బంధకారి; ని
ర్విషయ మైన, ముక్తి విభవకారి. 73

ప్రాణికోటికిన్‌, ఎల్లన్‌ = అన్ని జీవరాసుల సమూహానికి; బంధంబున్‌ = సంసారమన్న ప్రవాహంలో కొట్టుకు పోవడము; మోక్షంబున్‌ = ఆ సుడిలో చిక్కుకోకుండా విడివడి పోవటానికీ; చేరుటకును = అస్థితులు పొందటానికి; కారణంబు = హేతువు; మనసు= నేను నాది యన్న అజ్ఞానంతో వ్యామోహము పొందే ఆలోచనలు కలిగించేది; విను = జాగ్రత్తగా విను; విషయసంగియైనన్‌ = బాహ్యవస్తువుల ఆకర్షణకు లోబడితే, బంధకారి= బంధహేతువు; నిర్విషయ మైనన్‌ = విషయాసక్తి త్యజిస్తే; ముక్తి విభవకారి = మోక్షమన్న ఐశ్వర్యాన్ని కలిగించేది.

తా॥ సర్వజీవకోటికి విషయాసక్తి వల్ల మనస్సే బంధాన్ని కల్పిస్తుంది. విషయాసక్తిని త్యజిస్తే అమనస్సే మోక్షానికి హేతువవుతుంది. అంటే జీవాత్మకు పరమాత్మకు మధ్య ఒకగోడలాగా మనస్సు నిలబడి రెంటిని వేరు చేస్తున్నది అని తాత్పర్యం. ఈ విషయం భగవత్‌ గీతాది దివ్యగ్రంథాలలో మాటి మాటికి చెప్పబడ్డది.

*శ్లో॥ ''మన ఏవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయోః'' (గీత)*

ఈ *గీతాపాదంలో కలిపి - బంధాయవిషయాసంగిముక్త్యైవ నిర్విషయంమనః* - విష్ణుపురాణం.

సీ. విజ్ఞానమునఁ జేసి విషయాదివలన నె
 మ్మన మాహరించి బ్రహ్మము c బరేశుఁ
జింతింపవలయు నిశ్శ్రేయసంబున; కట్లు
 చింతింప నతఁడు తచ్చింతకునకు
నాత్మభావం బిచ్చు, నాకర్షకము వికా
 ర్యశ్మసారము c దార్చునట్లు; యోగ
మన, యమాదివిషయ కంబైన యాత్మప్ర
 యత్నంబున కధీనయైన సాత్త్వి

తే॥ కపుమనోగతి యెయ్యది గలదు దాని
బ్రహ్మ సంబంధినిఁ గఁ జేయు ప్రౌఢి సూవె;
యిట్టి వైశిష్ట్యధర్మ మెందేని గలుగు
నట్టి యోగంబు గలిగిన యతఁడె యోగి. 74

1. నిశ్శ్రేయసంబునకున్‌ = ముక్తికి; విజ్ఞానమునన్‌+చేసి = విశిష్టమైన ఆత్మజ్ఞానంతో; నెమ్మనమున్‌= నిండుమనస్సుతో; విషయ+ ఆదివలనన్‌ = జ్ఞానేంద్రియాలకు ఆధారమైన ప్రాపంచిక విషయాల నుండి; ఆహరించి = ఉపసంహరించి; బ్రహ్మమున్‌ = బ్రహ్మపదార్థమైన; పర+ ఈశున్‌ = సర్వమునకు ఈశ్వరుడైన వానిని ; చింతింపన్‌ వలయు = ధ్యానించాలి.

తా॥ ముక్తి కోసం అధ్యాత్మ విజ్ఞానంతో మనస్సు బాహ్య విషయ ఆకర్షణను లోపలకు కుదించి పరమాత్మయైన సర్వేశ్వరుని నిత్యము ధ్యానించాలి. విజ్ఞానం = చిదచిదీశ్వరస్వరూప వైలక్షణ్య వివేకం.

2. అట్లుచింతింపన్ = ఆవిధంగా ధ్యానిస్తే; అతడు = పరమేశ్వరుడు; తత్+ చింతకునకున్ = ధ్యానం చేసే వానికి; ఆత్మభావంబున్ = తనస్థితిని లేదా స్వభావాన్ని; ఇచ్చున్ = అనుగ్రహిస్తాడు; ఆకర్షకము= సూదంటురాయి; వికారి = వస్తురూపకంగా పరిణమించిన; అశ్మ = రాతియొక్క; సారమున్ = సారమైన ఇనుమును; తార్చునట్లు= తారసిల్ల జేసినట్లుగా

**తా॥** ఆ విధంగా ధ్యానించిన వానికి పరమాత్మ తనస్వరూపాన్ని అనుగ్రహిస్తాడు. ఎలాగంటే సూదంటు రాయి ఖడ్గాది రూపంగా పరిణమించిన ఇనుమును ఆకర్షించినట్లుగా. పరమాత్మ సాధర్మ్యం కల్గి తరిస్తాడనితాత్పర్యం *''ఆత్మభావంనయత్యేనం -త(ద్బ)హ్మధ్యాయినంమునిం వికార్యమాత్మ- నశ్శక్త్యాలోహమాకర్షకో యథా. (వి.పు)*

**అలం :** దృష్టాంతము.

3. యోగము అనన్ = యోగమంటే యమాది విషయకము. యమనియమాది సంబంధమైన; ఆత్మప్రయత్నకంబునకున్ = ఆత్మదర్శన ప్రయత్నానికి; అధీనయ్యైన = లోబడిన దైన; సాత్త్విక = సత్త్వగుణసంబంధమైన; మనోగతి = మనస్సుయొక్క చలనము; ఏయ్యది = ఏది; కలదు = కలదో; దానిన్ = ఆ మనోగతిని; బ్రహ్మసంబంధిగన్ = పరమాత్మ ధ్యేయంగా; చేయు = చేసే; ప్రౌఢిసూవే = కౌశలమే సుమా !

**తా॥** యోగమంటే వివరిస్తున్నాను. విను. యమనియమాదుల వల్ల స్వచ్ఛమైన మనోగతిని బ్రహ్మవైపునకు మళ్లించే నేర్పు. యమ - నియమ- ఆసన - ప్రాణాయామ-ప్రత్యాహార ధ్యాన-ధారణ-సమాధులు అష్టాంగాలు.

4. ఇట్టి = ఇలాంటి; వైశిష్ట్య ధర్మము = విశిష్టమైన లక్షణము; ఎందేనిన్ = ఎక్కడైనా సరే; కలుగున్ = ఉన్నదో; అట్టి = అలాంటి; యోగంబు = యోగము; కలిగిన యతడె; యోగి = సాధకుడు.

**తా॥** సాత్త్వికమైన మనస్సును బ్రహ్మకు ఉన్ముఖంగా మళ్లించటమన్న చాతుర్యము ఎక్కడున్నా ( ఏసాధనలో ఉన్నా) దానినే యోగమంటాము. అదికల వాడే యోగి.

**విశే ॥** సాత్త్విక = సత్త్వగుణ లక్షణాలు సంతోషం, సుఖం, ప్రకాశం, మొ॥ నవి. రజస్సు; రజోగుణం = ప్రాకృతిక ఉద్రేకాలు పొందేవి.

తమోగుణం = వ్యామోహాత్మకమైనది, జడత్వం.

ఈ విషయమంతా యోగశాస్త్రాదులలో చెప్పబడినా చెప్పేతీరులో వక్త యొక్క పరిపక్వత స్పష్టపడుతున్నది. చెప్పడంలో ఒక హేలాగతి ఒక క్రీడాలక్షణం భాసిస్తున్నది. ఇతరులెవరైనా ఇలాంటి విషయాలు చెబితే దురవ గాహమై తల నొప్పి కలిగిస్తుంది. కాని యీకవి చెప్పటంలో ఒక తెలిసిన లక్షణం ఉన్నందువల్ల అవలీలగా చెప్పడం పాఠకునకు సుబోధకమై ఒక కావ్యధర్మం ఏర్పడుతున్నది.

వ. 1) మఱియు, బ్రహ్మచర్యాదులగు యమంబు లేనును, స్వాధ్యాయాదులగు నియమంబు

లేనును, నిష్కాముండై యోగి యగువాఁడు మనోనైర్మల్య సంపాదనకు నాచరింపవలయు; నివి కామ్యంబులైన విశిష్టఫలదంబులు; నిష్కాములకు ముక్తిదంబులగు;

2) నట్టి యమ నియమంబులు వదలక భద్రాసనాదులందు నొకటి నవలంబించి ప్రాణాభిధానంబగు పవనంబు నభ్యాసవశంబున వశంబు సేయవలము; నదియె ప్రాణాయామ మనంబడు; నట్టి ప్రాణాయామంబు సబీజ అబీజ సంజ్ఞలం బరఁగు; నదియె ప్రాణాపానంబుల మిథోనురోధంబుల నుభయ నిరోధనంబున రేచకాది త్రైవిధ్యంబునుం బొందు.

3) మొదల నాచెప్పిన సబీజ అబీజ సంజ్ఞలందు నంతస్స్వాల రూపావలంబి యగునదియ సబీజం బితరం బబీజంబు; మఱి శబ్దాదివిషయంబులం బ్రవణంబులగు నింద్రియంబులం ద్రిప్పి మానసంబున కధీనంబులు సేయుట ప్రత్యాహారం; బిట్టి ప్రత్యాహారంబు ముముక్షున కవశ్య కర్తవ్యంబు; దీనివలన నతి చంచలంబులగు నింద్రియంబులకు నాత్మవశ్యత గలుగు; నివిగన వశ్యంబులు గాకుండిన నాయోగి యోగసాధకుండు గానేరండు; ప్రాణాయామంబునఁ బవనంబులు, ప్రత్యాహారంబున నింద్రియంబులు వశంబులైన పిమ్మటఁ జిత్తంబు శుభాశ్రయంబునం దిడునది'' యనుటయు ఖాండిక్యుఁ డిట్లనియె. 75

1. బ్రహ్మచర్య+ ఆదులు = బ్రహ్మచర్యము మొదలైనవి; యమంబులు = అహింస మొదలైనవి; ఏనును = ఐదున్ను (అహింస, సత్యము, దొంగతనము చేయ కుండటం, బ్రహ్మచర్యము, దానం తీసుకోక పోవటం); స్వ+అధ్యాయ = వేదపఠనము, ఓంకారజపము; ఆదులు = మొదలైనవి; నియమంబులు = సంతోషాదులు; ఏనును = ఐదున్ను (శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానము); నిష్కాముండై = ఫల దృష్టి లేని కర్మలు కలవాడై; మనోనైర్మల్య = చిత్తశుద్ధియొక్క; సంపాదనకున్ = సంపాదించడానికి, ఆచరింపవలయున్ = చేయవలెను; ఇవి = ఈ యమనియమాదులు; కామ్యంబులు+ ఐనన్ = ఫలితం కోసం చెయబడినవైతే; విశిష్ట ఫలదంబులు = విశేష ఫలితాలను ఇచ్చేవి; నిష్కాములకున్ = కోర్కెలు లేనివారికి; ముక్తిదంబులు = ముక్తిని యిచ్చేవి.

తా॥ బ్రహ్మచర్యంతో కూడిన ఐదు యమములు, స్వాధ్యాయం మొదలైన నియమాలు ఐదును యోగియైనవాడు చిత్తశుద్ధి కోసం అనుష్ఠించాలి. ఇవి ఫలితం కోరి చేస్తే విశిష్ట ఫల స్వరూపాలుగా అనేక శక్తులు సిద్ధిస్తాయి. కోర్కెలు లేక పోతే ముక్తి నిస్తాయి. యమ నియమాదుల అభ్యాసం చేత అనేక రకాల శక్తులు వస్తాయని యోగ శాస్త్రం చెబుతుంది. ఈ శక్తులు. సిద్ధులు ముక్తినివ్వవు. కనుకనే పైవిధంగా చెప్పబడింది.

2. భద్ర+ ఆదులు = భద్ర అన్న పేరుగల ఎనభైనాలుగు ప్రధాన ఆసనాలు; అవలంబించి = ఆశ్రయించి; ప్రాణ+అభిధానంబు = ప్రాణమన్న పేరుగలది; పవనంబున్= గాలిని; అభ్యాసవశంబునన్= నిత్యము అభ్యాసము చేయడం వల్ల; వశ్యంబు = లోబడిన దానిగా; ప్రాణ+ ఆయమము =

ప్రాణనిరోధము; సబీజ = బీజము కలది; నిర్బీజ = బీజము లేనిది; సంజ్ఞలన్ = పేర్లతో; పరగున్ = ఒప్పుచున్నది; ప్రాణ+అపానంబుల = ప్రాణవాయువు; అపానవాయువు; మిథః = పరస్పరము; అనురోధంబులన్ = నిరోధించడం వల్ల; ఉభయ = రెంటి యొక్క నిరోధంబునన్ = నియమించుట వల్ల; రేచక+ ఆది = రేచకము = గాలిని బయటకు విడవడం, పూరకం = లోపలికి పీల్చడం; కుంభకం = పీల్చినగాలిని లోపలే బంధించడం, ఈ మూడు ఆదిశబ్దంతో చెప్పబడు తున్నది. త్రైవిధ్యంబునున్ = మూడుస్థితులను; పొందున్ = పొందుతాయి.

తా॥ భద్రాసనాదులలో ఏదో ఒకటి అవలంబించి ప్రాణాయామం చేయాలి. ఈ ప్రాణాయామాలలో బీజము, నిర్బీజము అని రెండు రకాలు. ప్రాణవాయువుతో అపాన వాయువును దీనితో దానిని పరస్పరం నిరోధించడం ద్వారా రెంటినీ కలిపి రేచక పూరక కుంభకాలన్న మూడు విధాలుగా అవుతుంది.

3. స్థూలరూప అవలంబి = భౌతిక రూపాన్ని ఆధారం చేసుకొని ధ్యానించేది; సబీజము = ఆధారము కలది; ఇతరంబు = ఆవిధంగా ధ్యానానికి ఆశ్రయము లేనిది; నిర్బీజంబు = బీజము లేనిది; మరి = ఇంకా; శబ్ద+ ఆది = శబ్దము, స్పర్శ, రూప, రస, గంధాలు అన్న పంచ భూతాల యొక్క గుణాలు; విషయంబులన్ = ఇంద్రియాలకు లక్ష్యాలైన వాటిపై; ప్రవణంబులు + అగు = తత్పరత కలవైన ( ఆసక్తి కలవి); ఇంద్రియంబులన్ = నేత్రాదులను; త్రిప్పి = లోపలికి మళ్ళించి; మానసంబునకున్= మనస్సుకు; అధీనంబులు = లోబడినవి; ప్రత్యాహారంబు = ఇంద్రియాలకు బయటకు పోకుండా మనస్సునకు అధీనం చేయడం; ముముక్షునకున్= ముక్తిని కోరే వానికి; అవశ్య = తప్పనిసరిగా; కర్తవ్యంబు = చేయదగినది; అతి చంచలంబులు = మిక్కిలి చపలములైన; ఇంద్రియంబులకున్; ఆత్మవశ్యత = ఆత్మకులోనగుట

ఇవి = ఈ యింద్రియాలు; కనన్ = చూడగా; వశ్యంబులు కాకుండినన్ = లోబడక పోతే; యోగసాధకుండు = యోగాభ్యాసి; కానేరండు = కాడు; ప్రాణాయామంబునన్= ప్రాణా యామం వల్ల; పవనంబులున్ = వాయువులు, ప్రత్యాహారంబులన్ = ప్రత్యాహారము వల్ల; ఇంద్రియంబుల్ = ఇంద్రియాలున్ను; వశ్యంబులు = లోబడినవి; ఐనపిమ్మటన్ = ఐనతర్వాత; చిత్తంబు = మనస్సును; శుభ+ ఆశ్రయంబునందున్ = శుభ ంకరమైన ఆధారముపై; ఇడునది = కేంద్రీకరించాలి .

తా॥ మనస్సులో స్థూలమైన దేవతా విగ్రహాన్ని ఆధారంగా పెట్టుకొని ధ్యానం చేయడం సబీజమని, ఆధారం లేకుండా చేసేది నిర్బీజమని అంటారు. బాహ్య విషయాలపైకి ప్రసరించే ఇంద్రియాలను లోపలికి త్రిప్పడం ప్రత్యాహారం. దీనివల్ల మిక్కిలి చపల స్వభావం గల ఇంద్రియాలు ఆత్మకులోబడిన వౌతాయి. మోక్ష వాంఛ గలిగిన వానికి ఈ ప్రత్యాహారం తప్పనిసరిగా అభ్యసించదగినది. ఇంద్రియాలు వశ్యముగాని యోగాభ్యాసముండదు. ప్రాణాయామంవల్ల ప్రాణశక్తి నియమం కలుగుతుంది. ప్రత్యాహారం వల్ల ఇంద్రియ జయం సిద్ధిస్తుంది. ఈ విధంగా శుద్ధమైన చిత్తానికి శుభమైన ఆశ్రయాన్ని అనుసంధించాలి.

కం. మనమున కెద్ది శుభాశ్రయ
మనఘ ! యెఱింగింపు; మఱి సమస్తాధారం

బనఁ జను యద్వస్తువు? య
న్మనన మశేషోరుదుఃఖ మండలిఁ జెఱుచున్. 76

అనఘ ! = పాపరహితుడా! (పాపము = మనోగతి వక్రంగా ఉండటం) ; మనమునకున్= మనస్సుకి; ఎద్ది = ఏది; శుభ+ ఆశ్రయంబు = మంగళమైన ధ్యేయవస్తువు; ఎఱిగింపుము= స్పష్టం చేయి; సమస్త ఆధారంబు+ అనన్ = అన్నిటికీ ఆధారమైనదని; యత్ = ఏవస్తువు; చనున్ = చెప్పజనునో; యత్+మననము = దేని చింతన; అశేష = సమస్తమైన; ఉరు = గొప్ప; దుఃఖ = శోకాల యొక్క; మండలిన్ = గుంపును; చెరచున్ = పోగొడుతున్నదో?

తా॥ పుణ్యాత్ముడా! ప్రాణాయామం వల్ల పరిశుద్ధమైన మనస్సుకు ఏదిమంగళమైన ఆశ్రయము, ఏది అన్నింటికీ ఆధారము, సమస్త దుఃఖరాశిని నాశనం చేసేది ఏదో దాన్ని వివరించు.

తే॥ అనినఁ, గేశిధ్వజుఁడు వాని కనియె; 'బ్రహ్మ
మాశ్రయంబు మనంబున; కదియ పరము
నపరము ననంగఁ బొలుచు; నం దపర మనఁగ
మూర్తము, పరం బనంగ నమూర్త మనఘ ! 77

బ్రహ్మము = పరమాత్మ; (బృహత్ = విస్తారము, బ్రహ్మమంటే అనంతమైన ఆకాశ ంలాంటిది); పరము = శ్రేష్ఠము; అపరము = శ్రేష్ఠముకాని క్రిందిది; అపరము+ అనగన్=పరముకానిది అంటే; మూర్తము , మూర్తి = దేహంగలది; అమూర్తము = మూర్తిలేనిది.

తా॥ అని ఖాండిక్యుడు ప్రశ్నిస్తే కేశిధ్వజుడు అన్నాడు. 'మనస్సునకు శుభాశ్రయము బ్రహ్మమే. అది రెండు రకాలు. ఒకటి సగుణ బ్రహ్మము అంటే శరీరము కలది. ఇదే అపరము అని పిలువ బడుతుంది. మూర్తి లేనిది పరము'

మ. మును నాచెప్పిన రెంటిలోఁ బర మనన్ ముక్తాత్మ; దూరం బుపా
సనఁ గావింప నమూర్త; మింక పరసంజ్ఞం; బబ్జగర్భాది బ
ద్ధనికాయం బది మూర్త మైనను బరిత్యాజ్యంబు శశ్వత్త్రిభా
వనలం గూడుట నారురుక్షున కసేవ్యం బీ ద్వయంబు న్నదన్. 78

మును = ఇందాక; నా చెప్పిన = నేను చెప్పిన; రెంటిలోన్ = రెండింటిలో; పరము+ అనన్= పరబ్రహ్మమంటే; ముక్త+ ఆత్మ = కేవల ఆనంద స్వభావ కమైన బ్రహ్మము (సృష్టి కార్యముతో సంబంధము లేనిది); దూరంబు = మనిషి కందనిది; ఉపాసన కావింపన్ = ఉపాసించడానికి ( ఉప+ ఆసన = దగ్గర ఉండటం, కాని ఈ మాట జప, తప, పూజాదులన్న అర్థంలోనే ఉన్నది.) అమూర్తము = మూర్తి లేనిది; ఇంత + అ పరసంజ్ఞంబు అపరమన్న పేరుగలది; అబ్జ గర్భ+ ఆది = పద్మగర్భుడు అంటే బ్రహ్మ, మొదలైన బద్ధని కా యంబు = బంధింప బడియున్న జీవుల సమూహము కలది; అది = అపరం;మూర్తము+ ఐనను = శరీరం కలదైన; పరిత్యాజ్యంబు = పరిత్యజింపదగినది; ఈద్వయంబున్ = ఈ రెండున్నూ;

ఎవనికిన్ = ఎవరికి, ఆ రురుక్షునకున్ = పైకి ఎక్కగోరే ముముక్షువునకు; శశ్వత్ = మాటిమాటికి; త్రిభావనలన్ = మూడు భావనలతో; కూడుటన్ = సమ్మిళితమైనందున; అసేవ్యంబు = ఉపాసన యోగ్యము కానిది

తా॥ ఇందాక నేను చెప్పిన రెంటిలో పరము కేవల సచ్చిదానంత్మకమై సృష్టికి దూరంగా ఉన్నందువల్ల, ఉభయార్థమైనందు వల్ల, ఉపాసన కందదు. రెండవదైన అపరమన్నపేరు గల బ్రహ్మము ఉపాసన పనికొస్తుంది కాని అది బ్రహ్మాది బద్ధ జీవులే శరీరంగా కలది. ఐనందున ఉపాస్యం కాదు. చివరికి ఈ రెండు త్రిభావనా సహిత మైనందున ముముక్షువునకు పరిత్యజింపదగ్గవే. అమూర్త నివరణగా శ్రీభాష్యంలో ''ప్రత్యస్త మితభేదంయద్ - సత్తామాత్రమగోచరం వచనా, ఆత్మసంవేద్యం-తద్జ్ఞానం బ్రహ్మసంజ్ఞితం'' దేవమనుష్యాది రూపాలు లేనిదే-సత్తామాత్రమైనదీ- స్వయంప్రకాశమై - ప్రకాశించునదీ-జ్ఞానాత్మకమైనదీ బ్రహ్మము.

వ. ఆ భావనాత్రయం బెద్ది యనినం జెప్పెద –

1) బ్రహ్మభావనయుం గర్మభావనయు బ్రహ్మకర్మోభయభావనయు; నందు బ్రహ్మభావనాయుతులు సనందనాదులు, దేవాది స్థావరావరులగు ప్రాణు లంద అు కర్మభావనాభావుకులు, హిరణ్యగర్భాదు లుభయభావనాపరు; లీ మూఁడు తెఱంగులవారు భావనాత్రయాన్వితులు గావున నీ త్రివిధాత్మక రూపం బసేవ్యంబు; సనందనాదులునుం బ్రాగ్బ్రహ్మకల్పంబుల సంసరించుట భావనా బద్ధులై; ఇబ్భావనాత్మకం బగు విశ్వంబు సంస్థితికి నవధి; దేవమనుష్యాది విశేషజ్ఞాన కర్మంబులు క్షీణించుటయ.

2) యట్టి విశ్వంబై తోచు హిరణ్యగర్భాదులకంటె నన్యంబు పరాఖ్యం; బిది ముక్తరూపం బమూర్తంబై యుండు నని మొదల సూచించితింగదా; తదాకారంబుఁ దేటపఱిచెద; పూర్వోక్త దేవాది భేదరహితంబై తద్భేదరాహిత్యంబున నిట్టి దట్టి దని వచించుటకు గోచరంబు గాక యపక్షయాది రహితంబును సచ్ఛబ్ద వాచ్యంబును నాత్మసంవేద్యంబునునై, జ్ఞానైకనిరూపణీయం బగుచు జ్ఞాన శబ్దవాచ్యంబునుం దానయై బ్రహ్మాత్మకం బగుట బ్రహ్మసంజ్ఞయుం గాంచి యొప్పు;

3) మఱి భావనాత్రయాత్మక విశ్వ వైలక్షణ్యంబె లక్షణంబుగాఁ గల యీ రూపం బభ్యస్యమానయోగుండగు యోగికిం జింతింప నశక్యంబు; మఱి యపరం బని చెప్పంబడిన హిరణ్యగర్భుండు, వాసవుండు ప్రజాపతులు, మరుత్తులు, వసువులు, రుద్రులు, ఆదిత్యులు, తారకంబులు, గ్రహంబులు, గంధర్వ, యక్షరక్షో దైత్యాదిసమస్త దేవయోనులు, మనుష్యులు, పశువులు, అద్రులు, సముద్రంబులు, ద్రుమంబులు, వెండియు నేకపాద, ద్విపాద, బహుపాదాపాదంబులగు నితర భూతంబులుం దదుత్పత్తి హేతువులుగా విలసిల్లు నట్టి ప్రధానాది విశేషాంత చేతనా చేతనాత్మక ప్రపంచభావం బగు స్థూలరూపం బుపక్రాంతయోగునకుఁ జింతింప శక్యంబు;

4) శక్యమేనియుఁ దద్భావనాత్రయాత్మకం బగుట నశుభాశ్రయంబు గావున ముక్తిసాధనంబుగా, దీ చెప్పబడిన సకల ప్రపంచంబును విష్ణుశక్తి సమన్వితంబై యతనికి శరీరంబు నైయుండు; నట్టి విష్ణుశక్తులు మొదల నేఁ జెప్పిన పరాపరాఖ్యలను దదతిరిక్తయగు కర్మాఖ్యనుం ద్రివిధంబులై యుండు; నందుఁ గర్మాఖ్య శక్తిచేత వేష్టితయై యపరాఖ్య యగు క్షేత్రజ్ఞశక్తి జన్మ జరా మరణాద్యనేక సంసార తాపంబులనుభవించుచుఁ దత్తత్కర్మానుగుణశరీరంబు లెత్తి తారతమ్యంబుల నొందుఁ, దత్ప్రకారం బాకర్ణింపుము. 79

1. బ్రహ్మభావనయు = బ్రహ్మమును భావించుట; కర్మభావనయున్ = వైదిక కర్మలను భావించడం; ఉభయ భావనయున్ = కర్మ, బ్రహ్మ, భావన (ఈ మూడింటిని భావనాత్రయం అని అంటారు); సనందన+ఆదులు = సనందనుడు మొ॥గు మహాయోగులు; బ్రహ్మ భావనాయుతులు = ముక్తాత్మను భావించేవారు; దేవ+ఆది = దేవతలు మొదలైన; స్థావర = జడములైన; అవరులు = శ్రేష్ఠులు కానివారు; కర్మభావనా= కర్మభావనను; భావుకులు= భావించేవారు; హిరణ్యగర్భ+ఆదులు = హిరణ్యగర్భుడు మొదలగువారు; ఉభయ భావనాపరులు = కర్మ, బ్రహ్మ భావన చేసేవారు, ఈ మూడు పద్ధతులున్నవారు; భావనాత్రయ+అన్వితులు = మూడుభావాలతో కూడుకొన్నవారు; కావునన్ = కాబట్టి; త్రివిధ+ఆత్మక = ఈ మూడు తెగలుగా ఉన్న; రూపంబు = మూర్తి; అసేవ్యంబు = శుభాశ్రయం కానిది కనుక సేవించదగనిది; సనందన+ఆదులునున్=సనందనుడు మొదలగువారున్నూ; ప్రాక్ = ముందరి బ్రహ్మకల్పంబులన్ = సృష్టులందు; సంసరించుటన్ = సంసారబద్ధులైనందువలన; భావనాబద్ధులే = భావనకు కట్టుబడినవారే; భావన+ఆత్మకంబు = భావనయే స్వరూపమైనది; విశ్వంబు = సమస్తలోకము; సంస్థితికిన్ = చక్కని స్థితికి; అవధి = మేర, సరిహద్దు; మనుష్య+ఆది = మనుష్యులు మొదలైన; విశేష = ఇతర ప్రాణులు; జ్ఞాన కర్మంబులు; క్షీణించుటయ = నశించడం.

తా॥ బ్రహ్మ, కర్మ, బ్రహ్మ కర్మ భావనలు మూడు భావనాత్రయంగా చెప్పబడుతున్నాయి. బ్రహ్మ భావన చేసినవారు సనందనాదులు. దేవతలు మొదలుగా జడపదార్థము తుదిగా ఉన్న సర్వజీవులు కర్మభావన చేసేవారు. బ్రహ్మాదులు ఉభయ భావనాపరులు. ఈ త్రిభావనతో కూడుకున్నవారు కనుక ఈ త్రివిధాత్మక రూపము ఉపాసనకు పనికి రాదు. సనందనాదులు కూడా పూర్వకల్పాల్లో జనన మరణ రూప జీవితంలో సుడి తిరిగిన వారే గనుక వారున్నూ భావనా బద్ధులే. దేవతలు మనుష్యులు మొదలైన సకల జీవరాసుల యొక్క జ్ఞాన కర్మలు రెండూ నాశనం కావటమే విశ్వస్థితికి చివరి హద్దు.

భావన=ప్రయత్నం. కర్మలనుభావించేవారు- బ్రహ్మభావనచేసినవారు-రెంటిని అనుష్ఠించేవారు భావనాత్రితయాన్వితులు.

2. హిరణ్యగర్భ+ ఆదులు = బ్రహ్మమొదలగువారు; అన్యంబు = వేరైనది; పర+ ఆఖ్యంబు = పరమన్న పేరుగలది; ముక్తరూపంబు = రూపములేని ముక్తాత్మ; అమూర్తంబు = శరీరము లేనిది; తత్+ ఆకారంబు = దాని స్వరూపము; తేట పరచెదన్= స్పష్టం చేస్తాను; పూర్వ+ ఉక్త = ముందు

చెప్పబడ్డ; దేవ+ ఆది = దేవతలు మొదలుగాగల; భేద రహితంబై = భేదము లేనిదై; తత్+ భేద రాహిత్యమునన్ = ఆ భేదము లేకపోవటం వల్ల; ఇట్టిది అట్టిది = ఇలాంటిది, అలాంటిది; గోచరంబు గాక = తెలియనిదై; అపక్షయ+ ఆది = క్షీణించటం మొదలగునవి; రహితంబునున్ = లేనట్టిది; సత్+ శబ్దవాచ్యంబునున్ = సత్తు ( ఉండటం, ఉనికి) అన్న శబ్దంతో చెప్పదగినది; బ్రహ్మ+ ఆత్మకంబు = బ్రహ్మస్వభావము ; సంజ్ఞ = పేరు.

తా॥ విశ్వంగా పరిణమించే బ్రహ్మ మొదలైన వారికంటె వేరైనది పరము. అది ప్రకృతి కంటె దూరంగా ముక్తమై మూర్తి లేనిదై ఉంటుందని ముందే సూచించాను గదా! దాని స్వరూపం వివరిస్తాను. ముందు చెప్పిన దేవతలకంటె భేదము లేనిదై ఆ భేదం లేక పోవడం వల్ల నిరూపించడానికి అశక్యమై క్షీణించటం మొదలైన గుణాలు లేనిదై సత్ అన్న శబ్దానికి అర్థమై ఆత్మ కందేదై ప్రధానంగా జ్ఞానంతో నిరూపంచదగ్గదై, జ్ఞాన శబ్దమునకు అర్థమై బ్రహ్మాత్మకం కావడం వల్ల బ్రహ్మమన్న పేరు గల్గి వర్తిస్తున్నది.

3 భావనాత్రయాత్మక = మూడు భావనలతో కూడిన; విశ్వ = విశ్వము యొక్క; వైలక్షణ్యంచే= విరుద్ధమైన లక్షణమే లక్షణముగా గల ఈ రూపంబు; అభ్యస్యమాన = అభ్యసిస్తున్న; యోగుండు = యోగము గలవాడు; అపరంబు = పరము కానట్టిది; వాసవుండు = ఇంద్రుండు; ప్రజాపతులు = సృష్టికర్తలు; మరుత్తులు = వాయువులు; వసువులు = ఒక తెగ దేవతలు ఎనిమిది మంది; రుద్రులు = ఏకాదశ రుద్రులు; ఆదిత్యులు = పంద్రెండు మంది సూర్యులు; తారకంబులు = నక్షత్రాలు; గ్రహంబులు = నవగ్రహాలు; గంధర్వ = ఒక తెగదేవతలు; యక్ష రక్షోదైత్య+ అదులు = రాక్షసులలో తెగలు; అద్రులు = కొండలు; ద్రుమంబులు = చెట్లు; ఏకపాద = ఒకే పాదం కలది; ద్విపాద = రెండు పాదాలు గలది; బహుపాద = అనేక పాదాలు గలది; అపాదంబులు = పాదాలు లేనివి; ఇతర = వేరైన; భూతంబులున్ = జీవరాశులు; తత్+ ఉత్పత్తి = ఆ పుట్టుకే ; హేతువులును గాన్ = కారణాలుగా; ప్రధాన + ఆది = ప్రకృతి మొదలుగా; విశేష+ అంత = ఒక్కొక్క వ్యక్తియందు ప్రత్యేకంగా ఉండే గుణాలు తుదిగా; చేతన = కదిలేవి; అచేతన = కదలనివి; ఆత్మక = స్వరూపంగా గల; ప్రపంచ భావంబు = ప్రపంచముయొక్క స్వరూపమే స్వరూపంగా గల; స్థూల రూపంబు = కంటికి కనిపించే భౌతిక ఆకారం గలది; ఉపక్రాంత= ప్రారంభింప బడ్డ; యోగునకున్ = యోగము గలవానికి; చింతింపన్ = మననం చేయడానికి; శక్యంబు = వశ్యమైనది.

తా॥ భావనాత్రయాత్మకమైన విశ్వముకంటె భిన్న లక్షణం గల పరబ్రహ్మము. అభ్యాసయోగికి ధ్యానానికి అశక్యమైనది. అపరమని చెప్పబడ్డ హిరణ్యగర్భాది దేవతలు, సూర్యచంద్రాది గ్రహాలు, గంధర్వ, యక్ష దైత్యాది సమస్త దేవ జాతులు, మనుష్యులు, పశువులు, కొండలు, సముద్రాలు, చెట్లు, ఏకపాత్తులు, ద్విపాత్తులు, బహుపాత్తులు, ఈ మొదలైన సకల జీవ రాసులయొక్క జన్మలకు కారణంగా ప్రకాశించే ప్రకృతి మొదలుగా గల ప్రతి ప్రత్యేక గుణాత్మక జీవి చివరగా ఉన్నా చేతనాచేతన మైన స్థూల రూపమైన ప్రపంచ భావన యోగాభ్యాసం ప్రారంభించిన వానికి భావించడానికి శక్యమౌతుంది.

4. శక్యము+ ఏనియున్ = వీలైన; అశుభ+ ఆశ్రయంబు = మంగళప్రదమైన ధ్యేయంకాదు;

ముక్తిసాధనము = ముక్తికి ఆధారము; తత్+అతిరిక్త = పర, అపర బ్రహ్మలకంటె వేరైన; కర్మ+ ఆఖ్య = కర్మ అన్న సంజ్ఞగల, త్రివిధములు = మూడు; అందున్ = అందులో; వేష్టితమై = ఆవరింపబడ్డదై, క్షేత్రజ్ఞశక్తి= ఆత్మశక్తి; జరా = వృద్ధాప్యం; సంసారతాపంబులు = సంసార దుఃఖాలు; తత్+తత్ = ఆయా; కర్మానుగుణః కర్మకుతగిన; శరీరంబులన్ = దేహాలు; ఎత్తి = ధరించి; విజ్ఞాన= విజ్ఞానంతో; తారతమ్యంబులన్ = భేదభావాలను; తత్+ప్రకారంబు = ఆ విధంబు; ఆకర్ణింపు = విను

తా॥ ఇది వీలైనా మూడు భావాలతో కూడుకొని ఉన్న యోగికి శుభాశ్రయం కాదు. కనుక ముక్తి సాధ్యం కాదు. ఇంతవరకూ చెప్పబడ్డ సకలప్రపంచము విష్ణువునకు శరీరము. అతని శక్తితో కూడుకొని ఉన్నది. ఆ విష్ణువునకు మూడు శక్తులున్నవి. ముందు చెప్పిన ఒక పర, రెండు అపర, మూడు కర్మ సంజ్ఞలు గలది. ఇందులో కర్మశక్తితో ఆవరింప బడ్డదై అపరమన్న పేరుగల ఆత్మశక్తిపుట్టుక ముసలితనము, మృత్యువు మొదలైన సంసారతాపాలు అనుభవిస్తూ ఆయాకర్మలకు తగిన రూపాలు ధరిస్తూ విజ్ఞానంతో తరతమ భేదాలు పాలిస్తుంటాయి. ఆ విషయం వివరిస్తాను. విను.

సీ. ఉండు నప్రాణులం దొక్కించు కాశక్తి
స్థావర శ్రేణిఁ దజ్జాతికంటె;
నెఱ్ఱ రోఁకటిబండ జెఱ్ఱి మన్దిండి ము
న్నగు సరీసృపములం దంతకంటె;
ఖగములయం దంతకంటె మృగావలి
యందు నూహింపంగ నంతకంటె మ
దంతి గోముఖ పశుతతి నంతకంటె, మ
ర్త్యకదంబములయం దంత కంటె

తే॥ యక్షగంధర్వ నాగాళి నంతకంటె,
నంతకంటె నిలింపులం దంతకంటె
హరిహయునియందు, దక్షునం దంతకంటె
నాద్యుఁడు హిరణ్యగర్భునం దంతకంటె 80

ఆ శక్తి = క్షేత్రజ్ఞుడు అన్న పేరుగల విష్ణుశక్తి (క్షేత్రము = పదార్థ రూప ప్రకృతి, క్షేత్రజ్ఞుడు ఆత్మ, ఈ రెండు విష్ణు స్వరూపాలే. ఆత్మ ప్రవేశించడంవల్ల ప్రకృతికి గతి ఏర్పడుతున్నది.) అప్రాణులందు = ప్రాణము లేని రాయి, రప్ప మొదలైన; స్థావర శ్రేణిన్= స్థిరంగా ఉండే వాటిలో; ఒక్క+ఇంచుక = ఒక కొంచెం; ఉండున్ = ఉంటుంది; తత్+జాతికంటెన్ = ఆ జాతి కంటే; ఎఱ్ఱ, రోకటిబండ, జెఱ్ఱి; మందిండి = మన్నుతినే పాము. (బురదకట్టె అన్న పాము); మున్నగు = మొదలైన; సరీసృపములందున్= ప్రాకేపాముల్లో; ఖగములందున్ = పక్షుల్లో (అంతకంటే ఎక్కువగా ఉంటుంది); మృగ+ఆవళి = జంతు

సమూహంలో; ఊహింపగన్ = ఆలోచిస్తే; (అంతకంటె ఎక్కువ క్షేత్రజ్ఞశక్తి ఉంటుంది.); దంతి = ఏనుగు; గో = ఆవు; ముఖ = మొదలైన; పశుతతిన్ = పశువుల సమూహంలో (అంతకంటె); మర్త్య = మానవ; కదంబములయందు = సమూహంలో (అంతకంటె); యక్ష, గంధర్వ; నాగ = నాగజాతి; ఆళిన్ = సమూహంలో (అంతకంటే); నిలింపులందున్ = దేవతలలో (అంతకంటే); హరి హయునియందున్ = ఇంద్రునిలో; దక్షునందున్ = దక్షుడన్న ప్రజాపతిలో; ఆద్యుడు= సృష్టికి మొదటివాడైన; హిరణ్యగర్భునందున్ = బ్రహ్మలో

**తా॥** క్షేత్రజ్ఞశక్తి స్థావరాదులలో ఒక కొంచెము వుంటుంది. దానికంటె ప్రాకే జీవ రాసులలో ఎక్కువగా ఉంటుంది. అంతకంటె పక్షులలోనూ; అంతకంటె జంతువులలోనూ; అంతకంటె ఏనుగు, ఆవు మొదలైన గ్రామ్య పశువులలోను, అంతకంటే మనుష్యులలోనూ, యక్షులు, గంధర్వులు, నాగులలోను, అంతకంటే విశేషించి ఉండే యీ ఆత్మశక్తి దేవతల్లో ఎక్కువ. వారికంటే ఇంద్రునిలోను, ఇంద్రునికంటే ప్రజాపతియైన దక్షునిలో అంతకంటె సృష్టికి మొదలువాడైన బ్రహ్మలో ఎక్కువ ఉంటుంది.

విశే॥ డార్విన్ గతశతాబ్దిలో ప్రతిపాదించిన పరిణామవాదం ప్రకారం యాంత్రికంగా భౌతిక పదార్థమే పరిణమిస్తున్నదని చెప్పాడు. కాని ఆధునిక విజ్ఞాన శాస్త్రవాదులు దీనిని అంగీకరించక ఒక విశ్వయజమాని యైన మనస్సు ఆజ్ఞకు లోబడిగతితప్పకుండా పరిణామం, విశ్వగతి సాగుతున్నదని విశ్వమనస్సు [Cosmic Mind]వాదాన్ని ప్రవేశ పెట్టి పదార్థము (రూపము) అంతశ్చైతన్య ప్రేరణతోనే పరిణమిస్తున్నది గనుక యాంత్రిక గతి లేదు అని కొట్టి పారేశారు. ఇంతేకాక నేను (క్షేత్రజ్ఞుడు) నా చుట్టూ ఉన్న ప్రపంచమూ (క్షేత్రము) ఒకే చైతన్య పదార్థముయొక్క రెండు రూపాలని మనస్తత్త్వశాస్త్ర వేత్తలు, విజ్ఞానశాస్త్రవేత్తలు ఈ శతాబ్ది ప్రారంభంలో నిరూపించారు. ఈ విషయం మన దేశంలో ఉపనిషత్ కాలంలోనే వివరింపబడింది కనుక ఈ పద్యంలో చెప్పిన విషయం అత్యంత ఆధునిక శాస్త్రీయ సత్యము. ఇంకా విశేషంగా చూడదలచుకొన్న పండితులు ''శ్రీఅరవిందుల దివ్యజీవన'' మన్న గ్రంథాన్ని చూడవచ్చు.

ఆ. ఇట్టి రూపకోటు లెల్ల నవ్విష్ణుని
తను చయంబు సుమ్ము ధరణినాథ!
యతఁ డచింత్యశక్తి నఖిలభూతముల నా
కసమువోలె నిండి యెసఁగుఁ గాన 81

ధరణినాథ = భూనాథ!; ఇట్టి రూప కోటులు = ఇట్టి రూపసమూహము; ఎల్లన్ = అంతా; ఆ విష్ణుని = పై చెప్పిన విష్ణునియొక్క; తనుచయంబు = శరీర సమూహము; సుమ్ము = సుమీ; అతడు = ఆ విష్ణువు; అచింత్య శక్తిన్ = మానవ మేధాశక్తి కందని శక్తితో; నిఖిల భూతములన్ = సకల జీవరాసుల్లో; ఆకసమువలెన్ = ఆకాశము లాగా; నిండి = పూర్ణమై; ఎసగున్ = విజృంభిస్తున్నది, కానన్ = కాబట్టి.

**తా॥** ఆకాశ మే విధంగా సకల వస్తువులలోనూ, లోపలనిండి బయట ఆవరించి ఉంటుందో అదే విధంగా క్షేత్రజ్ఞశక్తి సకల రూపాలలోనూ నిండి వుంటుంది. ఎందు చేతనంటే అవన్నీ తన శరీరాలే గనుక.

విశే॥ ఆకాశమంటే పరమాణువుల మధ్యనున్న శూన్య ప్రదేశము. అది లోపల, బయట కూడా ఉంటుంది. ఆత్మ కూడా అంతే. తనలో నున్నది జీవాత్మ. విశ్వమంతటా వ్యాపించి యున్నది విశ్వాత్మ, (Universal Self). ఇందుకే ఆత్మ పదార్థాన్ని ఆకాశంతో పోల్చడమే కాకుండా ఆకాశమే అన్న అర్థం గల మంత్రాలు వేద వాఙ్మయంలో చాలా ఉన్నాయి.
'ఖం బ్రహ్మేతి వ్యజానాత్' ఆకాశమే బ్రహ్మమని చెప్పబడుతున్నది. లేదా తెలుసుకో.

సీ. మున్నెన్నిన పరాఖ్యమునకు ద్వితీయమై
విష్ణుసంజ్ఞనకు నుర్వీతలేశ
యోగిహృద్ధ్యేయమై యొప్పు నమూర్త రూ
పం బొండు; సత్సంజ్ఞఁ బ్రాజ్ఞకోటి
దాని వచించు; నేతద్రూపమె సమస్త
శక్తుల కెల్ల నాశ్రయతఁ బొంది
ప్రాగుక్త విశ్వరూపవిలక్షణతఁ గాంచి
కల్యాణగుణ భూతి గరిమఁ దనరి
తే॥ యతిమహత్త్వంబుచే వెల్గు; నట్టి శక్తి
నలరు బ్రహ్మంబు దేవతిర్యఙ్మనుష్య
నామచేష్టావ దవతరణముల నాత్మ
లీల జగదుపకృతికిఁ గల్పించుచుండు. 82

ఉర్వీతల+ఈశ = భూనాథా ! విష్ణు సంజ్ఞనకున్ = విష్ణువన్న పేరు గల బ్రహ్మమునకు; మున్ను = ఇదివరకు; ఎన్నిన = చెప్పిన; అపర+ఆఖ్యమునకున్ = అపరమన్న పేరు గల మూర్త బ్రహ్మమునకు; ద్వితీయమై = రెండవదై; పరమైయోగి+హృత్+ధ్యేయము+ఐ = యోగులకు హృదయంలో ధ్యానించదగినదై; అమూర్త రూపంబు = శరీరం లేని ఆకారము; ఒండు = ఒకటి; ఒప్పును = ప్రకాశిస్తూ ఉన్నది; ప్రాజ్ఞ కోటి = జ్ఞానుల సమూహం; దానిన్ = ఆ ద్వితీయ ఆకృతిని; సత్ సంజ్ఞన్ = సత్తు అన్న పేరుతో; వచించున్ = చెబుతున్నది; ఏతత్ = ఈ రూపమే (ఆకృతియే); సమస్త శక్తులకున్+ఎల్లన్=భగవంతునియొక్క శక్తులన్నిటికీ; ఆశ్రయతన్+పొంది = ఆధారమై; ప్రాక్ = ఇదివరకు; ఉక్త = చెప్పిన; విశ్వరూప = ప్రపంచ రూపమైన బ్రహ్మము కంటె; విలక్షణతన్ = విరుద్ధ లక్షణాలు కలిగివుండటం; కాంచి = పొంది; కల్యాణ గుణ భూతి గరిమన్ = మంగళకరములైన గుణములయొక్క, ఐశ్వర్యంయొక్క అతిశయత్వం చేత; తనరి = ఒప్పుతూ; అతిమహత్వంబు చేన్ = గొప్ప మహిమ గలదై; వెల్గున్ = వెలుగుచున్నది; అట్టి శక్తిన్ = అలాంటి శక్తితో; అలరు బ్రహ్మంబు = అలరారుచున్న బ్రహ్మము; ఆత్మ లీలన్ = తనయొక్క లీలతో; జగత్+ఉపకృతికిన్ = ప్రపంచరక్షణార్థం; దేవ = దేవతలు; తిర్యక్ = జంతువులు; మనుష్య = మానవులయొక్క; నామ చేష్టావత్= పేర్లు, చేష్టలు కలిగిన; అవతరణములన్ = అవతారాలను; కల్పించుచుండున్ = నిత్యము కల్పిస్తూ ఉంది.

తా॥ ఇది వరకు మూర్తమైన అపరమన్న దానికంటె వేరై యోగుల ధ్యానానికి శుభాశ్రయమై అమూర్తమైన మరొక రూపము విష్ణునకున్నది. దానినే పండితులు సత్తు అని వ్యవహరిస్తున్నారు ఈ రూపమే సమస్త శక్తులకు ఆశ్రయమై ఇది వరకు చెప్పిన విశ్వరూపం కంటె విలక్షణమై కల్యాణగుణసంపన్నమై మిక్కిలి మహిమ కలిగి ప్రకాశిస్తున్నది. ఆ మహాశక్తితో వెలిగే బ్రహ్మము లోక రక్షణకై లీలగా దేవ, జంతు, మానవనామ చేష్టలు కల్గిన అవతారాలను కల్పిస్తుంది.

విశే॥ భగవద్గీతలో క్షరపురుషుడు, అక్షరపురుషుడు అని యిద్దరు చెప్పబడ్డారు. విశ్వరూపుడు క్షరుడు. అక్షరుడు కూటస్థుడు. ఈ యిద్దరి కంటె ఉత్తమ పురుషుడు మరొకడున్నాడు. అతడే పరమాత్మ. అతడే సర్వలోక భర్త అని ''ఎప్పుడెప్పుడు ధర్మగ్లాని సంభవిస్తుందో అప్పుడపుడల్ల నేను అవతరిస్తున్నాను.'' అని చెప్పబడింది. ఈ పద్యం లోనూ అదే విషయం ప్రస్తావించబడింది. ఈ మూర్తి మూర్త- అమూర్త విలక్షణమైనది. అప్రాకృత దివ్య మంగళరూపం.

ఈ పద్యంలోనూ, ఇది వరకూ రాబోయే పద్యంలోనూ లీల అన్నమాట పనిగట్టుకొని ప్రయోగించబడింది. ఇది వేదాంత శాస్త్రం లోని సాంకేతిక పదం తప్ప లౌకిక విలాసమన్న అర్థం కలది కాదు. 'లోకవత్తు లీలా కైవల్యం' అని బ్రహ్మ సూత్రాలలో చెప్పబడ్డట్లుగా పరమేశ్వరుడు ఈ సృష్టిని నిర్మించడంలో అన్యప్రయోజనం ఏమీ లేదు. అతనికి అది ఒక క్రీడ ఇందుకని ఈ లీలాశబ్దము ఆ సూత్రదృష్టితో వ్యాఖ్యానింప బడాలి

ఈ పద్యాధారశ్లోకాలు :-

*సమస్తాశ్శ్రయశ్శైతా:- నృపయత్రప్రతిష్ఠితా·*

*తద్విశ్వరూపవైరూప్యం-రూపమన్యత్ హరేర్మహత్*

*సమస్తశక్తిరూపాణి - తత్కరోతి జనేశ్వర*

*దేవతిర్యఙ్మనుష్యాది చేష్టావంతిస్వలీలయా(వి.పు) (చూ· ఈపద్యార్థవివరణకు - తత్త్వోపహారం)*

ఆ. **కర్మభుక్తికొఱకు గా దిట్టి తల్లీల;**
**యతఁడు సకలజాతులందు బుట్టుఁ**
**బుట్టినట్టి యతని భూరిచేష్టితము ల**
**వ్యాహతములు రావణాదివలన** 83

ఇట్టి = ఇలాంటి; తత్+ లీల = అతని లీల; కర్మభుక్తికొఱకున్ = కర్మఫలాన్ని అనుభవించడం కోసం; కాదు; అతడు = విష్ణువు; సకల జాతులందున్ = అన్ని జాతులలోనూ (పై పద్యంలో చెప్పినట్లుగా దేవ, తిర్యక్, మనుష్యాదులలో, పుట్టున్ = జన్మిస్తాడు; భూరి = అతిశయమైన; చేష్టితములు = చేష్టలు; రావణ+ ఆదివలనన్ = రావణాదులయెడల; అవ్యాహతములు = భంగింపబడనివి.

తా॥ ఆ పరమాత్మ అవతరించడం మనవలె కర్మానుభవం కోసం కాదు. అది కేవలం లీల. అతడన్ని జాతులలోను జన్మిస్తాడు. అలా జన్మించిన ఆ పరమేశ్వరుని మహిమాన్విత చేష్టలు అడ్డం లేకుండా రావణాదులందు సాగిపోతున్నాయి.

విశే ॥ భగవద్గీతలో ఇలా చెప్పబడింది.

*న మాం కర్మాణి లింపంతి*
*న మే కర్మఫలే స్పృహా,*
*ఇతి మాం యోఽభిజానాతి*
*కర్మభిః న స బధ్యతే॥* (4-14)

నన్ను కర్మలంటవు. కర్మఫలాసక్తి నాకు లేదు. కనుక నన్ను ఇలాంటి వానిగా ఎవడు తెలుసుకుంటాడో వానికి కర్మబంధం లేదు. సకలజాతులందు- మత్స్యావతారాదులు.

**వ. అట్టి పరమేశ్వరునకు బద్ధముక్తాది రూపంబు లనేకంబులు గలిగిన ముముక్షునకు జ్ఞానసిద్ధికిఁ బరమవ్యూహ విభవాది రూపంబులే చింతనీయంబులు. ప్రజ్వలితశిఖుండగు పవనసఖుండు నీరసనికుంజము నెట్లు దహించు, నట్లు చిత్తస్థుండగు నవ్విష్ణుండు యోగిజనంబుల సకల కిల్బిషంబులు నిర్దహించుఁ గావున సకల శక్త్యాశ్రయుండైన యప్పరమాత్మునియందు ఁ జలాత్మకంబగు చిత్తంబునకుఁ ద్రిభావభావనాతీతుండగు నద్దేవుండు శుభాశ్రయుండై ముక్తికరుండగు; నేతద్వ్యతిరిక్తులగు బ్రహ్మాదిదేవతలు కర్మయోను లగుట నశుద్ధులు గావునఁ జిత్తంబున కవలంబనీయులు గారు; మఱి, నిరవలంబధ్యానంబు పొందుపడదు. గావున ధారణా ధ్యానవిషయంబై శుద్ధంబగు స్థూలరూపాంతరం బయ్యనంతునకుం గలదు. దాని సవిస్తరంబుగా ఁ జెప్పెద నాకర్ణింపుము. 84**

1. బద్ధ ముక్త+ ఆదిరూపంబులు = అపర సంజ్ఞగల బ్రహ్మము, పరసంజ్ఞగల బ్రహ్మము మొ॥న రూపాలు; అనేకంబులు = చాలా; కలిగినన్ = ఉన్నా; ముముక్షునకున్ = మోక్షవాంఛ గల యోగియొక్క; జ్ఞాన సిద్ధికిన్ = ఆత్మజ్ఞాన లబ్ధికి; పరమ = ఉత్కృష్టమైన; తత్త్వం. వ్యూహ = వ్యూహసంబంధమైన; విభవ = అవతారములు; ఆది = మొదలైన; చింతనీయంబులు = ధ్యానింపదగ్గవి.

2. ప్రజ్వలిత శిఖుండు = మండుతున్న నాల్కలున్న వాడు; పవన సఖుండు = వాయువునకు స్నేహితుడైన అగ్ని; నీరస = రసములేని; నికుంజంబున్ = పొదను; ఎట్లు= ఏ విధంగా; దహించున్ = కాలుస్తాడో; అట్లు = ఆదే విధంగా, చిత్తస్థుండు = చిత్తమందున్నవాడు; ఆ విష్ణు ఓడు = ధ్యానింపబడుతున్న పరమాత్మ; సకల కిల్బిషంబులున్ = పాపాలన్నిటిని, నిర్+దహించున్ = దహిస్తాడు.

3. కావునన్ = కాబట్టి; సకల శక్తి+ ఆశ్రయుండు+ అయిన = సకల శక్తులకు నిలయమైన; ఆ+ పరమాత్మునియందున్ = ఆ పరమాత్మలో; చిత్తంబున్ నిల్పుట = మనస్సును కేంద్రీకరించుట; విశుద్ధయగు ధారణ = మిక్కిలి శుద్ధమైన ధారణ; అనంబడు, సర్వసంగంబునన్ = అన్నిటితో ఉన్న సంపర్కంచేత; చల+ ఆత్మకంబు = చలనమే స్వభావంగా గల; చిత్తంబునకున్ = మనస్సునకు; త్రిభావ = మూడు భావాలయొక్క; భావన = ఆలోచనలకు; అతీతుండు = పైనున్నవాడు; శుభ+ ఆశ్రయుండు+ ఐ = మంగళకరమైన ధ్యేయవస్తువై; ముక్తికరుండు+ అగు = మోక్షము నిచ్చేవాడగును.

4. ఏతత్ = దీనికి, వ్యతిరిక్తులు = విరుద్ధులు; బ్రహ్మ+ఆది దేవతలు; కర్మయోనులు= కర్మమే కారణంగా గలవారు; అగుటన్ = కావడం వల్ల; అవలంబనీయులు కారు = ఆశ్రయులు కారు; నిః+ అవలంబ ధ్యానంబు = ఆధారము లేని ధ్యానము; పొందుపడదు = వీలు కాదు; ధారణాధ్యాన విషయంబై = ధారణకు ధ్యానమునకు ధ్యేయమై; స్థూలరూప +అంతరంబు+ అగున్ = స్థూలరూపముకంటే భిన్నమైన దగును.

తా॥ అలాంటి పరమేశ్వరునకు పరాపరాది రూపాలెన్ని ఉన్నా యోగికి ధ్యానయోగ్యమైన వ్యూహచతుష్టయ మందలి సంకర్షణుడు, వాసుదేవుడు; ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు. ఈ నాలుగు రూపాలు కలిపి వ్యూహ మనబడుతున్నది. రామకృష్ణాది అవతారాలు. మండుతున్న అగ్ని యే విధంగా ఎండిన పొదను దహిస్తుందో, అదే విధంగా అంతర్యామి యైన విష్ణుండు యోగుల పాపాలను దగ్ధం చేస్తాడు. కాబట్టి సకల శక్తులకు ఆధారమైన ఆ పరమాత్మలో మనస్సును ఏకాగ్రం చేయడం ధారణ అనబడుతుంది. అన్నిటియందు ఆసక్తి కలిగి చపల స్వభావమైన మనస్సునకు కర్మభావన, బ్రహ్మభావన, ఉభయ భావనలకు అతీతుడైన కల్యాణమూర్తియే మనస్సునకు ఆశ్రయం కావాలి. బ్రహ్మాదులు కర్మయోనులు గనుక ధ్యానయోగ్యులు కారు. ఆలంబనం లేక ధ్యానం కుదరదు. కనుక ధారణకు, ధ్యానానికీ ధ్యేయమైన మరొక శుద్ధరూపం స్థూలరూపం కానిది. అనంతుడైన విష్ణున కున్నది. దాన్ని విశదీకరిస్తున్నాను. ఆలకించు. ముందు చెప్పిన దానికీ వచనం ముగింపు.

సీ. శరదిందు చకచకస్మయజిత్ప్రసన్నాస్యు
దొడ్డ కెందమ్మి కందోయివాని,
నలికప్రమ గల్లభాగాభోగ ఫాలాఢ్యు,
మకరాంక రత్నకర్ణికలవానిఁ
గాంబవోద్యచ్ఛ్రీవిడంబి వృత్త శిరోధి,
సిరి పొల్చుమచ్చ పేరురమువాని
నతనాభియుత వళిత్రితయ శాతోదరు,
జానులంబి చతుర్భుజములవానిఁ,

తే॥ గరివరకరోరు, రుచిరజంఘామనోజ్ఞ
సమతబొందిన పదపల్లవములవాని
హైమవసను c గిరీట హారాంగదాది
కలితు, శంఖరథాంగాదు లలరువాని. 85

శరత్+ ఇందు = శరత్కాల చంద్రునియొక్క; చక చక = కాంతియొక్క; స్మయ = గర్వం; జిత్= జయించే; ప్రసన్న+ ఆస్యున్ = ప్రసన్నమైన ముఖము కలవానిని; దొడ్డి = పెద్ద; కెందమ్మి = ఎఱ్ఱతామరల వంటి; కన్ +దోయి = కన్నుల జంటగల; వానిన్.

అతి = మిక్కిలి; క్రమ = అందమైన; గల్లభాగ = చెక్కిళ్ల భాగంలో; ఆభోగ= విస్తారమైన; ఫాల+ ఆఢ్యున్ = నుదురు గలవానిని; మకర+అంక = మొసలి గుర్తుగా గల; రత్న = రత్నాలు పొదిగిన; కర్ణికలవానిన్ = చెవి కుదురు గలవానిని.

కాంబవ = శంఖసంబంధమైన (కంబువు = శంఖము); ఉద్యత్ = ప్రకాశించే; శ్రీ = అందాన్ని; విడంబి = సమానమైన; వృత్త = గుండ్రని; శిరోధి = మెడగల వానిని; సిరి = లక్ష్మి; పొల్చు = అందగించే; మచ్చ = శ్రీవత్స మన్న పుట్టు మచ్చగల; పేరు+ ఉరము వానిన్ = పెద్దరొమ్ము గలవానిని.

నత = లోతైన; నాభి = బొడ్డుతో; యుత = కూడు కొన్న; వళిత్రితయ = మూడు ముడుతలు గల; శాత+ఉదరున్ = సన్నని పొట్ట వానిని; జానులంబి = మోకాళ్ల దాకా వ్రేలాడు; చతుర్భుజముల వానిన్ = నాలుగు బాహువులు గల వానిని.

కరివర = శ్రేష్ఠమైన గజముయొక్క; కర = తొండము వంటి; ఊరున్ = తొడలు గలవానిని; రుచిర = అందమైన; జంఘామనోజ్ఞున్ = పిక్కలచే మనస్సును హరించేవానిని.

సమతన్ = సమత్వాన్ని, పొందిన = చెందిన; పదపల్లవములవానిన్ = చిగురు టాకులవంటి పాదములు గలవానిని

హైమవసనున్ = బంగారు వస్త్రము గలవానిని; కిరీటహార+అంగద+ ఆది+కలితున్ = మకుటము, హారాలు, బాహు పురులు మొదలైన వానిలో కూడుకొన్న వానిని; శంఖ = శంఖము; రథాంగము = చక్రము; ఆదులు = మొదలైన; అలరు వానిన్= అందమైన వానిని.

తా॥ శరత్కాల చంద్రునియొక్క కాంతి గర్వాన్ని జయించి ప్రసన్న మైన ముఖము గలవానిని, విశాలములైన ఎఱ్ఱతామరల వంటి జంట కన్నుల వానిని, మిక్కిలి అందమైన విశాలమైన చెక్కిటి ప్రదేశము, విస్తార ఫాల భాగము గలవానిని, మొసలి గుర్తుగల రత్నాల కుండలాలు గల వానిని; శంఖశోభను నవ్వేబలిసిన గుండ్రని మెడగలవానిని, అందమైన శ్రీవత్సమన్న పుట్టుమచ్చ గల వెడద రొమ్ము వానిని, లోతైన పొక్కిలితో కూడు కొన్న మూడు ముడుతలు గల ఉదరభాగము గలవానిని, మోకాళ్లవరకూ వ్రేలాడే నాలుగు బాహువులు గలవానిని, మదగజతుండము వంటి ఊరువులు గలవానిని; కాంతి మంతములైన పిక్కలతో అందమైన వానిని, సమమైన చిగురుటాకుల వంటి పాదాలు గలవానిని, పట్టు పీతాంబరం చుట్టిన వానిని తలపై బొమిడికము, తలలో ముత్యాల సరాలు, చేతిదండలయందు కడియాలు గలవానిని, శంఖ చక్రాది ఆయుధాలు గలవానిని.

విశే ॥ ఎర్రని కనులు సాముద్రిక శాస్త్రం ప్రకారం మహాపురుష లక్షణ మైనందున కెందమ్మితో పోలిక చెప్పాడు. ఆళ్వారులు సైతము ఇట్లే భగవంతుని కీర్తించారు. నల్లని కనీనికలు (గ్రుడ్డుమధ్య భాగాన్ని) చుట్టూ తెల్లని గ్రుడ్డు, చివరలయందు ఎర్రసెరలు. ఇది నేత్ర సౌందర్యంగా చెప్పబడ్డది. చెక్కిలి ప్రదేశం విశాలంగా ఉండడం మహాచక్రవర్తి లక్షణమని, స్వామి వివేకానంద ఇలాగే ఉండేవారు. అది చూచిన పరమహంస మహాపురుష లక్షణంగా చెప్పారు.

సామాన్యంగా దేవతలను పాదం దగ్గరినుండి శిరస్సు దాకా స్తుతిస్తారు. ఇక్కడ వర్ణన శిరస్సు నుండి పాదం దాకా అవయవ క్రమం తప్పక వర్ణింపబడింది. ఈ రెండు రకాల పద్ధతులు సాహిత్యంలో కనిపిస్తాయి ఈ మంగళమూర్తి దేవాలయఅర్చామూర్తి. ఈ శిల్ప సౌందర్యమే పద్యంలో చిత్రితమైన భువనసుందరమూర్తి ధ్యానించితరించ తగినది.

సీ. శ్రీవిష్ణు నీగతిఁ జింతింపవలయుఁ ద
న్మయుఁడయి యోగి క్రమంబుతోడ;
నొక్కయంగమె మున్ను చిక్క లో భావించి
యది దృఢం బగుటయు నవలియంగ
కము మఱి చింతింపఁగాఁదగు; నట్టి య
భ్యాసంబువలన నయ్యవయవి మఱి
నడచిన నున్న మానక యెద్దియేనియుఁ
జేయుచున్నను మదిఁ బాయదేని

తే॥ యతని సామ్యంబు గని ముక్తుఁ డగు; సురాది
భేద సంజకాజ్ఞాన మేదఁ బిదప
నలము కల్యాణగుణముల హరికిఁ దనకు
లేని భేద మెవ్వాఁడు కల్పింపఁగలఁడు? 86

యోగి = ధ్యాన నిష్ఠుడైన భక్తుడు; శ్రీవిష్ణున్ = పురుషోత్తమ మూర్తిని; ఈ గతిన్ = ఈ విధంగా, క్రమంబుతోడన్ = పై పద్యంలో చెప్పిన అవయవాలను క్రమం తప్పకుండా; తన్మయుడు+అయి = తాదాత్మ్యం చెంది; చింతింపవలయున్ = ధ్యానించాలి; ఒక్క అంగమే = ఒక అవయవమే; మున్ను = ముందు; లోనన్ = మనస్సులో; హత్తుకొనునట్లు; భావించి = దర్శించి; అది = ఆ అంగము; దృఢంబు = గట్టిగా నాటుకోవడం; మరి = ఇక; చింతింపన్ = భావించడం; కాదగును = చేయదగును; అట్టి అభ్యాసంబువలన = ఈ క్రమం తప్పని యోగాభ్యాసమువలన; ఆ అవయవి = ఆ అవయవాలు గల మూర్తి; నడచినను = నడుస్తున్న; ఉన్నన్ = కూర్చున్న; మానక = వదలక, ఎద్ది + ఏనియున్ = ఏదైనా సరే; చేయుచున్ = చేస్తూ; ఉన్ననున్ = ఉన్నా; మదిన్ = మనస్సులో; పాయదు+ఏనిన్=వదలకుండా పట్టుకొని ఉంటే; అతని సామ్యంబు = భగవంతునితో సమాత్వం; కని = పొంది, ముక్తుడు + అగున్ = సంసార బంధ విముక్తుడౌతాడు. సుర+ఆది = దేవతలు మొదలైన; భేద = భేదాన్ని; సంజనక = కలిగించే; అజ్ఞానము = అవివేకము; ఏదన్ = నశింపగా; పిదపన్ = తర్వాత; అలము = వ్యాపించే; కల్యాణ గుణముల = మంగళకరమైన గుణాల చేత; హరికిన్, తనకున్ = విష్ణునకు, తనకు; లేని = లేనట్టి; భేదము = భేదాన్ని; ఎవ్వాడు = ఎవ్వడు; కల్పింపగలడు.

తా॥ పై పద్యంలో చెప్పినట్లుగా అవయవక్రమంలో ఒక్కొక్క అవయవాన్ని తాదాత్మ్య భావంతో చింతిస్తే; ఆ అవయవం మనస్సులో ముద్రిత మౌతుంది. తర్వాత మరి యొక అవయవాన్ని చింతించాలి. ఈ విధంగా అభ్యాసం చేస్తే కొన్నాళ్లకు అవయవం గల రూపమంతా మనస్సులో నాటుకుంటుంది. నడచినా, కూర్చున్నా, ఏ పని చేసినా మనస్సులో ఆ రూపం చెదరకుండా ఉంటే యోగి భగవంతునితో సామ్యం పొందుతాడు. దేవతలూ మొదలైన సకల జీవుల మధ్య ఉన్న భేదకారణమైన అజ్ఞానం నశించిన పిదప కలిగే కల్యాణగుణాలచేత హరికి, తనకు భేదము నశిస్తుంది. లేని భేదాన్ని ఎవడు కల్పించగలడు ? అంటే మొదట్లోనే భేదం లేదు. మధ్యలో అజ్ఞానవశాత్తు వచ్చింది. ఈ అజ్ఞానం యోగాభ్యాసంతో నశించిన పిదప మరల ఆ మొదటి సారూప్యం, సామ్యం సిద్ధిస్తున్నది అందుచేత లేని భేదం ఎవడు కల్పిస్తాడు ? ఈ పద్యానికి మూలం-

*విభేదజనకేఽజ్ఞానే - నాశమాత్యంతికం గతే ఆత్మనో(బ్రహ్మణోభేదం అసంతం కః కరిష్యతి (వి.పు)*

కం. 'నరవర !, యిటు బంధచ్యుతి
కొఱకగు నంగాష్టకాఖ్య ఘన యోగము వి
స్తరముగఁ జెప్పితి, నింకన్
గరణీయం బెద్ది నాకుఁ గల్పింపు మనన్ ! 87

నరవర = మానవ శ్రేష్ఠుడా ! (రాజా); ఇటు = ఇలా; బంధ చ్యుతికరము+ అగు = అజ్ఞానమన్న బంధాన్ని తొలగించే; అంగ+ అష్టక+ ఆఖ్య = ఎనిమిది అంగములు గలదన్న పేరు గలదియైన; ఘన = గొప్ప; యోగము = జీవేశ్వర సాధర్మ్యాన్ని కలిగించే విద్యను; విస్తరముగన్ = విశదంగా; చెప్పితిన్ = చెప్పాను, ఇంకన్ = ఇంకా; నాకున్; ఎద్ది = ఏది; కరణీయంబు = కర్తవ్యము; కల్పింపుము = విధింపుము; అనన్ = అంటే.

తా॥ నరవర ! నరుడంటే అర్జునుడు. జీవాత్మకు సంకేతం. నారాయణుడన్న పరమాత్మతో నిత్యసంబంధమున్న వాడు. ఇందుకే నరనారాయణులు ప్రతియుగంలోను గురుశిష్యులుగా అవతరిస్తారు. ఇక్కడ ఖాండిక్యుడు, మధురా చక్రవర్తి ఈ ఆత్మ విద్యకు శ్రోతలైనందున గీతాశ్రోతయైన నరవరుడైనాడు. ఈ సామ్యం కోసం కవి ఈ శబ్దాన్ని ప్రయోగించడం గొప్ప ఔచిత్యం. (కొఱకగు - గురుయోగమని - వావిళ్ళపాఠం)

తే॥ నృప, కృతార్థుండ నైతి; నా కింతకంటె
నర్థనీయంబు మఱి యెద్ది ? యనుచు నతని
కర్చఁ గావించి వల దన్న నతఁ డొసంగు
తనదు తొంటిరాజ్యంబునఁ దనయు నిలిపి . 88

నృప = రాజా !; కృత+ అర్థుండను+ ఐతిన్ = నెరవేరిన ప్రయోజనం గల వాడనైన; నాకున్; ఇంతకంటెన్; అర్థనీయంబు = కోరదగ్గది; మఱి+ఎద్ది = ఇంకా ఏమున్నది; అనుచున్ = అంటూ; అతనికిన్ = కేశిధ్వజునకు; అర్చన్ = పూజ; కావించి = చేసి; వలదు+ అన్నన్ వద్దంటున్నా; అతఁడు = కేశిధ్వజుడు;

ఒసంగు = ఇచ్చే; తనదు = తనయొక్క; తొంటి రాజ్యంబునన్ = మొదటి రాజ్యంలో; తనయున్ = కుమారుని; నిలిపి = పట్టాభిషేకం చేసి.

వ. 1. పురోహిత ప్రధానుల నప్రాప్తయౌవనుండగు నతని వినీతుఁగా మెలపికొం డని నియోగించి, వారల దానసమ్మానాదులం బ్రోవుమని కుమారునకు నప్పగించి, గోవింద చరణారవింద విన్యస్తమానసుండై ఖాండిక్యుం డుభయ కర్మంబులు డులిపి; యువ్వనంబ తపోవనంబుగాఁ గొంతకాలంబు కేశిధ్వజోపదిష్ట భక్తియోగానుసంధానంబున మధుమథన సాధర్మ్యంబు నొందెఁ

2. గేశిధ్వజుండును దత్పుత్రునిఁ దత్ప్రధానులఁ దదీయ రాజ్యపరిపాలన కనిచి, మగిడి మిథిలాపురంబు ప్రవేశించి, యోగాశ్రయుఁడై, భోగంబులం బుణ్యంబులు తదితరంబుల దురితంబులు, ప్రక్షీణంబులుగా క్షోణీతలం బేలు చుండె.

3. కావున ముముక్షున కుపాశ్రయణీయుం డధోక్షజుండు; పాండ్యక్షితీశా! నీ వతని భజియింపు మిదియె భక్తియోగంబు, దీనియందు నొక్క కొఱఁత గల, దంతరాయంబు నొందినఁ బునర్భవంబుఁ బొందించి మఱి ముక్తిఁ జేర్చు; నట్లగుట నింతకంటెసులభోపాయం బాయోధనంబున నయ్యధోక్షజుండు గాండీవి కుపదేశించిన శరణాగత ధర్మంబ నిరపాయధర్మంబ'' ని పరిణతాంతః కరణుం డగు నతనికి మూలమంత్రపూర్వకంబుగా ద్వయము ప్రసాదించి భాగవత ప్రధానుం గావించిన. 89

(1) పురోహిత ప్రధానులన్ = పురోహితుడు, మంత్రులను; అప్రాప్త యౌవనుండు = ప్రాప్తించని యౌవనం గలవాడు; అగు+ అతనిన్ = ఐన కొడుకును; వినీతునిన్‌గా = విధేయునిగా; మెలపికొండు = మలచుకోండి; అని నియోగించి = అని ఆనతిచ్చి; వారలన్ = పురోహితాదులను, దాన, సమ్మానాదులన్ = దాన సత్కారాలతో; ప్రోవుము= కాపాడుము; అని; కుమారునకున్; అప్పగించి = అప్పజెప్పి; గోవింద = శ్రీమహావిష్ణువుయొక్క; చరణ+ అరవింద = పాదపద్మాలపై; విన్యస్త మానసుండై = లగ్నము చేసిన మనస్సు గలవాడై; ఉభయకర్మంబులు = పుణ్యాపాపములన్న జంటను, డులిపి = రాల్చి; ఆ వనంబ = ఆ అరణ్యమే; తపోవనంబుగా = తపస్సునకు ఉచితమైన అడవిగా; కేశిధ్వజ+ ఉపదిష్ట = కేశిధ్వజునితో ఉపదేశింపబడ్డ; భక్తియోగ ; అనుసంధానంబునన్ = అనుసంధించడం చేత; మధుమథను = మధువన్న రాక్షసుని చంపిన శ్రీవిష్ణునియొక్క; సాధర్మ్యంబు = సమాన భావం; పొందెన్ = పొందెను.

తా॥ పురోహితుడు, మంత్రులకు యౌవనోదయం గాని తన కొడుకు నప్పగించి ఇతనిని విధేయునిగాజేసికొని రాజుగా మలచండని అప్పగించి, పురోహిత ప్రధానులను దాన సత్కారములతో కాపాడుకొమ్మని కొడుకునకు అప్పగించి ఈ విధంగా బాధ్యతలన్నీ తొలగించుకొని ఖాండిక్యుడు శ్రీహరి పదపద్మాలను కేశిధ్వజుడు చెప్పిన యోగమార్గం ద్వారా అనుసంధిస్తూ భగవంతునితో సహధర్మాన్ని పొంది తరించాడు.

(2) కేశిధ్వజుండునున్ = ఇతడున్నూ; తత్+పుత్రునిన్ = ఆ కొడుకును; తత్+ ప్రధానులన్

= ఆ మంత్రులను; తదీయ = తనయొక్క; రాజ్య పరిపాలనకున్ = రాజ్యముయొక్క ఏలుబడికి; అనిచి = పంపి; మగిడి = తిరిగి; మిథిలాపురంబు ప్రవేశించి; యోగ+ఆశ్రయుండై = యోగాన్ని ఆశ్రయించి; భోగంబులన్ = భోగాలతో; పుణ్యంబులన్ = పుణ్యాలతో; తత్+ఇతరంబులన్ = భోగములకంటె విరుద్ధమైన వానిని ; దురితంబులు = పాపాలు; ప్రక్షణంబులుగాన్ = క్షీణింపగా; ఏలుచుండెన్ = పాలిస్తున్నాడు.

తా॥ కేశిధ్వజుడు కూడా ఖాండిక్యుని కుమారులను మంత్రులను తానిచ్చిన రాజ్య పరిపాలనకు పంపి తిరిగి తాను మిథిలానగరము ప్రవేశించి యోగాన్ని ఆశ్రయించి పుణ్యాలను, భోగాలద్వారా, పాపాలను వైదికకర్మలద్వారా క్షీణింపజేస్తూ పరిపాలిస్తున్నాడు.

(3) కావునన్ = కాబట్టి; ముముక్షునకున్ = మోక్షేచ్ఛ గలవానికి; ఉప+ఆశ్రయణీయుండు = ఆశ్రయయోగ్యుడు; అధోక్షజుండు = విష్ణువు; పాండ్యక్షితీశ = పాండ్యరాజా !; నీవు = నీవు కూడా; అతనిని = ఆ నారాయణునే; భజింపుము = సేవించు; ఇదియే = ఇదే; భక్తియోగంబు; కొఱత = తక్కువ, అంతరాయంబు = విఘ్నము; పునర్భవంబు = పునర్జన్మ; అట్లగుటన్ = అందువల్ల; ఇంతకంటెన్; సులభ+ఉపాయంబు = సులభమైన ఉపాయము; ఆ యోధనంబునన్ = యుద్ధంలో; ఆ+అధోక్షజుండు = ఆ శ్రీకృష్ణుడు, గాండీవికిన్ = గాండీవమన్న విల్లు ధరించిన పార్థునకు; ఉపదేశించిన = బోధించిన; శరణాగత ధర్మంబ = శరణాగతి అన్న పేరు గల ధర్మమే; నిరపాయ = అపాయం లేని; ధర్మంబు; అని; పరిణత = పరిపక్వమైన; అంతఃకరణుండు = మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారములన్న నాల్గింటిని కలిపి అంతఃకరణ చతుష్టయమంటారు. మూలమంత్రపూర్వంబుగాన్ = మూలమంత్రమైన అష్టాక్షరీ మంత్రముతో ముందుగా ఉపదేశించి; ద్వయంబు = ద్వయమంత్రాన్ని; తర్వాత ప్రసాదించి = అనుగ్రహించి; భాగవత ప్రధానున్ = మహాభక్తుని; కావించినన్ = చేయగా;

తా॥ కాబట్టి పాండ్యరాజా ! నీవు కూడా శ్రీహరినే ఆశ్రయించు. ఇదే భక్తి యోగమంటే. దీనిలో ఒక కొరత మాత్రమున్నది. దీనికి అవాంతరం కలిగితే మరలా పునర్జన్మ కలిగించి ఉద్ధరిస్తుంది. దీనికంటె సులభమైన ఉపాయం మరొకటి ఉన్నది. శ్రీకృష్ణుడు కురుక్షేత్రంలో బోధించిన శరణాగతి ధర్మము అపాయము లేనిదని పరిపక్వమైన అంతఃకరణం గల పాండ్యరాజునకు అష్టాక్షరీ మంత్రంగల వాక్యద్వయం గల మంత్రాన్ని ప్రసాదించి పరమభక్తుని చేసి

విశే॥ పురోహితుడు ఆనాటి రాజ్యపరిపాలనలో చాలా బాధ్యత గలవాడు. ధర్మరాజు ఇందుకే ధౌమ్యుని పురోహితునిగా వరించాడు. రాజ్యానికి కలిగే దైవికమైన విపత్తులను నివారించే వాడు పురోహితుడు. కనుక కవి మాటిమాటికి ఈ విషయాన్ని ప్రస్తావిస్తున్నాడు. శ్రీవైష్ణవమతం శరణాగతిని ప్రధాన ధర్మంగా బోధిస్తుంది. భగవద్గీత చివరలో శ్రీకృష్ణుడు పార్థునితో ఇలా అన్నాడు.

సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ,
అహం త్వాం సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥

అన్ని ధర్మాలను వదలి నన్నే శరణని ఆశ్రయించు నేను నిన్ను సర్వ పాపాల నుండి విముక్తుని చేస్తాను బాధపడబోకు. ఇది గీత చరమమని వరాహపురాణంలో వరాహస్వామి భూదేవికి చెప్పిన శ్లోకాలను [illegible] శ్రీవైష్ణవం గ్రహించింది. భగవంతునికి తనను తాను సంపూర్ణంగా సమర్పించుకోవడమే ప్రపత్తి.

మ. వకుళాలంకృతయోగిహృన్నిలయ ! భాస్వత్పాండుభాస్వన్మయాం
బక, నాభీజలజాతసూత విధి సంప్రాప్త స్మరారిష్ట, ము
ష్టికఠోరార్పణ కర్కటీఫలిత కేశి క్రూర రక్షోంగకా,
కృకవాకుధ్వజ దీర్ఘికాప్లవ తపః క్రీడోత్సవాద్యుత్సుకా ! 90

వకుళ = పొగడపూలతో, అలంకృత = అలంకరింపబడ్డ; యోగి = నమ్మాళ్వారు పేరుగల యోగియొక్క; హృన్నిలయ = హృదయమే నివాసముగా గలవాడా !; భాస్వత్ = సూర్యుడు; పాండు = తెల్లని; భాస్వత్ = [illegible] చంద్రుడు, మయ = (మయట్ ప్రత్యయం) మయమైన; అంబక = నేత్రాలు గలవాడా !; నాభీ = పొక్కిలిలోని, జలజాత = తామరపువ్వుచేత; సూత = ప్రసవింపబడిన; విధి = బ్రహ్మచేత; సంప్రాప్త = పొందబడిన; స్మర = మన్మథునియొక్క; అరిష్ట = శత్రువైన శివుడు కలవాడా !; ముష్టి = పిడికిలియొక్క, కఠోర = కఠినమైన; అర్పణ = ఇవ్వడం వల్ల; కర్కటీ ఫలిత = దోసకాయగా చేయబడ్డ; కేశి = కేశియన్న పేరుగల; క్రూరరక్షః = భయంకరమైన రాక్షసునియొక్క; అంగకా = అవయవాలు గలవాడా ! కృకవాకు = కోడి; ధ్వజ = జెండాగలవాడు. (జెండాపై కోడిగుర్తు గలవాడు కుమారస్వామి); దీర్ఘిక = పుష్కరిణిలో, ప్లవ = తెప్పయొక్క; తపః క్రీడ = వేసవి ఆట; ఆది = మొదలగువానియందు; ఉత్సుకా = ఆసక్తి కలవాడా !

తా॥ పొగడ పూలతో అలంకరింపబడ్డ యోగి నమ్మాళ్వారు. అతని హృదయమే నివాసముగా కలవాడా! సూర్యచంద్రులే నేత్రాలుగా కలవాడా ! నీ పొక్కిటి తామరపువ్వు బ్రహ్మను కన్నది. అతడు శివుని కన్నాడు. కఠినమైన నీ ముష్టి దెబ్బకు కేశి రాక్షసుని దేహము దోసపండైనది. స్వామీ ! నీవు స్కంద పుష్కరిణిలో వేసవి కాలంలో తెప్పల ఉత్సవాలతో క్రీడించేవాడివి.

కం. ఉరరీకృతపాండవరథ;
సారథ్య ! సయూథ్య గోపశాబక సహకే
ళీరత ! భక్తప్రహ్లా;
దారచిత స్తోత్రపులకితాంచిత గాత్రా ! 91

ఉరరీకృత = అంగీకరింపబడిన; పాండవ = అర్జునునియొక్క; రథసారథ్య = రథమును తోలే వాని లక్షణం గలవాడా !; సయూథ్య = సహవాసులైన; గోపశాబక = గొల్లపిల్లలతో; సహకేళి = కలిసి క్రీడించటంలో; రత = ఆసక్తి గలవాడా !, భక్త = భక్తుడైన, ప్రహ్లాద = ప్రహ్లాదునిచేత; ఆరచిత= చక్కగా చేయబడ్డ; స్తోత్ర = స్తుతులతో, పులకిత = గగుర్పాటు చెందిన; అంచిత = అందమైన; గాత్ర = శరీరం గలవాడా !

తా॥ అర్జునుని రథసారథ్యాన్ని అంగీకరించినవాడా ! పార్థసారథీ ! తోడి గొల్లపిల్లలతో కలిసి స్నేహంతో క్రీడించినవాడా ! భక్తి పారవశ్యంతో ప్రహ్లాదుడు చేసిన స్తుతికి పులకించిన శరీరం గలవాడా !

విశే॥ పద్యంలో కృష్ణావతారం నరసింహావతారం స్తుతింపబడ్డాయి. బాల్యంలో గోపాల బాలకులతో ఆడుకోవడం, పెద్ద వాడైన తర్వాత అర్జునునకు రథం తోలడం, రెండూ భక్తులపైనున్న వాత్సల్యంతో నిర్వహించిన క్రీడలేనని ధ్వనిస్తుంది. మిక్కిలి కోపంతో నున్న నరసింహస్వామిని దేవత లెవ్వరూ చివరకు లక్ష్మి కూడా సమీపించలేకపోగా ప్రహ్లాదుడు చేసిన స్తుతితో నరసింహస్వామి కోపముడిగి ప్రసన్నుడైనాడని భాగవతంలో ఉంది. ఇందుకే కవి ఆరచిత అని అన్నాడు.

సయూాధ్య శబ్దమే లోకంలో సయోాధ్యగా వాడబడుతున్నది వారిద్దరికీ సయోధ్య లేదని ప్రయోగం.

స్రగ్విణి. అస్థితాహీంద్రశయ్యా, దవీయస్తర
ప్రస్థితాంఘ్రీ, శ్రిత వ్రాత చేతోఘదా,
కస్థల ప్రస్పృశత్ కాళియ క్ష్వేళ మూ
ర్ధస్థలీ నృత్తమత్తల్లిహల్లీసకా ! 92

ఆస్థిత = చక్కగా అధిష్ఠింపబడ్డ; అహి+ఇంద్ర = నాగరాజైన ఆదిశేషుడే; శయ్యా = సెజ్జగా గలవాడా!; దవీయస్తర = మిక్కిలి దూరంగా; ప్రస్థిత = ఉన్నట్టి; అంఘ్రీ = పాదములు కలవాడా !; శ్రితవ్రాత = ఆశ్రితసమూహంయొక్క; చేతః = మనస్సులందలి; అఘ = పాపములను; దా = ఖండించేవాడా!; కస్థల = నీటినేలను; ప్రస్పృశత్ = తాకుతున్న; కాళియ = కాళియుడన్న పాముయొక్క; క్ష్వేళ = విషము గల; మూర్ధ= తలపై; స్థలీ = ప్రదేశమందు; నృత్త = ఆంగికాభినయరూపమైన; మత్తల్లి = ఆ పేరుగల నృత్యమును; హల్లీసకా = మండలాకార నృత్యము గలవాడా !

తా॥ శ్రీవేంకటేశ్వరా ! నీవు ఆదిశేషుని శయ్యగా చేసికొని చక్కగా శయనించియున్నావు. త్రివిక్రమావతార మెత్తినపుడు ఆకాశాన్ని దాటి నీపాదం మిక్కిలి దూరానికి సాగి పోయింది. భక్తుల పాపాలను నశింపజేస్తున్నావు. యమున మడుగులో అడుగు దాకా నిగిడియున్న కాళియుని తలలే రంగభూమిగా జేసికొని మత్తల్లి, హల్లీసక నృత్యం చేసిన వాడా !

విశే॥ మత్తల్లీ, హల్లీసకములు ఆంగికాభినయరూపమైన దేశీయ నృత్య విశేషాలు. హల్లీసకమంటే కోలాటం.

ఛందస్సు : ఇది స్రగ్విణీ వృత్తము. నాలుగు రగణాలు. ఏడవ గణం యతిస్థానం.

మ. ఇది పాత్ర ప్రహరేశ్వరప్రభృతి బంహిష్ఠోత్కలానీక గు
ప్త దివిస్పృక్కోపటుయంత్ర కొండపలి హృద్భాహాసి కద్రూజ దీ
వ్యదుదారోద్యమ కృష్ణరాయనృప సంజ్ఞాస్మత్కృతాముక్తమా
ల్యద నాశ్వాసము హృద్యపద్యము తృతీయంబై మహిం బొల్పగున్. 93

[illegible] = ప్రహరేశ్వరుడన్న పేరుగల గజపతి సామంతుడైన పాత్రుడు; ప్రభృతి = మొదలైన; [illegible], ఉత్కలం = ఓఢ్రులయొక్క; అనేక = సమూహం చేత; గుప్త = పొదువుకొనబడియున్న; [illegible] = ఆకాశాన్నంటే, పటు = పటిష్ఠమైన; యంత్ర= శతఘ్నులు మొదలైన ఆయుధాలు గలది; [illegible] కొండపల్లి దుర్గాన్ని, హృత్ = హరించే; బాహా = చేతిలోని; అసి = కత్తియన్న; క్రూరాజ = [illegible] పాములో, దీవ్యత్ = ప్రకాశిస్తున్న; ఉదార = గొప్ప; ఉద్యమ = ప్రయత్నం కల; [illegible] = కృష్ణరాయలన్న; సంజ్ఞ = పేరుగల; అస్మత్ = నాచేత; కృత = నిర్మింపబడ్డ; ఆముక్త [illegible] = ఆముక్త మాల్యదలో; ఇది = ఈ ప్రస్తుత భాగము; హృద్యపద్యము = మనోహరమైన [illegible] గలది, ఆశ్వాసము = కావ్యవిభాగము; తృతీయంబై = మూడవదై; మహిన్ = లోకంలో; [illegible] = ప్రసిద్ధమగును

[illegible] ప్రహరేశ్వరాదులైన ఉత్కళ మహావీరులైన సేనలతో రక్షింపబడుతూ, ఆకాశాన్ని తాకే [illegible] కొండపల్లి దుర్గాన్ని జయించిన చేతి కత్తియన్న పాము కలవాడు. శ్రీకృష్ణరాయలన్న [illegible] రచించబడ్డ ఆముక్తమాల్యదలో ఇది అందమైన పద్యాలు గల మూడవ ఆశ్వాసము.

[illegible] పద్యంలో కొండపల్లి దుర్గవిజయం చెప్పబడింది. మూడు ఆశ్వాసాంతాలు కూడా రాయలవారి [illegible] వీటి వివరాలకు పీఠిక చూడు.